# తెలుగువారి యింటిపేర్లు

(SOCIO-LINGUISTIC STUDY OF SURNAMES IN TELUGU)

డా. తేళ్ళ సత్యవతి, M.A., Ph.D.
లెక్చరర్, పి.ఏ.యస్. కళాశాల,
పెదనందిపాడు, గుంటూరుజిల్లా.

పిఎచ్. డి పట్టంకోసం నాగార్జున విశ్వవిద్యాలయానికి సమర్పించిన
సిద్ధాంత వ్యాసం

జి. ఆర్. పబ్లికేషన్స్
గుంటూరు - 1

గాలి ముద్దుకృష్ణమనాయుడు, M A,LL.B;
అటవీశాఖామాత్యులు

హైదరాబాదు
తేది 20-7-1987

# సందేశం

తేళ్ళ సత్యవతి గారికి

మీరు వ్రాసిన "తెలుగువారి ఇంటిపేర్లు" పరిశోధన గ్రంథాన్ని చదివినాను. దాదాపు ఆరువేల గృహనామాలు సేకరించి వాటి పూర్వరూపం ఏదై ఉంటుందో తెలియచెప్పడం చాలా కష్టతరమైనపని. అలాంటి పనిని మీరు చేపట్టి, మీ గ్రంథం ద్వారా అందచేయటం ముదావహం. వ్యయ ప్రయాసలతో కూడిన మీ కృషి శ్లాఘనీయము. మీ "తెలుగువారి ఇంటిపేర్లు" అటు విద్యార్థులకు, పరిశోధకులకే కాక సమాజంలో అన్ని వర్గాలవారికి ఉపకరిస్తుందనటంలో సందేహంలేదు. ఇలాంటి మంచి గ్రంథాన్ని తెలుగువారికి అందించినందుకు మనసారా అభినందిస్తూ, ఇలాంటి మంచి గ్రంధాలను మరిన్ని మీ కలమునుండి వెలువడాలని ఆసిస్తూ-

భవదీయుడు

సం. గాలి ముద్దుకృష్ణమనాయుడు

ఆచార్య తూమాటి దొణప్ప
ఎమ్.ఎ.,పిఎచ్.డి.,డి.లిట్
కులపతి

హైదరాబాదు-500 004
తేది 13-5-1987
బుద్ధపూర్ణిమ

# అభినందనం

డాక్టర్ శ్రీమతి తేళ్ళ సత్యవతి నాగార్జున విశ్వవిద్యాలయంలో ఒకనాడు మా పరిశోధక విద్యార్థిని. వినూత్న విషయాన్ని పరిశోధనాంశంగా స్వీకరించి, వలసిన ఆధారసామగ్రిని ఎన్నో ఆకరాలనుంచి సేకరించి, శాస్త్రీయంగా వ్యాకరించి ఫలితాలను సమ్యగ్ దృష్టితో సుష్ఠుక్రమంలో ఆవిష్కరించగా రూపొందిన సిద్ధాంత ప్రబంధమిది. చిరంజీవిని సత్యవతి ఇతోఽధిక కృషికిది నాంది. ఆమెకు హార్దికమైన మా అభినందనలు.

ఆచార్య తమ్మారెడ్డి నిర్మల
ఎం.ఎ;పిఎచ్.డి;
తెలుగు శాఖాధిపతులు
నాగార్జున విశ్వవిద్యాలయం

విజయవాడ
29-7-1987.

పేర్ల కి సంబంధించిన పరిశీలన ఇప్పుడిప్పుడే పేరులోకి వస్తోంది. నామ విజ్ఞానశాస్త్రం అధ్యయనం చేయదగిన ఒక విషయమే అని పరిశోధకులు రుజువు చేస్తున్నారు. ఈ శాస్త్రానికి సంబంధించిన మొదటి మొదటి పరిశోధకులలో శ్రీమతి సత్యవతి ఒకరు.

ఇంతకు పూర్వం తెలుగువారి ఇంటిపేర్లకు సంబంధించిన వ్యాసాలు. కొన్ని గ్రంథాలు వెలువడ్డాయి గాని సమగ్ర పరిశీలనతో ఒక సిద్ధాంత వ్యాస రూపంలో వెలు వడిన మొదటి సిద్ధాంత వ్యాసమిది. ఈ అంశానికి సంబంధించి పూర్వ పూర్వ రచ యితలు తెలిపిన విషయాలను గ్రహించి వాటిని సమన్వయం చేసుకొని తనదైన వినూతన పద్ధతిలో ఈ సిద్ధాంత వ్యాస రచను చేశారీమె. ఈ ప్రయత్నంలో ఎంతో శ్రమకోర్చి విషయ సేకరణ చేయటమే కాక శాస్త్రీయంగా విశ్లేషించారు.

సాహిత్యంలో నిక్షిప్తమైన ఇంటిపేర్లను వెతికి వెతికి తెచ్చి వాటిని చక్కగా విభజించి వివరించారు. వ్యవహారంలో ఉన్న తెలుగువారి ఇంటిపెర్ల వర్గీకరణ ఆసక్తికరంగా ఉంది ఈ రెంటికీ కూడ రచయిత్రి ఎంతో సమయాన్ని వెచ్చించి ఉంటారని స్పష్టమవుతోంది.

ఇంతవరకు మొదటి భాగం. ఈ విభాగ రచన ఒక ఎత్తయితే రెండో భాగంలోని గృహనామ వివరణ పట్టిక ఇంకొక ఎత్తు. సేకరించిన ఇంటి పేర్లన్నీ వివరణతో అకారాది క్రమంలో ఈ విభాగంలో ఇచ్చారు. ఈ వరస క్రమంతో ఇంటిపేర్లన్నిటి వివరణను రాయటానికి ఎంతో జాగ్రత్త, సమయం అవసరమవు తాయి. సమర్ధులైన ఆచార్యుల సుశిక్షణలో ఈ పనిని ఎంతో శ్రద్ధాసక్తులతో నిర్వ హించారీమె.

ఈ సిద్ధాంత వ్యాసంలో సరిచేసుకోవలసినవి ఒకటి రెండు నాకు కని పించాయి. అవి—

ii)

"1917 లో కమ్యూనిస్టులు అధికారంలోకి వచ్చాక కుటుంబ వ్యవస్థలేకుండా చేయాలని అనుకున్నారట" (పుట 24).

ఈ "అట" కు ఆధారం ఏమిటో ఇవ్వలేదు. ఇతర దేశాల విషయాల గురించి, అందులోను తొలి సోషలిస్టు దేశమైన రష్యా గురించి (కనీసం ఆ దేశం పేరు కూడా ఎత్తకుండా) క్షుణ్ణంగా తెలుసుకోకుండా ఆధార రహితంగా సిద్ధాంత వ్యాసాలలో రాయటం న్యాయం కాదు.

తూర్పు యూరపు దేశాలలో స్త్రీ వివాహానంతరం ఇంటిపేరును మార్చుకోవటం మార్చుకోక పోవటం అన్నవి ఆ భార్యాభర్తల ఏకాభిప్రాయం మీద ఆధారపడి ఉంటుంది (పుట 48) అని రాస్తూ "వీరి ఇంటిపేరు వీరి పిల్లలకు కూడా కుటుంబ నామంగా ఉంటుంది కనుక స్త్రీకి సమానత్వం కల్పించటం కోసం ఇలాంటి అవకాశాన్ని కలిగించినా, రష్యావారి పితృస్వామిక వ్యవస్థకు ఇది ఒక గొడ్డలి పెట్టు" (పుట 49) అన్న వాక్యం రాశారు. దీనికి కూడ ఆధారం ఇవ్వలేదు.

స్త్రీ భర్త ఇంటిపేరుగాని తండ్రి ఇంటిపేరుగాని ఏదో ఒకటి పెట్టుకొంటుంది. అంతమాత్రాన ఆమెకి కల్పించిన సమానత్వం యొక్క స్వరూప స్వభావాలు ఏమిటి? ఆ భార్యాభర్తలు వేరొక ఇంటిపేరును పెట్టుకొన్నప్పుడు వాళ్ళ పిల్లలు ఏ ఇంటి పేరును స్వీకరిస్తారు? అనే ప్రశ్నలు వివరణను కోరతాయి. అంతే కాకుండ రష్యాలో పితృస్వామిక వ్యవస్థను నిలబెట్టాలని కంకణం కట్టుకున్నారా? మిగిలిన దేశాలు ఇప్పుడున్న పితృస్వామిక వ్యవస్థను మార్చబోతున్నాయా ఇప్పుడు ఏ దేశంలోనైన మాతృస్వామిక వ్యవస్థ ఉందా? అనే ప్రశ్నలు ఈ వాక్యం వలన వస్తున్నాయి.

ఇటువంటి అశాస్త్రీయ విషయాలను పరిహరిస్తే ఎంతో బాగుంటుంది. స్త్రీకి సమానత్వాన్ని కల్పించేది కమ్యూనిస్టు వ్యవస్థే అనేది కూడ గుర్తించాలి.

భారతీయేతర భాషల్లో ఇంటిపేర్లను గురించి చర్చించిన సందర్భంలో కొన్నిచోట్ల ఆకరాలనిచ్చారు. ఇంక కొన్నిచోట్ల ఇవ్వలేదు. ఇచ్చి ఉంటే భవిష్యత్పరిశోధకులకది చాల ఉపయోగపడేది. సిద్ధాంత వ్యాస ప్రయోజనాలలో అదికూడ ఒకటి.

ఆసక్తికరమయిన ఇంటిపేర్ల చర్చను, వివరణను విసుగు కలిగించని పద్ధతిలో చేసిన శ్రీమతి సత్యవతి తన పరిశోధనా వ్యాసంగాన్ని కొనసాగించగలదని ఆశిస్తాను, ఆమెకు శుభాకాంక్షలందిస్తాను.

# అవతరణిక

భాషాశాస్త్రంలో పరిశోధన చేయాలనే నా ఆకాంక్షను గుర్తించి పూజ్యులు ఆచార్య తూమాటి దొణప్పగారు తెలుగువారి ఇంటిపేర్లను పరిశోధనాంశంగా సూచించారు. గృహనామాలమీద పరిశోధన నూతనాంశం గనుక చేయాలనే కోరిక కలిగింది. గృహనామాల వేటకోసం సాహిత్యారణ్యంలోకి ప్రవేశించాక నేను సాహసం చేస్తున్నానేమో నన్పించింది. రెట్టింపు ఉత్సాహంతో పనిచేస్తున్న నాకు అధ్యాపక రంగ ప్రవేశం మొదట కొంత నిరుత్సాహాన్ని కల్గించింది. అయినా పరిశోధనా పర్యవేక్షకుల నిరంతర ప్రోత్సాహం, సహృదయుల, సహాధ్యాయుల సంతత సహకారంవల్ల నా యీ పరిశోధన కార్యక్రమం సల్లేపు మీద బండిలా నడిచింది.

సిద్ధాంత వ్యాస రచనకు ఉపకరించే గ్రంధాలు ఎక్కువగా లభ్యంకాలేదు. Andre F. Sjoberg గారి "Telugu personal names- A Structural analysis", చిలుకూరి నారాయణరావుగారి 'ఇంటిపేరు', తూమాటి దొణప్పగారి 'తెలుగువారి ఇంటిపేర్లు-ఒకపరిశీలన', మేరు సోమయాజుల వరహాలుగారి 'ఇంటి పేరంటే' అన్న వ్యాసాలు తప్ప ఇతర ఆధారాలు లేవు. ఇంటిపేర్ల మీద భాషా శాస్త్రాభిమానుల దృష్టి ఎక్కువగా పడలేదు గనుక ఈ రంగంలో ఎక్కువగా కృషిజరగలేదు.

విదేశాలలోని గృహనామాల పద్ధతి తెలుసుకోడానికి ఎన్నో విజ్ఞాన సర్వ స్వాలు, ఇతర ఆకరాలు తోడ్పడ్డాయి. ఆంధ్ర దేశానికి చుట్టూ ఉన్న ఆంధ్రేతర ప్రాంతాలలోని గృహనామాల వాడుక పద్ధతిని పరిచయస్థుల నుండి సంభాషణ రూపంలో సేకరించడం జరిగింది

గ్రామనామాలకు వ్యుత్పత్తులు దొరికినంతగా ఇంటిపేర్లకు వివరణ కన్పించదు. ఆంధ్రభూమి సచిత్ర వారపత్రిక వారు గ్రామనామాలెలా వచ్చాయో పాఠకుల అభిరుచిని అనుసరించి ప్రచురించారు. ఇలాగే గృహనామాలకు కూడా ప్రాధాన్యం ఇచ్చినట్లయితే కొన్ని వ్యుత్పత్తులు, జననిరుక్తులు బయటకు వచ్చేవి.

ఇంటిపేరు అనగానే ఎవరైనా 'అతి లివిగా' ఆధునిక కాలంలో ఆంగ్ల సంప్రదాయం ప్రకారం నివసిస్తున్నయింటికి పెట్టుకునే పేరు అని పెడర్థాలు తీయ

వచ్చు. వాటితో ప్రకృత చర్చకు సంబంధం లేదు. అవి వ్యక్తుల ఇంటిపేర్లు కావు, వారు నిర్మించుకొన్న లేక నివసిస్తున్న ఇంటికి పెట్టుకున్న పేర్లు మాత్రమే రాగిణీ లక్ష్మీనిలయం, శ్రీనిలయం, సుధారా మొదలైనవి ఇందుకు ఉదాహరణలు.

వీలయినంతవరకు సమగ్రంగా రూపించాలన్న ప్రయత్నం జరిగిందికాని వ్యుత్పత్తి నిర్ణయం మొదలైన విషయాలలో ఈ కృషి సమగ్రమయిందని చెప్పడానికి సాహసించను. అయినా ముమ్ముందు ఈ రంగంలో కృషిచేసే వారికి ఇది ఒక మార్గదర్శిగా ఉంటుందని భావిస్తున్నాను.

పరిశోధన చేయడానికి అవకాశం కల్పించి, పరిశోధనాంశాన్ని సూచించి అడుగడుగునా వారి అండదండలిస్తూ, పరిశోధన ప్రారంభ దశలోనే ఉన్నా ఉద్యోగ ప్రవేశానికి అంగీకారం తెల్పడమే కాకుండా భవిష్యత్తుకు మంచి బాటను ఎన్నుకొనేలా ఎన్నో సార్లు వ్యక్తిగత విషయాలను సైతం పట్టించుకొని సలహాలిస్తూ ఈ పరిశోధనా కార్యక్రమాన్ని పూర్తిచేయడానికి అండగా నిలిచిన పూజ్యులు ఆచార్య తూమాటి దొణప్పగారికి నా కృతజ్ఞతాభివందనాలు.

ఆదిలో పరిశోధనకు అవకాశం కల్పించిన ఆంధ్ర విశ్వవిద్యాలయ పాలకులకు ఒదిలి ఆయిన తరువాత నాకు స్థానమిచ్చిన నాగార్జున విశ్వవిద్యాలయ పాలకులకు—

ఉద్యోగరంగ ప్రవేశం తర్వాత పరిశోధనకు ప్రోత్సహించిన మా కళాశాల పాలక వర్గానికి, ప్రిన్సిపాల్ శ్రీ సాంబశివరావుగారికి, ఎలాంటి అనుమానాలు కలిగినా చర్చిస్తూ నాకు సలహాలిచ్చి ఒకే కుటుంబ సభ్యుల్లా మెలగుతున్న మా పెదనందిపాడు కళాశాల తెలుగు శాఖ అధ్యాపకులకు—

రాయలసీమలోని ఇంటిపేర్ల సేకరణ సాధ్యం కాదనిపించిన సమయంలో ఎంతమాత్రం నాకు శ్రమ కలగకుండా వారే శ్రమించి ఇంటిపేర్లను సేకరించి అందించిన శ్రీ భోజనపాటి రాజేంద్రనాయుడు (ఎర్రాండ్లపల్లి), శ్రీ జి. రామమూర్తి (చిత్తూరు) గారికి—

గ్రంథాన్ని ఆసాంతం చదివి తమ అమూల్యమైన అభిప్రాయాలనందించిన అటవీశాఖామాత్యులు శ్రీ గాలి ముద్దుకృష్ణమనాయుడు గారికి, నాగార్జున విశ్వవిద్యాలయ తెలుగు శాఖాధిపతి శ్రీమతి నిర్మల గారికి—

అడిగిన తోడనే ఎంత మారుమూల గ్రంథాన్నైనా శోధించి నాకందించిన నాగార్జున విశ్వవిద్యాలయ గ్రంథాలయాధికారి శ్రీ సుంకర కోటేశ్వరరావు గారు, శ్రీ రామమూర్తిగారు, శేషగిరిరావుగారు, తదితర గ్రంథాలయ సిబ్బందికి—

విషయ సంగ్రహణకు తోడ్పడిన గుంటూరు ప్రభుత్వ ప్రాంతీయ గ్రంథాలయం; హైదరాబాదు కేంద్ర గ్రంథాలయం; వాల్తేరు వాసిరెడ్డి శ్రీకృష్ణ గ్రంథాలయం; వేటపాలెం గ్రంథాలయం; ఉస్మానియా విశ్వవిద్యాలయ గ్రంథాలయాల అధికారులకు—

వేటపాలెం వెళ్ళడానికి వీలుకల్పించి నన్నెంతో ఆదరించి విషయ సంగ్రహణకు తోడ్పడిన V.R.S. & Y.R.N. కళాశాల తెలుగు శాఖాధిపతి శ్రీ కొల్లా హనుమంతరావుగారికి వారి ధర్మపత్నికి—

గ్రంథముద్రణకు 5 వేల రూపాయల ఆర్థిక సహాయాన్నందించిన తెలుగు విశ్వవిద్యాలయం వారికి—

భాషా శాస్త్ర విభాగంలో దోషాలు దొరల కుండా ఎక్కువ శ్రద్ధ తీసుకొని గ్రంథముద్రణ గావించిన శ్రీలక్ష్మీ ప్రెస్ అధిపతికి, వారి సిబ్బందికి—

పెంచి పెద్దచేసి నన్నింతదాన్నిగా తీర్చిదిద్దిన అమ్మానాన్నలకు, ఎంతో ఆత్మీయతతో అనుక్షణం సహాయ సహకారాలందించే తమ్ముళ్ళిద్దరికీ, జి. యస్. తీర్థకి—

నా జీవితాన్ని సుమవనంగా దిద్దితీర్చిన శ్రీవారు రామతీర్థ చౌదరికి—

వీరందరికి, ఇంకా ఈ పరిశోధనకు ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ ఎన్నో రకాలుగా తోడ్పడిన మిత్రులకు, కళాభిమానులకు—అందరికీ నా కృతజ్ఞతలు.

—o—

# విషయసూచిక

# సంకేత పద వివరణ పట్టిక

## తెలుగు గ్రంథాలు :

| | | |
|---|---|---|
| అడిదం. | : | అడిదం సూరకవి జీవిత |
| అనిరు. | : | అనిరుద్ధ చరిత్ర |
| అప్పక. | : | అప్పకవీయము |
| అలం. చ. | : | అలంకార చంద్రోదయము |
| ఆం. క. త. | : | ఆంధ్ర కవి తరంగిణి |
| ఆం. క. స. | : | ఆంధ్ర కథా సరిత్సాగరము |
| ఆం. భా. భూ. | : | ఆంధ్ర భాషా భూషణము |
| ఆం. వా. | : | ఆంధ్ర వాచస్పత్యము |
| ఆం. సా. ప. ప. | : | ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక |
| ఆము. | : | ఆముక్తమాల్యద |
| ఉద్భటా. | : | ఉద్భటారాధ్య చరిత్ర |
| కమ్మ. చ. | : | కమ్మవారి చరిత్ర |
| కళా. | : | కళాపూర్ణోదయము |
| కవి. చ. చం. | : | కవి జనచకోర చంద్రోదయము |
| కవిజీ. | : | కవి జీవితములు |
| కవి. ర. | : | కవి కర్ణరసాయనము |
| కాళిం. ప. | : | కాళిందీ కన్యకా పరిణయము |
| కాశీ. | : | కాశీఖండము |
| కుబ్జా. | : | కుబ్జా కృష్ణవిలాసము |
| కుమార. | : | కుమార సంభవము |
| కువల. | : | కువలయాశ్వ చరిత్ర |
| కృష్ణరా. వి. | : | కృష్ణరాయ విజయము |
| కేయూ. | : | కేయూర బాహు చరిత్ర |
| కౌస. | : | కౌసల్యా పరిణయము |
| క్రీడాభి. | : | క్రీడాభిరామము |
| గజా. | : | గజానన విజయము |

గంధ. ; గంధవహము

చం. చ. ; చంద్ర భామ చరిత్ర

చంద్రాం. చ. : చంద్రాంగద చరిత్ర

చమత్కా. : చమత్కారమంజరి

చంపూ. : చంపూ రామాయణము

చాటు. మ. ; చాటుపద్య మణిమంజరి

చాటు. ర. : చాటుపద్య రత్నాకరము

జైమి. : జైమినీ భారతము

దశకు. : దశకుమార చరిత్ర

దశ. రా. నం. చ. : దశరథ రాజనందన చరిత్ర

ధర్మనం. : ధర్మనందన విలాసము

నవచో. : నవచోళ చరిత్ర

నారా. మ. : నారాయణాచలమహాత్మ్యం

నాసికే. : నాసికేతోపాఖ్యానం

నీలా. పరి. : నీలాసుందరి పరిణయము

పండి. : పండితారాధ్య చరిత్ర

పద్మ. ఉ. ఖం. : పద్మపురాణము ఉత్తర ఖండము

పల్నా. : పల్నాటి వీరచరిత్ర

పాండు. : పాండురంగ మాహాత్మ్యము

పారి. : పారిజాతాపహరణము

ప్రద్యు : ప్రద్యుమ్నోపాఖ్యానము

ప్రబోధ. : ప్రబోధ చంద్రోదయము

ప్రభా. ప్ర. : ప్రభావతీ ప్రద్యుమ్నము

ప్రభులిం. : ప్రభులింగలీల

ప్రా. ఆం. చ. భూ. : ప్రాచీనాంధ్రచరిత్ర భూగోళసర్వస్వము

ప్రాస్తా. ప. : ప్రాస్తావిక పద్యావళి

బహుళా. : బహుళాశ్వ చరిత్ర

బిల్హణీ. : బిల్హణీయము

భాగ. : భాగవతము

| | | |
|---|---|---|
| భీమే. | : | భీమేశ్వర పురాణము |
| భృగు. | : | భృగు సంతతి మహాప్రబంధము |
| మను. | : | మనుచరిత్ర |
| మన్నా. వి. | : | మన్నారుదాసు విజయము |
| మార్కం. | : | మార్కండేయ పురాణము |
| మిత్రవిం. | : | మిత్రవిందోపాఖ్యానము |
| మైరా. చ. | : | మైరావణ చరిత్ర |
| మొ. రా. | : | మొల్ల రామాయణము |
| యాజ్ఞ. | : | యాజ్ఞవల్క్య చరిత్ర |
| రంగ. చ. | : | రంగరాయ చరిత్ర |
| రసిక. | : | రసికజన మనోభిరామము |
| రాఘ. | : | రాఘవ పాండవీయము |
| రాజశే. | : | రాజశేఖర చరిత్ర |
| రామా. | : | రామాభ్యుదయము |
| రుక్మ. | : | రుక్మవతీ పరిణయము |
| రుక్మి. ప. | : | రుక్మిణీ పరిణయము |
| రెడ్డి. | : | రెడ్డిమత శాస్త్రము |
| లక్ష్మీసం. | : | లక్ష్మీ సంవాదము |
| లంకా. | : | లంకావిజయము |
| లలి. | : | లలితాంబోపాఖ్యానము |
| వరాహ. | : | వరాహ పురాణము |
| వల్లభా. | : | వల్లభాభ్యుదయము |
| వ. సా. చ. | : | వరసావిత్రి చరిత్ర |
| వసు. | : | వసుచరిత్ర |
| వాల్మీ. | : | వాల్మీకి చరిత్ర |
| విక్ర. | : | విక్రమార్క చరిత్ర |
| విజ. విలా. | : | విజయనందినీ విలాసము |
| విప్రనా. | : | విప్రనారాయణ చరిత్ర |
| విష్ణుమా. | : | విష్ణుమాయ నాటకము |

| | | |
|---|---|---|
| విష్ణుమి. | : | విష్ణుమిత్రోపాఖ్యానము |
| వీర. వి. | : | వీరభద్ర విజయము |
| వైజ. | : | వైజయంతీ విలాసము |
| శకుం. ప. | : | శకుంతలా పరిణయము |
| శతక. | : | శతక కవుల చరిత్ర |
| శంత. చ. | : | శంతన రాజనందన చరిత్ర |
| శ. ర. | : | శబ్ద రత్నాకరము |
| శశిరే. | : | శశిరేఖా పరిణయము |
| శివయో. | : | శివయోగి సారము |
| శివలీ. | : | శివలీలా విలాసము |
| శుకచ. | : | శుకచరిత్ర |
| శృం. క. చ. | : | శృంగార కల్యాణ చరిత్ర |
| శృం. శా. | : | శృంగార శాకుంతలము |
| శృం. సం. | : | శృంగార సంధ్య |
| శేష. | : | శేషధర్మములు |
| శ్రీకృష్ణా. | : | శ్రీకృష్ణాభ్యుదయము |
| శ్రీకృష్ణా. సం. | : | శ్రీకృష్ణార్జున సంవాదము |
| శ్రీగౌ. వి. | : | శ్రీగౌరీ వివాహము |
| శ్రీచి. భా. | : | శ్రీచిత్ర భారతము |
| శ్రీజీ. | : | శ్రీజీవయాత్ర |
| శ్రీదీ. చ. | : | శ్రీదీక్షిత చరిత్ర |
| శ్రీరంగ. | : | శ్రీరంగమాహాత్మ్యము |
| శ్రీరా. క. | : | శ్రీరామ కల్యాణము |
| శ్రీరా. విలా. | : | శ్రీరామచంద్ర విలాసము |
| శ్రీల. | : | శ్రీలక్ష్మీనారాయణ పరిణయము |
| శ్రీశం. వి. | : | శ్రీ శంకర విజయము |
| శ్రీసూక్తి. | : | శ్రీసూక్తి వసుప్రకాశము |
| షోడ. | : | షోడశకుమార చరిత్ర |
| సకః నీ. | : | సకలనీతి సమ్మతము |

సత్య. : సత్యభామా స్వాంతనము
సత్య. ఉ. : సత్యవత్యుపాఖ్యానము
సత్య. కృ. సం. : సత్యభామా కృష్ణ సంవాదము
సానం. : సానందోపాఖ్యానము
సింహా. : సింహాసన ద్వాత్రింశిక
సుదక్షి. : సుదక్షిణా పరిణయము
సుభద్రా. : సుభద్రా పరిణయము
సుభా. ర. : సుభాషిత రత్నావళి
సువర్చ. ప. : సువర్చలా పరిణయము
సూ. ని. : సూర్యరాయాంధ్ర నిఘంటువు
హంస. : హంసవింశతి
హరవి. : హరవిలాసము
హరివం. పూ. భా. : హరివంశము పూర్వభాగము
హరిశ్చం. : హరిశ్చంద్రోపాఖ్యానము

భాషా సంకేతాల వివరణ :

అర. : అరబిక్
ఆం. : ఆంగ్లం
ఉ. : ఉర్దూ
క. : కన్నడం
కు. : కువి
కూ. : కూయి
కొడ. : కొడగు
కోలా. : కోలామి
గోం. : గోండి
త. : తమిళం
తు. : తుళు
తె. : తెలుగు
నా. : నాయికి

| | | |
|---|---|---|
| వ. | : | వర్జి |
| వర్షి. | : | వర్షియన్ |
| పా. | : | పాళీ |
| ప్రా. | : | ప్రాకృతం |
| బ్రా. | : | బ్రాహుంయీ |
| మ. | : | మలయాళం |
| మరా. | : | మరాఠీ |
| సం. | : | సంస్కృతం |
| హిం. | : | హిందూస్తానీ |

ఇతర సంకేతాలు :

| | | |
|---|---|---|
| అం. నా. | : | అంగ్లనామం |
| ఇం. పే. | : | ఇంటిపేరు |
| ఉ. | : | ఉచ్చారణ |
| ఉదా. | : | ఉదాహరణ |
| ఏ. వ. | : | ఏకవచనం |
| ఔప. | : | ఔపవిభక్తిక రూపం |
| కు. నా. | : | కుటుంబనామం |
| కు. సూ. | : | కులసూచి |
| గృ. నా. ప. | : | గృహనామ పరపదం |
| గృ. నా. పూ. | : | గృహనామ పూర్వపదం |
| గ్రా. నా. | : | గ్రామనామం |
| చూ. | : | చూడండి |
| జ. ని. | : | జననిరుక్తులు |
| తం. పే. | : | తండ్రిపేరు |
| తె. | : | తెలంగాణ |
| ద్వి. వి. | : | ద్వితీయావిభక్త్యంగ రూపం |
| పం. | : | పంక్తి |
| పర్యా. | : | పర్యాయపదాలు |

| | | |
|---|---|---|
| పు. | : | పుట |
| పు. నా. | : | పురుషనామం |
| పు. నా. అను. | : | పురుషనామ అనుబంధం |
| పు. నా. ప. | : | పురుషనామ పరపదానుబంధం |
| పోల్చిచూ. | : | పోల్చిచూడండి |
| బహు. | : | బహువచనం |
| బహు. ద్వి. వి. | : | బహువచనానికి ద్వితీయా విభక్త్యంగం |
| బహు. ఔప. | : | బహువచనానికి ఔప విభక్తిక రూపం |
| మొ. | : | మొదలైనవి |
| రా. | : | రాయలసీమ |
| రూ | : | రూపాంతరం |
| రూ. చూ. | : | రూపాంతరాలకు చూడండి |
| వా. | : | వాడుక |
| వి | : | విశేషాంశాలు |
| వి. చూ. | : | వివరములకు చూడండి |
| వృ. నా. | : | వృక్షశాస్త్ర నామం |
| వ్య. నా. | : | వ్యక్తినామం |
| శా. | : | శాసనాలు |
| శా. రూ. | : | శాసన రూపం |
| స. | : | సర్కారు |
| సం. | : | సంపుటి |
| సా. | : | సాహిత్యం |
| స్త్రీనా. | : | స్త్రీనామం |
| స్త్రీనా. అను. | : | స్త్రీనామ అనుబంధం |

తె.రా.స.) కుండలీకరణంలో సూచించబడిన ప్రాంతాలలో ఆ ఇంటిపేరు వ్యాప్తిలో వుందని అర్థం.

> పూర్వమందున్నది సమీప మాతృకగాని, ప్రాచీన రూపమనిగాని అర్థం.

| | |
|---|---|
| < | మొనవైపున వున్నది జన్యరూపమని కాని, పరిణత రూపమనిగాని అర్థం. |
| ? | సందేహాస్పదమైనది. |
| – | ఈ గుర్తు గృహనామంలోని ఒక పదానికి పూర్వం వుంటే ఆపదం గృహనామ పరపదమనీ, పదానికి తరువాత వుంటే అది గృహనామ పూర్వపదమనీ అర్థం. |

**ఆంగ్ల గ్రంథాలు :**

| | |
|---|---|
| C.P.D.L. | Collected Papers on Dravidian Linguistics. |
| C.T.S.I. | Castes and Tribes of South India |
| D.E.D, | Dravidian Etymological Dictionary |
| D.E.D.S. | Dravidian Etymological Dictionary Supple-ment. |
| F.F. | Fairs and Festivals |
| J.A.H.R.S. | Journal of Andhra Historical Research Society |
| N.I. | Nellore Inscriptions |
| S.I.I. | South Indian Inscriptions |
| T.T.D.E.S. | Tirumala Tirupati Devasthanam Epigraphical Series |
| T.M.P. | Topographical List of Madras Presidency. |

—o—

# తెలుగు వారి ఇంటి పేర్లు
## ( మొదటి భాగం )
## ప్రవేశిక

### గృహనామాల సేకరణ — ఆధారాల వివరణ :

ప్రస్తుత పరిశోధనలో పేర్కొబడ్డ గృహనామాల సేకరణ ఏడు విధాలుగా జరిగింది. 1. ఓటర్ల జాబితానుండి. 2. గ్రంథాలనుండి, 3. తెలుగు శాసనాల నుండి, 4. వార్తాపత్రికలనుండి. 5. ఉత్తరాలద్వారా. 6. సంభాషణ రూపంలో, 7. వివిధ కార్యాలయాలనుండి.

### 1. ఓటర్ల జాబితాలనుండి :

ఇంటిపేర్లను ఓటర్ల జాబితాలనుండి సేకరించడం ఒక పద్ధతి. తెలుగు దేశంలో వ్యవహారంలోవున్న అందరి ఇంటిపేర్లు పరిమిత వ్యవధిలో పట్టికా రూపాన ప్రదర్శించడం కష్టంకనుక యదేచ్ఛా సేకరణ (Random Selection) పద్ధతిలో ఇంటిపేర్ల సేకరణ జరిగింది. తెలంగాణాలోని రంగారెడ్డి. హైదరాబాదు జిల్లాలోని 58 గ్రామాలు, రాయలసీమలోని చిత్తూరు, కడపజిల్లాలోని 102 గ్రామాలు, సర్కారు ప్రాంతంలోని కృష్ణా, గుంటూరు జిల్లాల్లోని 50 గ్రామాలకు సంబంధించిన 1976వ సంవత్సరపు ఓటర్ల జాబితాలనుండి ఇంటిపేర్లు సేకరించడం జరిగింది. ప్రతి నియోజకవర్గం కార్యాలయం నుండి ఆయా నియోజకవర్గాలకు చెందిన గ్రామాల ఓటర్ల జాబితా గ్రహించి అందలి ఇంటిపేర్లు గ్రహించడ మయింది. ఎన్నికల కార్యాలయంలో మరో ప్రతి లేనందున సేకరణ అక్కడే చేయవలసి వచ్చింది. సర్కారు జిల్లాల్లో గృహనామాల సేకరణ ఈ పద్ధతిలోనే జరిగింది.

తెలంగాణాలోని మలక్‌పేట. హైదరాబాదు ఎన్నికల కార్యాలయములలో అధికారుల అనుమతితో ఓటర్ల జాబితాలు పరిశీలించి నప్పటికీ ఆ జాబితాలన్ని ఆంగ్లభాషలో ఉన్నందున ఇంటిపేర్ల సేకరణ కష్టంగా కన్పించింది ఓటర్ల జాబితాలు ఆంగ్లభాషలో ప్రచురించబడడం వలన ఉచ్చారణ భేదాలు ట–డల

మధ్య భేదం స్పష్టంగా లేకపోవడంతో హ్రస్వ దీర్ఘాలకు తేడా లేకపోవడం వలన కొన్ని ఇబ్బందులు కలిగాయి.

2. గ్రంథాలనుండి

సాహిత్యం, చారిత్రక రచనల (కులచరిత్రలు) అని ఈ భాగాన్ని రెండుగ విభజించవచ్చు.

**అ. సాహిత్యం నుండి :**

నన్నయ కాలమునుండి ఇప్పటివరకున్న సాహిత్యంలోని పీఠికలు కృత్యవతారికలు, అశ్వాసాది ఆశ్వాసాంత గద్య పద్యాలలో ఉన్న ఆయా కృతికర్తల, కృతిభర్తల, కృతిప్రేరకుల గృహనామాలు సేకరించబడ్డాయి.

ఆ. చారిత్రక రచనలు :

కొంతమంది వారి కుల చరిత్రను గ్రంథంగారాశారు, కొన్ని గ్రంథాల్లో గృహనామ పట్టిక కూడ చోటుచేసుకొంది ఉదా : కొత్త భావయ్య చౌదరిగారి కమ్మవారి చరిత్ర, ఆచార్య పాలడుగు శేషాచల వర్మగారి కూర్మరాజీయము, విపుల ఇండ్లపేర్లు–శాఖలు, గోత్రములు, ఇవికాక ప్రాచీన గవరల చరిత్ర, బలిజకుల చరిత్ర నుండి కూడా ఇంటిపేర్లు సేకరించబడ్డాయి. ఎ. నాగభూషణంగారి ద్రావిడ బ్రాహ్మణుల ఇంటిపేర్లు, రాచిరాజు సీసమాలిక, Thurston గారి 'Castes and Tribes of South India', ఏడు సంపుటాలు గృహనామాల సేకరణకు ఎంతో తోడ్పడ్డాయి. పల్నాటి వీరచరిత్రలో అనుగురాజుతో పాటు యాత్రకు వెళ్ళినవారిని వర్ణించిన సందర్భం, పండితారాధ్య చరిత్రలో భక్తుల సమూహాలను వర్ణిస్తున్న ఘట్టాలు, ఓరుగంటి చరిత్రలో కాకతీయుల కాలంనాటి నాయకులను పేర్కొన్న పట్టిక, వేటూరి ప్రభాకరశాస్త్రిగారి చాటుపద్య మణిమంజరిలోని ద్వాత్రింశన్మంత్రి సీసమాలిక ఇంటిపేర్ల సేకరణకు ఎంతో దోహదం చేసినవి.

**3. తెలుగు శాసనాలనుండి**

సాధు సుబ్రహ్మణ్యశాస్త్రిగారి 'Early Inscriptions' అకాడెమీ వారిచే ప్రచురించబడిన డా॥ బూదరాజు రాధాకృష్ణగారి 'Early Telugu Inscriptions', తిరుపతి విశ్వవిద్యాలయం వారు ప్రచురించిన డా॥ యమ్. రామారావుగారి

'Inscriptions of Andhra Desa'. దక్షిణాంధ్ర శాసనాలలో నాల్గు, ఆరు సంపుటాలు. వేపా రామేశం పంతులుగారిచేత ముందుమాట రచించబడిన తెలంగాణా శాసనములు. శ్రీ జి. పరబ్రహ్మ శాస్త్రిగారి తెలుగు శాసనాలు. రంగాచార్యగారి 'Topogrophical list of Madras Presidency' రెండు సంపుటాలు మొదలైన శాసన గ్రంథాలలో కన్పించిన గృహనామాలు పూర్వాపరాలతో సహా స్వీకరించబడ్డాయి. శాసనాలలోని గృహనామాలకు ఇప్పుడు వాడుకలో ఉన్న గృహనామాలకు రూపంలో చాలా తేడా కన్పిస్తుంది.

4. వార్తాపత్రికల నుండి :

వార్తాపత్రికలలో ప్రచురించబడే సభలు, సమావేశాలలో పాల్గొన్న వ్యక్తి నామాలలోని గృహనామాల సేకరణ మరో పద్ధతిగా స్వీకరించబడింది. 1976 జూన్ నుండి నవంబరు వరకు వెలువడిన ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి, ఈనాడు దినపత్రికలలోని ఇంటిపేర్లు గ్రహించబడ్డాయి.

5. ఉత్తరాల ద్వారా :

కొన్ని ప్రాంతాలలోని స్నేహితులనుండి ఉత్తరాలద్వారా ఇంటిపేర్లు స్వీకరించబడ్డాయి. ఈ పద్ధతి ఎక్కువగా రాయలసీమలో ఉపయోగించబడింది. ఓటర్ల జాబితాలో ఇంటిపేర్లు అదృశ్యమయి ఏకాక్షర రూపంలో కన్పించినందువల్ల ఓటర్ల జాబితాలద్వారా జరిగే గృహనామాల సేకరణ పద్ధతికి రాయలసీమలో అవరోధం కలిగింది. అందువలన రాయలసీమలోని కొన్ని ప్రాంతాలనుండి భోజనపాటి రాజేంద్రనాయుడు, ఎర్రొంగ్లపల్లి; యమ్. వెంకటరెడ్డి, మలకాట్‌పల్లి; బి. గురునాథనాయుడు, కొత్తపల్లి (చిత్తూరుజిల్లా); టి. రామమూర్తి, చిత్తూరు మొదలైనవారు ఒక్కొక్కరు వారి పరిసర ప్రాంతాల్లో ఉన్న ఇరవై గ్రామాలలోని గృహనామాలను కులాలతోసహా సేకరించి పంపారు.

6. సంభాషణ రూపంలో :

పరిచయమున్నా లేకపోయినా చాలా సందర్భాలలో కలసిన వ్యక్తులనుండి వారి ఇంటిపేర్లు, వారి బంధువుల, సన్నిహితుల ఇంటిపేర్లు, వారు ఏయేప్రాంతాల్లో నివసిస్తున్నారో, ఏకులానికి సంబంధించినవారో సంభాషణ రూపంలో గ్రహించబడ్డాయి.

## 7. వివిధ కార్యాలయాల్లోని జాబితాలనుండి :

కళాశాలల్లో సీట్లకోసం. ఎంప్లాయిమెంట్ ఆఫీసుల్లో ఉద్యోగంకోసం. విశ్వవిద్యాలయంలో పరీక్షలకోసం దరఖాస్తులు పెట్టుకొన్న అభ్యర్థుల జాబితాల నుండి ఇంటిపేర్లు సేకరించబడ్డాయి. పెదనందిపాడు కళాశాల. నాగార్జున విశ్వవిద్యాలయంలోని పరీక్షావిభాగం .గుంటూరు ఎంప్లాయిమెంటు ఎక్స్చేంజిలోని ఆఫీసుల్లోగల అభ్యర్థుల జాబితాలు ఇందుకు తోడ్పడ్డాయి.

మొత్తంమీద ఆరువేల గృహనామాలు సేకరించినప్పటికీ ఇప్పుడు వాడుకలో ఉన్నవాటికి పూర్వరూపం ఏదై ఉంటుందో గ్రహించలేనివి కొన్ని, ఉచ్చారణ, లేఖన దోషాల వలన రూపాన్ని కోల్పోయినవి కొన్ని. అర్థం తెలియని పేర్లు కొన్ని పరిశోధనకు అంతుచిక్కలేదు. కమ్మవారిలో ఇంటిపేర్లకు, బ్రాహ్మణుల ఇంటిపేర్లకు గ్రంథాలలో పట్టికలున్నాయి గనుక ఈ ఇంటిపేరు ఈ కులంలో ఉన్నదని పేర్కొనబడింది. ఇతర కులాలకు ఈ అవకాశం కలుగలేదు. రాయల సీమలోని గృహనామాల సేకరణ స్థానికులచేత చేయబడింది గనుక ఏ గృహ నామం ఏ కులానికి చెందిందో తెలిసింది.

అలానే సర్కారు జిల్లాల్లోకూడ ఏయే కులాల్లో ఏయే ఇంటి పేర్లున్నాయో తెలుసుకోవడంకోసం కొందరి వ్యక్తుల వద్ద ప్రయత్నించినప్పటికీ. ఇంటిపేరు చెప్పినంత సులభంగా కులంపేరు చెప్పడానికి ఇష్టపడలేదు. పైగా ఈ ఇరవయ్యో శతాబ్దంలో కూడా కులాన్నిగురించి అడుగుతున్నారా! అన్నట్లు కోపంగా చూస్తున్నందున ఈ ప్రయత్నం విరమించబడింది.

## సిద్ధాంత వ్యాససారం :

ఈ సిద్ధాంత వ్యాసంకోసం సేకరించిన ఇంటిపేర్ల జాబితాలనుండి గృహ నామాలుగా నిలిచిపోయిన గ్రామనామాల పట్టిక గ్రంథ విస్తరణ భీతివల్ల తొలగించబడింది. స్థూలంగా ఈ సిద్ధాంత వ్యాసం రెండు భాగాలుగా విభజించ బడింది. మొదటిభాగం ఇంటిపేర్ల తత్త్వ సందర్శనానికి సంబంధించింది. రెండో భాగంలో స్వరూప స్వభావ నిరూపణలకు సంబంధించిన వివరణలతో ఇంటిపేర్లు అకారాద్యను క్రమంలో ప్రదర్శించబడ్డాయి.

మొదటి భాగం :

ఈ భాగం నాల్గు చిన్న ప్రకరణాలుగా విభజించబడింది, భూమిక, భారతీయేతర భాషలలో ఇంటిపేర్లు, ఇతర భారతీయ భాషలలో ఇంటిపేర్లు, తెలుగువారి ఇంటిపేర్లు—ఈ భాగానికి రూపుదిద్దాయి. ప్రవేశిక ముందు చూపబడింది. ఇందులో గృహనామాల సేకరణ—ఆధారాల వివరణలు ఇవ్వబడ్డాయి. గృహనామాల సేకరణ టెలిఫోన్ డైరెక్టరీలనుండి, గ్రంథాలనుండి తెలుగు శాసనాల నుండి, వార్తాపత్రికలనుండి, ఉత్తరాల ద్వారా, సంభాషణ రూపంలో, వివిధ కార్యాలయాలనుండి అవి ఏడువిధాలుగా జరిగిందని పేర్కొనబడింది. ఒక్కొక్క భాగాన్ని గురించి వివరించడం జరిగింది. ఇందు సిద్ధాంత వ్యాస ప్రణాళిక ఇవ్వబడింది.

మొదటి ప్రకరణం :

ఈ ప్రకరణం భూమికగా చెప్పబడింది. సంజ్ఞావాచకాలను వివరించడానికి ప్రాచ్యపాశ్చాత్య పండిత పరిశోధకుల అభిప్రాయాలు స్థూలంగా ప్రదర్శించబడ్డవి. నామ విజ్ఞానాన్ని గురించి వివరిస్తూ సంజ్ఞానామ శాస్త్ర విభజన ఎన్ని రకాలుగా వుంటుందో చూపించబడింది. సంజ్ఞావాచకాలన్నీ ఒకదానితో ఒకటి ఎక్కువ సంబంధం కలిగి వుంటాయని వివరించడమయింది. ఉదా : గ్రామనామం ఇంటిపేరుగా ఉంటుంది. వ్యక్తినామం ఇంటిపేరుగా ఉంటుంది. ఇంటిపేరు గ్రామనామంగానూ కన్పిస్తుంది.

పేరుకుగల ప్రాధాన్యాన్ని వివరిస్తూ నిఘంటువుల్లో ఇవ్వబడ్డ నామ నిర్వచనాలు పేర్కొనడం జరిగింది.

ఇంటిపేరుతో ఎక్కువ సన్నిహిత సంబంధం కలది వ్యక్తినామం గనుక ఆ వ్యక్తినామాలను వాటి ఉనికిని చర్చిస్తూ వ్యక్తినామాలకు ఏర్పడే మారుపేర్లను వివరించడమయింది. ఈ రెండోపేరు ముద్దుపేర్లు, వ్యంగ్యనామాలు, కలంపేర్లు బిరుదులు, మార్చుకున్నవి, ఇంటిపేర్లు, ప్రథమాక్షర సంఘటితాలు, పట్టపుపేర్లు, సంకేత నామాలు, రంగస్థల నామాలు అని సౌలభ్యంకోసం తొమ్మిది విధాలుగా విభజించబడింది. ఒక్కొ విభాగాన్ని గురించి కొద్దిగొద్దిగా వివరణ చేయడానికి వీలుకలిగింది.

ప్రవేశిక

కుటుంబ నామాన్ని గురించి తెలుసుకునేముందు కుటుంబం యొక్క ఆవశ్యకత, దాని వ్యాప్తి, ప్రాధాన్యం వివరించడం ప్రధానం. కుటుంబం లేకపోతే సంఘానికి అస్తిత్వం లేదు. అందుకే ఆదిమ మానవుల కాలంనుండి కుటుంబం ఎలా మానవుని అవసరాలు తీర్చుతున్నదీ వివరించబడింది. కుటుంబ వ్యవస్థను పేర్కొంటూ కుటుంబాన్ని ఎన్నిరకాలుగా చూపవచ్చునో వివరించబడింది. మాతృస్వామిక పితృస్వామిక వ్యవస్థలతోపాటు బహుభార్యాత్వ బహు భర్తృత్వ కుటుంబాల నిర్మాణంకూడా వివరించబడ్డాయి. భారతదేశంలో కుటుంబ వ్యవస్థ చాలా పటిష్ఠమైనది. మొన్నమొన్నటి వరకు అవిభక్త కుటుంబాలే ఎక్కువగా ఉండేవి. ఇప్పుడు చిన్నచిన్న కుటుంబాల సంఖ్య ఎక్కువయింది. నాగరికత వెర్రితలలు వేస్తున్న ఈ సమాజంలో కుటుంబ భవిష్యత్తు ఎలా ఉంటుందో ఊహించబడింది

నిఘంటువులలోను అనేక విజ్ఞాన సర్వస్వాలలోను ఈబద్ధ గృహనామ నిర్వచనాలు ప్రదర్శించబడ్డాయి, కుటుంబ నామ ప్రాధాన్యం, ప్రయోజనం వివరించబడ్డాయి.

రెండో ప్రకరణం :

ఇందు భారతీయేతర భాషలలోని ఇంటిపేర్ల పరిశీలన జరిగింది. పాశ్చాత్య దేశాలలో ఇంటిపేర్ల పద్ధతి ఎలావుందో పరిశీలించడానికి అనేక విజ్ఞాన సర్వస్వాలు ఎంతగానో ఉపకరించాయి. పాశ్చాత్య భాషలలో ఇంటిపేర్లు ఏయే తీరుల్లో వాడుకలో ఉన్నాయో నిరూపించబడ్డాయి. ఈ ప్రకరణాన్ని పాశ్చాత్యజాతులు, మధ్య ప్రాచ్య జాతులు, చైనా, జపాన్, కొరియా మొదలైన ప్రాంతాలలో ఇంటిపేర్లని మూడు విభాగాలుగా విభజించడం జరిగింది. స్కాచ్, జర్మన్, జెక్ మొదలైనవి పాశ్చాత్యజాతుల్లోనూ, అరబిక్, అరామిక్ యూదు మొదలైన వాటిని మధ్య ప్రాచ్యభాషలుగానూ, చీనీ, జపానీ, కొరియన్ మొదలైనవి ఒక విభాగం గానూ, గ్రహించబడ్డాయి.

భారతీయేతర భాషల్లో గల ఇంటిపేర్లను మాతాపితరుల వలన ఏర్పడ్డవి, వృత్తినిబట్టి, నివాస స్థలాన్ని బట్టి, స్వరూపాన్ని బట్టి, జంతువుల పెంపకాన్ననుసరించి అవలంబించిన మతాన్నిబట్టి అని ఆరు విధాలుగా విభజించడం జరిగింది.

మాతాపితరుల నామాలు వేర్వేరుగా వివరించబడ్డాయి. తండ్రిపేరును వ్యక్తి నామానికి అనుబంధించుకోవడం చాలా ప్రాంతాల్లో కన్పిస్తుంది. ఒక్కొక్క ప్రాంతంలో ఆ పద్ధతి ఒక్కోరకంగా ఉంది. ఈ విషయాలు విపులీకరించబడ్డాయి. స్పెయిన్, లాటిన్ అమెరికాల్లో కన్పిస్తున్న మాతృస్వామిక పద్ధతికి ఉదాహరణలు చూపించబడ్డాయి. ఇలానే మిగిలిన భాగాల వివరణ జరిగింది.

మనకు ఇంటిపేర్లు తరచుగా మారుతున్నట్లే పాశ్చాత్యుల్లోకూడ ఇంటిపేర్ల మార్పిడి కన్పిస్తుంది. ఆలా మార్పులను పొందిన ఇంటిపేర్లు కారణాలతో సహా చూపించబడ్డాయి.

పాశ్చాత్యుల గృహనామాలు ఆంగ్లంలో వుంటాయిగనుక ఆ పేర్లను తెలుగులో ఉచ్చరించడం రాయడం చాలా కష్టమైనపని. అందువలన ఉచ్చారణా స్వరూపాన్ని తెలుగులో రాస్తూ ఆపదాన్ని ఆంగ్లంలో కుండలీకరణంలో సూచించవలసి వచ్చింది. ఒక్కొక్క పదాన్ని ఒక్కొక్క వ్యక్తి ఒక్కో విధంగా ఉచ్చరిస్తాడు గనుక ఆ పదానికి ఏరూపం సమీపంలో ఉందనిపిస్తే అది గ్రహించడం జరిగింది. కొన్ని ఉద్ధరణాలను ఆంగ్లంలో పేర్కొని వాటికి వెంటనే భావం వివరించబడింది.

మూడో ప్రకరణం :

ఈ ప్రకరణంలో తెలుగు దేశానికి చుట్టుప్రక్కలగల ప్రాంతాల్లో ఉన్న ఇంటిపేర్లరీతి పరిశీలించబడింది. ఆంధ్రదేశం నుండి ఇతర ప్రాంతాలకు వెళ్ళిన ఆంధ్రులు కొందరు ఆ ప్రాంత ప్రభావం తమమీద పడకుండా ఇంటిపేరు నిలుపుకున్నారు. మరికొందరు ఆ ప్రభావంతో మన పద్ధతిని వదలి ఆ పద్ధతినే స్వీకరించారు. పరిసరస్థ భాషల్లో గృహనామాలను ద్రావిడ భాషల్లో ఇంటిపేర్లు, గౌడియ భాషల్లో ఇంటిపేర్లని రెండు విధాలుగా విభజించబడ్డాయి. తమిళనాలలో. కేరళలో. మైసూరు ప్రాంతంలో ఇంటిపేర్లు ఎలావున్నాయో ద్రావిడ భాషల్లోని ఇంటిపేర్లలోను: గుజరాత్, మహారాష్ట్ర. మధ్యప్రదేశ్ ప్రాంతాల్లోని ఇంటిపేర్లు గౌడియ శాఖలోని ఇంటిపేర్లుగా పేర్కొనబడ్డాయి.

నాల్గో ప్రకరణం :

తెలుగువారి ఇంటిపేర్లను గూర్చి ఇందులో చెప్పబడింది. ఈ ప్రకరణం

తెలుగుసాహిత్యంలో ఇంటిపేర్లు, వ్యవహారంలో తెలుగువారి ఇంటిపేర్లు–వర్గీకరణ అని రెండుగా విభజించబడింది. సాహిత్యంలో ఇంటిపేర్ల భాగంలో తెలుగు సాహిత్యంలో ప్రసక్తమయిన ఇంటిపేర్లు ప్రదర్శించబడ్డాయి. ప్రాచీనాంధ్ర కవుల కావ్యావతారికాభాగాల్లో, ఆశ్వాసాద్యంత గద్యల్లో కన్పిస్తున్న కృతికర్తల, కృతి భర్తల, కృతిప్రేరకుల ఇంటిపేర్లు ఉదహరించబడ్డాయి. సాహిత్యంలో అక్కడక్కడా కవులు చేసిన వంశవర్ణనలు ప్రదర్శించబడ్డాయి. సాహిత్యంలోని ఇంటిపేర్లను మూలపురుషులతో ఏర్పడ్డవి, మాతాపితరుల నామధేయాలతో సంబంధంగలవి, గ్రామనామాలు, పౌరుష లేక బిరుదనామాలు, వృత్తులు, జననిరుక్తులు, మార్పులు అని ఏడు భాగాలుగా విభజించబడ్డాయి.

మూలపురుషుల పేర్లతో ఏర్పడిన వాటిని గురించి చెప్పేటప్పుడు వ్యక్తి నామ పరపదాలైన–నేని, –రాజు, –రెడ్డి లాంటివి తీసుకొని ఆ పరపదం గల సాహిత్యంలోని ఇంటిపేర్లన్నీ అకారాద్యనుక్రమంలో కూర్చి ఒక్కొక్కదానికి వివరణ చేయబడింది. సాహిత్యంలో కన్పించిన ఇంటిపేరును వ్యక్తినామంతో పాటు ఇక్కడ ఉదహరించి దానిప్రక్కనే కుండలీకరణంలో గ్రంథనామం, పుట సూచించబడ్డవి.

ఉపనిషత్తుల్లోనూ సాహిత్యంలోనూ గృహనామ స్థానంలో కన్పించిన తండ్రిపేర్లు, తల్లిపేర్లు, భర్తలపేర్లు ఉదహరించబడ్డాయి.

గ్రామనామాలను వివరించే సందర్భంలో గ్రామనామ పరపదాలైన–ఊరు, –కంటి, –కొండ, –కొలను, –పల్లి, –పాటి, –ప్రోలు, –మట్టి, –వాడ మొదలైన వాటితో గల గృహనామాలు అకారాద్యను క్రమంలో రాసి ఒక్కొ ఇంటిపేరును వివరించడం జరిగింది. పరపదాలను వేరుచేయడానికి వీలులేని 'బమ్మెర' లాంటి వాటికి వివరణ తరువాత ఈబడింది,

పౌరుష నామాలుమీదుగా ఏర్పడ్డ ఇంటిపేర్లను సంగీత ప్రావీణ్యాన్ని సూచించేవి, కవిత్వ పాండిత్యసూచి, పరాక్రమసూచి అని మూడు విధాలుగా విభజించడం జరిగింది. ఏకా, చల్లగాలి, మొదలైన బిరుదనామాలు కూడా వివరించబడ్డాయి. సాహిత్య గ్రంథాలలో ఈ ఇంటిపేర్లు గల భాగాలను ఉదహరిస్తూ ఆగ్రంథ నామం, ఆశ్వాసం, పుట కుండలీకరణాల్లో సూచించ బడ్డాయి.

అర్చకం. అవసరం కొట్టరువు మొదలైన వృత్తిపరమైన ఇంటిపేర్లను వివరించడం జరిగింది ఆచంట. సిల్లలమర్రి. పుష్పగిరి. మేకా మొదలైన ఇంటి పేర్లకుగల జననిరుక్తులు చెప్పబడ్డాయి.

ఇంటిపేర్లలో భిన్నత్వం ఉంది. పూర్వం రెండుమూడు తరాల కొకసారి అరుదుగా మారుతుండేవి. సాహిత్యంలో అలాంటి మార్పులకు గల కారణాలు పరిశీలించబడ్డాయి. ఈ మార్పులు గ్రామనామాలు. నివాస ప్రదేశాన్ననుసరించి, బిరుదులు. వృత్తిననుసరించి. సంస్కృతీకరణ. ప్రసిద్ధపురుషులనుండి. సందిగ్ధ స్థితివలన అవి ఏడు రకాలుగా రూపొందించబడ్డాయి,

సాహిత్యంలో చాలాచోట్ల కవులు చేసిన వంశవర్ణనలు ప్రదర్శించబడ్డాయి.

వ్యవహారంలో ఉన్న ఇంటిపేర్ల వివరణలో వ్యక్తినామంలో గృహనామ స్థానాన్ని వ్యక్తీకరించడం జరిగింది. వాడుకలో ఉన్న ఇంటిపేర్లను ఎన్ని రకాలుగా వర్గీకరించవచ్చో వర్గీకరణచేసి ఒక్కొ-భాగాన్ని ఉదాహరణలతో పాటు వివరణ ఇవ్వబడింది. వర్గీకరణకు సూచించే పట్టిక రూపొందించబడింది నేటి సమాజంలో ఇంటిపేర్లలో మార్పు అధికంగానే కన్పిస్తుంది. ఆ మార్పులకు గల కారణాలను పేర్కొంటూ ఉదాహరణలతో వివరించబడ్డాయి.

సిద్ధాంత వ్యాసంలోని రెండోభాగం రెండుగా విభజించబడింది. 1. గృహ నామ వివరణపట్టిక, 2. గృహనామ పరపద వివరణ పట్టిక. గృహనామ పూర్వ పదాల పట్టిక ఒక క్రమపద్ధతిలో తయారుచేయబడింది. ఒక గృహనామ ఆరోపం కింద దానికి గల రూపాంతరాలు చూపించబడ్డాయి. తరువాత ఆ గృహనామం ఏవర్గానికి చెందిందో అంటే వ్యక్తినామానికో, పౌరుషనామానికో, వృత్తిని సూచించేదిగావుందో చెప్పబడింది. దానిప్రక్కనే ఆ ఇంటిపేరు ఏప్రాంతంలో వ్యాప్తిలో ఉందో ఆ ప్రదేశం కుండలీకరణంలో ఇవ్వబడింది. తరువాత పంక్తిలో గృహనామ పూర్వపదాన్ని విడదీసి దాని వ్యుత్పత్తి చెప్పబడింది. అది ఏకులంలో కన్పిస్తుందో తెలిసిన మేరకు వివరించడం జరిగింది. ఈ ఇంటిపేరు యీకులంలో ఉందని చెప్పినపుడు ఆకులంలో మాత్రమే ఉందని అర్థంకాదు. ఆకులంలో ప్రచురంగా కన్పించిందని చెప్పడం ఇక్కడి ఉద్దేశం. వీలైనచోట్ల వివిధ ద్రావిడ

భాషల్లోగల జాతిరూపాలు పేర్కొ-బడ్డవి. శాసనాలలోను, సాహిత్యంలోను ఇంటి పేరును సూచించే భాగాలు అక్క-డచూపి కుండలీకరణంలో ఆ శాసనం లభించిన గ్రంథం, పుట. శాసన సంఖ్య లేక సాహిత్యగ్రంథం, అశ్వాస, పద్యసంఖ్య పేర్కొ-నబడ్డాయి. శాసనాలలోని ఇంటిపేర్లను సేకరించినపుడు ఆశాసన లేఖన రీతులను మార్చకుండ యధాతథంగా తీసుకోవడంజరిగింది. ఉదా :- అంగ్గడి. కొన్ని శాసనాలలోని ప్రాచీన రూపాల్లో హ్రస్వదీర్ఘాలగుర్తులు సరిగా సూచించక పోయేసరికి. గృహనామ సేకరణలో కొంత తికమక కలిగింది. వాడుకలో ఉన్న ఇంటిపేర్లలో ఎ. ఒ ఐ- య. వలుగా ఉచ్చరించబడి అవే గ్రంథస్థమయ్యాయి. ఉదా :- ఎలవర్తి - యలవర్తి. ఏర్నేని - యర్నే. ఒబ్బిలిశెట్టి - వొబ్బిలిశెట్టి ఉ-వుగా కూడ కన్పిస్తుంది. ఉదా :- ఉపాధ్యాయుల - వుపాధ్యాయుల. ఇలాంటి తావుల అజాది రూపం ప్రధానారోపంగానూ, హలాది రూపం ఉపారోపంగానూ సూచించబడ్డవి. ఆ ఇంటిపేరులో గల పరపదాన్ని చివరపంక్తిలో సూచించి దాని వివరణ గృ నా. ప. పట్టికలో చూడమని చెప్పడం జరిగింది. ఈ ఇంటి పేర్లన్నీ అకారాద్యనుక్రమంలో చూపబడ్డాయి. పూర్వ పరపదాలుగా విభజించడానికి వీలులేని పదాలుకూడా పై అకారాద్యను క్రమంలోనే ప్రర్శించబడ్డవి.

రెండోవిభాగం పరపద నిరూపణకు సంబంధించింది. పరపద నిరూపణలో ఒక గృహనామ పరపదాన్ని తీసుకొని దాని రూపాంతరాలు సూచించడం జరిగింది. ఆ పరపదానికి సంబంధించిన పూర్వపదాలజాబితా వరుసగా అకారాద్యను క్రమంలో సూచించి, తర్వాత ఆపదానికి గల అర్థం. వ్యుత్పత్తి, విశేషాంశాలు పేర్కొ-వడం జరిగింది. -నేని ఇంటిపేరు కమ్మవారిలో ఎక్కు-వ వాడుకలో ఉందని తెలిసినా నిర్ధారణగా తెలియని వాటిని కమ్మవారివని చెప్పలేదు. గృహ నామ పరపదాన్ననుసరించి చాలావరకు కులాన్ని సూచించవచ్చని చెప్పబడింది.

# భూమిక

భాషలో శబ్దార్థ వస్తు సంబంధ తత్త్వానికి చెందిన విషయంగా సంజ్ఞానామ తత్త్వ సమస్యను గూర్చి చెప్పవచ్చు. ప్రపంచంలోని చేతనాచేతన పదార్థాలను, మానవ నిర్మితాలను, అమూర్త భావాలను, వాగ్రూప సంకేతాలతో సూచించడమే భాషలు చేస్తున్న పని. ఈ సంకేతాలు మూర్తామూర్త పదార్థ బోధకాలుగా ఏర్పడి భావ వ్యవహారానికి తోడ్పడుతాయి. వీటిని వ్యాకరిస్తూ చేసే వర్గీకరణలో నామ వాచక పదాలు ఒక వర్గం వీటిని స్థూలంగా సామాన్య వాచకాలు (Common nouns), సంజ్ఞా వాచకాలు (proper nouns) అని విభజించవచ్చు.

ఇతర పదాలకువలే ఈ సామాన్య వాచకాలకు కూడ శాబ్దిక రూపం, అర్థం ఉంటాయి. సంకేతార్థాన్ని బోధించే శబ్దశక్తిని 'అభిధ' అని భారతీయ ఆలంకారికులు పేర్కొన్నారు. ఈ సంకేతితార్థాన్నే వాచ్యార్థం అంటారు. వీటి స్వరూప స్వభావాలనుబట్టి ఈ వాచక శబ్దాలను జాతి, గుణ, క్రియా, ద్రవ్యవాచిక శబ్దాలుగా విభజించవచ్చు. జాతినంతటిని బోధించే జాతివాచకాలనే సామాన్య వాచకాలు అంటారు.

వాచ్యార్థానికి అనుపపత్తి కలిగినప్పుడు తత్సంబంధమైన వేరొక అర్థాన్ని స్ఫురింపజేసే శక్తిని 'లక్షణ' అని చెప్పారు.

భాషలో సామాన్య వాచకాలకు, సంజ్ఞావాచకాలకుగల భేదాలను, పోలికలను, వాని ప్రతిపత్తిని, అర్థతత్త్వాన్ని గూర్చి ప్రాచ్యపాశ్చాత్య, ప్రాచీన నవీన తాత్త్వికులు, తార్కికులు, విజ్ఞాన వేత్తలు చాలా దృక్పథాలతో సమాలోచన చేశారు.

## సంజ్ఞావాచకాలు—ప్రాచ్య పండితుల, పరిశోధకుల అభిప్రాయాలు :

"భాషలోని ఇతర పదజాలం కంటె సంజ్ఞావాచకాలు భిన్నం కావని మీమాంసకులూ వేదాంతులూ అభిప్రాయపడినారు" (క.ఊ.పు.18). ఇవి సహజార్థ బోధకాలని వీరి అభిప్రాయం. నైయాయికుల అభిప్రాయం కూడ ఇదే. అన్ని పదాలు జాతివాచకాలేనన్న అభిప్రాయం కూడ కొందరు వ్యక్తీకరించారు.

పాశ్చాత్యుల దృష్టి :

సంజ్ఞా వాచకాలకు సహజార్థం వుండదనీ. అవి అర్థంలేని వస్తు నిర్దేశకాలనీ చాలామంది పాశ్చాత్య తాత్త్వికుల వాదం. (The encyclopaedia of Philosophy., Vol.6, 1967, 487) ఈవాదానికి బీజం ప్లాటో 'Theaetetus' లో కన్పిస్తుంది 'The name means the object, the object is its meaning (Witt genstein as quoted by Searle, 1971,135) సంజ్ఞావాచకం యొక్క అర్థం అది సూచించే వస్తువు అని విట్జెన్ స్టీన్ అభిప్రాయం.

అలెన్ హెచ్ గార్డినర్ వాదం ప్రకారం శబ్దానికిగల అర్థంతో నిమిత్తం లేకుండా కేవలం శబ్దమాత్రంగానే సంజ్ఞానామం వస్తువును సూచిస్తుంది. 'అర్థం మరుగున పడినపుడే సంజ్ఞావాచకాలు నిర్దుష్ట సంజ్ఞావాచకాలు అవుతాయి.' అని గార్డినర్ అభిప్రాయం. (Gardiner, 1940, 43). అర్థంతో నిమిత్తం లేనప్పటికి పై అభిప్రాయం సరైనది కాదని పుల్‌గ్రాం ఉద్ఘాటించినట్లు విశ్వనాథ రెడ్డిగారు పేర్కొన్నారు.

అలాగే సంజ్ఞావాచకాలకు సహజార్థం ఉందని పలువురు నామ విజ్ఞాన వేత్తల అభిప్రాయం. వీటిలో ఒక భాగమైన స్థలనామాలు. వ్యక్తినామాలు, గృహనామాలు అర్థరహిత ధ్వనులు కావు. స్థలనామాలలోని వ్యస్తపదాల అర్థం కంటె మొత్తం పేరులో అర్థం గొప్పదని జార్జి స్టీవర్ట్ భావించాడు. (Stewert 1967. 21)

సామాన్య సంజ్ఞావాచకాల మధ్య ఉన్న విభేదం వాటి వ్యాపారంలో వుందనీ. సంజ్ఞావాచకం సామాన్య వాచకంగా మారడం అసాధారణం కాదనీ స్టీఫన్ ఉల్‌మన్ అభిప్రాయం. (Ulman 1962. 77) ఒక వ్యక్తిని మాత్రమే ఉద్దేశించే పేరు సంజ్ఞానామమని ఎస్‌పర్సన్ (Jespersen 1958. 64) అభిప్రాయపడినట్లు తెలుస్తుంది.

సంజ్ఞానామ విజ్ఞాన విభజన :

సంజ్ఞావాచకాల పరిశోధన భాషాశాస్త్రంలో ఒక విభాగం. పేర్లను గురించి. దానికి సంబంధించిన శాస్త్రాన్ని ఒనమాస్టిక్స్ (Onomatics) అంటారు. అన్ని

ప్రాంతాలకు, అన్ని భాషలకు, అన్ని సాంస్కృతిక కేంద్రాలకు, అన్ని వస్తువులకు పేర్లుంటాయి గనుక ఈ విభాగం చాలా పెద్దది. అందుకనే ఈ శాస్త్రంలో విభజన చాలా అవసరం. వ్యక్తినామాల సమూహాన్ని ఆంథ్రోపోనమి (Anthroponomy) అనీ, వ్యక్తినామ అధ్యయనానికి 'Anthroponomistics' అనిపేరు. అలాగే స్థలనామాల సముదాయాన్ని 'Toponomy' అనీ, వాని అధ్యయనానికి 'Toponomistics' అనీ పేర్లున్నాయి, కాని వ్యవహారంలో మాత్రం వ్యక్తినామాలకు, వాటి అధ్యయనానికి వ్యక్తినామాధ్యయనం (Anthroponomy) స్థలనామాలకు, వాటి అధ్యయనానికి స్థలనామధ్యయనం (Toponomy) అనీ వ్యవహారం ఉంది. పట్టణాల, నగరాల, గ్రామాల, చిన్నపల్లెల పేర్లన్నీ టోపోనమి (Toponomy) అనీ, నివాసయోగ్యం కాని ప్రాంతాలైన పొలాలు, చిన్నచిన్న అడవులు మైక్రోటోపోనమి (Microtoponomy) అనీ, వీధులు, బాటల పేర్లు హైడోనమి (Hydonomy) అనీ, నీటికి సంబంధించిన వాటిని హైడ్రోనమి (Hydronomy) అనీ, పర్వతాలకు సంబంధించిన పేర్లను ఒరోనమి (Oronomy) అనీ, పర్వతా వస్తువుల (Things) పేర్లను క్రెమటోనమి (Chrematomony) అనీ వ్యవహరిస్తున్నారు.

స్థలనామాల నుండి యేర్పడిన వ్యక్తినామాలున్నాయి. ఉదా :— తిరుపతి, సింహాచలం. వ్యక్తినామాల నుండి యేర్పడిన స్థలనామాలున్నాయి. ఉదా :— కృష్ణంపేట, మల్లిఖార్జునపురం. గ్రహాలపేర్లుకూడ వ్యక్తినామాల మీదుగా యేర్పడినవున్నాయి. వ్యక్తినామాలనుండి యేర్పడ్డ ఇంటిపేర్లున్నాయి. ఉదా:— అక్కిరాజు, చలసాని. ఇంటిపేర్ల నుండి యేర్పడ్డ స్థలనామాలున్నాయి. ఉదా:— నిమ్మగడ్డవారిపాలెం రంపాపురం. ఇలా ఈ సంజ్ఞావాచకాలన్నీ ఒక విభాగంతో మరో విభాగం సంబంధం కలిగివున్నాయి.

పేరుకు గల ఆవశ్యకత లేక ప్రాధాన్యం :

చరిత్ర ఆరంభమైనప్పటినుండి మన ఆచార వ్యవహారంలో పేర్లు ఉన్నట్లు కన్పిస్తున్నాయి. "కొంతమంది అన్వేషకులు ఆదిమ జాతులలో పేర్లు లేని జాతులు కూడ ఉన్నాయని అభిప్రాయపడ్డారు మరొక వ్యక్తికి మనపేరు తెలిస్తే అతను మనమీద అధికారం వహిస్తాడనీ, చేతబడి మొదలైన అభిచార క్రియలవల్ల మనకు అపకారం చేస్తాడని భావించే మూఢాభిప్రాయం ఆదిమ మానవుల్లో ఉండేదట.

(World Book of Encyclopaedia, Vol.'4, P 5). అందుకే వారు తమ పేర్లను రహస్యంగా దాచుకొని అడ్డపేర్లతో మాత్రమే వ్యవహరింపబడేవారు.

పేరులో ఏముంది? అంటారు కొందరు. అందులోనే అంతా ఇమిడి ఉందంటారు మరికొందరు. వ్యక్తులపేర్లు, ఇంటిపేర్లు కులాలపేర్లు, తెగలపేర్లు వేర్వేరు అంతస్సులలోని సంజ్ఞావాచకాలు. సామాన్య సామూహిక వాచకాలనుండి ఒక నిర్దిష్టవ్యక్తిని గాని, నిర్ణీత వంశాన్నిగాని, తెగనుగాని వేరుపరచి వివరించేవే సంజ్ఞావాచకాలు. కమ్మవారు, కాపులు, కోమట్లు, రాజులు, బ్రాహ్మణులు అన్నవి కులాన్ని సూచించే సంజ్ఞావాచకాలు. అక్కినేని, వాసిరెడ్డి, గణపతిరాజు, గ్రంధి, సంధ్యావందనం మొదలైనవి ఇంటిపేర్లు.

ప్రపంచంలోని అన్నిభాషలలోను లాటిన్, గ్రీకు, ఇండియన్-అమెరికన్ మొదలైన నామాలలోని మొదటి అక్షరానికి పెద్ద అక్షరం (Capital Letter) వాడుకలో ఉంది. కనుక భాషలో పేరుకు ఏంత ప్రాధాన్యం ఉందో తెలుస్తుంది. జీవధారణకు ప్రాణవాయువు ఎంత అవసరమో, వ్యవహారానికి పేరు అంత అవసరం.

నామ నిర్వచనం :

"1. a word or a combination of words by which a person, Place, idea etc is known or designated.

2. Mere designation as distinguished by from fact"
( The Random House Dictionary of the English Language, p. 884)

" That by which a person or a thing is konwn or called : a designation : a reputation : fame : a celebrity : family or clan : seeming or pretension without reality.
(Chambers Twentieth century Dictionary)

నామము :

"సం.వి.న్.న. 1. పెట్టిన పేరు, 2. ఒక వస్తువునకు జనులు వాడుకొను పేరు, ఈశ్వరసంకేతము, 3. ప్రాతిపదికము (వ్యాక), 4. సంజ్ఞా

వాచక పదము. నామవాచకము (వ్యాక.). వ్యు : మ్నా= అభ్యాసేమ్నాయతే. ణము=ప్రహ్వీభావే శబ్దేచ_నమ్యతే _ నిపాత : (కృ.ప్ర). దీనిచే అర్థము తెలుప బడును." (ఆంధ్రశబ్ద రత్నాకరము. పు 573) "నామ నామధేయం. అభిధానం. ఆభిధా. అభిధేయం. ఆఖ్య. అభిఖ్యా. అహ్వాయ:,_కులనామ. (F. N.) ఉపనామ్ జన్మనామ్. నక్షత్రనామ్ = from the constellation (Monier Williams, p 524 )

వ్యక్తినామం :

ఈ జగత్తులో పేరులేని చరాచర వస్తువేదీ కన్పించదు. కుటుంబంలో చిన్నారి పాప పుట్టబోతుందన్న వార్త తెలిసినప్పటినుండి ఆ కుటుంబంలోని వారి మధ్య ఆ పుట్టబోయే పాపకు ఏపేరుపెట్టాలన్న వాగ్వివాదాలు జరుగుతూనే వుంటాయి. మానవుని జీవితంలో ఈ నామకరణం ఒక ముఖ్యఘట్టం. ఆర్య సంప్రదాయంలో నామకరణం షోడశోపచారాలలో ఒకటి. పుట్టిన నక్షత్రాన్ని బట్టి వారాన్ని బట్టి. దేవుని పేర్లతోను సంఘంలో గౌరవనీయులైన వారిపేర్లతోను. తాతముత్తాతల పేర్లతోను, సాధుసత్పురుషుల పేర్లతోను చాలా విధాలుగా ఈ నామకరణం జరుగుతుంది.

వ్యక్తినామాలను ఆంగ్లంలో 'Personal name' అంటారు. దీనినే 'First name' అనికూడ పాశ్చాత్యులు పిలుస్తారు. అమెరికా సంయుక్త రాష్ట్రాలలోను, కెనడాలోను వ్యక్తినామాన్ని ఫస్ట్‌నేమ్ (First Name) అనీ. అమెరికాలోను, యూరపులోను ఈ పేరును (Formal name) మొదటిపేరు లేక క్రైస్తవనామం (Christian name) అనీ వ్యవహరిస్తారు.

ప్రతిపేరుకూ అర్థంవుంది. బైబిల్‌లో ఒక విధవ తన అభిప్రాయం ఇలా వ్యక్తపరుస్తుంది. 'నన్ను నవోమి (Navomi) అని పిలువవద్దు. 'మారా' అని పిలవండి. ఎందుకంటే విధి నాకు చేదునే చూపించిందికనుక'. (Ruth 1 : 20) ఈమె పేరు నవోమి. నవోమి అంటే ఆహ్లాదకరమైన అని అర్థం. తనకు జీవితంలో సౌభాగ్యం లేకుండా చేసిన దేవుడు కష్టాలను మాత్రమే చవిచూపించాడు గనుక తనను 'నవోమి' అని పిలవకుండా 'మారా' అని చేదును సూచించే పేరుతో పిలవమని తనకర్మను నిందించుకుంటుంది. కాని నేడు మనం ఈ పేర్లలోని

అర్థానికి ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వడంలేదు. వాడుకలో ఉన్న అన్నిపేర్లకు అర్థాన్ని చూసిపెట్టరు. అందుకే సుందరి అని పేరున్నవాళ్ళు అందవికారంగాను, కురూపులుగాను; మృదుల అన్న పేరుగల అమ్మాయి మొద్దురాచ్చిప్పలాగాను, లక్ష్మి అనే పేరుగలవారు జ్యేష్ఠాదేవులుగాను, రాజు-నిరుపేద గాను. పొట్టియ్య - ఆరడుగుల పొడవుగాను, నల్లయ్య - తెల్లగాను ఉండవచ్చు. కనుక మనిషి రూపాన్ని, గుణాన్ని తెలిపేవిగా ఈ పేర్లుండవు. పిల్లలు బతకడం లేదన్న బాధతో పులివిస్తరిమీద పడుకోబెట్టి పుల్లయ్య అనిపెడతారు. అలానే పెంటమీద శిశువును దొర్లించి పెంటయ్య అనీ, వీర వెంకట సత్య సదా శివ నాగ సుబ్రహ్మణ్య చౌదరి అని కొండవీటి చేంతాడులాగ అందరి దేవతల ఆశీస్సులు పొందాలని వ్యక్తినామాలు పెట్టేవారున్నారు.

మొదట తల్లిదండ్రులు పుట్టుకతోనే పెట్టిన పేరున్నా, ఏదో కారణాన ఆపేరు మరుగునపడి మరోపేరుతో ఈ వ్యక్తులు పిలువబడుతున్నారు. దీనినే రెండోపేరు (Second name) లేక తరువాతిపేరు (latter name) అని అనవచ్చు. వ్యక్తియొక్క మొదటి పేరులాగ ఇది ప్రామాణికంకాదు. ఈ రెండోపేరును చాలా విధాలుగా విభజించవచ్చు 1. ముద్దుపేర్లు, 2. పెట్టుడుపేర్లు 3. కలంపేర్లు, 4. బిరుదులు, 5. మార్చుకున్నవి, 6. ఇంటిపేర్లు, 7. ప్రథమాక్షర సంఘటితాలు, 8. పట్టపుపేర్లు, 9. సంకేతనామాలు, 10. రంగస్థల నామాలు.

1. ఏ. ముద్దుపేర్లు : (Petnames) ముద్దుగా పిలవడానికి పెట్టేపేర్లు ముద్దుపేర్లు తల్లిదండ్రులు పెట్టిన పేరున్నా, చిన్నపిల్లలలో అధికశాతం ఈ ముద్దుపేర్లు చోటుచేసుకొన్నాయి. ఉదా:— కన్న, చంటి, చిట్టి, చిన్న, చిన్ని, నాని, బాబు, బాబి, బుజ్జి, బున్ని, బెన్, డాలి, పింకీ, బ్లాకీ, లవ్‌లీ, స్వీటి మొదలైన పేర్లు ఆంగ్లపదాలమీద ఇకారం చేర్చినందువల్ల ఏర్పడినవే. చిన్నతనంలో ముద్దుగా పిలువబడిన బుజ్జి పెద్దదైనా బుజ్జిగానే మిగులుతుంది. ఆదర్శ యువకుడుగా తయారైన తరువాత కూడ ఇంట్లో 'చంటి' గానే మిగిలినవారున్నారు.

బి. పెట్టినపేర్లనుండి : వ్యక్తినామాలను చిన్నదిగా చేసి పిలిచే పద్ధతి మన ఆంధ్రదేశంలోనే కాక ఇంగ్లండులోను, అమెరికా సంయుక్త రాష్ట్రాలలోను కన్పిస్తుంది. ఉదా :— అనూరాధా -రాధా, రాజేంద్ర - రాజా, సుజాత - సుజా, సుబ్బలక్ష్మి – సుబ్బూ, మైకేల్ – మైక్, మార్గరెట్ - మెగ్, ఇవి పేరునుబట్టి

పెట్టుకునే ముద్దుపేర్లు. ఆత్మీయులకు, తల్లిదండ్రులకు మాత్రమే పరిమితమైనవి.

2. వ్యంగ్యనామాలు లేక పెట్టుడుపేర్లు (Nicknames) :- ఒక వ్యక్తి యొక్క ప్రవర్తనను గని, వారి రూప వేషభాషలనుగాని నిరూపిస్తూ వ్యంగ్యంగా పెట్టినపేర్లే పెట్టుడుపేర్లు లేక నిక్‌నేమ్స్ (Nicknames) ఇవి చనువుగాను, చమత్కారంతోను పెట్టివుండవచ్చు. నిక్‌నేమ్ అనే పదానికి మరో పేరు అనేఅర్థం "Old Nick is a slang term for the Devil, it is natural to think that the word 'Nickname' was invented to suggest spite or mischief. That is not true. Nickname is a slurred form of a 'an ekename'. 'An' shortened into (n) makes 'nekename 'Eke' is a middle English word for additional. (The New book of knowledge, Vol. 13) ఈ పెట్టుడుపేర్లు అనేక విధాలుగా వున్నాయి.
ఏ. రంగునుబట్టి: నల్లనివారిని సింగరేణి. కోకకోలా అని, తెల్లవారిని గోల్డ్‌స్పాట్ అని పిలవడం కన్పిస్తుంది.

బి. పల్లెలో మొదట రేడియో కొన్న హరిబాబును రేడియో హరిబాబని, పట్టణంలో ఇంగ్లీషు నేర్చుకొని పల్లెకు చేరిన సత్యనారాయణను ఇంగ్లీషు సత్యనారాయణ అనీ, మొట్టమొదట టి.వి. కొన్న సూర్యనారాయణను టి.వి. సూర్యనారాయణ అనీ, మేడ కట్టించినందువలన మేడ మనోహరి అనీ వ్యవహరిస్తున్నారు. ఇవే తరువాత ఇంటిపేర్లవుతున్నాయి.

సి. విద్యార్థుల్లో ఎక్కువగా వాడుకలో వున్నపదం ప్రొఫెసర్. బాగా తెలివిగల వారిని, తెలివిగలవారుగా అందరికీ కన్పించాలని తాపత్రయపడే విద్యార్థిని 'ప్రొఫెసర్' అనే వ్యంగ్యనామంతో మిగిలిన విద్యార్థులు పిలవడం కద్దు.

ఈ పెట్టుడు పేర్లు మనవరకే పరిమితంకాదు. పాశ్చాత్య దేశాలలో కూడ కన్పిస్తున్నాయి. అతిగా మాట్లాడే వారిని వాగుడుగాయ, నాన్‌స్టాప్ అని మనం. లిప్పీ (Lippy) అని వారూ పిలుస్తారు. వ్యక్తియొక్క బాహ్య స్వరూపాన్ని బట్టి కూడ ఈ పేర్లున్నాయి.

3. కలంపేర్లు (pen names) : మరొకరు పెట్టినపేర్లు ముద్దుగా ఉండవనేమో

ఈమధ్య ఎవరికివారే ముద్దుపేర్లు పెట్టుకొని కవిత్వాలు రాస్తున్నారు. వీటినే కలంపేర్లు అంటారు. అతిదూరంలో వుండి ముఖపరిచయం లేకుండ కేవలం లిఖిత పరిచయాలతో స్నేహసంబంధాలను కలంతో పెంచుకున్న వారిని కలం స్నేహితులన్నట్లే వీరుకూడ వారిపేరును కలంవరకే పరిమితం చేస్తారు కనుక వీటిని కలంపేర్లు అంటారు. ఉదా : కరుణశ్రీ. చెరబండరాజు. జ్వాలాముఖి నగ్నముని.

4. బిరుదులు (Titles) : వ్యక్తులయొక్క పాండితీ ప్రాభవాలకు. నేర్పరితనానికి అధికారులు. అభిమానులు లేక అధికారసంఘాలు ఇచ్చినవి. ఉదా : ఆంధ్రకేసరి. ఆంధ్రరత్న, కళాప్రపూర్ణ. భారత రత్న. మహాత్మ.

5. మార్చుకున్నవి లేక ఉరఫ్‌లు : తనకు పెట్టినపేరు నచ్చక కొంతమంది తమపేరును మార్చుకోవడం కన్పిస్తుంది. పూర్వీకుల పేర్లనో, మూఢ నమ్మకాలతోనో పెట్టినపేర్లు ఈ మార్పులకు లోనవుతున్నాయి. కొంతమంది హిందువులు క్రైస్తవ మత ప్రభావంతో తాము క్రైస్తవ మతం స్వీకరించినపుడు వారు హిందూమతపరమైన పేరువదలి క్రైస్తవమత నామం స్వీకరించడం రోమన్ కాథలిక్ మతంలో కన్పిస్తుంది. అలాంటి పేర్లకు ఉరఫ్ 'Alia's అనే అనుబంధాలు చేర్చడం ఆచారం. ఉదా : జ్వాన్నే సు ఉరిఫ్ సుబ్బారావు. కొంతమంది పేర్లను ద్రావిడీకరించుకోవడం కూడ వుంది. శ్రీ కామకప తిరు కామకవి అని రాయడమే ఇందుకు ఉదాహరణ.

6. ప్రథమాక్షర సంఘటితాలు : రచయితలు లేక చిత్రకారులు వారి కళా ప్రదర్శనలతో పూర్తి పేరు వాడకుండా వారి ఇంటిపేరులోని మొదటి అక్షరాన్ని. వ్యక్తినామంలోని మొదటి అక్షరాన్ని ఒకచోట చేర్చి పెట్టడం కూడ కన్పిస్తుంది.

ఉదా :—

| | | |
|---|---|---|
| గోరా | : | గోపరాజు రామచంద్రరావు |
| చేరా | : | చేకూరి రామారావు |
| జమాశర్మ | : | జమ్మల మడక మాధవ రామశర్మ |
| బంగోరె | : | బండి గోపాలరెడ్డి |
| రారా | : | రాచమల్లు రామచంద్రారెడ్డి |

రావిశాస్త్రి : రాచకొండ విశ్వనాథ శాస్త్రి
శ్రీశ్రీ : శ్రీరంగం శ్రీనివాసరావు
సినారె : సింగిరెడ్డి నారాయణరెడ్డి

7. ఇంటిపేర్లు : కొందరు వారి వ్యక్తినామానికి బదులు కుటుంబ నామంతోనే ఎక్కువగా వ్యవహారంలో ఉన్నారు.

ఉదా : అక్కినేని, కట్టమంచి, కందుకూరి, కుందుర్తి, కొనరాజు, గడియారం, గుమ్మడి, గురజాడ, చిలకమర్తి, తుమ్మల, దేవులపల్లి, ధనకుధరం, పుట్టపర్తి, పురిపండా, మాధవపెద్ది, రాచకొండ, రాచమల్లు, రాయప్రోలు, రేలంగి, విశ్వనాధ —మున్నగునవి.

8. పట్టపుపేర్లు (professional Titles or caste indications) :

వ్యక్తినామంలో ఉత్తర భాగం వారి వర్ణాన్నిగాని, కులాన్ని గాని సూచిస్తుంది. ఈ పరపదమే పట్టపుపేరు. ఈ అనుబంధం పురుషుల లోనే కన్పిస్తుంది తప్ప స్త్రీలలో కన్పించదు. రావు, చౌదరి, నాయుడు, మొదలైనవి ఇందుకు ఉదాహరణలు. కమ్మవారు చౌదరి అనేపదం అనుబంధంగా వ్యక్తినామం తరువాత చేరుస్తారు. 'చౌత్' అనే పన్నువసూలు చేసినందుకు వీరికి ఈపేరు వచ్చిందని అంటారు. చౌదరి అనేపదాన్ని బెంగాల్ నుండి ఎరువుతెచ్చుకున్నారని కొందరి అభిప్రాయం బెంగాల్‌లోని ఒక ధనికవర్గం 'చౌధురి'లని పిలవబడుతున్నారు. నిరాద్ సి. చౌధురి ప్రసిద్ధ బెంగాలీ రచయిత. వ్యక్తినామాలు సంపూర్ణంగా పిలవబడక రావుగారని. శాస్త్రిగారని. చౌదరిగారని నాయుడుగారని పిలువబడుతున్నారు. స్త్రీలుకూడ ఈ పట్టపు పేర్లను తగిలించుకొని మిసెస్.నాయుడు. మిసెస్ రావు. మిసెస్.శర్మ అని కమలారావు. కస్తూరి నాయుడు, భవానీ శర్మ అని వారిపేరు తరువాత పట్టపు పేరుతో పిలవబడటం ఆధునికత్వం. పూర్వ పరపదానుబంధాలు ఆంగ్లంలో కూడ కన్పిస్తాయి.

9. సంకేతనామాలు : కార్ఖానాలలోను. పోలీసుదళాలలోను ఉన్న ఉద్యోగులకు వారిపేర్లుకాక 203. 87. 78 అనే సంఖ్యలతోకూడిన సంకేతాలే ఎక్కువగా వాడు తారు, అలాగే ఆఫీసుల్లో పనిచేసేవాళ్ళను $B_2$ అప్పారావని ($B_2$ సెక్షన్‌లో పని

చేస్తాడుగనుక). స్టోర్సు రామ్మూర్తి. లైబ్రరీ కోటేశ్వరరావు, ఇంజనీరు సుబ్రహ్మణ్యం అని పిలవడం పరిపాటి.

10. రంగస్థల నామాలు (stage names) · సినీనటులు తమ పేర్లను మార్చుకొని సినీరంగానికి కొత్త పేరుతో పరిచయమౌతారు. ఇవి రంగస్థలంవరకు పరిమితం కనుక వీటికి రంగస్థలనామాలని పేరు. ఉదా :– వాణిశ్రీ (రత్నకుమారి) జయమాలిని (అలివేలుమంగ). ఈపద్ధతి ఫ్రెంచి సినిమా రంగంలో కూడా వుంది 'Sarah Benhardt' అనే ఫ్రెంచి నాయిక అసలుపేరు 'Rosine Bernard' చాలా దేశాలలో పేర్లు మార్చుకోవాలంటే ప్రభుత్వ అనుమతితో లీగల్‌పేరును మార్చుకోవాలి. ఈ చట్టమే లేకపోతే నేరాల సంఖ్య చాలా ఎక్కువగా ఉండేది.

కుటుంబ ఆవశ్యకత – ప్రాధాన్యం :

ప్రపంచంలోని ప్రజలంతా ఆయా దేశాల భౌగోళిక హద్దులను అనుసరించి వేర్వేరు జాతులుగా వర్గీకరించబడ్డారు. ఉదా :– భారతజాతి, రష్యాజాతి, ఫ్రెంచి జాతి మొదలైనవి. భాషాప్రాతిపదికపై కూడ ప్రజల వర్గీకరణ జరిగింది ఉదా : తెలుగువారు, ద్రావిడులు, ఆర్యులు, పంజాబీయులు ప్రపంచంలోని ప్రజలంతా వారివారి దేహలక్షణాలను బట్టి నల్లజాతివారు (నెగ్రాయిడ్), శ్వేతజాతివారు (కాకసాయిడ్, ఆస్ట్రిలాయిడ్, మంగొలాయిడ్ జాతీయులు అని విభజించబడ్డారు. ఇందులో చాలా ఉపజాతులున్నాయి ఇలా విభజించిన అతి చిన్న తెగ 'కుటుంబం.'

"The family is a group of two or more persons related by blood, marriage or adoption, who reside in a common house-hold, interact and Communicated with eachother in their respective family roles, and create and maintain a common culture" –Earnest Burgess, Harvey Locke and Mary Thones. (The family : from institutions to Companionship)

కుటుంబానికి ఉన్న నాల్గులక్షణాలను కలిపితే దానిని నిర్వచించినట్లు అవుతుంది. 1. ఆ కుటుంబంలోని సభ్యులంతా రక్తసంబంధమో, వివాహబంధమో లేక దత్తతో కలిగి ఉంటారు. 2. వారంతా ఒకే ఇంటిలో ఉండాలి..

3. తల్లి,తండ్రి, భార్య, భర్త మొదలైనవారు వారివారి పాత్రలతో ఒకరితో ఒకరు ఐక్యత కలిగిఉండాలి.. 5. వారు ఆచారాలను, సంప్రదాయాలను సృష్టించుకొని పాటిస్తూ వుంటారు.

"A small group related through marriage or blood kinship, the members of which are bound together by a common life, Mutual moral responsibility, and mutual aid" (Great Soviet Encyclopedia, Vol.23, p. 82

ప్రాచీన కాలపు గుహలలోని తవ్వకాల వలన పురుషులు. స్త్రీలు. పిల్లలు చిన్నచిన్న గుంపులుగా నివసించారని తెలుస్తుంది. ఆ గుంపులు తల్లి. తండ్రి, వారి బిడ్డలేనని మనం ఖచ్చితంగా చెప్పలేం. ఎందుకంటే స్త్రీమాత్రమే తన పిల్లలను గురించి శ్రద్ధ తీసుకునేది గనుక. కొంతకాలం తల్లిసోదరుడు కుటుంబ యజమానిగా ఉన్నాడు. తండ్రి తన పిల్లలతో తక్కువ సంబంధం కలిగి వుండేవాడు ప్రాచీన ఈజిప్టుదేశంలోని రాజులు లేక ఫారోలు వారి సోదరిని వివాహం చేసుకునేవారట.

కుటుంబం ప్రాచీనమైన మానవ సమాజం. ఇది సంఘం యొక్క మూల ప్రాతిపదిక. (basic unit). నాగరికత సజీవంగా ఉండాలన్నా, నశించాలన్నా, కుటుంబంయొక్క శక్తి, బలహీనతల మీదనే ఆధారపడి వుంటుంది.

కుటుంబం ఎప్పుడు ఎలా ఏర్పడింది అన్న విషయం ఎవరికీ తెలియదు. ఇది క్రమంగా పరిణమించింది. తన కుటుంబ సభ్యులకు రక్షణ కల్పిస్తూ మనుగడ సాగిస్తుంది ప్రాచీన కాలంలో అనేక తరాలవాళ్ళు ఒకేచోట అవిభక్త కుటుంబంగా నివసించారు. వాటిని విస్తరిల్లిన లేక రక్తసంబంధమైన (extended or consanguine) కుటుంబాలు అంటారు. ఆదిమ మానవులు కొన్ని తెగలుగా చీలిపోయారు. ఒక్కొక్క తెగలో అనేక అవిభక్త కుటుంబాలు ఉన్నాయి. అనేక తెగలు కలసి ఒక'జాతి' అని పిలువబడుతుంది. వీరందరూ ఒకేప్రాంతంలో ఒకే సంస్కృతి కలిగి వుండేవారు.

మానవులంతా ఏదో ఒక కుటుంబంలో పెరుగుతారు. ఒకకాలంనుండి

మరొక కాలానికి, ఒక సంస్కృతి నుండి మరో సంస్కృతికి మాత్రమే గాక ఈ కుటుంబక్రమం ఒకే కాలంలోని అనేక సంస్కృతులలో అనేకవిధాలుగా ఉంటుంది.

కుటుంబాలు అతి ప్రాచీనకాలంనుండి వున్నాయి. ఈ భూమిమీద మానవుడు నివసించినంతకాలం కుటుంబం ఉండి తీరుతుందని చెప్పవచ్చు. కుటుంబం వలన మానవునికి మూడు అవసరాలు తీరుతున్నాయి. మొట్టమొదటగా పిల్లలకు జన్మనిస్తూ మానవజాతి పెంపొందడానికి దోహదకారి అవుతుంది. చిన్నపిల్లల సంరక్షణకు, వాళ్ళను బాల్యంనుండి క్రమశిక్షణతో పెంచడానికి ఉపయోగిస్తుంది. సృష్టిలోని జీవులన్నిటిలోనూ నిస్సహాయంగా పెరగలేనిది పసిపిల్లలు మాత్రమే. పసిపాప తప్ప ఏజంతువుకూడా పుట్టినప్పటినుండి ఎక్కువకాలం ఇతరులమీద ఆధారపడదు. పిల్లలు కలిగిన తరువాత తల్లిదండ్రులమధ్య ప్రేమ ధృఢపడుతుంది. కనుక మంచి సంఘం ఏర్పడటానికి అవకాశం కలుగుతుంది. ఈ కుటుంబ వ్యవస్థలో శ్రమ విభజన (division of labour) కన్పిస్తుంది. పురుషుడు సంపాదిస్తాడు, స్త్రీ కుటుంబపనులు చూస్తుంది. తల్లిదండ్రులు ఇద్దరూ పిల్లల సంరక్షణభారం తీసుకుంటారు. ఈ పిల్లలు పెరిగి పెద్దవారయ్యాక తల్లిదండ్రులయి తమపిల్లల బాధ్యత తీసుకుంటారు.

అరిస్టాటిల్ ప్రకారం మానవుని అవసరాలను తీర్చడానికే కుటుంబం ఏర్పడింది మానవుడు ఒంటరిగా బతకగలిగేలా సృష్టించబడలేదు. అతనియొక్క శారీరకమైన, మానసికమైన, నీతి పరమైన అవసరాలన్నీ సంతృప్తిపరచుకోలేడు. అలా ఒంటరి తనంతో బ్రతకలేడు గనుకనే కుటుంబ ఆవశ్యకత కలిగింది. కుటుంబ జీవితంలో 'సెక్స్'కు ఎక్కువ ప్రాధాన్యం ఉంది. ఈ ప్రకృతి సహజ కాంక్ష, స్త్రీ, పురుషులిద్దరినీ ఒకచోట చేర్చి మానవ సృష్టికి తోడ్పడుతుంది. తల్లికి బిడ్డమీద వున్న ప్రేమకన్నా సృష్టిలో మరేప్రేమ గొప్పదికాదు. బిడ్డమీద ఆమెకు ఉన్న ప్రేమ సంరక్షణభారం వలన కుటుంబం ఏర్పడింది.

వివాహమే కుటుంబ జీవితానికి నాంది. మానవ చరిత్రలో అనేక కుటుంబాలు పితృస్వామ్యం కలిగినవే. ప్రాచీన రోమ్‌లో తండ్రికి తన పిల్లలను చంపుకోడానికి లేక బానిసగా అమ్ముకోడానికి హక్కు వుందట. మాతృస్వామిక వ్యవస్థ అమల్లో ఉన్న కుటుంబాలలో భర్త భార్య కుటుంబానికి వెళ్తాడు. పాశ్చాత్యదేశాలలో సమానత్వం వుంది గనుక ఎవరూ 'బాస్' కాదు.

కుటుంబంలేని సంఘం ఏదైనా ఉందా అని ప్రశ్నించుకుంటే కుటుంబం లేని సంఘాలు రెండు వున్నాయని చెప్తుంటారు. 18వ శతాబ్దిలో భారతదేశంలోని మలబారు సముద్రతీరంలో వున్న 'నాయరు', ఇజ్రాయెల్‌కు చెందిన 'Kibbutz అని 1951 లో స్పైరో (Spiro) చేత పేర్కొ-బడ్డాయి.

**కుటుంబంలోని రకాలు :**

పితృస్వామిక కుటుంబం, మాతృస్వామిక కుటుంబం, ఏకపత్నీత్వం, బహుభార్యాత్వం, బహుభర్తృత్వం, బహుభర్తృత్వకుటుంబాలు చాలా తక్కువ. టిబెట్‌లోను, భారతదేశం లోని మరికొన్ని జాతులలోనూ ఇది కన్పిస్తుంది. పాండవులను ఇందుకు ఉదాహరణగా తీసుకోవచ్చు.

**భారతదేశ కుటుంబం :**

సశాస్త్రీయమైన, శృతులను అనుసరించిన అవిభక్త కుటుంబ ప్రభావం యిప్పటికీ ఇండియాలో కన్పిస్తుంది. ఈ కుటుంబంలో మునిమనుమలు, ముని మనుమరాళ్ళు, మనుమలు, వివాహంకాని కూతుళ్ళు, వైధవ్యం సంభవించిన వారు మొదలైన వారంతా కలిసే ఉంటారు. తండ్రి ఆ కుటుంబానికి ధర్మకర్త (Trustee) లాంటి వాడు. నాల్గు తరాలనుండి విడిపోని కుటుంబాలు ఉన్నాయి. వీళ్ళంతా తాము సంపాదించినది దాచడం, ఖర్చుపెట్టడం కలిసే చేస్తారు. కాని ఈనాడు ఎక్కడ చూచినా చిన్న కుటుంబాలే కన్పిస్తున్నాయి.

వంశం నిలవాలంటే దంపతులకు కొడుకు పుట్టాలి కొడుకు లేకపోతే దగ్గర బంధువులలో ఎవరినైనా దత్తత చేసుకోవడమో లేక అనాధను పెంచుకోవడమో చేస్తారు. మగబిడ్డకోసం పునర్వివాహం చేసుకోవడం తక్కువగా కన్పిస్తుంది. ఇంటిపేరు నిలపడానికి కొడుకు కావాలి గనుక కుటుంబం నిలపాలంటే కొడుకు వుండాలని వీరి అభిప్రాయం. దీనివలన సంఘంలో కుటుంబానికి ఎంత ప్రాధాన్యం వుందో తెలుస్తుంది. "Even as the cell is the unit of the Organic body, so the family is the unit of the society" మానవ శరీరంలో జీవకణం ఏవిధంగా ఒక భాగంగా ఉంటుందో అలాగే కుటుంబం సంఘంలో ఒకభాగం.

కుటుంబంలో స్త్రీ స్థానం :

వేదకాలంలో మతప్రధాన రాజ్యంలో పురుషునితోపాటు స్త్రీకి సంపూర్ణ స్వేచ్ఛవుంది. కుటుంబంలోను సంఘంలోను వీరికి గౌరవనీయమైన స్థానంఉంది. స్త్రీ తల్లిగా, భార్యగా, కుమార్తెగా గౌరవించబడుతుంది. స్త్రీ జననాలను ఆహ్వానించారు. ఉపాధ్యాయ వృత్తిలోకూడ ఉన్నారు. క్రీ.పూ. 300 వరకు స్త్రీలు పురుషునిలా సంఘంలో ఉన్నత స్థానాన్ని ఆక్రమించారు.

క్రీ.పూ. 300 తర్వాత కొన్ని రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక కారణాల వలన స్త్రీ స్థానం క్రమంగా దిగజారింది. ఆడపిల్లల చదువులు ఆపేశారు. ఏడు లేక ఎనిమిది సంవత్సరాలకే వివాహం చేశారు. క్రీ.శ. 700 లో సతి, పరదా, వితంతు వివాహాల నిషేధం జరిగాయి. స్త్రీ పరిస్థితి నీచంగా ఉంది. 1800 వరకు కుటుంబంలో ఆమె పరిస్థితి అలానే వుంది. పురుషుని చేతిలో కీలుబొమ్మ. 19వ శతాబ్దిలో ఆమె పరిస్థితి మెరుగయింది.

కుటుంబ భవిష్యత్తు :

ఈ రోజుల్లో వివాహం ప్రాచీనపద్ధతి (Old fashion) అనడంవిన్పిస్తుంది. అమెరికాలోనే కాదు. మన దేశంలో కూడ కొంతమందికి వారి దాయాదుల, తాత, ముత్తాతల పేర్లు తెలియవు. 1917లో కమ్యూనిస్టులు అధికారంలోకి వచ్చాక కుటుంబ వ్యవస్థ లేకుండా చేయాలని అనుకున్నారట. వివాహం సులభంగా చేసుకోవడం, పోస్టుకార్డు సహాయంతో విడాకులు తీసుకోవడం అమలుచేశారు.

విడాకులు ప్రేమక్షీణతకు గుర్తు. కొంతమంది కారణం లేకుండానే విడాకులు అడుగుతారు. తనభర్త గురకపెడుతున్నాడుగనుక విడాకులు కావాలని ఒక స్త్రీ కోరినట్లు ఓసారి ఒక ప్రకటనలో చూశాను. ప్రజలందరిలో పూర్వంకన్నా తక్కువ సర్దుబాటు, ఎక్కువ స్వార్థం వున్నాయి గనుక విడాకుల శాతం యింత ఎక్కువగా పెరుగుతుంది. మనం పరిష్కరించుకోలేని సాంఘిక సమస్యలన్నింటికి విడాకులే మార్గం అవుతున్నాయి. విడాకులను ఆపినంతమాత్రాన ఆధునిక కుటుంబం స్థిరంగా ఉండదు. సంఘంలో ఉన్న పెద్ద సమస్యలను పరిష్కరిస్తే విడాకుల సంఖ్య తగ్గవచ్చు.

కుటుంబ వ్యవస్థలేని సంస్కృతి జీవించలేదు. భవిష్యత్తులో కూడా కుటుంబం లేకుంటే మానవుని మనుగడ క్లిష్టం అవుతుంది. "Loveless marriages lack an important element essential to family unity" ప్రేమలేని వివాహాలు కుటుంబ అనైక్యతలో ముఖ్యపాత్ర వహిస్తాయి.

కుటుంబం సంఘంలో ఇంత ప్రముఖ స్థానాన్ని ఆక్రమించింది గనుకనే ఒక కుటుంబానికి, మరొక కుటుంబానికి మధ్యగల వ్యత్యాసాన్ని చూపించడంకోసం కుటుంబం తనకు ఒకపేరును కల్పించుకొంది. ఇదే, ఇంటిపేరు, కుటుంబనామం, గృహనామం లేక వంశనామం.

కుటుంబనామ నిర్వచనాలు :

ఆంగ్లభాషలో ఇంటిపేర్లను సర్‌నేమ్ (Surname) అని అంటారు ఇది పూర్వపు 'Sire name'. అనగా కుటుంబానికి మూలపురుషుడుగా భావించబడే వ్యక్తిని 'Sire' అనేవారు. 'Suramne' అనే పదం లాటిన్‌లోని 'Surnoom' నుండి వచ్చిందని శాస్త్రకారుల అభిప్రాయం.



" 1 Additional name of descriptive or allusive kind attatched to a person & occasion becoming hereditory; the name common to all members of a family.

2. V.T.give to; give (person) called by way of additional name› having as family name".
(The Consise of Oxford Dictionary of Current English,p.1.0.)

1. Also called last name.The name that a person has in common with the other members of his family, as distinguished from his given name, family name.

2. a desroriptive name added to a persons name or names; epithet.

3. to give a surname to; call by a surname"
(The Random House Dictionary of the English Language p. 1322).

" An additional name: a family name-V.t.to name by a surname-adj Surnominal. (on the anology of Fr. Surnom, from Eng. name and L. nomen, - inis)''. (Chambers Twentieth century Dictionary p. 875).

" 1. To give an additional name, title or epithet to (a person), b with a recognised proper name.

2. To give such and such a surname to., to call (a person) by his surname or Family name.

3. To call by another or additional name; to attach another appellation or designation to; more widely, to designate entitle. Sorname, Surnome, surnam, Sirename.

(The Oxford English Dictionary, p. 239)

" The Cognomen, or surname was the familyname and was gradually derived from some personal quality or peculiarity as in the cases of Naso, Torquatus, Lepidus, Longulus, or from Geographial considerations, as in Sabinus and Calatinus".

(Everymans Encyclopaedia, vol. 9)

" Surnames were added to make it easier to identify people At first they were called ekenames (eke means also). The word nickname developed from this. The Surnames of many of our ancestors were once Nicknames such as Fair, hair, Duke (a leader) and campbell (crooked lip)" (Childrens Britanica, Vol. 7).

" కులనామ : N. Examples of Surnames in Sanskrit are 'శర్మన్' in విష్ణుశర్మన్; దాసః in కాళిదాసః " (Monnier williams, p.)

"ఊరిపేరింటి పేరుగా నొప్పునాకు. సుధానిధి (వా).

(వావిళ్ళ నిఘంటువు. ప్రథమసం. పు.280)

"గృహనామము, వంశ క్రమముగ వచ్చు కుటుంబపుపేరు"
(శబ్దార్థ చంద్రిక, పు 147)

"ఒక కుటుంబంలోని వారిని మరియొక కుటుంబంలోని వారినుండి వేరుచేసి చెప్పవలసి వచ్చినప్పుడే ఇంటిపేరుకావలసివస్తుంది."
(నారాయణరావు. 1945, 373)

"ఇంటిపేర్లు వ్యక్తినామాల్లో కారకరీత్యా భాగమే"
(కడప ఊర్ల పేర్లు, పు.32)

ఇల్లు + పేరు–ఇంటిపేరు. ఇల్లుయొక్క ఔపవిభక్తిక రూపం ఇంటి. ఇంటి యొక్క, ఇంటికి సంబంధించిన అని అర్థం. ఇంటి< ఇన్ (ఇల్) + తి.

## కుటుంబనామ ప్రాధాన్యం, ప్రయోజనం

ఈ భూఖండాన్ని పరిపాలనా సౌలభ్యంకోసం చాలా భాగాలుగా విభజించారు. ఖండాలు (ఆసియా), దేశాలు (భారతదేశం), రాష్ట్రాలు (ఆంధ్ర), నగరాలు (ఢిల్లీ). పట్టణాలు (గుంటూరు, గ్రామాలు (పెదనందిపాడు), పేటలు (చౌదరి పేట), కాలనీలు (శ్రీనివాసకాలని), రోడ్లు (మంగళగిరిరోడ్డు), వీధులు (ప్రకాశం వీధి), కుటుంబాలు లేక ఇళ్ళు ఇలా విభజిస్తే అతి చిన్న విభాగం కుటుంబం.

మానవ సమాజం అనేక వ్యక్తుల, అనేక కుటుంబాల సమూహం. ఈ సమాజంలో కుటుంబం ఒక ప్రాథమిక మైన ఘటకం. ఒక కుటుంబాన్ని ఒక సమూహం నుండిగాని, ఇతర కుటుంబాల నుండి గాని వేరుచేసేదే కుటుంబ నామం, గృహనామం లేక ఇంటిపేరు. ప్రతి కుటుంబం ఏదో ఒక వంశనామంతో వాడుకపడి ఉంటుంది. సమాజంలోని వ్యక్తులను వ్యక్తిగతంగా గుర్తించడానికి ఇంటిపేరు అవసరం ఎంతైనా వుంది. ఒకేపేరుగల వ్యక్తులు ఒకే ప్రదేశంలో ఉన్నప్పుడు వారిలో ఒకరిని వ్యక్తిగతంగా సంబోధించాలంటే నలుపు, తెలుపు, పెద్ద, చిన్న, పొడవు, పొట్టి లాంటి విశేషణాలు వాడుతున్నాం.

ఇంటిపేరు తెలుగు వారికి విశిష్టమైంది. ఈ గుర్తింపు అన్ని భాషలలో 'ఇంటిపేరు' అని పేర్కొనబడక పోయినా అనేక విధాలుగా ఉంది. భిన్న

ప్రాంతాలలో గల ఇంటిపేర్ల పరిశీలనవల్ల ఇంటిపేర్ల మధ్యగల సామాజిక సంబంధాలూ, వాటివెనక గల సంస్కృతి, చరిత్ర తెలుస్తాయి.

అనేక సాంఘిక రాజకీయ ఆర్థికాది కారణాల వల్ల హిందువులైన తెలుగువారు కొందరు ఇస్లాం, క్రైస్తవ మొదలైన ఇతర మతాలను స్వీకరించారు. మతం మారి వ్యక్తుల పేర్లు మారినా చాలాచోట్ల వారి పూర్వపు ఇంటిపేర్లే యధాతధంగా నిల్చిఉన్నాయి.

ఉదా :– కొలకలూరి ఇనాక్, గుర్రం జాషువా, గుడిసె శామ్యూల్, గుమ్మడి జోసఫ్, బీర్నీడి మోషేకవి, ఈ ఉదాహరణల వల్ల సంఘంలో ఇంటి పేరుకున్న గౌరవం, విలువ వ్యక్తమౌతున్నాయి.

గురజాడ, దేవులపల్లి, రాచకొండ, విశ్వనాథ మొదలైన పేర్లవలన కొందరు వ్యక్తినామంకంటే గృహనామానికే ఎక్కువ ప్రాధాన్యమిస్తున్నారని తెలుస్తుంది.

# భారతీయేతర భాషలలో ఇంటిపేర్లు

తెలుగువారిలోనే కాక పాశ్చాత్యదేశాలలో సయితం ఇంటిపేర్లు వాడుకలో ఉన్నాయి. ఏ సమాజంలో అయినా, ఏ భాషా వ్యవహార ప్రాంతమైనా సమాజం లోని వ్యక్తుల సమూహం నుండి వ్యక్తిని వేరుచేయవలసిన అవసరం ఉంది. అప్పుడు కుటుంబనామ ఆవశ్యకత కల్గుతుంది. ఆయాప్రాంతాన్ని బట్టి, వ్యక్తుల వృత్తులు మొదలైన వానినిబట్టి అన్ని దేశాలలోను గృహనామాలున్నట్లుగా తెలుస్తుంది. ఒకే కుటుంబంలోని పిల్లలందరికి ఒకే గృహనామం కల్గుతుంది. వార్లు ఏకుటుంబానికి చెందుతారో ఇంటిపేరు తెలియజేస్తుంది. కొంతకాలం వ్యక్తికి ఒక్కపేరే వ్యవహారంలో ఉన్నా, తరువాత ఆపేరు రెండుగాను, మూడుగాను మారి గృహనామాల స్థానాన్ని ఆక్రమించాయి. 12వ శతాబ్ది తరువాత ఇంటిపేర్లు స్థిరపడి వంశపారంపర్యంగా సంక్రమించాయి. భారతీయేతర భాషలలో ఇంటి పేర్లను పాశ్చాత్యులలో ఇంటిపేర్లు, మధ్యప్రాచ్య భాషల్లో ఇంటిపేర్లు, చైనా, జపాన్, కొరియా, మొదలైన దేశాలలో ఇంటిపేర్లని మూడు విధాలుగా వర్గీక రించవచ్చు.

i. పాశ్చాత్యులలో ఇంటిపేర్లు :

1. రోమన్లు కూడ మొదట ఒక్కపేరే కలిగి ఉన్నప్పటికి, తరువాత మూడు పేర్లు పెట్టుకున్నారు. వ్యక్తుల పేర్లలో మొదట 'ప్రినామెన్' (praenomen), తరువాత 'నామెన్' (nomen) పెట్టుకున్నారు. ఈ'నామెన్' తెగను సూచిస్తుంది. చివరిపేరు (lastname) 'Cognomen' కుటుంబాన్ని సూచిస్తుంది.

ఉదా :– సీజరు పూర్తిపేరు Gaius Julius Caesar.

గేయస్ (Gaius) – ప్రినామెన్, జూలియస్ (Julius) – నామెన్, సీజర్ (Caesar) – కుటుంబనామం. రోమ్‌లో కొంతమంది నాల్గవ పేరునుకూడ అనుబంధిస్తారు. దీనిని 'ఆగ్నామెన్' (agnomen) అంటారు. ఇది వెక్కిరింపు గానో, ఎగతాళిగానో పెట్టుకున్న మారుపేరు. ప్రసిద్ధిచెందిన పనినిగాని, గుర్తించ దగిన సంఘటనను గాని జ్ఞాపకం చేస్తుంది. రోమన్ సామ్రాజ్యం పతనమయ్యే సరికి కుటుంబ నామాల్లో తికమకలు ఎక్కువయ్యాయి. ఒకే పేరుతో సంబోధించడం మళ్ళీ అమలులోకి వచ్చింది.

క్రీ.శ. 900 లో ఉత్తర ఇటలీలో కుటుంబనామాలు తిరిగి వాడుకలోకి వచ్చాయి. ఇలా వాడబడుతూ క్రీ.శ. 1200 సంవత్సరానికి అధిక ప్రాచుర్యాన్ని పొందాయి. సామాన్యులనుండి ఉన్నత వంశస్థులు తమ కుటుంబాన్ని వేరుగా ఉంచుకోవడంకోసం కుటుంబనామాన్ని వారిపేర్లకు అనుబంధించుకున్నారు. అప్పటి నుండి యీ ఉన్నత వంశస్థులు తమ కుటుంబనామాలను వంశపారంపర్యంగా చేసుకున్నందున అవి తాత ముత్తాతలనుండి తద్వంశీయులకు సంక్రమించాయి. ఈవిధంగా కుటుంబ ఔన్నత్యం తమ పూర్వీకుల మీద మనస్సును లగ్నంచేసింది. ఆకాలంలో కుటుంబనామం సంపూర్ణ వ్యక్తిత్వానికి గుర్తుగా ఎంచబడింది. "యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః" అన్నట్లు పెద్దలు ఆచరించిన ధారినే సామాన్యులు స్వీకరించి కుటుంబనామాన్ని అనుబంధించుకోవడం అలవాటు చేసుకున్నారు. కుటుంబనామాన్ని పెట్టుకొనే అలవాటు ఇటలీనుండి పశ్చిమ యూరపు ప్రాంతాలకు సాగిన వాడులమూలంగా ఆప్రాంతాలకు వ్యాప్తిచెందింది. యూరపులోని శ్రీమంతులూ సత్కులీనులూ అయినవారంతా మొట్టమొదటగా ఈ కుటుంబనామాలను పెట్టుకోవడం మొదలుపెట్టారు. మొదట ఇవి వంశాను క్రమంగా పాటించబడక కేవలం ఒక వ్యక్తికి మాత్రమే పరిమితమయ్యాయి.

ఉదా :— రాబర్ట్ జాన్‌సన్ కుమారుడు హెన్రీ రాబర్ట్‌సన్‌గా పిలువబడ్డాడు.

యూరపులోని అనేక దేశాలలో బాప్తిజం సమయంలో పెట్టిన పేరునే ప్రధానంగా స్వీకరించి మిగిలిన వాటిని వదలిపెడతారు. జర్మనీలో మాత్రం బాప్తిజమ్ నాటి క్రైస్తవ నామానికి ముందు కుటుంబనామం పెట్టడం చాలా ముఖ్యం.

ఇంగ్లాండు, అమెరికాలలోని కుటుంబనామాలు తరచుగా క్రైస్తవ నామాలుగా గుర్తించబడ్డాయి. అమెరికా సంయుక్త రాష్ట్రాలకు చెందిన ఫ్రాంక్లిన్ డిలానో రూజ్‌వెల్ట్ (Franklin Delano Roosevelt), హామిల్టన్ ఫిష్ (Hamilton Fish), జెఫర్‌సన్ డేవిస్ (Jeferson Davis) మొదలైన వారి పేర్లు ఈ వర్గానికి చెందినవే.

అమెరికా సంయుక్తరాష్ట్రాలలోను, కెనడాలోను కుటుంబనామాలను చివరి పేర్లు ( last names ) అంటారు. కొన్నిచోట్ల దీనికి భిన్నంగా కూడ కన్పిస్తున్నాయి.

2. స్కాట్లండ్ :— స్కాట్లండ్‌లో గృహనామాలు చాలా ఆలస్యంగా ఏర్పడ్డాయని చరిత్రకారుల నిరూపణ. చాలామట్టుకు ఇవి తెగను అనుసరించి రూపొందినప్పటికీ ఇంగ్లండుకన్నా చాలా తక్కువ సంఖ్యలో కనిపిస్తాయి. మూడో పేరు జాతినిగాని, ఇంటినిగాని సూచిస్తుంది. చీఫ్స్ (chiefs), చీఫ్టెన్స్ (Chieftains) కుటుంబాలలో గృహనామం కన్పిస్తుంది. ఉదా:- Mackintosh of Machentosh, కెమెరాన్ ఆఫ్ లాచీల్ (Cameron of Lochiel). వాడుకలో వున్న ఇవి కుటుంబనామ భాగంగా, చట్టసమ్మతంగా గుర్తించబడ్డాయి. స్కాట్లాండులోని యువతులు వివాహం అయ్యాక తమ పుట్టింటి పేరు వదలరు. చట్టబద్ధమైన పనులలో మాత్రం భర్త పేరును హోదాతో సహా వాడుకుంటారు. ఉదా :— మర్గరెట్ గార్డన్ (Mrs. Margaret Gardon , మెక్‌డొనాల్ట్ ఆఫ్ గ్లెన్ బ్రాకెన్ (Mac donald of Glenbraken).

3. హంగేరియన్లు :— హంగేరియన్లు తమ పేరుకు ముందు కుటుంబనామం చేర్చుకుంటారు. ఉదా:- నాగీ ఇస్త్వాన్ (Nagy Istvan . ఇందు క్రిగీటు కల భాగం కుటుంబనామం. మిగిలింది వ్యక్తినామం. హంగేరియన్లు తమ పేరును ఆంగ్లభాషలో వ్రాసేటప్పుడు ఈ క్రమాన్ని తారుమారు చేస్తుంటారు. అప్పుడు nagy Istvan > Istvan Nagy అవుతాడు. ( The new encyclopaedia Bri. Vol. 12 )

## ii. మధ్యప్రాచ్య భాషలలో ఇంటిపేర్లు :

1. అరమెయిక్ :— "The Aramaic Surnames of the Fisherman Simon, Kepha. meaning 'stone', became famous in the new testment as Petros (Peter). The Greek translation of the name Petra 'rock stone' " (The new Encyclopaedia Britanica Vol. 12 P. 814) సైమన్ కెఫా మొదలయిన పదాలు అరమెయిక్ భాషలలోని బెస్తవారి యొక్క కుటుంబనామాలు. వీటికి రాయి (stone) అని అర్థం. ఇది కొత్త నిబంధనలో (new testment) Petros (Peter) అని ప్రసిద్ధి చెందింది. ఈ పేరు రాయి (rock, stone) అనే అర్థాన్నిచ్చే గ్రీకు పదమైన 'Petra' నుండి వచ్చింది.

ఇబన్ అబ్బాస్ (Ibn Abbas) = అబ్బాస్ కుమారుడు

ఇబన్ బటూటా Ibn Batuta) = బటూటా కుమారుడు

అల్ బాగ్దాదీ (al baghdadi = బాగ్దాదునుండి

అల్ ఘజలి (al Ghazali) The Spinner

బెన్‌హార్ (Ben Hur) ఇందు al_, Ben_, Ibn_ మొదలైనవి ఇంటిపేర్లు.

2. యూదులు :_ "Jewish family names were the last to develop in most Countries. In Europe Jews usually lived apart from others in secluded countries. Many did not feel for family names. Lames. Laws passed in the early 1800's compelled them to adopt surnames" (World Book knowledge. vol, 14, Name P. 5) యూదులు కుటుంబనామాలు అనేక దేశాలలో ఇంకా అభివృద్ధి చెందవలసి వున్నాయి. యూరపులోని కొన్ని ప్రాంతాలలో యూదులు ఆ ప్రాంతం లోని ప్రజలకు దూరంగా నివసించేవారు. కనుకనే వారికి కుటుంబనామాల ఆవశ్యకత కన్పించలేదు. క్రీ.శ. 1800 ప్రారంభంలో శాసనం జారీచేయడం జరిగిన తరువాత ఇంటిపేర్లు ఏర్పరుచుకున్నారు. చాలామంది అప్పుడు గోల్డ్ (Gold), mountain (berg), rose (rosen) సిల్వర్ (silver), స్టోన్ (stone) valley (thal) మొదలైన ఆహ్లాదకరమైన కలయికలతో ఇంటిపేర్లు ఏర్పరచుకున్నారు. ఉదా :_ గోల్డ్‌బర్గ్ (Gold berg) రోజెన్ తాల్ (Rosen thal), సిల్వర్ స్టీన్ (silverstein) మొదలైనవి. మరికొంత మంది వారు జన్మించిన పట్టణాలలోని స్థలనామాలను లండన్, మదీనా (Madena) మొదలైన వాటిని స్వీకరించారు.

మధ్య యుగంలో కొత్తగా వచ్చి నివాసం ఏర్పరచుకున్న వ్యక్తికి అతను ఎక్కడనుండి వచ్చాడో ఆపట్టణం లేక దేశంయొక్క పేరు ఇంటిపేరుగా పెట్టడం యూదుల ఆచారం కొహెన్ (Cohen) లెవి (Levy) మెదలైనవి ఇలాంటివే. లెవి ఎష్కోల్ (Levy Eshkol) ఇందులో 'లెవి' ఇంటిపేరు 'ఎష్కోల్' వ్యక్తినామం.

12వ శతాబ్దిలోని 'Maimunison', 18వ శతాబ్దికి చెందిన మెండల్‌సన్ (Mendelssohn) - మెండెల్ యొక్క కుమారుడు మొదలైన పేర్లవలన తండ్రి పేరు పిల్లలకు కుటుంబనామంగా వచ్చినట్లు తెలుస్తుంది. జంతువుల పేర్లు చాలా ఎక్కువగా వాడబడ్డాయి. మధ్య యుగంలో వృత్తుల వలన ఇంటిపేర్లు వచ్చాయి. ఆధునిక యుగంలో జర్మనీనుండి వచ్చిన కుటుంబనామాలు కన్పిస్తున్నాయి. ప్రత్యేకంగా 1787లో కుటుంబనామాలను గూర్చిన శాసనాన్ని 'Jews of the Austrian Empire' ఏర్పరచింది. (Encyclopaedia is of Relegion and Ethics). కొంతమంది మతసంబంధమైన (relegious Connotations) ఇంటిపేర్లను స్వీకరించారు. కొహెన్ జెడక్ (Kohen Tzedek) అనే పదానికి చిన్నరూపం కట్జ్ (Katz). ఈపదానికి హీబ్రూ భాషలో మతాధిపతి (Priest అనే అర్థం. మిగిలినవారు బెంజమిన్ (Benzamin) లెవి (Levy) మొదలైన వ్యక్తినామాలను గృహనామాలుగా స్వీకరించారు. "The Jews of the Germany did not begin to use Surnames until the early 19th C. When they were forced to by the Govt." (Childrens Britanica Vol. 7). జర్మనీలోని యూదులు 19వ శతాబ్ది ప్రారంభం వరకు ఇంటిపేర్లను వాడడం మొదలు పెట్టలేదు.

iii. చైనా, జపాన్, కొరియా మొదలైన ప్రాంతాలలో ఇంటిపేర్లు :

1. చైనా : ఒకటికన్నా ఎక్కువ పేర్లు పెట్టుకునే అలవాటు మొదట చైనీయులు ప్రారంభించారు. ఫూషి (Fushi) చక్రవర్తి క్రీ.పూ. 2852లో గృహనామాల లేక కుటుంబనామాల ఆవశ్యకతను గుర్తించి చట్టంచేశాడు. చైనీయులు ఆచారంగా పెట్టుకునే మూడుపేర్లలో ఇంటిపేరు మొదటి స్థానాన్ని ఆక్రమిస్తుంది. "The family name placed first, eomes from one of the 438 words in the Chinese sacred poem Pochia-Hsing. It is followed by a generation name, taken from a poem of 20 or 30 characters adopted by each family, and a milk name, corresponding to our Christian name". (world Book of knowledge. Vol. 14) వీరి గృహనామాలు పవిత్రమైన "Pochia-Hsing" అనే పద్యంలోని 438 పదాల

నుండి గ్రహించబడ్డాయి. రెండవపేరు వంశనామం లేక తరంపేరు (generation name). ఈపేరును కూడ ప్రతికుటుంబం చైనీయుల పద్యంలోని ఇరవై లేక ముప్పై ప్రత్యేక లక్షణాలనుండి గ్రహించబడ్డాయి. మూడవది పెట్టినపేరు. (milk name) అంటే వ్యక్తినామం. ఈ వ్యక్తినామానికి, క్రైస్తవ నామానికి సామరస్యం ఉంది.

చైనాలో కుటుంబ నామానికి చాలా ప్రాముఖ్యం వుంది. ఒకే ఇంటిపేరుగల కుటుంబాల మధ్య దగ్గర సంబంధం ఉన్నట్లుగా తెలుస్తున్నందున చైనా ప్రాచీన సంప్రదాయమే కాక చట్టంకూడ ఆయా కుటుంబబాలలోని అంతర్వివాహాలను అంగీకరించలేదు. ఈనాటికీ కుటుంబాలమధ్య జ్ఞాతి సంబంధం లేకపోయినా, ఒకే గృహనామం గలవారి మధ్య అంతర్వివాహాలకు అనుమతిలేని యీ పద్ధతే ఆచరణలో వుంది. ఒక ఇంటిపేరు కలిగివుండడం వ్యక్తులమధ్య ఉన్న దగ్గర సంబంధానికి రెడీపాస్‌పోర్ట్ (ready passport) లాంటిది. క్రీస్తునకు పూర్వమే చైనాలో చాల కొద్ది కుటుంబనామాలు మాత్రమే ఉండేవట. "The Book of Hundred family names" ను రచించిన రచయిత ఈనాటి ఇంటిపేర్లు మూడువేల యేళ్ళనాటివిగా గుర్తించారు. కాని ఇవి రెండువేల నాటివే అని ఖచ్చితమైన లెక్కలవల్ల చెప్పవచ్చు. (Encyclopaedia of Religion and Ethics, Vol. 9 p.142).

ఇప్పుడు 'Sing' అని ఇంటిపేరు పెట్టుకున్న చైనీయుల పేరు పూర్వ కాలంలో వారు పుట్టిన స్థలనామాన్ని సూచిస్తుంది. ఈనాడు కూడ సగానికి పైగా కుటుంబనామాలు స్థలనామాలనుండి వచ్చినవే. నాల్గోవంతు పూర్వీకులనుండి (Ancestral title) వచ్చాయి. మిగిలిన ఒక వంతు రకరకాలుగా యూరపులోని ఇంటిపేర్లవలే ఏర్పడ్డాయి. జంతువులనుండి యేర్పడ్డ ఇంటిపేర్లను చైనీయులు ఒకప్పుడు అత్యంతరం పెట్టేవారు. ప్రాయికంగా చైనీయులు ఇంటిపేర్లను విడనాడ డానికి వీలుపడదు. అయితే బౌద్ధమతాచార్యులు, యోగినులు మాత్రమే వారి కుటుంబాలతో గల సంబంధాన్ని తెంచుకోవడంకోసం ఆ కుటుంబనామాన్ని వదిలిపెడతారు.

వివాహమైన తరువాత స్త్రీ తన భర్త ఇంటిపేరునుకూడ స్వీకరిస్తుంది. కాని

సంతకం పెట్టేటప్పుడు తన భర్త ఇంటిపేరుతోపాటు తన ఇంటిపేరును వాడడం పరిపాటి. కనుక న్యాయసమ్మతమైన పత్రాలు మొదలగు వాటిలో ఈరెంటిని గ్రహిస్తారు. వ్యక్తి నిర్దేశంలో ప్రథమస్థానాన్ని ఆక్రమిస్తున్న గృహనామం వ్యక్తినామం చివర చాల విరళంగా కన్పిస్తుంది. అమెరికాలో వున్న చైనీయులు పాశ్చాత్య ప్రభావంతో తరచుగా వారి వ్యక్తినామం చివర గృహనామం తగిలించుకుంటున్నారు.

2. జపనీస్ :— "In Ancient times there were two kinds of Family names recognised in Japan. 'kabane' or 'Sei', 'Uji' or Sahi' both were granted by the sovereign to only a limited number and the mass of the people had no patronymic" (Encyclopaedia of Relegion and Ethics, Vol. 9. Family names.) ప్రాచీనకాలంలో జపాన్‌లో గుర్తించబడిన ఇంటిపేర్లు రెండు మాత్రమే. 1. 'కాబనె' లేక 'సెయి', 2. 'యుజి' లేక 'షి'. ఈ రెండు గృహనామాలు చక్రవర్తిచేత అల్పసంఖ్యాకులకు మాత్రమే ఇవ్వబడ్డాయి. మిగిలిన సామాన్య ప్రజలకు పైతృకంగా వచ్చే ఈ కుటుంబనామాలు లేవు.

అ. కాబనె : సృష్టిమొదటినుండి 'కాబనె' అనే గృహనామం జపానీయులలో ఉన్నట్లు తెలుస్తుంది. 673_686 ప్రాంతంవాడైన తెము చక్రవర్తి (Temmu) చాలా రకాలైన ఇంటిపేర్లలో ఎనిమిది 'కాబనె' లను గుర్తించినట్లు ప్రకటించాడు. అవి యాసన్ (Ason), ఇనగి (Inagi), ఇమికి (Imiki), మబిటొ (Mabito), మికినోషి (Mikinoshi), మురజియొమిల్ (Murajiomil), సుకునె (Sukune). ఆ తరువాత ఈ సంఖ్య క్రమంగా ఇరవైమూడుకు పెరిగింది. ఈ కుటుంబనామాలను ధరించిన వ్యక్తియొక్క వృత్తిని, హోదాను ఇవి తెలియజేస్తాయి. అంతేగాక వారు ఏ తరగతికి చెందిందీ లేక ఏ కులానికి చేరిందీ సూచిస్తాయి.

ఆ. యుజి :— ఈ శాఖలోని చాలా ఇంటిపేర్లు చక్రవర్తిచేత 'కాబనె' కుటుంబంలోని ఒకరు లేక అంతకన్నా ఎక్కువమంది వ్యక్తులకు వారి యొక్క ప్రత్యేకతను, గొప్పదనాన్ని లేక వారి వృత్తిని గుర్తించి యిచ్చిన ఇంటిపేర్లే. వీటిలో మొనొనొబె (Mononobe), ఓడొమొ (odomo), ఇమ్‌బే (Imbe), నకటొమి (Nakatomi), సొగ (Soga). అతిప్రాచీనమైనవి. కాని జపానీయుల

చరిత్రలో చాలాప్రసిద్ధి చెందినవి మినమొటొ (Minamoto , తైరా (Taira), ఫ్యూజివార (Fujiwara), టచిబాన (Tachibana), ఈ నాల్గు కుటుంబనామాలు కూడ ఒకేసారి ప్రత్యేకమైన 'యుజి' శాఖగా పిలవబడ్డాయి. సుగవార (Suga-wara), కియొహర Kiyohara), కామొ (Kamo), ఉరబె (Urube . అబె (Abe) మొదలైన ఇంటిపేర్లు ప్రసిద్ధి నెందిన యుజి శాఖకు చెందినవే.

యుజి శాఖలోని సభ్యుల సంఖ్య నానాటికీ అధికమయ్యేసరికి ఈ 'యుజి' పేరుకు అదనంగా ప్రాంతీయమైన పేరును పెట్టుకున్నారు కనుక వేర్వేరు కుటుంబనామాల సంఖ్య పెరిగింది. క్రీ. శ. 815లో 'A record of kabane and uji'ని ప్రచురించారు. ఈ రికార్డులో 1182 యుజి పేర్లు ఉన్నాయి. మిగిలినవి చాలావరకు అప్రాంత సంబంధమైన గృహనామాలను ప్రాంతీయ స్థలనామాలనుండి గ్రహించారు. ఇలా గ్రహించిన కుటుంబనామాలు గల వారంతా మొదట పెద్దదైన యుజి శాఖలోని వారేనని తెలుస్తుంది. లిఖిత పూర్వకంగా జపానీయుల కుటుంబ నామాలలో చైనావారి ఇంటిపేర్ల లక్షణాలు కన్పిస్తున్నాయి. జపానీయులు లేక చైనీయులలో ఏదోఒక పద్ధతిని మాత్రమే వారి కుటుంబసభ్యుల అభిరుచి ననుసరించి యింటిపేర్లను గ్రహించినవారు ఉన్నారు. కొంతమందికి ఒక ఇంటి పేరు. మరి కొంతమందికి రెండు లేక మూడుపేర్లు ఉన్నాయి. ఒక్క ఇంటిపేరునే వాడే పద్ధతి చైనీయులలో తక్కువగా కన్పిస్తుంది. కాని ఎక్కువమందికి ప్రకృతితోనో, ప్రకృతిలోని వస్తువులతోనో ఎక్కువ సంబంధం ఉన్నట్లు తెలుస్తుంది. ఇకె [Ike]=కొలను, ఓక [oka] = ఓకొండ, కవా [kawa]= నది, 'త' లేక 'ద' [Ta or Da]= వరిపొలం, నొ [No] = పొలం, మురా [mura] = గ్రామం, మొవి [Move] = Greve, యమ [yama] = పర్వతం, సుకి [Tsuki] = చంద్రుడు, షిమ [Shima] = దీవి, హర [Hara] = బయలు, హయాషి [Hayashi] = అడవి. హి [Hi] = సూర్యుడు, హోషి [Hoshi] = నక్షత్రం. జపానీయుల ప్రాచీన కుటుంబనామాలలో కొరియానుండి వలస వచ్చిన వారికి అప్రాంతం పేరు కన్పిస్తుంది. జపాన్‌లోని కొరియన్ కుటుంబనామాల సంఖ్యను "Record of Kabane and Uji" పేర్కొంది. కుటుంబనామానికి అదనంగా చేర్చిన పేరు కుటుంబనామం తరువాత లిఖించ బడడం గమనించవచ్చు.

మెయిజి [Meiji] శకం మొదలయ్యేవరకు ఈ రెండు కుటుంబనామాలు సామాన్యులకంటె భిన్నంగా అత్యున్నత స్థాయిలోగాని, అత్యున్నత పదవులలోగాని ఉన్నవారికి మాత్రమే ఇవ్వబడ్డాయి. మిగిలిన సామాన్య ప్రజలకు వ్యక్తినామం మాత్రం ఉండేది. మెయిజి శకంలో అందరినీ కుటుంబనామాలు పెట్టుకొమ్మని ఆజ్ఞ జారీచేశారు. అంతేగాక వ్యక్తినామాలు స్వేచ్ఛగా మార్చుకోకూడదు అనే నియమంకూడ విధించబడింది. ఈ సమయంలో లక్షలాది కుటుంబాలు కుటుంబ నామాలను మొదటిసారిగా స్వీకరించాయి. అందువలన ఒకే గ్రామంలో ఒకే కుటుంబనామంగల కుటుంబాలు అనేకం వున్నాయనడంలో ఆశ్చర్యంలేదు. ఒకే ఇంటిపేరుండి. ఒకే గ్రామంలో నివసిస్తున్నా, యీ కారణంవలన ఆ కుటుంబాల మధ్య బాంధవ్యం కన్పించదు. టోక్యో డైరెక్టరీ [Tokyo Directory] లో ఇప్పుడు రికార్డు చేసిన వేర్వేరు కుటుంబనామాల సంఖ్య 4146. జపాన్ దేశం మొత్తంలోని 'పోస్టల్‌చెక్‌లిస్టు' 4942 గా పేర్కొంది. కాని నేడు వాడుకలో వున్న జపానీయుల కుటుంబనామాలసంఖ్య 10,000కు తక్కువ ఉండదు.

3. కొరియన్ : కొరియన్లకు కేవలం మూడువందల కుటుంబనామాలు మాత్రమే ఉన్నాయి. కాని అందులో '–Kim, –Pak, –Yi' అనే మూడు మాత్రమే ఎక్కువ కొరియన్ కుటుంబాలకు ఇంటిపేర్లుగా వ్యవహారంలో వున్నాయి.

భారతీయేతర గృహనామాలను పైతృకంగా వచ్చినవి, తల్లిపేరుననుసరించి ఏర్పడినవి, వృత్తి ననుసరించినవి, నివాసస్థలాన్నిబట్టి యేర్పడ్డవి, వ్యక్తి బాహ్య స్వరూపాన్నిబట్టి రూపొందినవి, జంతువుల నామాలమీద ఏర్పడ్డవి, మత సంబంధ మైనవి అని ఏడు విధాలుగా విభజించవచ్చు.

1. పైతృకంగా లేక తాతముత్తాతల నుండి వచ్చిన యింటిపేర్లు (Patronymic or Ancestors) :

కుటుంబనామాలు మధ్య యుగాంతంలో అమలులోకి వచ్చాయి. ఇవి 11వ శతాబ్దితో మొదలయి 16వ శతాబ్దితో పూర్తయ్యాయి వంశానుక్రమంగా వస్తున్న ఇంటిపేర్లు వారి వంశానుబంధాన్నీ, వంశ గొప్పదనాన్నీ సూచిస్తాయి. "Surnames were very gradually introduced and it is not until the 12th

C. that they begin to become heriditory. Before and frequently after this time the surnames as well as the Christian names was peculiar to the individual. Now however it is an established custom that the Children should known by the fathers name" [Everymans Encyclopaedia, Vol. 9] ఇంటిపేర్లు క్రమంగా ప్రవేశపెట్టబడి నప్పటికీ, అవి 12వ శతాబ్ది తరువాత మాత్రమే వంశపారంపర్యంగా మారాయి. ఈ సమయానికి ముందు అధికంగాను తరువాత తక్కువగాను క్రైస్తవ నామాల వలె ఇంటిపేర్లు వ్యక్తులకు ప్రత్యేకతను ఆపాదించాయి. ఇప్పుడు మాత్రం తండ్రి పేరుతో పిల్లలు గుర్తింపబడడం సుస్థాపితమైన సంప్రదాయంగా వుంది.

ఐలాండులోని కొద్ది ప్రాంతాలలోను, సోవియట్ యూనియన్‌లోను పైతృకమైన పేరు వ్యక్తినామానికి, కుటుంబనామానికి మధ్య చేరుతుంది. రష్యన్ల తండ్రిపేరు ఇవాన్ క్రైలోవ్ [Ivan crylov] అయితే అతని కొమరుని పేరు 'pytor Ivanovich Krylov' ఇందులో పైటర్ [Pytor] వ్యక్తినామం, ఇవానొవిచ్ [Ivanovich] తండ్రిపేరు, క్రైలోవ్ [Krylov] కుటుంబనామం. 'Ivan Krylov' యొక్క కుమార్తెపేరు Varavara Ivanovna Krylova. తండ్రిపేరుకు అనుబంధంగా పురుషునికి 'Ovich', స్త్రీకి 'Ovana' అని చేర్చు కుంటారు. ఒవిచ్ [Ovich] అంటే 'son of' అని. ఒవానా [Ovana] అంటే 'daughter of' అనీ అర్థం.అంటే క్రైలోవా అనే కుటుంబనామం తండ్రినుండి స్త్రీపురుషులు ఇద్దరికి సంక్రమిస్తున్నా పౌరుగువారిని, సమకాలీనులను, అధికారపు హోదాలో వున్న రష్యన్లను సంబోధించేటపుడు వ్యక్తినామానికి తండ్రిపేరును కలిపి పిలుస్తారు. కుటుంబనామానికి ఎక్కువ ప్రాధాన్యం ఉన్నట్లు కన్పించదు.

ఆంగ్ల కుటుంబనామాలలో తండ్రినుండి సంక్రమించిన పరపదానుబంధాలు [suffixes] ఎక్కువగా కన్పిస్తున్నాయి. ఈ పరపదానుబంధం '-son.' ఉదా :— డిక్సన్ [Dixon], గిబ్సన్ [Gibson], గిల్బర్ట్‌సన్ [gilbertson], గ్రెగ్సన్ [gregson], గ్రియర్సన్ [Grierson], హెన్రిసన్ [Henryson]. రిచర్డ్‌సన్ [Richordson] రాబిన్‌సన్ [Robinson].ప్రాచీనకుటుంబాలలో పూర్వ పదానుబంధాలుకూడ కన్పిస్తున్నాయి. పూర్వపదానుబంధం 'Fitz-'. ఉదా :— ఫిజెరాల్డ్ [Fitzgerald].

"In scotland and Ireland, surnames were often formed by adding a prefix to the fathers name" [Young students encyclopaedia] స్కాట్లాండులోని ప్రజలకు పైతృకంగా వ్యక్తి నామానికి పూర్వపదాను బంధాలు చేరుతాయి. ఉదా :– 'Mac–', or 'Mc–'. Gregor (son of Gregor) అని అర్థం.

ఐరిష్ ప్రజలు 'O' అనే పూర్వపదాన్ని కుమారుడు అనే అర్థంలో సంధిస్తారు. ఉదా :– O, 'Briln = grandson of Briln. 'Mc' లేక 'Mac' కూడ పూర్వపదాను బంధాలుగా చేర్చవచ్చు.

Welsh ప్రజలు 'P' అనే పూర్వపదానుబంధాన్ని చేరుస్తారని పోవెల్ 'Powell' మొదలైన పేర్ల వలన తెలుస్తుంది.

ఆధునిక గ్రీకుదేశంలో తండ్రినుండి సంక్రమించిన పరపదానుబంధాలు కన్పిస్తున్నాయి. ఉదా :– డిమిట్రిపోలస్ (Dimitripoulos) – డిమిట్రియస్ (Dimitrious) కుమారుడని అర్థం. అలానే పాపడో పోలస్ (Papado Poulos) – పాపడో కుమారుడు. ఇందులో పోలస్ – Poulous అనే పరపదాను బంధం కన్పిస్తుంది.

చాలామంది ప్రజలు తమ ఇంటిపేర్లను వారి తండ్రుల యొక్క వ్యక్తి నామాలనుండి గ్రహిస్తారు అతనియొక్క కుమారుడు (son of) అనే అర్థాన్నిచ్చే పదాన్ని పరంపదంగా గాని, పూర్వపదాను బంధంగా గాని చేర్చుకోవడం ప్రతి భాషలోను వుంది. ఐరిష్ ప్రజలు 'O'ను; జర్మనుప్రజలు '–sohn', '–son' అనే పదాలను; స్కాండినేవియన్లు తమపేర్ల చివర '–sen', లేక '–son' అనే పదాలను; రష్యన్లు, సర్బియన్లు (serbians), '–ovitch' అని, రొమేనియన్లు '–escu' అనే పదానుబంధాన్ని 'కుమారుడు' అనే అర్థంతో వారి పేర్ల చివర చేర్చుకుంటారు.

జాన్‌యొక్క కుమారుడు 'Johnson'. జాక్‌సన్ Jackson) అని ఇంగ్లాండులోను; జాన్స్ (Johns, జోన్స్ (Jones) అని వేల్స్‌లోను; Jensen, Jansen, Hansen అని డెన్మార్క్‌లోను; 'Janowicz' అని పోలాండ్

లోను; 'Ivano' అని రష్యా, బల్గేరియాలలోను; 'Janosfi' అని హంగేరిలోను; 'Mac Eoin' అని ఐర్లాండ్‌లోను వాడతారు. -Son కు బదులు s' అని పెట్టడం కూడ కన్పిస్తుంది. John కుమారుడు 'Jonnes' లేక 'Johnson' అని వేల్స్ లోను; 'రిచార్డ్' కొడుకు 'రిచార్డ్స్' లేక 'రిచార్డ్‌సన్' అని వ్యవహరిస్తాదు. వారి సంబంధాలను తెలిపే సోదరుడు (brother), Eames [uncle] 'Eames Watmought' (wats' brother-in-law) అని అర్థాన్నిచ్చే సంబంధార్థక ప్రయోగాలు కుటుంబనామాలుగా తక్కువ కన్పిస్తున్నాయి. పూర్వీకులను వర్ణించుతున్న పదాలు కుటుంబనామ స్థానాల్లో చాలాచోట్ల కన్పిస్తున్నాయి.

2. తల్లి పేరు ననుసరించి ఏర్పడ్డవి :— మాతృస్వామికమైన (Matronymic) పద్ధతి కూడ కొన్నిచోట్ల వ్యవహారంలో వుంది. ఈ పద్ధతిలో తల్లినుండి కుటుంబనామాను బంధం పిల్లలకు సంక్రమిస్తుంది. కాని ఇలా తల్లి పేరును స్వీకరించిన ఉదాహరణలు తక్కువగా వున్నాయి. మేరి కుమారుడు "Mallison" గా పిలువబడుతున్నాడు. ఎందుకంటే మేరి 'మాల్' (Moll) గా మారుతుంది గనుక. అలాగే మార్గరెట్ పుత్రుడు మార్గరెట్‌సన్ (Margaretson) గ వ్యవహరింపబడుతున్నాడు. ఈ పద్ధతి అన్ని సందర్భాలలోను ఖచ్చితంగా అమలులోలేదు. స్పెయిన్, లాటిన్ అమెరికాలలో ఈ మాతృస్వామిక పద్ధతి అమలులో వుంది. వాళ్ళ పైతృకమైన పేరు 'Y'గ సూచించబడి తరువాత తల్లిపేరు ఉంటుంది. స్పానిష్ రచయిత "Antonio Machado Y Ruiz" పేరు ఇందుకు ఒక ఉదాహరణ. ఇందులో "రూయిజ్" తల్లి పేరు.

3. వృత్తిననుసరించి :— మనిషి చేస్తున్న వృత్తిని అనుసరించికూడ ఇంటిపేర్లు ఏర్పడ్డాయి. ఆంగ్లభాషలో ఉన్న "Baker, కార్పెంటర్ (Carpenter), కార్క్ (Carke), కుక్ (Cook), మిల్లర్ (Mieller), టైలర్ (Taylor) మొదలైన పదాలు ఇందుకు ఉదాహరణలు. ఆంగ్లేయులలో మనకు ఎక్కువగా ఇంటిపేర్లలో కన్పిస్తున్న వృత్తిపరమైన పేరు స్మిత్ (Smith), ఈ స్మిత్ బ్లాక్ స్మిత్ (Blacksmith) నుండి ఏర్పడిన రూపమే. ఈ పద్ధతి అనేక దేశాలలో కన్పిస్తుంది. ఈ స్మిత్ అన్న పదం జర్మనీలో "Schmidt"గ; ఫ్రాన్స్‌లో "Lefeore"గా; ఇటలీలో "Forraro", పోలాండ్‌లో "Kowal", రష్యాలో "Kutznetzvo" అనే రూపాల్లో కన్పిస్తుంది. మధ్యకాలంలో సాధారణంగా

ఒక గ్రామానికి ఒక్క బ్లాక్‌స్మిత్ మాత్రమే ఉండేవాడు. జనులు అతని నేర్పరితనాన్ని చూచి గౌరవించేవారు కనుక అతనికి "స్మిత్" అనేపదం వృత్తివరమైన కుటుంబనామంగా చేరింది.

బెల్ (Bell) అనే కుటుంబనామం గంటయొక్క సంకేతాన్ని అనుసరించి పనిచేసేవారికి వచ్చివుండవచ్చు లేదా గంట తయారుచేసే వానికో లేక గంట మోగించేవానిగానో సంబంధం కలిగివుండవచ్చు. ఈ గృహనామం గల వ్యక్తులకు ఆయా వస్తువులతో గల సంబంధాన్ని సూచిస్తుంది. ఇసబెల్ (Isbel) అనే వ్యక్తినామానికి "బెల్" అనేది ముద్దుపేరు. దీనికి, ఆ "బెల్"కు సంబంధం ఉందేమో! ప్రాచీనమైన ఫ్రెంచిభాషలో "బెల్" (bell) అంటే అందమైన అనే అర్థంవుంది. కాబట్టి అందమైన వారికి ఇది వ్యంగ్యనామం (Nickname) కావచ్చు.

భూస్వాములకోసం పనిచేసినవారంతా తమ తమ వృత్తులపేర్లు కుటుంబనామాలుగా స్వీకరించారు. గొర్రెలను చక్కగా సంరక్షించిన వానికి, sheep-herd కనుకనే అతనిపేరు "షెపర్డ్" (Shepherd) = గొర్రెల కాపరి అయింది. ఆంగ్లంలో "కవార్డ్స్" (Cowards) అనే కుటుంబనామం కూడ కన్పిస్తున్నది. కవార్డ్ (Coward) అంటే పిరికి. కానీ ఈపదం ఇంటిపేరుగా వాడుకోడానికి వారేమీ సిగ్గుపడరు.. ఆ పదానికి "Cow-herd" అంటే ఆవులను రక్షించేవాడని అర్థం. యూరపులోని ఇనుపపని వారంతా వారి దేశీయనామాలను పెట్టుకున్నారు.

ఫ్రెంచి ప్రజలు విలాసాలలో మునిగివున్న కాలంలో వారి రథాలను (Carriages) కోచస్ (Coaches) అనేవారు. ఈపదం ఫ్రెంచి పదమైన కోచ్ (Coche) నుండి వచ్చింది. ఆంగ్లోశాక్సన్ ప్రజలు మరోవైపు వ్యవసాయబండ్లను (rough farm carts) వాడేవారు. వీనిని వాగన్ (wagon) లేక "wain" అని పిలిచేవారు. కనుకనే నేటికీ కార్టర్ (Carter), వెయినర్ (Wainer) అనే గృహనామాలు మనకు కన్పిస్తున్నాయి. కార్ట్ (Cart) తో సంబంధం ఉన్నది గనుకనే ఆ కుటుంబీకులకు కార్టర్ (Carter) అనే గృహనామం ఏర్పడింది. ఉదా :– జిమ్మికార్టర్ (Jimmy Carter)

ధనికులయొక్క వస్త్రాలను కుట్టేవానిని 'Tailleur "అని నార్మన్ ఫ్రెంచిలో వాడుతారు. కాని ఇప్పుడు 'Taylor'గ పిలువబడుతున్న ఈపదం చాలామందికి కుటుంబనామంగా కన్పిస్తుంది. ఉదా :- ఎలిజబెత్ టేలర్ (Elizabeth Taylor). వస్త్రాలను కుట్టడానికిగాను గుడ్డను సరఫరాచేసిన పేదవ్రజలకుమాత్రం స్పిన్నర్ (Spinner , వీవర్ (weaver) మొదలైన ప్రాచీన ఆంగ్లపదాలు ఇంటిపేర్లుగా నిలిచాయి. "క్లార్క్‌సన్" (Clarkson) అనే గృహనామానికి క్లర్క్ యొక్క కుమారుడు అని అర్థం. ఈపదం ఇక్కడ అతని తండ్రియొక్క వృత్తిని సూచిస్తుంది.

**4.** నివాస స్థలనామాలు గృహనామాలుగా ఏర్పడినవి :- ఒక దేశీయుడు తన దేశంనుండి మరోదేశానికి వచ్చి అచట స్థిరపడినపుడు వారు తమ నివాస స్థలనామాన్ని తెచ్చుకుంటారు. నార్మన్ విజేతల విషయంలో, ఫ్లెమిష్ (Flemish), హ్యూగొనాట్ (Huguenot) శరణార్థులు అచట స్థిరపడినపుడు ఈ పేర్లు ఏర్పడినట్లు తెలుస్తుంది. ఆతరువాత అమెరికాకు వెళ్ళిన కొన్ని మిలియన్లమంది వారుచేస్తున్న వ్యాపారాన్ని లేక ఆయా స్థలనామాలను అనుసరించి ఇంటిపేర్లు స్వీకరించారు. విలియంపెన్ (William penn) తన పేరును ఒక చిన్న ఆంగ్లేయుల గ్రామంనుండి గ్రహించి, అమెరికాకు వచ్చిన తరువాత ఆ పేరును పెన్సిల్వేనియాకు (Pensylvania) పెట్టాడు.

మధ్యయుగంలో యూరపులో జరిగిన దాడులవలన స్కాండినేవియన్లు, జర్మన్లు వివిధదేశాలకువెళ్ళారు. ఇలావెళ్ళినవాళ్ళు ఆక్రమించుకున్న స్థలనామాన్ని బట్టి గ్రామమైనా, పట్టణమైనా దానికి తమ సొంతపేరు పెట్టారు. ఆ తరువాత ఆ స్థలనామాలన్నీ వారి ఇంటిపేర్లుగా మారాయి. ఈ విధంగా అనుబంధించిన స్థలనామానుబంధాలు "Thorp" లేక "Thorpe" పదాలు ఫామ్ (Farm) లేక హామ్లెట్ (Hamlet) అనే అర్థాన్నిస్తున్నాయి. "Thorp" అనే పదంకూడ తరచుగా కన్పిస్తుంది. ఈ అనుబంధాలు చేరిన ఇంటిపేర్లు ఇలాఉంటాయి. "Winthorp", "Calthrop",

ఈ వర్గానికి చెందిన పరపదాను బంధమైన విక్ [Wick] కు గ్రామం అని అర్థం. ఈ పరపదానుబంధాలున్న స్థలనామాలు పిక్‌విక్ [Pickwick]. ఈ

—"Wick" అనే పదం అప్పుడప్పుడు "Wich"గ కన్పిస్తుంది. పచ్చగా ఉన్న స్థలం గ్రీన్‌విచ్ [Greenwich] అయింది "—హామ్" [-Ham], "టన్" [-ton] మొదలైన పరపదాలు ఇంటిపేర్లుగా వున్న స్థలనామాలలో కన్పిస్తాయి. ఉదా :— డెన్హామ్ [Denham], వాషింగ్‌టన్ [Washington]. టౌన్ (Town) అన్న పదానికి టన్ (Ton) అనేది ప్రాచీననామం. "Ley", "Lee" లేక Lea అనే పదాలకు పచ్చికబయలు (meadow)అనే అర్థం. ఇదికూడ స్థలనామం చివర చోటుచేసుకున్న మరోపదం. స్థలనామాన్ని సూచించే ఇంటిపేరును పరిశీలిస్తే వారు ఆయా ప్రాంతాలనుండి వచ్చారని తెలుసుకోవచ్చు. ఉదా :— వల్లేస్ (Wallace) = వేల్స్ (Walse) నుండి వచ్చారు. విట్నీ (Whetney) ఇది ఇంగ్లాండులోని ఒకప్రాంతం అలానే ఫీల్డ్స్ (Fields). బ్రూక్స్ (Brookes), ముర్రే (Murray). వుడ్స్ (Woods), హార్డేస్ (Hardes), హోమ్స్ (Holmes) మొదలైనవి ఇందుకు ఉదాహరణలు.

ఒక వ్యక్తి పర్వతప్రాంతంలో నివసిస్తున్నట్లయితే అతను ఫిన్‌లాండ్‌లో Mr. మకి (Maki), ఫ్రాన్స్‌లో Mr. Dumont లేక Mr. Depew అనీ, ఇటలీలో Mr. zola అని, పోలాండ్‌లో Mr. Jurek, ఇంగ్లండులో Mr. Hill అనీ వ్యవహరింపబడుతున్నాడు.

మధ్య యుగంలో కొంతమంది మాత్రమే చదవగలిగేవారట. అందుకని అంగడినిగాని, సత్రాన్నిగాని సూచించడానికి వస్తువుల లేక జంతువుల బొమ్మలను సైన్‌బోర్డులమీద చిత్రించేవారట. ఇక్కడ నివసిస్తున్న లేక పనిచేస్తున్న వారికి బెల్ (bell), స్టార్ (star), స్వాన్ (swan) మొదలైన గృహనామాలు ఏర్పడ్డాయి. ఇంగ్లాండులోని ప్రజలు వారి నివాసస్థలాన్ని అనుసరించి వుడ్ (wood), లేక్ (Lake), బ్రూక్ (brook), స్టోన్ (stone), ఫోర్డ్ (Ford) అని పిలువబడుతున్నారు ఉదా - "Woods" సమీపంలో నివసిస్తున్న తామస్ (Thomas) ను తామస్ వుడ్ (Thomas wood) అని వ్యవహరిస్తారు. "Middleton", "Kronenberg" మొదలైన పట్టణాలనుండి వచ్చినవారికి అవి గృహనామాలుగా నిలిచిపోయాయి. అనేక ఆంగ్ల స్థలనామాలలో "-Ham", "Thorp", "-Wic", "-Worth" అనే పదాలు నివసించు అనే అర్థాన్నిస్తూ పరపదానుబంధాలుగా నిలిచాయి.

"Wealthy land owners of feudal Europe drew their titles from the main physical features of their property". [The New Book of Knowledge, Vol. 13.] ఫ్యూడల్ యూరపులోని ధనిక భూస్వాములు ప్రకృతి సంపదనుండి ముఖ్యమైన గృహనామాలను గ్రహించారు. ఉదా :— లేక్ [Lake] జిల్లాలో నివసిస్తున్న ఆంగ్లకుటుంబం లేక్ [Lake], పాండ్ [Pond] లేక పూల్ [pool] అని పిలువబడేవారు. నీటి సమీపంలో వున్న ఇతర ప్రాంతీయులను బ్రూక్ [Brook] లేక రివర్స్ [rivers] అనేవారు. అదేప్రదేశంలో స్థిరపడిన ఇతర దేశాలలో వున్న కుటుంబాలను స్పెయిన్‌లో అయితే "Rio", "Rivera"; జర్మనీలో "storm" అనీ అంటారు. అంతేకాక "By of", "By waters" అనే అవ్యయాలుకూడ కన్పిస్తున్నాయి.

5. బాహ్య స్వరూపాన్నిబట్టి :— "physical features such as persons colouring, have frequently contributed family names [The new book of knowledge Vol. 13]. వ్యక్తులయొక్క బాహ్యాస్వరూపాన్ని బట్టి, వారి చేష్టలను, వారి వర్ణాన్నిబట్టికూడ కుటుంబనామాలు ఏర్పడ్డాయి. మధ్య యుగంలో చాలామంది యూరోపియన్లు చిన్నచిన్న గ్రామాలలో మాత్రమే నివసిస్తుండేవారు. కనుక వారికి ఒక్కపేరు మాత్రమే అవసరముయింది. కాని గ్రామంలో గ్రామస్థులు శిస్తులు కట్టిందీ లేనిదీ గ్రంథస్థం చేయవలసి వచ్చినప్పుడు ఏ రాబర్టు శిస్తుకట్టాడో గుర్తించవలసిన అవసరం ఆగ్రామ లేఖకునికి [Village clerk] వుంది. అప్పుడతను వర్ణనాత్మకమైన ఒక పదాన్ని అతనిపేరుకు అతని అభిప్రాయంతో సంబంధం లేకుండానే తగిలిస్తాడు ఉదా :— చినరాబర్టు [Robert, the small] జర్మన్ పదమైన "Gross", "Groth" అనే పదాలకు లావైన లేక పెద్దవ్యక్తి అని అర్థం.

"Nickames also often later became surnsmes, such as white, Brown, Longfellow etc. which describes the persons appearance" [Childrens Britanica, Vol. 7] వ్యక్తిస్వరూపాన్ని వర్ణించే వైట్, బ్రౌన్ మొదలైన వ్యంగ్యనామాలు తరువాత తరచుగా ఇంటిపేర్లుగా మార్పుచెందాయి. "Reid" "Reed", "Read", మొదలైనవి "red" [ఎఱుపు] అనే పదానికి పూర్వరూపాలుగా ఉండి, ఎఱ్ఱని కేశాలుగల వ్యక్తిని సూచిస్తున్నాయి. ఈ ఎఱ్ఱ

కేశాలున్న వ్యక్తులకు రెడ్ [Red] అనే వ్యంగ్యనామం వచ్చివుంటుంది. నేటికీ ఎఱ్ఱటిజుట్టు ఉన్నయువకులకు ఈపేరు వాడుకలో ఉంది. ఈపేరు ఎఱ్ఱకేశాలున్న వాళ్ళకేకాక ఎఱ్ఱటిరంగున్న వాళ్ళకు కూడా వచ్చింది. ఇంగ్లండులో వీరిని 'Red', 'Reid' 'Reed' 'Read' అనీ; జర్మనీలో 'Roth' అనీ; ఫ్రాన్స్‌లో 'Rousseau' లేక 'Rouse' అనీ; ఇటలీలో 'Rossi' అనీ, ఐర్లాండులో 'Flynn' అనీ పిలుస్తారు. ఇంగ్లాండులో 'White; ఇటలీలో 'Bianco'; ఫ్రాన్స్‌లో 'Labalnc'; జర్మనీలో 'Weiss' మొదలైన కుటుంబనామ పదాలన్నీ తెల్లటిరంగును సూచిస్తున్నాయి. వలస వచ్చిన ప్రజల వ్యక్తినామాలను ఉచ్చరించడం కష్టమైనపుడు ఆ వ్యక్తులను ఈ రంగులపేర్లతో పిలుస్తారు. పొలిష్ మైనర్లు [Polish miners] పనిచేసుకోవడానికని ఎక్కువసంఖ్యలో స్కాట్లాండ్ వచ్చినప్పుడు ఆ 'ఫోర్‌మన్' వారిని వారిపేర్లతో పిలువలేదు. వారిని బ్లాక్, బ్రౌన్ మొదలైన పేర్లతో వారియొక్క రంగునుబట్టి మాత్రమే పిలవాలని ఆజ్ఞాపించాడు.

18వ శతాబ్దిలో స్కాట్లాండ్‌లో జాకొబైట్ల తిరుగుబాటును అచిణచేసిన తరువాత అచ్చటి ప్రజలను 'Mac' అని పిలవడం ప్రమాదకరంగా ఉంది. అందు వలన చాలామంది వైట్, బ్లాక్ లేక బ్రౌన్‌గా మార్చుకున్నారు. రంగులకే ప్రాధాన్యాన్ని ఇవ్వకుండ మనిషియొక్క రూపాన్ని, పరిమాణాన్నిబట్టి కూడ ఇంటిపేర్లు ఏర్పడ్డాయని లిటిల్[Little], స్మాల్ [Small], పవర్ [Power], స్ట్రాంగ్ [Strong] మొదలైన పదాలవలన తెలుస్తుంది. మనిషి శరీరంలోని వివిధ భాగాల పేర్లుకూడ ఇంటిపేర్లబదులు వాడుకలోకి వచ్చాయి. 'Brain', 'Head', Legge, 'Foot' మొదలైనవి ఈ విభాగానికి చెందినవే.

6. జంతువులననుసరించి :— ఎవరి లక్షణాలయితే జంతువుల ప్రవర్తనతో పోలిఉంటాయో వారికి ఆయా జంతువుల పేర్లను పెట్టడం కన్పిస్తుంది. జిత్తులమారి తనాన్ని ప్రదర్శించే వారికి ఆ లక్షణానికి ఎక్కువ ప్రాధాన్యంఇస్తూ ఫాక్స్ [Fox] అనీ, పరాక్రమంగల వారికి లయన్ [Lion] అనీ, పెద్దమనిషిలా వున్నవారికి లాంబ్ [Lamb] అనీ, బలిష్ఠంగా ఉన్నవారికి బుల్ [Bull] అనీ అంటారు. ఉదా:—ఆండ్రూ [Andrew] నడుపుతున్న సంత్రంగుర్తు సింహం అయితే అతనిని ఆండ్రూ లయన్[Andrew Lion] అని పిలిచేవారు. జంతువుల పేర్లతోనే కాక

పక్షులపేర్లతోకూడ పిలువబడుతున్నట్లు కన్పిస్తుంది. శక్తిగల లేక బలంగల మనిషికి ఈగల్ [Eagle] లేక ఫాల్కన్ [Falcon] అనే పదాన్ని తగిలించడం సామాన్యం.

7. మతాన్ననుసరించినవి లేక మత సంబంధమైనవి :- 18వ శతాబ్ది తరువాత, 19వ శతాబ్దిలోను యూదులు ఇంటిపేర్లు ఎన్నుకున్నారు. ఇవన్నీకూడ మతసంబంధమైనవే. 'Kohn', 'Cohen', 'Cahen', 'Kaan' = priest; 'Levy','Lowy',=Name of the tribe of priest. మతసంబంధంగా మతాధిపతి అనీ. మతాధిపతి యొక్క శాఖ అని అర్థంయిచ్చే పేర్లను ఇంటిపేర్లుగా స్వీకరించారు.

ఇంటిపేర్లను వర్గీకరించడం చాల క్లిష్టమైనపని. ఎందుకంటే ఆంగ్లభాషా పదాలలో వున్న వర్ణక్రమ దోషం వలన [spelling mistakes], ఉచ్చారణా లోపాలవలన ఇది కష్టసాధ్యమౌతుంది. భాష కొత్తగా అక్షరరూపం దాల్చిన సమయంలో ఆ పదాలను రచించడంలో అక్షరదోషాన్ని పాటించేవారు కాదు. అందువలన ఆ పదాల ఉచ్చారణ అనేక విధాలుగా మారింది. ఒకే దేశంలోని ఒక జిల్లాకు, మరొక జిల్లాకు ఆపద ఉచ్చారణలో సంబంధం ఉండేదికాదు. ఈపదాలు ఎలాంటిమార్పు లేకుండా ఖచ్చితంగా ఉండవు. ఏ వస్తువునకైనా పేర్లు పెడతామేతప్ప వానిని స్థిరపరచలేము. అవి మార్పుకు లోనవుతుంటాయి. విద్యలేనివారికి, ఎలిజబెత్ కాలంలోని రచయితలకు కూడ పేరు ఒకరూపంలోనే వుండేది. ఈనాడు షేక్స్పియర్ [Shakespeare] అనేపేరు కనీసం 80 రకాల వర్ణక్రమాలతో ముద్రణలలో కన్పిస్తుంది. ప్రాచీన పదాలకు ఈనాడు వ్యవహార విదూరమైన [obsolete] అర్థాలు కలుగుతున్నాయి. వ్రాయసగాని యొక్క వివక్ష [discretion] మీద వర్ణక్రమం ఆధారపడి ఉంటుంది. ఒకేపేరు ఒకేగ్రంథంలో వేర్వేరు అక్షరక్రమాల్లో కన్పిస్తుంది. కొన్నిపేర్లు గుర్తించదగిన ఆంగ్ల పదాల నుండి వచ్చినట్లు కన్పిస్తున్నాయి. కాని అవి నిజంగా ఇతరభాషా పదాలే.

ఇంటిపేర్లను గుర్తించడంలో మరికొన్ని సమస్యలు ఎదురవుతున్నాయి. ఒక చిన్న పదానికి అనేక అర్థాలున్న సందర్భంలో ఈ సమస్య ఉత్పన్న మౌతుంది. డెన్మార్క్‌లోని 'Barn'కు, స్కాట్లాండ్‌లోని Bairn'కు చైల్డ్

[child] అనేఅర్థం. కాని ఆంగ్లంలో రైతులు పంటను నిల్వచేసే ప్రదేశాన్ని బారన్ [Barn] అంటారు. దీనిని పూర్వం బార్టన్ [Barton] అనేవారు. బార్నబాస్ [Barnabas] అనే పదానికి చిన్నరూపం బార్న్ [Barn]. బార్టన్ [Barton] లేక బార్నెస్ [Barness] అనే కుటుంబనామాలకు మూలం పైనున్న పదాలలో ఏపదమైనా కావచ్చు.

ఒకపదం అర్థం మారినపుడుకూడ మనకు తికమక కలుగుతుంటుంది. సిల్లి [Silly] అనేపదాన్ని షేక్స్పియర్ 'సింపుల్' అన్న అర్థంలో వాడటాడేకాని ఫూలిష్ [Foolish] అనే అర్థంలోకాదు. సీలే [Seeley] కుటుంబంలోని సభ్యులందర్నీ సిల్లీస్ [Sillies] అంటారు. వారిపేరుకు మంచి, అమాయకులు [innocents] అని. 'breed of fools' కాదని అర్థం. మరోవైపున వారు సముద్ర సమీపంలో ఉన్న మైదానం [ley] నుండి వచ్చినందుకు వారికి ఆపేరు వచ్చివుండవచ్చు. కొన్ని పేర్లను వృత్తిపరంగాను, పరిసరాలను బట్టికూడ వివరించవచ్చు. కుండలు చేస్తున్నవాడిని పాటర్ [Potter] అనవచ్చు. ఫ్రాన్స్ దేశంలోని 'Portiers' నుండి వచ్చినవారినికూడ 'Potter' అనవచ్చు. అంటే ఒకే గృహనామానికి రెండువిధాలుగా వ్యుత్పత్తులు చెప్పవచ్చు.

మార్పులు :

The British Royal family accepted the name "Windsor" only in 1917. This was changed to "Mount batten Windsor" for the future members of the family who will not enjoy princely status. (The new encyclopaedia Britanica. Vol. 12.) బ్రిటీషు రాజకుటుంబం 'విండ్సర్' అనే నామాన్ని 1917లో మాత్రమే అంగీకరించింది. భవిష్యత్తులో రాజరికం అనుభవించలేని కుటుంబ సభ్యులకు ఈ పేరు మౌంట్‌బాటన్ విండ్సర్ [Mount batten Windsor] గా మార్చబడింది.

విదేశనామాలు తరచుగా ప్రఖ్యాతిచెందిన పదాలుగా మారుతుంటాయి. ఉదా :- Dutch Roggenfelder (dweller in or a rye field). Dutch Roggenfelder > American Rockfeller. డచ్చిపదమైన 'Roggenfelder' అనే కుటుంబనామానికి రైఫీల్డ్‌లోగాని, సమీపంలోగాని నివసించేవారని అర్థం. ఈపదం అదే అర్థాన్నిచ్చే అమెరికా పదమైన 'Rockfeller'గా మారింది.

అనేక దేశాలలో వివాహం తర్వాత స్త్రీ తన గృహనామాన్ని మార్చుకునే ఆచారం ఉంది. పెండ్లికుమార్తె తన కొత్త ఇంటిపేరుతో పాటు తనపూర్వపు గృహనామాన్నికూడ జర్మన్ అమెరికన్లు, ఐరిష్ అమెరికన్లలో వలే చేర్చుకునేందుకు పశ్చిమజర్మనీలాంటి న్యాయస్థానాలు అనుమతిని ఇచ్చాయి. ఉదా :- "Beatrix curzon". Frederic Cholomondeley-Curzon అని తక్కువగా కన్పిస్తుంది. విడాకులు తీసుకున్న కన్యలు వారి పూర్వపు ఇంటిపేర్లు పెట్టుకోవచ్చు.

జూలియస్ సీజరు సోదరియైన జూలియా మనుమడు 'గేయస్ ఆక్టేవియస్' [Gaius Octavious]ను తన మేనమామ దత్తత స్వీకరించాడు. అప్పుడు ఇతనిని "Gaius Julius Caesar Octavianus"గా వ్యవహరించారు. ఒక కుటుంబంలో నుండి మరొక కుటుంబంలోనికి స్వీకరించబడిన వ్యక్తి తన పెంపుడు తండ్రి యొక్క మూడుపేర్లనూ స్వీకరించాలి. రెండోపేరైన తన వ్యక్తినామానికి '-anus' అనే పరపదాన్ని తగిలించుకోవాలి. అందువలన ఆక్టేవియస్ [Octavious] ఆక్టేవియానస్ [Octavianus] అనే పేరుతో వ్యవహరించబడుతూ, తన కుటుంబనామాన్ని పోగొట్టుకొని దత్తత తీసుకొన్నవారి కుటుంబనామంతో నిలిచిపోతాడు.

కొంతమంది రోమన్లు తమ పూర్తిపేరును వదులుకుంటున్నారు. బానిస తనకు స్వేచ్ఛనుకల్గించిన యజమాని పేరుపెట్టుకుంటున్నాడు. మార్కస్ టులియస్ సిసిరో [Marcus Tullius Cicero] అనే అతను ఒక సిరియన్ బానిసకు స్వేచ్ఛను కల్గించినందువల్ల ఆ బానిస "Marcus Tullius Syrus" అనే పేరును గ్రహించాడు. వీరి వంశంలోని వారికి ఇది కుటుంబనామంగా నిలిచిపోయింది.

తూర్పు యూరపు దేశాలలోని కుటుంబనామాలలో అసాధారణ పరిస్థితులు కన్పిస్తున్నాయి. అన్నాక్లిమోవా [Annaklimova] అనే 'జెక్' బాలిక జోసఫ్ నొవాక్ [Joseph Novak] ను వివాహం చేసుకుందని అనుకుందాం. వారిద్దరూ వారి సహజమైన గృహనామాన్ని అలానే పెట్టుకోవచ్చు. లేక ఆబాలిక జోసఫ్ క్లిమోవా [Joseph Klimova] అని తన భర్త ఇంటిపేరును తనకు ఇంటిపేరుగా పెట్టుకోవచ్చు. ఈ ఇంటిపేరును మార్చుకోవడం, మార్చుకోకపోవడం అనేవి భార్యాభర్తల ఏకాభిప్రాయం మీద ఆధారపడి ఉంటుంది. వీరి ఇంటిపేరే వీరి

పిల్లలకు కూడా కుటుంబనామంగా ఉంటుంది కనుక స్త్రీకి సమానత్వం కల్పించడం కోసం ఇలాంటి అవకాశాన్ని కల్గించినా, రష్యావారి పితృస్వామిక వ్యవస్థకు ఇది ఒక గొడ్డలిపెట్టు.

స్పెయిన్‌లోను, లాటిన్ అమెరికాలోను స్త్రీలు వారి పిల్లలకు కుటుంబ నామాన్ని ఎన్నుకునే స్వేచ్ఛనిస్తారు. తండ్రిపేరుగాని, తల్లిపేరుగాని, ఇద్దరిపేర్లు గాని కుటుంబనామంగా స్వీకరించవచ్చు. విడాకులు తీసుకున్న అమెరికన్ మహిళ తన భర్తపేరును తీసివేయవచ్చు లేకపోవచ్చు.

"In regard to family names, the most important regulation was made at the Council of Trent (1563). It was decreed that every parish must keep complete registers of Baptism, with the names of the child, parents and grand parents. The new system helped to establish the family names. (The new encyclopaedia Britanica Vol. 12, p. 814) 1563లో 'కౌన్సిల్ ఆఫ్ ట్రెన్ట్' ఒక ముఖ్యమైన చట్టాన్ని చేసింది. ప్రతిపారిష్ తమపిల్లల, తల్లిదండ్రుల తాతల బాప్టిజం పేర్ల పూర్తి రికార్డు తయారు చేసుకోవాలని నియమం విధించింది. ఈ కొత్త పద్ధతి ఇంటిపేర్ల నిర్మాణానికి ఏంతో దోహదం చేసింది.

ఇరవయ్యో శతాబ్దానికి యూరోపియన్ పద్ధతయిన వ్యక్తినామం + కుటుంబనామం రెంటినీ చేర్చే పద్ధతి ప్రతిచోటా అమలులోకి వచ్చింది.

33663

# ఇతర భారతీయ భాషలలో ఇంటిపేర్లు

తెలుగుదేశం చుట్టూ వాడుకలో ఉన్న భాషలమీద తెలుగువారి కుటుంబ నామ ప్రభావం తక్కువనే చెప్పాలి. ఎందుకంటే దాదాపు ఏప్రాంతంలోనూ ఆంధ్రులకు ఉన్నట్లు ప్రత్యేకమైన యింటిపేర్లు లేవు. ఒక్కొక్కరికి ఒక్కొక్క పద్ధతి అమలులోవుంది. ఆంధ్రదేశం నుండి ఇతర రాష్ట్రాలకు వలసవెళ్ళిన ఆంధ్రులు కొందరు వారి ఇంటిపేరును నిలుపుకున్నారు. మరికొందరు ఆయాప్రాంతాల ఆచారాలను బట్టి మార్చుకున్నారు.

## ద్రావిడ భాషలలో ఇంటిపేర్లు :-

తమిళులకు ప్రాయికంగా ఇంటిపేర్లు కన్పించవు. వీరిలో తండ్రిపేరు ముందు, తరువాత సొంతపేర్లు ఉంటాయి ఉదా- : చంద్రశేఖర వెంకటరామన్, వైద్యనాథ బాలసుబ్రహ్మణ్యం, నల్లయరాజా కుమారస్వామి రాజా; రామచంద్రరాజు జగన్నాథరాజు అని వ్యక్తినామానికి ముందు తండ్రిపేరు కన్పిస్తుంది. క్రీగీత కల పేర్లు తండ్రిపేర్లు. మిగిలినవి వ్యక్తినామాలు. తెలుగుదేశంనుండి తమిళ దేశానికి వలసవెళ్ళిన వారిలో కూడ ఈ ఆచారం కిన్పిస్తుంది. పెళ్ళి అవ్వక ముందు కుప్పుస్వామి సుధగా వ్యవహరించబడిన సుధ వివాహానంతరం తండ్రిపేరు వదలి మామగారి కుటుంబంలో వారిలాగ తానుకూడ మామగారిపేరు చేర్చుకొని రంగనాథ్‌సుధగా వ్యవహరించబడుతుంది. తమిళులలో అయ్యర్, అయ్యంగార్, ముదలియార్ మొదలైన కులనామ సూచకాలు ఉన్నప్పటికీ గృహనామం స్థానంలో గ్రామనామంగాని, తండ్రిపేరుగాని వుంటుంది. ఉదా :- పి.ఏ. క్రిష్ణస్వామి అయ్యర్, పి.అంటే పట్టమడై (ఇది గ్రామనామం); ఏ- అనంత (తండ్రిపేరు); క్రిష్ణస్వామి (వ్యక్తినామం); అయ్యర్ (కులసూచి).

కేరళలో మాతృస్వామిక వ్యవస్థ అమలులో ఉన్నందున తల్లి ఇంటిపేరు వ్యక్తినామానికి ముందు పెట్టుకోవడం సంప్రదాయం. పాఱక్కాల్ పార్వతి కుమార్తె పాఱక్కాల్ లక్ష్మి అవుతుంది. పార్వతి కుమారునికి కూడ ఆమె కుటుంబనామం సంక్రమిస్తుంది. పార్వతి భర్తకు మాత్రం ఇంటిపేరు యిదికాదు. అతనిపేరు మఠతిల్ ఉన్నికిృష్ణన్. ఇతని గృహనామం మఠతిల్. ఈతని సంతతికి ఈ యింటిపేరు రాదు. కాని తిరువనంతపురం ప్రాంతంలో స్త్రీసంతతి తల్లి

పేరును, పురుషసంతతి తండ్రిపేరును వ్యక్తినామానికి ముందు పెట్టుకోవడం కన్పిస్తుంది ఉదా :—




పాలప్పులట్టు, వడక్కేవిట్టిల్ మొదలైనవి వీరిలో కొన్ని ఇంటిపేర్లు.

మైసూరు ప్రాంతంలో వారికి ఎక్కువగా గ్రామనామాలే గృహనామాలుగా వాడుకలో ఉన్నాయి. తెలుగువారి సంప్రదాయంలా వీరికికూడ వ్యక్తినామానికి ముందు గృహనామం ఉంటుంది.

ఉదా :— కడకల్లు చెన్నప్ప. గిణివారు శివరాజు; అత్తునూరు చంద్రప్ప; మాచనూరు చంద్రశేఖరప్ప; ముద్దనూరు బసవలింగప్ప.

ఈ పేర్లలోని మొదట పదాలన్నీ గ్రామనామాలు. రెండో పదాలన్నీ వ్యక్తినామాలు. గదారు, దాసరు మొదలైనవి కూడ గృహనామాలుగ ఉన్నాయి. ఈ ప్రాంతంలో వృత్తినిబట్టి కూడ కుటుంబనామాలు ఉన్నాయి. ఉదా :— నాదురు = మంగలి; కొరువురు = మాల; తండే = లంబాడి; మాదురు = మాదిగ; కోమటురు = కోమటి మొదలైన కులనామ సూచకాలుకూడ గృహనామ స్థానంలో చోటుచేసుకున్నాయి బ్రాహ్మణులకు వారి గ్రామనామాలు ఇంటిపేర్లుగా ఉంటాయి. తెలుగుదేశంనుండి వెళ్ళిన తెలుగువారికిమాత్రం వారి ఇంటిపేర్లే వాడుకలో నిలుస్తాయి.

గాంఢీయ భాషలలో ఇంటిపేర్లు :

ఉత్తర హిందూదేశంలోని ఇంటిపేర్లన్నీ దాదాపు వృత్తిపరమైనవే. వీటిని వ్యక్తినామంచివర జమునాలాల్ బజాజ్, దశరథనందన అగరవాల్, రామానంద బెనర్జీ, శ్రీమన్నారాయణ మిశ్రా, లక్ష్మీపతి త్రిపాఠీ, శంభుచంద్ర ముఖర్జీ,

బాలగంగాధర తిలక్, సునీతికుమార చటర్జీ, సుమిత్రానందన్ పంత్, గంగాచరణ దుబే, అనే వృత్తిసూచక నామం చివర చేర్చే అలవాటువుంది. క్రింగీత గలవి వృత్తిని సూచించేపదాలు.

మూడు లేక నాలు శతాబ్దాల క్రితం రాజపుత్రులు సౌరాష్ట్రానికి వచ్చారు. చౌహాన్, సావరియా, రాథోడ్స్ (Rathods), టాంక్ (Taunk) మొదలైనవి అన్నీ గుజరాత్‌లోని రాజకుటుంబాలు. వీరు పేరుకు తరువాత ఇంటిపేరును వాడుతారు. ఉదా :- పృథ్వీరాజ్ చౌహాన్. ఇందులో చౌహాన్ అనేది ఇంటిపేరు. తండ్రిపేరు, ఇంటిపేరు రెండూ వ్యక్తినామం తరువాత ఉంటాయి.

ఉదా :— నందలాల్ వసంజి టాంక్ (Nandlal Vasanji Taunk)

ఇచట నందలాల్ వ్యక్తినామం, వసంజి తండ్రిపేరు, టాంక్ ఇంటిపేరు.

భారత్ శాంతిలాల్ సావరియా (Bharat Shantilal Savaria)

భారత్ వ్యక్తినామం, శాంతిలాల్ తండ్రిపేరు, సావరియా ఇంటిపేరు. 'కచ్'లో ఒకే కులదైవం, ఒకే ఇంటిపేరు వున్న వ్యక్తులకు వివాహం చేయరు. అంటే వీరి వంశమూలం ఒక్కటేనన్న వుద్దేశంతో అంగీకరించరు వివాహానికి పూర్వం తండ్రిపేరు. తండ్రి ఇంటిపేరు తనపేరు తర్వాత పెట్టుకున్న గుజరాతీ వనిత వివాహానంతరం భర్తపేరు, అతని ఇంటిపేరు పెట్టుకుంటుంది. వివాహానికి పూర్వం బీనా వసంజి టాంక్ (Bina Vasanji Taunk) అని పిలవబడి, వివాహానంతరం బీనా జితేంద్రచావదా (Bina Jitendra Chawada) అని బీనా తనపేరు తరువాత తనభర్త పేరైన జితేంద్రను, అతని ఇంటిపేరును నిలుపుకుంటుంది. ఈ ఇంటిపేర్లన్నీ క్షత్రియులవే. గుజరాత్‌లోని అన్ని కులాలలో ఇదే ఆచారం కన్పిస్తుంది. ఇంటిపేర్లు మాత్రం వేరుగా ఉంటాయి.

ఉదా :— మోహనదాస్ కరమ్‌చంద్ గాంధి.

ప్రభావతి పానాచంద్ నర్వానా.

మోహన్‌దాస్ వ్యక్తినామం, కరమ్‌చంద్ తండ్రిపేరు, గాంధి కుటుంబనామం.

మహారాష్ట్రల్లో పేరుకుముందు తండ్రిపేరు, చివర ఇంటిపేరు ఉంటుంది.

ఉదా :- శివరామ అనంత భండార్కర్;
తం. పే వ్యనా. ఇం. పే.

దామోదర్ వినాయక సావర్కర్;
తం. పే. వ్య.నా. ఇం. పే.

సిద్ధోజీ ఖండేరావు మూల్గాం;
తం పే. వ్య.నా. ఇం. పే.

పాండురంగ గోవింద మంగూల్కర్.
తం. పే. వ్య.నా. ఇం. పే.

పాండురంగ తండ్రిపేరు, గోవింద వ్యక్తినామం, మంగూల్కర్ ఇంటిపేరు.

మధ్యప్రదేశ్‌లోని షెడ్యూలుకులాలలో ఆదివాసి, నాగర్, దూబే, చవహాన్, పైటస్, కాషివ్, శాస్త్రి, చందుర్, షాహూ, తివారి మొదలైన పదాలు వ్యక్తి నామాల చివర అనుబంధించబడి కుటుంబనామాలుగ వ్యవహరించబడుతున్నాయి. వీరు తెలుగు వారుకాదు.

# తెలుగువారి ఇంటిపేర్లు

## తెలుగు సాహిత్యంలో ఇంటిపేర్లు

ఆంధ్రసాహిత్యం సుమారు వెయ్యేళ్ళ చరిత్ర కలది. ఈ సుదీర్ఘమయిన కాలంలో నూరారుమంది కవులు వెలసి వేలాది గ్రంథాలను వెలయించారు. సాహిత్యం జగద్ధితం కోసమనీ, విశ్వశ్రేయమే దీని పరమార్థమనీ సాహిత్య విమర్శకులయిన పెద్దలు ఉద్ఘోషిస్తుంటారు. అంతేకాక సాహిత్యం లోక వృత్తాంత ప్రదర్శకమని కూడా సాహిత్యాభిమానులు పేర్కొంటూ ఉంటారు. ప్రపంచ భాషలలోని అనేక సాహిత్యాలపట్ల ఈ అభిప్రాయం చాలా మట్టుకు ప్రవర్తిస్తుందేమోకాని, తెలుగు సాహిత్యంలో మాత్రం దీనికి ఆస్కారం అంతంతమాత్రమే. అస్తి నాస్తి విచికిత్స అన్ననూ తప్పులేదు. దీనికి హేతువులేవో మనకు స్పష్టంగా తెలుసు. తెలుగులోని సాహిత్య వ్యవసాయం ముక్కాలు మువ్వీసం పాలు విలాస జీవనులైన ప్రభువుల సమాశ్రయంలో పుట్టి పురుడు తీర్చుకున్నందున సామాన్యుల జీవన స్రవంతికి దూరమవడం మొదటి హేతువుగా నిర్ణయించవచ్చు. తెలుగుల సాహిత్య సృష్టిలో చాలాభాగం సంస్కృతం నుండి అనూదితమైనందున మన కవుల స్వీయాభిరుచుల ప్రకటనకు గాని, సమకాలిక జీవిత రేఖాచిత్రణకుగాని అంతగా అవకాశం లేకపోవటం రెండో హేతువుగా పేర్కొనవచ్చు.

అయినప్పటికీ స్వస్థానవేష భాషాభిమానులూ, రసప్రలుబ్ధులూ అయిన కవులు కొందరు కొంతలోకొంత సామాజిక జీవన చిత్రణానికి యత్నించకపోలేదు. ప్రకృత చర్చా వ్యాపారానికి సంబంధించిన 'ఇంటిపేర్ల చరిత్ర'కు సాహిత్యంలో లభ్యమయ్యే ఆధార సామగ్రి తత్త్వాన్ని పరిశీలించవలసి ఉంది. కావ్యావతారికా భాగాలలోను, ఆశ్వాసాంత గద్యలలోను మన కవులు తమవంశ కథనాన్ని కృతి నాయకుల లేక కృతిప్రేరకుల పోషకుల వంశ కథనాన్ని కావించడం సాధారణ విషయం. వంశ పరంపరను అభివర్ణించే ఘట్టాలలో పితరుల నామాలూ గృహనామాలూ రాక తప్పవుకదా!

ఇంటిపేర్లు కొన్ని సాంఘిక రాజకీయ నేపథ్యాలు ఆధారంగా ఏర్పడతాయి.

ఇంటిపేర్లను ఎన్నిరకాలుగా విభజించవచ్చో చూద్దాం. "స్వభావాన్నిబట్టి ఇంటిపేర్లు 1. పౌరుషనామాలు, 2. వృత్తి బోధకాలు, 3. గ్రామనామాలు, 4. ప్రసిద్ధులైన మూలపురుషుల పేర్లమీద ఏర్పడ్డవి, 5. నివాసగృహాల ఉనికి, నిర్మాణరీతి, వాటి పరిసరాలు వగైరాలను బట్టి రూపొందినవి అని స్థూలంగా ఐదువిధాలుగా వర్గీకరించవచ్చు అని తూమాటి దోణప్పగారు తమ రేడియో ప్రసంగంలో పేర్కొన్నారు. తెలుగు సాహిత్యంలో కన్పించే ఇంటిపేర్లను 1. మూలపురుషుల పేర్లతో ఏర్పడినవి; 2. మాతా పితరుల నామధేయాలతో సంబంధంకలవి; 3. గ్రామనామాలు; 4. పౌరుష లేక బిరుదనామాలు; 5. వృత్తులు; 6. జన నిరుక్తులు; 7. మార్పులు అని ఏడు భాగాలుగా విభజించవచ్చు.

## 1. మూలపురుషుల పేర్లతో ఏర్పడినవి :

మొదట వంశ మూలపురుషుల పేర్లతో ఏర్పడ్డవి, ప్రతిభావంతులైన పురుషులకు తమ ఇంటిపేర్లు జారిపోయి వ్యక్తినామాలే వంశనామాలుగా ఏర్పడిన వైనం చూద్దాం.

ప్రమర, చయహాని, శుక్ల, పరిహార అనే నాలుగూ అగ్నివంశాలు. ఈనాల్గు వంశాల రాజులు క్రీ. పూ. 392 సం॥ నుండి క్రీ. శ. 1193 వరకు భారతదేశాన్ని పరిపాలించారు. ప్రమరవంశ శ్రేష్ఠుడు విక్రమాదిత్యుడు క్రీ. పూ. 82 నుండి క్రీ. శ. 18 వరకు పరిపాలించాడు. క్రీ. శ. 1193లో మహమ్మదీయులతో జరిగిన స్థానేశ్వర యుద్ధంలో ఈనాల్గు వంశాల రాజులూ నశించారు. వీరిలో ప్రమరుడు క్రీ. పూ. 392 – 386 వరకు పరిపాలించాడు గనుక ఈతని తరువాత వీరి వంశం ప్రమర వంశమయింది. చయహాని వంశంలో చయహాని రాజు మొదటివాడు. చాళుక్య వంశపు రాజులలో శుక్ల: లేక చాళుక్యరాజు మొదటివాడు. పరిహార వంశపు రాజులు కలి 2710 – 4295 వరకు కలింజపురం (వంగదేశం) ను పరిపాలించారు. వీరిలో మొదటిరాజు పరిహార. ఈ వంశాలలోని మూలపురుషుల పేర్లమీదుగా ఆయావంశాల పేర్లు ఏర్పడినట్లు 'కలియుగ రాజ వంశములు' అన్న గ్రంధం వలన తెలుస్తుంది.

ఆనందగోత్రికుల వంశనామాన్ని గురించి చూద్దాం. బృహత్ఫలాయన జయవర్మ అనంతరం పల్లవులు ఆంధ్రదేశాన్ని ఆక్రమించిన సమయంలో

ఆనందగోత్రికులు ఆంధ్రదేశంలోని కొన్ని ప్రాంతాలను వశపరుచుకొని పాలించారు. గుంటూరు మండలంలోని చేజర్ల లేక కపోతకందరపురము వీరి రాజధాని. వీరు గోత్రనామాన్నే వంశనామంగా ధరించారు. ఈ వంశీయులకు మూలపురుషుడు ఆనంద మహర్షి. మొదటిరాజు కందరరాజు. (శాస్త్రి, ఆం.సాం.చ; పు.184). ఆనందగోత్రికుల మూలపురుషునిపేరు. గోత్రనామం ఒకటేగనుక ఆపేరుతోనే వీరు ప్రసిద్ధికెక్కారు.

శాలంకాయనులు కూడా గోత్రనామాన్నే వంశనామంగా గ్రహించారు. శాలంకాయనుడు ఒక వేదర్షి. మత్స్యపురాణం, ప్రవరమంజరి మొదలైన గ్రంథాలవల్ల శాలంకాయనుని విషయం తెలుస్తుంది. శాలంకాయన మహర్షి విశ్వామిత్ర సంతతివాడైన శాలంకు లేక శాలంక వంశీయుడు. ఆంధ్రదేశంలో శాలంకాయన రాజులు తమపేర్ల చివర 'పద్మ' పదాన్ని చేర్చుకోవడం వల్ల పల్లవులు, అనంద గోత్రికుల వలే వీరుకూడా బ్రాహ్మణులేనని ఊహించుటకు అవకాశమున్నదని బి. యన్. శాస్త్రిగారు పేర్కొన్నారు.

**అనఘం** :— వంశంలోని పెద్దవాడైన అనఘయామాత్యునిపేర అనఘం అనే ఇంటిపేరు వచ్చిందట.

**అయ్యదేవర** :— ఆంధ్రప్రముఖులలో దీనబంధు శ్రీ ఆయ్యదేవర కాళేశ్వరరావు ఆదర్శమూర్తులగు మహాపురుషులలో గణింపదగిన వారు. "ఆర్యత్వము (అయ్య- ఆర్యశబ్ద తద్భవము); దేవత్వము (కన్నడ భాషలోని దేవర = దేవుడు); ఈశత్వము (కాళేశ్వరుడు) ముప్పిరిగొని వారి గృహనామాభిధానములలో గర్భితము లగుట ఒక విశేషము". (శ్రీ. అయ్య; పు. 1). అని శ్రీ బండారు తమ్మయ్య గారు అయ్యదేవర కాళేశ్వరరావు గారి జీవితచరిత్ర భూమికలో పేర్కొన్నారు.

**అవచి** :— 'అవచి' అనేది ఒక వాణిజ్య కుటుంబానికి చెందిన ఇంటిపేరు. అవచి తిప్పయసెట్టి హరవిలాస కృతిపతి. వీరి ఇంటిపేరు 'అవచి' వారు. దక్షిణ భారతాన కంపానదీ తీరంలోని కాంచీనగరంలో ఆగర్భ శ్రీమంతులైన వణిక్పుంగవులెందరో ఉన్నారు. వారిలో ప్రసిద్ధి చెందినవారు అవచి వారు. వీరు కొండవీటి రెడ్డిరాజుల వైభవ ప్రాభవాలకు ప్రాపై ద్వీపాంతర వాసంచేస్తూ ఆంధ్రదేశాన్ని సంపదలకు నిలయంగాచేశారు. ఈ వంశీయులు చిఱుతొండనంబి

వంశీయులమని చెప్పుకున్నారు. వీరిది కౌండిన్య గోత్రం. వీరు ముఖ్యంగా సరకులు, రత్నాలు, సుగంధ ద్రవ్యాలు, అశ్వాలు, గంధ సింధూరం మొదలైనవి ద్వీపాంతరాల నుండి తీసికొని వచ్చి భారతఖండం అంతటా పంపిణీచేసేవారు. 'అవచి' అనేది వీరి వంశంలోని ఒక ప్రధాన వ్యక్తినామంగా శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారు భావిస్తున్నారు. అవచి సెట్టి పోలయ వేమారెడ్డికి శ్రీపర్వత సోపాన నిర్మాణానికి పాతాళ గంగకు మెట్లు కట్టడానికి గాను ధనం పెట్టుబడి పెట్టినట్లు మల్లంపల్లి సోమశేఖరశర్మగారు తమ 'హిస్టరీ అఫ్ రెడ్డి కింగ్‌డమ్స్'లో పేర్కొన్నందువల్లనూ. ఆశ్వాసారంభంలో –

"శ్రీ పర్వత సోపాన
స్థాపక వేమక్షితీశ సామ్రాజ్య శ్రీ
వ్యాపారి ముఖ్య సాన్వయ
దీపక! యలకాధిరాజ! దేవయతిప్పా" (హర. 3-1).

అని ఉండడంవల్ల అవచిసెట్టి అనే ప్రసిద్ధ వ్యక్తి ఈ వంశమూలపురుషుడై ఉండవచ్చు. అవచిసెట్టి పేర 'అవచి' అనే గృహనామం ఏర్పడి ఉండవచ్చు.

"... అవచి దేవయ

యాపాణికి జనించె నభ్యుదయముతోన్" (హర.పీ. 18).

అని ప్రయోగం కూడ ఉంది.

**గోపాలుని :**– గోపాలుని రామకవి తన వంశాన్ని వర్ణించేటప్పుడు ఎలాంటి సంశయానికీ తావివ్వకుండ నన్నయభట్టు తన వంశంలోని వాడనీ తన పూర్వుడనీ కింది పద్యంలో స్పష్టంచేశాడు.

"—మద్వంశక్రమంబభివర్ణించెద
—ఆ మౌద్గల్యమౌని వరేణ్యుండు ప్రకాశమంచె ధరణిన్
విజ్ఞాన పారీణుడై"

"ఆమౌద్గల్య సగోత్రుల
లాము డను పొగడ్తని యిలన్ శబ్దపటి
ష్ఠామేయ దక్ష శిక్షా
కాముడు నన్నయజనించె గణనాగణుడై"

"ఆనన్నపార్య వంశాం
బోనిధి సంపూర్ణ చంద్రుపోలికను దయా
సూనగుణాలంకారుడు
దీనిధి గోపాలు డమిత తేజుడు పుట్టెన్ (ఆం.క.త;సం. 1పు.59).

గోపాలుని రామకవి వంశంలో జన్మించిన గోపాలుడు ప్రసిద్ధి చెందినాడని పై పద్యం వలన తెలుస్తుంది గనుక ఇతనిని బట్టి రామకవి గృహనామం గోపాలుని వారని వచ్చింది. గోపాలుని రామకవి చిత్రాంగదా పరిణయ ఆశ్వాసాంతంలో తనను గూర్చి గద్యలో ఇలా రాసుకున్నాడు. "ఇది శ్రీమదహోబల లక్ష్మీనృసింహ కరుణా కటాక్ష వీక్షణ విచక్షణాక్షీణ మహిమా కలిత లలిత కవితా విలాసమృదు మధుర వచన రచనా విలాస గోపాలాన్వయాంబోనిధి సరస సన్మాన రామాభిధాన ప్రణీతంబైన—" అని రాసుకున్న ఇతడు 16వ శతాబ్దివాడు. నన్నయ ఇతని వంశంవాడు కాదని పరిశోధకులు పేర్కొన్నారు.

"భరతుని బట్టి యిందుజులు భారతులైరి రఘుండు హేతుపై
పరగిరి రఘువాఖ్యనల భానుకుల ప్రభువుల్"

అన్న రీతిగా ఒక్కొక్క మహాపురుషుని పేరుతో కొంతకాలానికి ఎవరో మహాపురుషులు బయలుదేరినట్లయితే ఆయన పేర ఆ వంశం ప్రసిద్ధికెక్కుతూ ఉంటుంది. వీటిని పూర్వోత్తరాలుగా విడదీస్తే ప్రతిపూర్వభాగం వ్యక్తినామాన్ని, ఉత్తర భాగం కులాన్నిగాని తెగనుగాని వృత్తినిగాని సూచిస్తాయి, _నేని, _రాజు మొదలైన పరపదాలతో కూడిన ఇంటిపేర్లు యిందుకు ఉదాహరణలు.

_నేని : కటికనేని, కామినేని, పాపినేనిలలోని 'నేని' ఉత్తరభాగంగా గల గృహనామాలు 77 అని వెలుగోటి వారి వంశావళి, 72 అని శివయోగిసారం పేర్కొన్నాయి. 'నేని' నాయక శబ్దభవం. దీనికి నాయకుడు అనే అర్థం ఉంది. కామినేని చౌదరిగారు కామినేని వంశానికి మూలపురుషుడనీ, అందుకే ఈ వంశం వారికి కామినేని గృహనామం కలిగిందనీ ఈ కింది పద్యంవలన తెలుస్తుంది.

"భరతుని పేర భారత
వర వంశము భంగి నాత్మవంశము తనపే
ర రహి వహింప గన్పించెను
ధరణిన్ శ్రీకామినేని దగ బొగడొందన్"

కామినేని మల్లారెడ్డి చాలా గ్రంథాలు రచించినా ముద్రింపబడినవి పద్మపురాణం, శివపురాణం, షట్చక్రవర్తి చరిత్ర మాత్రమే.

పండితారాధ్యులు :— ఆరాధ్యుల వారి తరువాత వారి సంతతి అభివృద్ధిచెంది ఆరాధ్యగురువంశాలుగా ప్రసిద్ధి చెందాయి. పండితారాధ్యుల వారన్న ఇంటిపేరు గలవారు వేరే ఇంటిపేర్లు గలవారు అయిన ఆరాధ్యులు తాము మల్లికార్జున పండితారాధ్యుని మొదలుకొని నేటివరకు వచ్చిన వంశాలను చూపించే ఎడతెగని వంశవృక్షం కన్పించదు. పండితారాధ్యుల వారిలో రెండురకాలవారున్నారు. ఒకరు మల్లికార్జున పండితారాధ్యుని వంశం వారం అంటారు. వారిది గౌతమ గోత్రం. మరొకరు శ్రీపతి పండితుని వంశపువారం అంటారు. వీరిది కౌశికగోత్రం. మైసూరు ప్రాంతంలోని కొందరు ఆరాధ్యులు తాము మల్లికార్జున పండితుని వంశం వారమని చెప్పుకుంటారని శివతత్త్వసారంలోని అవతారిక వలన తెలుస్తుంది. మల్లికార్జుని పేరు శ్రీశైల మల్లేశ్వరుని పేరే. శ్రీశైల మల్లికార్జున దేవుని ఉపాసించిన తరువాత పుట్టినందున అతనికి మల్లికార్జునుడన్న పేరు పెట్టారు. కాని ఇతడు ఆరాధ్యమత సాంప్రదాయకమైన వీరమహేశ్వర ఆచార పద్ధతిని ప్రతిష్ఠించిన 'పండిత' అనే విశేషనామంచేత పిలవబడ్డాడు.

ఆరాధ్య సంప్రదాయానికి చెందినవారు ముగ్గురూ పండితనామధేయులే. మల్లికార్జునునకు పూర్వులైన శ్రీపతి పండిత, శివలెంక మంచన పండితులు ఇద్దరిలో ఉన్న పండిత నామమే వారి తరువాత మల్లికార్జునునకు కూడా వచ్చింది. దాక్షారామం వద్ద ఉన్న కోటిపల్లి వాడైన ఆరాధ్యుడు ఈతని గురువు. మల్లికార్జున శివయోగి బ్రహ్మచర్యం వదలి గృహస్థాశ్రమం స్వీకరించిన తరువాతనే పండితుడయ్యాడు ఈ పండితారాధ్య నామమే వీరి తరువాత వారికి గృహనామంగా నిలిచింది. మల్లికార్జున పండితారాధ్యుడు గోదావరి జిల్లా దాక్షారామ నివాసి. వీరి ప్రాముఖ్యాన్ననుసరించి వీరిపేరే వీరివంశీయులకు ఇంటిపేరయింది. వీరు వైదిక ధర్మానుసారులై వర్ణాశ్రమ ధర్మాలను అనుసరించి శైవమత వ్యాప్తిచేశారు.

**పరశురామపంతుల :–** బ్రహ్మవిద్వజ్జన గేయ పరశురామ పంతుల రామమూర్తి నామధేయ—" (శుక. ఆశ్వాగ; పు. 296) అనే

అశ్వాసాంత గద్యంలో కవి ఇంటిపేరు పరశురామపంతుల వారు అని తెలుస్తుంది. ఆంధ్రేతరులు ఆంధ్రదేశానికి రాకపూర్వం వారికి ఇంటిపేర్లు లేకపోయినా, వీరు ఇచ్చట స్థిరపడిన తరువాత ఈదేశపు ఆచారానుసారం "యస్మిన్ దేశే యదాచారః" అన్నట్లు వీరుకూడా క్రమంగా ఇండ్లపేర్లు ఏర్పరచుకున్నారు. వీరి ఇండ్లపేర్లు ఎక్కువగా గ్రామనామాన్ని అనుసరించి, జాతివాచకాన్ని అనుసరించి వచ్చినట్లు కన్పిస్తున్నాయి. కాని ఇక్కడ ఆ కుటుంబ యజమాని పేరే గృహనామంగా స్థిరపడడం మనం గమనించవచ్చు. ఈ గృహనామం గురించి ఒక కథవుంది. ఔరంగజేబు పాదుషా మహారాష్ట్రంపై దండెత్తినపుడు అతని సైనికులు పెట్టే బాధలు భరించలేక చాలామంది మహారాష్ట్రదేశాన్ని విడిచి అన్యప్రాంతాలకు వలస పోయారు. వారిలో దండాపంతు, శ్యామాపంతు, పరశురామపంతు అనే ముగ్గురు తమ కుటుంబాలతో ఆంధ్రదేశానికి వచ్చారట. వారి సంతతి వారికి క్రమంగా వారిపేర్లే గృహనామాలయ్యాయి. పరశురామ పంతుల అన్ననామం గ్రహించిన వారు వరంగల్లుకు సమీపంలోని పెనగవరంలో నివసిస్తూ అక్కడున్న నియోగి బ్రాహ్మణులతో సంబంధ బాంధవ్యాలు ఏర్పరచుకొని వారుకూడ నియోగులుగ వ్యవహరించబడుతున్నారు. నియోగ బ్రాహ్మణుల నామాలకు మంత్రి, అమాత్య పదాలు వారిపేర్ల చివర చేర్చడం అనేకచోట్ల కన్పిస్తుంది. అందుకే లింగమూర్తి తన తండ్రిపేరుకు చివర మంత్రి అనే పదం చేర్చి రామమంత్రి అని పేర్కొన్నాడు. (ప. లిం. జీ; సా.). పరశురామ పంత్‌గారి తాలూకు అని వ్యవహరించడం వలన వారికి అది ఇంటిపేరై బహువచన లకారంకూడ ఇంటి పేరు చివర వచ్చిచేరింది.

**–పిళ్ళ :–** చల్వపిళ్ళ నరసకవి క్రీ.శ. 1800 ప్రాంతంవాడు. ఈతడు 'యామినీ పూర్ణతిలకా విలాసము' రచించాడు ఈ ఇంటిపేరు మేలుకోట అనే ఊరుపేరుగల యాదవాద్రిని వెలసిన చెల్వపిళ్ళరాయని నామం. ఈ దేవుడు తనను కొల్చినవారిలో కొందరి భక్తికి మెచ్చి పత్యక్షమై వారు 'చెల్వపిళ్ళ' అనే ఇంటిపేరుతో ఆయురారోగ్యైశ్వర్యములతో తులదూగేటట్లు వరమిచ్చాడట. ఈ ఇంటిపేరు తనకు ఇలా కలిగిందని చెల్లపిళ్ళ నరసకవి తన వేంకటేశ్వర విలాసంలో ఈ కింది పద్యంలో పేర్కొన్నాడు.

"ప్రవరుల్ కొందరు మేలుకోట గలచె
ల్వపిళ్ళరాయండు భ
క్తి విశేషంబున కాత్మమెచ్చి కరుణో
క్తిన్వేగ సాక్షాత్కరిం
చి వరంబిచ్చి మదీయ భక్తులని వా
సింబో్రివగా వారస
ర్వ విశేషంబుల వృద్ధిబొందిరిల జె
ల్వ పిళ్ళవారైతగన్" (భార. 1946. ఆగస్టు. పు.124).

తిరుపతి వెంకటకవులలో ఒకరైన వెంకటశాస్త్రిగారు ఈ వంశానికి చెందినవారే.

-ప్రగడ/-పెగ్గడ·- చెన్నాప్రగడ, తల్లాప్రగడ, మంత్రిప్రగడ, విస్సాప్రగడ మొదలైన ఇంటిపేర్లలోని 'ప్రగడ' మంత్రి అనే అర్థంగల పెగ్గడ నుండి ఏర్పడిందే. పెగ్గడ, ప్రగడ రూపాంతరాలు. రామాపెగ్గడ జగన్నాథకవి 16వ శతాబ్ది ప్రారంభంలోని వాడు. ఇతడు ప్రబంధ రత్నాకరం రచించాడు.

**బిజ్జుల** వీరశైవమత వ్యాప్తిచేసిన బిజ్జలుని పేరే తరువాత కొందరికి గృహనామమయినట్లు తెలుస్తుంది. ఇది కాలక్రమేణా బిజ్జులగామారి ఉండవచ్చు.

"సిరుల నొప్పు నలంపురీ సీమకెల్ల
నాడ గౌడును, దేశాయి, నాడకరణ
మనెడి విఖ్యాతి యెవ్వాని కలరెనతడు
వొల్చె, బిజ్జుల పెద తిమ్మ విభుండు". (అనర్ఘ. 1-39).

బిజ్జుల తిమ్మ భూపాలుడు క్రీ శ. 17వ శతాబ్దిలో ప్రాగటూరు రాజధానిగా ఆలంపూరు సీమను పాలించాడు. ఈ వంశం వారికి బిజ్జుల అనే పదం ఇంటి పేరుగా ఏర్పడడానికి కారణం అనర్ఘరాఘవ పరిష్కర్త కేశవపంతుల నరసింహ శాస్త్రిగారు ఇట్లుచెప్పారు. "కాలాచుర్య వంశీయుడైన బిజ్జలరాయడు పశ్చిమ చాళుక్యరాజైన తైలపదేవుని జయించి కళ్యాణియందు తన విజయ ధ్వజాన్ని స్థాపించాడు. బసవేశ్వరుడు మంత్రిగ లభించిన తరువాత జైన మతాన్ని వదలి తాను శైవాన్ని స్వీకరించడమేగాక దేశమంతా బలాత్కారంగా శైవమతాన్ని వ్యాపింపజేయడానికి పూనుకున్నాడు. బసవేశ్వరుడు లేవదీసిన ఈ శైవమత

విప్లవంవలన బిజ్జలుడు రాజధానిలో నిలువలేకపోయాడు. అదికారణంగ కాలచుర్యులు చాలస్థలాలు తిరుగడమేగాక అందినంతవరకు ప్రతిప్రాంతంలోను శైవాన్ని వ్యాపింపజేసి తమ ఏలుబడి క్రిందికి తీసుకొన్నారు. ఆసమయంలో ఆలంపూరు ప్రాంతం వారి స్వాధీనమైనట్లు అచటి శాసనాలు తెలుపుతున్నాయి. ఆలంపూరులోని సూర్యనారాయణస్వామి స్తంభం మీద బిజ్జలుని కుమారుడు భుజమల్లుని కాలంలో ఒక వర్తక సంఘం చేసిన దానాన్ని తెలిపే శాసనం ఉంది. ఈ కారణంవలన బిజ్జలుని వంశీయులే కాలక్రమం చేత బిజ్జుల వారై ఉంటారు. లేదా బిజ్జలుడు వీర శైవమత వ్యాప్తికి ముఖ్యుడవటం చేత కొందరు వీర శైవంమీద భక్తిచేత అతనిపేరును తమ వంశనామంగా పెట్టుకొని ఉంటారు. మహాపురుషుల నామధేయాలు వంశనామాలుగ మారడం కొత్తకాదు. కనుక వీరశైవమతాభిమానంతో ఆలంపూరు ప్రాంతంలో ఉన్న 'బిజ్జల' పదాన్ని గ్రహించగా అది కాలక్రమేణా 'బిజ్జుల'గా మారి ఉండవచ్చు. ఎట్లైనా ఈ వంశంవారికి కాలాచుర్య సంబంధం దైహికంగా కాకపోయినా, స్నేహ సంబంధంగానో, భక్తిరూపంగానో ఉండి ఉంటుందని ఊహించవచ్చు కాలాచుర్య చక్రవర్తి భుజబలమల్లుని కాలపు శాసనాలు ఆలంపూరు ప్రాంతంలో ఉన్నట్లు పరిశోధకులు తెలపడంవల్ల బిజ్జలవారు పూర్వం శివభక్తులని ఆలంపూరులో ఉన్న జంగమ మఠాధిపతులు బిజ్జలరాయని చిహ్నాలుగల ఘంటా శంఖాలను ధరిస్తూ వాటికి సంస్కారం చేయవలసి వచ్చినప్పుడు ఈ వంశీయులచేత చేయించుకుంటు న్నందువలన 'బిజ్జుల' పదాన్ని గూర్చి ఇలా ఊహించవలసివచ్చింది.

_భట్లు : అదిభట్ల, కాశీభట్ల, విష్ణుభొట్ల గృహనామాలలో సామాన్యంగా కన్పిస్తున్న భట్ల, భొట్ల వైదిక గృహనామాలుగ కన్పిస్తున్నాయి. సంస్కృతంలోని భట్టునుండి ఇవి ఏర్పడ్డాయి. పై రూపాలు మార్పుచెంది భట్ట అనేది కూడ ఉత్తర పదంగా గల ఇంటిపేర్లున్నాయి. ఉదా :_ ఆదిభట్ట. హరికథాపితామహ నారాయణదాసు గారి ఇంటిపేరు అదిభట్ట. 'భట్ట' శబ్దం పండితవాచకం. ఆదిభట్ల వారిలో అజ్జాడ ఆదిభట్టవారు విశిష్టులు. "ఆదిశ్చ సౌభట్టశ్చ ఆదిభటః మొట్టమొదట ఈ గోత్రీకులకు ఈపేరు వచ్చుటకు కారకుడు ఏ మహాపురుషుడో తెలియదు (ఆంధ్ర దినపత్రిక 28-1-1945

_రాజు :— అయ్యలరాజు, కొమ్మరాజు. చెన్నమరాజు, నీలంరాజు. పోచిరాజు, పెగ్గడ రాజు, బైచరాజు రామరాజు గృహనామాలలోని ఉత్తరపదం 'రాజు'

నియోగి బ్రాహ్మణులలోను, వెలమ, కమ్మవారిలోకూడ కన్పిస్తుంది. అయ్యలరాజు రామభద్రకవి ఇంటిపేరు అయ్యలరాజు.

"అయ్యలరాజు తిప్ప సచివాగ్రణి పర్వతరాజు రామభ
ద్రయ్యను భాస్కరాగ్రణి బ్రధాన వరుండగు కొండ ధీరునిన్
జయ్యనఁ దిమ్మయ ప్రభుని సత్కవితా రచనాఢ్యులైన మా
యయ్యల రాజ వంశజుల నాది కవీంద్రుల సన్నుతించెదన్"
(హంస; – 12)

అయ్యలరాజు వంశపు కుదురు కడప మండలమందున్నది. ఆచార్య కె. వి. ఆర్. నరసింహంగారు రామాభ్యుదయ పీఠికలో రామభద్రకవి పూర్వులు తరతరాలనుండి కడప మండలంలోని ఒంటిమిట్టలో నివసించారని, అందువలన ఈ కవి కూడ బాల్యంలో ఇక్కడేగడిపి ఉండవచ్చునని భావించారు.

'చెన్నమరాజు చెన్నమరాజు చెన్నమరాజు' బాలకొంబలకు పౌత్రుడు. చారు చంద్రోదయం అనే ఐదు ఆశ్వాసాల శృంగార ప్రబంధాన్ని రచించి తాడిపత్రిలో తాను నెలకొల్పిన శ్రీ గోపాల కృష్ణునికి అంకితం ఇచ్చాడు. ఈతని పూర్వులు మంత్రులై, దండనాయకులై దాతలై యశస్సు నార్జించారు. పూర్వం ఈ వంశం వారి ఇంటిపేరు అన్మల చింతల వారని, అందులో చెన్నమరాజు సుప్రసిద్ధుడై నందువలన అతనినిబట్టి ఆతని ఇంటిపేరు చెన్నమరాజుగా మారినట్లు ఈ కవి ఈ కింద పద్యంలో పేర్కొన్నాడు.

"—ఆయనవద్య వంశభవులందు ప్రసిద్ధివహించి మించెనా
త్రేయ గోత్రుడు సుధీనిధి యన్మల చింతలాన్వయ
శ్రీయుతు డర్థి కల్పకము చెన్నమరాజు గుణాభిరాముడై"
(చారుచం. 1–11 అముద్రితపత్రి).

పోతరాజు అనేది ఒక ఇంటిపేరు. ఆంధ్రదేశంలో పోతరాజు అధిక ప్రఖ్యాతి పొందినకవి. ఈ భాగవత కర్తతో అసలు సంబంధం ఉన్నదో లేదో తెలియదుగాని పోతరాజు గృహనామంగా గలవారు ఆంధ్రదేశంలో ఉన్నారు. వీరు పోతరాజును వారి పూర్వీకుడని చెప్పుకుంటారు. లద్దంకి తాలూకా ఏల్చూరు

గ్రామానికి చెందిన పోతరాజువారి వంశం పండిత వంశమేగాని వీరిలో ప్రసిద్ధి చెందినవాడు పోతరాజు రామకవి. ఇతడు భక్తి రసపూరితమైన మూడు శతాకాలను, సావిత్రి చరిత్రను రచించాడు.

పెద్రిగడ రాజనే ఇంటిపేరు కృష్ణదేవరాయల కాలంలో నే ఉంది. "—పెద్దలైన వారల నిరసింతురా। పద్రిగడ రాజ్ఞ రసా। విరసా। తుసా। బుసా।" అని రామలింగ కవి పలికాడు. పెద్రిగడ రాజు నరసరాజు అనేకవి పెద్దన మొదలైన కవీశ్వరుల్ని లెక్క-చేయకుండా వారి కవిత్వాలలో దోషాలు ఉన్నాయని అక్కడక్కడా అనేవాడట. ఒకసారి కృష్ణదేవరాయల ఆస్థానానికి వచ్చి పెద్దనాదుల కన్నా అధికంగా ఆశుకవిత్వం రచిస్తానని అన్నాడట. స్వతహాగా సమర్థుడే అయినా రాయసంలో తనంత వాడులేడని గర్వపడేవాడు. రామలింగడు ఇతని గర్వం అణచాడు. పెద్రిగడ రాజనే పేరు పెద్రిగడరాట్ అని వాడబడింది. పెద్రిగడ రాజనే గృహనామంలో సగంపేరు మార్చి 'రాట్' అని పెట్టుకోవడం తమాషా।

బైచరాజు అనే ఇంటిపేరు కూడా మూలపురుషుని పేరుమీదుగా ఏర్పడిందే. బైచరాజు వెంకటనాథుని తాతపేరు బైచభూపాలుడు. అతని పేరునుబట్టి ఈ ఇంటిపేరు వెలిసింది. బైచరాజు వెంకటనాధుడు పంచతంత్రాన్ని రచించాడు.

రామరాజు రంగప్పరాజు ఆరవీటి రాజులలోని వాడు. ఈయన తండ్రిపేరు గాని తాతపేరు గాని వాడక తన ముత్తాతపేరును తనపేరుకు ముందు జోడించాడు. అదే ఇతని ఇంటిపేరయింది. రామరాజు రంగప్పరాజు 'సాంబోపాఖ్యానము' 'అనే ఐదాశ్వాసాల కావ్యం రాసి దాని గద్యలో అది 'సకల కళాభోజ రామరాజ రంగప్పరాజ ప్రణీతం' అని చెప్పాడు.

సిద్ధిరాజు తిమ్మరాజు అళియరాయల మేనల్లుడు. 16వ శతాబ్దివాడు. ఇతడు పరమ యోగీవిలాసం రాసి మంగళగిరి పానకాలస్వామికి అంకితం చేసాడు.

లింగనమఖి :— లింగన మఖి తిరుకామయ్య సత్యభామా స్వాంతసం రచించాడు. ఇతని ఇంటిపేరు లింగనమఖి. మధుర నాయకరాజుల ఆస్థానకవి. ఇతడు కాళహస్తి ప్రాంతంలో యజ్ఞం చేసినప్పటినుండి వారి వంశానికి 'లింగనమఖి' అనే ఇంటిపేరు వచ్చిందట. లింగనమఖి శ్రీ కామేశ్వరకవి

తన 'సత్యభామా సాంత్వనం'లో లింగనమఖి అనే గృహనామాన్నిగూర్చి ఇలా చెప్పాడు. తన వంశంలో అనేక మఖములు(యజ్ఞములు)ఆచరించిన లింగనమఖి ప్రసిద్ధుడవడం వలన ఈతని ఇంటిపేరు లింగనమఖి వారయిందట. ఇతడు తనపేరును ద్రావిడీకరించుకొని లింగినమఖి తిరుకామయ్య అని చెప్పుకున్నాడు. శ్రీఅనే శబ్దానికి ద్రావిడంలో 'తిరు' అనే పదంవస్తుంది. ఈతని గృహనామం లింగనమఖి వలన వచ్చిందని చెప్పడానికి ఆధారం కన్పించదు.

లెంక :— శివలెంక అనేది గృహనామం. లెంక అనే పదానికి సేవకుడు అని సాధారణంగా అర్థంఉంది. కాని సమయం వచ్చినప్పుడు విశేషార్థంకూడ ఉన్నట్లు చరిత్రనుబట్టి ఊహించడానికి వీలవుతుంది. కాకతీయ ప్రభువులు తమ కొలువులో పనిచేస్తున్న ఉద్యోగుల పోషణకుగాను నాయంకరాలు ఇచ్చారు. నాయంకరాలు అంటే పోషణకై ఇచ్చిన మాన్యాలు. ఇట్టి మాన్యాలను గ్రహించిన వారికి నాయంకరులని పేరు నాయంకరులైన లెంకలు సైన్యాన్ని, అశ్వాలను, గజాలను పోగుచేసి తగిన తర్ఫీదు ఇచ్చి అవసరమైనపుడు ప్రభువుకు యుద్ధంలో తోడ్పడుతూ ఉంటారు. ప్రభువు వీరికి ఇచ్చిన నాయంకరాల ఆదాయంతో సైనికులకు, అశ్వాలకు, ఏనుగులకు కావలసిన ఖర్చు చేస్తుంటారు. సైన్యాభివృద్ధి చేయటం, ప్రభువుకు సహాయం చేయడం లెంకల యొక్క విధులుగా కన్పిస్తున్నాయి. లెంకలు అనే పేరుతో సేనానుల మొదలుకొని అడపం ఇచ్చేవారి వరకూ కన్పిస్తున్నారు. శివలీలావిలాసం రచించిన కొమ్మన ఇంటిపేరు శివలెంక. ఇతడు నిశ్శంక మంత్రి మనుమడు. పై లెంకలలో శివనామం కలిగినవాడు శివలెంక. ఆ శివలెంక పేరే అతని తరువాత వారికి గృహనామంగా ఉండవచ్చు. శివలెంక అంటే శివునికి భక్తుడని కూడా అర్థం ఉంది. వీరశైవ పండిత త్రయంలో ఒకడైన మంచణ్ణకు శివలెంక అనే భక్త బిరుదనామం ఉంది. అందువల్లనే శివలెంక మంచన అని ప్రసిద్ధి చెందాడు. ఆతని వంశంవారు అప్పటినుండి శివలెంక గృహనామం కలిగి ఉండవచ్చు.

వఝులు:— వఝుల అనేవి ఉత్తరపదంగా తిమ్మావఝుల, రామావఝుల మొదలైన ఇంటిపేర్లున్నాయి. వఝుల, వజ్ఝల రూపాంతరాలు. రామావజ్ఝల గృహనామం వ్యక్తినామ పరంగా వచ్చిందే, రామావజ్ఝులని గృహనామం 'కొమరోశి'. సుధీ

మాన్యుడు, సత్యవచనుడు అయిన రామావఝ్ఝలు పేర తనవంశం ఉవ్వొంగే ట్లుగా వ్యాసులవారు వరమిచ్చారట. ఆయననుండి వారి వంశీయులకు 'రామావఝ్ఝలు' అనే ఇంటిపేరు వచ్చిందని రామావఝ్ఝల కొండుభట్టు తన 'కపిల గోసంవాదం' లోని ఈ కింది పద్యాలలో చెప్పాడు.—

"ఆ మౌనీంద్రు కులంబున
శ్రీమత్కామకోశి వంశశేఖరుడగుచున్
రామావఝ్ఝలు డనగ సు
ధీమాన్యుండు దయమయ్యె దేజంబెసగన్"

రామావఝ్ఝలు డాత్మ సత్యవచనారంభ ప్రచారంబునన్
రామాధీశ్వరుడే యనంగ దన పేరన్ వంశముఉవ్వొంగను
ద్దామప్రేమ జెలంగ వ్యాసముని ప్రత్యక్షంబునై సద్వర
స్తోమంబీయ నొసంగె సర్వజన సంస్తూయ ప్రభావమ్మునన్".

ఈ కొండుభట్టు 18వ శతాబ్ది లోనివాడని ఆంధ్రకవితరంగిణి గ్రంథకర్తలు నిర్ధారించారు. ఈయన వంశ మూలపురుషుడైన రామావఝ్ఝలు కొండుభట్టుకు 8వ తరంవాడై ఉండవచ్చు. కాబట్టి శతాబ్ది ఒకటికి నాలుగు తరాల చొప్పున వెనుకకు లెక్కవేసి చూసినట్లయితే ఈ ఇంటిపేరు 16వ శతాబ్దిలో పుట్టినట్లు తెలుస్తుంది. అప్పటినుండే ఈప్రాంతం వారికి ఈ గృహనామం వ్యాప్తిలోనికి వచ్చిందని తెలుస్తుంది. (ఆం.పు.పూ పు 50).

**శివదేవుని** :— గణపతి దేవ చక్రవర్తి గురువు విశ్వేశ్వర శివదేశికులు. ఈయన వంశీకులు 'శివదేవుని' వారు అనే గృహనామంతో ఇప్పుడు వ్యవహరించ బడుతున్నారు.

**సాని** :— అల్లసాని పెద్దన గృహనామం అల్లసాని. అల్లసాని లోని 'సాని' సాహిణి శబ్దంనుండి వచ్చింది. వీరి పూర్వులు సేనానులుగ పనిచేసి ఉండవచ్చు. సాహిణి శబ్దానికి ప్రాకృతంలో అశ్వసేనానాయకుడు అని అర్థం. "ఆంధ్రపితామహ అల్లసాని పెద్దన కవిచంద్రయని నిను బిలుచునట్టి...." అని పెద్దనే తన గృహనామాన్ని పేర్కొన్నాడు.

పెమ్మసాని వారిది ముగ్గుళ్ళ గోత్రమని, వీరి ఇంటిపేరు ముందు పెమ్మసానివారు కాదని, ఆలంవారని, వీరి మూలపురుషుడైన ఆలం వెంకటపతి నాయుడు నెలరోజుల పసివాడైనపుడు; తల్లిదండ్రులు మరణించగా, పెమ్మసాని అనే బోనగత్తె ఆలం వెంకటపతి నాయుణ్ణి పెంచి పెద్దచేసిందని, అప్పటినుండి వారి ఇంటిపేరు పెమ్మసానిగా మారిందని తెలుస్తుంది. (భారతి. 1939. సం 6.పు.78) హాళక్కి భాస్కరుడు తన కావ్యాన్ని సాహిణి మారనకు అంకితం ఇచ్చాడు. అతనిని గూర్చి

"అప్పులిడునతడు ఘనుడా, యప్పుడొసగి మరల జెందు నతడురాజా
చెప్పగవలె సాహిణి మారప్పను దానమున ఘనుడు రాజు నటంచున్"

వృత్తిని సూచిస్తున్న ఈ సాహిణి అన్నపదమే 'సాని'గా మారి గృహనామంలో పంపరానుబంధ స్థానాన్ని ఆక్రమించింది.

సారంగు :— సారంగధరుడు మూలపురుషుడుగా గల వారికి 'సారంగు' ఇంటిపేరు వచ్చింది. 'వైజయంతీ విలాసము' రచించిన సారంగు తమ్మయ తన గ్రంథ పీఠికలో—

"శ్రీరంగ హిమవదంతర
భూరంగ త్కీర్తియగుచు బొగడత కెక్కెన్
సారంగధరుడు నిర్జిత
సారంగధరుండు కీర్తి సర్వజ్ఞుడిలన్" (వై.వి. 1-17)

"సారంగధరుడు వెలయగ
సారంగుని వారటంచు సచివాగ్రణులై
పేరుంబెంపును గాంచి రు
దారు తనయ్యు భవులనగ దద్వంశభవుల్" (వై.వి.1–18).

"సారంగు తమ్మమంత్రి కుమారుడు నరసింహమంత్రి—" (వై.వి.1-25). అని సారంగు అనే పదం గృహనామంగా కన్పిస్తుంది. గోల్కొండ నగరానికి సారంగు తమ్మయ్య కరణీకం వహించేవాడు. ఈతని తాత సారంగధరుడు. ఇతడు 17వ శతాబ్ది ప్రారంభంలోని వాడు. రాజరాజనరేంద్రుని కాలంనాటి

సారంగధర చరిత్రలోని నాయకుడు ఈ గృహనామం కలవారికి మూలపురుషుడని కొందరి అభిప్రాయం. ఈ కథ యదార్థమా, కల్పితమా అన్న వాదోపవాదాలు ఇంకా పూర్తికాలేదు. ఏదైనా ఆధారం లేదుకనుక యదార్థంకాదు.

## 2. మాతాపితరుల నామధేయాలతో సంబంధం కలవి :

ఇక మాతాపితరుల నామధేయాలతో సంబంధం గల వాటిని పరిశీలిద్దాం. ఉపనిషద్వాఙ్మయంలో సైతం మాతృస్వామిక ప్రాధాన్యంగల నామకరణ రీతిని బలపరిచే సూచనలు గోచరిస్తున్నాయి. "అథవంగశః పౌతిమాషీపుత్రః కాత్యాయనీ పుత్రాత్ ... బ్రహ్మణేనమః" బృహదా. 8-5-2, 3, 4) అన్న గ్రంథభాగంలో పౌతిమాషీపుత్రుడు, కాత్యాయనీ పుత్రుడు, కాణ్వీపుత్రుడు, కాపీపుత్రుడు, ఆత్రేయీ పుత్రుడు, గౌతమీపుత్రుడు, మొదలైన వ్యక్తి నామాలలో తల్లి పేరు వ్యక్తి నామానికి ముందు చేర్చబడుతున్నట్లు బృహదారణ్యకోపనిషత్తు పేర్కొంది. ఉపనిషత్తుల్లో వైదిక పురుషుల పేర్లు కన్పిస్తున్నాయి. "ఉద్దాలక అరుణిః పప్రిచ్ఛ", 'గార్గీవాచ కృపీ పప్రిచ్ఛ", "జనకోవై దేహః", దృప్తబాలకీః గార్గ్యః", "అజాత శత్రుంకాశ్యం ఉవాచ", సాంఘిక వ్యవహారంలో ఒక పేరుగల వ్యక్తిని నిర్దేశించ వలసి వచ్చినప్పుడు ఆవ్యక్తి పేరుకుముందు పై విధంగా తల్లిపేరుగాని, తండ్రిపేరుగాని, వంశనామంగాని చేర్చి సూచించేవారని స్పష్టపడుతుంది.

ఇంటిపేర్లు ఏర్పడడానికి అనేక కారణాలున్నా, వాటి అన్నిటి ప్రయోజనం వ్యక్తి నిర్దేశమే. తాత్కాలిక ప్రయోజనం కోసం వ్యక్తి నిర్దేశం తండ్రి పేరుతో చేయడం సమస్త ప్రపంచంలోనూ ఉంది. విస్తారమైన తెలుగు సాహిత్యంలో సైతం వ్యక్తులపేర్లకు పూర్వభాగాన తండ్రి పేరును ఉట్టంకించడం అనూచాన సంప్రదాయంగా కన్పిస్తుంది. ఆదికవి నన్నయ నుంచి నేటి దాకా గల తెలుగు కావ్యాల అవతారికా భాగాలను, ఆశ్వాసాద్యంత పద్య భాగాలను, అశ్వాసాంత గద్యభాగాలను విహంగావలోకనం చేస్తే ఈ విషయం స్పష్టమౌతుంది.

తండ్రిపేరు వంశనామంగా మారటం రామాయణ కాలంనాటికే ఉన్నట్లు మనకు తెలుస్తుంది. కుశుడనే బ్రహ్మపుత్రుని కుమారుడు కుశనాభుడు. ఇతని కుమారుడు విశ్వామిత్రుడు "కుశవంశంవాడు కనుక కౌశికుణ్ణయ్యాను". ' కుశికుల వంశం ధర్మపారాయణం'. కుశవంశీయులైన రాజులందరూ బ్రహ్మతో సమానులై

మహాత్ములు—" అని వాల్మీకి రామాయణంలోని బాలకాండలో పేర్కొనబడింది.

రెడ్డిరాజుల కాలంలో కూడా ఇంటిపేరుకంటే తండ్రిపేరే ఎక్కువవాడుకలో ఉన్నట్లు కన్పిస్తుంది. రెడ్డిరాజులలో 'వేమ' అనే పేర్లున్నవాళ్ళు చాలామంది ఉన్నారు. వాళ్ళను సరిగా గుర్తుపెట్టుకోడానికి వాళ్ళను తండ్రిపేరుతో కలిపి పిలిచేవారు. కాటయవేముడంటే కాటయ రెడ్డిగారి కుమారుడు వేమారెడ్డి అని అర్థం. పెదకోమటి వేముడంటే పెదకోమటి రెడ్డి కొడుకు వేమారెడ్డి అని తండ్రిపేరతో తమ పేరు అనుబంధించేవారు.

తెలుగు సాహిత్యాన్ని పరికిస్తే వ్యక్తినామాలకు పూర్వం తల్లిదండ్రులపేర్లు, భర్తపేరు చేర్చుతున్నట్లు తెలుస్తుంది. '... భీమయ గుండమంత్రికిన్' (కేయూ. 1–41) '. మంత్రి భీమన గుండ నామాత్య మణికి (పైది. 1–44) అని కేయూర. లో ప్రశంసించబడ్డ గుండ మంత్రిపేరు ముందు అతని తండ్రిపేరు కనిపిస్తుంది. '....కొమ్మయ తిక్కని గాచుగావుతన్' (పైది.1–2); 'కొమ్మయ తిక్కడు' (పైది. 1–90) అని తిక్కన తండ్రిపేరుతో చెప్పబడ్డాడు. '.... నాగయ గన్న ధీనిధిన్' (మార్కం పీ.1) '....నాగయ గన్న విభుడు', (పైది.12) '....నాగయ మేచశౌరి' పైది. 43), అన్ని మార్కండేయ పురాణం కృత్యవతారిక లోని ఉదాహరణం. ఉత్తర హరివంశ కర్తయైన నవీన గుణసనాథుడు తాను 'నాచన సోముడనని' ప్రకటించు కున్నాడు. (ఉత్తర హరివం. ఆశ్వాగద్య). 'నాచన సుతుసోము' అని కొక్కోకమును రచించిన ఎట్టయకవి తన సకలనీతి కథావిధానమున పూర్వ కవిస్తుతిలో చెప్పియున్నాడు. దీనిని బట్టి నాచన శబ్దం పితృనామమే అని స్పష్టమౌతున్నదని శ్రీచాగంటి శేషయ్యగారు అభిప్రాయపడ్డారు. నాచన అన్నది ఇంటిపేరు మాత్రమే గాక ఇతని తండ్రిపేరు నాచిరాజని ఆంధ్ర ప్రబంధాలలో వాడబడింది. ఒకవేళ ఇంటిపేరు నాచిరాజు వారని కూడ చెప్పవచ్చునని శ్రీ చిలుకూరి వీరభద్రరావు సూచించారు ఈ వాగ్వాదానికి మూలం పెంచుకలదిన్నె శాసనం మాత్రమే. ఆకాలంలో ఉన్న సోమనాథులలో [illegible]ండి ఇతడిని ప్రత్యేకించడానికి నాటి ఆచారాన్ని పాటించి తండ్రిపేరతో చేర్చిఉంటారు. ఈ కవి తన ఉత్తర హరి వంశంలో 'నాచన సోమనాథ ప్రణీతంబైన' అనే వాడాడు కనుక ఇది తండ్రిపేరు అని గట్టిగా చెప్పవచ్చు. శ్రీనాథుని కృత్యవతారి

కళలో 'పెద్దయసింగమంత్రి' (శృం. నై. 1-1) '....పెద్దయ సింగనామాత్య వరుడు...' (పైది. 1-9) 'అవచి దేవయ తిప్పు ...' (హర.వి. 1-1), 'దేవయ చామిశెట్టి (పైది' 1-21), 'దేవయ త్రిపురాంతకునకు —' అని ఆయాకృతి నాథుల, కృతి పతుల ఉద్ధృవుల నామాలకు పూర్వం వారి తండ్రుల నామధేయాలు పేర్కొబడ్డాయి.. '—అల్లయ వీరభద్రునిన్ (కాశీ. 1-4) 'దొడ్డయ మల్లశౌరి' (కాశీ.1-28) '—గుండయ నరసింగ జనవిభుండు' (జై భా.పీ. 14) '....ఇందలి పూర్వభాగపు వ్యక్తినామాలు తండ్రుల పేర్లుగా స్వీకరించవచ్చు 'అనంతామాత్య గంగాధిపున్' (-నాసి. 1-1), '—ఐతయ కొమ్మమంత్రి' (పైది. 1-39), "... దగ్గుబల్లి కవితిప్పయ దుగ్గని ..." పైది. 1-15) అని దుగ్గన కవి ఉద్ధరణాలు, '....నాచన సోము' (మొల్ల. రా. పీ. 9) '....సిద్ధ జన్నమంతి) విక్ర., 1-44', బసవయ రాఘవుండు' (విష్ణు.1-18, 'తమ్మయ లింగవిభుడు' (పైది. 1-46) 'మల్లయ భీమ నాహ్వాయ' (వీరభ.వి. 1-48) 'మాచయ నాగ ' (పైది, 1-29, 'నాగయ వెన్నమంత్రి' (శృం.శా.1-2), 'నాచిరాజుని సోము, ....'నాగవిభు వెన్నామాత్య; (శకుం.వ.8.1-2). ఇవి పిన వీరభద్రుని వాక్కులు. ఔబళార్య కందనమంత్రి (సకలనీతి, 1-41). '... నరసవిభు కృష్ణరాయ భూనాయకుండు' (పారి. 1-1)లో కృష్ణదేవరాయల తండ్రి నరసరాజు సూచించ బడ్డాడు. '....తిమ్మభూపతి ఈశ్వరుండు' (ఆము 1-27), '..తిమ్మభూపతి ఈశ్వరుండు' (మనుచ.1-27), '....అన్నయమంత్రి దేచనిన్ (ఉద్భ 1-4, 'తిమ్మవిభు గోపమంత్రి' (పైది.1-17), 'రామానుజయ్య వేద్రాదిపతి (పాండు. 1-7), 'రామయ రామకృష్ణ' (పైది. 1-23), '....రామ విభు సోమామాత్యునికి (సుపక్షిణా1-1), '....రామయసోమమంత్రి' పైది1-6) '....శ్రీరంగాధిపు కోన భూవిభు....' (వస. 1-39), 'అచ్యుతేంద్ర రఘునాధ నృపా' (వాల్మీ.చ, 1-22), ' సిద్ధన తిక్కన ఎల్లియున్' పైది. పు. 64) '....రాయనమంత్రి భాస్కరుని కొండా....' (పైది.,పు. 61). 'గండభూపాలు నరసింహమండలేంద్ర (పైది.,పు. 18), '. నృసింహ కృష్ణరాయా....' (పైది. పు. 117) '....సుగుణా కర పెమ్మయ సింగధీమణీ' (పైది.పు. 69) భోగసుకరాజు తిమ్మయ బుక్కరాజు..'

(పై ది.పు.44 , 'అల్లయరెడ్డి వేముడు....' (పై ది.పు. 42) ఇట్టి మీది ఉదాహరణ లనుబట్టి కృతికర్తలు, కృతిభర్తలు అయిన వ్యక్తులపేర్లకు పూర్వభాగాన వారివారి పితృనామాలు చేర్చబడడం అతిప్రసిద్ధమని నిర్ధారించవచ్చు.

ఇట్లే తల్లుల పేర్లు పూర్వభాగాన వచ్చినవారికి ఉదాహరణలు: "....తిన్నమ తిక్కని ధర్మ్య జేయుతన్" (దశకు. 1-1). "పోలమ తిక్కడు...." (చాటుప. పు.11) అని తల్లుల పేర్లతో వ్యవహరింపబడ్డారు శాతవాహన రాజులకాలంలో కూడ తల్లిపేరు బిడ్డలపేర్లకు ముందు కన్పిస్తుంది. ఉదా : గౌతమీ పుత్రశాతకర్ణి, వాసిష్ఠీపుత్ర శివసిరి శాతకర్ణి, గౌతమీపుత్ర శ్రీయజ్ఞశాతకర్ణి. గౌతమీ నామాన్ని గురించి నండూరి రామకృష్ణమాచార్యగారి అభిప్రాయంచూద్దాం. "గౌతమీపుత్ర శాతకర్ణి తల్లి బాలశ్రీ శిలాశాసనము నాసికలోపుళమావి 19సం॥న కన్పిస్తుంది గౌతమీపుత్ర అను విశేషణమునకు పండితులు పలువిధముల అభిప్రాయములు చెప్పుచున్నారు. కాళిదాసు శాకుంతలములో కణ్వాశ్రమములో 'గౌతమి' కన్పించు చున్నది. 'గౌతమి' అనిన పరివ్రాజికాశ్రమమును స్వీకరించిన సన్యాసిని. గౌతమి పుత్ర శాతకర్ణి ఆగర్భచక్రవర్తి. భర్త మరణింపగ రాణిబాలశ్రీ గౌతమియై రాజ్యమును శాసించి ఆగర్భపుత్రునిపేర రాజ్యమేలినది. ఈ వీరమాత పుత్రుని జగదేక వీరునిగ తీర్చిదిద్దినది. ఆకాశములోనున్న ఆచారం ప్రకారం గౌతమీ పుత్రుడు 24వ ఏట పట్టాభిషిక్తుడైనాడు. అప్పటికే అతడు దిగ్విజయంచేసిన మహావీరుడు. గౌతమియై, సన్యాసినియైన వీరమాతయగు తన తల్లిపేరు చిర స్మరణీయము చేయుటకు గాను శాతకర్ణి గౌతమీపుత్ర శాతకర్ణియని నామధేయము ధరించి యుండవచ్చు. 'యథారాజా తథాప్రజా' యన్నట్లు అంతవరకు శాతవాహన వంశంలో తల్లిపేరు పెట్టుకొనని రాజపుత్రులు రాజవంశీయులు, గండనాధులు కూడ తమ నామములకు ముందు తల్లిపేరు పెట్టుకొను ఆచారము ప్రచారములోకి వచ్చియుండును." (ప్రా. ద. భా. చ. పు. 43).

భర్తపేరు స్త్రీల పేర్లకుముందు కన్పిస్తున్న వాటికి ఉదా :- బమ్మెర కేసయ లక్కసానికిన్" (భాగ. పు. 24, ఇక్కడ లక్కసాని బమ్మెర కేసయ ధర్మగేహిని అని "....కేసన తనకు లక్కమాంబ ధర్మగేహినిగా గమనియె ..." (పై ది. పు. 22) అన్న పద్యభాగాన్ని బట్టి తల్లిదండ్రులు పేర్లే గాక వ్యక్తి నిర్దేశానికి భర్తపేరు కూడ స్త్రీలపేర్ల పూర్వభాగాన నిలుపుతున్నట్లు భావించవచ్చు.

భాగవత షష్ఠ స్కంధంనుంచి యట్టిదే మరొక్క ఉదాహరణ చూడవచ్చు. "ఏరుచూరి కులశేఖరు కస్వయ మమ్మడమ్మకున్" (పైది షష్ఠ. 27) ఈ ముమ్మడమ్మ భర్త కస్వయ. "కిసు వన ప్రభువునకును ముమ్మడమ్మను సాధ్వి యిమ్ములను వెలసె (పైది. షష్ఠ 26) అన్న పద్యభాగాన్ని బట్టి ముమ్మడమ్మ కస్వయ భార్య అని స్పష్టపడుతున్నది. ఈ ముమ్మడమ్మ కస్వయలు షష్ఠస్కంధ కర్తయైన ఏర్చూరి సింగయకు తల్లిదండ్రులు. ఇప్పుడు నాగరికత కోసం స్త్రీలు భర్తపేరు వారిపేర్ల తరువాత పెట్టుకుంటున్నారు. కాని సాహిత్యంలో కొందరు స్త్రీలు పురుషునికి గౌరవాన్నిస్తూ వ్యక్తినామానికి ముందే భర్తపేరుకు స్థానం కల్పించారు.

3. గ్రామనామాలు :—

తెలుగు సాహిత్యంలోని ఇంటిపేర్లను పరిశీలిస్తేవాటిలో గ్రామనామాలనుండి ఏర్పడినవే ఎక్కువగా కన్పిస్తున్నాయి. ఈ వర్గానికి చెందిన గృహనామాలను పూర్వోత్తర భాగాలుగా విడదీస్తే ఉత్తర భాగాలు ఆయాపరిసరాల భౌగోళిక పరిస్థితులవలన ఏర్పడినట్టివని మనం గమనించవచ్చు. ఉదా :— ఊరు, కంటి/, గంటి, కుంట,/గుంట, కొండ,/గొండ, కొలను/గొలను, పల్లి, పాటి, ప్రోలు, మంచి, వరం, వాడ, వీడు మొదలైనవి.

-ఆల :- నంద్యాల పురాధిపత్యం వహించడం వలన ఆవంశం వారికి నంద్యాల గృహనామం ఆయినట్లు తెలుస్తుంది.

"—వారలలో నరసింగరాజునం
ద్యాల పురాధిపత్య విభవాతిశయంబు వహించి మించెను.
—తనవంశ మెల్లనం
ద్యాల పదప్రసిద్ధ। దనచారుచ నెంతయు దేజరిల్లగన్". (కళా. 1-26). పింగళి సూరన తన అవతారికలో కృతిపతి నంద్యాల కృష్ణభూవల్లభుని వంశాదికాన్ని వర్ణిస్తూ పై పద్యం చెప్పాడు.

"—భళిర నంద్యాల నారభూపాలకుండ" (కళా. 1-34).

"—నంద్యాల కృష్ణ విభుడు." (కళా.1-85) అని నంద్యాలనుగృహనామంగా కళాపూర్ణోదయంలో పింగళి సూరన సూచించాడు.

ఈదర :— ఇది ఒక గ్రామం. ఈ గ్రామనామమే ఇంటిపేరుగా మారింది.

ఆఱువేల నియోగి శాఖాఖ్యఁ గూడ
నొంది యవ్వేల నాటి నియోగి శాఖ
బ్రథిత మౌనందు నీదర గ్రామమందు
వెలసె నొక వంశమదె ఇంటిపేరు గాగ. (శ్రీ.శం.వి ,అవ.పు.8).

ఊరు :— ఆలూరు, ఉప్పుగొండూరు, గుంటూరు, చెరుకూరుల లోని ఊరు శబ్దానికి గ్రామం అనే అర్థం. ఊరు యొక్క షష్ఠీవిభక్తిక రూపమే అట్లూరి, ఆతుకూరి, ఆలూరి, ఇందులూరి. ఈడూరి, ఏర్చూరి, కందుకూరి, కట్టమూరి, కాండూరి, కాకునూరి, కాళ్ళకూరి, గొబ్బూరి, చెందలూరి, తాడూరి, తాళ్ళూరి, దెందులూరి, దేవలూరి, నండూరి, నెల్లూరి, పాపులూరి, మాటూరి, మునునూరి, మైసూరి, మొరటూరి, రేబూరి, వల్లూరి, విరూరి, సంబటూరి లలోని "ఊరి".

అనుగురాజుతో పాటు తీర్థయాత్ర చేయడానికి అతనితో వెళ్ళిన అతని బంధువులు డెబ్బైరెండు గోత్రాల వారు, 12 ఇంట్లపద్మనాయకులతోపాటు అట్లూరి వారు, ముట్లూరివారు, ముయ్యూరివారు కూడ ఉన్నట్లు పల్నాటి వీర చరిత్రద్వారా తెలుస్తుంది. మొల్ల రామాయణం రచించిన రచయిత్రి మొల్ల గృహనామం "ఆతుకూరి".

"గురులింగ జంగమార్చన
పరుడును శివభక్తిరతుఁడు బాంధవ రహితుఁడున్
గురుఁ డాతుకూరి కేసన
వరపుత్రిని మొల్లయనగ వఱలిన దానన్" (మొల్ల.రా.1-11)

అని ఆతుకూరి మొల్ల తననుగూర్చి చెప్పుకొంది గనుక మొల్ల గృహనామం 'ఆతుకూరి' వారని తెలుస్తుంది.

ఇందులూరి సోమయ్య క్రీ.శ.13వ శతాబ్దికి చెందినవాడు, కాకతిగణపతిదేవ చక్రవర్తి వద్ద దండనాథునిగా, మంత్రిగా ఉన్నాడు. ఇందులూరి ఇంటిపేరు గాగలవారి పూర్వీకులు ఇందులూరి పుర శాసనులగుట చేత వీరికి ఆ ఇంటిపేరు

కలిగింది. కాకునూరి ఇంటిపేరు గలవారి పూర్వుడైన సోమయ మధురాపురానికి పోయి వేదశాస్త్ర పురాణాది వాదాలను కాకునూరింట చేసిన కారణాన ఆ ఇంటిపేరు వచ్చినట్లు ఈ కింది పద్యంవలన తెలుస్తుంది. "వేదశాస్త్ర పురాణాది వాదములను కాకునూరింటఁ జేసిన కారణమున కాకునూరింట వాడని ఘనత గాంచె"(అప్ప పీ.) అనియు

"చరిగొండ సీమలో సంతరించెను గాకునూరను
సర్వాగ్రహార మొకటి --" (అప్పక, పీ.(3) అనియు

అప్పకవి పీఠికలో పేర్కొన్నాడు. అప్పకవి గృహనామం కాకునూరి. ఇతడు 1660 ప్రాంతంలోని వాడు. కాకునూరింటి వాడని చెప్పి ఆ తరువాతి పద్యంలోనే కాకునూరు అను అగ్రహారం అనుటచే ఈ ఇంటిపేరు గ్రామనామమూ లేక పౌరుషనామమూ అనే సందేహం కలుగుతుంది. ఇతని వంశమూల పురుషుడు సోమన 'అభినవ చూతవర్గ్రామం'లో ఉన్నట్లు తెలుస్తుంది. ఇది హైదరాబాదు రాష్ట్రంలోని లేమావిళ్ళ అని కొందరు, కొత్తమామిడి పల్లి అని కొందరు అభిప్రాయ పడుతున్నారు. కాకునూరు అగ్రహారం సంపాదించి ఆ ఊరిలోనే ఒక ఇంటనో లేక ఆ ఊరిలో అదే ఇంటిపేరుగా గల వారింటనో వాదాలు చేసి వుండవచ్చు. ఇది గ్రామనామం, పౌరుషనామం రెండునూ అయి ఉండవచ్చు.

చెందులూరి ఐతనామాత్యుని గూర్చి దుగ్గన తన నాసికేతోపాఖ్యానంలో పేర్కొన్నాడు.

"--శ్రీలు నిండార విలసిల్లెఁ, జెందులూరి--
యయితనామాత్య వరుడు విశ్వవిఖ్యాత యశుడు" (నాసి.1-27)

దానినిబట్టి వారి ఇంటిపేరు 'చెందులూరి' అని తెలుస్తుంది. చెందులూరు గ్రామం ఒంగోలుజిల్లాలోఉంది. కాని ప్రబోధ చంద్రోదయంలో "పెసరు వాయవంశవార్ధి" అని వర్ణింపబడినది. ఒకే వ్యక్తికి రెండు గృహనామాలుండడం ఆశ్చర్యకరం. ఇతని గ్రామం చెందులూరు గనుక అదే అతని గృహనామమై ఉండవచ్చు.

చెందులూరి ఇంటిపేరు గురుస్తుతిలో లక్షణసారసంగ్రహమందు కన్పిస్తుంది.

"చిరభక్తిన్ బొగడెద, మ

ద్గురు నాథుని, బెందలూరి కులపావనునిన్
గరుణానిధి నపరాంతక
హరమూర్తిని, ఘనుని, లింగ నారాధ్యమణిన్"(లక్షణ సా.1-4)
అని బెందలూరి గృహనామం పేర్కొబడింది.

అలానే నెల్లూరి గృహనామంగా కలవారికి వారి నివాసమైన నెల్లూరును బట్టి గృహనామం ఏర్పడింది.

"—నెల్లూరి తరుకాళ మనుజవిభుని"—(విక్ర.1—20)
అని నెల్లూరును ఇంటిపేరుగా జక్కన తన విక్రమార్క చరిత్రలోని కవి ప్రశంసలో పేర్కొన్నాడు. ప్రాచీనాంధ్ర శాసనాలలో ఇది నెల్లూరు, నెల్లూరునాడు, నెల్లూరుసీమ, నెల్లూరు వణితమనికూడ చెప్పబడింది. దీనికి విక్రమ సింగపురమని నామాంతరం. కేతన దశకుమార చరిత్రలోని ప్రథమాశ్వాసంలో ఈ పట్టణాన్ని వర్ణించాడు.

నండూరుకు ఔపవిభక్తిక రూపం నండూరి. ఇది గృహనామం. నండూరి కొమ్మన క్రీ.శ.12వ శతాబ్దివాడు. "వెలనాటి మహామండలేశ్వరుడగు రాజేంద్ర చోడుని ప్రముఖమంత్రి. రాజేంద్రచోడుని యాజ్ఞశిరమున దాల్చి కొమ్మన మంత్రి పాకనాడు ఏకవింశతి సహస్రగ్రామముల గెలుపొందెననియు, శ ౧౧౧౭ నాటి బాపట్ల భావనారాయణస్వామి ఆలయ మందలి శాసనము తెలుపుచున్నది. వీరు కౌశిక గోత్ర కలిత అపస్తంభసూత్రులు. ఆర్వేల నియోగి బ్రాహ్మణులు. బాపట్ల తాలూకా యందలి నండూరు వాస్తవ్యులు. గుంటూరు, కృష్ణ, గోదావరి మండల ములలోని నండూరి వారందరును తొలుత ఈ నండూరు గ్రామంలోని వారే" (దండ నాథులు-పు. 41, కోన వెంకటరాయ శర్మ).

పావులూరి ఇంటిపేరుకూడ పావులూరు గ్రామం వలన ఏర్పడింది.

"ఇల గమ్మనాటి లోపల
విలసిల్లిన పావులూరి విభుడను సూరా
కలితాపస్తంభ ద్విజ
కుల తిలకుఁడ వినుత గార్గ్యగోత్రోద్భవుడన్".

తెలుగున గణిత శాస్త్రం రచించిన మహాకవి పావులూరి మల్లన. ఇతడు పావులూరి గ్రామానికి కరణీకం చేశాడు కనుక వీరి గృహనామంకూడ 'పావులూరి' అయింది. గోదావరి మండలంలోను, బాపట్ల తాలూకాలోను ఈ పావులూరనే గ్రామాలు ఉన్నట్లు తెలుస్తుంది.

ముసునూరి ప్రోలయ నాయకుడు మహావీరుడు, సాహసి. చెదరిపోయిన నాయకులను ఆతడు తన నాయకత్వంక్రింద చేరదీసి మహమ్మదీయులపై తిరుగుబాటు చేశాడు. ప్రతాపరుద్రుని డెబ్భైఐదుగురు సామంత నాయకులలో ప్రోలయనాయకుడు ఒకడు. ముసునూరి ప్రోలయనాయకుని పేరు విన్నంతనే యవనులు వణికేవారట.

మొరటూరి అరుణాచలంగారు (1831 – 95) భరత శాస్త్ర ప్రవీణులు, త్యాగరాజుశిష్యుడు. ఇతని పూర్తిపేరు స్వరకళానిధి పట్టాభి అరుణాచలం. అచ్యుత సముద్రం లేక 'మొరటూరు' అనే గ్రామాన్ని యీనాంగ పొందినందున ఈ ఇంటిపేరు ఇతనికి కలిగినట్లు తెలుస్తుంది.

వల్లూరు గృహనామం, వారికి ఎలావచ్చిందో వల్లూరి సూర్యనారాయణరావు గారు ఇలా పేర్కొన్నారు. "మా వంశమువారు మొదట నెల్లూరు జిల్లాలోనుండి ఇప్పుడు గుంటూరు జిల్లాలో చేర్చబడిన వంగవోలు దగ్గర వల్లూరు గ్రామస్థులు. మా ఇంటిపేరిటి వారు, ఇతర గోత్రముల వారనేక మంది యున్నారు గాని, వారు బాపట్ల, నరసరావుపేట, నరసాపురం మొదలగు పట్టణముల సమీపముననున్న వల్లూరు గ్రామములను బట్టి వారి ఇంటిపేర్లు కూడ మావలెనే ఏర్పడినవి", (వల్లూరి సూర్యనారాయణరావు– స్వీయచరిత్ర, పు.1). ఒకే ఇంటిపేరున్నా వేర్వేరు గోత్రములుగల వారి వంశాలకు ఆ గృహనామాలు గ్రామనామ సంబంధాలుగా ఎలావచ్చాయో చూపించారు.

ఈ గ్రామనామాలలో ఉత్తరపదంగా గల 'ఊరి' అనేది కొంలది మార్పు చెంది 'ఊర' అనికూడ ఇంటిపేరుగా ఉన్నట్లు కన్పిస్తుంది. అన్నవిభుని గృహనామం ఊరె (ఊర) వారు. వీరు శివారాధన తత్పరులు, అర్థిజనకల్ప భూరుహులు, ఊరాగ్రహారమున నివసించుటచేత వీరికి ఊరె (ఊర) అనే గృహ

నామం ఏర్పడినట్లు తోస్తుంది. వీరి వంశానికి మూలపురుషుడైన పెద్దనమంత్రి ఊరాగ్రహార నివాసి అనియు, ఈశపదపద్మ ధ్యాన, సంవిధాన విశ్రాంతుడనీ ఉద్భటారాధ్య చరిత్రలో వర్ణింపబడింది.

ఔకు :— ఔకు ఒక గృహనామం. ఇదికూడ ఔకు గ్రామాన్నిబట్టి ఏర్పడిందే.

"అతిమ్మనృపతి భూకాం
తాతిలకంబైన యవుకు దానేలుచువి
ఖ్యాతిగ నప్పురి పేరన్
ప్రీతిని దన కులము వెలయ బెంపొంది మహిన్" అని

రామరాజీయంలో పేర్కొ-బడింది. "అవుకు (ఔకు) గ్రామం కర్నూలు జిల్లాలోని కోయిలకుంట్ల తాలూకాలో నున్నది. అళియ రామరాయల పెద్దతండ్రియగు తిమ్మరాజు అవుకు పురమును నిర్మించి ఆ సీమకు ప్రభువైనప్పటి నుండియు అతని సంతతివారికి అవుకు వారని ఇంటిపేరు వచ్చినట్లు తెలియుచున్నది. ఈ అవుకు సీమ విజయనగర సామ్రాజ్యకాలంలో నేటి కోయిలకుంట్ల శిరువెళ్ళ తాలూకా ప్రాంతమై యుండును." అని కుందూరి వారి తీర్పు. (ప్రా. ఆం. చా. భూ. 3 భా. పు. 16)

—కంటి/ —గంటి : ఈడ్పుగంటి, పానుగంటి, పొన్నెకంటి, బొమ్మకంటి, వెన్నెలకంటి అనే ఇంటిపేర్లలోని 'కంటి'/'గంటి' అనేవి గ్రామనామాలైన ఈడ్పుగల్లు, పొన్నెకల్లు, బొమ్మకల్లులకు ఉత్తరపదమైన 'కల్లు'నుండి ఏర్పడినవే. ఈ'కల్లు' శిలావాచకం. పానుగంటి ఉదయావనీశుడు పండితారాధ్యుని సమకాలికుడు. చోడ వంశంవాడు. ఇతడు పానుగల్లును పరిపాలిస్తున్న సమయంలోనే (1160) పండితుడు ఈ దేశాన్ని దర్శించడానికి వచ్చినట్లు శాసనాలవలన తెలుస్తుంది. తెనుగు లో మొదటి అచ్చతెనుగు కావ్యమైన యయాతి చరిత్ర కృతికర్త తెలగనార్యుని ఇంటి పేరు పొన్నెగంటి.

విష్ణుపురాణమును తెనిగించిన వెన్నెలకంటి సూరయకవి నియోగి బ్రాహ్మణుడు.

"కవితపుట్టిల్లు వెన్నెలకంటి ఇల్లు—"ననెడు పౌరుషనామధేయంబునిలిపె—
—"సూరనామాత్యవరుడు". (ఆంధ్ర శ్రీ.వి.పీ.పు.5)

"వెన్నెలకంటి సూర్యుడు వివేక గుణాఢ్యుడు" అని విక్రమార్క చరిత్రలో వెన్నెలకంటి గృహనామాన్ని ఉక్కన పేర్కొన్నాడు.

కాకతి :- కాకతీయుల వంశనామం కాకిత, కాకెత, కాకర్త్య, కాకతి అన్న వివిధ రూపాల్లో కనబడుతుంది. ఈ వంశం నామం వీరికి ఎలా కలిగిందన్న అనుమానం కలుగుతుంది. తెలుగువారిలో సాధారణంగా ఇంటిపేర్లు గ్రామనామాల్ని బట్టి ఏర్పడుతుంటాయి. వారు ఆరాధించిన దైవతాలను బట్టకూడ ఇంటిపేరు వంటి ఉపపదాలు ఏర్పడవచ్చు. కాకతి అనే ఊరుపేరును బట్టిగాని, కాకతి అనే దేవతను బట్టిగాని కాకతీయులకు ఆపేరు వచ్చివుండవచ్చు. విద్యానాథుడు రచించిన ప్రతాపరుద్రయశోభూషణం అనే అలంకార శాస్త్రగ్రంథానికి వ్యాఖ్యానం కైసేసిన కుమారస్వామి సోమపీథి "కాకతి" అన్న కులదైవాన్ని ఆరాధించడం చేత వారు కాకతీయులు అయినట్లు వివరించారు. క్రీడాభిరామం అనే గ్రంథం బయలుదేరే కాలానికే కాకతమ్మ అనే దైవతం ఉన్నట్లు తోస్తుంది. "కాకతమ్మ"కు సైదోడు "ఏకవీర" అని యిందులో వర్ణించబడింది. అనుమకొండ దుర్గంలోని కొండమీది పద్మాక్షీదేవే కాకతమ్మో లేక ఈ దేవతకు వేరే ఆలయం ఉండేదో తెలియదు, రాజమహేంద్రవర రెడ్డిరాజ్యాన్ని పరిపాలించిన వీరభద్రారెడ్డితల్లి అనితల్లి వేయించిన కలువచేరు శాసనంలో కాకతీయులు గుమ్మడి తీగెకు పుట్టినట్లు ఒక అద్భుత వృత్తాంతం చెప్పబడింది. దీనికి సంవాది యైన కథనమే సిద్ధేశ్వర చరిత్రలోనూ కనబడుతుంది, ఈ వంశ మూలపురుషుడైన మాధవవర్మ యొక్క కుమారుడు పద్మసేనుడనే రాజు సంతానం లేకపోవడంచేత అనుమకొండ పద్మాక్షిని కూష్మాండాలతో పూజించాడట. కూష్మాండ మంటే గుమ్మడికాయ. ఆదేవి అనుగ్రహం వల్ల పద్మసేనుడికి కొడుకు గలిగాడు. ఈ వృత్తాంతమే కలువచేరు శాసనంలో గుమ్మడి తీగ కథగా సాక్షాత్కరిస్తున్నది. "కాకతి" గ్రామదేవత కాకతమ్మ కావచ్చు. మొత్తంమీద కాకతి గ్రామసంబంధం చేతనే వీరు కాకతీయులు అయి ఉండడం విశ్వసనీయంగా ఉంది. ఈ వంశీయుడైన త్రిభువనమల్లి బేతరాజు అనబడే రెండవ బేతరాజు క్రీ.శ. 1075 – 1111 కాజీపేట శాసనంలో తన తాతయైన బేతరాజును గూర్చి "సామంతవిష్టి వంశః శ్రీమాన్ కాకటి పురాధినాథోబేతః" అని చెక్కించాడు. కాకతి వంశానికి మూలపురుషుడైన యితనిని సామంత విష్టివంశంవాడని, కాకతిపురాధినాథుడనీ చెప్పబడడం గమనించదగింది. రేచర్ల పద్మనాయకులు ఆమనగంటి పురవరాధీశ్వరాధీశ్వరా" అనీ,

చోడవంశం వారు ఒరయూరు పురవరాధీశ్వరులనీ వేయించుకున్నట్లే వీరిది కూడ కాకతిపురమే అయివుంటుంది.

ఈ వంశంలో మొదటి బేతరాజుకు పూర్వం మరోవ్యక్తి కన్పిస్తున్నాడు. అతడు కాకర్త్య గుండ్యన. ఇతడు తూర్పు చాళుక్యుడు. గుండ్యన ఇంటిపేరైన కాకర్త్యపదం కొంత సంస్కృతీకరణం చెందినట్లు తోస్తుంది. (గాలి నః నయ్య వాథూల లేక ప్రభంజనం ఆహో జలపతి అయినట్లు) కాకతి గుండయ కాకర్త్య గుండ్యన అనే ప్రౌఢనామంతో కన్పించినా ఆశ్చర్యంలేదు. ఈతని కులం సామంత ఒడ్డెవంశం. పెద్దాడికి సమీపంలో 'కాకతి' అనేగ్రామం ఉందని చిలుకూరి వీరభద్రరావు పంతులుగారు గుర్తించారు. (కాకతీ. పు.4) కనుక "కాకతి" అనే గ్రామనామమే వీరి వంశనామమయి గృహనామంగా వ్యవహరిస్తున్నారని అనవచ్చు.

—కుంట / —గుంట :— చింతకుంట, చింతగుంట, సూనుగుంట, దూబగుంట మొదలైన గృహనామాలలో శ్వాసనాద భేదాలతో ప్రవర్తితమవుతున్న "కుంట"కు గొయ్యి అనే అర్థం ఉంది. దూబగుంట నారాయణ కవి పంచ తంత్రాన్ని ఆంధ్రంలో పద్యకావ్యంగా రచించాడు. ఈతడు దూబగుంట పురశాసనుడని చెప్పుకున్నాడు. అందుకే ఈతని ఇంటిపేరు దూబగుంట వారని ప్రసిద్ధిచెందింది. కాని కవి ఇంటిపేరు "ప్రబంధవాచకాభరణం" వారైనట్లు ఈ కింది పద్యంలో పేర్కొన్నాడు.

"—ప్రబంధవాచకా

భరణము నాగమాంబకును బ్రహ్మయమంత్రికి నాత్మసంభవున్

సరసుని దూబగుంట పురశాసను నారయ నామధేయునిన్"

ప్రబంధవాచకాభరణశబ్దం విశేషణమైనా కావచ్చు లేక భారతము, వైయాకరణము అనే ఇంటిపేర్లవలే గృహనామమై ఉండవచ్చు. జనమంచి శేషాద్రి శర్మగారు పంచతంత్ర పీఠికలో "ఉదయగిరి సమీపంలో ఉన్న దూబగుంట ప్రాంతంలో కవులుండేవారని ప్రతీతి కలదనీ అదే ఇతనినివాసమై ఉంటుందనీ" పేర్కొన్నారు.

—కురికి / —గురికి :— "పాల్కురికి సోమనారాధ్యుడు సుకవియచె..." (పండి. చ. పు. 6, 22) 12వ శతాబ్దికి చెందిన పండితారాధ్య చరిత్ర, బసవ

పురాణము రచించిన సోమన ఇంటిపేరు పాల్కురికి. నేటి తెలంగాణాలోని నల్గొండ జిల్లాలోని జనగామ తాలూకాలోని వరంగల్లుకు 12 కోసుల దూరంలో వుంది. ఇది ఒక పుణ్యక్షేత్రం. మహమ్మదీయ ప్రభుత్వం ఏర్పడిన తరువాత జనుల వాడుకలోనూ, ఉచ్చారణలోనూ ఏర్పడిన వ్యత్యయాల వల్ల ఇది "పాలకుర్తి" అని వ్యవహరించబడుతున్నా, సోమనాథుని కాలంలో దీనికి పాల కుఱికి అనే వ్యవహారం ఉంది. "సుకృతాత్మ పాలకుఱికి సోమనాథ" అని ప్రాస స్థానాల్లో సైతం పాలకురికి అనే వ్యవహరించాడు. "దీనికి సమీపంలో ఉన్న "ఎలకురికి", "ఉరికురికి" అనే రూపాలు కనిపించుచున్నవి కనుక నేటి పాలకుర్తి అని వ్యవహారంలో వున్న గ్రామం అప్పటి కాలంలో పాలకురికి అని వ్యవహరింపబడి యుండవచ్చు" (పండి. పీ. పు. 9). సోమనాథుడు కాకతీయుల రాజధాని అయిన ఏకశిలానగర సమీపమందున్న పాలకురికి వాస్తవ్యుడని కాకతీయ సంచిక (పుట ౨౦౮) లో బండారు తమ్మయ్య రాశారు. నైజాము రాష్ట్రమందలి ఓరుగంటి మండలంలో పాల్కురికి గ్రామం ఉన్నదట. అక్కడ జన్మించడం చేత అతనికి ఆఊరి లింగమూర్తి పేరు పెట్టి ఉండవచ్చునని ఒక శైవుడు రాశాడు. "పాల్కురికి" దక్షిణ మహారాష్ట్ర దేశంలోని ఒక గ్రామం అని కిట్టెల్ రాశాడు. "కుఱికి", "గుఱికి" అనేవి కన్నడంలో గ్రామ శబ్దానికి పర్యాయ పదాలు. ఇవి తెలుగులోని కఱ్ఱు, కుచ్చి; తమిళంలోని 'కురుచ్చి' అనే గ్రామవాచక పదాలకు సంబంధించినవే. 'కుఱ్ఱు' గోష్ఠ శబ్దభవం. 'కుఱికి'కి కూడ అదే అర్థం. 'కుఱికి', 'గుఱికి' అంతమందు గల గ్రామనామాలు సాధారణంగా కన్నడ దేశంలో కన్పిస్తున్నాయి. 'కుఱికి' తో అంతమయిన 'పాలకుఱికి' గ్రామం కర్ణాట దేశంలోనో కర్ణాట ప్రాంత దేశంలోనో ఉండవచ్చు. శ్రీశైలయాత్ర వర్ణన సందర్భంలో సోమనాథుడు కన్నడ పరుస, ఆరెపరుసల నడకలను వర్ణిస్తూ, ఆ భాషలలో కొన్ని ద్విపదలు రచించాడు. కాబట్టి అతనిదేశం కన్నడం, తెలుగుల కూడలిలో ఉండవచ్చు. ఆంధ్ర కర్ణాట దేశాల కూడలిలో 'పాలకుఱికి' అనే గ్రామం అనంతపురంలోని మడకసిరా గ్రామానికి ఇరవై మైళ్ళ దూరంలో, మైసూరు రాష్ట్రంలోని తుమ్కూరు తాలూకాలో ఉంది. దీనిని ఇప్పుడు 'హాల్కుర్కి' అంటున్నారు. ఇది సోమనాథుని జన్మస్థలం అని ఇతని అభిప్రాయం.

పండితారాధ్య చరిత్ర రచనా సందర్భాన్ని బట్టి నేటి మైసూరు రాజ్యంలోని

తుమ్మూ్కూరు జిల్లాలో తెనుగు, కన్నడదేశాలకు కూడలిలో ఉన్న పాలకురికి గ్రామంలో సోమన్న జన్మించాడనీ, పాల్కురికిలో జన్మించడంచేత ఆ గ్రామం పేరే అతనికి ఇంటిపేరయిందనీ నిర్ణయించవచ్చని పండితారాధ్య చరిత్ర పీఠికలో పేర్కొన్నారు. అయితే సోమన్న పాల్కురికిలోనే జన్మించాడని నిష్కర్షించలేము. అది అతని తాత ముత్తాతల అభిజనం కావచ్చు. పుట్టినవూరు వదలి మరో గ్రామానికి తరలివెళ్ళినపుడు వారికి ఆ గ్రామనామమే గృహనామంగా ఏర్పడి ఉండవచ్చు.

-కొండ / -గొండ — చరిగొండ, తరిగొండ, బెల్లంకొండ, ముదిగొండ, వల్లకొండ,వినుకొండలలోని 'కొండ' మన అందరికి తెలిసిందే. చరిగొండ ధర్మన్న చిత్రభారతం రచించాడు. ఇతని గృహనామమైన చరిగొండ తెలంగాణాలోని మహబూబ్ నగర్ జిల్లాలో ఉంది.

తరిగొండ వెంకమాంబ కడప జిల్లాలోని 'తరిగుండ' గ్రామనివాసి. 'తరిగొండ' అని మనం వ్యవహరిస్తున్నది 'తఱికుండ' గాని 'తఱికొండ' కాదని శ్రీ వెంకటేశ్వర భక్త విజయంలో శ్రీ వెంకమాంబా చరిత్రలో పేర్కొనబడింది.

జక్కన విక్రమార్క చరిత్రలో-

"——బెల్లము కొండ భైరవుడు రు మహామాత్యు ——"(విక్ర 1-4)

అని 'బెల్లము కొండ' అనే గ్రామనామాన్ని పేర్కొన్నాడు.

వినుకొండ నేటి నెల్లూరు మండల మందలి గ్రామం. పూర్వం ఈ వినుకొండ ప్రాంతం పాకనాడుగా ప్రసిద్ధి చెందింది. కవి వంశాన్ని వర్ణిస్తూ——

"నటులది దోరసముద్రము

విటులది యోర్గల్లు కవిది వినుకొండ మహా—(క్రీడా.ప.284)

కవిది వినుకొండ నివాసమని పేర్కొనుట చేత ఆ గ్రామాన్ని అనుసరించి వారి వంశంవారు వినుకొండ వారుగా ప్రసిద్ధిచెంది, అదే వారి గృహనామంగా స్థిరపడి ఉండవచ్చు.

కొండ అనే అర్థంతోనే 'గిరి' ఉత్తరపదాలుగా గల గృహనామాలున్నాయి. గిరి శబ్దం సంస్కృతం. ఇది పర్వతవాచకమే అయినా గ్రామవాచకమై గృహనామాలు ఏర్పడ్డాయి. ఈ గ్రామాలకు సమీపాన కొండ ఉందేమోనని అనుమానం రావడం సహజం. కాని వెదికినా ఒక్కరాయీ కన్పించని ప్రదేశాలకు కూడ ఈపేరుండడం ఆశ్చర్యాన్ని కల్గిస్తుంది. ఇందుకు కారణం వ్యక్తినామం కావచ్చు. 'కొమరంగిరి' గ్రామం రెడ్డిరాజైన కుమారగిరి పేర వెలసింది. కుమారగిరి వికృతి 'కొమరంగిరి'. పుష్పగిరి తిమ్మన 18వ శతాబ్దివాడు. ఇతడు సమీరకుమార విజయాన్ని రచించాడు. ఇతని ఇంటిపేరు పుష్పగిరి.

**కొరళ్ళ** :– కొరళ్ళ అనేది ఒక గృహనామం. ఈ గృహనామం ఎలా ఏర్పడిందో ఈ కిందిపద్యం వలన తెలుస్తుంది.

"షోడశ దానముల్ ఘనులకొసగి, వాసికెక్కు-గొరళ్ళ సుబ్రాయుడతడు"
(ప్రద్యు. 1–64)

"వారు కొరళ్ళ వలసనా యూరుపునం బొదలు సూరదొల్లు నిలుచుటం
బేరగు గొరళ్ళ వారన వారాప స్తంబ సూత్ర వర్తను లవనిన్"
(ప్రద్యు. 1-18)

అనుటచేత కొరళ్ళ గృహనామం కలిగిన వారు పూర్వం కొరళ్ళవలస అనే గ్రామంలో ఉన్నట్లు తెలుస్తుంది. ఇచట వీరికి గ్రామనామమే గృహనామంగా నిలిచింది.

**కొలను** :– 'కొలను' అనే పదానికి సరస్సు అనే అర్థంఉన్నది. ఇది ఉత్తర భాగంగాగల ఇంటిపేరు 'కానుకొలను'. కాని 'కొలను'కు ఔపవిభక్తిక రూపం 'కొలని' అనేది మాత్రం వేరే అర్థంలో వచ్చినట్లు తెలుస్తుంది.

"కొలని ప్రతాపరుద్ర నృపకుంజరుచేత నరేడు సాంణి--" అని శ్రీనాథుడు కొలని గృహనామాన్ని పేర్కొన్నాడు.

"ఇలవెలనాటి గొంక వసుధేశు తనూభవుడైన చోడభూ
తల పది చోడ పట్టము ముదంబున గట్టి భుజాబలంబునన్

గొలను జయించి యందు రిపుకుంజరు భీముని జంపి
యాంధ్ర భూతలము పదారువేలు సంతతస్థితి నేలె సురేంద్రులీలన్"
(భీమే- 1-49)

అనుటచే వెలనాటి రాజేంద్రచోడుని సిరిపురము శాసనంలో అతడు కొలను జయించి దాని మండలీకుడైన భీముని చంపెనని చెప్పబడినందున 'కొలను అనేది వీరి ఇంటిపేరుగా ఏర్పడినట్లు భావించవచ్చు. దండి మహాకవి తన దశకుమార చరిత్రలో ఆంధ్రదేశాన్ని వర్ణిస్తూ అందొక మహాసరస్సు కలదని, అది ఆంధ్ర నగరికి సమీపాన ఉందని వ్రాశాడు. ఇది పశ్చిమ గోదావరి జిల్లాలోని కొల్లేరు సరస్సు. దీనికే సరసీపురి అనియు, పద్మినీపురం అనియు పేర్లు కలవని కుమారి చెప్పారు బహుశా ఈ కొలను ప్రాంతాన్ని జయించడంవల్లే ప్రతాపరుద్రుడికి ఈ గృహనామం ఏర్పడి ఉండవచ్చు.

గని :- గని తిమ్మానాయుడు కృష్ణరాయల నాటి వాడు. నంద్యాల తాలూకాలోని గని రాజధానికి ముఖ్యనివాసంగా చేసికొని ఉన్నందున ఇతనికి గని తిమ్మానాయుడని వ్యవహారం కలిగింది. అచ్యుత దేవరాయల ప్రభుత్వ కాలంలో గుండ్లకమ్మ నదీ సమీపాన బట్టు కోట అనే పట్టణంలో జాబోలు తిమ్మరాజను నతడు రాయల కోట నాక్రమించగా. ఆతనిని చంపడానికి రాయలు ఇతడిని పంపించాడు. తిమ్మరాజును చంపి రాయలచే మన్నన పొందినాడట ఈ గని తిమ్మానాయుడు. వెలుగోటి వారి వంశావళి యందును, వెలుగోటి వారి వంశచరిత్రయందును ఈతని ప్రశస్తి ఉంది.

గుండిమెడ :- చోడబల్లి కుమారుడు కామచోడదేవ మహారాజు. గుండిమెద రామన్న ఈతనివద్ద తంత్రపాలునిగ ఉండి అధికారం వహించి బలదర్పాలతో తేజరిల్లాడు. ఈతని పూర్వులు 'కొండ్రవాటి' విషయంలో 'గుండిమెడ' అనే గ్రామం (గుంటూరు తాలూకాలోనిది) అగ్రహారంగ పొందారని క్రీ శ. ౧౧౫ రా నాటి శాసనంలోని_

"త్రిభువన గీత కీర్తినర
దేవశిఖామణి 'కామ' ధారుణీ
ప్రభుతనయుండు మాండలిక
భర్గుడు భర్గ పదాబ్జషట్పదుం

డ భినవరాము డర్యమకు
లాగ్రణి 'గుండియపూండి' భక్తితో
త్రిభువన మల్లదేవుడు పి్ర
తీతిగ "గుండనకిచ్చెఁ బ్రీతితోన్". అనే

(గవర్న మెంటు ఏపిగ్రాఫిస్ట్స్ కలెక్షన్ సం. 166 – 1899) పద్యం వలన తెలుస్తుంది. క్రీ. శ. 1091వ సం॥ నాటి త్రిభువన మల్లిదేవచోడ మహారాజులుం గారి శాసనమందలి–

"శ్రీ మద్గుండి మడాభిదాన విబుధ గ్రామాధిపస్సత్యవాక్
ధర్మ— —" (ఎ.ఆర్.196–1889; కొణిదెన–నరసరావుపేట తాలూకా,
గుంటూరుజిల్లా.

అనే పంక్తుల వల్ల అన్నయమంత్రి కాశ్యప గోత్రుడనీ, గుండన కుప్పాంబల సత్పుత్రుడనీ, గుండిమెడ గ్రామాధిపుడనీ, త్రిభువన మల్లదేవ భూవిభునకు మహామాత్యుడనీ తెలుస్తున్నది. కొణిదెన తెలుగు చోళ చక్రవర్తుల ఏలుబడిలో 'గుండిమెడ' వారు కరణం వాళ్ళు మహామాత్యులుగా, దండ నాధులుగ కీర్తిపొందారు.

–చర్ల :- అలఘచర్ల, కంచెర్ల, బొడ్డుచర్ల, మోచర్ల లోని 'చర్ల' చెఱువు బహువచన రూపానికి ద్వితీయాది విభక్త్యంగమైన 'చెఱువుల' నుండి ఏర్పడింది, అలఘచర్ల వారి ప్రశంస చాటుపద్యమణిమంజరిలోను, రెడ్డిసంచికలోను కన్పిస్తుంది. వీరు ఏరువ చోడరాజులను ఆశ్రయించి వారికి సంగ్రామ రంగంలో అండగానిల్చి శత్రువుల బారినుండి ఏరువ రాజ్యాన్ని రక్షించి ఏరువ 'స్థాపనాచార్య' అనే బిరుదాన్ని వహించిన మహనీయులు అలఘుచర్ల వారే. ఈ విషయం వారి బిరుదు వలన తెలుస్తుంది. ఈ విషయం చాటు పద్యమణి మంజరిలో ఇట్లు కన్పిస్తుంది. "పల్లవుండను రాజు యేర్వసింహాసనంబునకెత్తి నడచిన యేర్వరాజు తను అలఘచర్ల నాయక వర్గంబుల పిలిపించి కదనంబున కేర్పరచి--- శరణంబు వేడిన, గాచి పల్లవుల బిరుదంబు గైకొని తమ్మేలిన యేరువరాజు సముఖంబున బెట్టి విన్నవించిన అన్నపాలుండు మెచ్చి యిచ్చిన బిరుదు లెట్టివనిన" (ఆంధ్ర. భూ. పు. 557) అనుటచే వీరిది పూర్వం ఏరువ వంశనామమని తెలుస్తుంది.

కంచెర్ల గోపన ఖమ్మంమెట్టు జిల్లా నేలకొండపల్లిలో జన్మించాడు. తండ్రి కంచెర్ల లింగన మంత్రి అని తెలుస్తుంది. గుంటూరుజిల్లా వినుకొండ తాలూకాలోని పెదకంచెర్ల మొదలైన గ్రామాలలోని ఇతనిశాఖ, గోత్రం, ఇంటి పేరు గల బ్రాహ్మణులున్నారు. వారు ఇతని జ్ఞాతులం అనిచెప్పుకుంటారు. ఇతడు తనను గూర్చి దాశరథీ శతకంలో_

"అల్లన లింగమంత్రి సుతుడత్రిజ గోత్రజుడాది శాఖకం
చెర్లకులోద్భవుండన ప్రసిద్ధుడనై భవదంకితంబుగా
నెల్లకవుల్ నుతింప రచియించితి గోపకవీంద్రుడన్ జగ
ద్వల్లభ నీకు దాసుడ షి దాశరథీ కరుణాపయోనిధీ।" అని

కంచెర్ల తన గృహనామంగా చెప్పుకొన్నాడు. కంచెర్ల నివాసులు గనుకనే వీరికిది గృహనామమయింది. ఈ విషయం రామదాసీయంలో ఉంది.

బొడ్డుచర్ల ఒక ఇంటిపేరు. ఇదికూడ గ్రామంనామంనుండి ఏర్పడిందే. ఈ గృహనామ ప్రసక్తి ఇలాఉంది.-

"____ధృతిమంతుడు బొడ్డుచర్ల తిమ్మన భళిరే"। రాయలకు చదరంగపు ఎత్తులు వేయడంలో చాలా ఆసక్తి ఉంది. బొడ్డుచర్ల తిమ్మన అనే కొవ్వూరు కరణం కవీశ్వర దిగ్దంతి అనే ప్రతిష్ఠగలవాడై కృష్ణదేవరాయలుతో చదరంగం ఆడుతుండేవాడు. శ్రీకృష్ణదేవరాయల పక్షంలో ఎందరో ఆలోచిస్తూ ఎత్తువేస్తున్నా ఇతడొక్కడే ఎదురెత్తువేసి ఆటగెలిచేవాడట. అతని శక్తికి సంతోషించి కొవ్వూరు గ్రామానికి కృష్ణరాయపురమనే నామం ఏర్పరచి రాయలు సర్వాగ్రహారంగా అతనికి ధారపోసి పై విధంగా శ్లాఘించినట్లు చాటుపద్యమణిమంజరి పేర్కొంది.

_చెళ్ళ :- "ఇది సకల సుకవికుల మనోహర కవిత్వ వైభవ మంచెళ్ళ రఘునాథాచార్య తనూభవ వాసుదేవకవి విరచితంబైన గంధవహంబను___" (గంధ.పు.32 ఆశ్వా.గ) అని మంచెళ్ళ వాసుదేవకవి తననుగూర్చి చెప్పుకుంటూ మంచెళ్ళ గృహనామకుల నిలా శ్లాఘించాడు. "వసుధ లోపల మంచెళ్ళ వారి యిల్లు, శారదాదేవి నాటక శాలయండ్రు వాసుదేవుని కవితావిలాస మచట; మొలక బంగారు గజ్జెలమ్రోత గాదె"।,

రావెళ్ళవారు విజయనగర సాళ్వ, తుళువ, ఆర్వీటి వంశాధిపుల సామంతులుగ వున్నారని కుందూరి ఈశ్వరదత్ చెప్పారు.

"సీకట కర్ణాట సింహాసనంబును
నెల్లగా రావెళ్ళ మల్లఘనుడు" అని చాటువులలో పేరు

గాంచిన రావెళ్ళ మల్లభూపాలుడు నరసరాయల, వీర నరసింహరాయల, కృష్ణ రాయల కాలములో వారికి సేనాధిపతిగ సామంతుడిగ నుండినట్లు తెలియుట వలన రావెళ్ళ గృహనామం 16వ శతాబ్దిలోనే కన్పిస్తుంది.

మాడయకవి నియోగ బ్రాహ్మణుడు. శ్రీవత్సగోత్రుడు. 'మైరావణచరిత్ర' అనే మూడాశ్వాసాల పద్యకావ్యాన్ని రచించి లేజెళ్ళ గోప మంత్రికి అంకితం చేశాడు. కృతిపతిని గూర్చి 'లేజెళ్ళ యబ్బధీమణిగోపా' అని తృతీయాశ్వాస పద్యంలోను 'లేజెర్ల యబ్బమంత్రి గోపయామాత్య' అని కృత్యాదిలోను ఉండడం వల్ల ఈ లేజెర్ల అనే శబ్దం కృతిపతి గృహనామం అని తోస్తుంది. కాని ఈ ఆశ్వాసాంత పద్యాలను బట్టి చూస్తే ఇతని ఇంటిపేరు 'కాండవ' వారని అన్పిస్తుంది.

"కవిజన మిత్ర। బంధుజన కల్పమహీరుహ। సర్వధారుణీ
ధరివర సత్సభాంతర ప్రధాన నుతస్ఫుట ధీవిచార। కాం
డవ కుల కుంజ భాస్కర——"
"—విమల వాగ్విలాస। ఘన బంధుర కాండవ వంశవర్ధనా।"
(ఆం.క.త.సం.6, పు.260).

మొదట 'కాండవ' గృహనామం కలిగి తరువాత 'లేజర్ల' వారయి ఉండవచ్చు.

_నాటి :- కాసలనాటి, పాకనాటి లోని_నాటి 'నాడు'కు షష్ఠీవిభక్తికరూపం. ఆంధ్ర బ్రాహ్మణులలో కాసలనాటి వారున్నారు. కాసల నాడులోని బ్రాహ్మణులే కాసలనాటివారు. కాసలనాటిని తెల్పే ప్రసిద్ధమాంధ్ర కావ్యం క్రీడాభిరామం. కాసలనాటి మాధవుని కుమారుడును, మీసాల అప్పయ్యగారి మేనల్లుడు అయిన గోవింద మంచనశర్మ, అతని స్నేహితుడు ఓరుగల్లులో ప్రవేశించి వింతలు తిలకించినట్లు తెలుస్తుంది. శ్రీనాధుని చాటువులలో కాసలనాటి కాంతల వర్ణన కన్పిస్తుంది.

కొసల్నాటి శ్రేష్ఠుడు
మీసాలప్పయ్యగారి మేనల్లుడు భా
స్త్రీసుర తిలకుడు కుసుమ శ
రాసీనము డంద్రినగర యాత్రోన్ముఖుడై".

"---కొసల్నాటి కనకాంగిని చూచితి సీశ్వరేవునన్" అని శ్రీనాథుని చాటువులలో ఉంది. ఈ కొసలనాడు తెలంగాణంలో హైదరాబాదు, వరంగల్లు జిల్లాలకు ఉత్తర ప్రాంతం, మెదకు, కరీంనగర్ జిల్లాల్లోని కొంతభాగం అని కొసలనాటిని గూర్చి కుందూరి ఈశ్వర దత్తుగారు తమ ప్రాచీన ఆంధ్ర చారిత్రక భూగోళంలో చెప్పారు.

పాకనాటి :—"---పాకనాటింటి వాడవు, బాంధవుడవు" అని భీమఖండంలో సూచించబడినందువలన శ్రీనాధుని గృహనామం 'పాకనాటివారని' భ్రమ పడుతున్నారేగాని 'పాకనాటి' గృహనామమని ఎక్కడా కన్పించదు. పాకనాడనేది నియోగులలో ఒక శాఖకే పేరుగా ఉందిగాని ఒక కుటుంబానికి ఇంటిపేరుగా కన్పించదు. వైదికులలో వేగినాటివారు వెలనాటివారు మొదలైనపేర్లు, నియోగులలో ఆర్వేలవారు, పాకనాటివారు మొదలైన పేర్లు గల శాఖలున్నాయి. పాకనాడు ఆనాడు 21000 గ్రామాలతో కూడిన దేశం. ఈతనిది భారద్వాజ గోత్రమనీ, ఆపస్తంభ సూత్రమనీ యజుశ్శాఖ అనీ తెలుస్తుంచేగాని ఇంటిపేరుగా కన్పించడం లేదు. శ్రీనాధుని ముందు'పాకనాటి' అనేపదం అనుబంధంగా ఎక్కడాకన్పించదు.

నాదెండ్ల :— నాదెండ్ల గోపన ఇంటిపేరు 'నాదెండ్ల' వారు.

"కొమరు దీపించు నాదెండ్ల గోపవిభుడు" (ఉద్భ.1–16)

అని నాదెండ్ల గోపన్నను గూర్చి తెనాలి రామలింగకవి తన ఉద్భటారాధ్య చరిత్రలో పేర్కొన్నాడు.

"తిమ్మయ మంత్రి సుతుడు
ధీసమన్వితుడు నాదిండ్ల శాసనుడు
భాసుర కీర్తి గోపప్రధానుండు" (శ్రీకృష్ణా.ద్వి.పు.86

గుంటూరు జిల్లాలోని నాదెండ్ల గ్రామం వీరి నివాసస్థలం. నాదెండ్ల శాసనుడు గనుక ఇతనికి ఆ గ్రామనామమే గృహనామంగా స్థిరపడింది.

**పంట – దేసటి** :– పంట, దేసటి శబ్దాలను గుర్తించి చూద్దాం.

"---పంటాన్వయ గ్రామణీః (కా.శ.7-266)
"---శ్రీమద్దేసటి వంశ గ్రామణీః (పైది. 2-1)
---శ్రీసాధక సుచరిత్రా - దేసటివేమాః (హరి.పూ.భూ.9-1)

పంట మహాన్వయంబు పాకనాటి దేశంబున భద్రపీఠంబున నధివసించి, సింహ విక్రమనగర, దువ్వూరు, గండవారాది పట్టణంబులు నిజ నివాసంబుగా"– (భీమ. 6-32)

పంట–దేసటి వంశాన్వయులుగా ప్రసిద్ధిగన్న ఈ ప్రోలయ వేమారెడ్డి పూర్వ వంశజుల గురించి వివిధ సమాచారాలు పరిశీలించవలసి ఉంది. ఉపలబ్ధ మయిన నేటి సమాచారాలలో కొండవీటి దండకవిలె-కైఫీయతులు రెండూ వీరి పూర్వ నివాసం నేటి ఒంగోలు తాలూకాకు చెందిన 'చదలువాడ' పురమనీ, వీరిది దొంతి గృహనామమనీ ఈ కుటుంబీకులలోనే కొందరు ఓరుగంటికి పోయి ఆ ప్రాంతాలలో స్థిరపడ్డారనీ ఆ తరువాత ఈ వంశంలోని అల్లాడరెడ్డి కొంత బంధు పరివారంతో కొండవీడుకు తరలివచ్చాడనీ తెలుస్తుంది.

"దొంతి అనేది వంశనామము లేక ఇంటిపేరుగా వాడుకొనుచున్న రెడ్డి వంశజులు నాటి కాలమందును, నేడును మన రాష్ట్రమందు కలరు. వాఙ్మయ గ్రంథములలో పంట వంశాన్వయమని లేక పంట-దేసటి వంశాన్వయమని లేక కేవలము దేసటి వంశాన్వయమని పలుకీతులలో పేర్కొనుట కానవచ్చుచున్నది. శాసనములలో మాత్రం పంట వంశ కులామృతాంభోనిధి అని పేర్కొనెను". (ఓరు.చ.పు.42).

ఈ దేసటి శబ్దము పూర్వం ఒక గ్రామానికో ప్రాంతానికో అధికార సూచనగా వాడివుండవచ్చు. వీటిలో అధిక భాగం పేరుకు చివరనే ఎఱదేసటి, మల్లిదేసటి, కొండదేసటి, కాటయదేసటి, దేసటి మహాసామంత నంబయ అని చెప్పబడడం కన్పిస్తుంది. కాకతి ప్రతాపరుద్రుని కాలంలో వున్న 72 నాయకులలో ఒక నాయకునికి దేసట్ల పురవరాధీశ్వర–ధన్నాలకోట రాయవేశ్యాభుజంగ అని ఒక బిరుదుగా చెప్పబడింది. కనుక ఇది పూర్వకాలంలో ఒక అధికార ప్రాంతానికి చెందిన గ్రామం అని స్పష్టం. "సంస్కృత 'దేశస్థ' శబ్దానికి వికృతియైన ప్రాకృత

'దేసట్ట'కుమార్పాటు మన చర్చలోని దేసటి". (తూ.దొణప్ప).

అలాగే పంట శబ్దం సహితం ఒక అంతర్భాగమైన చిన్న రాష్ట్రపరంగా వాడి వుండడం కొన్ని శాసనాలలో కన్పిస్తుంది. ఈ పంట, దేసటి శబ్దాలు రెండూ మొదట గ్రామనామాలై, విశేషించి ప్రాంతీయ సూచకాలైనట్లు అధికారపరంగా వాడబడుతూ కాలక్రమంగా వంశార్థ సూచకం అయినట్లు కన్పిస్తుంది.

అలాగే 'పంట' అన్నది కొన్ని గ్రామాల సముదాయంగల రాష్ట్ర శబ్దవాచకమై, రానురాను ఆ అర్థం గూడా తొలగిపోయి, ఆ ప్రాంతంలో నివసించిన రెడ్డి వీరకుటుంబాలకు అది అన్వయం అయినట్లును, దాన్నే వారు అధికార వ్యవహారాలలో గూడ వాడుకొని వున్నట్లును, నిదర్శనాల వలన తెలుస్తుంది. పంట వంశీయులు అధికంగా పూర్వం నెల్లూరు, దువ్వూరు, గూడూరు, కావూరు, గంధవరం, రావూరు మొదలైన ప్రాంతాలలో నివసించారు.

-పట్టు/ -పర్తి : 'పట్టు'కు ఔపవిభక్తిక రూపం 'పర్తి'

'—— సత్పండితు డబ్బమంత్రి కనుపర్తి పురాన్వయ వార్ధి పూర్ణచం
దుఁ్రండనిలోకులందఱు నెఱుంగు టకున్ నుతిసేయ నేటికిన్"

(అని. చ. 1-29: పీఠి. పు. 6)

అని పేర్కొనబడడంచేత ఇతడు కనుపర్తి నివాసుడని తెలుస్తుంది. కనుపర్తి అబ్బయామాత్యుడు అని రుద్ధ చరిత్రను రచించి మంగళగిరి నృసింహస్వామికి అంకితం చేశాడు. ఇతడు 18వ శతాబ్దివాడు. కనుపర్తి గ్రామం గుంటూరుజిల్లాలో ఉంది. అదే అబ్బయామాత్యునికి గృహనామమైంది.

-పల్లి, -ఫల్లి : అడుసుమల్లిలోని 'మల్లి' శబ్దం కాటేపల్లి, గాజులపల్లి, గుంటుపల్లి, చింతలపల్లి, తామరపల్లి, దగ్గుపల్లి, దేవులపల్లి, పారుపల్లి, బలిజేపల్లి, మల్లంపల్లిలలోని ఉత్తర భాగమైన 'పల్లి' శబ్దానికి రూపాంతరం.

"కాటేపల్లి ముఖ్య గణప వర గ్రామ
శేఖర శిష్టవశిష్ఠ గోత్ర ---" అని పేర్కొనుటచే

కాటేపల్లి మజరా గ్రామమగు గణపవరమితని స్వగ్రామమని తెలియుచున్నది.

కొన్ని తాళపత్ర ప్రతులలో 'కామేపలి' ముఖ్య గణప వరగ్రామ' అని వ్రాసియున్నది. గుంటూరు జిల్లా నరసరావుపేట తాలూకాలోని కామేపల్లి గణపవరాలున్నాయి. ఈ గణపవరం చిలకలూరిపేట వద్దనున్నదై యుండవచ్చని విద్వాన్ కె. రామానుజాచార్యులను ఆంధ్ర పండితులు తెలిపిరి. 'గణప' అను శబ్దము కన్పించుచుండుటచేనిది కాకతీయ గణపతి చక్రవర్తి యిచ్చిన అగ్రహార మేమో। ఆ అగ్రహారం నామమే ఇంటిపేరుగా మారియుండును.

"గణప వరాన్వయంబునిధి కైరవ బాంధవు డప్పనార్యుల
క్ష్మణకవి వేంకటార్యమణి సంతత శోభన కీర్తి సంతతుల్"

(శ్రీ ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసము–గణప వరపు వేంకట కవి. పు. 296) అకాడమి.

"——సంమోదిత సితి గళుండై కాటెపల్లి వంశకలశార్ణవ
శరచ్చంద్రుడును కాటెపల్లి పురవర గ్రామాగ్రహార రాజ్యలక్ష్మి"
(విష్ణుమి.1–25).

"——కాటెపల్లి సర్వయామాత్య పెదవీర సచివరుడు" (పై ది.1–57).

అని కాటెపల్లి గృహనామాన్ని పేర్కొన్నాడు సోమనాథుడు. కాటెపల్లి పురాన్ని అగ్రహారంగా పొంది వుండడంవలన వీరికి ఈపేరు కలిగినట్లు విష్ణుమితో్రి పాఖ్యానంలోని పై పద్యంవల్ల తెలుస్తుంది. కనుక వీరికి ఈ అగ్రహార నామం అయిన 'కాటేపల్లి' గృహనామంగా మిగిలింది. గుంటుపల్లి అనేది ఒక గృహనామం.

"కమల బాండమున గల్గిన నందవరంపు టింట్లలో
బ్రముఖుండు రాయని ప్రభుని భాస్కరుడే నెఱదాత, పిమ్మటన్
విమల గుణౌఘ 'గుంటుపల్లి వీరయ్య ముత్తడె' దాత, భట్ట సం
భ్రమ ఘన దాన యాఢి నొక పాటి వదాన్యుల నెన్న నేటికిన్
(చాటువు)

ఇతడు గుంటుపల్లి ముత్తడు. రాయని భాస్కరుని వలెనే ముప్పది ఇద్దరు మంత్రుల్లోని వాడు. దానశీలి అని శతక కవుల చరిత్రలోని పై పద్యం వలన

తెలుస్తుంది. "గుంటుపల్లి తిప్పనా మాత్యకుంజరుడు.." వి. మి. 1-34) అని 'గుంటుపల్లి'ని తిప్పన గృహనామంగా పేర్కొన్నాడు.

చింతలపల్లి ఛాయాపతి ఇంటిపేరు చింతలపల్లి వారు.

"...కీర్త్యనపాయ
శ్రీయుత చింతలపల్లి
ఛాయాపతి నామధేయ సరసవిధేయా..." రా.వా.పు.25)

అని రాఘవాభ్యుదయ రచయిత చింతలపల్లి ఛాయాపతిని గూర్చి పేర్కొబడింది. చింతలపల్లి ఛాయాపతి పాలమూరు (మహబూబ్‌నగర్) మండలంలోని గంగాపుర నివాసి అనీ ఇతని తాతయైన వీరరాఘవకవి మధురవాణీ విలాసాన్ని రచించెననీ కీ.శే. సురవరం రాశారు. మధురవాణీ విలాసకర్తయైన చింతలపల్లి వీర రాఘవకవి 18వ శతాబ్దిలోని వాడై వుండునని వీరేశలింగం పంతులుగారు ఊహించారు. ఈ వంశంలో మొదట ప్రసిద్ధిచెందినవాడు ఎల్లయ. ఛాయాపతి 17-18వ శతాబ్దులకు చెందినవాడని చెప్పవచ్చు.

విజయనగర చక్రవర్తులకు ప్రముఖ సేనానాయకుడైన వీర కృష్ణారెడ్డి అనే సార్థక నామధేయం కల వీరుడు శ్రీకృష్ణదేవరాయల కాలంలో కడప మండల ప్రాంతంలో ఉండి ఆ ప్రాంతపు పాలనా వ్యవస్థ చూస్తూ ఉండేవాడు. శ్రీకృష్ణదేవ రాయలతరువాత ఇద్దరుతమ్ములతోనూ భరద్వాజ గోత్రుడైన తన పురోహితునితోను గౌతమగోత్రుడైన కరణంతోను కడప మండలంలోని జనుంపల్లి అనేగ్రామంనుండి సైన్యసమేతంగా బయలుదేరి కర్నూలువద్ద తుంగభద్రానదిని దాటి అక్కడినుండి ఉత్తరంగా వెళ్ళి కృష్ణానదిని కూడ దాటి ఆనదికి ఉత్తరతీరంలో ఉన్న 'వేపల్ల' గ్రామం చేరుకున్నారట. వీర కృష్ణారెడ్డి జనుంపల్లినుండి వచ్చాడు గనుక ఇప్పటికీ ఆరాజుల ఇంటిపేరు జనుంపల్లి వారనే ఉంది. వారిది పెనుబానిగోత్రం. అని కప్పగంతుల లక్ష్మణ శాస్త్రిగారు తమ "సాహిత్య సంస్కృతీ కేంద్రంగా వనపర్తి" అన్న వ్యాసంలో పేర్కొన్నారు.

తామరపల్లి తిమ్మయ తూర్పు గోదావరి జిల్లా రామచంద్రపురం తాలూకా లోని 'తామర పల్లి' నివాసి. ఈ వంశం వారికి నివాస గ్రామ నామమే గృహ నామంగా మారింది హరివంశంలో ఆశ్చర్య పర్వంలోని శేషధర్మాన్ని తామరపల్లి

తిమ్మయ్య అనువదించాడు. ఇతడు 16వ శతాబ్దివాడు.

ఇక దగ్గుబల్లి గృహనామాన్ని గూర్చి పరిశీలిద్దాం.

"---కవితా విశేష దగ్గుబల్లి తిప్పనార్య ప్రియ తనూజ దుగ్గననామధేయ---" (నాసి.ఆశ్వా.గ.) అని దగ్గుపల్లి దుగ్గన తన తండ్రిపేరును చెప్తూ తన గృహనామాన్ని 'దగ్గుపల్లి'గా పేర్కొన్నాడు. నాసికేతోపాఖ్యానంలోని ప్రథమాశ్వాసంలో-

"సత్కవితా గుణప్రసా
దితమతులు దగ్గుబల్లి కవితిప్పయ దుగ్గని గద్యముల్"
(నాసి. 1-15).

అనడంచేత ఇతని పేరుముందు తన తండ్రిపేరు జోడించబడింది. తండ్రిపేరుతో అనుబంధింపబడిన కవిపేరుకు విశేషణంగా 'దగ్గుబల్లి కవి' అని ఉండడంచేత వీరి నివాసం దగ్గుపల్లి అని స్పష్టంగా తెలుస్తున్నది. కనుక వీరి నివాస గ్రామం అయిన 'దగ్గుపల్లి' గ్రామనామమే యీ కవికి గృహనామమైనట్లు కన్పిస్తున్నది.

క్రీ. శ. 12వ శతాబ్దిలో జైనమత వ్యాప్తిని అణచిన శైవ మతస్థులలో మల్లంపల్లి పల్లినాథుడు ముఖ్యుడు. ఈయన ఏకోరామారాధ్యుని కొమారుడు ఈయన కొలను పాకలో ఒక తటాకాన్ని తవ్వించి గ్రీష్మకాలంలో ఒక రాజుయొక్క దప్పిని తీర్చినందువల్ల ఆ రాజువలన మల్లంపల్లి అగ్రహారాన్ని పొందాడట. వీరిది హరితస గోత్రం.

"--అం: దేకోరామాన్వయ
మందు దయించిన మహాత్ములార్జించిరి కీ
ర్తిందగు మల్లమపలి, వా
రందుండుట నింటిపేరు నదెయై చెలగున్" (సత్య. ఉ.
అవ. పు. 9).

అని మల్లంపల్లి గ్రామవాసులైనందున వారికాపేరు గృహనామమైనట్లు మల్లంపల్లి మల్లికార్జునుడు తన గృహనామావతరణం గూర్చి చెప్పాడు.

-పాక : తాళ్ళపాకలోని 'పాక' తమిళ పదమైన 'పాక్కం' నుండి వచ్చింది. పాకలతో కూడిన చిన్నపల్లె అని దీని మౌలికార్థం.

"భరద్వాజస గోత్ర
పావన శ్రీ తాళ్ళపాకన్నయార్య"
"---సార్వభౌము నసఘ శ్రీ తాళ్ళపాకన్నమాచార్య--"
(పరమయో. పు. 3-4)

అని తాళ్ళపాక గృహనామం అన్నమాచార్యుల గృహనామంగా కన్పిస్తుంది. తాళ్ళపాక కడపమండలంలోని ఒక గ్రామం.

_పాటి : ఎడపాటి, గొట్టెపాటి, జానపాటి, పూసపాటి, పైడిపాటి, భమిడిపాటి, రావిపాటి లలోని ఉత్తరపదం 'పాటి' ఆయా గ్రామనామాల ఉత్తర పదమైన 'పాడు'కు ఔపవిభక్తిక రూపం. ఇది శిథిలమైన జనావాసాల లేక దుర్గాల అవశేషమైనట్టి అనేఅర్థం ఇస్తుంది. ఎడపాటి ఎఱ్ఱయ కవి నియోగ బ్రాహ్మణుడు. సోమయామాత్యుని పుత్రుడు. కౌండిన్య గోత్రుడు. ఎడపాడు గ్రామ కరణం. అతని గ్రామనామాన్ని బట్టి అతని ఇంటిపేరు ఏర్పడి వుండవచ్చు. సాధారణంగా కరణీకం చేస్తున్న కరణాలకు తమ ఇంటిపేర్లు నమసిపోయి ఆ ఊరిపేర్లే ఇంటి పేర్లుగా మారటం సర్వసామాన్యం. ఈతని ఇంటిపేరు 'పెదపాటి' అని కొన్నిచోట్ల కన్పిస్తున్నా, ఇది సరికాదని ఆంధ్రకవితరంగిణీ కర్త చెప్పారు. మల్హణచరిత్ర అనే మూడు ఆశ్వాసాల ప్రబంధం రచించాడు. కుమార నైషధాన్ని కూడ ఇతడు రచించినట్లు జగ్గన కవి ప్రబంధరత్నాకరంలో ఇచ్చిన ఉదాహరణల వలన తెలుస్తుంది. ఇతడు 16వ శతాబ్దివాడు.

గొట్టెపాటివారు కృష్ణా, గుంటూరు, చిత్తూరు, విశాఖపట్టణం జిల్లాలలో ఉన్నారు. చిత్తూరుజిల్లా, చంద్రగిరితాలూకా, వళ్ళివేడు గ్రామ సమీపంలో 'గొర్రెపాటి వారిపల్లె' అనే పేరుతో ఒకగ్రామం ఉంది. ఈ గ్రామంలో ఉన్న వారంతా గొట్టెపాటివారే. ప్రతిచోట గ్రామనామం గృహనామంగా మారుతుంది. కాని ఈ పల్లె ఇటీవల ఏర్పడింది గనుక ఇచట ఆ గృహనామం కలిగిన వారివలనే ఆ పల్లెకు ఆ పేరు కల్గినట్లు తెలుస్తుంది. వీరికి ఆ గృహనామం కలిగి వుండడానికి కారణం 'గొట్టెపాడు' గ్రామంతో వారికివున్న సన్నిహిత సంబంధమే.

పూసపాటి అమలరాజు ప్రసక్తి పూసపాటి తమ్మ భూపాలుని శ్రీకృష్ణ విజయ కావ్యంలో ఉంది. (శ్రీ కృ. వి. 1-100). పూసపాటి వారి కాలంలో

వెలువడిన తెలుగు కావ్యాలలో అన్నిటియందునూ అమలరాజు మొదలుకొని వీరి వంశ వర్ణన కన్పిస్తుంది. వారివంశం వారందరికి పూసపాటి వారని గృహనామం ఏర్పడిన పద్ధతి ఈ క్రింది సీస పాదం వలన తెలుస్తుంది.

"వసు దిగింద్రియ వత్సరంబుల జయ
వాటికా దుర్గ వైభవముఁగాంచె
గగన వాణీ వాక్య గౌరవంబునఁబూస
పాటి భూమినిఁబురవనము గట్టి
వాసి గాంచుట బూసపాటి వారను నింటి
పేరు గాంచిరి రాచ పెద్దలైన
యమల రాజాదిగా ప్రముఖులుమా వారు
త ద్గృహ నామముల్ దాల్చుచుండ్రి" (రాచిరాజుసీసమాలిక,
ఆం. వి; సం. 5)

పైడిపాటి గృహనామాన్ని గూర్చి చూద్దాం.

నృసింహ విలాస కర్తయైన పైడిపాటి వేంకట నృసింహామాత్యుడు తన మేనమామ అని దశావతార కథా సంగ్రహంలో అయ్యలరాజు నారాయణామాత్యులు స్తుతించారు.

"కామాదిక షడ్వర్గ్విద, భీముని శ్రీపైడిపాటి వేంకట
నరసింహామాత్య కవికులేంద్రుని---"

కందుకూరు సమీపాన గల పైడిపాడు ఈతని నివాస గ్రామం. ఈ గ్రామంలో అయ్యలరాజనే ఆర్వేల నియోగులు ఉండి దేశకాల వైపరీత్యాలవలన చెదిరిపోయి ఒంగోలు, వినుకొండ తాలూకాలలో స్థిరపడ్డారు.

పింగళి : పింగళి సూరన గృహనామం పింగళి. ఈ గృహనామాన్ని గూర్చి-

"ఆగౌతమ గోత్రంబున నాగమనిధిపుట్టె గోక నామాత్యుడు స
ద్భోగ క్షేత్రస్వామ్య సమాగతి బింగలి పురాంకుడై యత డొప్పెన్".

"తరముల్నాల్గ్రయిదెందునగు దత్త గ్రామ నామంబుబన్
బంగున్ వంశము లెల్ల బూర్వపు నిజ ప్రఖ్యాతి మాయంగనే
మరుదో పింగళి నామమందు చిరకాలా వాసులై యున్న సు
స్థిరతన్ గోకన మంత్రి వంశజులకున్ జెన్నొందు మిన్నందుచున్"
(ప్రభా. 1-17)

అని వర్ణన కన్పిస్తుంది. పింగళిగ్రామం నిజామాబాదుకు చేరువలోఉంది. పింగళివారి పూర్వీకుని భార్య సంతానం కోసం సూర్యుని ప్రార్థించి అతని చేత ఒక దొండ చెట్టు గ్రహించిందట. అప్పటినుండి వీరి సంతానం ఆ దొండ పాదులా విస్తరిల్లిందట. అందుకేనేమో పింగళి వారిలో సూరన లెక్కువగా కన్పిస్తారు. ఇలా విస్తరిల్లిన సంతతి అనేక స్థలాల్లో స్థిరపడి ఆయా గ్రామనామాలే గృహ నామాలుగా గ్రహించారు.-

"సులతాన్ శాహబహద్దరద్దుల హసన్ క్షోణీంద్రుచే బూజ్యపిం
గళి మాదన్న బుధేంద్రు చేత బహుసత్కారంబులందెన్ నబా
బులు సాధింపగలేని దుర్గనికాయంబుల్ లీలగెల్చి ---" అను పద్యం

వలన మాదన్న గృహనామం పింగళి వారని తెలుస్తుంది.

-ప్రోలు : పిండిప్రోలు, రాయప్రోలు, గృహనామాలలోని 'ప్రోలు' నకు అర్థం పట్టణం. ప్రోలు యొక్క రూపాంతరమే నిడదవోలు, రాజవోలులోని 'వోలు'. దీని ప్రాచీన రూపం 'పుటిల్' అని శాసనాల్లో కన్పిస్తుంది. లంకా విజయంలో-

"-----పిండిప్రోలి కులవీరామాత్యుడు ---" (లంకావి. 1-27)

అని వంశప్రకారంలో కవి పిండి ప్రోలు గృహనామాన్ని ఉపయోగించాడు. "నాకబలి పద్యాలకు పిండిప్రోలు లక్ష్మణకవి వెళ్ళేవారట. పెండ్లి జరిగిన సంవత్స రానికో, రెండుసంవత్సరాలకో వెళ్ళికూడ మామూలు వసూలు చేసేవారట. మీరు సకాలంలో రాలేదని ఆ గృహస్థులు అడిగితే 'నేను రాకుండా నీ ఇంట పెండ్లి జరగడానికి అవకాశం లేనేలేదు. నివు తెలుసుకోలేకపోయావు. పిండిలేకుండా పెండ్లి ఎలా జరుగుతుంది'అనీ, ప్రోలు (ఇదీ నాకబలి నాటి ఒకానొకతంతు) లేనిదే పెళ్ళి ఎలాజరుగుతుంది అనీ చమత్కరించేవారట". (రథ.గా.2; పు.450).

_బండ్ల : పాటిబండ్ల వేంకటప్పయామాత్యుడు 19వ శతాబ్ది మధ్యకాలంలో వాడు. ఈతడు పాటిబండ్ల గ్రామ కరణం అయినందువల్ల ఈతనికి ఈ పేరు గృహనామంగా నిలిచింది. పాటిబండ్ల గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకాలో ఉంది. ఈ కవి ప్రభులింగ లీలను రచించాడు.

పోరండ్ల గృహనామం పండితారాధ్య చరిత్రలో కన్పిస్తుంది.

"వీరభక్త స్థల విదిత పోరండ
సూరసానవ్వనాధారుణిఁబరగు
నరిది మున్నాయవ్వ చరిత మెట్లనిన
నరయఁబోరండ్లను నగ్రహారమునఁ
బతి పరోక్షంబునఁబ్రిధిత సద్భక్తి___" (పండి.పు.30) అని

అనడంచేత 'పోరండ్ల' అనే అగ్రహారంలో ఈమె నివసిస్తున్నట్లు సూరసాని కథలో పేర్కొనబడడంచేత ఈమెకు గ్రామనామమే గృహనామం అయినట్లు తెలుస్తుంది.

బమ్మెర :

"సమ్మతి శ్రీహరికిచ్చి చెప్పనీ
బమ్మెర పోతరాజొకడు భాగవతంబు జగద్ధితంబుగన్"
(భాగ. పీ 1_13)

భాగవతాన్ని రచించిన పోతన గృహనామం బమ్మెర. ఇతడు బమ్మెర గ్రామంలో నివసించాడు గనుక ఇతని యింటిపేరు 'బమ్మెర' వారుగా చెప్తున్నారు. బమ్మెర అనునది గ్రామనామము కాదని వావిలికొలను సుబ్బారావుగారి అభిప్రాయం. 'బమ్మెర' అను శబ్దమునకు నిలకడలేనిది, చలించునది అని అర్థం. ఇది భ్రమ అను శబ్దమునకు తద్భవమని సీతారామాచార్యులవారు వ్రాసిరి. భ్రము_అనవస్థానే (తిరుగుట) అను ధాతువు వలన కలిగినది భ్రమ- కావున బమ్మెరకు అదే అర్థమని చెప్పి కొన్ని ప్రయోగాలు చూపించారు.

'ఎలదేఁటి దాఁటులన్‌ః బమ్మెర వోవఁదోలు తెగబారెడు వెండ్రుకలు'-మను.

'బమ్మెర పోకతో"-అని పంచతంత్రము.

ఇతరులచే భుజింపక స్వయముగా పాకము చేసికొను వారిని స్వయంపాకం వారన్నట్లే బమ్మెర వారను పేరు ఇట్టి వచ్చియుండవచ్చు. పోతరాజు పూర్వులు ఒకచోట నిలుకడ లేక నానాదేశముల భ్రమించుచుండిన వారలగుటచే బమ్మెరవారైరి కాబోలు. దీనికి సరైన ఆంగ్ల నామము 'నోమాడ్స్' (Nomads) "నోమాడ్- పశుచారోపజీవన్- అస్థిరవాస" అని 'ఆష్టి' నిఘంటువు. పోతరాజు పశుచారోపజీవి యనియు కింవదంతి కలదుగదా! ఇది వూహామాత్రమే (ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక- కాళయుక్తి సం॥ శ్రావణ భాద్రపదమాసములు-ఒంటిమిట్ట పోతనామాత్యుడు — వాపిలి కొలను సుబ్బారావు; పు. 161)

-మంచి : కట్టమంచి, కూచిమంచి, జనమంచి, శంకరమంచి లలోని 'మంచి' ఉత్తర పదంగాగల గృహనామాలు కూడ ఉన్నాయి. ఇవన్ని గ్రామ నామాలుగా ఉన్నాయి. ఇది కన్నడ రూపమైన 'బెంచి' నుండి వచ్చింది. దీనికి నీటిదొరువు అని అర్థం. 'మంచి' వ్యక్తినామానుబంధంగా కూడాఉంది.

'---శ్రీ కూచిమంచి వంశాబ్ది చంద్రు మజ్జనకు నలగంగనామాత్య దలతు"
(రుక్మిణి–1–1?).

అని తిమ్మకవి రచన. "ఏనాడో ఎన్నితరముల క్రితమో జనులఎడ మంచిగ నుండుటచే మాకు 'జనమంచి' యను ఇంటి పేరు వచ్చినది. ఇప్పుడు నేను మొగము చెండుకొని వారివలె ననవసరముగా నా ప్రతి పక్షుల విమర్శించితినేని మా ఇంటిపేరును నేతి బీరకాయను చేసిన వాడనగుదునని జనమంచి శేషాద్రి శర్మగారే చెప్పిరి" (ఆంధ్రర.) బహుశ: ఛలోక్తిగా చమత్కరించి ఉంటాడు.

పిండిప్రోలు లక్ష్మణకవికి శంకరమంచికి పడేదికాదట. ఒకరోజు శివాలయంలో శంకరమంచి అనంతపంతులును చూసిన లక్ష్మణకవి 'ఔరా! శంకరమంచి వాడవు అనంతాఖ్యుండవై తీర్చెబుంగ" అంటూ వ్యంగ్యంగా పద్యం చెప్పాడు. కూచిమంచి జగ్గకవి, తిమ్మకవి గృహనామాలు ఈ వర్గానికి చెందినవే. తిమ్మకవి 17వ శతాబ్దివాడు. ఇతడు రుక్మిణీ కల్యాణము, సింహాచల మహాత్మ్యము మొదలైనవి రచించాడు. కట్టమంచి రామలింగారెడ్డి పాకనాటి శాఖకు చెందిన వాడు. చిత్తూరునకు సుమారు మువ్వాతిక మైలు దూరంలో వున్న కట్టమంచి వీరి

గ్రామం. ఈ గ్రామం ఆ కాలంలో చాలాచిన్నది. ఈ గ్రామనామమే తరువాత రామలింగారెడ్డికి గృహనామమైంది.

-మట్టి : పిల్లలమట్టి, పైడిమట్టిలోని 'మట్టి' పట్టుకు వికృతి చిలకమర్తి, నిడమర్తిలలోని 'మర్తి' -పట్టు/ -బట్టు లకు పరిణతరూపం. వెలుగోటి వారి వంశావళిలో పిల్లలమట్టి గృహనామాన్ని గూర్చి ఒక కథ వ్రాయబడింది.

"---తనరు పిల్లలమట్టి భేతాళ నృపతి" వెలు.వం పు.5)

"-- గాదయామాత్య పుత్రియారాధితామర వీర భద్రి పిల్లలమట్టి;

పినవీరభద్రిప్రణీతంబైన శాకుంతల--" (శకుం.పు.31

పైడిమట్టి వేంకటపతి తన చంద్రాంగద చరిత్రలో ఆశ్వాసాంత గద్యంలో "ఇది---సకల శాస్త్రాధ్వరికంస పైడిమట్టి పద్మనాభాధ్వరివతంస కృపా భూషణ -" అని 'పైడిమట్టి' గృహనామాన్ని పేర్కొన్నాడు.

"మా ఇంటిపేరు చిలకమర్తివారు, చిలకమట్టను పేరుగల గ్రామం ఎక్కడో ఉండే ఉంటుంది. నిజాం రాజ్యంలో ఉన్నదని కొందరంటున్నారు. ప్రస్తుతం వంగవోలు (ఒంగోలు) సమీపాన గల మద్దిపాడు నివాసం. చిలకమర్తివారు ఆరామ ద్రావిడులు, కాశ్యప గోత్రులు, అశ్వలాయన సూత్రులు, ఋగ్వేదులు. వైష్ణవులలో కూడ చిల మట్టివారున్నారు. వీరు మొదట ఆరామ ద్రావిడులేయై యుందురు. విసిష్టాద్వైతము మీది అభిమానముతో శ్రీవైష్ణవులై యుందురు. వీరును కాశ్యపగోత్రులే. వీరికి, వారికి భేదంఒక్కటే. వీరు చిలకమర్తి, వారు చిలకమట్టి." (స్వీయచ. పు. 2) అని చిలకమర్తివారు తమ స్వీయ చరిత్రలో చెప్పారు. చిలకమర్తి అనే గ్రామంనుండి వచ్చారు గనుక చిలకమర్తి అనే ఇంటిపేరు వచ్చింది. ఆరామ ద్రావిడులలోనూ, శ్రీవైష్ణవులలోనూ ఒకేగోత్రం, ఒకే ఇంటిపేరు కలవారున్నారని చెప్పడం గమనించదగింది.

పైడిమట్టి : పైడిమట్టి వేంకటపతి చంద్రాంగదచరిత్రమనే ఆరాశ్వాసాల ప్రబంధాన్ని రచించి శ్రీరామచంద్రునకు అంకితం ఇచ్చాడు. ఇతడు షట్శాస్త్ర వాలకు పిమ్మట, ధారాబంధాలకి పూర్వం తననుగూర్చి ఈ కింది సీసపద్యంలో చెప్పాడు.

"——అవధాన కృతి గుంభకవితాచ్ఛసందర్భ
కీర్తిత ప్రజ్ఞుండు కేశవన్న
తనకు నన్నలుగాఁగను దనరు గృష్ణ
రాయభూషణకుల రామరాజతనయ
కేశవాత్మజ పర్వతాధీశు వేంక
టాద్రినిదె కావ్యమేనిత్తు నంకితముగ".

"కృష్ణరాయ భూషణ"' అను పదమును బట్టి మెకింజీదొరగారు కవి కృష్ణదేవరాయల కాలంలోని వాడని చెప్పినాడు. ఈ కవి కృష్ణరాయ భూషణుని వంశజుడగు రామరాజు కొడుకైన కేశవార్యుని పుత్రుడగు పర్వతాఖ్యుని సుతుడగు వేంకటపతి. గ్రంథాంత గద్యము ఇది శ్రీరామచంద్ర చరణారవింద మిళిందాయమాన మానస సకల శాస్త్రాధ్వరివతంస పైడి మట్టి పద్మనాభాధ్వరి వతంస కృపాభూషణ కృష్ణరాయభూషణ పర్వతరాజ తనయ వేంకటపతి విరచితంబైన 'చంద్రాంగదచరిత్రం' బను మహాప్రబంధంబునందు షష్ఠాశ్వాసము." (చంద్రాం. ఆశ్వా. ౬) ఇందు పేర్కొనిన పైడిమట్టి పద్మనాభాధ్వరి కవికి గురువు. పైడిమట్టి అనునది గురువుకు గృహనామమేగాని కవికి కాదు. కవికి ఇంటిపేరు 'కృష్ణరాయభూషణ' అయినట్లు సీసపద్యమున 'కృష్ణరాయభూషణకుల' అను వాక్యమునుబట్టి, గద్యలోని 'కృష్ణరాయ భూషణ పర్వత రాజతనయ--' అను వాక్యమునుబట్టి నిర్ధారింపవచ్చు కృష్ణరాయభూషణ శబ్దము ఇంటిపేరుగాక, కృష్ణరాయల సభకు అలంకారము వంటివాడని అర్థమిచ్చు బిరుదు శబ్దముగా భావించితిమేని, ఈ బిరుదు ఈకవి తండ్రియగు పర్వతరాజునకే అన్వయించునని గద్యను బట్టి నిస్సంశయముగా చెప్పవచ్చు. ఈ బిరుదు పర్వతరాజుచే సంపాదింపబడినను, కవి ఆ బిరుదమును పూర్వులకు కూడ అన్వయించునట్లు "కృష్ణరాయ భూషణ వంశమని' పద్యంలో వ్రాసియుండవచ్చు. ఈ అభిప్రాయం నిజమైనచో కవి 16వ శతాబ్ది మధ్యవాడని చెప్పవచ్చు. 'పైడిమట్టి' అను ఇంటిపేరు గలవారు తెలగాణ్య శాఖీయులగు వైదిక బ్రాహ్మణులలో ఉన్నారు. 'సాహిత్యంలో పైడిమట్టి వేంకటపతి అని పిలువబడ్డాడు గానిఈతని గృహనామం 'పైడిమట్టి' అని ఎక్కడా కన్పించలేదు." (చంద్రాం.-ఆశ్వా. గ. 7)

-మల :- తిరుమల అనేది గ్రామనామంగానే కాక గృహనామంగా కూడా ఉంది.

"విశ్రుత తిరుమల తాతా
ర్య శ్రేష్ఠాన్వయ సుదర్శనాచార్య తనూ
జ శ్రీనివాస గురుచర
ణా శ్రయజ సమార్జితాఖిలాభ్యుదయునకున్"

సాంబోపాఖ్యాన కర్తఅయిన రామరాజు రంగప్పరాజుకి మంత్రోపదేష్ట అవడమే గాక శ్రీ తిరుమల శ్రీనివాసాచార్యులు కళాపూర్ణోదయ కృతిపతి అయిన సంద్యాల కృష్ణరాజుకు కూడా గురువై ఉన్నాడని కళా పూర్ణోదయంలోని పై పద్యంవల్ల తెలుస్తుంది. ఇందు 'తిరుమల' గృహనామంగా కన్పిస్తుంది.

మారెళ్ళ : క్రీ.శ.9వ శతాబ్దినికి చెందినవాడు మారెళ్ళ రాజాదిత్యుడు—ఇతడు తన శౌర్య ధైర్య గాంభీర్యాలను ప్రకటించి గుణగ విజయాదిత్యునికి ఖడ్గ సహాయుడైన సేనాని. ఇతని గృహనామం 'మారెళ్ళ'. ఈ విషయంకా ఉపరు శాసనంవల్ల తెలుస్తుంది.(నెల్లూరు శా నం3; కందుకూరు శా.నం 30,32,పు 544)

-మూడి / -పూడి : గోళ్ళమూడి, యండమూడి. ఆదిపూడి, కాకర్లపూడి, చింతలపూడి, బెండపూడి, మాడిపూడి, వెలగపూడి ఇత్యాదులలోని 'మూడి' 'పూడి' పర్యాయ పదాలు. ఇవి కాలువ అనే అర్థంగల 'పూణ్డి' నుండి వచ్చాయి.

కాకర్లపూడివారు ఆంధ్ర క్షత్రియులు.

"---శ్రీవశిష్ట గోత్రపవిత్ర కాకర్లపూడి వంశాంబుధి కైరవ మిత్రుండును---" అనటంచేత కాకర్ల పూడి గృహనామంగా కన్పిస్తుంది. రేకపల్లి సోమప్ప కవి తనరుక్మవతీ పరిణయంలో

"---అకసప క్ష్మాతలపతి
యేక చ్ఛత్రంబు గాగ నేలుచు జగతిన్
గాకరల పూడి యను పురిఁ
జేకొని నిజరాజధానిఁ జేయగ దానన్ (రుక్మ-1-40)

కాకరల పూడి కులముది
వాకర వరివంశ సంభవమై ధరణిన్
శ్రీకరముగ సర్వంశం
బైకర మొప్ప నృపమణుల కాశ్రయమగుచున్" (పై ఛ.1. 41)

వీరి వంశానికి మూల పురుషుడు దేవన కసవరాజు. ఇతడు కాకర్ల పూడిని రాజధానిగా చేసుకొని తన చిన్న సంస్థానాన్ని పరిపాలిస్తూ ప్రసిద్ధిచెందాడు గనుక వీరి గృహ నామం 'కాకర్ల పూడి' అయినట్లు తెలుస్తుంది.

చింతలపూడి ఎల్లనార్యుడు 'రాధామాధవ' మన్న ప్రబంధాన్ని రచించి దానిమూలాన శ్రీకృష్ణదేవరాయల మెప్పు పొందటం వల్ల అతనికి 'రాధామాధవ' బిరుద నామం కలిగింది; తన రాధామాధవ ప్రబంధ పీఠికలో—

"రాధామాధవ మచ్యుతాంకితము గాఁబ్రౌఢ క్రియం జెప్పిత
న్మాధుర్యంబునఁగృష్ణరాయవిభుఁగర్ణాటేశు మెప్పించి, నా
నా ధాత్రీప్రతిమాన సత్కవులలోనన్ భూషణశ్రేణితో
రాధామాధవ నామమందిన జగత్ప్రఖ్యాతి చారిత్రుడన్"

"సంతత భావ సిద్ధయుత సంస్థితియున్, సనయ క్రియా పరి
క్రాంతియు, సర్వలక్షణ విచారితయున్ ఫలియించి, రాధికా
కాంతుఁడు ప్రాణవల్లభుడు గావునఁబావన మూర్తియైన యీ
చింతలపూడి యెల్ల కవి శేఖరు కోమల కావ్య కన్యకన్," అని

రాధామాధవ మందు తన ఇంటిపేరు చింతలపూడిగా పేర్కొన్నాడు. ఇతని బిరుద నామం, ఇంటిపేరూ రెండూ అతని వ్యక్తినామం ముందు వ్యవహృతం అవుతున్నాయి.

బెండపూడి అన్నామాత్యునికి తన గ్రామనామమే గృహనామంగా మారింది. తూర్పు గోదావరి జిల్లా తుని తాలూకాలో బెండపూడి అనేగ్రామం ఉంది. ఇది ఒకప్పుడు మఖ్యపట్టణమట. అల్లాడ రెడ్డి మంత్రి అరియేటి అన్నమ్మనుమంత్రి ఈ పట్టణానికి రాజప్రతినిధిగా నియమించబడినప్పటి నుండి అరి వంశంవారికి

బెండపూడి గృహనామం ఏర్పడినట్లు మల్లంపల్లి సోమశేఖర శర్మగారు "హిస్టరీ ఆఫ్ ది రెడ్డీ కింగ్‌డమ్స్"లో పేర్కొన్నారు.

—వరం : గుండవరము, ధర్మవరము, సురవరంలలోని 'వరం' యొక్క ఔపవిభక్తి రూపమే కేతవరపు, గన్నవరపు, సురవరపు గృహనామాల లోని 'వరపు'. గణపవరపు వెంకటకవి చిత్రకవిత్వంలో దిట్ట. ఈయన ప్రబంధ రాజ వెంకటేశ్వర విజయవిలాసమన్న ప్రబంధానికి కర్త. ఇతడు తెలుగులో మొదటి పద్య నిఘంటువు, 'ఆంధ్రకౌముది' అనే వ్యాకరణం రచించాడు.

—వల్లి : ఎడవల్లి, ఖండవల్లి, గూడవల్లి, దిగవల్లి, ఎఱ్ఱపల్లి. అడుసుమల్లి లోని 'మల్లి' 'మిల్లి,' పల్లి' శబ్దసంబంధాలని 'వల్లి' కూడ 'పల్లి' కి మార్పాటు రూపం కావచ్చుని లేదామూల ద్రావిడ రూపం 'వటి' నుంచి ఏర్పడి ఉండ వచ్చునని, తెనాలిలోని 'అలి' ఈ 'వల్లి' నుండి పరిణమించింది కావచ్చు లేదా 'దక్షిణాపథం' అనేఅర్థంగల 'తెన్నవలి' అన్న ఊహాసిద్ధరూపం 'తెన్నాలి గా మారి తెనాలి అయిఉండవచ్చు అని తూమాటి దొణప్పగారు రేడియో ప్రసంగంలో పేర్కొన్నారు. తెనాలి వారి పూర్వపు గృహనామం గార్లపాటి. పాండురంగ మహాత్మ్యమందలి ఈ క్రింది పద్యం వలన వీరి నివాసం తెనాలి అని తెలిస్తుంది.

'శ్రీ తెనాలి నగరేవ్యరాజ యద్గార్లపాటి పురరామ పండితః
---రామలింగ --"

తెనాలి నగరే అనుటచే రామలింగనికి తెనాలి గ్రామనామమే గృహనామంగా స్థిరమయిందని స్పష్టమౌతుంది.

—వాడ : చదలవాడ వేములవాడలోని 'వాడ'కు జనపదమని అర్థం. ఇది సంస్కృత 'వాట'/'వాటీ కి వికృతి. విప్రనారాయణ చరిత్ర కవి చదలవాడ మల్లయ్య ఎఱ్ఱయ్య తన వంశంవాడని తాను చిన మనుమడననీ, ఎఱ్ఱయ చెదలువాడ నివాసుడనీ చెప్పాడు. శ్రీనాధుడు తన కవిస్తుతిలో 'వచియింతు వేములవాడ భీమన భంగి నద్దండ లీల నొక్కొక్కమాటు "అని భీమకవి గృహనామం 'వేములవాడ' అని పేర్కొన్నాడు.

—వీటి : జనావాసం అనే అర్థంగల 'వీడు' శబ్దం అచ్చమైన తెలుగు పదం ఈ వీడుకు ఔప విభక్తిక రూపమే వీటి. విడువది యాకువీటి పెద పేంకట

భూపతి—" రాఘవ. పీ. పు. 38). ఆరు వీటి పట్టణ ప్రభువు గనుక ఇతనికి 'ఆరువీటి' వారనే గృహనామం ఏర్పడింది.

కృష్ణదేవరాయల తర్వాత విజయనగరసామ్రాజ్య వైభవానికి పట్టుగొమ్మయి పిలపిల్లిన రామరాయలు ఈ ఆర్వీటి వంశానికి చెందినవాడు. అనంతపుర మండలానికి చేరిన తాడిపత్రి తాలూకాలోని యెల్లనూరు వద్ద చిత్రావతీ తీరంలో వున్న పాడుపడిన పల్లే అప్పటి ఆరవీడు. ఈతని పూర్వీకులు ఆరవీటిని పరిపాలించిన కారణాన ఈతనికి ఆర్వీటి రామరాజనే పేరు కలిగింది.

**వెలిగందల :** "తత్కవితా వధూముఖ తిలకంబగు వెలిగందల కందనా మాత్యుండను నుత్తమ రత్నంబునకు సాశ్రయంబగు రామగిరి పట్టణాధీశ్వరుండైన ముప్పడి క్షోణిపాలుని యన్వయ గుణవిశేషంబు లెట్టివనిన" అని మడికి సింగన తాను రచించిన పద్మపురాణ ఉత్తర ఖండంలో తత్కృతిపతియైన కందనామాత్యుని గూర్చి యిలా రాశాడు. కృతిపతి వెలిగందులకు అమాత్యుడవడం వలన ఈతనికి వెలిగందల అన్న గృహనామం ఏర్పడినట్లు తెలుస్తుంది. ఈ వెలిగందుల గ్రామం కరీంనగర్ జిల్లాలో ఉంది.

**వెలిచేటి :** వెలిచేరుకు ఔపవిభక్తిక రూపం వెలిచేటి. ఇది ఇంటిపేరుగా ధర్మనందన విలాసంలో ఉంది.

"—పురుష గాంగేయ వెలిచేటి గురువరాయ" (ధర్మనం. 1-13)
"——వెలిచేటి పాపరాయాహ్వయుండు" (ధర్మనం. 1-78)

"ధరణి నతడు పశిష్ఠగోదావరిని
కటమున న్వెలి చేరను గ్రామ మొకటి
గట్టిమంగాంబికను బెట్టబట్టిమల్లి
కార్జునుని—" (ధర్మనం. 1-26) అని

ధర్మనందన విలాసకర్త కాళ్ళహరి గౌరికాంత కవి పేర్కొనటం చేత వెలిచేటి వంశపురుషుడు గోదావరీ తీరంలో వెలిచేరు అనే గ్రామాన్ని కట్టినందువల్లనే యీ వంశంవారికి ఆ ఇంటి పేరు కలిగిందని చెప్పవచ్చు.

_సాల : ఘంటసాల వెంకటేశ్వరరావుగారి గృహనామం ఘంటసాల. ఈ పద వ్యుత్పత్తి చూద్దాం. ఘంటసాలకు టోలమీ కాలంలో 'కొంటకశ్శైల' అనే పేరున్నదట. ఇది వాణిజ్యస్థానం. ఈ కొంటకశ్శైలను కొందరు కటకశాలని, కటకసోలని, కంటకసేలి, కంటికోస్సలని అనేకవిధాల చదివారు. "ఇటీవల నాగార్జున కొండ శాసనములలో కంటకసేల శబ్దము కన్పించుటతో 'టోలమీ' పేర్కొన్న 'కొంటకశ్శైల' కంటక సేలయొక్క అపభ్రంశమే అనుటలో అసామంజస్యము లేదు. "కంటకశైల" అను శబ్దమున కర్థము ముండ్లపర్వతము. ఘంటసాలలో ముండ్లపర్వతము లేదు. బౌద్ధుల యుగంలో 'శైల' శబ్దముగల పేర్లు చాలాగలవు. శైల శబ్దార్థము పర్వతమేగాని, శైల శబ్దాంతాలన్నీ ఆకాలంలో కొండలుకావు. స్థూపములు, కొండరాళ్ళు పర్వతములవలె వుండుటచేత వాటికి శైల అను పేరుపెట్టి వుంటారు. ఆయా స్థూపాలను వారికిష్టమైన శైల శబ్దాంతాలైన పేర్లతో పిలిచారు స్థూపాలు శైలాకృతిలో నిర్మింపబడడంచేత వానిని శైల మనడంలో అసందర్భంలేదు. ఆకాలంలో స్థూపాలు ఆవిధంగా పిలువబడి వుంటాయి. దానినికేవలం శబ్దార్థ దృష్టిలో విచారించగూడదు కంటక అశుభకర మైన శబ్దము. గ్రామానికి మనం ఏదో ఒక మత సాంఘికాచారానుకూలమైన పేరు పెట్టడం మన సంప్రదాయం. ఆచారవిరుద్ధంగా ఇచట 'కంటక' శబ్దం కన్పిస్తుంది. ఆజన్మ సుఖభోగియై అన్ని సంపదలతోనున్న రాజ భవనాన్ని వదలి దుఃఖ నివారణకై బయలుదేరి వచ్చిన ఆ బుద్ధభగవానుని అశ్వము పేరు కంటకము. ఆ దివ్యసుందర ధవళ తరంగము సిద్దార్థునిచే విడనాడబడి దుఃఖముచే శుష్కించినదై విచార భరమున జీవముల బాసినది. ఈ హయమునకు కంటకమని పేరు. పుణ్య మూర్తియైన బుద్ధభగవానుడు లోక కల్యాణార్థము ఎక్కి వచ్చినట్టియు, పవిత్రమై నట్టియు, విశ్వసనీయమైనట్టియు, ఆత్మార్పణ బుద్ధికలిగినట్టి గుఱ్ఱము పేరుతో కంటక శైలయని ఒక చైత్యము కట్టబడి వుండవచ్చు. అది గ్రామమునుపేరై ప్రసిద్ధి చెంది ఉండవచ్చు. 'అవరశైల' అమరావతిగా నిర్ణయింపబడినట్లు మన ఆంధ్రదేశంలో గ్రామాలెన్నో (భీమేశ్వరం, ఎల్లేశ్వరం, సంగమేశ్వరం మొ॥) దేవాలయాల పేర్లతో పిలువబడుతున్నాయి. కనుక శుభకరమైన నామముతో ఆచారానుకూలముగాను, చారిత్రాత్మకముగను సత్ప్రమాణముగను కంటకశైల నామోత్పత్తి కన్పిస్తుంది." (ఘంటసాల చరిత్ర - గొర్రెపాటి వెంకట సుబ్బయ్య. పు. 29-30)

కడపజిల్లా పులివెందుల తాలూకాలో సుంకేసుల అనే పేరుగల ఊరొకటి ఉంది. సుంకేసుల సంకుసాలగానో, సంకుసాల సుంకేసులగానో మారి ఉండవచ్చు. ఈ గ్రామనామం గృహనామంగా గల కవి సంకుసాల నృసింహకవి. ఈతడు 15వ శతాబ్దివాడు. శ్రీకృష్ణదేవరాయల కాలంలోనివాడు. 'మాంధాతృచరిత్ర' అనే కర్ణరసాయనాన్ని రచించాడు.

దేశ్యాలైన ఏరు, కుట్టు, తుట్టు, పట్టు, పూడి, పోడి అనేవి ప్రత్యేకంగా కాక ఏదో శబ్దానికి తుదిని ప్రయోగిస్తే అవి గ్రామవాచకాలవుతాయి. ఆ గ్రామ నామాలు ఔపవిభక్తిక రూపంతో గృహనామాలుగా చలామణిలో ఉన్నాయి. ఉదా:- కంతేరు _కంతేటి, ఏమకుర్తి, పులకుర్తి, పెందుర్తి, పుట్టపర్తి, ముళ్ళపూడి మొదలైనవి.

4. పౌరుష లేక బిరుదనామాలు :

బిరుదనామాలు లేక పౌరుషనామాల మీదుగా ఇంటిపేర్లు ఎలాఏర్పడ్డాయో చూద్దాం. పురుషవ్యాపారం కలది పౌరుషనామం. ఈ పౌరుషనామాలను 1. సంగీత ప్రావీణ్యాన్ని సూచించేవి, 2. కవిత్వ, పాండిత్య సూచి, 3. పరాక్రమసూచి అని మూడు విధాలుగా విభజించవచ్చు. నివాసస్థల సూచకాలైనవి, ఇతరాలు సైతం గృహనామాలుగా కన్పిస్తున్నాయి.

i. సంగీత ప్రావీణ్యసూచి : చల్లగాలి, ఝుంఝామారుతం, పల్లవి, వీణ, షట్కాలం, స్వరకాడు, స్వరం మొదలైన ఇంటిపేర్లవలన సంగీతంలో వీరికిగల నైపుణ్యం తెలుస్తుంది. చల్లగాలి : పచ్చిమిరియం ఆదెప్పయ్య శిష్యుడైన పల్లవి గోపాలయ్య కొడుకు చల్లగాలి కృష్ణయ్య. ఇతడు 1824-65 మధ్యప్రాంతం వాడు. ఇతడు తంజావూరు ఆస్థాన విద్వాంసుడు. శృతి, తంతిని వాయించ కుండగనే వీణను మీటటం ఈతని విశిష్టత. ఈతని వీణ మానవగాత్రం వలే పలేకేదట. దక్షిణ తెరిపి చల్లగాలివలె చల్లగా ఉండటంచేత ఈతనికి 'చల్లగాలి' అనే బిరుదం వచ్చిందట. ఈతని తండ్రిపేరు పల్లవి గోపాలయ్య. తండ్రికాలంలో పల్లవి అన్న పదం గృహనామంగా వాడుకున్న కృష్ణయ్యకు ఆ ఇంటిపేరు సమసి

పోయి తాను సంపాదించుకున్న 'చల్లగాలి' బిరుదనామం కుటుంబనామంగా మిగిలింది.

ఝుం ఝూ మారుతం సుబ్బయ్య తంజావూరు కన్నయ్య శిష్యుడగు వడ్డి సుబ్బయ్య స్వాధ్యాయి. మైసూరు మహారాజావారిచే 'ఝుంఝూమారుతం' బిరుదం పొందాడట. ఈ బిరుదమే ఈతని వంశం వారికి గృహనామం అయింది.

వీణకుప్పయ్యసామ వేద బ్రాహ్మణుడు. వీణ ఫిడేలు వాద్య చతురుడు. చక్కగా వీణ వాయించి ఆ వీణపేరే తనకు పౌరుషనామంగా నిలుపుకున్నాడు. ఈతని మూలాన్నే సంగీత నిలయమన్న ఖ్యాతి మద్రాసు పట్టణానికి వచ్చిందట.

షట్కాలం నరసయ్య ఆరుకాలాలలోనూ కీర్తనలు పాడగల సమర్థుడట. ఈతను వేంకటగిరి ఆస్థాన విద్వాంసుడు

1825-64 మధ్యకాలంలో ఆరంతంగి వద్దనున్న 'వల్లవాడి' నివాసి స్వరకాడు వెంకట సుబ్బయ్య. ఇతడు నిడమంగళ గ్రామాన్ని నివాసంగా జేసుకొని అచటి బాహ్య ప్రదేశమున ఏకాంత నాదోపాసన చేశాడట. ఈతని స్వరకల్పనా చాతుర్యానికి మెచ్చి శివాజీరాజు 'స్వరకాడు' బిరుదాన్నిచ్చి సత్కరించాడు. (ఆం. గా. చ. పు. 24) ఆ బిరుదమే ఈతనికి ఇంటిపేరుగా మారిందన్న విషయం ఆంధ్ర గాయకుల చరిత్రలో మంగిపూడి రామలింగశాస్త్రి పేర్కొన్నారు.

స్వరం కొండయ్య బందరు నివాసి. మంచి గాన ప్రతిభకలిగి శైలి, స్వరములకూర్పు, శబ్దాల సొగసు, మనోధర్మ స్వరాలు పక్కాతాళ పొందికలలో పాడుతుండేవాడట. అందువలననే ఈతనికి 'స్వరం' అన్నపదం ఇంటిపేరుగా మిగిలింది.

ii. కవిత్వ పాండిత్యసూచి : అవధానం, అష్టభాషా, చిత్రకవి, దిట్టకవి, నిమిషకవి, పురాణం, ప్రౌఢకవి, భద్రకవి, భాగవతుల, భారతం, రమణకవి. వేదుల, లింగనముఖి. శ్రీపాద, సన్నిధానం మొదలైన గృహనామాలు ఆయా కుటుంబీకుల పాండిత్యాన్ని సూచిస్తున్నాయి. వేదాలతోనూ, శాస్త్రాలతోను వారికి గల సన్నిహితత్వం కన్పిస్తుంది.

"చిత్రకవి వంశ దుగ్ధాబ్ధి శీతభానుఁ
దనుపమానోక్తి శ్రీ సింగరార్యసూనుఁ..." (బిల్హ. 1-6)

చిత్రకవి సింగనార్యుని ఇంటిపేరు 'చిత్రకవి' వారు. ఈ చిత్రకవి అతనికి బిరుద నామం. ఈ బిరుదనామంతన వంశం వారందరికి గృహనామంగా మారింది. ఈ కవి రచించిన రాఘవ వాసుదేవీయ ఆశ్వాసాంత గద్యంలో "ఇది శ్రీమదళహ సింగరి స్వరూప శ్రీమన్నారాయణ ముని గురుచరణ --- గోత్రి పవిత్ర కొత్త పల్లి రంగాచార్యపుత్ర చిత్రకవి సింగరాచార్య ప్రణీతంబైన రాఘవ వాసుదేవీయం" అని ఉంది. ఇతని కాలంనుండే ఈ బిరుద నామం గృహనామంగా ప్రసిద్ధిచెందినట్లు తెలుస్తుంది. చిత్రకవి పెద్దన తనకు ఇంటిపేరుగా నిలచిన చిత్ర కవిత్వ లక్షణాలు వివరించాడు. అందులో కల్పవల్లికాబంధం అని ఒకటి చెప్పాడు. నాలుగు చంపక మాలలనుండి 17 వృత్తాలు పుడతాయట. ఇటువంటి ఫీట్స్‌చేసిన వాడు నిజంగా చిత్రకవేమరి. చిత్రకవి పెద్దన 1600 ప్రాంతంవాడు. ఆర్వేల నియోగి. ఇతడు సర్వలక్షణ సార సంగ్రహము, సాహిత్య చంద్రోదయం మొదలైనవి రచించాడు.

దిట్టకవి వెంకటామాత్యకవి ఇంటిపేరు మొదట వెణుతురుపల్లి. ఇతని పితామహుడు వెంకటామాత్యకవి కవిత్వంలో దిట్టయై దిట్టకవి అనిపేరు పొందడం వలన ఈ ఇంటిపేరు వచ్చింది. (ఆం.క.త. XII, పు. 175)

నిముషకవి రామయ్య జలక్రీడావిలాసం అనే యక్షగానం రచించాడు. క్రీ.శ. 1758 ప్రాంతంవాడు. తూర్పు గోదావరి జిల్లా అమలాపురం తాలూకా గ్రామ కరణం నిముషకవి లింగరాజు గారి పుత్రుడు.

iii. పరాక్రమసూచి : అడిదం, కట్టబొమ్మ, కాసె, కోటిరాయ, తుపాకుల, పచ్చకప్పురం, వాసిరెడ్డి మొదలైనవి యుద్ధంలో వారు చూపిన సాహసాలకు ప్రతీకలుగా వారు పొందిన బహుమతులు, బిరుదులు.

అడిదం వారి ఇంటిపేరు మొదట మోదుకూరి వారు. ఈ కుటుంబం వారు తమ గ్రంథాలను ఏనుగులపై వేసికొని దేశాటనం చేస్తూ రాజాస్థానాలను దర్శించి కాలంగడుపుతుండడం చేత గ్రంథవారణం వారని పేరుకలిగింది. తరువాత కొంత కాలానికి అడిదం వారి పూర్వుడైన సీలాద్రి కవి కళింగరాజులలో ఒకని వద్ద ఆస్థానకవిగా ఉండి యుద్ధానికి వెళ్ళాడట. బ్రాహ్మణుడైనా ఇతను యుద్ధరంగంలో

వెల్లడించిన ధైర్య సాహసాలకు తగిన పారితోషకమని ఎంచి ఒక అడిదమును కానుకగా యిచ్చిగౌరవించాడట. అప్పటినుండి వారిపేరు ఆడిదము వారైనట్లు ఈ ఈ క్రింది పద్యము వలన తెలుస్తుంది.

"కదన పార్థుడందె కవిరాజునీలాద్రి, అలకళింగ రాజు లడిద మొసగ
నిందుచేత నయ్యెనింటిపేరడిదము, రామరాయ వినుత రామచంద్ర".

మహామహోపాధ్యాయ శ్రీ కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు 'బిల్వేశ్వరీయము'లో "అధికుడౌను గాదె యడిదము సూరన్న నియమశూద్రక నమనిష్ఠ చేత" అని ఈతనిని పేర్కొన్నాడు. (నిడదవోలు వెంకట్రావు, అడిదము సూరకవి జీవితము. పీఠిక, పు. 7) 'నేనడిదము వాడ। సూరన సమాఖ్యుడ। నాకొక రుండ సాటియే' అని పల్కిన ఆడిదము సూరన 1750 ప్రాంతంలో విజయనగర ప్రభువగు పూసపాటి చిన విజయరామరాజుగారి వద్ద కవీశ్వరుడుగా ఉన్నాడు ఆంధ్ర చంద్రాలోకము, కవి సంశయవిచ్ఛేదము, కవిజనరంజనము మొదలైనవి యితని కృతులు. ఈతని చాటువులలో —

"ఊరెయ్యది? చీపురుపలె
పేరో? సూరకవి; యింటిపే? రడిదమువార్,
మీరాజు। విజయరామ మ
హారా; జతడేమి సరసుడా। భోజుడయా।" అని

తననూ, తన వంశాన్ని గురించి చెప్పుకున్నట్లు కన్పిస్తుంది. ఇలా కవులందరూ తమనుగూర్చి వివరించినట్లయితే వారి కాలాన్ని గూర్చి, గృహనామాలను గూర్చి, ఎవరి సమకాలికుడో తెలుసుకోవడానికి ఈనాడు మనం తపన పడవలసిన అవసరం ఉండేదికాదు.

1799 అక్టోబరు 16వ తేదీన ఆంగ్లసైనికాధికారి మేజర్ 'బానర్‌మన్'చే మరణదండన విధించబడిన వీరవరుడు పాంచాల కుటిచ్చి తెనుగు పాళెగాడు కట్టబొమ్మ కట్టయ్య నాయకుడు. దక్షిణాపథంలో మొట్టమొదటగా ఆంగ్లేయుల నెదిర్చిన తెలుగు పాలకుడు. కట్టబొమ్మ అనేది వంశనామం. వీరు తొలుత బళ్లారి మండలవాసులు. వీరు 'జగవీరపాండ్య కట్టబొమ్మ' బిరుదం ధరించినట్లు తిరుమల రామచంద్రగారు తమ 'దక్షిణాంధ్రవీరులు' లో పేర్కొన్నందున వీరి

బిరుదమే గృహనామంగా మారి కట్టబొమ్మ సోదరులుగా ప్రసిద్ధి చెందినట్లు తెలుస్తుంది.

"దొరగె రిపుకోటి సీడెరా బిరుదుకోటి
రాయ రఘునాధ పంచణ ప్రభుకిరీటి-"(చా.ప.మ.మం.పు.38)

ఈతడు పుదుక్కోట ప్రభువు, 17వ శతాబ్దివాడు. ఆంధ్రభాషార్ణవకర్త నుదురుపాటి వెంగన ఈతని ఆస్థానకవి. రిపులను అనేక కోట్ల మందిని రణరంగంలో సంహరించినందుకు గాను ఈతనికి 'కోటిరాయ' అనే బిరుదు కలిగి ఉండవచ్చు.

'పచ్చకప్పురపు' గృహనామంగా గల వారి పూర్వులు తిమ్మరాజు, అతని తమ్ముడు అయ్యల రాజున్ను కన్నడ రాయడైన ప్రౌఢరాయని మెప్పించి ఘన సారదానాన్ని పొంది పచ్చకప్పురపు వారనే గృహనామం పొందారట" (స.ఆం. సా;సంపు.9, పు.23) పచ్చకప్పురపు తిరువెంగళ నాధుడు 1530 ప్రాంతం వాడు. ఈతడు చొక్కనాధ చరిత్ర రచించాడు.

వాసిరెడ్డి ఇంటిపేరు పౌరుషనామం. ఈ గృహనామాన్ని గురించి ఇతరుల అభిప్రాయాలు చూద్దాం. "చరిత్రలో మనకు ప్రప్రథమంగా వాసిరెడ్డి యను ఇంటి పేరుగల పోతినీడు నామము పీఠికాపుర శాసనములో లభ్యమగుచున్నది. ఈయన వాసయప్రభుని తనూజుడు. రాజ్మహేంద్రవరమును పాలించు రెడ్డిరాజులగు కాటయ వేమారెడ్డి వీరభద్రారెడ్డి యను వారి కాలములో పోతినీడు క్రీ.శ. 1430 ప్రాంతంలో ఒక సామంతుడుగానుండి పీఠికాపుర ప్రాంతమును పరిపాలించెను. (రాజావాసిరెడ్డి వెంకటాద్రినాయుడు, పు. 7) వాసిరెడ్డి గృహనామం కమ్మవారిది. ఈ ఇంటిపేరు ఒక పౌరుషనామం. క్రీ.శ. 14వ శతాబ్దిలో అనవేమారెడ్డి రాజ్యం చేస్తూండగా తన సామంతులు కొందరు కప్పాలీయక ఎగగొట్టగా, వారిపై తన సైన్యాన్ని తీసుకొని యుద్దానికి వెళ్ళాడు. అంతట ఆ సామంతులందరూ ఏకమై వేమారెడ్డినిలా కోరారు. ఇలా మనం యుద్ధం చేసి సైన్యాన్ని తగలెట్టుకోవడ మెందుకు? ఇరుపక్షాలనుండి ఒక్కొక్కరు మాత్రమే వచ్చి యుద్ధం చేయాలని, తాము ఓడిపోయినచో కప్పం కడ్తామని అనగా ఆరెడ్డి సైన్యాధిపతి సదాశివనాయని కోరికపై అతనినే పంపాడు. ఆ సదాశివనాయడు గెల్చి రాజరాజను తన ప్రతిష్ఠ నిలబెట్టినందుకుగాను వేమారెడ్డి అతనికి కొంత రాజ్యం కూడా ఇచ్చి కమ్మ

ప్రభువుగా చేశాడు. రెడ్డికి వాసి కూర్చినవాడగుటచే వాసిరెడ్డిసదాశివ నాయుడనిరి. ఆవంశంవారికిది ఇంటిపేరుగా నిలచింది. మంచెళ్ళ వాసుదేవకవి తన 'గంధ వహము'లోపై ఉదంతమిలా వర్ణించాడు.

"ఘన కీర్తుల్ జగ నొబ్బ గండ బిరుదుల్ గంభీర ఢాంకారభీ
మన గోద్వేక భేరు నిల్చియున వేమారెడ్డియున్ వాసి గా
గనియెన్ గావున వాసిరెడ్డియన నాఖ్యంజెందెనే ధార్మికా
వనినాదాగ్రిణి వంశ నాధుడతనిన్ వర్ణింపగా శక్యమే", మరియు

అమరవాది రామయ కవి తన ద్రౌపదీ పరిణయంలో-

"తిరుగబడ్డట్టి పశ్చిమాధిపు లన్వభుజ
పటిమనరిగాపుల నొనర్చి వసుధరాజ
రాజనెడు వాసిరెడ్డికి నోజనిలిపె
సారశాలి సదాశివ వీరమౌళి",

"వాసిరెడ్డికి నిలుపుటవలన నాట
బట్టి ధాత్రి సదాశివ ప్రభుని కతని
వంశమున బుట్టువారికి వాసిరెడ్డి
వారనెడు పౌరుషాలయాహ్వాయము గలిగె" (ద్రౌ.ప.155, 56)

అని పేర్కొన్నాడు

పై ఇద్దరి కవుల రచనలలోను వాసిరెడ్డి గృహనామమేర్పడిన విధం ఒక రీతిగానే ఉంది కనుక ఇది పౌరుషనామమనే చెప్పవచ్చు. వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు కమ్మనాటిలో తన సామ్రాజ్యాన్ని నెలకొల్పి ప్రసిద్ధిచెందాడు. ఈ వంశానికి పేరు ఇలావచ్చిందని మంచర్ల వాసుదేవ కవి తన 'గంధవహము' లో కూడ చెప్పాడు.

పరవస్తు, మడికి, వాడ్రేవు మొదలైనవి వారి నివాసాల ఉనికిని సూచిస్తున్నాయి.

పరవస్తు చిన్నయసూరి తండ్రి వేంకట రంగరామానుజాచార్యులు. వీరు 17వ శతాబ్దివారు. ఉత్తర దేశస్థులు. వీరు పరవస్తు మఠం వారి శిష్యులు, పరవస్తు మఠము వారు ఉత్తర దేశమునుండి వచ్చినప్పుడు వారితో గూడ తన భార్యతో వచ్చి మద్రాసులోని రామానుజకూట వీధిలో నుండి ఆ తరువాత పెరుంబుదూరు వెళ్ళారు పరవస్తు మఠశిష్యులు గనుక వీరికిదే గృహనామమైంది. కాని పర_ ఇతర; వస్తు = వస్తువులను అను అర్థంలో ఈ ఇంటిపేరుకు కొందరు వ్యుత్పత్తి చెప్పుకొంటున్నారు. ఇది చాలా బాధాకరం.

గోదావరికి ఉత్తరమున పెద్దమడికిలో స్థిరమైన తోటలు ఆర్జించినందున వీరు మడికివారని వీరేశలింగంగారు పేర్కొన్నారు. వీరి పూర్వపు ఇంటిపేరు 'రావెల' అని ఆరుద్రగారు సమగ్ర ఆంధ్రసాహిత్యంలో పేర్కొన్నారుగాని ఆధారం చూప లేదు. మడికి సింగన తమ ప్రభువుచేత రామాద్రి సీమలో అనేక వృత్తులు, గ్రామాలను పొందానని చెప్పుకొనడం చేత అతడు స్థిరపడి గ్రంథరచన చేసి ప్రసిద్ధి పొందినందువలన అతని ఇంటిపేరు 'మడికి' అనడంకంటె రామగిరి సింగన అని పిలవడం ఉచితమని కవిజీవితాలలో గూరజాడ శ్రీరామమూర్తిగారు పేర్కొన్నారు.

'--- నగపున వాడ్రేవు సూర్యనారాయణునిన్' అని వాడ్రేవు అనే గృహ నామం గజానన విజయంలో కన్పిస్తుంది

"అల్లమౌద్గల్య గోత్రజులందుఁగొందఁబొఱువేల నియోగుల యందుఁగలసి
యోడయాడు రేవునను మున్నుంటఁజేసియోడరేవు వారను పేరనొప్పుచుండ్రు"

(గ.వి; పి.ఆ.శ్వా గ.పు. 3)

వీరు ఓడరేవు నందు నివసించినందువలన వీరికీ గృహనామం కలిగిందట. వీరు పూర్వము పసలపూడి గ్రామవాసులని ఈ పద్యంవల్ల తెలుస్తుంది.

"సూర్య తేజుడల్ల సూర్యనారాయణ---

--- చూపరగ్గింపపసలపూడి యందు బసగుచుండు---" అనుటవలన

వీరు పసలపూడి నుండి ఓడరేవుకు చేరి ఉండవచ్చు. అచట నివాసాన్ని బట్టి వీరికి ఓడరేవు వారనే పౌరుషనామం కల్గింది

I. కట్ట, ii కొప్పెర, iii. గుడ్డి, iv. చితారు, v. చౌదరి, vi జయంతి vii, బొమ్మలాట viii. విశ్వనాథ మిగిలినవానికిడుదాహరణలు.

i. కట్టు : "-- ఇది —సకల విద్వజ్జనాధార కట్ల హరిదాసరాజ గర్భాబ్ధి చంద్ర వరద రాజేంద్ర ప్రణీతంబైన —" ఈ 'కట్ట' వారికి ఈ గృహనామమెట్లు కలిగిందో కట్టా వరదరాజేంద్రకవి తన శ్రీరంగ మహాత్మ్యములో ఇట్లు పేర్కొన్నాడు.

"చటాళిలపై యెటాళియొలిచెకట్ట కట్టాజనుచు రిపుల్ గంపమొంద—"
వీరి వంశమూలపురుషుడైన కరికాళచోళుడు కావేరీనదికి ఆనకట్ట కట్టించుటచేత ఆవంశీయులకు 'కట్టా' గృహనామ మేర్పడినట్లు తెలుస్తుంది.

ii. కొప్పెర : శేషం వంశానికి చెందిన పెదకృష్ణమంత్రి కుమారుడైన కృష్ణయ్యకు కొప్పెర కృష్ణయ్య అనిపేరు.

"అతనికి కొప్పెర కృష్ణయ
సుతుడయ్యె ‹దదీయ హేతి శూరాలి వధూ
వితతుల కొప్పెర గొనుటన్
క్షితి కొప్పెర కృష్ణుడన సుకీర్తిందనరెన్"

అని ఉంది. (శ.వి.పీ. 36)

శత్రు స్త్రీల కొప్పును ఎరగా తీసుకున్న వాడట. స్త్రీ కొప్పు తీయడమంటే వారి భర్తలను సంహరించి ప్రసిద్ధి నొందాడని భావం. కనుకనే ఆపేరతనికి గృహ నామంగా నిలచిపోయింది

iii. గుడ్డి : గుడ్డి కృష్ణయ్య పుట్టుకతో అంధుడైనా సూదిలో దారం ఎక్కించ గలడట ఇతడు సునిశిత ప్రజ్ఞాశాలి. ఫిడేలరు, మంచిజ్ఞాని. ఇచట 'గుడ్డి' అనేది ఇతనికి బిరుదనామం కాకపోయినా అంగలోపాన్ని సూచిస్తుంది. అంధుడైనా మంచి ప్రావీణ్యం కల్గిన వాడుకనుక 'గుడ్డి' అనేది ఇతనికి పౌరుషనామమై ఇంటిపేరుగా మిగిలిపోయింది.

iv. చిత్తారు : చిత్తారు గంగాధర కవి ఇంటిపేరు చిత్తారు. ఇది సంస్కృత పదమైన చిత్రకార — శబ్దంనుండి వచ్చింది.

"వంశవర్ధనుడు ఘనమైన చిత్తారు గంగాధరుండు
వినుపింతు నానేర్చు వినము—" అన్నాడు. (శ్రీం.భ.చ.అవ.పు. 3)

చిత్తారు గంగాధర కవి సిరియాళ చరిత్ర కృత్యంతరమున ఈతడు వెనవెళ్ల గంగాధరుడని కన్పిస్తుంది. వీరిద్దరును వీరయ్య మల్లాంబికలనే తల్లి దండ్రులుగా పేర్కొన్నందున ఇద్దరూ వేరుకారు. వెనవెళ్ల ఈతని గ్రామము, చితారు ఇంటిపేరును అయ్యుంటుంది. రచననుబట్టి ఈతడు 17వ శతాబ్దివాడు.

V. చౌదరి : "——— నిరతిన్ చౌదరి రామభూపతి" (ద్రౌపది, 1-50)

"భూమి పరిపాలనము పాద్షా మెచ్చగఁజేసి ముస్తుజానగరునకా
రామన పాదుషాహచే, ప్రేమనుపొందెఁ జౌదరి యనెడి బిరుదున్'
(ద్రౌపది. 1-155)

పాదుషాచే మెప్పుపొంది ఇతడు చౌదరి అనే బిరుదాన్ని పొందినట్లు ద్రౌపదీపరిణయంలోని ఈ పద్యం వలన తెలుస్తుంది. చౌదరి అనేది పట్టపుపేరుగా వ్యక్తినామం చివర అనుబంధంగా వ్యవహారంలో ఉంది. కాని బిరుదనామమని పేర్కొనబడడంచేతను, గృహనామస్థానంలో ఇది కన్పించటంచేతను ఈ పౌరుష నామం గృహనామంగా మారినట్లు తెలుస్తుంది. ముస్తుజానగరునకు అని చెప్పుటచే ఆ నగరమునకు చౌదరిగా నియమింపబడినట్లు తెలుస్తుంది. చౌత్ అనే పన్ను వసూలు చేసేవారిని (ఆదాయంలో 1/4 వంతు పన్ను) చౌదరి అని పిలుస్తారు. రాయసం, సముఖంలానే ఇది కూడ ఒక ఉద్యోగంగా కన్పిస్తుంది. కమ్మవారు ఈ ఉద్యోగములలో నియమించబడి ఉండడంచేత వారికి కలిగిన చౌదరి అనే బిరుదనామమే గృహనామంగాను, పట్టపు పేరుగాను కన్పించిందేగాని 'చౌదరి' అనే పదం నేడు గృహనామ స్థానంలో కన్పించదు. బెంగాల్‌లో కూడ చౌదరీలున్నా, వారు వీరు ఒకటికాదు. వారు చౌధురీలు.

vi. జయంతి : జయంతి రామయ్యగారిచే అనువదింపబడిన భోజపరచితమగు చంపూరామాయణ పీఠికలో తమ ఇంటిపేరునుగూర్చి ——

"వినుత కౌశిక గోత్రజ విప్రులందు
నలరు వెలనాటి వారనునట్టి శాఖ
వెలయు వెలనాటి శాఖలోపల జయంతి
వారు నానొప్పు విఖ్యాత వంశమొకటి" అని తన వంశాన్ని

గురించి వర్ణించుకున్నాడు. "ఇది శ్రీమత్కౌశిక గోత్ర పవిత్ర జయంతి వంశ రత్నాకర సుధాకర రామయ నామధేయ ప్రణీతాంధ్ర చంపూ రామాయణంబు—"
(జ.రా ; చం.రా.ఆశ్వా.గ.పు. 26)

vii బొమ్మలాట : "క్రీ.శ. 1521 నాటి ఒక శాసనమునుబట్టి బొమ్మలాటవారు తమ విద్యాధిక్యముచే అగ్రహారము ను బహుమతిగా పొందగలిగినారనియు, ఒక గణిత శాస్త్రగ్రంధమునుబట్టి ఒక బొమ్మలాట వంశస్థుడు కృష్ణదేవరాయలంతటి చక్రవర్తికి అధికారుడై, ఆందోళికాది సన్మానములను బడసెననియు తెలియు చున్నది. బొమ్మలాట యనునది ఇంటిపేరగుట గమనార్హం. ఒక వ్యక్తియో, వాని పూర్వులో బొమ్మలాట యందు బహుప్రసిద్ధి వహించియుందురు. ఆధునిక కాలంలో భారతము వారు, బి.ఏ.వారు అనునవి ఇంటిపేర్లయినట్లే ఆనాడు ప్రసిద్ధిని బట్టి బొమ్మలాట వారను ఇంటిపేరు వచ్చియుండును.

మరియొక శాసనమునుబట్టి (ఏ.ఆర్. 316 of 1928) కడప మండల మందలి కమలాపురం తాలూకా చిడిపిరాల గ్రామమును చంద్రమయ్య యను నతడును, బొమ్మలాట యమృతకవి యనునతడును తెరనాటకము లాడుటకై పెదచిట్టయ్య యనునతని కొసంగిరని తెలియుచున్నది. అనగా బొమ్మలాట వారున్నత పదవులందుండి రాజ సన్మానముల నందుచు స్వయంగా గ్రామదానముల నొసంగుచున్నారని నిర్ణయించుట అసమంజసము కానేరదు. తెరనాటకమనగా తెర వెనుక బొమ్మల నెక్కించి యాడించు నాటకము : అనగా బొమ్మలాట అని యర్ధము". (తె.నా.వి; బొమ్మలాట. పు. 147)

viii విశ్వనాధ : "వారి పూర్వులు విశ్వనాధపల్లి అను కృష్ణానదీ తీరమునందలి యొక గ్రామమున నుండెడివారు. ఈ గ్రామము కృష్ణాసముద్ర సంగమక్షేత్రమైన హంసలదీవి కెగువననున్నది. వారి పూర్వులెవరో కాశి నుండి విశ్వనాధ లింగమును తెచ్చి ఆగ్రామమున ప్రతిష్ఠచేసి దానికి విశ్వనాధపల్లి అను సార్థక నామధేయ మొసంగిరట. అప్పటనుండియు వారి ఇంటిపేరు కూడ విశ్వనాధగా మారినది." (కవి.విశ్వ; పు. 1). వీరి పూర్వులలో ఒకరైన వెంకటనరసుగారు విశ్వనాధపల్లి వదలి నందమూరు వచ్చారట.

పైఉదాహరణలవల్ల వీరి పూర్వులు ప్రదర్శించిన పాండిత్యం, ప్రజ్ఞ, ధైర్య

సాహసాలకు చిహ్నంగా బిరుదులు, బహుమతులు వారి అధికారులచే ఇవ్వబడ్డాయని. క్రమంగా అవేవారి ఇంటిపేర్లుగా స్థిరపడ్డట్లు తెలుస్తుంది.

5. **వృత్తులు** : వ్యక్తులయొక్క వృత్తిననుసరించి. చేస్తున్నపనిని బట్టి వచ్చిన గృహనామాలున్నాయి.

**అడపం** : పల్నాటి వీర చరిత్రలో గురజాలలో జరుగనున్న కోడిపందాలలో పాల్గొనడంకోసం తనతో రావడానికి బ్రహ్మన పిలిపించిన 33మంది సేవకులలో అడప కేశవ దాసి ముఖ్యడు. ఆసేవకులలో గొడుగును పట్టుకొనేవారు, మందులను వెంట తెచ్చేవారువున్నారు. వారిలో బామిదేవుడు, బిరుద భీముడు, మలిదేవమల్లు, కుంచ శ్రీరాముడు, గొడుగు మోగాయ, చండి పెంకాయ మొదలైన వారు పేర్కొదగినవారు. అడప కేశవదాసి ఈ సేవకులలో అగ్రగణ్యుడు. అడపము అనగా ఆకువక్కలుంచు భరణి. ఆనాడు ఇది ఒక గౌరవనీయమైన ఉద్యోగంగా పరిగణింపబడి వుంటుంది. అడప కేశవదాసి అలాంటి ఉద్యోగయి ఉంటాడు. అతడు అభరణినిచేత పట్టుకొని అవసరమైనపుడు ఆకులను చుట్టి బ్రహ్మనకు అందించుతుండేవాడు. అందుచేత ఆపేరు అతనికి వచ్చివుండవచ్చు. "కృత్యవేది యగు అడప కేశవదాసి రత్నములతో పొదగబడిన ఒక పళ్లెములో తాంబూలపు చుట్టనుంచుకొని గోపన్నను సమీపించి అతనిని తమలపాకు చుట్టతో సత్కరించిరి...." అని పల్నాటి వీరచరిత్రలో పేర్కొనబడింది. (ఆం.దే.చ.భూ.స;పు. 128) పై ముప్పైమువ్గురు సేవకులు చేసే వారివారి వృత్తులను అనుసరించి గొడుగు కుంచ మొదలైన ఇంటిపేర్లు ఏర్పడి ఉండవచ్చు.

**అర్చకం** : అర్చకం అనేది ఇంటిపేరు. వంశపారంపర్యంగా తిరుమల క్షేత్రంలో శ్రీ వేంకటేశ్వర స్వామివారి సన్నిధిలో అర్చన చేస్తున్నందున ఈవంశం వారికి వృత్తిని స్ఫురింపజేసే 'అర్చకం' అనే పదం ఇంటిపేరై స్థిరపడింది. నేటికీ 'అర్చకం' వారే వెంకటేశ్వర స్వామివారి ప్రధాన అర్చకులుగా ఉన్నారు. ఈ వంశంవారిలో అర్చకం శ్రీనివాసాచార్యులు ముఖ్యులు. ఇతడు 1850 ప్రాంతం వాడు. ఈతడు శాకుంతలానికి వ్యాఖ్యరచించాడు. శ్రీమద్రామాయణానికి వైఖానస సూత్రాలకు వ్యాఖ్యలురచించాడు. (ఆం.దే.చ.భూ;పు. 532_33)

**అవసరం** : అవసరం వెంకటయ్య ప్రస్తావన కృష్ణదేవరాయల పట్టాభిషేకపు

ఏర్పాటులను వివరించిన సందర్భంలో రాయవాచకంలో కన్పిస్తుంది. 1505 నుండి 1509 వరకు విజయనగర సామ్రాజ్యాన్ని పరిపాలించిన వీర నరసింహరాయల పరిపాలనావ్యవస్థలో రాజకార్య నిర్వహణలో ముఖ్యులైన వారిలో అవసరం వెంకటయ్య ఒకడు. అవసరం వెంకటయ్య పదవీ బాధ్యతలు ఇంటిపేరునుబట్టి మాత్రమే ఊహించుటకు అవకాశం ఉంది. ఏ పని అవసరమైనప్పుడు ఆపని నిర్వహించడానికి పోర్టుఫోలియోలేని మంత్రులను ఏర్పాటుచేయడం ఈనాటి ఆచారం. అలాంటి పద్ధతిని అనుసరించి వ్యవహరించడానికి ఏర్పడిన రాజకార్యనిర్వహణ దక్షుడేమో ఈ అవసరం వెంకటయ్య అని భావించవచ్చు. కృష్ణరాయల పట్టాభిషేక కాలమునాటికే వృద్ధుడై తర్వాత ఉద్యోగ విరమణ చేసినందువలనేమో అవసరం వెంకటయ్య ప్రస్తావన రాయల పరిపాలనాకాలములో మరికన్పించదు. కృష్ణదేవ రాయలు ఆమోదించిన రాజసభాసదులలో అవసరం వెంకటయ్య ముఖ్యుడని కన్పిస్తుంది. అవసరం వచ్చినప్పుడు కన్పించడం ఈతని వృత్తిగనుకనే ఈతనికి 'అవసరం' అనేది గృహనామంగా నిలిచింది.

కొట్టూరి : రెండవ వెలనాటి కులోత్తుంగ చోడరాజువద్ద నిడుబ్రోలి సబ్బి నాయకుడు కొట్టాలపై అధికారం వహించి వున్నాడు. అందుచేత ఈతని వంశీయులు కొట్టూరివారైరి. ఈతని కుమారుడైన కొట్టూరి ఎరియమ నాయకుడు శా.స. 1085 వ సం॥లో ఒక శాసనం వేయించాడు. ఈతడు మూడు కోష్టములపై అధికారిగా వెలనాటి కులోత్తుంగ చోడ నృపాలుని వద్ద వున్నట్లు అతని శాసనాల వలన తెలుస్తుంది. ఈతడు ద్రాక్షారామ భీమేశునికి అనంతారామంలో పోకతోట కొనియిచ్చి ప్రసిద్ధి చెందాడట. ఇచట తండ్రికి 'నిడుబ్రోలు' గృహనామంగా కన్పిస్తుంది. కొడుకుకు ఆ ఇంటిపేరు 'కొట్టూరు'గా మారింది.

"కొట్టరువు కొమ్మనామాత్య కూరిమిసుతుడు—" అని తిక్కనను గూర్చి కేతన తన దశకుమార చరిత్రలో పేర్కొన్నాడు. తిక్కన ఇంటిపేరు కొట్టరువు వారని మొట్టమొదటగా కేతన చెప్పాడు. కోష్ఠాగార మందున్న వారికి ఈపేరు కలుగుతుంది. తిక్కన పూర్వీకులు కోష్ఠాగారము నందుండి ఏదో పదవిలో ఉండటంవలన వారికి 'కొట్టారు' వారని పేరు వచ్చివుంటుంది. 'కొట్టారువే' 'కొట్టరువు'గా మారి ఉండవచ్చు. తిక్కన తరువాతనే వీరి ఇంటిపేరు మారి పావులూరి వారైనదనుట ప్రసిద్ధం. రాజుల కొలువులో కొట్టారు వారుగ నియమింపబడినందునే వీరికి ఈ గృహనామం కలిగింది.

తాపీ : తాపీ ధర్మారావుగారి ఇంటిపేరు తాపీ. వారు తమ ఇంటిపేరును గూర్చి ఇలా అంటున్నారు. "మా ఇంటిపేరు బండివారో, బండారు వారోనట. మాపూర్వులు ఆరోజులలో మిలిటరీలో సిపాయిలుగా ఉండేవారు. మూడు నాలుగు తరాలుగ ఆ వంశంలో ఒక కొడుకుమించి సంతానముండేదికాదట. మానాన్నగారి తాతగారు లక్ష్మయ్యగారు మిలిటరీనుండి తిరిగివచ్చి లేక మిలిటరీకి పోకుండానో తాపీ పనిలో ప్రవేశించారట. తాపీ లక్ష్మయ అన్న వాడుక ఊరిలో కలిగింది. అతని జీవిత కాలంలోనే మానాన్నగారు పుట్టడమూ, వారి తల్లిదండ్రులు గతించడం జరిగాయి. ఆ లక్ష్మయ్య భార్య మాకందరికీ అవ్వ. మానాన్నగారిని చదువులో వేసినప్పుడు తాపీ లక్ష్మయ్య మనుమడు కాబట్టి, తాపీ అప్పన్న అని వ్రాశారు. అది మొదలు మేము తాపీవారమయ్యాము. నిజం తెలిశాక కూడ ఆపేరు మార్చుకోవాలన్న అవసరం మాకు కలుగలేదు. నాటినుండి నేటివరకు మేము తాపీవారమే. ఇలాగే ఉంటాము. దీనిలో ఒక్క విశేషముంది. మా వంశంలో ఇప్పుడు గాని, ఇకముందుగాని ఎవ్వరెంత ఐశ్వర్యంలో వున్నా దీనికంతటికీ మూలము తాపీ పనే నని మరచిపోరు. మాదీ ఒక కార్మిక వంశమన్న మాట జ్ఞాపకముంచుకుంటారు. ఎప్పుడైనా ఒళ్ళు వంచి కష్టపడవలసివచ్చినపుడు అది చిన్నతనంగా భావించ డానికి జంకుతారు" (రాలూ.ర;పు. 16-17) అంటూ ఇంటిపేరు మార్చుకోడానికి వ్యతిరేకత చూపిస్తున్నారు తాపీ ధర్మారావుగారు.

నేబది : క్రీ.శ. 1580 – 1612 మధ్యకాలంలో గోల్కొండ రాజ్యాన్ని పాలించిన కులీకుతుబ్‌షా ప్రధాని మండలిలో కృష్ణమంత్రి ఒకడు. ఇతని వంశంలో ఆరవ తరంలో తాతగారు బెడదంకోటలోని సుల్తాన్‌షా వద్ద 'నౌబతి' పదవిలో ఉన్నాడు. నౌబతి అనేమాట 'నియాబత్' అనే పదానికి తెలుగు రూపం. దీనికి రాయబారి, స్థానాపతి అని అర్థం ఉంది. నౌబది కృష్ణమంత్రి పంచ తంత్రాన్ని వైష్ణవ ప్రబంధంగా మార్చి రచించి, దానికి 'రాజనీతి రత్నాకరం" అని పేరు పెట్టాడు.

ప్రబంధాంకం : మధుర ప్రబంధాలను రచించడమే వృత్తిగాగలవారు ప్రబంధాంకం వారు. కృష్ణరాయలు భట్టుపల్లె అనే గ్రామాన్ని ప్రబంధాంకం వారికిచ్చారట. (న.ఆం.సా,సం. 8; పు. 229)

బండారు : బసవపురాణాది గ్రంథాలలో బసవనార్యుని బండారు బసవన్న

అని వాడారు. 'బండారు' బసవన ఇంటిపేరు కాదు. ఇతని తండ్రిపేరు మండెగ మాదిరాజు అని తెలియడంవలన బసవనికి పూర్వం ఈ ఇంటిపేరు లేదు. కాని బసవన బిజ్జలరాజు వద్ద కోశాధ్యక్షుడుగా ఉండడం చేత ఈతనికి బండారు బసవన్న అని పిలిచేవారు. భాండాగారాధిపతిని 'బండారువు' అని పిలిచేవారు. బండారువే క్రమముగా బండారు అయింది. అతని సంతతి వారు ఆ గౌరవోద్యోగ నామమే ఇంటిపేరుగా నిల్పుకొని వుండవచ్చు. అందుకే బండారు తమ్మయ్య, బండారు అచ్చమాంబ. బండారు ఇస్మాకు భాగవతార్ మొదలగు వారు ఏకులానికి చెందినా, గృహనామంలో మాత్రం సామ్యం కన్పిస్తుంటుంది. భండారి ముప్పి నాయకుడు వెలనాటి కులోత్తుంగ రెండవ రాజేంద్ర చోడరాజు వద్ద భండారిగ వుండడంచేత ఆగృహనామం ధరించాడు. శ్రీద్రాక్షారామంలోని భీమేశ్వర స్వామికి ఇతడు శా.శ. 1087 సం॥లో అఖండ దీపదానం గావించి శాసనం రాయించాడు.

**రాయసం :** 'రాయసం' అనేది కూడ గృహనామంగా కన్పిస్తుంది. 'వ్రాయసం' అనేపదానికి మార్పుచెందిన రూపమే రాయసం. 'రాజస్వం' లేక 'రాజసం' అనేపదాలనుండి కూడ 'రాయసం' అను పదం ఏర్పడియుండవచ్చునని శ్రీతూమాటి దొణప్పగారు అభిప్రాయ పడుతున్నారు. కేంద్ర మండల ప్రభుత్వాలలో పూర్వం ఒక కార్యాలయం ఉండేదట, ఆ కార్యాలయంలో నియమించబడిన ప్రతి ఉద్యోగి 'రాయసం' అని పిలువబడేవారు. ప్రతి ఒక్క లేఖకుడు రాయసం కాకపోయినా ప్రతిరాయసం తప్పకుండా లేఖకుడై ఉండేవాడట. రాజుగాని మండలాధిపతిగాని యిచ్చిన లేక చెప్పిన వార్తలను వారిసమక్షంలోనే రాసేవారు రాయసంవారు. అంటే పూర్వపు రాయసం కొద్దిగా మార్పుచెంది ఆధునిక కాలపు సెక్రెటరీ లేక స్టెనోగ్రాఫరుగా మారారు. (హి.రె: పు. 210) రాయలు ఉదయగిరి విజయానంతరం కందుకూరు వైపుకు ప్రయాణమై వెళ్తూ అక్కడ తన ప్రతినిధిగా రాయసం కొండమరుసయ్యను నియమించినట్లు శాసనాలవల్ల తెలుస్తుంది.

"After the fall of Udayagiri fort, Krishnadevarya marched against Kandukuru, another important place in the Udayagiri rajya. After reducing it in Sep. of A.D. 1514, he appointed Rayasam Kondamarusayya as his regent at Udayagiri and then proceeded towards Kondavidu" Nellore inscriptions, Vol. II,

Kandukuru 27, dated 5,1436., (The Suryavamsa Gajapatis of Orissa, R. Subrahmanyam) ఈ విషయం వలన కృష్ణదేవరాయల కాలంలో రాయసం ఉద్యోగి యొక్క ప్రాధాన్యం తెలుస్తుంది.

సముఖం : సముఖం అనేది ఒక పౌరుషనామం, గృహనామం. సముఖం వెంకట కృష్ణప్ప నాయకుడు చొక్కనాథుని దళవాయి. విజయరంగ చొక్కనాథుని దళవాయిగా నుండిన వెంకట కృష్ణప్ప నాయకుడు స్వయంగా కవియై కవులను పోషించి తనపేలిక జాడలను, వదాన్యత్వపైఖరులను అనుగమించి పేరు ప్రతిష్ఠలు పొందాడు. నిరంతరం రాజసముఖాననే ఉండడం వలన తిరుమలేంద్రుని కొలువులో మీనాక్షినాయకుని ఇంటిపేరు సముఖమని మారి అప్పటినుండి అదే నిలిచిపోయింది. వెంకట కృష్ణప్ప నాయకుని వంశక్రమం చెప్తూ వెంకటపతి పూర్వీకుల నామాలు మాత్రమే తెలుపుతూ, మీనాక్షి నాయకుని దగ్గరకు రాగానే ఇంటిపేరు కలపడం వలన పై ఆలోచనకు కొంత ఆధారం కన్పిస్తుంది. ఈ కవి జైమినీ భారత వచన కావ్యాన్నే గాక సారంగధర చరిత్రమను మూడు ఆశ్వాసాల వచన గ్రంథాన్ని, అహల్యా సంక్రందనం, రాధికా స్వాంతనమనే ఏకాశ్వాస శృంగార ప్రబంధాన్ని రచించాడు.

VI. జననిరుక్తులు (Folk etymologies) : సాహిత్యంలో కొన్ని గృహ నామాలకు వ్యుత్పత్తులు కన్పిస్తున్నా, ఆధారంలేనివి కొన్ని ఉన్నాయి. అధి కారులను స్తుతించి ప్రశంసలందుకోవడానికో లేక ఈ ఇంటిపేరు ఇలావచ్చి ఉండవచ్చని వారి కవిత్వంలో పేర్కొన్నందువలనో కొన్ని వ్యుత్పత్తులు ఏర్పడ్డాయి. వీనినే జననిరుక్తులు అంటారు. సంఘంలో తమయొక్క స్థాయిని మెరుగుపరచుకోవడం కోసం వ్యక్తినామాలను, సంఘనామాలను, కులనామాలను గోత్రనామాలను సంస్కరించడానికి జనులు పూనుకుంటారు. ఆ సమయంలోనే జననిరుక్తులు ఏర్పడతాయి. "ఏదైనా ఒక భాషా రూపానికి కృత్రిమంగా కల్పించ బడ్డ వ్యుత్పత్తి ననుసరించి సిద్ధించే రూపాంతరీకరణాన్ని జననిరుక్తి లేదా 'ఫోక్ ఎటిమాలజీ' అని శాస్త్రకారులు నిర్వచించారు. శాబ్దికంగా జరిగే తికమకలు కృతక ప్రామాణిక రూపాల (hyper_forms) సృష్టికీ, అర్థపరంగా ప్రవర్తిల్లే అవక తవకలు కృత్రిమ వ్యుత్పత్తుల కల్పనకీ హేతువు లవుతాయి.

(తూ.దా. 1972-31)

**ఆచంట :** ఒడయనంబి విలాసంలో పేరయలింగం ఆచంటకు ఆపేరు ఎందుకు వచ్చిందో చెప్పాడు. ఒడయనంబి వేశ్యాలోలుడు, పరమ భక్తుడు. అతడు వేశ్య ఇంట్లో ఉన్నప్పుడు శివపూజకు వేళయింది. అప్పుడు ఒడయనంబి ఆమె కుచాన్నే శివలింగంగా భావించి పూజించాడట. పరమనాచి వెటకారంచేస్తే "దేవా! యిందులో నీవు లేవా? అని ప్రశ్నించాడట. ఉన్నాడనున్నాడనటంచు పల్కి మహాత్ములందరూ మెచ్చగా సంభవించాడట రామేశ్వరుడు. ఈ విషయం ఈ పద్యంలో ఇలా ఉంది. "—తనభక్తుడు చన్ను భజింప శంభుడా చంద మెరిగి చంట బలుకంగ గ్రామమాచంటయయ్యె" అని ఆచంట గ్రామానికి ఆపేరెలా వచ్చిందో చెప్పాడు. శివశతక కర్తయగు ఒక కవి ధూర్జటి కవీశ్వరుని శివభక్తి మహిమను ఇలా పొగిడాడు.

'చెలిచంటిమీద జేయిడి
చెలువొప్పశివా! యటన్న జేడియనవ్వన్
జలపట్టి శివుని జూపిన
చెలుని ధూర్జటిని దలతు జెన్నొందు శివా!

భక్తులు ఎండైనా భగవంతుణ్ణి చూపిస్తారు. స్తంభంలో ప్రహ్లాదుడు విష్ణుని చూపించాడు కదా! ధూర్జటి యిట్టి మహిమలుగల శివభక్తుడని ఆనాటికి పేరు గడించి ఉంటాడు. ఈ సందర్భంలోనే ఈ కవీశ్వరుని కాళహస్తీశ్వర శతకంలో ఒక పద్యం గమనింపదగి యున్నది.

"నిన్నే రూపముగా భజింతు మదిలో, నీరూపుమోకాలో, స్త్రీ
చన్నో! కుంచమో? మేక పెంటికయో...."

ఆచంట కథకు పైరెండు పద్యాలలో ఉన్న అభిప్రాయాలకు సంబంధం కన్పిస్తున్నందున ఒడయనంబి విలాసంలో ఉన్న కథకు కొంత బలం కన్పిస్తుంది.

**ఏకా :** 'ఏకా' ఇంటిపేరు ఎలావచ్చిందో ఈక్రింది పద్యంలో వివరించబడింది.

"శ్రీదండనార్య వజ్రినిస్తుల యశస్విన్ గన్న యేకాన్వయ ప్రాదుర్భావ
పవిత్రి వర్తనుడు...."

"ఎన్నడో పూర్వమందల మెక్కు నర్స
రాజను మహామహుఁడు సమర్థత మెరయగ
వ్రాసినాడట పెను జమాబందిలెక్క
లన్నియును నద్భుతముగ నొక్కాకులోన"

ఆ కౌశల్యము జూచి, యప్పటి నిజామాశ్చర్య ధుర్యాత్ముడై యేకావారని పిల్చి నన్మఱలి పోయెన్ గట్టు పల్యాఖ్యయా యేకా వంశము నందు బుట్టి, ధరణీ——".

పూర్వం నరసరాజను సతడు తన జమాబందీ లెక్కలన్నియును ఒక్క తాళపత్రము మీదనే లిఖించాడట. అతని నేర్పరితనానికి ఆశ్చర్యపోయిన ఆనాటి నిజాము వారిని 'ఏకా' వారని పిలిచారట. అప్పటివరకు 'గట్టుపల్లి' గృహనామంగా గలిగినవారు 'ఏకా' వారుగా మారిపోయారు. (ఖండ. 2 భా.పు. 6)

**కలిదిండి :** "మా కలిదిండి కామయ కుమారు డన్నిటందం డ్డి పై ఖరికాక...." అని కలిదిండి అన్న పేరు గృహనామంగా కన్పిస్తుంది. కలిదిండి భావనారాయణగారు విష్ణుపురాణం రచించారు. 1550 ప్రాంతంవాడు. కలిని దండించిన వారవడంచేత కలిదిండి అనే గృహనామం ఏర్పడిందని 'వరసావిత్రి చరిత్ర' అనే ప్రబంధ అవతారికవలన తెలుస్తుంది. విద్యార్థి కల్పతరువులోను, తెనుగు కవుల సంగ్రహ చరిత్రలోను ఈ కవి విశేషాలలో ఇంటిపేరు అడవివారు అని పేర్కొన్నారు.

**దోమా :** 'దో _మా'. అని 'దోమా' అనే ఇంటిపేరును విడదీసి ఇద్దరు తల్లుల సంతతి వారనే వ్యుత్పత్తిని శతావధాని దోమా వెంకటస్వామి గుప్తగారి చతురోక్తి.

**ధూర్జటి :** వేంకటగిరి సంస్థానంలో కారూరు ధూర్జటి అమ్మపాళెం అనే గ్రామం ఉందట. కారూరులో ధూర్జటి వారనే ఇంటిపేరు గలవారు ఇప్పటికీ ఉన్నారు. దీనివల్ల ధూర్జటి పూర్వులు 'ధూర్జటి అమ్మపాళెము' గ్రామ వాస్తవ్యులై వుండుననీ, అందుచే అసలుపేరు విస్మృతమై ఉంటుందనీ, ధూర్జటి ఇంటిపేరుతోనే కృష్ణదేవరాయల సభలో ప్రసిద్ధుడై వుండవచ్చునని కాళహస్తి మహాత్మ్య పీఠికలో శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావు రాశారు.

**పిల్లలమఱ్ఱి :** జైమినీ భారత కర్త పినవీరన ఇంటిపేరు పిల్లలమఱ్ఱి. ఈ వంశానికి ఈ ఇంటిపేరు వచ్చిన కథనం సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశంలో ఇలా ఉంది. గణపతి దేవుని సేనానాయకులైన రేచెర్ల రామిరెడ్డి, బేతిరెడ్డి సోదరులు ఆమన గంటికి ఆరుమైళ్లలో గల అరణ్యానికి వేటకు వెళ్లారు. వేటాడి అలసిన బేతిరెడ్డి సపరివారంగా ఒక మఱ్ఱిచెట్టు క్రింద విడిది చేశాడట. బేతిరెడ్డి ఏదో ఆలోచనలతో నిదుర మేల్కొనే ఉన్నాడు. ఇంతలో చెట్టుపై ధ్వని వినబడింది. పరికించి చూస్తే అది ఒక పిశాచపతి భేతాళుని ఆకారం. చిరకాలంనుండి ఆ వృక్షాన్ని ఆశ్రయించుకొని వున్నాడు. వృక్షమూలంలో వున్న నిధులకు అతడు రక్షకుడు. సాహసుడయిన బేతిరెడ్డి తన అసమాన ప్రతాపంచేత భేతాళుని నిర్జించి నిధులను సాధించాడు. ఈ సాహస కార్యానికి చక్రవర్తి సంతోషించి సత్కరించాడట. భేతాళ నిగ్రహం తరువాత అచ్చట నిధులను సంగ్రహించి బేతిరెడ్డి సోదరులు అచటనే ఒక మహానగరం నిర్మించి వటవృక్షంపేరుతో పిలిచారు. అదియే 'పిల్లలమఱ్ఱి' అనబడింది. తరువాత పినవీరన వంశీయులకు ఈ గ్రామ నామం ఇంటిపేరుగా వచ్చిందని ఈ క్రింది పద్యాల వలన కూడ తెలుస్తుంది.

"అమృతాంశు మండలం బాలవాలముగాగ
మొలచె నొక్కటి జగన్మోహనముగ
జిగిరించె విలయ సింధుగత కైతవడింభ
శయనీయ వర పలాశముల తోడ
పితృదేవతలకు నంచిత సత్రశాలయై
చెట్టు గట్టెను గయాక్షేత్రసీమ
నిలువ నీడయ్యె నిందీ వరప్రియ కళా
కోటీరునకు భోగి కుండలునకు
మఱ్ఱి మాత్రంబె పిల్లలమఱ్ఱి
పేరువలె గాదు శారదా పీఠకంబు" (జైమి.పి.ప. 22)

**పుష్పగిరి :** పుష్పగిరి తిమ్మన కుటుంబనామానికి మూలకారణమైన పుష్పగిరి గ్రామం కడప తాలూకాలోని కాజీపేట ఫిర్కాలో కడప పట్టణానికి వాయవ్యదిశగా పదిమైళ్లదూరంలో ఉంది. దీనిని దక్షిణకాశి అంటారు. వాయుభక్షణాధకుడు

శంకరుని ఆజ్ఞచేత పర్వతం తీసుకొని వచ్చి ఆ మడుగుపై వేస్తే అది పుష్పంలా తేలుతుండడం చూచి పడమట, తూర్పున వారివారి పాదాలచే త్రొక్కగా ఆపర్వతం కదలక నిలిచిందని, దీనిమీద సకల దేవతా గణాలతో శివ కేశవులు నివసిస్తూ భక్తుల కోర్కెలు తీర్చుతుంటారని పుష్పగిరి స్థల పురాణం వలన తెలుస్తుంది. కొండ పుష్పంలా తేలడం చేత దీనికి పుష్పగిరి అనిపేరు వచ్చింది. ఇదే తిమ్మనకు గృహనామ మయింది.

బాంధవకోటి : బాంధవకోటి శివరామయ్య తన సానందోపాఖ్యాన ఆశ్వా సాంత గద్యలో "కౌశిక గోత్ర సుధాణ్ణావకైరవ బాంధవకోటి బాపనయ్య తనూభవ సవినయగుణ విధేయ శివరామ నామధేయ--" అని తన గృహనామం బాంధవ కోటి అని చెప్పాడు.

"---బాపనయ్య వసుధాస్థలిలో వెలసెన్సమస్త ధా
త్రీరమణాగ్రగణ్యులును సుధీమణులార్యులు బంధువర్యులన్
గూరిమి సన్నుతింప ననుకూల నిజస్థిర ధర్మమార్గుడై".

కం- "కులజాండని నిజబాంధవ
కులభినుతి సేయనతని గురుకీర్తిరుచుల్
తళతళమను వజ్రింబులు
తల తలము గాను బొగడ దరమెవ్వరికిన్"

గీ. "బాపనయ్య యొనగు బాపనయ్యల కగ్రి
హార మౌక్తికాగ్రిహార వార
నార భూరి గంధవార రత్నాంబర
మాన్య మానతతులు మహిని వెలయ" (సానందో;పు.4)

బంధువులకు కూర్మి చేసెను గనుక ఈతనికి బాంధవకోటి అనే పౌరుషనామం కలిగి ఉండవచ్చు.

మరింగంటి : "మదగ్రజన్మ మరింగంటి యప్పలాచార్యసెంతు –
(దశ.రా.చ. 1–8)

దశరథ రాజనందన చరిత్ర రచించిన మఱింగంటి సింగరాచార్యుల గృహనామం ఆసూరి మరింగంటివారు. ఆసూరి గృహనామం విశిష్టమైనది. శ్రీమత్ రామానుజాచార్యులవారి గృహనామం ఇదే. ఆసూరి వారికి మరింగంటి అనే ఇంటిపేరు రావడానికి కారణం తమ రచనలందు ఇలా చమత్కరించారు. "శేష సంభవుడైన లక్ష్మణాచార్యుడు పండ్రెండువేల మంది త్రిదండ సన్యాసులు, ఏడువేల జనము, 74 వేల గురుజనము, లక్ష తిరునామ ధారులు వెంటరాగా శ్రీవైష్ణవ స్థాపనార్థమై బయలుదేరి అనుకూలురననుగ్రహించి, చెనటులను శిక్షించి అష్ట దిశలయందు శ్రీమతము నిల్పి శ్రీరంగమునకు తిరిగిరాగా లక్షణార్యులతో శ్రీరంగేశుడు –

"కంటిన్ లక్ష్మణ మునివరుఁ
గంటిన్ఁ గూరేశదేశిక స్వామి మఱిం
గంటి - నదెవ్వరన 'మఱిం
గంటి' మహాన్వయంబు దనరె గణ్యంబగుచున్"

(దశ.రా.చ. 1–16)

ఈవిధంగానే సింగరాచార్యుల తరువాత కవులును తమ గృహనామ విషయమై తెల్పిరి. 'గోదావధూటీ పరిణయం'లో కృత్యాది 25, 26 పద్యాలకొను, తాలాంక నందినీ పరిణయమును ఇట్లే తెలుపుచున్నది. ఇందు–

"కంటిమి మిము కూరేశులఁ
గంటిమి మీవెంట వచ్చు ఘనులెవరో మఱిం
గంటిమని బల్కెనది మా
కింటికి పేరుంట నామహిన్ రహికెక్కెన్" అని యున్నది.

"మరింగంటి వారని వచ్చుటకు పై కారణము కవికల్పితమేమో! 'మరికల్లు' అను గ్రామము ననుసరించి మరింగంటి, మరిగంటి అగు అవకాశము కలదు. మరికల్లు పేరుగల గ్రామములు దేవరకొండ, నల్లగొండ, మహబూబ్‌నగర్ తాలూకాలలో గలవు". (దశ.రా.పు. 7)

మేకా : యం.ఆర్. అప్పారావుగారి షష్టిపూర్తి సందర్భంగా రచించిన అభినందన పద్యాల్లో మేకా అనే గృహనామం మేకు నుండి వచ్చిందని కరుణశ్రీగారు

ఒక కృతకష్యక్ప్రత్తిని సూచించారు. సూజిపీడు జమీందారులు కుంఫిణీ ప్రభుత్వానికి మేకులాగ వుండి ప్రజలను రక్షిస్తుండేవారట. కుంఫిణీ ప్రభుత్వానికి భయపడ్డ జనులు మేకును సంబోధించి మేకా, మేకా అని ఆర్తనాదాలు చేసేవారట. అందు వలన వీరి ఇంటిపేరు మేకా అయిందని చమత్కరించాడు.

శృంగారకవి : శృంగార కవి అనే ఇంటిపేరు పౌరుషనామం. విస్సాప్రగడ వారు క్రమముగా విటులైరి. వీరి పూర్వులలో వెంకయ్యగారను నొకరు శృంగార పద్యములు నాల్గురచించి తమ గ్రామమునకు వచ్చిన ఒక మహమ్మదీయాధికారి వద్దకు వెళ్లి చదివిరట. ఆయన ఆనందపడి 'శృంగార కవివయ్యా'। అని ప్రశంసించి పందుము మెట్టక నేలను, గుఱ్ఱమునిచ్చి సత్కరించారట. నాడు మొదలు నలుగురును వీరిని శృంగార కవివారు అనుచుండిరి. ఇదే వారికి ఇంటిపేరుగా స్థిర పడినది". (ఆంధ్ర.పు. 192)

సురభి : "క్రీ.శ. 16వ శతాబ్ది చివరి వాడైన సురభి మాధవ రాయలు చంద్రికా పరిణయము రచించాడు. వీరి ఇంటిపేరు సురభి". మాధవరాయ కవికి పూర్వంకొంతకాలంనుండి 'సురభి' ఇంటిపేరుంది. కాకతీయ చక్రవర్తుల కాలమున వారికి సామంతత్వమువహించి వివిధ ప్రాంతాలను పాలించిన రాజవంశాలలో సురభి వంశము ప్రసిద్ధము. ఈ వంశము పరిపాలించిన రాజ్యమును జటప్రోలు సంస్థానమందురు. కాకతి గణపతి దేవునిచే సత్కరింపబడి పిల్లలమర్రి భేతాళ నాయుడని బిరుదు నొందిన రేచెర్ల చెవిరెడ్డి ఈ వంశమునకు మూలపురుషుడని వంశ చరిత్రలో తెలుపబడినది. ఇతని నుండి 12వ శతాబ్దివాడైన ఎఱసూరా నాయనికి మాదానాయడు, యాచమ నాయడు అను ఇద్దరు పుత్రులుకలరు. మాదా నాయని సంతతి జటప్రోలు సంస్థానాధిపతులైన సురభివారు. యాచమ నాయని సంతతివారు వెంకటగిరి ప్రభువులైన వెలుగోటి వారు. ఈ వంశానికి సురభియని పేరు రావడానికి కారణం పూర్వులెవరో సురభియను గ్రామము నేలియుండవచ్చు. ఇది గ్రామముకాదని, బిరుదనామమని సురభివంశ చరిత్రకారులు అభిప్రాయపడు తున్నారు. జటప్రోలు, వెంకటగిరి, బొబ్బిలి, పిఠాపురం వారికి రావు వారని గృహనామాలు కలిగినట్లే వీరికి సురభివారనే ఇంటిపేరు వచ్చిందని చంద్రికా పరిణయంలోని ఈక్రింది పద్యంలో పేర్కొన్నాడు.

"అర్థిసాత్కృత సురభి పరాళి సురభి
సుగుట వల్లీప్రకాండైక సురభికీర్తి
జిత సురభి శౌర్య సురభి నా సింగ నృపతి
పరంగ దద్వంశమును గాంచె సురభి సంజ్ఞ" ఇది

సరికాదని తోస్తున్నది. రేచెర్ల గోత్రులైన 36 తెగల పద్మనాయకులలో రావువారు, కటారివారు మాత్రమే పౌరుష నామధేయం గలవారు. తక్కిన తెగల వారందరికిని గ్రామనామాలే ఇంటిపేర్లుగా ఉన్నాయి. "ఆంధ్ర దేశములో సురభి అను గ్రామములు మహబూబ్ నగర్ జిల్లాలో ఒకటి, కడప జిల్లాలో ఒకటి ఉంది. మహబూబ్ నగర్ మండలంలోని కల్వకుర్తి తాలూకా సురభి గ్రామమే వీరి స్థానమై యుండును. ఇప్పుడా ఊరిని 'గోడల్' అనుచున్నారు. ఈ మార్పు నవాబు కాలమున కలిగి యుండవచ్చు లేదా 'గోదలు' అను దేశ్యశబ్దమునకు సంస్కృతీ కరణ రూపముగా 'సురభి' ఏర్పడి యుండవచ్చు. రేచర్ల వారి మూలపురుషులు ఆమనగంటి పురవరేశ్వరులు. వీరి తరువాతివారు రాచకొండ, దేవరకొండ దుర్గములను పాలించిరి. పై గోదల్ (సురభి) రాచకొండ, దేవర కొండలకు సమీపముననే ఉన్నందున ఈ వంశీయులు పెద్దనాయని వరకు గోదల్ పరగణానేలి యుండినందున ఈ సురభియే వీరి స్థానమని చెప్పవచ్చు".

(సం.ఆం.వి.సం. 4, పు. 5)

సురవరం : సురవరంవారు రెడ్డి కులజులు. వీరిది మోటాటిశాఖ. ఈ సుర వరం అనే గృహనామం ఇటీవల ప్రచారంలోనికి వచ్చింది. పూర్వం వీరి ఇంటి పేరు ఏమిరెడ్డివారు. వీరిది పేరిమాళ్ల గోత్రం. ఏమిరెడ్డి వారు తమ స్వగ్రామానికి పది ఆమడల దూరంలో ఎక్కడో లేరని ప్రతాపరెడ్డిగారు చెప్పుకున్నారు. అయినా కొల్లాపురం తాలూకాలోని కాళ్ళూరులో యిదే గోత్రానికి చెందిన 'వేమిరెడ్డి' వారున్నారు. "సురవరము వారి పూర్వులు బహుశః 250 సం॥ల క్రిందట 'షోరాపూర్' నుండివచ్చి 'ఇటికేలపాటి'లో స్థిరపడి యుండవచ్చును. షోరాపూర్ నుండి వచ్చిరి గనుకనే సూరాపురమువారని జనులు పిలిచెడివారు. ఈ సూరా పురమే వ్యవహార వశమున సురవరముగా మారినది. షోరాపూర్ సంస్థానమును సురపురము సంస్థానము అనికూడ వ్యవహరించుట కలదు. ఇది బొంబాయి షోలాపూర్ కాదు, దీనికి బేండర్ షోలాపూర్ అని పేరు. ఇది గుల్బర్గా సరి

హద్దులోనిది. బోయజాతి దొరలు రాజ్యముచేయుట చేత దీనికాపేరు వచ్చినది".
(సుర.జీ.పు.1)

సూర్యదేవర : "సూర్యదేవర వారు క్షత్రియులు. దక్షిణముననున్న పాండ్య చోళనాయకులు. ఆదిలో ద్రవిడ పాలిగార్లుగా నుండియుండవచ్చునని, కాలక్రమమున వీరు హోదావలన, అధికారమువలన క్షత్రియ బిరుదులగు 'దేవర, వర్మ' యను వానిని పొందిరని కాల్డ్వెల్ అను విద్వాంసుడు వ్రాయుచున్నాడు. ఈ విధముగా వీరికి చివర దేవ, దేవర అనియుండుటచేత వారు వీరు ద్రావిడ నాయకులై యుండవచ్చునని చెప్పవచ్చును. క్రమముగా క్షత్రియులై రాజ్యపాలనచేసిరి. 'దేవర' శబ్దము వీరు క్షత్రియులని స్పష్టము చేయుచున్నది.

ఇక సూర్య శబ్ద విచారణ. 'సొర' యను శబ్దము తమిళ దేశమునకు ఉత్తరమున నున్న భాగము అని తెలియపరచును. ఆ కాలపు తమిళ వాఙ్మయమును బట్టి చూడగా ఈ సోరుల ముఖ్యనగరము 'ఉరయూరు' అని తెలియుచున్నది. కనుక సోరులను సంస్కృతములో చోళులని, తెలుగులో కూడ చోళులని పిల్చెదరు. 'సోరులు', 'సొరగలు' సోరీయులు ఈ పదములన్నియు చోళులను పదమునకే సరిపోవుచున్నవి. సూర్య, సోరియ శబ్దములు దగ్గరగానున్నవి. చోళ శబ్దార్థములో గానిచో ఈ వంశీకులు సూర్యోపాసకులైన క్షత్రియులని లేక కరికాలచోళునివరె సూర్యవంశజులని చెప్పవచ్చును. వీరు క్రమముగా సూర్య, చంద్ర, అగ్ని కుల వంశముల అభిరుచులను కృషిచేసిరని తెలియుచున్నది. వీరి యొక్క కులబిరుదము 'దేవ' యని నేడు మారివాస్ అను వారికి కూడ నిదియే కలదని కాల్డ్వెల్ వ్రాయుచున్నాడు. వీటినన్నిటిని సమన్వయముచేయగా సూర్యదేవర వారు మొదట చోళులని, కరికాలచోళ వంశజులని, ఒరయూరు, తిరుచినాపల్లి ప్రాంతముల నుండిరని, రాజ్యపాలన చేత క్షత్రియులైరని నన్నెచోడుడు మొదలగు తెలుగు చోడులకుగల బిరుదములు వీరికి కూడ యుండుటచేత వీరు, వారు ఒకేవంశమునకు చెందినవారని 'ఊహ' కలుగుచున్నది". (సూర్యదే. పు. 56, 64)

"—— పరమ భక్తాను మోద
సూర్యదేవర వంశజ సూర్యతేజ
లక్ష్మణాఖ్యలలామ ప్రోల్లసితనామ" అని సూర్యదేవర వారిని గురించి చాటు పద్యాలలో పేర్కొనబడింది.

ఇంటిపేర్లలో భిన్నత్వం ఉంది. ఈ ఇంటిపేర్లు పూర్వం రెండు మూడు తరాలకొకసారి అరుదుగా మారుతుండేవి. కాని ఇప్పుడు గృహనామాల్లో మార్పు అధికంగా కన్పిస్తుంది. ఈ మార్పులకు గల కారణాలు పరిశీలిద్దాం. సాహిత్యం లోని గృహనామాలలో మార్పులు ఏడు విధాలుగా ఉన్నాయి. 1. గ్రామనామాలు, 2. నివాస ప్రదేశాన్ననుసరించి, 3. బిరుదులు లేక పౌరుషనామాలు, 4. వృత్తి ననుసరించి, 5. సంస్కృతీకరణ, 6. ప్రసిద్ధ పురుషులనుండి, 7. సందిగ్ధస్థితి వలన.

1 గ్రామనామాలు : మిర్యాలగూడెం తాలూకా నిడిశెనమెట్ల గ్రామంలో కందాళ రత్నమాచార్యులు ఉండేవారు. విశిష్టాద్వైత సిద్ధాంతంలో పారమందిన పండితులు. కాని వీరి కుమారులంతా పండితపుత్రులే. వీరి గృహనామమైన 'కందాళము' పోయి గ్రామనామమే గృహనామంగా మారిందని "నిడిశెన మెట్లు రత్నయకు నీచులు పుత్రులు బుట్టిరేడ్వురీ--" (చాటు.ర:పు. 82) అనే వాక్యం వలన తెలుస్తుంది.

పెనుమళ్ల గృహనామంగా కలిగినవారు పిల్లలమర్రి వారి పుత్రులు. వీరిలో ఒకరికి గజపతి ప్రభువు పెనుమళ్ళ గ్రామాన్ని ఇచ్చాడు. అప్పటినుండి 'పిల్లల మర్రి' గృహనామంగా గలవారిలో ఒక శాఖవారు 'పెనుమళ్ల' వారయ్యారు.

వట్టివేళ్ల ఇంటిపేరు 'అయ్యనకోట' వారుగా మారిందనడానికి ఒక ఉదాహరణ. "సిద్ధాంతోద్ధారకాద్దంకి తిరుమల తాతాచార్యవర్య శిష్య ప్రశిష్య వట్టివేళ్ల గోత్రోద్భవ అయ్యనకోట తిరుమలశ్రేష్ఠి తనూభవ--" అని అయ్యనకోట అనే గృహనామాన్ని తన ఆశ్వాసాంత గద్యంలో అయ్యనకోట పార్థసారధి శ్రేష్ఠి పేర్కొన్నాడు.

"లలి వట్టివేళ్లయిలు వడి
బలుకొనఁదొలి గొర్నెపాటి వారన మాపె
ద్దలు వెలయగఁగొన్నితరం
బులు సనసట గొందఱుందుఁబొదలిన బలిమిన్"

అలవున నంప విద్దె మెఱయన్ గడునేరిచి యెందుఁబేరు పెం
పులును గరంబు మేటిలిన బ్రోలగు నయ్యన కోటఁజొచ్చియ
మ్ముల యలవవ్విలాతి దొరమ్రోలను జూపిన నాఁట గోతెపే
రలవడ బిరుదందిరి"యయ్యన కోట వారనన్" (సత్య.వి. 1–22, 23).

వీరి పూర్వపు గృహనామం గొర్నెపాటివారు. గొర్నెపాటి గృహనామంకల వారి పెద్దలు కొన్ని తరాల తరువాత అంపవిద్యనేర్చుకొని ప్రసిద్ది చెందివారి విద్యా ప్రావిణ్యాన్ని చూపించడానికి ప్రసిద్ధి చెందిన 'అయ్యనకోట' ప్రవేశించి దొర ఎదుట ప్రదర్శించారట. ఆనాటి నుండి వీరికి 'గొర్నెపాటి' గృహనామం మరుగై పోయి 'అయ్యనకోట' వారని ప్రసిద్దికెక్కారట.

శ్రీనాధుడు భీమేశ్వర పురాణ అవతారికలో కృతిపతియైన బెండపూడి అన్న మంత్రి వంశంలోని వారి కార్యఖడ్గనైపుణ్యాన్ని, సాహసౌదార్యాలను, ధర్మనిరతిని పేర్కొన్నాడు. ఈ వంశంలో ప్రోలయ అన్నమంత్రి కొలని ప్రతాపరుద్రుని చేత 'ఆరేడు' అనే గ్రామాన్ని అగ్రహారంగా పొందాడు. కనుకనే ఈ వంశానికి ప్రోలయ అన్నమంత్రి తరువాత ఆరేటి వారనే ఏర్పడింది.

"కొలను ప్రతాపరుద్ర నృపకుంజరు చేతనరేఁడు సారణీ
సలిల వివర్ధమాన బహుసస్యసమాకుల మగ్రహారమై
వెలయ విభాకర గ్రహణవేళఁదగంగఁ బరిగ్రహించి బం
ధుల భరియించె నన్నవిభుతో సరియెట్లు ప్రధానువెవ్వరున్ (భీ.పు. 1-50)

అన్నమంత్రి అన్నయైన లింగనమంత్రి అల్లాడరెడ్డికి చేదోడు వాదోడుగా వుండి అతని యుద్ధకార్యాలను సరిదిద్దుతుండేవాడట.

"––– దన నిజస్వామి నల్లాడు ధరణి నాధు
భళిరె యరియేటి లింగన ప్రభు వరుండు" (భీ.పు. 1-63)

భీమేశ్వర పురాణంలో పేర్కొన్న పై రెండు పద్యాల వలన 'అరేటి' 'అరియేటి' అని రూపాంతరాలు కన్పిస్తున్నాయి. కాటయ వేమారెడ్డి తన బావమరిది, రాజైన కుమారగిరి అభ్యర్థనమీద తాను తూర్పుదండయాత్రకు సింహాచలం వరకుబయలుదేరి రాజ్యాన్ని విస్తరించతలపెట్టాడు. కిమ్మిరు సీమను, నల్లగొండ కోటను ఆక్రమించు

కొని బెండపూడి దుర్గాన్ని ఆక్రమించ తలంచారు. బెండపూడి మొదలైన ప్రదేశాల లోని వీరభటులు యుద్ధవిద్యలలో ఆరితేరిన వారని తెలుస్తుంది. కనుక శిష్ట విద్యానిధి, శూరాగ్రణి అయిన అరియేటి లింగనామాత్యులను, వారి తమ్ముడైన అన్నయను సేనలను నడిపించడానికి నియమించారు. లింగనామాత్య సేనాని తన సేనలతో బెండపూడిని ముట్టడించాడు. బెండపూడి కోట కాకతీయచక్రవర్తుల కాలంలో నిర్మింపబడింది. ఆకోట చుట్టూ లోతైన అగడ్త ఉంది. లింగనమంత్రి యొక్క విలుకాండ్రు వేసే బాణాల ధాటికు బెండపూడి విలుకాండ్రు నిలువలేక పోయారు. యువకుడు అయిన అన్నయ తన అన్నయైన లింగనకు తోడుగా వుండి బెండపూడి రాజును, రాకుమారులను సంహరించాడు. కోటకు వారసులు లేనందున, యుద్ధంలో నేర్పరి తనాన్ని చూపినందున అరియేటి లింగన సోదరుడైన అన్నయను రాష్ట్రాధిపునిగా నియమించారు. దాంతో వారు బెండపూడి వారయ్యారు. ప్రోలయ అన్నమంత్రిని ప్రతాపరుద్రుని కాలంలో అరియేటి అన్నమంత్రిగా పేర్కొన్నారు. తరువాత కుమారగిరి రెడ్డి కాలంలో అరియేటి – బెండపూడిగా మారిందని చెప్పవచ్చు.

సురవరం ప్రతాపరెడ్డి మోటాటి శాఖకు చెందిన రెడ్డివారు. పూర్వం వీరి ఇంటిపేరు 'ఏమిరెడ్డి' వారు. వీరి పూర్వులు గుల్బర్గాజిల్లాలోని 'సురపురం' సంస్థానంనుండి వచ్చారు. అచటి నుండి ఈ వంశంలోని ఒక శాఖ నాగర కర్నూలు తాలూకాలోని 'వట్టెము' గ్రామంలోను, మరొక శాఖ కొల్లాపురం తాలూకాలో కొన్నాళ్లుండి సుమారు 250 సం॥లకు పూర్వం ఆలంపూరు తాలూకా ఇటిక్యాలపాడు గ్రామంలోను స్థిరపడ్డారు. అందువలన వీరికి సురాపురంవారని, సురవరం వారని ఇంటిపేరు వచ్చింది. ఈతడు 1896 లో జన్మించాడు.

వత్సవాయి రాజవంశస్థులు సూర్యాన్వయ సంభవులని, వీరికి మూల పురుషుడు సాగిపోతరాజని, ఏనుగు లక్ష్మణ కవి తనరామవిలాసము నే గ్రంథంలో ఇలా పేర్కొన్నాడు —

"సహ్యజా తీరమునకు భూషణమనంగ
సిరుల కిరవగు గుడిమెట్ట పురముదనకు
రాజధానిగ సత్కళా భోజరాజు
సాగి పోతక్షమాభర్త జగతియేలె"

1178–82 ల మధ్య జరిగిన పల్నాటి వీరయుద్ధంలో నలగామరాజుకు సహాయంగా సాగి పోతరాజు వచ్చినట్లు చెన్నపట్టణంలోని లిఖిత పుస్తక భాండాగారం లోని పలనాటి వీరచరిత్ర అనే గ్రంథం యొక్క లిఖిత ప్రతిలో కన్పిస్తుంది. ప్రతాపరుద్రుడు మహమ్మదీయులతో ఓడిపోయి ఏకశిలానగరం తురుష్కుల వశమైన తరువాత ఈ పోతరాజు పుత్రుడైన తెలుగురాజు రేపల్లి దుర్గానికి, రామరాజు వత్సవాయి దుర్గానికి అధిపతులుగా వుండి, మహమ్మదీయ పాలనకు లోబడి కొంతకాలం వేమారెడ్డి మొదలైన రెడ్డి నాయకులతోనూ పోరాడుతూవచ్చారు. వీరిలో రామరాజు గారు వత్సవాయ దుర్గాధీశులై పరిపాలించడంచేత ఆసంతతి వారికి వత్సవాయవారు అనే ప్రసిద్ధి కలిగిందని రామవిలాసంలోని—

"ఆరామ రాజేంద్రుఁడా జి రంగంబున
వైరి రాజులగెల్చి వారిచేత
మదగజ కంఖణా మాణిక్య గాణిక్య
కనకాంబరములు పాయనములందె
యాచక శ్రేణుల కభిమతార్థములిచ్చెఁ
బ్రజల సంరక్షించె భరతునట్లు
తగవత్సవాయాఖ్య నగరంబు నిజనివా
సముఁజేసెనది కారణముగ సాగి
వంశమునకు వత్సవాయ నామములోక
సుప్రసిద్ధమగుచు సొంపుగాంచె" (పెద్దా.చ,పు. 7) అనే

పద్యం వలన తెలుస్తుంది.

తామర పల్లి తమ్మయ ఇంటిపేరు తామరపల్లి. ఇతని పూర్వపు గృహనామం ఇదికాదు. "—— విద్యావిధాన తామర పల్లి తిమ్మయ ప్రధాన--" (శేష. ధ; ఆశ్వా.గ.పు. 154). 'తామరపల్లి' వారికి పూర్వం పైడిగంటం వారు అనే ఇంటిపేరు ఉండేది. తిమ్మయకు ఏడవ తరంలోని అబ్బయమంత్రి అనే పూర్వీకుడు పౌఢ దేవరాయల్ని మెప్పించి పైడి గంటం బహుమతిగా పుచ్చుకొన్నందువల్ల వారికి పైడిగంటం వారనే గృహనామం కలిగింది. కాని తిమ్మయ తామరపల్లి నివాసి. ఈ తామరపల్లి తూ.గో. జిల్లా, రామచంద్రపురం తాలూకాలో ఉంది, ఈ

వంశం వారికి గ్రామనామమే గృహనామంగా మారిందని 'శేషధర్మాలు'లో తామర పల్లి తిమ్మయ ఇలా పేర్కొన్నాడు—

ప్రౌఢరాయల మెప్పించి రాయసములు, పైడి గంటలు గొని వ్రాసి భద్రలీల
బైడిగంటము వారను పద్దుఁదెచ్చి, యలరె మీతాత ముత్తాత యబ్బ మంత్రి"
(శేషధ: 1-19)

"పైడి గంటము వారు నాఁబరలెవన్నె, నంత దామరపల్లె వారనగ నలరి
కుందనము మీదఁ బరిమళ మొందినట్లు. తిమ్మయామాత్య నీ కులమెమ్మెగాంచె"
(శేషధ. 1-24)

పైడిగంటం వారనే గృహనామం పోయి తామరపల్లి గ్రామ సంబంధం వల్ల 'తామరపల్లి' గృహనామం ఏర్పడింది.

ధరణికోటను కోటరాజులు పాలించారు. రెండవ కేతరాజు తరువాత ధరణి కోటనుండి యనమదల రాజ్యం విడదీయబడినట్లు కన్పిస్తుంది. కనుక యనమదలను పాలించిన కోటరాజులకు కోట గృహనామానికి బదులు యనమదల వచ్చి యుండ వచ్చు. (కమ్మ.చ,పు. 113)

'ముగ్గుళ్ల' వారు విద్యలచే గజపతులను మెప్పించి అజ్జరమనే గ్రామాన్ని బహుమతిగా పొందారట. ఈ వంశమూల పురుషుడు కొండన. అజ్జరపు పేరయ కవి తన ఒడయనంబి విలాసపు కృత్యవతారికలో 'ముగ్గుళ్ల' వారు 'అజ్జరపు' వారుగా మారటాన్ని ఇలా చెప్పాడు.

"అతడు ముగ్గుళ్ల వంశమున
నర్థి జనించియు రాజదత్తమై
క్షితి జెలువొందు నజ్జరము
జేకొని పాలన మొప్పజేయ భా
సితగతి నజ్జరంపు కుల
సింధు సుధాకరుడై చెలంగె
.... .... .... .... ...."

ముగ్గుళ్ల వంశంలో జన్మించినా, అజ్జరం అనే గ్రామాన్ని పాలించి నందున వారికి

ఆగ్రామనామమైన అజ్జరం వంశ నామంగా నిలిచింది. ఈ అజ్జరం పశ్చిమ గోదావరి జిల్లా తణుకు తాలూకాలోని గ్రామం.

'తెనాలి' వారికి పూర్వం గార్లపాటి వారనే గృహనామం ఉందట. గార్లపాటివారు తెనాలి వారుగా మారినట్లు పాండురంగ మహాత్మ్యంలోని ఈక్రింది పద్యం వలన తెలుస్తుంది. —

"శ్రీ తెనాలి నగరే వ్యరాజ యద్గార్లపాటి పురరామ పండితః
శుక్ల మాఘ సితపంచమీ గురౌ రామలింగమమ యోత్సేవాకృతమ్"

తెనాలి గుడిలోని ఉత్సవం విగ్రహం మీద తెనాలి రామలింగని గూర్చి పైవిధంగా వ్రాయబడింది. బాల్యమందే తండ్రి మరణించడంచేత మాతులుని గ్రామమైన తెనాలి వచ్చినట్లు తెలుస్తుంది. అప్పటినుండే వారి గృహనామం 'గార్లపాటి' మారి 'తెనాలి' వారుగా వ్యవహరింపబడి వుండవచ్చు.

ఆలం వెంకటపతి పెమ్మసానిచేత పెంచబడ్డాడు గనుక ఇతనికి ఆలం స్థానంలో పెమ్మసాని అనే ఇంటిపేరు వచ్చింది. ఇతని కొమారుడు పెమ్మసాని తిమ్మానాయుడు. పౌఢదేవరాయల కాలంలో క్రీ.శ. 1423-46 ప్రాంతంలో రాయలచేత పావురాళ్లమీద కొలువుంచబడ్డాడు గనుక 'పెమ్మసాని' పోయి 'పావురాళ్ల' ఇంటిపేరయింది. తాడిపత్రిలోని యాడికి గ్రామాన్ని విస్తరించేందుకు రాయలచేత నియమించబడ్డాడు గనుక పావురాళ్ల తిమ్మానాయుడు యాడికి తిమ్మానాయుడయ్యాడు. తండ్రి కొడుకుల తరంలోనే మూడు గృహనామాలొచ్చాయి. గృహనామాల మార్పు ఎంతవేగంగా జరుగుతుందో ఈ ఉదాహరణ వలన తెలుస్తుంది.

ఒక ఇంటిపేరు గలవారు ఒక గ్రామంలో కొన్ని తరాలు నివసించి తరువాత మరో గ్రామం వెళ్లినపుడు వారి ఇంటిపేరు మూలనపడి వారు విడచివచ్చిన గామనామమే గృహనామంగా ప్రసిద్ధి పొందడం జరుగుతుంది. అనేక కారణాల వల్ల ప్రజలు ఇలావలస వెళ్లడం, గ్రామనామమే, గృహనామంగా మారడం తరచు సంభవిస్తుంది. రాజులు పండితులకు అగ్రహారాలు దానాలు చేసినపుడు ఆ బ్రాహ్మణులకు ఆయా అగ్రహారనామాలు గృహనామాలయ్యాయి. ఒక వంశం వారు ఏదో ఒక గ్రామంలో తమ విద్యా ప్రావిణ్యాన్ని చూపినందువలన వారికి

ఆగ్రామ నామం గృహనామస్థానంలో నిలిచింది. గ్రామానికి కరణీకం చేసినందుకు గాను అతని ఇంటి పేరు సమసిపోయి ఆగ్రామనామమే గృహనామంగా స్థిరపడిందని పై ఉదాహరణలవలన తెలుస్తుంది.

ii. నివాస స్థలాన్ననుసరించి : కొలని గోపరాజు గృహనామం 'కోవెల' యని ఆంధ్రకవుల చరిత్రకారులు చెప్పారు. తాళపత్ర ప్రతిలో కోవలె' అని చూచి నట్లు చాగంటి శేషయ్యగారు ఆం.క త.లో చెప్పారు. సాహిత్యపరిషత్తువారు 'కొలని' అని ప్రకటించారు. ఈతడు నియోగి బ్రాహ్మణుడు, ఆపస్తంబ సూత్రుడు, హరితసగోత్రుడు. నిజాం రాష్ట్రంలోని 'కొలని' అనే గ్రామాన్నిబట్టి ఈపేరు వచ్చివుండవచ్చు.

కొలని వెన్నయ్య క్రీ.శ. 13వ శతాబ్దివాడు. వెలనాటి పృథ్వీశ్వరుని రాజ్య సముద్ధరణుడు.

"హరి సిరిని వలచు సిరియును
వరుడుగ హరి గోరుఁగొలని వెన్నయ యెపుడు
న్వరకీర్తి సతిని వలచున
వరుసన్వరకీర్తి యతని వలచు సతతమున్" అనే పద్యాన్నిబట్టి

వెన్నయ మంత్రి మహోదాత అని తెలుస్తుంది. ఇతని కుమారుడు పెద్దిరాజు 'పల్లె కొండ' రాజు మల్లనచే అందలములు, కంచెలు గైకొన్నాడని సింహాసన ద్వాత్రింశికలో కొలని గోపరాజు పేర్కొన్నాడు. ఇతడు ఆర్వేల నియోగి బ్రహ్మణుడు, హరితస గోత్రుడు, ఆపస్తంభ సూత్రుడు. "గుంటూరు సీమలోని ఒక కోనకు చెందిన సనదువోలు నెలవుచేసుకొని ప్రశస్తివహించెను. ఆతని గృహము ఆ కొనయందుండెనని తెలియబడుటవలన ఆతని కాలమునుండి కొలని వారు కోనవారయినట్లు అభిప్రాయ పడుతున్నారు." (దండనా;పు. 113)

కొలని వంశం వారి పూర్వపు గృహనామం ఇందులూరి. ఇందులూరి పురశాసనులవడంచేత (కరణమగుటచే) వీరికి ఇందులూరి వారని, తరువాత కొలను వీడు మండలేశ్వరులను పారద్రోలి ఆదుర్గాన్ని ఆక్రమించడంవల్ల ఇందులూరి ఇంటిపేరు మారి 'కొలని' అని ఏర్పడిందనీ ఆంధ్ర కవితరంగిణీకర్త పేర్కొన్నారు. (సం. 5, పు. 252)

బళ్లారి రాఘవాచార్యులు విప్లవ భావాలతో వినూత్న ప్రయోగాలు చేసి ఆంధ్ర నాటక రంగ చరిత్ర మీద తన ప్రభావంచూపిన మహానటుడు అతని అసలు ఇంటిపేరు 'తాడిపత్రి'వారు. బళ్లారిని నాలుగు దశాబ్దాలపాటు తన కార్యకలాపాలకు కేంద్రంగా చేసుకొనడం వలన అతనికి బళ్లారి రాఘవాచార్యులు అని పేరువచ్చింది. ఇతని తండ్రిపేరు అష్టావధానం నరసింహాచారి. ఇక్కడ తండ్రికి పూర్వపు గృహ నామం తాడిపత్రి కాగా అతడు అష్టావధానం చేయడం వలనే మో అష్టావధానం అనే పౌరుషనామం గృహనామమై అతని కుమారుడైన రాఘవాచార్యులకు ఈ రెండింటిలో ఏదీ గృహనామంగా నిలవకుండా అతడు నివసించి ప్రఖ్యాతిచెందిన గ్రామమైన 'బళ్లారి' గృహనామమయింది. ఇతడు 1880లో జన్మించాడు. ధర్మవరం కృష్ణమాచార్యులు ఇతనికి మేనమామ. నివాస ప్రదేశాన్ననుసరించి వీరు తమ గృహ నామాలను కోల్పోయి ఆయా నివాసప్రదేశ నామాలను స్వీకరించినట్లు పై ఉద హరణల వలన తెలుస్తుంది.

iii. **బిరుదులు లేక పౌరుషనామాలు :** 'బయకారం' అనేది పౌరుష నామం. బయకారుడంటే సంగీత విద్వాంసుడని అర్థం. బయకారం రామప్పయ్యది పేరు ప్రతిష్ఠలుగల వంశం. రామప్పయ్య తండ్రియైన పెద తిమ్మయ విజయనగర చక్రవర్తి అచ్యుత దేవరాయలవద్ద (1529–42) 'రాయసం'అనే మంత్రి పదవిని వ హించాడు. ఈ పెద తిమ్మయ (రాయసం తిమ్మరుసయ్య) రాజనీతిజ్ఞుడే గాక ధార్మిక చింతన కలవాడు. రామప్పయ్య గొప్ప రాజ్యతంత్రజ్ఞుడు. సంగీత సాహిత్యాలలో ఘనమైన పాండిత్యం కలవాడు. ఈతని సంగీత సాహిత్య విశారదతకు ఇతడు సంస్కృతంలో రచించిన 'స్వరమేళ కళానిధి' అనే సంగీత శాస్త్ర గ్రంథం సాక్ష్యం. రామప్పయ్య అచ్యుత దేవరాయల వద్దను, అళియ రామరాయల వద్దను, తన సంగీత విద్యను ప్రదర్శించి మెప్పుపొందాడు. అచ్యుత దేవరాయల వారి రాణి వాసపు స్త్రీలకు, అళియ రామరాయల కుమార్తెలకును సంగీతం నేర్పిన విద్యాగురువు. అందువలననే ఇతనికి 'రాయసం' అనే ఇంటి పేరుపోయి బయకారం అనే ఇంటిపేరు వచ్చింది.

ఏనుగు గృహనామం గలవారి పూర్వపు ఇంటిపేరు 'పైడిపాటి' వారు. పైడిపాటివారి పూర్వులలో జలపాలామాత్యుడనే అతడు తన ప్రభువువల్ల ఏనుగును బహుమతిగా పొందడం వల్ల ఆవంశంవారు 'ఏనుగు' వారయినట్లు ఏనుగులక్ష్మణ

కవి తన సుభాషిత రత్నావళిలో పేర్కొన్నట్లు ఈ క్రింది సీసపద్యం వలన తెలుస్తుంది.

"—— శ్రీపైడి పాటి సింగన మంత్రి
వంశాగ్ర గణ్యుడై వరలునతని
మహిమ సంతాన క్రమమునను జలపాల
సచివుడొప్పె బలారి సచివ సముడు
గజపతి క్షితి భర్తచే గజము తోడ
నగ్రహార ములతడు పరిగ్రహించె
నెలమి నేనుగు వారన్న ఇంటిపేరు
గలిగెనతనికి గజలాభ గరిమ వలన" — ఈ ఏనుగు

బహుమానం క్రీ.శ. 1500 ప్రాంతంనుండి అమలులోనికి వచ్చినట్లు తెలుస్తుంది. కొందరు తాము పొందిన బిరుదుల, బహుమానముల పేర్లను ఇంటిపేర్లకు మారుగా నిల్పుకున్నారు.

iv. వృత్తి ననుసరించి : తాపీ ధర్మారావుగారి ఇంటిపేరు ఈ కోవకు చెందినదే. చేస్తున్న వృత్తినిబట్టి ఇంటిపేరు జారిపోయిన సంఘటనలున్నాయి. ఆంధ్రనాటక పితామహ బిరుదాంకితులైన ధర్మవరం రామ కృష్ణమాచార్యుల వారు క్రీ.శ. 1853 లో అనంతపురం జిల్లా తాడిపత్రి తాలూకా, ధర్మవరం గ్రామంలో మాతామహుల ఇంటిలో జన్మించారు. వీరి పూర్వుల నివాసం కూడ ధర్మవరమే. ఈ వంశంలో పెద్దకొడుకు కృష్ణమాచార్యులని పేరుపెట్టడం ఆచారం. వీరి తండ్రి, తాతలపేర్లుకూడ కృష్ణమాచార్యులే. వీరు జన్మించేనాటికే వీరి తండ్రి కృష్ణమాచార్యులుగారు ధర్మవరం వదలిపెట్టి బళ్లారిలో స్థిరపడ్డారు. వీరు ఆంధ్రోపన్యాసకులయినా, వైద్యులుగా ఎక్కువ ప్రసిద్ధి పొందారు. అందువలన వీరిని వైద్యం కృష్ణమాచార్యులనేవారట. ధర్మవరం గ్రామానికి చెందిన వారు కావడంవల్ల 'ధర్మవరం' కృష్ణమాచార్యులనే వారు. ఇంటిపేరు కొమాండూరు. మొత్తంమీద వీరిపేరు 'వైద్యం ధర్మవరం కొమాండూరు' కృష్ణమాచార్యులు అయింది. (ధర్మ.రా;పు. 6). తండ్రికి గృహనామాలస్థానంలోనున్న పౌరుష నామాలను వదలి వారి గ్రామ నామమైన ధర్మవరమునే కుటుంబనామంగా స్వీకరించారు. అందువలననే వీరు ధర్మవరం రామ కృష్ణమాచార్యులుగా వ్యవహరింపబడ్డారు.

V సంస్కృతీకరణ : కొందరు తమ గృహనామం బాగుండలేదనో, అశ్లీలార్థాన్నిస్తుందనో, సంఘంలో గౌరవం మెరుగుపరచుకోడానికో ఇంటిపేరును సంస్కృతీకరించుకున్నారు

"ప్రభంజన వంశాబ్ధి రాకా శశాంక----

అభినవ నన్నయ భట్టారకా హోబలపత్యాహ్వయకవి--" అని

కాళిందీ పరిణయకర్త తన గృహనామాన్ని, వ్యక్తినామాన్ని సంస్కృతీకరించుకొని పేర్కొన్నాడు. ఈ కవి రచించిన అహోబలపండితీయంలో "ప్రభంజన వంశ ముక్తా మణినా-- అహోబల పత్యాచార్యేణ" అని ఉన్నది. దీనినిబట్టి ఇంటిపేరు ప్రభంజనము వారనీ, కవిపేరు అహోబలపతి అని తెలుస్తుంది కాని జయంతి రామయ్య పంతులుగారు ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక 15వ సంపుటము 2వ సంచికలో ప్రకటించిన అహోబలపండిత పీఠికా శ్లోకములో 75లో "వాతూల వంశేవ తతాభూయః" అనియు, 79లో "వాతూల వంశాగ్రణీః" అనియు నుండుటచే నీకవి ఇంటిపేరు 'గాలి' వారని స్పష్టపడుచున్నది. ఈ విషయమై శ్రీరామయ్య పంతులుగారు ఇంటిపేరు 'గాలివారు' అనియు, కవికి మొదటి పేరు నరసరాజు అనియు వ్రాసిరి. నరసింహస్వామి అహోబలక్షేత్రాధిపతి కావున వారట్లూహించి యున్నారు. ఇంతేకాక ఈకవి కుటుంబమువారు గుంటూరు మండలమున వినుకొండ తాలూకాలోని 'ముమ్మడివరం' గ్రామమందున్నారని కూడా వ్రాసియున్నారు. కావున వ్యవహారమందట్లు గాలి నరసరాజని యుండవచ్చు. ఈ పుస్తకమునకు కవి వంశస్థులలో నొకరు ప్రతి వ్రాసినారు. * చివర స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శక వర్షంబులు 1822 అగు నేటి శార్వరినామ సంవత్సర ఆషాఢ బ౹౧భృగు వారం వరకు ప్రభంజనం వెంకట సుబ్బయ్య శాస్త్రిగారి కుమారుడు లక్ష్మినారాయణ వ్రాసుకొన్న కాళింది కన్యాపరిణయము" అని రాసిరి. ఇలా గృహనామాలను సంస్కృతీకరించడం అనేక చోట్ల కన్పిస్తుంది. ఇచట 'గాలి' అనే గృహనామాన్ని 'ప్రభంజనం'గా మార్చుకున్నారు.

పెనుగొండను సంస్కృతీకరించి ఘనగిరి అని ఇంటిపేరు మార్చుకున్నారు. రామడుగుల వారు వ్యాకరణం వారని మార్చుకున్నారు. పైయా కరణం రామానుజాచార్యులు గొప్ప సంస్కృతాంధ్ర పండితుడు. ఇతడు చిన్నయసూరి శిష్యుడు, మహాభారతం ఆదిపర్వమంతటిని వచనంగా మార్చాడు. ఈతని కాలంనుండే ఈ గృహనామం వాడుకలోకి వచ్చి ఉండవచ్చు.

vi. ప్రసిద్ధ పురుషులనుండి

"ధరయథావాక్కులాన్వయు లుత్త్వ విదులు
వారిలో నొక్కసద్గురుండ మిత యశుడు
అన్నమార్యాధ్యుడని యెడ నార్యసుతుని
వంశ వృద్ధిని ——— ———" శః

యథావాక్కుల వంశమే క్రింది పద్యం వలన సోమరాజు వారుగా మారినట్లు తెలుస్తుంది.

"సోమరాజు కీర్తికాముడై విలసిల్లెఁ
దనదు సంతతికిని ధరణి యందు
గోపనార్య సుతుడు గృహనామధేయుడై
పెంపుబడసెఁబ్రస్తుతింపజనులు"

యథావాక్కుల వంశం సోమరాజుగా మారడానికి కారణం "అన్నమయ్యగారి వంశావళి" అనే గ్రంథంలో వెంకటశివుడు గారు చెప్పిన పై పద్యం వలన తెలుస్తుంది. యథావాక్కుల వంశంలోని సోమరాజు ప్రసిద్ధుడై ఉండడం వల్ల అతని నాటినుండి ఆవంశానికి యథావాక్కుల వారనే పేరుమారి సోమరాజువారనే పేరు కలిగింది. ఇప్పటికీ ఇదే వాడుకలో ఉంది.

ఒక వంశంలో ఏదో ఒక పురుషుడు ప్రసిద్ధి చెందినపుడు అతని పేరే ప్రసిద్ధిచెంది గృహనామ స్థానాన్ని అలంకరిస్తుంది. కొమరోశి అనే గృహనామం గల రామావఝ్ఝలు పేర రామావఝ్ఝల అనే ఇంటిపేరు వచ్చిందని కొండుభట్టు తన కపిల గోసంవాదంలో ఇలా పేర్కొన్నాడు.

'అమౌసీంద్ర కులంబున
శ్రీమత్కొమరోశి వంశ శేఖరుఁడగుచున్
రామావఝ్ఝలు డనగ సు
ధీమాన్యుండు దయ మయ్యోదేశింబెసగన్'

"రామావ ఝలుకాత్మ సత్యవచనారంభ ప్రచారంబునన్
రామాధీశ్వరుడే యనంగ దన పేరన్ వంశ ముప్పొంగను
ద్దామ ప్రేమ జెలంగ వ్యాసముని ప్రత్యక్షంబునై సద్వర
స్తోమం బీయ నొసంగె సర్వజన సంస్తూయ ప్రభావంబునన్'

కొమరోశి అనే ఇంటిపేరు గల రామావఝలుకు ఆవంశంలో ప్రసిద్ధి చెందినందున అతని వంశానికి అతని పేరే గృహనామమయింది.

vii సందిగ్ధస్థితివలన : కవులు తమ ఇంటిపేరు ఎక్కడా చెప్పుకోనందున సాహితీప్రియులు ఆయా కవులకు సంబంధించిన అనేకవిధనామాలను గృహనామంగా నిలపడానికి ప్రయత్నించారు. ఎఱ్ఱయ తన ఇంటిపేరు ఎక్కడా చెప్ప లేదు. విప్రనారాయణ చరిత్ర కవి తన ఆశ్వాసాంత గద్యంలో ఇది "--ప్రబంధ పరమేశ్వర వంశ పవిత్ర లింగన మనీషి పుత్ర శ్రీ కాళహస్తీశ్వర దయాసహాయ చెదల్వాడ మల్లయనామధేయ ప్రణీతంబైన --" (విప్ర,ఆశ్వా.గ.పు. 66) అని తాను ఎఱ్ఱన వంశస్తుడనని చెప్పుకున్నాడు. కృతి అవతారికలో

"--నీయనుంగు ముత్తాతయుఁ దాతయున్భువి విధాతలు

మల్లన ఎఱ్ఱనాహ్వయుల్" అని పేర్కొనుటవలన ఎఱ్ఱనకు ఇతడు చిన మనుమడని తెలుస్తుంది.

"దురిత హరు ప్రబంధ పరమేశ్వరుని జెద
ల్వాడ నిలయు నాదు వంశకర్త
ధన్యమూర్తి శంభుదాసు నెఱ్ఱాప్రెగ్గ
డనుతింప బ్రహ్మకును దరంబె" అన్న మల్లయ్య

సాక్ష్యమేగాక "క్రీ.శే. ప్రభాకర శాస్త్రి సంపాదించిన ఒక ప్రాచీన పద్య సంకలనంలో ఒక పద్యం చెదలువాడ ఎఱ్ఱాప్రెగ్గడ రచన అని లభించినట్లు వారు ప్రకటించిన ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణ పద్యంలో ఉంది" (రెడ్డి.సం.పు. 40)

ఎఱ్ఱన ఇంటిపేరు ఏర్చూరి వారని ఆంధ్రకవుల చరిత్ర మొదటి సంస్కరణములో వీరేశలింగం పంతులుగారు రాశారు. తరువాతి సంస్కరణలో చదలవాడ వారని సరిదిద్దుకున్నారు. అలా భ్రమ పడడానికి కారణం ఎఱ్ఱన అనేక

లుండడమూ, మన ఎఱ్ఱన తన ఇంటిపేరు ఎక్కడా చెప్పక పోవడమూ, భాగవతం ఆరవ స్కంధం వ్రాసిన ఏర్చూరి సింగయ "ఏర్చూరి శాసనుండెఱ్ఱప్రెగ్గడ" అని చెప్పడం చేతనని వారే చెప్పుకున్నారు. కాకరపర్తి నుండి చెదలువాడకు మారిన తరువాత ఎఱ్ఱయ ఇంటిపేరు చదలవాడ అయి ఉండాలి. చెదలువాడకి పూర్వం ఎఱ్ఱన పూర్వులు కాకరపర్తిలో ఉండేవారు. కాని అరణ్యపర్వశేష రచన నాటికి ఆతడు గుడ్లూరులో ఉండేవాడు. రెడ్డిదొరల ప్రాపకం కుదిరాక ఎఱ్ఱయ చెదలువాడలో కాపురం పెట్టాడు. ఆస్థాన కవిగా అద్దంకిలో ఉన్నా ఇతని నివాస స్థానం చదలవాడే అయ్యుంటుంది. ఇంతకు మునుపు ఏదైనా, చెదలువాడ నివాస మైన తరువాత అదే అతనికి గృహనామ మనడానికి సందేహంలేదు.

తిక్కన తాతగారు మంత్రి భాస్కరుడు. నిర్వచనోత్తర రామాయణంలో–

"సారకవితాభిరాము గుంటూరు విభుని
మంత్రి భాస్కరు మత్పితామహునిఁదలచి
యైన మన్నన మెయిలోక మాదరించు
వేఱనాకృతి గుణములు వేయునేల?" అని వుంది.

తిక్కన తాత గుంటూరు విభుడని పేర్కొనడంచేత అతని గృహనామం గుంటూరు వారని కొందరు పేర్కొన్నారు —

"మనుమసిద్ధి మహీశ సమస్త రాజ్య
భార ధౌరేయుఁడభిరూప భావ భవుడు
కొట్టరువు కొమ్మనామాత్య కూర్మిసుతుడు" అనే చోట

కొట్టరువు అనేది గృహనామంగా వాడబడింది. ఈతని గృహనామం గుంటూరు వారని, పాపులూరి వారని, కొట్టరువు వారని పలు అభిప్రాయాలున్నాయి. కొట్టరువు 'కోష్ఠాగార' శబ్ద భవం.

ఒకే పేరుగల వ్యక్తులు పలువురున్నపుడు అందులో ఒక ప్రత్యేక వ్యక్తిని నిర్దేశించడానికి తండ్రిపేరును జతపరచే అలవాటు అనేక భాషా కుటుంబాలలో ఉంది. సాహిత్యంలో అందుకు ఉదాహరణంగా మాదయగారి మల్లన కన్పిస్తున్నాడు. మాదయగారి మల్లన ఇంటిపేరు 'అయ్యంకి' అయ్యుండొచ్చునని ఆంధ్రకవి

తరంగిణీ కర్త ఊహ. ఇలాంటి వారికి అగ్రహనామాలు పోయి తండ్రిపేర్లే గృహ నామస్థానంలో వాడబడ్డాయి.

ఇమ్మడి వెంకట రెడ్డి కొడుకు గోపాలరావు. ఇతడు వైష్ణవ భక్తుడు. మహా పండితుడు. విద్వత్కవిసార్వభౌముడు. ఇతడు తెలుగు, పార్శీలతో బాటు సంస్కృత ప్రాకృతాది అష్ట భాషలలో పాండిత్యం సంపాదించాడు. ఆరాజు పాండిత్యాన్ని ప్రశంసించి ఆనాటి విద్వత్సభ వారు ఆయనకు 'అష్టభాషా' గోపాలరావు అని బిరుదును ఇచ్చి సత్కరించారు ఇతడు 'రామచంద్రోదయము' అనే సంస్కృత యమక కావ్యాన్ని అతిజటిలంగా నిర్మించి, దానికి తానే 'విజ్ఞేయార్థ దర్పణము' అనే వ్యాఖ్యానం రచించాడు. అప్పటి కుతుబ్‌షాహి నవాబు 'అబ్దుల్లా కుతుబ్ షాహి' గోపాలరావుకు 'బహరీ' అనే బిరుదును ఇచ్చారు. 'బహరి' అంటే పార్శీ భాషలో 'డేగ' అని అర్థం. డేగవలె ఇతడు తన శత్రువులను ఎంత దూరం నుండైనా సంహరించగలడని ఈ బిరుదు నొసంగారట. కనుక ఆయనకు 'అష్ట భాషా బహరీ గోపాలరావు' అనేపేరు ఏర్పడింది. ఇదే అతనికి గృహనామం అయింది. (తెలుగువాణి, స.3. 1978, పు. 46)

ఇక అయ్యలరాజు రామభద్రకవి ఇంటిపేరు విషయంలో విమర్శకులు వివిధ అభిప్రాయాలు వెలిబుచ్చుతున్నారు. కొందరు వీరి ఇంటిపేరు అయ్యలరాజువారు అంటే, మరికొందరు రాయకవి వారు అన్నారు. మరికొందరు 'పుత్తేటి' వారు అని నిరూపించడానికి ప్రయత్నించారు. 'రాయకవి యగు అయ్యలరాజు వంశ్య ననఘ' అని రెట్టమత శాస్త్రవచనం. 'అయ్యలరాజు వంశ్య' అనడం వలన అయ్యలరాజు వారనేది వంశనామమనీ, అయ్యలరాజు మొదలుకొని ఆ సంతతి వారందరూ అయ్యలరాజువారే అని ఊహించవచ్చు. రాయల ఆస్థానకవి అయి నందున ఇతడు రాయకవి అయివుండవచ్చు. ఆనాటి నుండి ఈ వంశం వారికి 'రాయకవి' వారని కూడా వంశనామం నిల్చిఉండవచ్చు. రామభద్రకవి వంశీయు లెవ్వరూ తమ వంశనామం 'పుత్తేటి' వారని పేర్కొలేదు. కాని గణపవరపు వెంకటకవి, లింగంగుంట తిమ్మకవి ఇతనిని పుత్తేటి రామభద్రయ్య అనే వ్యవ హరించారు. పుత్తేరు గ్రామ నామమై ఉండవచ్చు. ఇది ఇంటిపేరుగా మారింది లేనిదీ తెలియదు. ఇందు ఏది అతనికి గృహనామమో చెప్పడానికి ఆధారం లేదు.

నారాయణభట్టు గృహనామం 'వానస' వారు. నన్నయ రచించిన 'పాయక పాకశాసనికి' అన్న పద్యంలో 'దానును' అన్న శబ్దానికి బదులుగ దక్షిణ దేశము నుండి సంపాదించబడిన ఆంధ్రసాహిత్య పరిషత్కార్యాలయ మందుంచబడిన ఒక పత్రికలో 'మానస' అని ఉన్నది. వానస అనుటకు బదులుగా విలేఖకుడు పొరపాటున 'మానస' అని రాసి యుండవచ్చు. 'దానును' అనే పాఠం కంటే 'వానస' అను పఠమే సమంజసంగా తోస్తుంది.

'మడికి' సింగనకవి రచించిన పద్మపురాణాన్ని కృతిపొందిన కందనమంత్రి ఇంటిపేరుకూడ 'వానస' వారే. కాని అతడు కాశ్యపగోత్రుడు. దాక్షారామమందున్న ఒక శాసనంలో (ద హిం.శా.సం.౬ సంఖ్య ౧౦౪౨) "ద్రాక్షారామ నివాసః కాశ్యపగోత్రోగామచమూపః నాగనశర్మ పుత్రో వానస భూదేవ వంశ వారిజమిత్రః అల్లనశౌరిః" అని యున్నది.

కాని నారాయణభట్టు హరితస గోత్రుడు. 'వానస' వారిలో రెండు మూడు గోత్రముల వారుండి యుందురు. హైదరాబాదు గవర్నమెంటు వారు ప్రకటించిన నాగాయి శాసములలో దాకలయిన గోవింద రాజు మొదలయిన వారుకూడ 'వానస' వంశీయులే. వారు పశ్చిమ చాళుక్యుల కడ మంత్రులుగను, దండనాథులుగ నుండిరి. కానివారు వసిష్ఠ గోత్రులయినట్లు కన్పించుచున్నది. నారాయణభట్టు తండ్రి శౌచాంజనేయుడను నామాంతరము గల శంకనామాత్యుడు. తండ్రికి అమాత్య శబ్దమును ప్రయోగించుటచే నారాయణభట్టు నియోగి శాఖ బ్రాహ్మణుడని చెప్పవలసి యున్నది". (ఆం క.త,సం. 1, పు. 124)

ఇట్టి ఇతిహాసాల యదార్థం ఎల్లా ఉన్నా మన ఇంటిపేర్లు వింతవింత పరిణామాలు పొంది నేటి స్థితికి వచ్చాయి. ప్రతి పేరుకి అర్థం ఉండి ఉంటుంది. కాని ఆపేరు వాళ్లవాళ్ల నోళ్లలో పడి ఎంతో మార్పు చెందడం చేత వాటి అసలు రూపం మరుగున పడిపోతుంది. ప్రాచీన కావ్యాలలో, ప్రబంధాలలో కొందరు కవులు తమ ఇంటిపేర్లను పేర్కొనక పోవడంవల్ల వారి కృత్యవతారికలలోని గద్యాలల్లోను, వంశ వర్ణనల్లోను ఉన్నవి విశేషణాలో, ఇంటిపేర్లో తెలియక తికమకపెట్టడమే ఈ మార్పులకు కారణంకావచ్చు.

**వంశవర్ణనలు :** దండయాత్రలకు వెళ్ళిన సమూహాన్ని. సభకు విచ్చేసిన

వారిని పేర్కొనే సందర్భాల్లోను కవులు అనేక గృహనామాలు గలవారిని పేర్కొన్నారు. ఆయాగృహనామాలు ఎలావచ్చాయో వానికి వ్యుత్పత్తులు చెప్పక పోయి నప్పటికి ఏ ఏ గృహనామాలు ఏకాలంలో ఉన్నాయో తెలుసుకోవడానికి ఈ వర్ణనలు ఎంతో ఉపకరిస్తాయి. కొంతమంది వారి ఆత్మీయుల లేక ఆశ్రితుల వంశాలను పేర్కొంటూ, ఆవంశ పరాక్రమాలను, గొప్పదనాన్ని వర్ణించిన సందర్భాలు కూడ లేక పోలేదు.

"దారా వారును బేర్లవారు సుజనాధారుల్ రసజ్ఞుల్‌గుణో
దారస్వాంతులు మోట మర్తి కులజుల్, ధర్మజ్ఞులున్ దినమం
దారుల్ మాపసుమర్తి వారు, సరసుల్ నారాయణం వారలు
న్నారింకెందరో తావకీన కృతి సన్మానించు వైశ్యాగ్రణుల్"
"సరసులు పెంటపాటి కులసాగర పూర్ణ సుధాకరుల్, ద్విజా
దరణ మనస్కులై తనరు ధన్యులు వొబ్బిలి శెట్టివారు, నీ
కరయఁ బురాతనంపు హితులౌదురెకా మనయాత్మకూరి ధీ
వరులిక నేమిలోపము భవ — — — —"
"పట్టణంబున ఆర్యవైశ్యప్రముఖులందుఁ బేరు గన్నారు మాటూరి వారు
సత్కార్యములపట్ల సాహసౌదార్య విస్తారులే సుమీ కట్టమూరి వారు
దేవ భూదేవ సేవా విశేషమ్ములఁజెలగు వారలు బొడ్డుకులము వారు
సకలార్యఘనవైశ్య సంఘంబునం జాల కీర్తి గన్నారు గుగ్గిలము వారు
"ఘనులు సూరంపలి కులంపు వణిజులెల్ల
నయ విచారులు పెన్నమాన్వయులు గూడ
నింకనున్నారు ఘనులు పేరెక్కినట్టి
వైశ్యకుల రత్నములు పురవరమునందు" (కన్యకా,పు. 4)

కాకతీయుల కాలంలో శౌర్య పరాక్రమ సంపన్నులయిన నాయకులను గౌరవించడం వారి రాజనీతి. 1279కి ముందే కేంద్రంలోని వ్యవస్థకు బలంచేకూర్చడానికి కాకతీయుల కాలంలో దేశాన్ని 77 మండలాలుగా విభజించి సమర్థులైన నాయకులను నియమించారు. ఈనాయంకరాలలో వివిధ జాతులకు చెందిన (బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, మొ॥న) అనేకులున్నారు.

రేచర్ల ప్రసాదిత్యుడు
మల్దేవ పాత్రుడు
అనాచి మల్దేవుడు
అల్లు రుద్రమ దేవుడు
మురారి మల్దేవుండు
వేదుకూరి రామ
అమ్మనబోలి రుద్రదేవుండ
పోతుగంటి మైలు
కొండపర్తి గణపతి దేవుండు
దాదినాగదేవుని సమాదేవుండు
కొలిపాక నాగిరెడ్డి
తాడితర్తి గన్నారెడ్డి
చంద మల్లారెడ్డి
బాచి బూచారెడ్డి
గడ్డి మన్నారెడ్డి
బాచి పెంచలమల్లారెడ్డి
బెడదకోట భైరవుండు
కరణకుమారుండు
రాణిక్య దేవుండు
సోమిరాజు యేలుడు
అభంగ రాహుత్తరాయం
అన్నమదేవుని వెంక
గుండయంగండు
ఝంట వెంక
కొలని రుద్రదేవుండు
ముప్పిడి నాయకుడు
కోవూరి నాచి దేవుండు
కాల్గయ ముగ్గండు
కొలుపి విశ్వంగుడు
మగతల గణపతి దేవుండు
గుండయ నాయుండు
చెఱుకుతోట చెన్న
సబ్బవారి బాలయ
కుమార గణపయ
ఎత్తడి బాలయ
గోన కట్టారెడ్డి
మల్లాది పోతయ
మారయ సాహిణి
మచ్చ రుద్రదేవుండు
ఎఱ్ఱసాహిణి
పెదకూచి రుద్రదేవుండు
అప్పక మల్దేవుండు
వీణె కుప్పయ
గోవుల పోచినేడు
మాచర్ల నాగువెంక
కొటుమల్లు వెంక
పారువార బ్రహ్మావెంక
ఉండవిల్లు వెంక
దిట్టకాము వెంక" (ఓరు.చ,పు. 19)

ఈ నాయకులు రుద్రమదేవి కాలంలోను, ప్రతాపరుద్ర చక్రవర్తి కాలంలోను ఉన్నట్లు తెలుస్తుంది.

'కాటూరి' తన గ్రామంలో ఉన్న పూరిళ్ళు పోయి మండువా భవనాలు వచ్చాయని, ఎట్టిబియ్యం పోయి రాజనాలు వచ్చాయని, 18 కులాలువారు ఉన్నారని పేర్కొంటూ అనేక వంశస్థులను పేర్కొన్నాడు.

"ఘనపాఠియై వాసిగన్న భాగవతుల
హనుమద్బుధుడు శిష్టులందు మేటి
పాణినీయముగాశిఁ పఠియించి వచ్చిన
ప్రాతూరి శంకర రామసూరి
సంగీత విద్యావ్యసన ముగ్గుబాలతో
నలవడినట్టి పెంద్యాల వారు
అనఘ వర్తను లింగువాన్వయులు, సదా
చారశోభి తులుప్పులూరి వారు
యక్షగానమ్ములాడి పేరందినట్టి
సాత్తానులు, సోదెచెప్పెడి వృత్తితోడ
పరికెముగ్గులవారు మా పల్లెటూరు
కొలువు జూపికె యొనర్చిరి కళలరెల్ల "(గుడిగం,పు.7-8).

"కాలుపెట్టినేల నెల్లను గని
గడ్డ జేయనేర్చు కమ్మవారి,
రభము శుభమెయుంగ నట్టి కాపులకు మా
యూరు కాణయాచియై రహించె"

కవి తన పౌలస్త్య హృదయము, గుడిగంటలలో 'మావాళ్ళు-మాఊరు' అని వారి గ్రామంలో ఉన్న ప్రజలను, వాతావరణాన్ని వర్ణిస్తున్నారు. ఆ గ్రామంలో

విజయదశమినాడు భేతాళ, ఆయుధ పూజలు చేస్తారట, కాలుపెట్టి నట్టి నేలను గనిగడ్డ చేస్తారట కమ్మవారు. కాపులుకూడ అభంశుభం ఎరుగని వారని చెప్తూ అనేక వంశాలను పేర్కొన్నాడు.

"అభిమాన ధనులు నార్లా న్వయులును, ని
శ్శంక సాహసులు వెల్లంకి వారు
కలిమియు, బలిమియు. జెలువారు కడియాలు
వార, లావెంట పేమూరి వారు
సముపాయ జీవనాస్పదులు నాగళ్ళ వా
ర్నైఖవాదులగు సూర్పనేని వారు
కరిసెనమ్మన సక్తిగల వెలగా వారు
కడునోర్మిగల యేర్లగడ్డ వారు
పాడి దప్పని కంబముపాటి వారు
పేరుగల సూర్యదేవర వారు నిట్లు
పలుతెగల కమ్మ నాయకుల్ హలముఖాన
పల్లియ నొసంట దిద్దిరి భాగ్యరేఖ

"అభిజనాభిమానులకుటిల వర్తనుల్
ధైర్య విశ్రుతులును దారమతులు
గుట్టుమట్టుగలుగు గుత్తాల పేరింటి
కాపులుంద్రు నాయకరము దాల్చి"-(గుడి.గం.పు.9).

ఈ పై తెగల వారంతా కమ్మవారని, కాపులని తెలుస్తుంది. బసవేశ్వరుని గూర్చి పండితారాధ్య ప్రలాప కథనంలో భక్తుల సమూహాన్ని గురించి చెప్తూ-

"మడివాలు మాచయ్య మడుగు వర్చితివా
ఒడవర బ్రహ్మయ్యం బనియుం బంచితివా
కిన్నర బ్రహ్మయ్య గిరికర్రించితివా

కన్నడ బ్రహ్మయ్య గనుమొరింగితివా
శూలద బ్రహ్మయ్యజూపుదప్పితివా
మోళిగ మారయ్య మోసపుచ్చితివా
తెలుగు బొమ్మయ్యగారి దిక్కు మఱచితివా
కలకేత బ్రహ్మయ్యగలరబుచ్చితివా
గజ్జేశ మసనయ్య బుజ్జగించితివా
యజ్జదాసయగారి నాగడించితివా
షొడ్డల బాచయ్య వెడ్డు వెట్టితివా
వెడ్డునాగయగారి వెడగు వర్చితివా
దసగణ సింగయ్య దక్కువెట్టితివా
ముసిడి చౌడయ్యగారి ముందు వెట్టితివా
సురగి చౌడయగారిఁ జొక్కువెట్టితివా" (పండితా,పు.208)

మిక్కిలి ప్రసిద్ధిచెందిన ప్రాచీన భక్తసమూహమంతా నీకుక్షిలోనే ఉన్నారు కదా, బసవన్న శరణాగ్రగణ్యుణ్ణి ఏల మింగావు? అని ప్రశ్నిస్తూ కవి ఈ కింది వారిని పేర్కొన్నాడు.

"—దాసకేసయ్య, ధూర్జటి కేశిరాజయ్య — (పండి.పు.209)
"నేణాది రామయ్య
జేరమ రాజయ్య -- --
— — — సిద్ధరామునిని
— — — — — — —
సుంకర బింకయ్య సురియ చమడయ్య
శంకర దాసయ్య వెంక మంచయ్య
బాపూరి బ్రహ్మయ్య బాచి రాజయ్య--" (పండి,పు.237)

అఖిల దేశాల పరుసలను పేర్కొంటూ ఆంధ్రదేశ పరుసను చెప్పాడు. అందులో తాను మల్లయ్యను ఏటేటా కొలవడానికి వెళ్తానని, పుక్కల పర్వతం ఎక్కుతానని చెప్తూ, ఆ దారిలో తాను ఏ ఏ శైవ భక్తులను కొలుస్తాడో వివరించాడు.—

'శృంగి బొజ్జయ నుత్తమాంగవేశి
సంగద బసవన్న శరణని కొలుతు,
బండితారాధ్య శ్రీపతి పండితయ్య
బండారు బసవన్నఁ బాయకకొలుతు
శంకర దాసయ్య తెంక మంచయ్య
బంకయ్య శివరాత్రి వెంకయ్య
మోళిగ మారెయ్య మున్నయ్య శరణు
కోవూరి బ్రహ్మయ్య గొగ్గవ్వ శరణు
కిన్నర బ్రహ్మయ్య కేశి రాజయ్య
కన్నడ బ్రహ్మయ్య గణ దాసి శరణు;
బాచయ్య, సవదర నాచయ్య, బిచ్చి
బాచయ్య మడియాలు మాచయ్య శరణు
సిరిగిరి మల్లయ్యశరణు---" (పండి,పు. 243)

సూరసాని కథలో భర్త లేని సమయంలో ఆమె పూర్వంలా జంగమారాధనలు చేస్తూ వైధవ్యంలో కూడ శైవ చిహ్నాలను వదలలేదట. అందుకు విప్రులు కోపించి రాజుగారికి విన్నవించగా బంధించమని ఆజ్ఞజారీ చేశాడట. ఆమెను బంధించడానికి విప్రప్రముఖుడు విప్రులను, తలవరులను పిలిచాడట. అప్పుడు ద్విజులు, తలవరులు, తీర్పరులూ, ప్రజలూ ఉన్నవిధంగానే వచ్చేశారట. ఆ వచ్చిన వారెవరో ఈ క్రింది విధంగా వర్ణించాడు.

"మత్తలారులఁ బిల్వడను నంతలోన
సోమయాజుల పెద్ది రామనభట్టు
దామోదరప్పన వామన కూచి
గేశనపెద్ది శాస్త్రి కేమనఘడ
వాశము మైలారు భట్లు పాధ్యాయ
నప్పట్ల పెద్ది యంశమసూర బోతి
వప్పు కేశవుడు నంచనంబ మాధవుఁడు

--- గూచెన గారి తుమ్మ

యుష్టము వారి పెన్నొజ్జలు గంప
కృష్ణమ్మ, యరగడ్డ కేమన కూచి
(వర) వరి గడ్డు వారి కుప్పన యాజి వంగ(ర)
(యగ్గెన) వరక యజ్ఞమ యుండి భాస్కర యొజ్జ(గంటి)
మేడి చెట్టయి తన మింద వల్లభుండు
దూడగడ్డప్పన దుష్ట రాఘవుండు(దుడ్డు)
(ఎ) నెత్తుగా లై తన యీ శ్వరభట్టు (వండి, పు.30)

ఏ ఏ ఇంటిపేర్లు గలవారు కరణీకములు చేసి చిరకాలంగా ప్రసిద్ధి చెందారో ఆ గణక వరులను గూర్చి కృతి రచిస్తానని వారి గృహనామాలను ఈ క్రింది విధంగా చెప్పాడు కవి.

కరణీకముల గల్గు గణకవరులు
గృహనామధేయముల్ కృతిగా రచించెద
చిరకాలముగ సుప్రసిద్ధులైన
కరమొప్ప గుడి పల్లి గార్లపాడెనుముల
పల్లి, కంచన పల్లి పరగమామి
డేల బోయిన పల్లి యేవూరు వతంగి
యెడవల్లి యేదు నూరేర్పడంగ
ముప్పవరపు వారు మొదలుగా పదిరెండు
నామముల్గలవారు సేమముగను---"(చాటు'ర,పు.96).

"విశ్వనాథేశ్వరులు నిరుపమభక్తులు
మంత్రి సింహాలు నిడమర్తివారు
నఖిల దిగ్విజతుల నాది సంపద్వంతు
లైన దారావారు నమపమాను

లైన దుర్గావారునట్టి చెన్నావారు
మాజేటి వారును మండవిల్లి
వారు నక్యంవారు బత్తివారును బచ్చి
గోళ్ళవారును గొనకళ్ళవారు
మన్నగాగల శిష్యులు 300 మంది--" (సత్య.అవ,పు.39).

భాగవతుల నరసింహ శర్మ తమ భాగవతుల వంశాన్ని గూర్చి 'శృగార సంధ్య' అనే గ్రంథంలో ఇలా పేర్కొన్నాడు.

"పండిత స్తవనీయ వైభవ ప్రాభవ ప్రౌఢులు శ్రీ భాగవతుల వారు
హృద్యానవద్య సద్విద్యా మహోద్యాన పాలకుల్ శ్రీ భాగవతులవారు
వితత వితరణ సంప్రీణితాశ్రిత జన ప్రణుతులు శ్రీ భాగవతులవారు
సకల భూపాలక ప్రకటిత ప్రఖ్యాత వైద్యులు --
అతుల సుమతులు శ్రీ భాగవతుల వారు ---" (శృం,సం పు.4).

పురాణాలు చదివి వినిపించినందువలనో హరికథలు చెప్పినందువలనో వీరి పూర్వులకు ఈ గృహనామం కలిగి ఉంటుంది. ఇదిపౌరుషనామం.

పల్నాటి వీర చరిత్రలో అనుగురాజు యాత్రకు వెళ్ళేటప్పుడు అతనితో 72 గోత్రాలవారు, పన్నెండిండ్ల పద్మనాయకులు వెళ్ళారట. వారెవరో కవి ఇలా పేర్కొన్నాడు.

"--అను పల్కులు విని యాత్మ బంధువులు
అరుదెంచి రావేళ నారాజువెంట
కోరి డెబ్బది రెండు గోత్రాలవారు
పరగ పన్నెండిండ్ల పద్మనాయకులు
ఆవాల వారును నచ్యుతు వారు
పైడిచుక్కలవారు పాలెము వారు

అట్లూరి మట్లూరి యాఖ్యల వారు
ముతసాని వారును ముయ్యూరి వారు
కొండ విదుల వారు గోవిందువారు" (పల్నా.పు5,పం.
205–215)

అనుగు రాజుతో ఈ కింది వారు వేటకు ఆయుధ హస్తులై వెళ్ళారట.–

–అడ్డకత్తులవారు, అరిగెలవారు
చేకత్తి పిడిబాకు శరములవారు
పచ్చబద్దల వారు బరిసెలవారు---"(పల్నా.పు. 40,పం898)

నాయకురాలు నాగమ్మను గురించి చెప్తూ—

పంటరెడ్డివారి పడతియు మరియు
వీర జగ్గారెడ్డి వేడుక పుత్రి
మేకపోతుల రెడ్డి మేనకోడలు
ఆరవెలి వారింటి యనుగు కోడలును"అని పేర్కొన్నాడు.
(పల్నా.పు.41; పం.912)

మలిదేవరాజు కొలువు దీరగా ఆకొలువుకు విచ్చేసిన ఆరవై ఆరుగురి వీరులు వారివారి ఉచిత ఆసనాలను అలంకరించారట. వారు–

–మర్నాడు కొలువుండ మలిదేవరాజు
చుక్కల గద్దెపై సుంకరి వారు
రేలపూ గద్దెపై రేణూరి వారు
పొగడపూ గద్దెపై పోతుల వారు
ఆవపూ గద్దెపై ఆణెము వారు
రేవనూళ్వారును రేచర్ల వారు
పైడి చుక్కల పాలపర్తి వారలును
ముతసాని వారును ముయ్యూరి వారు

అట్లూరి మట్లూరి యాఖ్యలవారు
భావజాకారులు బలమూరి వారు
ఆవాల వారును అచ్యుతువారు
కొండవిండావారు గోవిందు వారు
పెద్దన్న సూర్నీడు పేర్నీడు మరియు
గండు కన్నమయును కన్నమనీడు
రాయన బోయని రాయపడవాలు
పడవాలు తమ్ముడు బాలగోపన్న
యాదిగ నరువది యార్వురు వీరు--"(పల్నా.పు.74.పం.
667-683)

రాజుగారి కొలువులో ఊడిగం చేస్తున్న ముప్పైముగ్గురు లెంకలు ఈ క్రింది భాగంలోకన్పిస్తున్నారు.--

"--కుంచ శ్రీరాముండు, గొడుగు మోగాయ
సంబువుల్ పట్టెడి చండి వెంకాయ
అతివీరుడైనట్టి యడప కేశవ దాసి
కరతి త్తి మాచండు కావటి వెంక
లెంక కాముండును లెంక మాచండు
లెంక లింగాయము లెంక వేముండు
లెంకన భీముండు లెంక మాదాసి--"(పల్నా.పు,88;
పం.62-68)

"--నత్తావు పోతన్న నాగ బోయిండు
పించము సీతన్న పిన్నబోయిండు
గొరివి రామన్న కొండ బోయిండు
తోడేటి సోమన్న దొర బోయిండు
నిడుగాళ్ళ నిమ్మన్న నిడుద బోయిండు

మడగాళ్ళ మల్లన్న మాచన్న బోయి
పెయ్యాల పెన్నండు పెద్ద బోయిండ" (పు.207.పం. 193-200)

"...దూడకడుపు సోమన దొప్ప వజ్జలును
కుడుముల గంగన్న కూరలబ్బయ్య
బూరెల భీమన్న పులుసు సుబ్బయ్య
గుంటుకలిస్సయ్య కూచి మలిభొట్లు
పెసరపప్పు అనంతు పెద్ది భొట్లు గారు
చతురువేదుల వారి సర్వన భొట్లు
మొదలైన విప్రులు మునుకొని వేగ..." (పు. 249; పం. 813-820)

"వర్మాల వారును నాయని వారు
అనుమగంటి వారు అల్లము వారు
చెవులవారు మరి చిల్లర వారు" మొదలైన

గృహనామాలు గలవారు నాయకులుగా గుర్తింపబడ్డారు. పైన పేర్కొన్న అనేక గృహనామాలు ఈనాడుకూడా వాడుకలో ఉన్నాయి. ఈనాడు వాడుకలో ఉన్న కొన్ని గృహనామాలకు పూర్వపు రూపాలు కూడ కన్పిస్తున్నాయి.

రాచిరాజుగారిచే రచింపబడిన సీసమాలికను రాచిరాజుగారి సీసమాలిక అని సుప్రసిద్ధంగా వాడుతున్నారు. వీరు వసిష్ఠగోత్రి క్షత్రియ కుటుంబాల ఇంటిపేర్ల గూర్చి యీ సీసమాలికలో పేర్కొన్నారు. శా.శి. 1406లో ఈ సీసమాలిక రచించబడింది. ఇందులోని ఇంటిపేర్లను చూద్దాం.—

'దండనాధులును, బాంధవులు, సామంతులు
ఫౌజుదారులు, పోటు-బంటులును

లయిన తద్గోత్రజు — లల్లూరి వేంకట
రాజు, సయ్యపరాజు — రామరాజు
మంతిన గుర్రాజు — కంతేటి పెదరాచి
రాజును, బాల్రాజు — రామరాజు
సిరిగూరి గుర్రాజు — చేకూరి దేవన్నృ
పాలుండు కంచేర్ల — పాటి తిమ్మి
రాజాగ్రణి యుభయి — రాఘ్రాజు భయరాఘ్రాజు
పేరిచర్ల కక్క భూ - విభుడు పెమ్మ
రాజు పీపపరాజు — రావి పాటన్న పృ
థ్వీభర్త సరిపల్లె — తిమ్మరాజు
వేగేశసయ్య పృథ్వీనాథుఁ డడ్డూరి
శ్రీరంగరాజును — చెరకువాడ
కోన నృపాలుండు - కూసమపూడి బ
య్యపరాజు కోసూరి — యమలరాజు
నందేల కృష్ణభూ — నాథుండు ధేనువు
కొండాధిపుడు పెద్ద — గోపరాజు
పేజేళ్ళ సామంత — రాజు బంధుజనాళి
నవపద్మవనహేళి — నంబిరాజు
అయినముపూడి రం — గావనీ నాథుండు
పొత్తూరి తిరుమల — బుక్కరాజు
కూనపరాజును - గుణరాశి మల్రాజు
దెందుకూర య్యల — దేవరాజు
వెలగనాట్యాహవ — విజయుండు సర్రాజు
ములగపాటి పెద్ద — బుద్ధరాజు
వాడపల్లి కృష్ణ — వసుమతి నాథుండు
ఇందుకూరచ్చిరా - జేంద్ర విభుడు

సామంతపూడి కృష్ణమరాజు, సకినేటి
తిరుమల వేంకట - వరదరాజు
గురిజాల విజయాంక - కోదండ రామరా
జెద్దె పల్లి ఘండు - పెద్దిరాజు
కొలుకులూరన్న నృ - పకుంజరుం, దడ్డాల
గోవిందరాజును - గోకరాజు
కసువ నృపాలుండు - గాదిరాజనృప
రాజు, నిసుకపల్లి - రామరాజు
రుద్రరాజును రామభద్ర నృపాలుఁడు
నడిమిపల్లి జగ - న్నాథరాజు
వలిప ర్తి జగ్గనృ - పాలుడు, వేగిరా
జచ్యుతరామరా - జప్రభుండు
బుద్ధరాజు కొండ - భూపతి, గణపతి
రాజు గొంకనరాజు - రాజరాజు
గోరింట పెద్దకు - మార రాజాగ్రణి
పిన్నమరాజు పృ - థ్వీ వరుండు
ఆదిగా నేఁబది - యాఱు కుటుంబముల్
కామరొందెను వశిష్ట - గోత్రమునకు - -"
(ఆంధ్రవి;సం.5, పు.2701,-2703)

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు చాటుపద్య మణిమంజరిలో ఇట్లు పేర్కొన్నారు. "ఒకానొక భట్టు రాజీ క్రింది విధమున ద్వాత్రింశన్మంత్రిసీసమాలికను చెప్ప దొడంగెనుగాని పూర్తి చేయలేక పోయెను.

సీసమాలిక :

"భళిర రామయ మంత్రి భాస్కరామాత్యుండు నింతారు నండూరు గుండమంత్రి
శివపాద భక్తుడు శ్రీకంఠ వెంగన్న శ్రీనిధి యొక్కోట సింగరాజు।

వేమ భూపతి మంత్రి మామిడి సింగన్నయెన్ననౌ బెండపూడన్న మంత్రి
మేటైన కొచ్చర్ల కోటకర్ణము మల్లు స్తుతికెక్క వాడల తుక్కమంత్రి
ప్రియమాడు నెఱజాణ పెమ్మయి సింగన మహితుండు సింగన మంత్రి మాచ
సర్వజ్ఞుడైనట్టి సర్వయ చిక్కన యధికుండు నెల్లూరి యాదిరాజు
ధీరుండు సాలువ తిమ్మనరేంద్రుండు, గురిజాల నాదెండ్ల గోపమంత్రి
ప్రధితికెక్కుచునుండు భాస్కరామాత్యుండు మాన్యుండు కొండపర్తి మాదిరాజు
ఇల కొండవీటిలో వెలయు ప్రధానుండు భవ్యుండు బలభద్రపాత్ర ఘనుడు
కులముద్ధరించిన గోపయ రామసపేరిమి తిరువెళ్ళ పెమ్మరాజు
విస్తార సత్కీర్తి విలసిల్లి వర్ధిల్లు విదితుండు నండూరి వెంగళయ్య
కేవల పుణ్యుండు కేసయ రామన సుజనుండు శ్రీపతి సోమరాజు!"

అని ముప్పైముగ్గురు మంత్రులను గూర్చి చెప్పారు.

ధర్మనందన విలాసంలో గురాల వారి వంశాన్ని గురించి ఇలా పేర్కొబడింది.

"శ్రీలు వర్ధిల్లఁ బ్రసిద్ధ దానాలు ధ
రంజేయు వారు గురాల వారు
మేలు గురాలు వరాలు ముత్యాలు స
రాలిచ్చువారు గురాలవారు
పాలకీలందలాల్ మేలు బంగారు
శాలూలంది నారు గురాలవారు
వాలూనికే లసూబాలను గెలచి శ
రాఁజూపినారు గురాలవారు--" (ధర్మనం.1-63).

అని గురాల వంశాన్ని గురించి వర్ణించబడింది.

"కౌశిక గోత్ర విఖ్యాతుఁడాప స్తంభ
సూత్రుడార్వేల పవిత్ర కులుడు

నంది సింగామాత్యునకును, దిమ్మాంబకుఁ
దనయుండు---" (పారి.ఆ.5, పు.124, ప.108)

మొదలైన చాలా వంశాల వర్ణనలు పలుచోట్ల కన్పిస్తున్నాయి.

పైన ఉదహరించిన వంశనామాలే కాక ఏనుగుల, గుర్రం, నంది, పావురాళ్ళ మొదలైన జంతువుల, పక్షుల పేర్లుకూడా సాహిత్యంలో ఇంటిపేర్లుగా కన్పిస్తున్నాయి.

పారిజాతాపహరణ రచన చేసి పేరొందిన నంది తిమ్మన ఇంటిపేరు నంది. తిమ్మన "నానాసూన వితాన వాసనల నానందించు సారంగ మేలానన్నొల్ల దటంచు---" అని ముక్కు మీద పద్యం చెప్పడం వలనే కాబోలు తెనాలి రామలింగకవి ముక్కు తిమ్మనార్య ముద్దుపలుకు అని పౌరుషనామం చేర్చి పొగిడాడు. ఇతని ఇంటిపేరు జంతుసూచికాదని, గ్రామనామమని పరిశోధకుల అభిప్రాయం. వీరి నివాసం "మైసూరు రాష్ట్రములోని కోలారు మండలమందలి చికబల్లారం తాలూకా నంది గ్రామమని ఒక పరిశోధకుడు తెలియజేశారు." (కె. యస్. కోదండరామయ్య, అష్టదిగ్గజకవి సమాజంలో రాయల నాశ్రయించిన తొలికవి ఎవరు? పు. 62 – 63, 1972) కాని కర్నూలు మండలంలోని మహా నంది క్షేత్రాన్ని బట్టి, వీరితో ఒకరైన ఘంట సింగయ, సింగయ గురువు అఘోర శివాచార్యుల నివాసం కడప మండలంలోని పుష్పగిరి అవడంచేత వీరు తెలుగు దేశపు కవులే అని నిశ్చయంగా చెప్పవచ్చని నిడదవోలు వెంకటరావుగారి అభిప్రాయం. మానవల్లి రామకృష్ణ కవిగారు క్రీడాభిరామ పీఠికలో 'నంది సింగన'యు, ఘంట మల్లయయు కలసి యార్వీటి తిమ్మరాజున కంకితముగా షష్ఠస్కంధమును---" అని నంది మల్లయ, ఘంట సింగనల ఇంటిపేర్లను తారు మారు చేసినట్లు వేటూరి వారు ప్రబంధ రత్నావళిలో పేర్కొన్నారు.

మేలైన గుర్రాలను పోషించడం వలనో, వాటితో క్రయ విక్రయాలు చేయడం వలనో గుర్రాల వంశం వారికి ఈ ఇంటిపేరు వచ్చి ఉంటుంది.

పావురాళ్ళ తిమ్మానాయుణ్ణి ప్రౌఢ దేవరాయలు పావురాళ్ళ మీద కొలువు వుంచాడట. అందుకని ఇతనికి పావురాళ్ళ తిమ్మానాయుడను పేరు వచ్చింది. ఇతడు ఆలం వెంకటపతి కుమారుడు,

ఇంతేకాక చేమకూర, పుల్లగూర, పుల్లాకుల, వంకాయల మొదలైన శాకాలపేర్లు ఇంటిపేర్ల స్థానంలో చోటుచేసుకున్నాయి. 'ఇంటిపేరు నసగా ఉన్నా కవిత్వంపసగా ఉన్నదని,' చేమకూర పాకాన పడ్డదని, 'చక్కెర మడిలో అమృతం పారించి పండించిన చేమకూర' అనీ పండితులూ, కవులూ, విమర్శకులూ అసాధారణంగా ప్రశంసించిన చేమకూర వెంకటకవి ఇంటిపేరు చేమకూరివారు.

పప్పు, నేతి మొదలైన ఆహార పదార్థాల పేర్లు కూడా ఇంటిపేర్లుగా కన్పిస్తున్నాయి.

"కుప్పిగంతులు వైచుచు – గునిసియాడుచు
పప్పు తిప్పాభట్లు వచ్చె – ప్రిప్పు ప్రిప్పు యనుచు"
(యక్షగా: సం. 1; పు. 196).

ఇంటిపేర్లన్నిటికి వ్యుత్పత్తులు, పుట్టుక, వంశచరిత్ర చెప్పడం చాలకష్టం. అందుకేనేమో –

"ఎన్నికోటుల ఇంటిపేర్లిలను గలవో?
ఏతదతి సంఖ్యనాఖ్యల వెందు కొరకో ?
ఎపుడు పుట్టెనో పరిణామ మెట్లు గనెనో
ఎరిగి ఇతమిత్థమను వారదెంత వారో ? అని

మేరు సోమయాజుల వరహాలుగారు ప్రశ్నించారు. (భా. 1945; మార్చి, పు. 228–238)

# ఇంటిపేర్ల వర్గీకరణ



# వ్యవహారంలో తెలుగువారి ఇంటిపేర్లు - వర్గీకరణ

ఆకరాలను బట్టి ఇంటిపేర్లను శాసనాలలో ఇంటిపేర్లు, సాహిత్యంలో ఇంటిపేర్లు, వ్యవహారంలో ఇంటిపేర్లని స్థూలంగా మూడు విధాలుగా విభజించవచ్చు. చూ. పట్టిక, పు. 161 వ్యవహారంలో ఉన్న ఇంటిపేర్లను దేశభేదాలను బట్టి భారతీయేతర భాషలలో ఉన్న ఇంటిపేర్లు, ఇతర భారతీయ భాషలలో ఇంటిపేర్లు, తెలుగువారి ఇంటిపేర్లు అని పూర్వ ప్రకరణాలలో వర్గీకరించి వివరించడం జరిగింది. భారతీయేతర భాషల్లో ఉన్న ఇంటిపేర్లు పాశ్చాత్య జాతుల్లో ఇంటిపేర్లు, మధ్యప్రాచ్య భాషల్లో ఇంటిపేర్లు అని మూడు విధాలుగా విభజించబడ్డాయి. ఇంగ్లీషు, స్కాచ్, జర్మన్, జెక్ మొదలైనవి మధ్యప్రాచ్య భాషలుగాను గ్రహించబడ్డాయి.

ఇతర భారతీయ భాషల్లో ఉన్న ఇంటిపేర్లను గౌడీయ భాషల్లో ఇంటిపేర్లు, ద్రావిడ భాషలలో ఇంటిపేర్లని రెండు విధాలుగా చేయడం జరిగింది. బెంగాలీ, గుజరాతీ, మహారాష్ట్రి మొదలైనవి గౌడీయ భాషా వర్గంలోనూ, తమిళ, కన్నడ, మలయాళ భాషలు ద్రావిడ భాషావర్గంలోనూ చర్చించబడ్డాయి.

వ్యవహారంలో ఉన్న తెలుగువారి ఇంటిపేర్లు గ్రామనామసూచి, వ్యక్తి నామసూచి, పౌరుష లేక బిరుదనామసూచి అని మూడు విధాలుగా విభజించబడ్డాయి గ్రామనామాలే ఇంటిపేర్లుగా వాడుక పడినచోట గ్రంథ విస్తరణ భీతితో గ్రామనామాలు ప్రకృతి చర్చలో పరిహరించ బడ్డాయి.

## II. వ్యక్తినామ సూచి :

వంశ మూలపురుషుల పేర్ల మీదుగనో, ప్రసిద్ధులైన వారి పేర్లమీద ఏర్పడిన ఇంటిపేర్లన్నీ ఈ వర్గానికి చెందుతాయి. ఈ వర్గాన్ని మానవీయ, దైవికాలని రెండుగా విభజించవచ్చు.

**అ. మానవీయాలు :** కేవలం మానవుల నామాలకు సంబంధించినవి మానవీయాలు. ఈ విభాగంలో వంశమూల పురుషుల పేర్ల మీద ఏర్పడ్డవి లేక పూర్వుల ననుసరించి ఏర్పడ్డవి తండ్రిని బట్టి ఏర్పడ్డవి, తల్లినిబట్టి ఏర్పడినవని

మరలా మూడు విధాలుగా ప్రత్యేకించి చెప్పవచ్చు. అక్కినేని, అనపోజు, ఎర్రాప్రగడ, కొమ్మారెడ్డి, తల్లావఝుల, పెమ్మసాని, వాసిరాజు, విష్ణుభట్ల మొదలైన ఇంటిపేర్లు మానవీయ వర్గానికి చెందినవే.

ఆ దైవికాలు : మానవాతీత మైన శక్తిగల దేవతల పేర్లకు సంబంధించిన ఇంటిపేర్లు దైవికాలు. ఈ దైవిక భాగంలో కూడా రెండు శాఖలున్నాయి. 1. ముఖ్య దేవతలు, 2. క్షుద్ర దేవతలు లేక స్థానిక దేవతలు. బాలాజి అనే ఇంటిపేరు వెంకటేశ్వరుని నామం గనుక ఇది మొదటిశాఖకు చెందుతుంది. కాళి, మహంకాళి, పోతురాజు మొదలైన ఇంటిపేర్లు స్థానిక దేవతల పేర్లమీద ఏర్పడ్డవే. ఇవి రెండో శాఖకు ఉదాహరణలు.

III. పౌరుష లేక బిరుదనామసూచి :

ఏదో ఒక వస్తువుతోనో, ఒక వృత్తితోనో, ఒక సందర్భంలోనో ప్రసిద్ధి చెంది ఆపేర్లే గృహనామాలుగా మారినవన్నీ పౌరుషనామాలు. రాజులచేతనో, ప్రసిద్ధుల చేతనో, అధికారుల చేతనో ప్రశంసించబడి గౌరవ సూచకంగానో బహుమతిగానో ఇవ్వబడిన బిరుదనామాలు కూడా ఈ వర్గానికి చెందుతాయి. ఇవి ఎనిమిది విధాలుగా వర్గీకరించబడ్డాయి. 1. ఆయుధసూచి, 2. కులసూచి, 3. జంతుసూచి, 4. వాద్యసూచి, 5 వృక్షలతాసూచి, 6. వృత్తిసూచి, 7. సంస్కృతిసూచి, 8. ఇతరాలు.

1. ఆయుధసూచి :

అడిదం, కటారి, కటికల, కత్తి, కాసె, గుదె. [గుదే] తుపాకుల బందూకు, బాడిశె, బాణాల. సూరే మొదలైన ఆయుధాలతో సంబంధం కలిగిన వారికీ, ఆ ఆయుధాలతో పరాక్రమాన్ని చూపి ప్రసిద్ధి చెందినవారికీ ఆ ఆయుధం పేరే ఇంటిపేరయింది ఇలాంటి పేర్లన్నీ ఆయుధ సూచి కింద సూచించబడ్డాయి.

2. కులసూచి :

ఇంటిపేర్ల స్థానంలో కన్పించిన వేర్వేరు కులనామాలు కులసూచిలో చూపించబడ్డాయి. ఉదా : ఎరుకల, కంచరి, కంసాలి, కమ్మ, కుమ్మరి, కోమటి, గొల్ల, చాకలి, జంగం. బలిజ, బాపన, బోయ, వడ్ల మొ॥ వి.

ఒక కులనామం మరొక కులానికి ఇంటిపేరుగా ఉండటం విశేషం. ఉదా : కాపు అనే కులనామాన్ని సూచించే ఇంటిపేరు కమ్మవారిలో ఉంది. ఈ కులసూచితో అంతర్విభాగాలయిన ఒంటరి, కురుబ, కూనపులి, జక్కుల, దేసటి, పంటరెడ్డి మొదలైన తెగల ఇంటిపేర్లు వేరుగా చూపింపబడ్డాయి.

3. జంతుసూచి :

జంతుసూచికి చెందిన భాగం జంతువులు, పక్షులు, కీటకాలు, సరీసృపాలని నాల్గు విధాలుగా విభజింపబడింది.

అ. జంతువులు : గృహనామ స్థానంలో కన్పిస్తున్న జంతువుల పేర్లు ఇందులో స్వీకరించబడ్డాయి. ఆయా జంతువులను పెంచడంవల్లనో క్రయవిక్రయాలు చేయడం వల్లనో యీ ఇంటిపేర్లు ఏర్పడి వుండవచ్చు. వీటిని పెంపుడు జంతువులు, అడవి జంతువులని మరలా విభజించవచ్చు.

I. ఆవుల, ఉడతల, ఎడ్ల, ఎద్దుల, ఎనుముల, కంచిమేకల, కుక్కపిల్ల, కోతుల, గుర్రం, గేదెల, దున్నపోతుల, పంది, పిల్లి, పోతుల, మేకల, మేకా మొదలైనవి పెంపుడు జంతువులు.

II. ఎలుగుబంటి, కేసరి, నక్కల, పులి, సింగం, మొదలైనవి అడవి జంతువుల పేర్లుగల ఇంటిపేర్లుగా గ్రహించబడ్డాయి.

ఆ. పక్షిసూచి : కంజుల, కాకి, కోడి, గువ్వల, చిలకా, డేగల, నెమలి, పిట్టల, బాతుల మొదలైనవి పక్షులను సూచించే ఇంటిపేర్లు.

ఇ. కీటకసూచి : ఈగా, ఎర్రచీమల, చలిచీమల, జోరీగల, తుమ్మెద మొదలైనవి కీటకాలకు సంబంధించిన ఇంటిపేర్లు.

ఈ. సరీసృపాలు : చిలువ, జెర్రిపోతుల, తేళ్ళ, పాముల, బల్లి మొదలైనవి సరీసృపాల వర్గానికి చెందిన గృహనామాలు.

**4. వాద్యసూచి :**

కిన్నెర, డప్పు, డోలు, తప్పెట, తిరుణాము, ధారా, బూర, మద్దెల, వీణ, వీరంగం, సన్నాయిల మొదలైన వాద్య విశేషాలు వాద్యసూచిలో చేర్చబడ్డాయి. ఈ వాద్యాలను తయారు చేయడంలోనో, క్రయ విక్రయాలు చేయడంలోనో వాయించడంలోనో ప్రసిద్ధి చెందినవారికి ఇవి గృహనామాలుగా నిలిచినట్లుగా భావించవచ్చు.

5. వృక్ష లతాసూచి :

వృక్షాలపేర్లు గృహనామాలుగాగల ఇంటిపేర్లన్నీ ఈ వర్గానికి చెందుతాయి. ఈ చెట్లను పెంచి పోషించడం వల్లనో మరో విధంగానో ఆ ఇంటిపేరుగల వృక్షంతో సంబంధం కలిగి ఉండవచ్చు. ఈ వర్గం —ఆకుల, —కాయల, —కూర, —తీగలు, పుష్పాలు, ధాన్యవాచకాలు, ఆహారపదార్థాలు అని ఏడు రకాలుగా వర్గీకరించడం జరిగింది.

**అ. —ఆకుల :** ఆకుల పరపదంగా గల అవిశాకుల, కూరాకుల, చింరాకుల. పాలాకుల మొదలైన ఇంటిపేర్లు ఈ విభాగంలో చోటుచేసుకున్నాయి.

ఆ. —కాయల : కందికాయల, కొబ్బరికాయల, చింతకాయల, జామకాయల, నిమ్మకాయల, పుచ్చకాయల, మిరపకాయల, ములక్కాయల, వంకాయల, మొదలైన గృహనామాలలోని పరపదమైన కాయలకు సంబంధించిన ఇంటిపేర్లన్నీ వృక్షసూచిలో భాగంగా పేర్కొబడ్డాయి.

ఇ —కూర : కూర పరపదంగా గల కొయ్యకూర, చేమకూర, తియ్యగూర, తోటకూర, పాలకూర, పుల్లకూర, బచ్చలకూర, మొదలైనవి కూడా గృహనామాలలో చోటుచేసుకున్నాయి.

ఈ. —తీగలు : గుమ్మడి, పుచ్చ, బీర మొదలైన తీగల పేర్లుగల గృహనామాలుకూడా వేరుచేయబడ్డాయి.

ఉ. —పుష్పసూచి : పుష్పజాతికి చెందిన కలువల, చామంతుల, జాజుల, పుష్పాల, పూల, పూవుల, మల్లిక, మల్లెల, మొగలి, సంపంగి, మొదలైన ఇంటిపేర్లు కూడా ఉన్నాయి.

ఊ. ధాన్యవాచకాలు : అలసంద, ఆళ్ళ, కందుల, కొఱ్ఱ, జొన్నల, ధనియాల, నువ్వుల, పెసల, రాగుల, శనగల, సజ్జ మొదలైన ఇంటిపేర్ల వలన వారి పూర్వీకులు ఆ పేరుగల ధ్యాన్యాన్ని ఎక్కువగా ఉత్పత్తి చేసినవారో లేక ఆ ధాన్యంతో వ్యాపారం చేసినవారో అయివుంటారని ఊహించవచ్చు

ఎ. ఆహార పదార్థాలు : అన్నం, గంజి, నేతి, పచ్చిపులుసు, పప్పు, బువ్వ, రొట్టెల, సంకటి, సాపాటి మొదలైన ఇంటిపేర్లు ఆహార పదార్థాలను సూచిస్తున్నాయి. ఈ పదార్థాలను వండి వడ్డించడంలో ప్రావీణ్యం కలవారో లేక ప్రీతితో భుజించేవారో కావచ్చు ఈ విభాగాన్ని పిండివంటలు, -కూటి ఉపపదంగా కలవి అని రెండుగా విభజించవచ్చు.

I పిండివంటలు : ఆవడ, కుడుములు, గారెల, బూరె (ల), వడ, వడియాల మొదలైన ఇంటిపేర్లు పిండివంటల విభాగంలో చేరుతాయి.

II. -కూటి : ఆరెకూటి, కురుకూటి, జొన్నకూటి, వట్టికూటి, వరికూటి మొదలైన కుటుంబ నామాలు -కూటి ఉపపదంగా గల విభాగానికి సంబంధించినవి.

6. వృత్తిసూచి :

వ్యక్తులు చేస్తున్న వృత్తిననుసరించి వారే వృత్తి చేస్తున్నారో అదే ఇంటిపేరుగా నిలిచిపోయిన సంఘటనలు కన్పిస్తున్నాయి. ఈ ఇంటిపేరు గలవారు ప్రస్తుతం ఈ వృత్తిలో లేకపోవచ్చు. కాని వారి పూర్వీకులెవరో ఆ వృత్తిలో ప్రసిద్ధిచెంది ఉంటారని భావించవచ్చు. అంగిరేకుల, అడపా, అవసరాల, ఉపాధ్యాయుల, కిరణం, తలారి, తాపీ, పూజారి, మోతాదు, రజకం, రాయసం, విన్నపాల, వేగుల, సుంకర (రి) మొదలైన గృహనామాలు వృత్తిని సూచిస్తున్నాయి. వృత్తిసూచిలో వృత్తి పరికరాలను మరో విభాగంగా చూపవచ్చు.

అ. వృత్తిపరికరాలు : వృత్తులకు సంబంధించిన పరికరాలను తయారు చేయడంవల్లనో, పంపిణీ చేయడంవల్లనో గృహనామాలు ఏర్పడియుండవచ్చు. ఉదాహరణకు కొడవలి, గుంటక, గొడ్డళ్ళ, నాగళ్ళ, పలుగు, మడకల, రంపాల, లిక్కి, సమ్మెట మొదలైన వృత్తి పరికరాలు ఆయావ్యక్తులయొక్క వృత్తులతోను,

వృత్తి పరికరాలతోను వారికిగల సంబంధాన్ని సూచిస్తాయి. వీటి వ్యుత్పత్తి వివరణలు ఆయా ఇంటిపేర్ల ఆరోపాల కింద చూడవచ్చు.

## 7. సంస్కృతి సూచి :

వేదశాస్త్ర పురాణ ఇతిహాస కళలు అన్నీ సంస్కృతీ విభాగానికి చెందినవే.

అ. వేదం : అవధానం, ఘనాపాఠీ, చతుర్వేదుల, త్రివేదుల, ద్వివేదుల, పన్నాల, భాష్యం, వేదం, వేదాల, వేదుల, శ్రీభాష్యం మొదలైన గృహనామాల వల్ల ఆ ఇంటిపేరు గలవారు వేదవిద్యాభ్యాసం కలవారని తెలుస్తుంది. వ్యక్తి నామం మీద అవధానపదం చేరిన ఇంటిపేర్లున్నాయి. ఉదా. చక్రావధానుల మాణిక్యావధానుల. వ్యక్తినామంపై ద్వేదుల చేరగా అప్పాద్వేదుల అన్న ఇంటిపేరు ఏర్పడింది.

ఆ. శాస్త్రం ; జ్యోతిషం, వ్యాకరణం అని శాస్త్రానికి సంబంధించిన ఇంటి పేర్లను విభజించవచ్చు.

I. జ్యోతిషం : జ్యోతిశ్శాస్త్ర పారంగతులై, జ్యోతిషం చెప్పి పేరుగాంచిన వారికి జ్యోస్యం వారనీ, జోస్యుల వారనీ, జోస్యుల పదం వ్యక్తినామాలపై చేరగా తిప్పాజోస్యుల, తిమ్మాజోస్యుల అన్న ఇంటిపేర్లు కూడా ఏర్పడ్డాయి. సాముద్రిక శాస్త్రం తెలిసినవారికి సాముద్రికం వారనీ ఇంటిపేర్లున్నాయి.

II. వ్యాకరణం : 'వ్యాకరణం' వైయాకరణం, అనే ఇంటిపేర్ల వల్ల వీరు వ్యాకరణ శాస్త్ర పాండిత్యమో, బోధనమో కలవారని చెప్పవచ్చు.

ఇ పురాణం : పురాణం, భాగవతం మొదలైన ఇంటిపేర్లు ఈ వర్గానికి చెందినవే. పురాణం చెప్పడం వలన ప్రసిద్ధి చెందిన వారు పురాణంవారు. అలానే 'భాగవతానికి వ్యాఖ్యానం రాయడంవల్ల' భాగవతం అన్న ఇంటిపేరు ఏర్పడింది.

ఈ. ఇతిహాసం · భారతం అనే ఇంటిపేరు ఇందుకు ఉదాహరణగా చెప్పుకో వచ్చు. భారత గ్రంథాన్ని చదివి వినిపించడంలోనో, వ్యాఖ్యానించడంలోనో ప్రసిద్ధి చెందినవారు కనుక వీరు 'భారతం' వారు,

ఉ. కళలు : సంస్కృతి సూచిలో భాగమైన కళలను కవిత్వం, సంగీతం, విగ్రహ నిర్మాణం, చిత్రకళ అని నాల్గు విధాలుగా విభజించవచ్చు.

I కవిత్వం : కవి, కవిరాట్, ఘోరకవి, చిత్రకవి, దిట్టకవి, నిదానకవి, నిమిషకవి, ప్రబంధకవి, ప్రౌఢకవి, బంధకవి, మధురకవి, వార్తకవి, శృంగారకవి, మొదలైన ఇంటిపేరు గల వారి పూర్వులు అయా కవితారీతులలో దిట్టలని ఊహించడానికి ఆస్కారముంది.

II. సంగీతం : ఘనం, పల్లవి, రాగం, సంగీతం, మొదలైన ఇంటిపేర్లు ఆ గృహనామకులకు సంగీతంలోగల ప్రతిభను చాటుతున్నాయి. తోడి మొదలైన రాగాలపేర్లు కూడా యింటిపేర్లుగా చెలామణి అవుతున్నాయి. వీణ, సన్నాయి, మున్నగు కొన్ని సంగీత పరికరాలే ఇంటిపేర్లుగా చెలామణిలో ఉన్నాయి.

III. శిల్పనిర్మాణం : శిల్పవిద్యకు సంబంధించిన ఇంటిపేర్లన్నీ ఈ వర్గానికి చెందుతాయి. ఉదా : శిల్పాల

Iv. చిత్రకళ : 'చిత్తారు' సంస్కృత చిత్రకార శబ్దభవంగా ప్రాకృతంలో ఏర్పడ్డ 'చిత్తార' దీనికి మూలం. ఇది చిత్రకళకు సంబంధించిన ఇంటిపేరే. ఈ గృహనామం కలవారికి చిత్రకళలో గల ప్రవేశం స్పష్టమౌతుంది. ఇప్పటివారికి చిత్రకళలో ప్రవేశం లేకపోయినా వారి పూర్వీకుల వలన ఆ గృహనామం అలా నిలిచి పోతుంది.

v. కళాప్రదర్శనం : కూచిపూడి భాగవత ప్రదర్శనాలు తరతరాలుగా వృత్తిగా చేపట్టిన ప్రయోక్తల కుటుంబ నామం 'భాగవతుల' గా రూపొందింది. భాగోతుల బుచ్చిగాడు చాటువులలో ప్రసిద్ధుడు. బొమ్మలాటలు ప్రదర్శించడంవల్ల 'బొమ్మలాట' యింటిపేరుగా మారింది.

**8. ఇతరాలు :**

ఇతర విషయాలకు చెందిన భాగాన్ని శరీరావయవ సూచి, లోహసంబంధులు, పంచభూతాలకు సంబంధించినవి, దేశలేక భాషాసూచి, నివాసస్థలసూచి అని ఐదు విధాలుగా విభజించవచ్చు.

అ. శరీరావయవ సూచి : శరీరావయవాల విశిష్టతగల వ్యక్తులకు సంబంధించిన కంఠం, గడ్డం, చెవుల. పొట్ట, బుర్ర, బొజ్జ, బొడ్డు, ముక్కు, మెడ, మొదలైన పేర్లు ఇంటిపేర్లుగా కన్పిస్తున్నాయి. ఇంతేకాకుండా శరీరావయవ లోపాన్ని సూచిస్తున్న ఇంటిపేర్లున్నాయనడానికి కర్రి, కుంటి, గుడ్డి, నంగి, నత్తి, మూగి మొదలైన ఇంటిపేర్లే ఉదాహరణలు.

ఆ. లోహసంబంధసూచి : లోహ సంబంధసూచిని లోహాలు, ఆభరణాలు అని రెండు విధాలుగా విభజించవచ్చు.

I. లోహసూచి : ఇత్తడి, కనక, బంగారు, రాగి, సువర్ణం మొదలైనవి లోహాలకు సంబంధించిన ఇంటిపేర్లు. ఈ ఇంటిపేర్లవలన ఆయాలోహాలతో ఆ ఇంటిపేరు కలవారి కున్న సంబంధం తెలుస్తుంది.

II. ఆభరణ సూచి : అందెల, కంకణాల, కడియాల, గజ్జెల, గాజుల, బంగారు, ముక్కెర, ముంగర, మురుగు, మువ్వల, మొదలైన ఇంటి ర్లు ఆభరణాలను సూచిస్తున్నాయి.

ఇ. పంచభూతాలు : నేల, నీరు, నిప్పు, గాలి, నింగికి సంబంధించిన ఇంటి పేర్లు పంచభూతాల వర్గానికి చెందినవి.

I. పృధ్వీ మొదలైన భూసూచిని తెలియజేసే ఇంటిపేర్లున్నాయి.

II. ఊటా, కాలవ, కొలను, గంగా, చెర్లో, జలధి, తీర్థం, మడుగు, లంక, సముద్రాల మొదలైన ఇంటిపేర్లు జలసంబంధమైనవి.

III. అగ్ని మొదలైన అగ్నికి సంబంధించిన ఇంటిపేర్లున్నాయి.

IV. గాలి మొదలైన వాయు సంబంధమైనవి కూడా ఇంటపేర్లలో చోటుచేసుకున్నాయి.

v. ఆకాశం, చదల మొదలైనవన్నీ పంచభూతాలకు సంబంధించినవే.

ఋ. దేశ/భాషా సూచి. అరవం, ఆరె, కన్నడ, గుజరాతి. తెలుగు, మరాటి మొదలైన దేశ లేక భాషా సూచి గృహనామాలు ఇంటిపేర్లుగా నిలిచిపోయాయి. వీరి పూర్వులు ఆయా దేశభాగానికో లేక భాషకో సంబంధించిన వారు అయ్యుండవచ్చు.

ఉ. నివాసస్థల సూచి : నివాసస్థల స్వభావాన్ని సూచించే ఇంటిపేర్లను రెండుగా వర్గీకరించవచ్చు. I. –ఇంటి పరపదంగా కలవి, II. –మీద పరపదంగా కలవి.

I. –ఇంటి : వ్యక్తులు నివసిస్తున్న ఇంటి నిర్మాణాన్నిబట్టి, నిర్మాణంలో ఉపయోగించిన సామగ్రినిబట్టి, ఇంటినిర్మాణానికి ఉపయోగించిన స్థలాన్నిబట్టి ఏర్పడిన ఇంటిపేర్లున్నాయి. ఉదా :– కొత్తింటి, గారింటి, చిన్నింటి, పాతింటి, మిద్దింటి మెరకింటి మొదలైనవి. దొడ్లో, నడిమింటి, మూలింటి, యింటి మొదలైన ఇంటిపేర్లు నివాసాల ఉనికిని, దిక్కులను సూచిస్తున్నాయి.

II –మీద : కొండమీద, పాటిమీద, మిద్దెమీద మొదలైన ఇంటిపేర్ల వలన నివాసస్థల స్వరూప స్వభావాలు వ్యక్తమౌతున్నాయి.

ఊ. గోత్రనామం, ఇంటిపేరు పరస్పరంగా మారడం : బ్రాహ్మణులలో తప్ప ఇతర వర్ణాలలో ఋషి గోత్రాలు కన్పించవు. ఈ ఋషిగోత్ర నామాలు విస్మృతాలయ్యాయనో. విసర్జించబడ్డాయనో కొందరంటారు. ఏది ఏమైనా బ్రాహ్మణేతరులలో గోత్రనామాలు గృహనామాలు పరస్పరం వినిమయ మౌతుండడం అనేకోదాహరణలనుబట్టి గమనించవచ్చు. ఇందు ఏదిముందో ఏది తరువాతో తెలియదు. ఇలాంటి ఇంటిపేర్లకు కొన్ని ఉదాహరణలు : అక్షింతల, అబ్బూరి, ఆలమందల, ఆవాల, ఇనగంటి, కంచర్ల, కస్తూరి, కాకర్ల, కాగితాల, గుంటూరి, గొర్రెల, చింతలపూడి, జిల్లేళ్ళ, టంగుటూరి, తాడ్పూరి, తోకల, నాదెండ్ల, నాయునేని, నీరుకొండ, పావులూరి, పువ్వుల, పేగాల, మదఘంచి, మల్లె పూవుల, రాజనాల, రావి, విప్పర్ల మొదలైనవి.

గృహనామాల వ్యక్తినామాల అనుపూర్వి :

తెలుగు వారిలో వ్యక్తినామానికి ముందు ఇంటిపేరు చేర్చబడుతుండడం సర్వసాధారణం. ఇంటిపేరు + వ్యక్తినామం + పట్టపుపేరు - ఇలా పెట్టుకొనే ఆచారం ఆంధ్రులది. పట్టపుపేరుకు అందరూ ప్రాధాన్యాన్ని ఇవ్వకపోయినా ముందు ఇంటిపేరు, ఆతర్వాత వ్యక్తినామం చేర్చి వ్యవహరించే పద్ధతి అలవాటులో ఉంది. కొందరు తమపేరు తరువాత ఇంటిపేరు చేర్చుకోవడం ఇటీవలి అలవాటు వివిధ విద్యా సంస్థలలో, ఇతర కార్యాలయాల్లో ఓటర్ల జాబితాల్లో వ్యక్తినామం తరువాతనే గృహనామం చేర్చడం మామూలయింది.

పాశ్చాత్య దేశాలకు వలస వెళ్ళినవారూ, వెళ్ళి తిరిగి వచ్చినవారూ, పాశ్చాత్య సంప్రదాయానికి లోనైనవారూ వ్యక్తినామం + పట్టపుపేరు + ఇంటిపేరును వాడుతున్నారు. ఉదా - ఎస్. ఆర్. మేదరమెట్ల : మేదరమెట్ల హనుమంతరావు; ఎచ్. ఆర్. పిన్నమనేని : పిన్నమనేని నరసింహారావు; ఎస్. ఎన్. కిలారు : కిలారు శ్రీమన్నారాయణ; ఎస్. ఎన్. ఎమ్. గొర్తి : గొర్తి సత్యనారాయణమూర్తి; వి. ఆర్. నార్ల : నార్ల వెంకటేశ్వరరావు. ఇలా కొందరు వ్యక్తినామాన్ని సంక్షిప్తీకరించి ఇంటిపేరును పూర్తిగా వాడారు. మరికొందరు వ్యక్తినామాన్ని ఇంటిపేరును పూర్తిగా రాసుకున్నారు. ఇందుకు ఉదా :- తిరుపతయ్య తేళ్ళ. సుబ్బారాయుడు కడప: శామ్యుయేల్ గుడిసె.

నాటికీ, నేటికీ, తెలుగు మాతృభాషగా కలిగి కొన్ని దశాబ్దుల క్రితమో లేక శతాబ్దుల క్రితమో తెలుగుదేశం నుండి తమిళ కర్ణాట మహారాష్ట్రాద్యన్య భాషా వ్యవహార ప్రాంతాలకు వలసవెళ్ళి స్థిరపడ్డ తెలుగువారి ఇంటిపేర్లలో మార్పు అంతగా లేకపోయినా, ఇంటిపేరు, వ్యక్తిపేరు, వీటి పౌర్వాపర్యంలో విపర్యయం కన్పిస్తుంది. ఉదాహరణకు కర్ణాటక సీమకు చెందిన గుల్బర్గా వాస్తవ్యులైన పూజారి అన్న ఇంటిపేరుగల రామప్ప కుమారుడైన వెంకప్పఅని సూచించడానికి వెంకప్ప రామప్ప పూజారి అని వ్యక్తినామం + తండ్రిపేరు + ఇంటిపేరుతో వ్యవహరించడం కద్దు. కొన్నిచోట్ల ఇంటిపేరు వాడుక బొత్తిగా మరుగున పడి ఆ స్థానంలో తండ్రిపేరు రావడం తమిళ దేశంలో కన్పిస్తుంది. రాజపాళయం

వాస్తవ్యులైన పూసపాటి కుమార స్వామిరాజా అచ్చంగా తెలుగువారు. వారి తండ్రి పేరు నల్లయరాజా. వాడుకలో కుమారస్వామి రాజాగారిని యన్.కుమారస్వామిరాజా అంటే నల్లయ రాజా కుమారస్వామిరాజా అని స్థిరపడి ఇంటిపేరు ఎగిరిపోయింది.

పాశ్చాత్యులలో ఇంటిపేరుకు బదులు వాడే తండ్రిపేరు వ్యక్తినామానికి చివర పెట్టుకోవడం పరిపాటి. ఇదే సంప్రదాయం ఇతర భారతీయ భాషా ప్రాంతాలలోకూడ ఉంది ప్రత్యేకంగా ఆర్యభాషా శాఖలలో కన్పిస్తుంది. తెలుగు తప్ప మిగిలిన ద్రావిడ భాషల్లో కూడ ఈ పద్ధతే అమలులో ఉంది. తెలుగువారిలో తల్లిదండ్రుల పేర్లు ఇంటిపేర్ల స్థానంలో తక్కువగా కన్పిస్తాయి.

ఇంటిపేర్లను సంక్షిప్తం చేసి రాసుకునే అలవాటు తెలుగువారిలో ఎక్కువగా ఉంది. ఈపద్ధతి మూడు రకాలుగా కన్పిస్తుంది. 1. ఇంగ్లీషు లిపిలోకి మార్పుగా వచ్చిన వర్ణాలతో 2. తెలుగు లిపిలోకి మార్పుగా వచ్చిన వర్ణాలతో 3. ఆంగ్లమో తెలుగో తెలియని సందిగ్ధవర్ణాలు కలవి. మొదటి వర్గానికి చెందిన వానికి ఉదాహరణలు : ఎ. సాంబశివరావు (ఆవుల), బి. రామచంద్రరావు (బరెల్లి), సి. రామచంద్రరావు చిరుమామిళ్ళ), డి. భాస్కరరెడ్డి (దువ్వూరి), జె. సూర్య నారాయణ (జాస్తి, ఎల్. రామచంద్రరావు (లక్కరాజు): వి. రామచంద్రచౌదరి (వంకాయల పాటి) : వి, యస్. కృష్ణ (వాసిరెడ్డి) మొదలైన ఇంటిపేర్లలో ఇంటిపేరును సంక్షిప్తీకరించి ఆంగ్ల లిపిలో సూచించడం జరిగింది. వారి పూర్తి ఇంటిపేరు కుండలీకరణంలో ప్రదర్శించబడింది.

ఇక రెండో వర్గానికి చెందినవి. కొందరు వారి ఇంటిపేరును ఆంగ్లీకరించ కుండా తెలుగులోనే సంక్షిప్తీకరించి వాడుకుంటున్నారు.

ఉదా :- ఊ. లక్ష్మీకాంతమ్మ, (ఊటుకూరి); ఆ. నా. దాసు (ఆదిభట్ల).

మరికొందరు తమ ఇంటిపేరును సంక్షిప్తీకరించినా అది ఆంగ్లమో తెలుగో తెలియని స్థితిలో ఉన్నాయనడానికి ఉదాహరణలు : బి. రామరాజు (బిరుదురాజు); సి. నారాయణరెడ్డి (సింగిరెడ్డి).

కొంతమంది ఇంటిపేరుతోపాటు వ్యక్తినామాన్ని కూడా కలుపుకొని కొత్త పేరు చమత్కృతికోసం సృష్టించడం కన్పిస్తుంది. ఉదా :- జరుక్‌శాస్త్రి

టంకసూత్రం రుక్మిణీనాథ శాస్త్రి; రావిశాస్త్రి : రాచకొండ విశ్వనాథశాస్త్రి ; వసురాయలు. వటాది సుబ్బారాయలు; వాసు.దాసు : వావిళికొలను సుబ్బారావు; ఈ ఉదాహరణల్లో క్రింగీటు కలవి ఇంటిపేర్లు. విశ్వసత్యనారాయణ అని విశ్వనాథ సత్యనారాయణగారి పేరును. ఇంటిపేరును కలగాపులగం చేయడం శ్రీశ్రీ గేయాల నూత్నభణితి.

తెలుగుదేశంలోని మహమ్మదీయులకు సాధారణంగా వారి తెగ నామాలైన షేక్, సయ్యద్, పఠాన్ మొదలైనవే గృహనామాలుగా వాడుకపడి ఉండడం గమనించవచ్చు. ఉదా : షేక్ మస్తాన్, షేక్ మహమ్మద్ సుభానీ, సయ్యద్ గఫూర్‌ఖాన్; పఠాన్ ఖోజాసాహెబ్ మొదలైనవి. కాని వీరిలో కూడ వృత్తిని బట్టి ఏర్పడ్డ ఇంటిపేర్లున్నాయి. మంటినూనె పీరుసాహెబు. మంటినూనె అంటే కిరసనాయిలు. కిరసనాయిలు వ్యాపారం చేస్తాడుగనుక ఈ ఇంటిపేరు వచ్చింది. అలానే బేపారిపు సుల్తాన్ సాహెబ్. బేపారపు అంటే వ్యాపారపు అని అర్థం. వ్యాపారంచేసేవడు గనుక సుల్తాన్ సాహేబ్‌కు ఇది ఇంటిపేరుగా నిలిచింది. ఇది సాధారణ వాడుక. ఇప్పుడు గ్రామ నామాలే ఇంటిపేర్లుగా స్థిరపడడం మహమ్మదీయులలో కూడ కన్పిస్తుంది. ఉదా :_ పెదకూరపాటి ఆదుంసాహెబ్.

### తెలుగు దేశంలోని ఆదివాసులలో ఇంటిపేర్లు

ఆదివాసులలో ప్రతిజాతిలోను ఒక్కొక్క కుటుంబానికి ఒక్కొక్క ఇంటి పేరు (sept) ఉంటుంది. సామాన్యంగా ఒక జంతువు పేరుగానో, ఒకచెట్టుపేరుగానో వుంటుంది. ఉదా:_ నక్కల, గుబ్బిం, పాముల, మామిడి మొదలైనవి. కొన్ని చోట్ల ఈ గృహనామాలు నిర్జీవవస్తువులుగా కూడా ఉన్నాయి. ఆయా ఇంటిపేర్లు గల కుటుంబాల యొక్క పూర్వీకులకు ఆపేరుతో ఉన్న వృక్షంతోగాని, మరి ఇతర వస్తువులతోగాని యేదో ఒక సంబంధం ఉందని చెప్పుకుంటారు. వాటిని ఆపేరుగల కుటుంబం వారు అతి గౌరవంతో పూజించేవారు. జంతువైతే చంపరు. సామాన్యంగా దాన్ని భక్షించరు. చెట్లను నరకరు. ఈ సంప్రదాయం ఆస్ట్రేలియా, ఉత్తర అమెరికా, ఆఫ్రికా జాతులలో కూడా ఉంది ఒకే ఇంటిపేరుగల కులంవారితో వివాహసంబంధాలు చేయరు "ఈచెట్లు 'Totems' అనియు వానియందు విశ్వాసంగల జాతులు 'Totemistic tribes' అనియు ఆంగ్లమున వ్యవహరింపబడుచున్నవి" (తె విజ్ఞాన.స.సం.2)

"కోయలు, సవరలు, ఖోండులలో సామాజిక నిర్మాణం కుదురు పరకే. మేకల, గుఱ్ఱం, తోకల, అరటి, గుండం, వింజ్ల, మొదలైనవి కుదురుల పేర్లే. ఆకుదురుపేరే ఇంటిపేరుగాను వుంటుంది." (ఆంధ్రులసంస్కృతి, చరిత్ర-I పు.41). కుదురు అనేది గ్రామం కన్నా పెద్దది. వివాహాలను ధృవీకరించడం, సమాజంలో సమైక్య భావాన్ని ధృఢ పరచడం దీని ప్రధాన బాధ్యతలు. ప్రతికుదురుకూ ఒక పూర్వపురుషుడుంటాడు. దానికో ఉపనామం—ఇంటిపేరు ఉంటుంది. బోగల, వెంట్లి, గుర్రంజ్ల, చింతల, గొల్ల మొదలైనవి పాల్కొంచ ప్రాంతంలో కన్పించే కొన్ని ఇంటిపేర్లు.

"శాతవాహన, శాలివాహన, శాతకర్ణి అనేవి ఆటవికుల కుదుర్ల పేర్లని తోస్తుంది. శద అంటే గుఱ్ఱం. కన్, హన్ అంటే కొడుకు. ముండా భాషకు చెందిన ఈ రెండు పదాల సమ్మేళనమే శాతకర్ణి, లేక శాతవాహన. అంటే గుఱ్ఱం కులదేవతగా గల కుదురు అన్నమాట" అని శాతవాహన అనే వంశనామం గురించి ఆంధ్రుల సాంఘిక చరిత్రలో కంభంపాటి పేర్కొన్నారు.

అరటి, ఇంజ్ల, గుండం, గుఱ్ఱం, తోట, మూన్ల, మేకల, సవరం మొదలైనవి చెంచులలో ఇంటిపేర్లు (సి.టి.యస్.ఐ.II; పు.39).

అంబోజల, ఆవుల, ఉయ్యాల, కటారి, కంప, రాసగ, గజ్జల, తోక, దాసరి, పూల, బండి, మొగలి, రాగుల, సముద్రాల మొదలైన ఇంటిపేర్లు ఉప్పుఎరుకలలో కన్పిస్తున్నాయని సి.టి.యస్.ఐ. III, పు. 452.

అగ్ని, అలిగె, అందర = booth, ఆనె, ఆరతి, ఆవు, ఉంగరం, చంద్ర, చిన్న, చేలు=తేలు, పుట్ట, బండి, మల్లి, సూర్య మొదలైన ఇంటిపేర్లు కురుబల్లో ఉన్నాయని సి.టి.యస్.ఐ. IV, పు. 142. ఈ ఉదాహరణాల వల్ల ఇంటిపేర్లకు గల ప్రాచీనత్వం తెలుస్తుంది.

## వ్యవహారంలో ఉన్న ఇంటిపేర్ల మార్పులకు గల వివిధ కారణాలు :

ఇంటిపేరు ఏర్పడడానికి ఎన్నికారణాలున్నాయో మార్పులకుకూడా దాదాపు అన్ని కారణాలూ దోహదంచేస్తాయి.

I. పెళ్ళి అయ్యాక స్త్రీల పుట్టింటి పేర్ల స్థానంలో మెట్టిన ఇంటి పేర్లు వచ్చి నిలుస్తాయి. ఈ విధమైన ఇంటిపేర్లను నాల్గు రకాలుగా వర్గీకరించవచ్చు. 1. వివాహం తరువాత మార్చుకొన్నవి. 2. మార్చుకోనివి, 3. రెండూ వాడినవారు 4. రెండు ఇంటిపేర్లూ తీసేసినవారు.

1. మార్చుకొన్న ఇంటిపేర్లు : ప్రాయికంగా ప్రతి తెలుగింటి ఆడబడుచు ఇంటి పేరులోనూ ఈ మార్పు కన్పిస్తుంది.

ఎ. బండారు అచ్చమాంబ (1874 – 1905) కొమర్రాజు వెంకటప్పయ్య గారి పుత్రిక బండారు మాధవరావుగారి ధర్మపత్ని అయ్యాక బండారు అచ్చమాంబగా మార్చుకోవడం జరిగింది.

బి గొడేవారి ఆడుబడుచు సుభద్రయమ్మ (19 th C) వివాహం తరువాత మదినె సుభద్రయమ్మగా మారారు.

సి. అబ్బూరి సుబ్బారావుగారి పుత్రిక కొటికలపూడి రామారావుగారి భార్య అయిన తరువాతనే అత్తవారింటి పేరు స్వీకరించి కొటికలపూడి సీతమ్మ (1874-1936) గా ప్రసిద్ధిచెందారు.

డి నాళం వారి ఆడుబడుచు, రాజమండ్రి వాస్తవ్యులు నాళం కృష్ణారావుగారి కుమార్తె అయిన లక్ష్మీకాంతమ్మ బాపట్ల వాస్తవ్యులైన ఊటుకూరి ఉపేంద్ర గుప్తాగారి భార్య అయిన తరువాత ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగా మారారు.

2. మార్చుకోని సంఘటనలు : సాంఘిక రాజకీయ సాంస్కృతిక రంగాలలో పేరు ప్రతిష్ఠలు గడించిన కొందరు వారి ఇంటిపేరు మార్చుకోలేదు. వారి విశిష్టత, ప్రత్యేకత నిలబెట్టుకోవాలని కాబోలు అలానే ఉంచుకున్నారు.

ఏ. కొండా పార్వతీ దేవి కొండా వెంకటప్పయ గారికొమార్తె ఈమె తన ఇంటిపేరు మార్చుకోలేదు.

బి. కొమర్రాజు అచ్చమాంబ తన పుట్టింటిపేరు మార్చుకోలేదు.

సి. తమారెడ్డి నిర్మలకూడా వివాహానంతరం ఇంటి పేరు మార్చుకోని వారిలో ఒకరు

డి. నాయని కృష్ణకుమారికూడా వారి ఇంటిపేరును మార్చుకోలేదు.

మొల్లరామాయణ కర్త్రి మొల్ల ఇంటి పేరు ఆతుకూరి వారు ఇది ఆమె పుట్టింటిపేరే. మెట్టినింటిపేరేదో తెలియదు.

3. రెండింటిపేర్లూ వాడినవారు : ప్రసిద్ధ రచయిత్రి కోడూరి కౌసల్యాదేవి ఇంటిపేరు పెళ్ళయ్యాక కోడూరి నుండి ఆరెకపూడిగా మారింది. కాని ఆమె సుపరిచితమైన తన గృహనామాన్ని అత్తవారింటి పేరైన ఆరెకపూడి పక్కనే కుండలీకరణంచేసి ఆరెకపూడి (కోడూరి) కౌసల్యాదేవి అని రాసుకుంటున్నారు ఈ విధంగా రెండు పేర్లూ వాడుకుంటున్నవారు వీరొక్కరే.

4 రెండింటిపేర్లూ తీసేసినవారు :

ఏ. ముప్పాళ్ళ రంగనాయకమ్మ పుట్టినింటిపేరు దద్దనాల. ఇప్పుడా రెండు ఇంటిపేర్లు తీసేసి కేవలం రంగనాయకమ్మ గానే రాసుకుంటున్నారు.

బి. తరిగొండ వెంగమాంబ పుట్టింటిపేరు కానాలవారు, భర్త నింజేటి వేంకటాచలపతి. కొన్నిచోట్ల నింజేటి, నుంజేటి అని పాఠాంతరాలున్నాయి. తరిగొండ నరసింహుడు ఆమెకు ఇలవేల్పు. వెంకటేశ్వరుడు ఇష్టదైవం. వీరిద్దరికీ అభేదం పాటించి చాలా కృతులు అర్పించింది ఈమె తన పుట్టింటి, మెట్టినింటి పేర్లతో కాకుండ తరిగొండ గ్రామనామంతోనే ప్రసిద్ధిచెందింది.

II. దత్తు వెళ్ళినా, ఇల్లరికం వచ్చినా ఇంటిపేరు మారవచ్చు. 'దత్తువెళ్తే జనక పితరుల ఇంటిపేరు స్థానంలో పాలక పితరుల ఇంటిపేరు వస్తుంది మచిలీపట్టణంలోని అక్కివారి అబ్బాయి గుంటూరు అగ్రహారంలోని కాశీవారి ఇంటికి దత్తు వచ్చి కాశీ కృష్ణాచార్యులుగా ప్రసిద్ధులయ్యారు ఇలాగే గూడు మారినందువల్ల కొమ్మూరి వారి కుర్రవాడు గుడిపాటి వెంకటాచలంగా గుర్తించబడ్డాడు.' (తూ.దొ. తె.ఇం;ఒ.పరి. ముత్తినేని వారి ఇంటికి ఇల్లరికం వచ్చిన పోతిన వారి అబ్బాయి ముత్తినేని కోటయ్యగా వాడుక పడ్డాడు. పోతుల వెంకటప్ప యల్నాటి వారి యింటికి ఇల్లరికం వెళ్ళి యల్నాటి వెంకటప్పగా మారారు,

III. ఒక ఇంటిపేరు గలవారు ఒక గ్రామంలో కొన్ని తరాలుండి ఆ పిమ్మట మరో ఊరు వెళ్ళి స్థిరపడగా పాతపేరు మూలబడి ఆ క్రితం వదలివచ్చిన ఊరి పేరు ఇంటిపేరుగా పైకివస్తుంది. చాలాకాలం గుంటూరులో నివసించిన పాలపర్తి గృహనామం కలవారు గుంటూరు వదలి మరో గ్రామానికి రాగా పాలపర్తి అనే ఇంటిపేరు మూలబడి గుంటూరి అనే కొత్త ఇంటిపేరు వాడుకలోకి వచ్చింది. రాకిట్ల గ్రామవాసులైన రాచముడుగు గృహనామకులైన వైశ్యులు కల్యాణదుర్గం వెళ్ళి స్థిరపడగా వారికి 'రాకట్ల' వారన్న కొత్త యింటిపేరు సంక్రమించింది.

iV. నివాస స్థలాన్ననుసరించి : ఆయా కుటుంబాలు నివసిస్తున్న నివాస స్థలాలు, వనికీ, దిశలు, నిర్మాణ పరికరాలు మొదలైన వాటిని బట్టి అసలు పేరు మూలనబడి కొత్తపేరు ముందుకువచ్చి కూర్చుంటుంది. అధికారికంగా అసలు ఇంటిపేరు వాడినా వ్యవహారంలో మాత్రం మారిన ఇంటిపేర్లే వాడుకలో ఉన్నాయి. గుడుపూటివారు పడమటింటి వారుగను, వగడాలవారు పైయింటివారు గానూ, నేలపాటివారు మూలింటివారుగాను మారడం ఇందుకు ఉదాహరణలు : వంకలో రంగన్న (బోధనపాటి): ఇంటిముందు వంక ప్రవహిస్తున్నది గనుక, ఊరాకిలి తిరుపతయ్య (రాచముడుగు) - ఊరువాకిలి దగ్గర ఇల్లు కట్టుకున్నారు గనుక. సందులో రామన్న, దొడ్లో కొండప్ప, కొట్లో బసప్ప మొదలైనవన్నీ ఇలాంటివే.

V భాషాంతరీకరణం : భాషాంతరీకరణం వలన కొన్ని ఇంటిపేర్లు మార్పు చెందినట్లు మనం గుర్తించవచ్చు. ఇవి ప్రధానంగా రెండు రకాలు. 1. సంస్కృతీకరణం, 2. కన్నడీకరణం.

1. సంస్కృతీకరణం : కవిశిరోభూషణకర్త ఆహోబలపతి అసలు ఇంటిపేరు 'గాలి' వారు. శబ్దమంజరికర్త నడిమింటి సర్వమంగళ శాస్త్రిగారు మధ్యమందరం వారుగా మార్చుకున్నారు. గాలి వారు ప్రభంజనం వారుగా మారడం, నడిమింటివారు మధ్యమందిరం వారుగా మార్పుచెందడం, రెండుచింతల లేక రెంటచింతల వారు ద్వితింత్రిణిగా, గోరుగుంతల పాడువారు నఖగర్తపురంగా మారడం, ఆలూరును ఆలు ఊరు అని విడదీసి జాయాపురంగా మార్చుకోవడం,

వందికొండ వారు పెదాహాగిరిగాను, గోగివారు ఘట్కేశ్వర గృహనామం గలవారుగాను, పొదిపెంటవారు ..... వారుగా మారడానికి కారణం దేశస్థల పేరు సంస్కృతీకరణం.

2. కన్నడీకరణం : అనంతపురం మండలంలోని పెంచలపాడు హంపసాగరాగా, పెనుకలపాడు హనకనహాళగా కన్నడించడం వలన మారిన ఇంటిపేర్లే.

VI. కొంతమంది తమ ఇంటిపేర్లు అశ్లీలార్థాన్ని ద్యోతక పరుస్తున్నాయని ఇంటిపేరు మార్చుకన్నారు. ముట్నూరు అశ్లీలార్థం స్ఫురిస్తుందని ముట్నూరు ను మార్చుకున్నారని ముట్నూరి కృష్ణారావుగారి జీవిత చరిత్రలో ఉంది.

VII. జ్ఞాతి సంబంధమైన కర్మాచరణలలో ఇబ్బంది లేకుండా ఉండేందుకు ఒక్కటిగా ఉన్న గృహనామం భాషాధ్వనిపరమైన కొద్ది మార్పులతో రెండు లేక మూడుగా ఏర్పడవచ్చు. ఉదా. త్రిపురనేని, త్రిపుర్నేని, తిపిర్నేని, తిప్పా

VIII. శ్రీ వైష్ణవ సంప్రదాయంలో ఆచార్య స్థానంలో ఉన్న కుటుంబాల వారిలో శ్రీమత్తిరుమల పెద్దింటి, శ్రీమతిరుమల గుదిమెళ్ళ అన్న ఇంటిపేర్లు చూస్తాం. క్రమంగా తాహతు తగ్గడం వల్లనో, శకరాయి వస్తుందనో, ఇబ్బిబ్బి కలుగుతుందనో మహత్సూచక వాచకాలు అదృశ్యమై తిరుమల పెద్దింటి, తిరుమల గుదిమెళ్ళ, పెద్దింటి, గుదిమెళ్ళ అన్న ఇంటిపేర్లతో కొందరు కన్పిస్తారు' (తూ.దొ;తె.ఇం.ఒ.వ. .

IX. వందేమాతరం ఉద్యమంలో పాల్గొన్నందున వందేమాతరం రామచంద్ర రావుగారికిది ఇంటిపేరయింది. వీరి పూర్వపు గృహనామం వైలాల?

X. గోత్రనామాలనే ఇంటిపేర్లుగా మార్చుకుని తమ పేర్ల చివర చేర్చుకున్నారు కొందరు.

ఉదా రామచంద్ర కాశ్యప; రామచంద్ర కౌండిన్య. వీరికి పూర్వం ఇంటిపేర్లున్నా వారి గోత్రనామాల్నే గృహనామ స్థానంలో నిలుపుకున్నారు. రామచంద్ర కౌండిన్య గారి పూర్వపు ఇంటిపేరు ఓరుగంటి.

XI. తమ ఇంటిపేరు ఎందువల్లనో నచ్చక కొందరు కొత్తపేరు పెట్టుకోవడం తరచుగా కన్పిస్తుంది. సింగాడి వారు సముద్రాల వారుగా మారడం, చలసాని సుబ్రహ్మణ్యేశ్వరరావు వడ్డెర చండీదాసుగా మారడం, బొక్కా-వారు బ్రహ్మాండం వారుగా మారాలని అనుకోవడం ఇలాంటివే.

నూకల అగ్గెప్పగారు కళింగసీమలోని వైదిక బ్రాహ్మణుడు. ఈ వ్యక్తినే తమ కన్యాశుల్కంలో అగ్నిహోత్రావధానులుగా చింతించి వీరి ఇంటిపేరును 'నులకా' అని గురజాడ అప్పారావుగారు మార్చారని అభిజ్ఞులు చెప్తుంటారు.

XII. 'పట్టుపోగుల' అన్నది సాలీలలో ఒక ఇంటిపేరు. పట్టుపోగులు నేసేపని వారు. వీరి ఇంటిపేరు పొట్టపేగులుగా మారింది. బహుశా ఇది ఉచ్చారణ దోషం కావచ్చు.

XIII. ఆయా వృత్తులలో ప్రసిద్ధిచెందిన వారికి వారి పాత ఇంటిపేర్లు మరుగునపడి వృత్తిని సూచించే కొత్త ఇంటిపేర్లు వాడుకలోకి వచ్చాయి. 'టైలర్' మొదలైనవి ఆధునికంగా ఏర్పడ్డ ఇంటిపేర్లే.

XIV. అవయవ లోపాదికం : కొన్నికొన్ని సందర్భాలలో ఇంటిపేర్లు మూలపడి ఆయా వ్యక్తుల అవయవలోపం, శరీర నిర్మాణ విశిష్టతలు కారణాలుగా ఇంటిపేరు స్థానంలో ఈ విలక్షణతలు చోటు చేసుకోవడం కొత్తకాదు. మాదిరికి కొన్ని ఉదాహరణలు : కుండలీకరణాలలో వారి అసలు ఇంటిపేరు సూచించబడ్డది. నల్లటి శరీర ఛాయ కలిగినందున జట్టిరామయ్య, కర్రి రామయ్యగా వ్యవహృతుడు. కుంటి రామప్ప (దగ్గుబాటి) గిడ్డ అంజనయ్య (జెట్టి); గూని తిమ్మప్ప (కొంకా); గుడ్డి రంగయ్య (బొబ్బూరు): జొల్లు తిమ్మయ్య (గుడుపూటి); దుబ్బ వెంకటరమణప్ప (నల్లబోతుల), నంగిరామన్న (ముల్లంగి); పొట్ట రామయ్య (రాచమడుగు).

XV. తండ్రి లేక పూర్వీకులపేర్లతో : కొంతమందికి పూర్వపు ఇంటిపేర్లు మరుగునపడి కూటస్థుడైన ఒకానొక ప్రముఖ వ్యక్తిపేరుకు గారు చేర్చి గృహ నామంగా వాడుక చేస్తున్నందుకు కొన్ని ఉదాహరణలు : వీరి అసలు గృహ నామాలు కుండలీకరణాలలో సూచించబడ్డవి. అబ్బయ్యగారి వెంకటేశ్వర్లు (లావు). గురప్పగారి కొండయ్య (మాకినేని);భోగప్పగారి రామన్న (నెట్టెం): యర్రన్నగారి ఓబన్న; (గుదె) వెంకన్నగారి రామన్న (మదమంచి).

## ఉపసంహారం

ఇంతవరకు మొదటి భాగంలో ప్రతిపాదించబడిన పరిశీలనా సారాంశం

సంజ్ఞానామ తత్త్వాన్ని, సంజ్ఞానామ శాస్త్ర విభజన, వ్యక్తినామాల వర్గీకరణ చూపించబడింది. వ్యక్తినామాలలో గృహనామ స్థానం వివరించబడింది.

కుటుంబనామాన్ని గురించి చెప్పేముందు కుటుంబ ఆవశ్యకత, ప్రాధాన్యం వివరించబడ్డాయి. ఇంటిపేర్లకు వివిధ నిర్వచనాలు నిరూపించబడ్డాయి.

పాశ్చాత్య భాషల్లోనూ. భారతీయభాషల్లోనూ ఇంటిపేర్లు ఎలా ఉన్నాయో పరిశీలించి వాటిని వర్గీకరించి ఇంటిపేర్లలోని మార్పులు వివరించబడ్డాయి.

ఇంటిపేర్లను అర్థదృష్ట్యా వర్గీకరించి వర్గీకరణ పట్టిక రేఖా రూపంలో సూచించబడింది. ఈ వర్గీకరణలో గ్రామనామాలు, వ్యక్తినామాలు, పౌరుషనామాలు, వృత్తిసూచకాలు, కులసూచకాలు, జంతు, వృక్ష లతాదులు ఉన్నట్లు తేలింది.

-నేని, -రాజు, -రెడ్డి, -ఓజు మొదలైన గృహనామ పరపదాలను బట్టి ఆయా ఇంటిపేర్లు గలవారు ఏయే కులాలకు చెందినవారో స్థూలంగా సూచించ వచ్చు. -నేని పరపదంగా గల ఇంటిపేరు వారు 99% కమ్మవారని, మిగిలిన ఒక శాతం ఇతర కులాలలోను కన్పిస్తున్నారని చెప్పబడింది. ఇలాగే -రాజు, -రెడ్డి, -ఓజు మొదలైన గృహనామ పరపదాలవ్యాప్తి సూచించబడింది.

సిద్ధాంతవ్యాసంలో అస్పష్టంగా ఉన్న కొన్ని ఇంటిపేర్లు అపరిష్కృతంగా మిగిలిపోయాయి.

ఉదా:- రామావత్. గోగిల కార్ మొ॥వి.

గృహనామ పూర్వపద, గృహనామ పరపదాలకు అర్థనిర్ణయం కష్టమైనవి కొన్ని, వాటి మూలరూపం ఏమై ఉంటుందో తెలియనివి కొన్నిఉన్నాయి.

ఎలెక్స్ హెలీ 'The Roots' అన్న గ్రంథంలో తనకు ముందున్న ఏడుతరాల వారి చరిత్రను పరిశోధించి రాశారు. కూర్మరాజీయంలో కూడ పాలడుగు శేషాచలవర్మ తన పూర్వీకుల వంశక్రమాన్ని బుక్కీకుని దగ్గరనుండి చూపారు. కానీ శాస్త్రీయ దృక్పథంతో ఇలాంటి రచనలు తెలుగులో ఎక్కువగా వెలువడితే కొన్ని వంశాల పూర్వ చరిత్రలు వెలుగులోకి రావడానికి అవకాశముంది.

పాశ్చాత్యదేశాలలో అన్ని రకాలపేర్ల (Names) మీద పరిశోధన విస్తృతంగా సాగుతోంది. అలాంటి స్థాయికి మనం కూడా ఎదగాలి.

# రెండవ భాగం

## గృహనామ వివరణ పట్టిక

### అ

అక్కన

రూ.౧ < అక్కినేని

వ్యక్తినామం (స.).

అక్క— గృ.నా.పూ.స్త్రీ. తల్లి. తన కంటె పెద్దదైన తోబుట్టువు, పూజ్యస్త్రీ. దేవతాసూచి. స్త్రీల పేర్లకు 'అమ్మ' పదానుబంధం చేరినట్లే 'అక్క' కూడ చేరుతుంది. ఉదా:— రామక్క, సీతక్క; అక్క పూర్వపదంగా ఉన్న వ్యక్తి నామాలు పురుషులలోను, స్త్రీలలో కూడ కన్పిస్తున్నాయి. ఉదా:— అక్కయ్య, అక్కమ్మ.

ప్రా.అక్క; క.అక్క; త.అక్కాళ్. <అంక— <అంకాళ <మాంకాళ— <మహంకాళి.

<ఎక్క— <యక్ష. యక్షిణి శబ్ద భవం కావచ్చు.

అక్కదేవతలు ఏడుగురు. ఏడుగురూ ఒకే ఇంటి కోడళ్ళట. కొండకింద ఉన్న బావిలో నుండి ప్రతిరోజూ కొండ మీదున్న వారి ఇంటికి నీరు మోసేవారట. కొండమీద ఉన్న పెద్ద బండ రాయి మా మీద పడితే మాకు కష్టాలు తప్పుతాయి కదా అని అనుకున్నారట. అలానే జరిగింది. అలానే వారు బావిలో నీరు ముంచుతున్న సమయంలో కొండ రాయి దొర్లిపడి బావిలోకి జారి చని పోయారు. ఆ ఏడుగురూ ఆ బావిఒడ్డున ఒక శిలమీద వెలిశారు. ఆ దారిన వెళ్తున్న వారికి కొన్నిరోజులపాటు ఆ బావిలో నుండి మాటలు విన్పించేవట. ఇప్పుడు అలా విన్పించవు. కాని బిందెలతో ఉన్న ఏడుగురు స్త్రీలుగల శిల, బావిమీద అడ్డంగా పడివున్న బండరాయి యివన్నీ గుంటూరు జిల్లాలోని 'లాం' గ్రామంలో ఉన్నాయి. ఇప్పటికీ ఈ అక్కదేవతలకు పూజలు చేస్తారు.

చూ.—స.గృ.నా.వ.

అక్కన ప్రగడ

రూ. అక్కెన ప్రగడ

వ్యక్తినామం (స.)

అక్కన— గృ.నా.పూ. వ్య.నా; వి.చూ. అక్కన. ఆర్వేల నియోగులలో ఇంటి పేరు. చూ. —ప్రగడ గృ. నా. వ.

అక్కపరెడ్డి

వ్యక్తినామం (స.)

అక్కప— గృ. నా. పూ., వ్య.నా; అక్క+అప్ప. అక్క—వి.చూ.,అక్కన. —అప్ప— వి.చూ. —అప్ప గృ.నా.ప. చూ. —రెడ్డి గృ.నా.ప.

అక్కబత్తుల

వ్యక్తినామం (స).

అక్క— గృ. నా. పూ; దేవతాసూచి; వి.చూ. అక్కన. చూ. —బత్తుల గృ. నా. ప.

అక్కరం

పౌరుషనామం (తె.).

<అక్కరము

ప్రా.అక్కర—; సం.అక్షర—; త.అక్కరం; క.అక్కర.

<తె.అక్కఱ.

అక్కరస

రూ. అక్కరాజు, అక్కరాసు.

వ్యక్తినామం (శా.).

అక్క— గృ.నా.పూ. స్త్రీ దేవతాసూచి. వి.చూ. అక్కన.

"—అక్కరస గంగరసరాజయ్య—" శా.1169 (టి. యం. పి. I; పు. 660 నెం. 925).

అక్కరాజు

చూ. అక్కరస

వ్యక్తినామం (స.).

ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.

చూ. —రాజు గృ. నా. ప.

అక్కరాసు

చూ. అక్కరస

వ్యక్తినామం (శా.).

"—అక్కరాసు బానోజి పంతులు—" శా. 1193 (టి. యం. పి; I; పు. 605, నెం. 388).

అక్కల

సంబంధసూచి, దేవతాసూచి (స).

అక్కబహు.కు ద్వి.వి.

అక్క—వి.చూ. అక్కల దేవి

అక్కల దేవి

వ్యక్తినామం (తె.).

అక్కల— గృ.నా.పూ. స్త్రీ దేవతా సూచి. అక్క బహు. కు ద్వి. వి. వి.చూ. అక్కన. "దేవతాత్వమును పొంది శుభకార్యారంభముల యందు కొందరిచే పూజింపబడు పూజ్యస్త్రీలు. వారు ఆరుగురును అక్కచెల్లెండ్రయి సుగుణములచే దేవతాత్వమును పొందిరని ప్రసిద్ధి" సూ. ని.

చూ. —దేవి గృ.నా.ప.

అక్కాపంతుల

వ్యక్తినామం (స.).

<అక్కాపంతు.అక్క— గృ.నా.పూ. వి.చూ. అక్కన. పరశు రామపంతుల మొదలైన వాటిలాగ ఇదికూడ అక్కా ఫంతుగారి తాలూకు అన్న అర్థంతో

వాడబడిందే. ఆరామ ద్రావిడులలో ఇంటి పేరు.చూ. _పంతుల గృ. నా. ప.

అక్కి

వ్యక్తినామం (తె.రా.స.).

అక్క + ఇ. అక్క వి. చూ. అక్కినేని. ? < అక్కి చర్మరోగ విశేషం. బ్రౌ.హరిజనులలో ఇంటిపేరు.

అక్కిన

చూ. అక్కినేని

వ్యక్తినామం (స.).

కమ్మవారిలో ఇంటి పేరు.

అక్కినేని

రూ. అక్కిన

వ్యక్తినామం (తె.స.).

అక్కి_ గృ.నా.పూ., వ్య.నా. దేవతా సూచి. <అక్కయ. వి.చూ. అక్కన. కమ్మవారిలో ఇంటి పేరు.

చూ. _నేని గృ.నా.ప.

అక్కిపెద్ది

వ్యక్తినామం (స.).

అక్కి_ గృ.నా.పూ.. దేవతాసూచి. వి.చూ. అక్కన. వెలనాటి వైదికులలో ఇంటిపేరు. చూ. _పెద్ది గృ.నా.ప.

అక్కిరాజు

వ్యక్తినామం (తె.).

అక్కి_ గృ.నా.పూ. దేవతాసూచి. వి. చూ. అక్కన.

చూ. _రాజు గృ.నా.ప.

అక్కిలిసెట్టి

వ్యక్తినామం (స.).

అక్కిలి_ గృ.నా.పూ., దేవతాసూచి. <అక్కల. వి. చూ. అక్కల దేవి. అక్కలకు ఔప. ?<అక్కిలి_ కలత. సూ. వి. చూ. _సెట్టి గృ.నా.ప.

అక్కెనప్రగడ

చూ. అక్కనప్రగడ

వ్యక్తినామం (సా.).

జగతియందక్కెన ప్రగడాన్వయంబున సౌరిది__" (కుబ్జాకృ. 1_23).

"__కవితావిచిత్ర అక్కెన ప్రగడ రాయనమంత్రి పుత్ర__" (పైడి;ఆశ్వా. గ.పు; 100)

అక్షతల

రూ. అక్షింతల

పౌరుషనామం (శా.).

అక్షత బహు. కుద్వి. వి. < సం. అక్షతా_. పూజించేటప్పుడు, ఆశీర్వదించేటప్పుడు ఉపయోగించే బియ్యము, తిలకమునకుపయోగించు కుంకుమ మొదలైన ద్రవ్యము. సూ. వి

"__అక్షతల తిరుమలభట్ట__" (టి. యం.పి. 11; పు.883, నెం. 85_86). శా1.511.

అక్షింతల

చూ. అక్షతల

పౌరుషనామం (సం.).

ప్రథమశాఖనియోగ బ్రాహ్మణులలో ఇంటిపేరు.

అగస్త్యరాజు

వ్యక్తినామం (సం.).

అగస్త్య–గృ.నా., వ్య.నా.పూ., ,వృక్ష నామసూచి. అగస్త్యుడనేఋషి, అగిసె చెట్టు. అగస్త్య అనే ఋషిపేరు వృక్ష నామసూచి కావచ్చునని, సంస్కృతంలో ప్రవేశించిన ద్రావిడ పదమై ఉండ వచ్చునని Burrow (CPDL179). ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.

చూ. –రాజు గృ.నా.ప.

అగ్గరాజు

వ్యక్తినామం (స.).

అగ్గ– గృ. నా. పూ. ?< అగ్గి; ?<అగ్ర–. ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.

అగ్నిహోత్రం

పౌరుషనామం (స.).

హవిస్సు, అగ్ని. "హవిర్వహ్నీచాగ్ని హోత్రౌ". ఆహితాగ్నులు. ప్రాత స్సాయంకాలాలలో చేసే హోమం. శ్రీవైష్ణవులలో ఇంటిపేరు. కేవలం అగ్నిఅనే ఇంటి పేరు కూడా ఉంది. ఇది గొల్లలలో కన్పిస్తుంది.

అంకగారి

వ్యక్తినామం (తె.).

అంక– గృ. నా. పూ., విచూ.

అంకరాజు

చూ. –గారి గృ. నా. ప.

అంకం

చూ. అంకము

పౌరుషనామం (తె.).

అంకము

చూ. అంకం

పౌరుషనామం (స.).

ఒడి; తోడ; సమీపం; భూషణం; యుద్ధం; పర్వతం.

అంకమోళ్లు

పౌరుషనామం (తె.).

అంకం– గృ.నా.పూ., వి. చూ. అంకం –ఓళ్లు < వాళ్లు

చూ. –వాళ్లు గృ. నా. ప.

అంకరాజు

వ్యక్తి నామం (స.).

అంక– గృ. నా. పూ., దేవతాసూచి. <అంకమ్మ. ఒకానొక గ్రామదేవత. సూ.ని., అంకు– అమ్మ. గ్రామదేవత, అమ్మవారు. ఆం. వా. అంకమ్మ స్త్రీ దేవతానామం; అయినప్పటికీ ఈపేరు పురుషుల్లోనే కన్పిస్తుంది మైసమ్మ కూడ ఇలాంటిదే. ఆర్వేల నియోగులలో ఇంటిపేర్లు. చూ. –రాజు గృ.నా.ప.

అంకినీడు

వ్యక్తినామం (స.).

అంకి_ గృ. నా. పూ., వ్య.నా. దేవతా సూచి. <అంకమ్మ <అంకాలమ్మ. వి.చూ. అక్క_న. కమ్మవారిలో విస్తృత వ్యాప్తిగల యింటిపేరు.

చూ. _నీడు గృ. నా. ప.

అంకిరెడ్డి

వ్యక్తినామం (స.).

అంకి_ గృ. నా. పూ., దేవతాసూచి; వి. చూ. అక్క_న.

చూ. _రెడ్డి గృ. నా. ప.

అంకెం

పౌరుషనామం (స.).

<అంకెము. గుఱ్ఱం ఎక్కడానికి ఇరువైపులా అమర్చిన యినుప మెట్టు, రికాబు. త. అంకవటి; మ. అంగవడి; తె. అంకెము, అంకవన్నె. DED. 34. ?<అంకె. జనపనారతో అల్లిన సంచి మాం. వృ. ప., పర్యా. గోనె, గోగు.

అంగజాల

వృత్తిసూచి (స.).

<అంగజాలం : శరీరకవచం. అంగ రక్షకులను అంగజాలలంటారు. వీరు అంతఃపుర కావలివారు, రాజభటులు.

అంగటి

చూ. అంగడి

పౌరుషనామం (రా.).

అంగడికి రూప.

అంగడి

రూ. అంగటి, అంగ్గడి

పౌరుషనామం (తె.శా.స.),

దుకాణం. సరుకులు అమ్మేచోటు, కొట్టు.

క. అంగడి త. అంగాడి; తు. అంగడి.

"__అంగడి గోపీనాథ__" శా. 1439 (టి.యం.పి. 11, పు.843, నెం. 843)

అంగరాజ

పౌరుషనామం (శా.).

అంగరాజు. యువరాజు.

"__అంగరాజ నాగప్పయ్యర్__" శా.1462 (T.T.D.E.S. IV.,P.302, No.159).

అంగిరేకుల

వృత్తిసూచి (స.).

అంగిరేక బహు. కు ద్వి. రూ. దేవుని విగ్రహానికి చందనాది మైపూతలు కావించి, అలంకార వస్త్రాదికాలను చేసేదేవకర్మి. "One who decorates and embelishes the deity."

శా.శ పు.2

అంగుళి

పౌరుషనామం (స.).

వేలు, బొటనవేలు

అంగ్గడి

చూ. అంగడి

పౌరుషనామం (శా.).
"—అంకలసెట్టియు అంగ్గడి దుగ్గిసెట్టి వీరుసాక్షి—" క్రీ.శ. 1060 (E.T.I. P. 115, No. 131, line 53-54).

అచరసు

వ్యక్తినామం (శా.).
అచ— గృ. నా. పూ. స్త్రీ దేవతాసూచి. వి. చూ. అచ్చినేని 'అచ్చరసు' కు లేఖనదోషం కావచ్చు. "అచరసు రంగాచార్లు—" క్రీ.శ.1615 (T.M.P.I. P. 595, No. 302).
చూ. _అరసు గృ. నా. ప.

అచిని

చూ. అచ్చినేని
వ్యక్తినామం (తె.).

అచ్చినేని

చూ. అచిని
వ్యక్తినామం (శా.).
అచ్చి— గృ. నా. పూ. స్త్రీదేవతాసూచి. లక్ష్మీదేవి. <అచ్చమ్మ. అచ్చయ్య "—అచ్చినేని రామానాయుడు—" శా. 1470 (T.M. P. II. P. 1073, No 197) చూ. _నేని గృ.నా.ప.

అచ్చిరాజు

వ్యక్తినామం (స.).
అచ్చి— గృ.నా.పూ. వ్య.నా; వి.చూ. అచ్చినేని. ?<అచ్చరసు-ఆర్వేల నియోగులలో ఇంటిపేరు. చూ. _రాజు గృ.నా.ప.

అచ్యుతనేని

వ్యక్తినామం (తె.).
అచ్యుత— గృ.నా.పూ. దేవతాసూచి. విష్ణువు. చూ. _నేని గృ.నా.ప.

అచ్యుతన్న

వ్యక్తినామం. (స.).
అచ్యుత— గృ.నా.పూ. దేవతాసూచి. వి.చూ. అచ్యుతనేని. ఆర్వేల నియోగులలో ఇంటిపేరు. చూ. _అన్న గృ.నా.ప.

అచ్యుతుని

వ్యక్తినామం (స.).
అచ్యుత— వ్య. నా; దేవతాసూచి. వి.చూ. అచ్యుతనేని. _న ద్వితీయా విభక్తి ప్రత్యయం. ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.

అజ్జగ్గగారి

వ్యక్తినామం (రా.).
అజ్జగ్గ— గృ.నా.పూ. ?<అజ్జ+అగ్గ అజ్జ <ప్రా. అజ్జ— <సం. ఆర్య— చూ. —గారి గృ.నా.ప.

అంచుల

పౌరుషనామం (స.).
అంచు బహు. కు ద్వి.వి. అగ్రం, కొన, పార్శ్వం. ?అంచెల.

అంజన

వ్యక్తినామం (స.).

?<స్త్రీ దేవతాసూచి. హనుమంతుని తల్లి.

**అట్టవణై**

వృత్తిసూచి (శా.).

హిందుస్థానీ పదమైన రెవిన్యూ పదం 'అట్టవణై' నుండి వచ్చింది. కృష్ణ దేవరాయల ఆస్థానంలో అట్టవణై బసవరసర్ ఒక రెవెన్యూ ఉద్యోగి.

"—అట్టవణై బసవరసర్—" క్రీ.శ. 1521. (T.T.D.E.S.III, P.311: No. 148 (No. 184. T.T.).

**అడప**

చూ. అడపం

వృత్తిసూచి (స.సా.).

"అడప వేమన—" శా. 1278 (T.M.P.II. P. 937; No. 278). "—అతి వీరుడైనట్టి అడపకేదాసి—" (పల్నా; పు. 88; పం. 64). కమ్మ వారిలో ఇంటిపేరు.

**అడపం**

రూ. అడప, అడపము, అడైప్పం.

వృత్తిసూచి (శా).

రాజాస్థానాలలో వక్కలు, ఆకుల సంచి మోసేవారి వృత్తి. త. అటప్పం; మ. అటకం; అడెకక్క; క. అడకె, అడ, అడికె; తె.అడపము. D.E.D.57. "—అడపం సూరప్పనాయుడు—" శా. 1458 (T.M.P.I.P.618; No.497).

**అడబాల**

వృత్తిసూచి (స.).

వంటవాడు. <క. అడబళ. అడ= వంట; బళ=వాడు.

**అడిదము**

పౌరుషనామం (స.సా.).

ఆయుధసూచి. కత్తి. ఈ గృహ నామకుల పూర్వులెవరో ఖడ్గ విద్యా నైపుణ్యానికి అడిదాన్ని బహుమతిగా పొందారు గనుక ఇది గృహనామంగా నిలిచింది. ఆర్వేల నియోగులలో ఇంటి పేరు. '—ఇందుచేతయ్యేనింటిపేరడిదము, రామ రాయ వినుత రామచంద్ర—" (అడి.సూ.జీ.పు.7.పీ.) "—అడిదము వాడ సూరన సమాఖ్యుడనాకొకరుండు సాటియే—" కవిజనరం.పీ.పు.4.).

**అడివి**

పౌరుషనామం.

అరణ్యసూచి. (తె.శా.స.).

<అడవి. అరణ్యం. ప్రా. అడవీ; సం. అటవీ; క. అడవి; త. అడవి; తు. అడవి. ఆర్వేల నియోగులలో ఇంటి పేరు. "—అడివి రామలింగస్వామి— T.M.P.II; P.782; No. 327).

**అడైప్పం**

చూ. అడపం

వృత్తిసూచి (శా.).

"అడ్డైప్పం భయ్యప నాయకర్——" క్రీ.శ. 16.4.1519 (T.T.D.E.S.IV; 110; No. 48).

"——అడ్డైప్పం పరమాదమ్మన్——" 26–12–1535 A.D. (T.T.D.E.S. IV: PIII; No. 56). ఈమె అచ్యుత దేవరాయల ఆస్థానంలో అడపం ఉద్యోగి.

**అడ్డకత్తుల**

పౌరుషనామం (సా.).

అడ్డకత్తి బహు. కు ద్వి. వి. అయుధ సూచి. అడ్డము + కత్తి. అడ్డములోని అంత్యవర్ణం లోపించగా మిగిలిన 'అడ్డ మీద కత్తి చేరి మొహదా పట్టిన అనే అర్థాన్నిస్తుంది. "——అడ్డకత్తుల వారు అరిగలవారు——" (పల్నా.పు.40; పం. 898).

**అడ్డగట్ల**

పౌరుషనామం (తె.రా.).

?<అడ్డము + కట్టు. అడ్డగట్టు బహు. కు ద్వి. వి. ప్రవహిస్తున్న ఏటికిగాని, ప్రవాహానికిగాని, అడ్డంగా కట్టిన గట్టు (ఆనకట్ట) కావచ్చు.

**అడ్డాల**

పౌరుషనామం (స.).

<అడ్డము; ఆటంకం, నిర్రోధం; అడ్డము బహు. కు ద్వి.వి. క. అడ్డి; త. అడ్డి; తు. అడ్డి; బహు. రూ.అడ్డాలు. పిల్లలనుంచుకోడానికి అడ్డంగా పెట్టే చేతులు. సూ.ని. అడ్డాలలో బిడ్డలుగాని గడ్డాలొచ్చాక బిడ్డలౌతారా? అని సామెత. వెలనాటి వైదికులలో ఇంటిపేరు.

**అడ్డిగ**

ఆభరణసూచి (రా.).

స్త్రీల కంఠాభరణంలో గుచ్చుకునేందుకు బంగారంతో చేసిన చిన్న పూస లాంటి వస్తువు. ఇది వడ్రాణంలో కూడ గుచ్చుకుంటారు. రెడ్లలో ఇంటిపేరు. క. అడ్డిగె; త. అడ్డిగై.

**అండా**

పౌరుషనామం (రా.స.).

<అండా <హండా <ప్రా. హండా, భాండా <సం.హండ–

**అండే**

చూ. హండే

పౌరుషనామం (రా.స.).

<అండియ. చిమ్మనగ్రోవి. సీతు మొదలైనవి చిమ్మేగొట్టం, వసంతం ఆడే గొట్టం. క. అండె; తు. అండె. బలిజకులంలో ఇంటిపేరు.

**అత్తి**

వృక్షసూచి (రా.).

మేడిచెట్టు. క. అత్తి. త. అత్తి; తు. అర్తి.

**అత్తినేని**

రూ. అత్తైన.

వ్యక్తినామం (స.).

అత్తి_ గృ.నా.పూ; గృ.నా; వృక్షనామ సూచి. వి.చూ. అత్తి. ?<ప్రా. హత్థి_ <సం. హస్తి. కమ్మవారిలో ఇంటిపేరు. చూ. _నేని గృ.నా.ప.

**అత్తైన**

చూ. అత్తినేని

వ్యక్తినామం (తె.).

**అత్తోట**

వృక్షనామసూచి (స.).

అత్తి+తోట: అత్తి_ మేడిచెట్టు.వి.చూ. అత్తి. _తోట; ఉపవనం. వి. చూ. తోట. కమ్మవారిలోనూ, బ్రాహ్మణులలోనూ ఇంటిపేరు.

**అద్దాలోళ్లు**

పౌరుషనామం (తె.).

<అద్దాలవాళ్లు.

అద్దాల_ అద్దము బహు. కు ఔప. దర్పణం. త. అద్దం; ప్రా. అద్దాఙ; సం. ఆదర్శ_ చూ. _ఓళ్లు గృ.నా.ప.

**అద్దోజి**

వ్యక్తినామం (తె.).

అద్ద+ఓజి. ఇది మరాఠీ వ్యక్తినామం. చూ. _ఓజి గృ.నా.ప.

**అద్రి**

పౌరుషనామం (స.).

<సం. అద్రి : కొండ, సూర్యుడు.

**అధికార్లు**

పౌరుషనామం (స.).

అధికారి బహు. కు ద్వి.వి. అధికారం కలవాడు. వేగినాటి బ్రాహ్మణులలో గృహనామం.

**అధ్యాత్మభట్టరు**

వ్యక్తినామం (స.).

ఆధ్యాత్మ_ గృ. నా. పూ. ఆధ్యాత్మిక సంబంధమైన. శ్రీవైష్ణవులలో ఇంటిపేరు.

చూ. _భట్టరు గృ.నా.ప.

**అనఘా**

పౌరుషనామం (స.).

<సం. అనఘ_ పాపంలేనిది, దోషం లేనిది, విపత్తులేనిది. ఆర్వేలనియోగులలో ఇంటిపేరు.

**అనంత**

వ్యక్తినామం (తె.స.).

దేవతాసూచి. వి.చూ. అనంతనేని

**అనంతనేని**

వ్యక్తినామం (తె.).

అనంత_ గృ. నా. పూ. దేవతాసూచి. విష్ణువు, పార్వతి. కమ్మవారిలో ఇంటి పేరు. చూ. _నేని గృ. నా. ప.

**అనంతప్రగడ**

వ్యక్తినామం (స.).

అనంత_ గృ. నా. పూ. దేవతాసూచి,

వి. చూ. అనంతనేని. ఆర్వేలనియోగులలో ఇంటిపేరు. చూ. _ప్రగడ గృ. నా. ప.

**అనంతభొట్ల**

వ్యక్తినామం (తె.స.).

అనంత_ గృ. నా. పూ. దేవతాసూచి వి. చూ. అనంతనేని. బ్రాహ్మణులలో ఇంటిపేరు. చూ. _భొట్ల గృ. నా. ప.

**అనంతం**

పౌరుషనామం (స.).

న+అంతం : అపారమైన, ఆకాశం.

?<అనంత : ఆదిశేషుడు.

?<అనంత_ వ్యక్తినామం నుండి ఏర్పడి ఉండవచ్చు.

**అనంతరాజు**

రూ. అంతరాజు

వ్యక్తినామం (రా.స.).

అనంత_ గృ. నా .పూ. దేవతాసూచి. వి.చూ. అనంతనేని. ఆర్వేల నియోగుల ఇంటిపేరు. చూ. _రాజు గృ.నా.ప.

**అనంతవఝుల**

వ్యక్తినామం (స.).

అనంత_ గృ.నా.పూ. దేవతాసూచి. వి.చూ. అనంతనేని ఆర్వేల ద్రావిడులలో ఇంటిపేరు. చూ. _వఝుల గృ.నా.ప.

**అనంతసెట్టి**

వ్యక్తినామం (తె.స.).

అనంత_ గృ.నా.పూ. దేవతాసూచి. వి.చూ. అనంతనేని. ఆర్వేల నియోగులలో ఇంటిపేరు. చూ. _సెట్టి గృ.నా.ప.

**అనప్పిండి**

పౌరుషనామం (స.).

అనప_ గృ.నా.పూ. ?<అనుము. సస్యవిశేషం. _పిండి బియ్యం మొదలైనవాని పొడి. అనుము+పిండి, వృత్తియందు పవర్ణం ఆదేశంగా వస్తుంది. చూ. అనుప చేను, అనుప గింజలు. పేరూరి ద్రావిడ బ్రాహ్మణులలో ఇంటిపేరు.

**అనవరెడ్డి**

వ్యక్తిషనామం (స.).

అనవ_ గృ.నా.పూ.<హనుమ. వ్యవహారంలో హనుమయ్యను అనవయ్య అంటారు. హనుమారెడ్డి -అనవారెడ్డి.

చూ. _రెడ్డి గృ.నా.ప.

**అనిపెద్ది**

రూ. అనిపెద్ది

వ్యక్తినామం (స.).

అని_ గృ. నా. పూ. దేవతాసూచి. విష్ణువు ?<సం. అనంత. బ్రాహ్మణులలో ఇంటిపేరు. చూ. _పెద్దిగృ.నా.ప.

**అనిమిసెట్టి**

వ్యక్తినామం (స.).

అనిమి_ గృ. నా. పూ. < ఘనిమి

<హనుమ. చూ. _సెట్టి గృ.నా.వ.

అనిసింగరాజు

వ్యక్తినామం (స.).

అనిసింగ_ గృ.నా.పూ. అని+సింగ. సింగ<ప్రా. సింఘ_ <సం. సింహ_ ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.

చూ. _రాజు గృ. నా. ప.

అనిసెట్టి

వ్యక్తినామం (తె.స.).

అని_ గృ. నా. పూ., పు.నా. వి. చూ. అనిపెద్ది. చూ. _సెట్టి గృ. నా. ప.

అనుమాండ్ల

చూ. హనుమాన్ల

వ్యక్తినామం (తె.).

అనుమాలసెట్టి

వ్యక్తినామం

అనుమాల_ గృ. నా. పూ., పు. నా. ?<హనుమల చూ. _సెట్టి గృ.నా.వ.

అనుముల

ధాన్యసూచి (తె.రా.స.).

అనుము బ.వ.కు ద్వి.వి. సస్యవిశేషం. వృత్తియందు 'ప' వర్ణం ఆదేశంగా వచ్చి అనుపచేను అని వాడుక. కమ్మ, దేవాంగుల, బ్రాహ్మణులలో ఇంటిపేరు.

అనువోజు

వక్తినామం (స.).

అను_ గృ.నా.పూ. పు.నా. <అనుమ_ <హనుమ_ విశ్వబ్రాహ్మణులలో ప్రచురంగా ఇంటిపేరుగా ఉంది.

చూ. _ఓజు గృ. నా. ప.

అనుసంధానం

పౌరుషనామం (శా.).

భక్తిగ్రంథాలను చదవడం.

"__దివ్య ప్రబంధాను సంధాన ధ్యానము__" ఆము.1_84 ఎల్లప్పుడూ దివ్యగ్రంథాలను పఠించడంలోనే కాలం గడుపుతుండవచ్చు. ఇదిరాజాస్థానంలోని ఒక ఉద్యోగమైనా కావచ్చు. ఏర్పాటు, చట్టము అని శా.శ. "__దివ్యప్రబంధాను సంధాన ధ్యానము__" ఆము. 1_84 "__అను సంధానం తిరువెంకటయ్యరు__"(శా.1426 CT.T.D. E. S.III. P.6. No. 266.)

అనేక

పౌరుషనామం (రా.).

<సం. అనేక_ న+ఏక. ఒక్కటి కానిది, పెక్కు. హరిజనులలో గృహనామం.

అంతరాజు

చూ. అనంతరాజు

వ్యక్తినామం (స.).

ఆర్వేలనియోగులలో ఇంటిపేరు.

అందుగుల

వృక్షసూచి (స.).

<క. అందుగు. సల్లకి వృక్షం. ఈ

చెట్టు ఏనుగులకు మిక్కిలి ప్రియమైంది. అందుగు బహు. కు ద్వి.వి. ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.

**అందె**

పౌరుషనామం.

ఆభరణసూచి (తె.శా.స.).

స్త్రీలు కాలికి తొడుక్కునే ఆభరణం, నూపురం, అందియ. వాడుకలో 'అంది' అనికూడ వుంది. బలిజలలో ఇంటిపేరు. క. అందుగ, అందుగె, అందిగె, సం. అందుక. "—అందె కొమ్మనప్పనకు—" (యస్.ఐ.ఐ.1; పు. 226; పంక్తి.83, నెం. 622).

**అందెల**

చూ. అందె

ఆభరణసూచి (తె.స.).

అందె బహు. కు ద్వి. వి; బహు. అందియలు, అందెలు.

**అందే**

తెగసూచి. (తె.స.).

తెలగలలో ఇంటిపేరు " a sub division of the Kurubas refers to the small bamboo or wooden vessel used when milking goats. It further denotes a division of the Koragas, who used to wear a pot suspended from their necks, into which they were compelled to spit, so as not to defile the highway " (C.T.S. I.IP. 44.) అందే = కుండ (pot) ?<అందె : భూషణ విశేషం.

**అన్నదాత**

బిరుదనామం. (తె.).

అన్నదానం చేసినందు వలన పొందిన బిరుదనామం.

**అన్నదానభట్ల**

వ్యక్తినామం (స.).

అన్నదాన- గృ.నా.పూ. అన్నదానం. ఆర్వేల నియోగి బ్రాహ్మణులలో ఇంటి పేరు. చూ.— భట్ల గృ.నా.ప.

**అన్నదానం**

పౌరుషనామం (రా.).

అన్నదానం చేయడంలో ప్రసిద్ధి చెందినవారు. ఆర్వేల నియోగులలోను, కమ్మవారిలోను ఇంటిపేరు.

**అన్నదాసు**

రూ. అన్నలదాసు

వ్యక్తినామం (స.).

అన్న- గృ.నా.పూ. సోదరుడు.వి.చూ. —అన్న గృ.నా.ప. ఇది పౌరుషనామం కావచ్చు. అన్నంమాత్రానికే సేవచేసే వాడు. అన్నానికి దాసుడనే అర్థంలో అన్నదాసు వచ్చియుండవచ్చు.

చూ. —దాసు గృ.నా.ప.

**అన్నదేవర**

వ్యక్తినామం (తె.స.).

అన్నప_ గృ.నా.పూ. సంబంధ సూచి సోదరుడు. వి.చూ. _అన్న గృ.నా.ప. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. _దేవర గృ.నా.ప.

**అన్నపరెడ్డి**

రూ. అన్నపరెడ్డి

వ్యక్తినామం (రా.స.).

అన్నప_ గృ.నా.పూ. వ్య.నా. అన్న+అప, అన్న_ వి.చూ. గృనా.ప.

_అన్న; _అప; వి.చూ. గృ.నా.ప _అప్ప చూ. _రెడ్డి గృ.నా.ప.

**అన్నపురెడ్డి**

చూ. అన్నపరెడ్డి

వ్యక్తినామం (తె.స.).

అన్నప_ గృ.నా.పూ.

**అన్నం**

ఆహారపదార్థసూచి (తె.రా.స.).

<అన్నము. తినడానికి ఉపయుక్తమైంది; కూడు. కమ్మ, గవళ్ళ, తొగట కులాలలో ఇంటిపేరు.

**అన్నమ**

వ్యక్తినామం (సా.).

అన్న+అమ. తిక్కన తల్లి పేరు. అమ్మ: తల్లి. <ప్రా. అమ్మా: సం. అంబా_. అమ్మ. పూజ్యతను, వాత్సల్యాన్ని తెలుపుతుంది. స్త్రీలపేర్ల చివర, కొన్ని పురుషుల పేర్ల చివరకూడ చేరుతుంది. భాగ్యమ్మ, మనోహరమ్మ, పు.నా.: కృష్ణమ్మ, అంకమ్మ. ఆశ్చర్యాన్ని సూచించడానికి కూడ అమ్మవాడుతారు.

"—అన్నమ తిక్కన ధన్యుజేయుతన్" (దశకు. 1_1) "—కొమ్మయ తిక్కని గాచు నవుతన్" (దశను. 1_2)

**అన్నమనేని**

వ్యక్తినామం (రా.).

అన్నమ_ గృ. నా. పూ. స్త్రీ. నా., <అన్నమ్మ. వి.చూ. అన్నమ. కమ్మ వారిలో ఇంటిపేరు.

చూ. _నేని గృ.నా.ప.

**అన్నమరాజు**

రూ. అన్నంరాజు

వ్యక్తినామం (రా.స.).

అన్నమ_ గృ.నా.పూ.స్త్రీ.నా; వి.చూ. అన్నమనేని. ఆర్వేల నియోగులలో ఇంటిపేరు. చూ. _రాజు గృ.నా.ప.

**అన్నంభట్టు**

వ్యక్తినామం (స.).

అన్నం_ గృ.నా.పూ, వి.చూ. అన్నమరాజు, అన్నంభట్టు వంశీయులు మొదట తెలంగాణాలోని మహబూబు నగర్ మండలంలోని అచ్చంపేట తాలూకాలో ఉన్న మామిళ్ళపల్లి గ్రామంలో నివసించారు. వీరి ఇంటిపేరు గరికపాటివారు.

గుంటూరుజిల్లా గరికపాడు నివాసులై నందువలన ఈ పేరు వచ్చియుండవచ్చు. ఆ తరువాత వారి వంశంలో ప్రసిద్ధి చెందిన అన్నంభట్టువలన వీరికి ఈ గృహనామం స్థిరమయింది.

అన్నంభొట్ల

వ్యక్తినామం (స.).

అన్నం– గృ. నా. పూ. వ్య. నా, అన్నమ్మ. అన్న+అమ్మ. ఆర్వేల నియోగి బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. –భొట్ల గృ. నా. ప.

అన్నంరాజు

చూ. అన్నమరాజు

వ్యక్తినామం (స.సా.).

అన్నం –గృ.నా.పూ. స్త్రీ. వ్య. నా; అన్నమ్మ. "ఇది— వెంకట నరసయా మాత్య పుత్రాన్నమ రాజాన్వయ పయః—" (శంత.చ; ఆశ్వా.గ; పు.35).

అన్నంరెడ్డి

వ్యక్తినామం (రా.స.).

అన్నం– గృ.నా.పూ.వి.చూ. అన్నమ రాజు. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. –రెడ్డి గృ.నా.ప

అన్నలదాసు

చూ. అన్నదాసు

వ్యక్తినామం (రా.స.).

అన్నల –గృ.నా.పూ..దే. అగ్రజుడు, సోదరుడు. అన్న బహు. కు ద్వి.వి. హరిజనులలో ఇంటిపేరు.

చూ. –దాసు గృ.నా.ప.

అన్నాపంతుల

వ్యక్తినామం (స.).

<అన్నాపంతుగారి

అన్నా– గృ.నా.పూ. సంబోధనార్థకం. వి. చూ. అక్కా– పంతుల. ఆరామ ద్రావిడులలో ఇంటిపేరు.

చూ. –పంతుల గృ. నా. ప.

అన్నాప్రగడ

వ్యక్తినామం (స.)

అన్నా– గృ.నా.పూ.,దే. సోదరుడు, తండ్రి. వి.చూ. అన్నా పంతుల.

చూ. –ప్రగడ గృ. నా. ప.

అన్నాబత్తుని

చూ. అన్నాబత్తుల

వ్యక్తినామం (స.).

కమ్మవారిలో ఇంటిపేరు.

అన్నాబత్తుల

చూ. అన్నాబత్తుని

వ్యక్తినామం (తె.స.).

అన్నా– గృ.నా.పూ. సంబంధ సూచి. వి.చూ. అన్నా పంతుల. కమ్మవారిలో ఇంటిపేరు. చూ. –బత్తుల గృ. నా. ప.

అన్నారెడ్డి

వ్యక్తినామం (తె.).

అన్నా- గృ.నా. పూ., దే. తండ్రి, సోదరుడు. వి.చూ. అన్నాప్రగడ.

చూ. _రెడ్డి గృ.నా.ప.

**అన్నావఝల**

వ్యక్తినామం (తె.స.).

అన్నా- గృ.నా.పూ., దే. సోదరుడు. వి.చూ. అన్నాప్రగడ. బ్రాహ్మణులలో ఇంటిపేరు. చూ. _వఝల గృ.నా.ప.

**అన్ని**

చూ. అన్నె

పౌరుషనామం (రా.).

కాపులలో ఇంటిపేరు.

**అన్నిపెద్ది**

చూ. అనిపెద్ది

వ్యక్తినామం (స.).

అన్ని- గృ. నా. పూ., రూ. అని. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

**అన్నెము**

పౌరుషనామం. వస్తుసూచి (స.).

ప్రా. అణియ; సం. అనిక; తు. అణ్య; త. అణియం; మ. అణియం.= fore_part of a vessel. D.E.D.S.100.

**అన్నె_**

తూ. అన్ని

పౌరుషనామం (తె.స.).



< సం. అన్న- కమ్మవారిలో ఇంటిపేరు.

**అపరంజి**

పౌరుషనామం (స.).

అపరంజి బంగారం. మేలిమి బంగారాన్ని అపరంజి బంగారం అంటారు. 'బంగారం అనే అర్థంగల ఉర్దూలోని అఫరంజి దీనికి సమీప మాతృక. ఫరంగుల రాకపోకలతో ప్రసిద్ధికి వచ్చిన మంచి బంగారం అనే వాడుక గలపారశీక భాషలోని 'అఫరంజి' దీనికి మూలమాతృక' తె. కొ. వె. 90

తూ.దొణప్ప. త.అపరంచి; క.అపరంజి; తె. అపరంజి.

**అపిరెడ్డి**

చూ. అప్పిరెడ్డి

వ్యక్తినామం (శా.).

అపి- <అప్పి. వ్య.నా.

"--అపిరెడ్డి ప్రోలిసాని--" శా.1149.

(T.M.P II., P.1113, No. 475)

**అప్పడం**

ఆహారపదార్థసూచి (స.).

పప్పడం లేక అప్పడం తయారుచేసి అమ్మేవారు. నంబూద్రి బ్రాహ్మణులలో గృహనామం.

**అప్పన**

వ్యక్తినామం (తె.స.).

అప్ప_గృ.నా.పూ.; పు.నా. <అప్పన్న.

అప్ప+అన్న. అప్ప_ వి.చూ. గృ.నా.ప. సింహాచలంలో ఉన్న దేవుడు అప్పన్న. బ్రాహ్మణులలో ఇంటి పేరు.

చూ. _అన గృ. నా. ప.

**అప్పన్న భట్ల**

వ్యక్తినామం (స.).

అప్పన్న_ గృ.నా.పూ., పు.నా. దేవతా సూచి. వి.చూ. అప్పన. వెలనాటి వైదిక బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. _భట్ల గృ. నా. ప.

**అప్పరచింతల**

వృక్షసూచి (రా.శా.).

అప్పర_వ్యుత్పత్తి అస్పష్టం?<అపర. అనుత్తమము, అపరదిక్కు. _చింతల. చింతబహూ కుఔప. చూ. చింతా. "__అప్పరచింతల పెద్ద చక్రరాజు__" క్రోధన (టి.యం.పి. పు.655.నెం.877)

**అప్పరాజు**

రూ. అప్పలరాజు

వ్యక్తినామం (స.).

అప్ప_ గృ. నా. పూ. తండ్రి, తల్లి, అక్క. వి.చూ. అప్పన. ప్రథమశాఖ నియోగి బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. _రాజుగృ. నా. ప.

**అప్పల**

చూ. అప్పాల

ఆహారపదార్థసూచి (స.సా.).

?<అప్పలము. అప్పడం "__దురంధరుడలరె నప్పల పాయక రాయఁడి ద్ధరన్__" (రుక్మ.పరి; రేక. సోమ. పు.16; 1_53)

**అప్పలభట్ల**

వ్యక్తినామం (తె.స.).

అప్పల_ గృ.నా.పూ; బహు. తండ్రి, అక్క, తల్లి. అప్పబహు. కుఔప. వి.చూ. అప్పన. వెలనాటి వైదిక బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. _భట్ల గృ. నా. ప.

**అప్పలరాజు**

చూ. అప్పరాజు

వ్యక్తినామం (తె.రా.స.).

అప్పల_ గృ.నా.పూ., బహు. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

**అప్పసాని**

వ్యక్తినామం (శా.).

అప్ప_ గృ.నా.పూ., వి.చూ. అప్పన. కమ్మవారిలో ఇంటిపేరు.

"__అప్పసాని కొండసాని __" వికారి. యఫ్. 1189. (టి.యం.పి.11; పు. 820; నెం. 592.).

**అప్పాద్వేదుల**

చూ. ద్వివేదుల

పౌరుషనామం (స.).

వెలనాటి వైదిక బ్రాహ్మణులలో ఇంటిపేరు.

**అప్పారావు**

వ్యక్తినామం (స.).

అప్పా_ గృ.నా.పూ., తండ్రి. అప్ప+ఇ. వి.చూ. అప్పన. బ్రాహ్మణులలో ఇంటిపేరు. చూ. _రావు గృ. నా. ప.

**అప్పాల**

పౌరుషనామం (తె. రా. స.).

ఆహారపదార్థసూచి. అప్పము బహు. కు ద్వి.వి. ఆహారపదార్థం. అప్పము. వరిపిండి, బెల్లం కలిపి గుండ్రివి ముద్దలు చేసి నూనెలో వండిన పదార్థం. సం. అపూప_; త. అప్పం.

**అప్పి**

వ్యక్తినామం (తె.).

అప్ప+ఇ, అప్ప_ వి.చూ. గృ.నా.ప.

**అప్పినేని**

వ్యక్తినామం (స.).

అప్పి_ గృ.నా.పూ. చూ. అప్పిరెడ్డి. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. _నేని గృ. నా. ప.

**అప్పిరెడ్డి**

రూ. అపిరెడ్డి

వ్యక్తినామం (రా.స.).

అప్పి_ గృ. నా. పూ., వ్య. నా. <అప్పయ. అప్ప_ వి.చూ. అప్పన.

చూ. _రెడ్డి గృ.నా.ప.

**అబ్బరాజు**

రూ. అబ్బిరాజు

వ్యక్తినామం

?<అబ్బయ <బొళ_ ఇవి రెండూ పర్యాయ వాచకాలుగా పద్మపురాణ అవతారిక పేర్కొంది. "—అబ్బరాజు కొడుకు అబ్బరాజు తిప్పరాజు—" (శా.1453.; టి.యం.పి.11,పు.969.

**అబ్బారెడ్డి**

వ్యక్తినామం (రా).

అబ్బా_ గృ. నా. పూ., వి.చూ. అబ్బరాజు చూ. _రెడ్డి గృ.నా.ప.

**అబ్బావఝుల**

వ్యక్తినామం (స.).

అబ్బా_ గృ.నా.పూ. సంబంధ సూచి. వి.చూ. అబ్బారెడ్డి. బ్రాహ్మణులలో ఇంటిపేరు. చూ. _వఝుల గృ.నా.ప.

**అబ్బినేని**

రూ. అబ్బినేని

వ్యక్తినామం (రా.).

అబ్బి_గృ.నా.పూ.వ్య.నా., <అబ్బయ. వి.చూ. అబ్బరాజు. ?<అబ్బి. దే. అబ్బాయి. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. _నేని గృ.నా.ప.

**అబ్బిరాజు**

చూ. అబ్బరాజు

వ్యక్తినామం (స.).
అబ్బి గృ.నా.పూ. వ్య. నా., వి. చూ. అబ్బరాజు.

అబ్బిరెడ్డిగారి

వ్యక్తినామం (రా.).
అబ్బిరెడ్డి_ గృ. నా. పూ. వ్య. నా. అబ్బి_ వి.చూ. అబ్బరాజు. _రెడ్డి_
చూ. _రెడ్డి. గృ.నా.ప.
చూ. _గారి గృ.నా.ప.

అబ్బిసాని

వ్యక్తినామం (రా.).
అబ్బి_ గృ.నా.పూ. వి.చూ. అబ్బరాజు
చూ. _సాని గృ.నా.ప.

అభినేని

చూ. అబ్బినేని
వ్యక్తినామం (స.).
అభి_ గృ.నా.పూ. <అబ్బి. వ్య.నా. కమ్మవారిలో ఇంటిపేరు.

అమర

చూ. అమరం
పౌరుషనామం (స.).

అమరగాని

వృత్తిసూచి (తె.స.).
<అమరగాడు. అమరమును అనుభవించేవాడు. వి. చూ. అమరం.
? అమరగౌని

అమరగౌని

వ్యక్తినామం (రా.స.).
అమర_ గృ.నా.పూ.అమరము.,వి.చూ. అమరనేని. త. అమరమ్, <సం. సమరమ్ చూ. _గౌని గృ. నా .ప.

అమరనేని

రూ. అమరినేని, అమిరినాయని, అమిరినేని.

వ్యక్తినామం (స.).
అమర_ గృ.నా.పూ., పౌ.నా. ఆవశ్యకమైనప్పుడు కొంత దండును తీసికొని రావలయునను నిబంధనము మీద చిన్న రాజులకు ఈయబడిన భూమి. సూ. ని. కమ్మవారిలో ఇంటిపేరు. అమరగాడు, అమరనాయకరము మొదలైనవి ఈ పదంతో ఏర్పడినవే. ఈ అమర నాయకుడే అమరనేని కావచ్చు.
చూ. _నేని గృ. నా. ప.

అమరం

రూ. అమర, అమరా.

పౌరుషనామం (తె.స.).
<అమరము <అమరు. వి. చూ. అమరనేని. అనుకున్న కౌలుకు భూమిని వ్యవసాయం చేసేవానికి ఇవ్వడాన్ని కూడ అమరం అంటారు.

అమరవాది

పౌరుషనామం (తె.సా.)

అమర_ గృ. నా. పూ. నశించని వాదం చేసేవాడు. వాదంలో ఎవరినైనా జయించగల శక్తి కలవాడు. బ్రాహ్మణులలో ఇంటిపేరు. "__చమత్కృతియుత కవితారచనచే నమరవాది రామయసుకవీ" (ద్రౌపదీ. 1_31) "__ద్విజరాజ వనుచు నిన్ను నభినుతింపగ జెల్లదె యమరవాది రామయకవీంద్ర___" (ద్రౌపదీ. 1_30).

అమరా
చూ. అమరం
పౌరుషనామం (స.).

అమరినేని
చూ. అమరనేని
వ్యక్తినామం (స.).
కమ్మవారిలో ఇంటిపేరు.

అమలినేని
రూ. అమిలినేని, అమ్మిలినేని
వ్యక్తినామం (రా.స.).
<అమలనాయుడు. అమల_ గృ.నా.పూ. వ్య.నా. దేవతాసూచి. <అమల; లక్ష్మి. కమ్మవారి ఇంటిపేరు.
చూ. _నేని గృ. నా. ప.

అమవాస
పౌరుషనామం (రా.).
కృష్ణ పక్షంలో చివరిరోజు. అమాస, అమావాస్య. సం. అమావస్యా, అమావాస్యా; త. అమావాసి; క. అమావాసె. హరిజనులలో ఇంటిపేరు.

అమిరినాయని
చూ. అమరనేని
వ్యక్తినామం (శా.).
"__అమిరినాయని వెంగళనాయనిం గారు__" శా. 1484 (టి.యం.పి.1, పు.650, నెం. 903).

అమిరినేని
చూ. అమరనేని
వ్యక్తినామం (రా.).
కమ్మవారిలో ఇంటిపేరు

అమిలినేని
చూ. అమలినేని
వ్యక్తినామం (తె.రా.స.).
కమ్మవారిలో ఇంటిపేరు.

అమృతవాక్కుల
పౌరుషనామం (స.).
అమృతవాక్కు బహు. కు ద్వి.వి. అమృత_ అమృతం, శాశ్వతమైన; వాక్కు: మాట, పలుకు. బ్రాహ్మణులలో గృహనామం.

అంబటి
ఆహారపదార్థసూచి (స.).
అంబలికి ద్వి.వి. పిండితో కొంచెం పల్చగా కాచిన పదార్థం. బహు. అంబళులు, అంబళ్ళు. త. అంబలి; క. అంబలి. (డి.ఇ.డి. 146.).

ఈ కులనామమే గృహనామ మయింది. (సి.టి.యస్.ఐ. III 141.).

కంసెట్టి

చూ. కమ్మిసెట్టి

వ్యక్తినామం (వ.).

కయి

పౌరుషనామం (రా.).

<?కయ్య:పొలంలో భాగం. కాపులలో ఇంటిపేరు.

కరణం

రూ. కరణము, కర్ణం

వృత్తిసూచి (వ.).

<సం.కరణమ్; త.కర్ణమ్ :గ్రామంలో లెక్కలు రాసేవాడు, కరణీకుడు, గణకుడు. కమ్మవారిలో ఇంటిపేరు.

కరణము

చూ. కరణ

వృత్తిసూచి (రా.శా.వ.).

"—పహారేణ స్వదత్తావి: ష్ఫలంభవేత్ కరణము దిండి మరాజు తన—" శా. 1187 (తెలం. శా. సం. 1. పు. 74. పం. 17–18). బ్రాహ్మణులలో ఇంటిపేరు.

కరణీక

రూ. కరణిక్క, కరణిక్కం

వృత్తిసూచి (శా.).

<కరణీకము : కరణం యొక్క పని. —కరణిక భసవరసర్—" శా. 1456 (టి.టి.డి.ఇ.యస్.IV. పు.72. నెం.37)

కరణిక్క

చూ. కరణిక

వృత్తిసూచి (శా.).

"—కరణిక్క అన్నదాత—" శా.1437 (ఇ.టి.ఐ. II; పు. 243, నెం. 113). "—కరిణిక్క భసవరసర్—" శా.1437 (టి. టి. డి. ఇ. యస్. III, పు. 216, నెం. 165)

కరణిక్కం

చూ. కరిణిక

వృత్తిసూచి (శా.).

"—కరణిక్కం కామరసప్పన్ కొడుకు కరణిక్కం అప్పలయ్య—" శా. 1480 (టి.టి.డి.ఇ.యస్.V,పు.435,నెం.161).

కరతిత్తి

వృత్తిసూచి (సా.).

<సం. కరధృతి— వస్త్రపుసంచి. తమలపాకులు మొదలైనవి యుంచుకొనెడు చేతి సంచి. సూ.ని. "—కరతిత్తి మాచండు—" (పల్నా.వు.88,పం. 65). 'అరువు దోవతియుఁబంచాంగంబు ముష్టిఁ బెరగిన కరతిత్తి పత్రాల సంచి' (హరిశ్చం.) ఇది అడపానికి రూపాంతరంలా కన్పిస్తుంది.

కరిపెనేని

వ్యక్తినామం (వ.).

కరిపె— గృ. నా. పూ. ?<కరియప, కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. _నేని గృ. నా. వ.

కరిమూల

తెగసూచి (తె.).

?<కర్రిమాల

కరెంటు

పౌరుషనామం (తె.).

<ఆం. కరెంట్ : విద్యుచ్ఛక్తి.

కర్ణ

వృక్షసూచి (స.).

<కర్ణ : ఒకానొక చెట్టు, సువర్ణాళి. ఆం. వా.

కర్తవోజు

వ్యక్తినామం (తె.స.).

కర్త_గృ.నా.పూ. ?

చూ. _ఓజు గృ. నా. వ.

కర్నం

చూ. కరణం

వృత్తిసూచి (రా.).

కర్నాటి

చూ. కర్నాడు

పౌరుషనామం, దేశసూచి (రా.).

దేశసూచి. కన్నడ దేశానికి సంబంధించిన. కర్నాడుకు ద్వి.వి. త. కర్నాటకం, కర్ణాటం; మ.కన్నాటం. క. కర్ణాట, కన్నడ. డి.ఇ.డి. 1079. కమ్మవారిలో ఇంటిపేరు.

కర్నాడు

రూ. కర్నాటి

దేశసూచి (తె.).

కర్నాటము, కన్నడదేశం.

కర్ని

పౌరుషనామం (తె.).

<కరిని. <సం. కర్ణీ_. చెవుల వద్ద కంతిలాగ పుట్టేవ్రణ విశేషం:

కర్పూరపు

చూ. కర్పూరం

పౌరుషనామం (స.).

కర్పూరం

రూ. కర్పూరపు

పౌరుషనామం (శా.).

<సం. కర్పూర_: ఘనసారం, కప్పురం. "_కర్పూరం మూవరయార్_" శా.1394, (ఇ.ఐ.11, పు.88, నెం49).

కర్రి

రూ. కర్రె

పౌరుషనామం (తె.స.).

<కఱ్ఱి : నలుపు, నల్లనిది. త.కఱ్ఱి; క.కఱి; సంస్కృతంలోని కాలశబ్దభవమని ఆం. వా.

కర్రె

చూ. కర్రి

పౌరుషనామం (తె.).

కఱ్రెడ్ల
జంతుసూచి (తె.రా.స.).
కఱ్రి+ఎడ్ల : నల్లఎద్దులు. త. కఱు; మ.కఱు, కఱు; క.కఱె, కఱి., తు.కప్పు; తె.కఱు, కఱియ, కట్టి. డి. ఇ.డి.1175.

కలకల
పౌరుషనామం (స.).
?<కొలకుల

కలగోట్ల
చూ. కలిగోట్ల
వృక్షసూచి (సా.).
?<కలగూటులు : వివిధసేవకులు. క.కల : కలసిన; గుండ–సేవకుడు.

"—అట్టి శ్రీపాకనాటి రెడ్డ న్వయమున
కలదు పులిగోళ్ళ గోత్ర సంకలితమైన
భవ్యకలగోట్ల నామా ప్తివరలుచుండు
వంశ మొక్కటి కవినుతిపాత్ర
మగుచు" (మురళీ. వి.పు.1–37)

"——భళరె మృతజీవులగు యశోభరితు లందు మేటి యగు గాదె కలగోట్ల కోటిరెడ్డి—" (మురళీ. వి.పు.12,1–44).

కలం
పౌరుషనామం (స.).
హిం. కలమ్. సం. కలమ– లేఖిని. రాయడానికి ఉపయోగించే పరికరం.

కలిగోట్ల
చూ. కలగోట్ల
వృక్షనామసూచి :(తె.).
కలిగొట్టు బహు. పు. ద్వి. వి. పాటల వృక్షం.

కలిదిండి
పౌరుషనామం (స.సా.).
< కలిదండియే కలిదిండిగా మారిందనీ, కలదండి, అంటే కలిని దండించినవారని వ.సా.చ. 'కలిదిండి' వాస్తవంగా ఒక గ్రామనామం. "—మాకలిదిండి కామయ కుమారకుడన్నిట—" (చాటు. పు.98).

కలిదేర
వ్యక్తినామం (స.).
కలి– గృ. నా. పూ. వి. చూ. కలిరెడ్డి. కమ్మవారిలో ఇంటిపేరు.
చూ. –దేర గృ. నా. ప.

కలిన
<కలినేని
వ్యక్తినామం (తె.).
కలి– గృ. నా. పూ. వి.చూ. రెడ్డి.
చూ. –న గృ. నా. ప,

కలిమిడి
?<కలిమినీడి
వ్యక్తినామం (రా).
కలిమి– గృ.నా.పూ. ఐశ్వర్యం, సిరి
చూ. –డి గృ. నా. ప.

కలిమిలి.
(శా).

"—కలిమిలి బొప్పరాజు—" (టి.యం. పి.II, పు. 1158, నెం. 821).

**కలిరెడ్డి**

వ్యక్తినామం (తె.).

కలి— గృ. నా. పూ. పులియబెట్టిన కడుగు నీరు, సూ. ని.

చూ. –రెడ్డి గృ. నా. ప.

**కలిసెట్టి**

వ్యక్తినామం (స.).

కలి— గృ.నా.పూ. వి. చూ. కలిరెడ్డి.

చూ. –సెట్టి గృ.నా.ప.

**కలువల**

పుష్పసూచి (స.).

కలువ బహు. కు ద్వి. వి. ఉత్పలం, కువలయం. క. కలువె; సం. కైరవమ్. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

**కల్యాణం**

పౌరుషనామం (స.).

<సం. కల్యాణ— శుభం, వివాహం, అక్షయం.

**కల్ల**

పౌరుషనామం (తె.).

ముళ్లకంప.

**కల్లపు**

ఆయుధసూచి (స.).

<కల్లము : పల్లబంధ విశేషం. ముప్పైరెండు అయుధాలలో ఒకటి.

**కల్లం**

పౌరుషనామం, ఆయుధసూచి (స. <కల్లము. వి. చూ. కల్లపు.

**కళ**

రూ. కళా

పౌరుషనామం (తె.).

సం. కలా : చంద్రకళ; విద్య

**కళా**

చూ. కళ

పౌరుషనామం (స.).

**కళాయి**

వస్తుసూచి (రా.).

<సం. కటాహ—; క. కడాయి; నీలి మందు మొదలైనవి కాచే గంగాళం; ఇత్తడి మొదలైన పాత్రలకు పూసే తగరం పూత. కాపులలో ఇంటిపేరు.

**కళ్లం**

పౌరుషనామం (స.).

<కళ్ళము : ధాన్యం నూర్చేచోటు <ప్రా. ఖలో- <సం. ఖల— త. కళం. పంటరెడ్లలో ఇంటిపేరు.

**కళ్లి**

వృక్షసూచి (స.).

క.కళ్ళి త.కళ్ళి : జెముడు చెట్టు

కళ్లెం

పౌరుషనామం. (రా.స.).

ప్రా. ఖలీణం; సం. ఖలీనం : గుర్రం నోటికి తగిలించి తిప్పే సాధనం.

కవాలి

పౌరుషనామం (తె.).

<ఉ. కవాలి : నృత్యవిశేషం.

కవి

పౌరుషనామం : కవిత్వసూచి (స).

కవిత్వం చెప్పేవాడు. పండితుడు. నియోగి బ్రాహ్మణులలో ఇంటిపేరు.

కవిరాట్

బిరుదనామం (న.).

కవిత్వసూచి. కవిరాజు. వీరి ఇంటిపేరు మొదట తుర్లపాటివారు. వీరిది అన్నవర్తి గ్రామం. వీరి వంశంలో ఒక శతాబ్ది క్రితం హనుమయ్యగారు వినుకొండ సమీపంలోని మానుకొండ గ్రామంలోని నృసింహస్వామి ఆలయంలో విశ్రమించారు. ఆ రాత్రి నరసింహుడు తన దేవేరితో మాట్లాడుతూ ఇతడు అజ్ఞానియైన జ్ఞాని అన్నాడట. ఆ దేవి కోరికపై ఈతని నోటిలో బీజాక్షరం లిఖిస్తానని అన్నాడట. అప్పుడు అతని నాలుకమీద ఏదోచుక్క పడినట్లన్పించిందట. ఆ వెంటనే అక్కడే నృసింహశతకం చెప్పి అచ్చటి ప్రభువులచేత గరికమాన్యం బహుమతిగా పొందారట. అక్కడే కవిరాట్ బిరుదుపొంది స్వగ్రామానికి చేరారట. అప్పటినుండి వీరి గృహనామం తుర్లపాటివోయి కవిరాట్ అనే బిరుదనామం గృహనామ స్థానాన్ని అలంకరించిందని, వీరు అవ్వారి వాసుదేవశాస్త్రి స్నేహితులని కవిరాట్ లక్ష్మి చెప్పారు.

కవిలె

పౌరుషనామం (స.).

లెక్కలువ్రాయు తాటాకుల పుస్తకము. శ.ర; ధనాగమ వ్యయాదుల లెక్కలు నానాడు వ్రాసి చేర్చిన పత్రముల కట్ట. చి. ని. అని సూ. ని.

కసవరాజు

వ్యక్తినామం (స.).

కసవ– గృ.నా.పూ. పు.నా. <ప్రా. కస్సవ– <సం. కశ్యప. ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.

చూ. –రాజు గృ.నా.ప.

కసవుల

వ్యక్తినామం (శా.).

<ప్రా. కస్సవ– సం. కశ్యప– "—కసవుల బోజయ్య—" శా. 1432 (టి.యం.పి, పు. 603; నెం. 346).

కసిందల

రూ. కసుందల

వృక్షసూచి (న.).

కసింద బహు. కు ద్వి.వి. కాసమర్దం

వృక్షం. క. కసింద.

కసిరాజు

వ్యక్తినామం (రా.).

కసి– గృ.నా.పూ. ?<కసవ.

చూ. –రాజు గృ.నా.ప.

కసిరెడ్డి

చూ. కాశిరెడ్డి

వ్యక్తినామం (రా.స.).

?<కశ్యపరెడ్డి.

కసుందల

చూ. కసిందల

వృక్షసూచి (శా.).

"––కొణ్డనూరి వసియపరడ్డి కసుందల కొమ్మిరడ్డి––" 742–79 ఎ.డి. (ఇ.టి. ఐ. పు. 38, పం. 5–6, నెం. 54).

కసెట్టి

చూ. కాసెట్టి

వ్యక్తినామం (రా.).

కస్తూరి

పౌరుషనామం (తె.రా.స).

సం. కస్తూరీ– మృగమదం, ఒక విధమైన పరిమళద్రవ్యం, కస్తూరి మృగనాభి యందుండేది. 'ఇంటిపేరు కస్తూరివారు ఇంటినిండా గబ్బిలాల మోత' అని సామెత. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

## కా

కాకన్న

వ్యక్తినామం (రా.).

?కాకి+అన్న.

చూ. –అన్న గృ.నా.ప.

కాకర్ల

వృక్షసూచి (తె.రా.స.).

ఉ : కాకిర, కాకిరి, కాకెర. వృ. నా : Momordica Charantia. గ్రామనామంకూడ కావచ్చు. కమ్మ, మూక దొర కులాలలో ఇంటిపేరు.

కాకలి

చూ. కాకొల్లి

?<కాకొల్లి. వృత్తిసూచి (శా.).

"––కాకలి వెంకట దీక్షితులు శా. 1448 (టి. యం. పి. I, పు. 310, నెం. 378).

కాకి

రూ. కాకుల

పక్షిసూచి (తె.రా.స.సా.).

త. కాక్కై–య్, కాక్కా–య్; క. కాకె, కాకి, కాగి, కాగె; తు. కక్కె, కాక; తె. కాకి; డి.ఇ.డి. 1197. సం. కాక– "––ఘనకీర్తిస్ఫూర్తిగా కాకి వెంగామాత్యాత్మజ––" (అంబ.Tel. M.పు.4) మాలలలో ఇంటిపేరు.

కాకు

పౌరుషనామం (రా.స.).

?<కాక: వేడి.యాదవులలో ఇంటిపేరు,

కాకుల

చూ, కాకి

పక్షిసూచి (తె.).

కాకి బహు. కు ద్వి. వి. కమ్మవారిలో ఇంటిపేరు.

కాకొల్లి

రూ. కాకలి.

వృత్తిసూచి (శా.).

?<కాకోలుడు : కుమ్మరి. ?<కాకోలి. వృక్షసూచి. కారుకొల్లి వృక్షం. "--కాకొల్లి తిమ్మావండితు----" (టి. యం. పి. II; పు. 789; నెం. 372).

కాగితం

చూ. కాగితాల

పౌరుషనామం (స.).

కాగితాల

రూ. కాగితం

పౌరుషనామం (స.).

కాగితం బహు. కు ద్వి.వి. <హిం. కాగజ్ : రాయడానికి ఉపయోగించే పత్రం.

కాగినేని

వ్యక్తినామం (వ.).

కాగి_ గృ.నా.పూ.?

చూ. _నేని గృ.నా.వ.

కాచి

వ్యక్తినామం (రా.).

పూ దేవతాసూచి. కామాక్షిదేవి.

కాచిభట్ల

వ్యక్తినామం (వ.).

కాచి_ గృ. నా. పూ. దేవతాసూచి. ?<కామాక్షి. ?<కాశీ_; కాచి_ వృక్ష విశేషమని క. ఊ. 597. వృక్షసంబంధ మైన పదం కాంచి. కాచారెడ్డి, కాచిరాజు, కాచిభట్ల మొదలైన పేర్లలోని కాచి_ కాచమ్మనుండి వచ్చిందే. వెలనాటి వైదిక బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. _భట్ల గృ. నా. ప.

కాచిరాజు

వ్యక్తినామం (స.).

కాచి_గృ. నా. పూ; వి.చూ. కాచిభట్ల. ఆర్వేలనియోగులలో ఇంటిపేరు.

చూ. _రాజు గృ. నా. ప.

కాటన్నగారి

వ్యక్తినామం (రా.).

కాటన్న_గృ.నా.పూ; వ్య.నా. దేవతా సూచి కాడు+అన్న. కాడు_ అడవి త. కాడు; క. కాడు. మ. కాటు.

చూ. _గారి గృ.నా.ప.

కాటా

రూ. కాటా

పౌరుషనామం (స.).

పెద్దతాసు. పెద్దబరువులను తూచటానికి ఉపయోగించే త్రాసు. < హిం. ఖా హా_ కమ్మవారిలో ఇంటిపేరు.

కాటాబత్తుని

రూ. కాటాబత్తుల

వ్యక్తినామం (స.).

కాటా– గృ. నా. పూ. ? < కాటమ్మ. కాడు+అమ్మ. అడవిలో పశువులకాపరులు ప్రతిష్ఠించి ఆరాధించే ప్రకృతి దేవత.

చూ. –బత్తుని గృ. నా. ప.

కాటాబత్తుల

చూ. కాటాబత్తుని

వ్యక్తినామం (స.).

కాటి

పౌరుషనామం (తె.స.).

కాడుకు ఔప. అడవి, శ్మశానం. ఆర్వేల నియోగులలో ఇంటిపేరు. త. కాడు; క. కాడు; మ. కాలు.

కాటు

చూ. కాటి

పౌరుషనామం (రా.).

కాట్రా

చూ. కాటా

పౌరుషనామం (రా.).

బలిజకులంలో ఇంటిపేరు.

కాంద్రు

తృణసూచి (స.).

? < కాంద్ర. ఒకవిధమైన గడ్డి

కాదంబరి

పౌరుషనామం (స.).

కదంబ పుష్పాల నుండి తీసిన మద్యం, సారాయి; బాణుడు రచించిన సంస్కృత వచన కావ్యం: ఆడుకోయిల; కాదంబరీ కావ్య ప్రవచనంచే ప్రసిద్ధులు కావచ్చు. ఆర్వేలనియోగులలో గృహనామం.

కాన

వనసూచి

త. కానం; సం. కాననం: అడవి.

కానాదిభొట్ల

వ్యక్తినామం (తె.).

కానాది–గృ.నా.పూ.< కాణాదము.కాణాదఋషిచెప్పిన న్యాయశాస్త్రం.న్యాయం, కాణాదం అని తర్కం రెండు రకాలు. తర్కశాస్త్రాన్ని అభ్యసించినవారు కావచ్చు.బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. –భొట్ల గృ. నా. ప.

కాను

ఆహారపదార్థ సూచి (రా.).

నీరుకలవని మజ్జిగ. రెడ్లలో ఇంటి పేరు.

కానుగుల

వృక్షసూచి (తె.స.).

కానుగు బహు. కు ద్వి. వి. కానుగు– వి. కరంజ వృక్షం. కాపులలో ఇంటి పేరు.కానగ ఎరుకలలో ఇంటిపేరు.

కాపరి

వృత్తిసూచి (తె.).

కాపు + అరి : రక్షకుడు, కాచేవాడు.

**కాపు**

కులసూచి (తె.రా.స.).

< కాంపు < కాచు:రక్షణ.

త. కాప్పు, కావల్; మ.కాప్పు;క.కాపు; తు. కాపు, కొప్పు; తె.కాపు. డి. ఇ.డి. 1192. కా=తమిళ కన్నడాలలో రక్షించు అని అర్థం. అధిక జనాభాగల పెద్ద కులాలలో ఇది ఒకటి. కాపు అంటే కాపలా కాసేవాడు. పంటలను రక్షిస్తుంటాడు. ఈకులం ఎన్ని విధాలుగా వుందో చెప్పలేం. అందుకే వారు పండించే వరి రకాలకు పేర్లు చెప్పవచ్చు గాని కాపులు ఎన్నిరకాలో చెప్పలేమంటారు. ఆవుల, ఆళ్ల,ఉడుముల, ఎద్దుల, ఏనుగు,కానుగుల,కోళ్ల, గుడిశె, గుంటక, గొర్రె,తంగేడు. దండు, నాగలి,బర్రెల. బండి, ముంగారు, మేకల, వరిగె మొదలయినవి, కాపులలోని ఇంటిపేర్లు. ప్రాచీన ద్రావిడుల ఆచారాలు కొన్ని ఈ కులంలో కన్పిస్తున్నాయి. కంచీవరం సమీపంలో నివసిస్తున్న పంట రెడ్లలో ఆదివాసుల గృహనామలు, వారి ఆచారాలు వున్నాయి. మగిలి కుటుంబంలోని స్త్రీలు మొగిలిపూవును తాకరు. ఇప్పి గృహనామం కలవారు ఆచెట్టును, ఆచెట్టు నుండి వచ్చిన దానిని తాకరు. మంచం ఇంటిపేరుగా గలవారు దానిమీద పడుకోరు. అరిగల వారు ఆ ధాన్యాన్ని తినరట. పుచ్చ, చింతగింజల మొదలైన కుటుంబాల కాపులు ఆపండ్లను తినరు, తాకరు. ఈ కులాన్ని గురించి ఒకకథ ప్రచారంలో వుంది. ప్రతాపరుద్రుని కాలంలో బేతిరెడ్డి భార్య తపస్సు చేసి సూర్యుని చేత ప్రకాశిస్తున్న చెవికమ్మను పొందిందట. దానిని రాజు భార్య కివ్వడానికి రాజమంత్రి దొంగిలించాడట. ఆ కమ్మను తీసుకురమ్మని బేతిరెడ్డి భార్య తన నల్గురు కుమారుల్ని పంపింది. రాజుకు ఇందులో సంబంధం వుందిగనుక పెద్దకొడుకు నిరాకరించాడు. రెండోవాడు కూడ అలానే నిరాకరించి నిందించాడు. మూడోవాడు తెస్తానని ప్రతిజ్ఞచేశాడు. నాల్గోవాడు పారిపోయాడు. మొదటి వాని సంతానం పంటకాపులు, రెండోవాని వారసులు పాకనాటి కాపులు, కమ్మ తెచ్చిన వాని వారసులు కమ్మవారు. పారిపోయిన వాని సంతానం వెలమలని చెప్తుంటారు. (సి. టి. యస్. ఐ. III, పు. 222) కమ్మ, కాపు కులాలలో ఇంటిపేరు.

**కామ**

రూ. కాము

వ్యక్తినామం (శా.).

దేవతాసూచి.< సం. కామ_మన్మధుడు. "—కామ బొప్పనింగారు—" శా.1221 (టి.యం.పి. II, పు. 789; నెం. 375)

**కామబుషి**

చూ. కామ్షరుసు,

వ్యక్తినామం (.న.).
కామ– గృ. నా. పూ; దేవతాసూచి; వి.చూ, కామ. కామఋషి కృతక రూపం. బ్రాహ్మణులలో ఇంటిపేరు.
చూ. –ఋషి గృ.నా.ప.

**కామన**

చూ. కామననేని
వ్యక్తినామం (రా.న.).
కమ్మవారిలో ఇంటిపేరు.

**కామననేని**

రూ. కామన
వ్యక్తినామం (న.).
కామన– గృ.నా పూ. వ్య.నా. దేవతాసూచి. <కామన్న. కామ + అన్న. వి.చూ. కామ.–అన చూ.అన్న గృ.నా.ప.
చూ. –నేని గృ.నా.వ.

**కామందుల**

పౌరుషనామం (తె.న.).
<ఉ.ఖావంద్: యజమాని, భూస్వామి. కామందు బహు. ఉ ద్వి. వి.

**కామభట్ల**

వ్యక్తినామం (న.).
కామ– గృ. నా. పూ. దేవతాసూచి. వి.చూ. కామ. వెలనాటి వైదిక బ్రాహ్మణులలో ఇంటిపేరు.
చూ. –భట్ల గృ.నా.ప.

**కామరాజు**

చూ. కామరుసు
వ్యక్తినామం (తె.న.).

**కామరుసు**

రూ. కామఋషి,కామరాజు,కామర్సు.
కామ– గృ. నా. పూ. దేవతాసూచి. <నం కామ– మన్మధుడు. "—ఇవ్విధంబున విజయ రాఘవ పట్టభద్రుని పట్టంపు కవియైన కామరుసు వెంకటపతి సోమయాజి హావణించిన—"(చంద్రికా. Tel. M. పు. 253).

**కామర్సు**

చూ. కామరుసు
వ్యక్తినామం (సా.).
"—పాక శాసన కృపా పరిపాక సామరస్యంబు వడసిన కామర్సు వెంకటపతి సోమయాజి విజయ రాఘవ చంద్రుని—" (చంద్రికా, Tel. M. పు. 253.)

**కామసాని**

వ్యక్తినామం (రా.).
కామ– గృ.నా.పూ. దేవతాసూచి. చూ. కామ. చూ. –సాని గృ.నా.వ.

**కామిని**

చూ. కామినేని
వ్యక్తినామం (న.).
కమ్మవారిలో ఇంటిపేరు.

**కామినేడి**

చూ. కామినేని
వ్యక్తినామం (న.).

**కామినేని**

రూ. కామిని, కామినేడి

వ్యక్తినామం (స.).

కామి_ గృ.నా.పూ.పు.నా; దేవతాసూచి. కామ+ఇ< కామయ్య. కామ+అయ్య. వి.చూ. కామ. కమ్మవారిలో ఇంటిపేరు. "__కామినేని ముత్తరాజు__" శా.1663. (Tel. P. II; పు.1083. నెం.291).

చూ. _నేని గృ.నా.ప.

**కామిరెడ్డి**

వ్యక్తినామం (రా.స.).

కామి_ గృ. నా. పూ. దేవతాసూచి. వి. చూ. కామినేని. కమ్మవారిలో ఇంటి పేరు. చూ. _రెడ్డి గృ.నా.ప.

**కాము**

చూ. కామ

వ్యక్తినామం (తె.).

**కాంభట్ల**

వ్యక్తినామం (స.).

కాం_ గృ.నా.పూ. పు.నా; దేవతాసూచి. <కామ. వి.చూ. కామ. బ్రాహ్మణులలో ఇంటిపేరు. చూ. _భట్ల గృ. నా. ప.

**కాయల**

ఫలసూచి (తె.స.).

కాయ బహు. కు ద్వి. వి, <కాయ. చెట్లు, తీగలు మొదలైనవి కాచేకాయ, ఇది వరపదంగా ఎక్కువ వాడుకలో ఉంది. త.కాయ్; క. కాయ్; తు. కాయి; తు.కావు

**కారప్పొడి**

ఆహారపదార్థసూచి (తె.).

కారము+పొడి. వి. చూ. కారము.

**కారము**

ఆహారపదార్థసంబంధసూచి (స.).

షడ్రసాలలో ఒకటి, చౌడు. సూ. ని. ప్రా.కారం; సం. క్షార_; త, కారమ్ క. కారవు.

**కారంసెట్టి**

వ్యక్తినామం (స.).

కారం_ గృ. నా. పూ. ? <కారము : పన్ను, సుంకం. చూ. _సెట్టి గృ. నా.ప.

**కారు**

వనసూచి (రా.).

అడవి, ఋతువు, దున్నని పొలం.

**కాలనాధభట్ల**

వ్యక్తినామం (తె.).

కాలనాధ_ గృ. నా. పూ. దేవతాసూచి. శివుడు. <కాలనాధుడు. బ్రాహ్మణులలో ఇంటిపేరు. చూ. _భట్ల గృ. నా ప.

**కాలవ**

చూ. కాలువ

జలసూచి (రా.).

పద్మసాలీలలో ఇంటిపేరు.

**కాలి**

చూ. కాళి

వ్యక్తినామం (రా).

**కాలికొన**

పౌరుషనామం (రా.స.).

కాలు యొక్క కొన. పాదం చివరి భాగం. కాలి <కాలు+ఇ. క. కాలు: త.కాల్; కు.కాడు: పాదం, అడుగు.

**కాలువ**

రూ. కాలవ, కాల్వ.

జలసూచి (రా.స.).

నీళ్ళుపారడానికి తవ్వినమార్గం; చెరువు, ఏరు మొదలైన వాటినుండి మాగాణి పొలాలకు నీళ్ళు సరఫరా చేసే మార్గం. క. కాలువె; త. కాల్వాయ్.

**కాల్వ**

చూ. కాలువ

జలసూచి (తె.రా.స.).

**కాళి**

రూ. కాలి

వ్యక్తినామం (తె.).

స్త్రీదేవతాసూచి. కాళికాదేవి, పార్వతి.

**కాళిదాసు**

వ్యక్తినామం (స.).

కాళి- గృ.నా.పూ. సం. స్త్రీదేవతాసూచి. వి. చూ. కాళి. కాళికిదాసుడైనవాడు. కాళిదాసు సుప్రసిద్ధ సంస్కృతకవి.

చూ. -దాసు గృ.నా.ప.

**కాళీభొట్ల**

వ్యక్తినామం (స.).



కాళీ- గృ. నా. పూ. <కాళి. వి. చూ. కాళి. వైదిక బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. -భొట్ల గృ.నా.ప.

**కాళ్లై**

రూ. కాళ్ళ

పౌరుషనామం (స.).

వాద్యవిశేషం. <ప్రా. కాహళియా- <సం. కాహళికా-;త.కాళమ్; క.కాహళె: కొమ్ముబూర. కాహళను ఊదడం వృత్తిగా గలవారు,

**కాళ్ళ**

చూ. కాళె

పౌరుషనామం (స.).

కాళ బహు కు ద్వి. వి. వాద్యవిశేషం. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

**కావటి**

వస్తుసూచి (స.సా.).

కావడికి ఔప. నీళ్ళు మొదలైనవి మోయడానికి రెండు చివరలకు మట్లు అమర్చిన వెదురుబద్ద. క. కావడి; త. కావడి; తు. కావడి; ప్రా. కావడీ. "--కరతిత్తి మాచండు,కావటివెంక--" (పల్నా. పు. 88).

**కావేటి**

జలసూచి (తె.స.).

కావేరుకు ఔప. <కావేరి: కవేరుడనే ఒకరాజు కూతురు. దక్షిణహిందూ

దేశంలో ఒకనది.

**కాశావఝుల**

వ్యక్తినామం (తె.స.).

కాశా— గృ.నా.పూ. ? < సం. కశ్యప— బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. —వఝుల గృ. నా. ప.

**కాశినవేని**

వ్యక్తినామం (స.).

కాశిన—గృ. నా. పూ. ?

చూ. —నేని గృ. నా. ప.

**కాశినేడి**

వ్యక్తినామం (స.).

కాశి —గృ.నా.పూ. వి.చూ. కాశిరాజు

చూ. —నేడి గృ. నా. ప.

**కాశిరాజు**

వ్యక్తినామం (స.).

కాశి —గృ. నా. పూ. స్థలసూచి. పుణ్యక్షేత్రం, కాశీపట్టణం, సూర్యుడు. తిరుపతి, సింహాచలం మొదలైన పుణ్యక్షేత్రాల పేర్లుగూడ వ్యక్తినామాల స్థానాన్ని ఆక్రమించాయి. ఆర్వేల నియోగులలో ఇంటి పేరు. చూ. —రాజు గృ. నా. ప.

**కాశిరెడ్డి**

రూ. కసిరెడ్డి

వ్యక్తినామం (తె.స.).

కాశి— గృ.నా.పూ. వి.చూ. కాశిరాజు

చూ. —రెడ్డి గృ. నా. ప.

**కాశీనాధుని**

వ్యక్తినామం (స.).

కాశీ— గృ. నా. పూ. దేవతాసూచి. వి.చూ. కాశిరాజు. కాశిలో వున్న నాధుడు కాశీనాధుడు. అతడే శివుడు, విశ్వేశ్వరుడు.

చూ. —నాధుని గృ.నా.ప.

**కాశీపతి**

వ్యక్తినామం (శా.).

కాశీ— గృ.నా.పూ. వి. చూ. కాశిరాజు; "——కాశీపతి సోమయాజులుగారు——" శా.1685 (టి. యం. పి. II. పు. 845. నెం. 867).

**కాశీప్రగడ**

వ్యక్తినామం (స.).

కాశీ— గృ. నా. పూ. వి.చూ. కాశిరాజు. ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.

చూ. —ప్రగడ గృ. నా. ప.

**కాశీభట్ల**

రూ. కాశీభొట్ల

వ్యక్తినామం (స.).

కాశీ— గృ.నా.పూ. వి.చూ. కాశిరాజు

చూ. —భట్ల గృ. నా. ప.

**కాశీభొట్ల**

చూ. కాశీభట్ల

వ్యక్తినామం (స.).

వెలనాటి వైదిక బ్రాహ్మణులలో ఇంటి పేరు.

కాశీవఝ్ఝుల
వ్యక్తినామం (తె.స.).
కాశీ– గృ.నా.పూ. దేవతాసూచి వి.చూ. కాశిరాజు బ్రాహ్మణులలో ఇంటిపేరు.
చూ. –వఝుల గృ. నా. ప.

కాస
చూ. కాసె
పౌరుషనామం (శా.స.).
"--కాసకొండ భట్టుడు--" (టి.యం. పి. II; పు.1102. నెం. 398). "—కాస అపాసెట్టి ఎత్తించిన—" రక్తాక్షి.(తెలం. శా. I, పు. 67; పం. 1).

కాసరనీడు
చూ. కాసరనేని
వ్యక్తినామం (స.).

కాసరనేని
రూ. కాసరనీడు
వ్యక్తినామం (స.).
కాసర– గృ.నా.పూ. వృక్షసూచి. రూ. కాచర. కమ్మవారిలో ఇంటిపేరు.
?<సం. కాసార– : తటాకం.
చూ. –నేని గృ. నా. ప.

కాసర్ల
ధాన్యసూచి (తె.).
కాసర బహు. కుద్వి. వి. శాలి ధాన్య విశేషం.

కాసలనాటి
దేశసూచి (స.సా.).
<సం. కోసల– ఈ ప్రాంతాన్ని కాసల నాడనీ, కాసలనాడు నుండి వచ్చిన బ్రాహ్మణులను కాసలనాటి వారనీ పిలుస్తారు. వైదిక బ్రాహ్మణులలో ఇంటి పేరు. "—కాసలనాటి కనకాంగిని చూచితి—" (శ్రీనా. చాటు.) కాసల నాటి శ్రేష్ఠుడు మీసాలప్పయ్యగారి మేనల్లుడు—" క్రీడాభి.

కాసా[1]
పౌరుషనామం (స.).
దాసీసంతతి.

కాసా[2]
చూ. కాసె
పౌరుషనామం (రా.).
కమ్మవారిలో ఇంటిపేరు.

కాసాని
వ్యక్తినామం (తె.స.).
కా– గృ.నా.పూ. ?<కామసాని.
చూ. –సాని గృ.నా.ప.

కాసారం
జలసూచి (తె.).
సరస్సు, కొలను.

కాసావఝ్ఝుల
వ్యక్తినామం (తె.).
కాసా– గృ. నా. పూ. ?<కశ్యప–, కాశీ–. బ్రాహ్మణులలో ఇంటిపేరు.
చూ. –వఝుల గృ. నా. ప.

**కాసిన**
వ్యక్తినామం (స.).
<కాసినేని
కాసి– గృ.నా.పూ. ?<కాచి.
చూ. –న గృ. నా. ప.

**కాసు**
రూ. కాసుల
పౌరుషనామం. (స.).
పదకొండణాల ఎత్తుగల బంగారపు నాణెం. ? <దుగ్గాణిలో పదవపాలు; దమ్మిడిలో ఐదోవంతు, సం. కాచ–; త. కాసు; క. కాసు.

**కాసుల**
చూ. కాసు
పౌరుషనామం (తె.రా.).
కాసు బహు. కు ద్వి. వి.

**కాసె**
రూ. కాస, కాసా.
ఆయుధసూచి (సా.).
మల్లబంధ విశేషం. కాసెకోక. దట్టి. సం. కచ్ఛా– "—సద్యశుడు గోత్రధీరుడు బ్రహ్మకుల సంభవుడు కాసె మల్లణ మంత్రి—" (సిద్దేశ్వ. 1–15, 17). "—నిత్య నిపుణుండు కాసె మల్లన మంత్రి—" (సిద్దేశ్వ. ఆశ్వా.౧ ప.21).

**కాసెట్టి**
రూ. కసెట్టి
వ్యక్తినామం (స.).
కా– గృనా.పూ <కామిసెట్టి. కామి– వి. చూ. కామినేని.
చూ. –సెట్టి గృ.నా.ప.

**కాసోజి**
వ్యక్తినామం (తె.).
కాస– గృ. నా. పూ. వి. చూ. కాసావరుల. చూ. –ఓజి గృ. నా. ప.

## కి

**కిన్నర**
పౌరుషనామం (తె.).
వాద్యవిశేషం. ఒకజాతి వీణె. <సం. కిన్నరా–

**కిరీటము**
అలంకరణసూచి (స.).
రాజులు ధరించే ఒక విధమైన తలపాగ.

**కిలారి**
వృత్తిసూచి (రా.స.).
<కీలారి : పాలు తీసేవాడు, ఆవుల కాపరి. కీలారము+ఇ. కమ్మవారిలో ఇంటిపేరు.

## కీ

**కీర్తిరాజు**
వ్యక్తినామం (స.).
కీర్తి– గృ.నా.పూ. యశస్సు. ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.
చూ. –రాజు గృ. నా. ప.

కీళ్ళ
పౌరుషనామం (స.).
?కీలు బహు. కు ద్వి. వి. మర్మం, ఉపాయం, కపటం, ఎముకకీలు. ?< కీడు బహు. కు ఔప. కీడు తీసేవారు, శాంతి పౌష్టిక క్రియలు చేసేవారుకావచ్చు.

## కు

కుక్క-పిల్ల
చూ. కుక్కల
జంతుసూచి (స.).
చిన్నకుక్క

కుక్కల
రూ. కుక్క-పిల్ల
జంతుసూచి(స.).
కుక్క బహు. కు ద్వి. వి. శునకం. కాపు, బోయలలో ఇంటిపేరు. ప్రా. కుక్కుర-, సం. కుక్కుర-, త. కుక్కల్,కుక్కన్- చూ. డి.ఇ.డి.1496.

కుంకుమ
పౌరుషనామం (స.).
సం. కుంకుమమ్: క. కుంకుమ; త. కుంకుమం. కుంకుమ తయారు చేయడమో, అమ్మడమో వృత్తిగా గలవారు.

కుంచ
చూ. కుంచె
వృత్తిసూచి (సా.).
<కుంచె. "—కుంచ శ్రీరాముండు—" (పల్నా. పు. 88: పం. 62).

కుంచం
రూ. కుంచపు.
పౌరుషనామం (తె.).
తూములో నాల్గోభాగం; నాల్గుమానికల ప్రమాణంగల కొలతపాత్ర. త.కుంజం. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

కుంచపు
చూ. కుంచం
పౌరుషనామం (స.).

కుంచప్ప
వ్యక్తినామం (తె.).
కుంచ- గృ.నా.పూ. ?<కుంచె+అప్ప.
చూ. -అప్ప గృ.నా.ప.

కుంచె
రూ. కుంచ
వృత్తిసూచి (స.).
చామరం, విసనకర్ర. ఈగలు మొదలైన వానిని తోలుకొనే సాధనం. రాజుగారి ఆస్థానంలో కుంచె పట్టుకొని వీచే ఉద్యోగి కావచ్చు. <ప్రా. కుంచిఆ- <సం. కుంచికా-.

కుడిమి
పౌరుషనామం (రా.).
<కుడిమివాడు ; పాములవాడు, విషవైద్యుడు.

కుడుం
రూ. కుడుముల
ఆహారపదార్థసూచి (రా.స.).

<దే.కుడుము. భక్ష్యవిశేషం. మోదకం. క.కుడుబు; కుడుంబు.

కుడుముల

చూ. కుడుం

ఆహారపదార్థసూచి (తె.రా.స.).

"—కుడుముల గంగన్న కూర లబ్బయ్య—" (పల్నా. పు. 249; పం. 814). గవళ్ళు, మాదిగలలో ఇంటిపేరు. కుడుము బహు. కు ద్వి. వి.

కుంటి

అవయవలోపసూచి (తె.స.).

అంగవైకల్యం, పాదవికలుడు. క. కుంటు, కూంటు; మ. కంటన్; కొ. కుంటి, డి.ఇ.డి. 1408

కూంటిగొర్ల

జంతుసూచి (స.).

కుంటి— గృ.నా.పూ: వి. చూ. కుంటి. చూ. —గొర్ల గృ.నా.ప.

కుంటోని

<కుంటివాని

అవయవలోపసూచి (తె.).

కుంటి— గృ.నా.పూ; వి. చూ. కుంటి. చూ. —ఓని గృ.నా.ప.

కుండం

పౌరుషనామం (స.).

<కుండము: కుండ, విప్పులగుండం; దేవఖాతముగు జలాశయం.

కుండ్ల

వస్తుసూచి (రా.).

కుండ బహు.కుద్వి.వి. మట్టితో చేసిన పాత్ర. కాపులలో ఇంటిపేరు. సం. కుండమ్; క.కుండ; త.కుండం.

కుతి

పౌరుషనామం (స.).

క. కుది : శోకం, దుఃఖం. ఇప్పుడీ పదం అర్థవిపరిణామం పొంది భ్రాంతి, ఆకాంక్ష అనే అర్థంలో కన్పిస్తుంది. నాకు వక్కపొడి తినాలని కుతిగా వుంది. వాడుక.

కుదుళ్ళ

పౌరుషనామం (స.).

కుదురు బహు.కు ద్వి.వి. కుదురుపడు. నెలకొను, పాదు, వంశం. సూ.ని. క. కుదురు; త. కుదిర్.

కుందా

పౌరుషనామం (రా.స.).

<కుంద : స్తంభం. క. కుంద

కుందేటి

జంతుసూచి (తె.రా.స.).

కుందేలుకు ఔప. చెవులపిల్లి. కుందేలు. ?<కుందేరుకు ఔప.

కుప్పంభట్ల

వ్యక్తినామం (తె.).

కుప్పం— గృ. నా. పూ; స్త్రీ; వ్య.నా.

<కుప్పమ్మ. కుప్ప+అమ్మ. కుప్ప–పెంట, రాశి. కుప్పయ్య, కుప్పస్వామి మొదలైన వ్యక్తినామాలు ఇలాంటివే. బ్రాహ్మణులలో ఇంటిపేరు. త.కుప్పం; కుప్పల్, కుప్పై; మ. కుప్ప; క.కుప్పె. డి.ఇ.డి. 1440. చూ. –భట్ల గృ.నా.ప.

కుప్పా

వ్యక్తినామం (తె.రా.శా.స.).

?<కుప్పమ్మ. "—కుప్పా వెంకట త్రరసు—"శా.1441.(టి.టి.డి.ఇ.యస్. III; పు. 287; నెం. 138).

కుంపటి

రూ. కుంపట్ల

వస్తుసూచి (స.).

చలికాచు కోడానికి నిప్పులుంచే పాత్ర. క.కుంపటి; త.కుమ్మట్టి. డి.ఇ.డి.1459.

కుంపట్ల

చూ. కుంపటి

వస్తుసూచి (స.),

కుంపటి బహు. కుద్వి.వి

కుంపిని

పౌరుషనామం (స.).

<కుంఫిణీ <ఆం. కంపెని.

కుంభసాని

వ్యక్తినామం (స.).

కుంభ– గృ.నా.పూ;స్త్రీ.నా వేశ్య. చూ. –సాని గృ.నా.ప.

కుంభసెట్టి

వ్యక్తినామం (స.).

కుంభ– గృ.నా.పూ; వి. చూ. కుంభ సాని చూ. –సెట్టి గృ.నా.ప.

కుంభా

పౌరుషనామం (స.).

?<సం. కుంభా–వేశ్య. సూ.ని.

కుమ్మర

రూ. కుమ్మరి

కులసూచి (సా.).

కుండలు మొదలైన మట్టిపాత్రలు చేసి జీవించే జాతి. కులాలజాతి. "—కరయూ చోడయ్య కుమ్మర గుండయ్య—" (కృష్ణరా.వి. 1–11). ప్రా. కుంభఆరో–, కుంభారో; సం. కుంభకార–; క.కుంబఱ, కుంబాఱ: ఒరియాలో వీరిని కుంబారొ అంటారు. కు=భూమి: మట్టితో పాత్రలు చేసేవారు. శూద్రులలో వీరిది పెద్ద జాతిగా భావిస్తారు. శాలివాహనుని వారసులమని చెప్పుకుంటారు. వి. చూ. సి.టి.యస్,ఐ IV. 112.

కుమ్మరి

చూ. కుమ్మర

కులసూచి (తె.రా.స.).

కుమ్మర+ఇ.

కురుకూటి

ఆహారపదార్థసూచి (స.).

కురు– గృ. నా. పూ: <సం. కురి;

తృణధాన్యవిశేషం.
చూ. _కూటి గృ.నా.ప.

కురుబ
తెగసూచి (రా.).
గొర్రె బొచ్చుతో కంబళ్ళు నేసే ఒక గొల్లజాతి. క.కుఱుబ, క ఱుంబ. కురవ అంటే కొండప్రాంతం, మెట్టప్రదేశం. కొండప్రాంతంలో గొఱ్ఱెలను పెంచుకుంటూవున్న కురమలు రాను రాను పల్లపు ప్రాంతాలకు వచ్చారట. కురుబ కులంలోనే ఇది ఇంటిపేరు. 'ఈ గృహనామంగల కుటుంబీకులు రాయలసీమలో ఉన్నారు. వీరుగొర్రెల కాపరులుగా, వ్యవసాయదారులుగా, నేతపనివాండ్రుగా, రాతిపనివారుగా ఉన్నారు. బళ్ళారి. కర్నూలు ప్రాంతాల్లో ఎక్కువగా కన్పిస్తున్నారు. కురుబఅనేపదం కన్నడ మూలమైన 'కురు' = గొర్రె నుండి వచ్చిందని 'స్టూవర్ట్' అంటారు. కాని వీరిది కేవలం గొర్రెల కాపరుల జాతి కాదు. వీళ్ళ 'కొఱి' అనే పేరుగల ప్రత్యేకమైన గొర్రెలను కలిగి వున్నారు గనుక వీరిని 'కురుబ'లు అన్నారు. తమిళంలో 'కురుంబ'అంటే క్రూరమైన అని అర్థం. కాబట్టి వీరుచాలా క్రూరులు అంటారు. అగ్ని; అరిగె = డోలు; అందర=పాక; ఆనె=ఏనుగు; బండి; ఆవు; చంద్ర; చేలు (తేలు); చిల్ల మొదలైనవి వీరి కులంలోని ఇంటిపేర్లు. సి.టి.యస్.ఐ. IV. 133.

కుర్రా
పౌరుషనామం (రా.స.).
దే. కుఱ్ఱ : చిన్నబాలుడు, కొడుకు, లేతవయసు గలది. కమ్మవారిలో ఇంటి పేరు.

కుర్రి
జంతుసూచి (స.).
<దే. కుఱ్ఱి : పాడిఆవు, గోవు.

కుల్లాయి
రూ. కుళ్ళాయి
అలంకరణసూచి (రా.).
టోపి, కుళాయ, కుళాయి, కుళ్ళాయ. హరిజనులలో ఇంటిపేరు. సం.ఖోలక_; క; కుల్లాయి; త. కుల్లా.

కుళ్ళాయి
చూ; కుల్లాయి
అలంకరణసూచి (రా.).

కుసుమ
వృక్షసూచి (స.).
ఒకజాతి పూలమొక్క; కుసుమ పూవు, కుసుంబపుష్పం. త. కుసుంబం; క. కుసుమ్బె. *<కుసుమ : వ్యక్తినామం కూడా కావచ్చు.

## కూ

కూకట్ల
పౌరుషనామం (స.).

కూకటి బహు. కు ద్వి. : శిఖ, జుట్టు. <సం. కూటక—.

కూచన

వ్యక్తినామం (స.).

కూచన్న <కూచి+అన్న. కూచి— గృ.నా.పూ: వి.చూ. కూచి.

చూ. —న గృ.నా.ప.

కూచి

పౌరుషనామం (సా.).

యుద్ధయాత్రకు సైనికులను హెచ్చరిక పరచడానికి యుద్ధవాద్యములను వాయించడం. <హిం. కూచ్ : దండయాత్ర; కూచి దేశ్యపదమని అం.వా. "—గుంటు కలన్నయ్య కూచి మలిభొట్లూ—" (పల్నా. పు. 249; పం. 816). కమ్మవారిలో ఇంటిపేరు.

కూచిభట్ల

వ్యక్తినామం (తె.).

కూచి— గృ.నా.పూ; వి.చూ. కూచి.

చూ. —భట్ల గృ. నా. ప.

కూచిమంచి

వ్యక్తినామం (తె.స.).

కూచి— గృ. నా. పూ; వి.చూ. కూచి. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. —మంచి గృ. నా. ప.

కూన

రూ. కూనల, కూనా



పౌరుషనామం (తె.రా.).

శిశువు, చిన్నది. <సం. కుణక—.

కూనపరాజు

వ్యక్తినామం (స.).

కూనప— గృ. నా. పూ; <కూనప్ప <కూన+అప్ప. కూన— వి. చూ. కూన. చూ —అప—గృ. నా. ప. బ్రాహ్మణులలో ఇంటిపేరు. చూ. —రాజు గృ.నా.ప.

కూనపరెడ్డి

వ్యక్తినామం (స.).

కూనప— గృ.నా.పూ; వి.చూ. కూనపరాజు. చూ. —రెడ్డి గృ.నా.ప.

కూనపులి

తెగసూచి (స.).

పద్మసాలీలలో ఒకశాఖ. ఉ.కునపులివాండ్లు, కునపులోళ్ళు. పద్మసాలీల వద్ద కథలు చెప్పి అడుక్కునే వాళ్లు. భావనాఋషి పద్మావతిని పెళ్ళిచేసుకోవడానికి వెళ్ళేటప్పుడు తనవెంట వచ్చిన పులికూనలకు కాపలిగా, రొమ్ముమీదున్న మన్ను నలిపి సృష్టించిన కూనపులివాని కథ మార్కండేయ పురాణంలోవుంది. వీరు అతని వంశం వారవిచెప్పుకుంటారు. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

కూనమనేని

రూ. కూనంనేని

వ్యక్తినామం (స.).

కూనమ– గృ. నా. పూ; <కూనమ్మ <కూన+అమ్మ. వి.చూ; కూనపరాజు. చూ. –నేని గృ. నా. ప.

కూనంనేని
చూ కూనమనేని
వ్యక్తినామం (స.).

కూనల
చూ. కూన
పౌరుషనామం (స.).
కూన బహు. కు ద్వి. వి.

కూనా
చూ. కూన
పౌరుషనామం (స.).

కూని
పౌరుషనామం (రా.).
?<ఉర్దూ. ఖూనీ : హత్య ?<గూని.

కూనిరెడ్డి
వ్యక్తినామం (తె.).
కూని– గృ.నా.పూ; వి. చూ. కూని, చూ. –రెడ్డి గృ. నా. ప.

కూనిసెట్టి
వ్యక్తినామం (స.).
కూని– గృ. నా. పూ; వి.చూ. కూని; చూ. –సెట్టి గృ. నా. ప.

కూరాకుల
వృత్తిసూచి (రా.).
కూరాకు బహు. కుద్వి.వి. కూర+ఆకుల. కూర–చూ. గృ.నా.ప; –ఆకుల గృ.నా.ప.

## కృ

కృష్ణా
జలసూచి (స.).
<సం. కృష్ణ–కృష్ణానది, యమునానది, దుర్గ. ఆర్వేలనియోగులలో ఇంటిపేరు.

కృష్ణావఝల
వ్యక్తినామం (తె.).
కృష్ణా–గృ.నా. పూ; పు.నా. <కృష్ణ+అ. వి.చూ. కృష్ణా. బ్రాహ్మణులలో ఇంటి పేరు. చూ. –వఝల గృ.నా.ప.

## కే

కేతనేని
చూ. కేతినేని
వ్యక్తినామం (స.).
కమ్మవారిలో ఇంటిపేరు.

కేతరాజు
రూ. కేతిరాజు
వ్యక్తినామం (స.).
కేత– గృ.నా.పూ; పు.నా. <కేతయ. బ్రాహ్మణులలో ఇంటిపేరు.
చూ. –రాజు గృ.నా.ప.

కేతిని
చూ. కేతినేని
వ్యక్తినామం (స.).
కమ్మవారిలో ఇంటి పేరు

కేతినేని
రూ. కేతనేని, కేతివి, కేతిన్ని.
వ్యక్తినామం (వ.).
కేతి—గృ.నా.పూ; వ్య. నా. వి. చూ. కేతిరాజు. కమ్మవారిలో ఇంటిపేరు.
చూ. _నేని గృ. నా. ప.

కేతిన్ని
చూ. కేతినేని
వ్యక్తినామం (రా.వ.).

కేతిరాజు
చూ. కేతరాజు
వ్యక్తినామం (రా).

కేతిరెడ్డి
వ్యక్తినామం (రా.).
కేతి_ గృ.నా.పూ; వి.చూ. కేతిరాజు.
చూ. _రెడ్డి గృ. నా. ప.

కేతు
పౌరుషనామం (రా.వ.).
?<సం. కేతి : ఖ్యాతి. ?<కేతువు : టెక్కెము, కాంతి, అగ్ని, శత్రువు. సూ. వి.

కేదారి
పౌరుష నామం (తె.).
<కేదారము వ్యవసాయ క్షేత్రం. దీనికి సంబంధించినవాడు కేదారి. ? <సం. కేదార— ; దేవతాసూచి. భార్య తల యందుగలవాడు. గంగాధరుడు, శివుడు,

కేదాసు
వ్యక్తినామం (తె.).
కే_ గృ.నా.పూ; ?<కేశ
చూ. –దాసు గృ.నా.ప.

కేశం
వ్యక్తినామం (వ.).
<కేశపమ్మ <సం. కేశప—

కేశరాజు
చూ. కేశవరాజు
వ్యక్తినామం (వ.).
కేశ_ గృ.నా.పూ; దేవతాసూచి ఆర్వేల నియోగ బ్రాహ్మణులలో ఇంటిపేరు.
చూ. _రాజు గృ.నా.ప.

కేశవభట్ల
వ్యక్తినామం (వ.).
కేశవ_గృ.నా.పూ; పు. నా; వి. చూ. కేశవరాజు. వైదికులలో ఇంటిపేరు.
చూ. _భట్ల గృ. నా. ప.

కేశవరాజు
రూ. కేశరాజు, కేశిరాజు, కేసిరాజు.
వ్యక్తినామం (వ.).
కేశవ_ గృ. నా. పూ; దేవతాసూచి. <సం. కేశవ : కేశవుడు. కేశి అనే రాక్షసుణ్ణి చంపినవాడు (విష్ణువు). ఆర్వేలనియోగులలో ఇంటిపేరు.
చూ. _రాజు గృ.నా.ప.

కేశాప్రగడ
వ్యక్తినామం (వ.).

కేశా– గృ.నా.పూ; పు.నా. కేశ+ఆ. వి.చూ. కేశవరాజు. ఆర్వేల నియోగులలో ఇంటిపేరు. చూ. –వ్రగడ గృ. నా. ప.

కేశినేని

రూ. కేసినేడి

వ్యక్తినామం (రా.స.).

కేశి– గృ.నా.పూ; వి.చూ. కేశవరాజు. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. నేని గృ.నా.ప.

కేశిమతము

మతసూచి (స.).

?< కేశవమతం. వైష్ణవమతం. కేశి– వెన్నుడు. వెన్నునిమతం వైష్ణవం.

కేశిరాజు

చూ. కేశవరాజు

వ్యక్తినామం (తె.).

ఆర్వేల నియోగి బ్రాహ్మణులలో ఇంటిపేరు.

కేసని

చూ. కేసాని

వ్యక్తినామం (స.).

< కేసాని. గౌడకులంలో ఇంటిపేరు.

కేసరి

అడవిజంతుసూచి (తె.).

సింహం, ఖేచరం. బ్రాహ్మణులలో ఇంటిపేరు. ?< కేసర అనే గ్రామనామో త్పన్నంకూడ కావచ్చు.

కేసరినేని

వ్యక్తినామం (.స.).

కేసరి– గృ. నా. పూ; జంతుసూచి. సింహం. కమ్మవారిలో ఇంటిపేరు. ?< కాసరనేని. చూ. –నేని గృ.నా.ప.

కేసాని

రూ. కేసన

వ్యక్తినామం (స.).

కే– గృ.నా.పూ; వ్య.నా. దేవతాసూచి. < కేశవ– కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. –సాని గృ.నా.ప.

కేసినేడి

చూ. కేశినేని

వ్యక్తినామం (తె.స.).

కమ్మవారిలో ఇంటిపేరు. కేసి< కేశి < కేశవ. "–కేశవరాజు చెన్నప్ప–" శా. 1480. (టి. యం. పి పు. 588; నెం. 137).

కేసిరెడ్డి

వ్యక్తినామం (తె.).

కేసి – గృ.నా.పూ; పు. నా. వి. చూ. కేసిరాజు. చూ. –రెడ్డి గృ.నా.ప.

కేసెట్టి

వ్యక్తినామం (తె.).

కే– గృ.నా.పూ; ?< కేసి. వి. చూ. కేసిరాజు. చూ. –సెట్టి గృ.నా.ప.

## కై

కైవారం

పౌరుషనామం (తె.స.).

<కైవారము : స్తోత్రం, పొగడ్త. త. కైవారమ్. చెయ్యెత్తి రాజులను, పెద్దలను కీర్తించేవారు. బ్రాహ్మణులలో గృహనామం.

## కొ

కొక్కు

జంతుసూచి (స.).

పందికొక్కు.

కొక్కెర

రూ. కొంగర.

పక్షిసూచి. (స.).

పెద్దకొంగ.మహాబకం, కొక్కిరాయి.

కొంగ

రూ. కొంగల

పక్షిసూచి (స.).

క్రౌంచపక్షి, బకం. త. కొక్కు; మ. కొక్కు; కొక్కన; కొచ్చ; తె. కొంగ,కొక్కెర, కొక్కిరాయి.డి.ఇ.డి. 1767.

కొంగర

చూ. కొక్కెర

పక్షిసూచి (తె.స.)

కమ్మ వారిలోను. పద్మ సాలీలలోను ఇంటిపేరు.

కొంగల

చూ. కొంగ

పక్షిసూచి (తె.స.).

కొంగ బహు. కు ద్వి. వి. కమ్మ వారిలో ఇంటిపేరు.

కొజ్జా

పౌరుషనామం (స.).

<హిం. ఖోజా : ఖ్వాజా, ఖ్వాజా.

కొటికె

పౌరుషనామం (రా.).

<కొటిక : వామనుడు. పొట్టివాడు.

కొట్టరు

చూ. కొట్టారి

వృత్తిసూచి (సా.).

"—కవిజన రాజకీర సహకారముఁ గొట్టరు మంత్రి తిక్కనిన్." (దశకు. 1_8).

కొట్టరువు

చూ. కొట్టారి

వృత్తిసూచి (వ.సా.).

"—కొట్టరువు తిక్కనామాత్యుండు నిజకుల—" (దశకు.1_20) "—ఆతని తమ్ముడు భువనఖ్యాతుడు కొట్టరువు కొమ్మడు—" (దశకు. 1_48).బ్రాహ్మణులలో ఇంటిపేరు.

కొట్టారి

రూ. కొట్టరు. కొట్టరువు, కొట్టూరి.

వృత్తిసూచి (శా.).

<ప్రా. కొట్టాఆర–, కొట్టార– <సం. కోష్ఠాగార–; త. కొట్టారమ్; క. కొట్టార. ధాన్యం మొదలైనవాటిని నిల్వచేసే కొట్టు. "—కొట్టారి కేసప దాసిని కోట కేసవదాసిని—" (యస్. ఐ.ఐ. IV; పు. 198; నెం. 659). కోష్ఠాగారానికి అధిపతులుగా ఉన్నవారికి ఇది గృహనామం.

**కొట్టియ**

వృత్తిసూచి (శా.).

<ప్రా. కోట్ఠియ– <సం. కోష్ఠక– పసులకొట్టాం. "—కొట్టియ మల్లయన్." శా. 1457 (టి.టి.డి. ఇ. యస్. IV; పి. 129; నెం. 65).

**కొట్టు**

పౌరుషనామం (వ.).

సామానుంచేగది <ప్రా. కోట్ఠ<సం. కోష్ఠ–

**కొట్టూరి**

చూ. కొట్టారి

వృత్తిసూచి (వ.).

రెండవ వెలనాటి కులోత్తుంగ చోడ రాజు దగ్గర నిడుబ్రోలి సబ్బునాయకుడు కొట్టాలపై అధికారిగా ఉన్నాడు. అందువలన వీరివంశీకులు కొట్టూరివారయ్యారు. ఇతని కుమారుడైన కొట్టూరి ఎరియమ నాయకుడు శా. శ. 1085 వ సం॥లో ఒక శాసనం వేయించాడు. ఇతడుకూడ కోష్ఠములపై అధికారిగా వెలనాటి కులోత్తుంగ చోడ నృపాలుని వద్ద ఉన్నట్లు అతని శాసనాల వలన తెలుస్తుంది. ఇతని తండ్రికి 'నిడుబ్రోలి' గృహనామం ఉండి, తరువాత వీరి వంశంవారికి నిడుబ్రోలు మారిపోయి 'కొట్టూరి' గృహనామం కలిగిందని తెలుస్తుంది. కమ్మవారిలో ఇంటిపేరు.

**కొడవటి**

చూ. కొడవలి

వృత్తివరికరసూచి స.).

కొడవలికి ద్వి.వి.

**కొడవలి**

రూ. కొడవటి, కొడవంటి, కొడవళ్ళ.

వృత్తిపరికరసూచి తె.వ.).

లిక్క–. వక్రాకారంతో పదునుకల్గి గడ్డి మొదలైనవి కోయడానికి ఉపయోగించే సాధనం. కమ్మ, కర్ణ సాలీలలో ఇంటిపేరు. బహు: కొడవలులు, కొడవళులు, కొడవళ్ళు, కొడవండులు, కొడవండ్లు. త. కొటువాళ్; తె. కొడవలి, కొడలి, కొడెలి, కొడ్వలి; కోలా. కొడవల్. డి.ఇ.డి. 1709.

**కొడవంటి**

చూ. కొడవలి.

వృత్తిపరికరసూచి (వ.).

కొడవలికి ద్వి.వి.

కొడవళ్ళ

చూ. కొడవలి

వృత్తిపరికరసూచి (స.).

కొడవలి బహు. కు. ద్వి.వి. కమ్మ వారిలో ఇంటిపేరు.

కొడుకుల

సంబంధసూచి (స.).

కొడుకు బహు. కు ద్వి.వి. మగశిశువు, బాలుడు. 'కొడుకు అనే శబ్దానికి మొదట బాలుడనే అర్థంవుండి తరువాత పుత్రుడు అనులాక్షణికార్థం కలిగినట్లు కనబడు చున్నది. ఈ శబ్దానికి గల రెండుఅర్థాలు భట్టారకుని కవిత్వంలో కన్పిస్తున్నాయి. సూ.ని. పేరూరి ద్రావిడులలోను, వెల నాటి వైదిక బ్రాహ్మణులలోను గృహ నామం.

కొణతం

ఆయుధసూచి (స.).

<కొణతము. మల్లసాధన విశేషం.

కొండ

రూ. కొండా

పర్వతసూచి (తె.స.).

పర్వతం, గుట్ట. బ్రాహ్మణులలో ఇంటిపేరు. క. కొండ; మ. కున్ను; త. కున్ఱు; పర్జి. కొండి. ఇది వ్యక్తి నామ పూర్వపదాను బంధాలుగాను, గ్రామనామ పూర్వపరపదాను బంధాలు గాను కన్పిస్తున్నాయి. ఉదా: కొండయ్య, అప్పలకొండ; కొండపల్లి, వినుకొండ.

కొండక్రింద

నివాససూచి (రా.).

కొండ– గృ.నా.పూ: వి.చూ. కొండ. కొండ కిందున్న ప్రదేశం. కొండ కింద నివసించేవారు. హరిజనులలో, కురబలలో ఇంటిపేరు.

కొండపడ్మటి

<కొండపడుమటి

దేశసూచి (శా.).

"—కొండపడ్మటి బుద్ధరాజు" (యస్. ఐ.ఐ.IV: పు.210;పం.10; నెం. 678). "—మహామండలేశ్వర కొండపడ్మటి మల్లెరాజు—" (యస్. ఐ. ఐ. IV; పు. 223; పం. 2; నెం. 685). ఈసీమ కు నాదెండ్ల ప్రధాననగరమని కమ్మ.చ.

కొండపునేని

వ్యక్తినామం (స.).

కొండపు– గృ. నా. పూ; వ్య. నా.< కొండప్ప. కొండ+అప్ప. కొండ–పర్వత సూచి. –పు– చూ. –అప్ప. గృ. నా. ప. చూ. –నేని గృ.నా.ప.

కొండబోతుల

వ్యక్తినామం (రా.స.).

కొండ– గృ. నా. పూ; పర్వతసూచి. వి. చూ. కొండపనేని.

చూ. –బోతుల గృ. నా. ప.

కొండబోయిన

వ్యక్తినామం (స.).

కొండ– గృ. నా. పూ; పర్వతసూచి. వి. చూ. కొండపనేని.

చూ. –బోయిన గృ.నా.ప.

కొండం

వ్యక్తినామం (స.).

కొండమ < కొండ+అమ్మ. కొండ– గృ. నా. పూ; వి.చూ. కొండ; –అమ్మ చూ. గృ నా.ప.

కొండమరాజు

వ్యక్తినామం (శా.).

కొండమ–గృ.నా.పూ; స్త్రీ.నా. వి.చూ. కొండం. చూ. –రాజు గృ. నా. ప

"—అత్మకూరిలోని శిరివరం స్థళకరణం భీమరాజు పుత్రులయిన కొండమరాజు తింమయ్యకు పుత్రుండయిన—" 21–3–1545 ఎ. డి.(టి.టి.డి.ఇ యస్. V; పు. 100).

కొండమీది

నివాసస్థలసూచి (స.).

కొండ–గృ.నా.పూ; వి. చూ. కొండ. –మీది : పైన, ఉపరిభాగం.

కొండముది

పౌరుషనామం (స.సా.).

వ్యుత్పత్తి అస్పష్టం.

"–శ్రీకొండముది కులక్షీరాబ్ధి చంద్రు డౌ శ్రీరామ—" (శ్రీదీక్షి. 1–23).

కొండరాతి

శిలాసూచి (స.).

కొండరాయికి ద్వి.వి. పెద్ద బండరాయి.

కొండవిందుల

అస్పష్టనామబంధం (సా.).

"కొండవిందుల వారు, గోవిందుల వారు—' (వల్నా. పు. 15; పం.213).

కొండసాని

వ్యక్తినామం (రా.స.).

కొండ– గృ.నా.పూ; వి.చూ. కొండ కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. –సాని గృ.నా.ప.

కొండా

చూ. కొండ

పర్వతసూచి (రా.స.).

కొండాజోస్యుల

వ్యక్తినామం (తె.).

కొండా– గృ. నా. పూ; పు. నా. <కొండయ< కొండ+అయ్య. వి.చూ. కొండపనేని. బ్రాహ్మణులలో ఇంటిపేరు. చూ. –జోస్యుల గృ.నా.ప.

కొండారెడ్డి

రూ. కొండ్రెడ్డి

వ్యక్తినామం (తె.).

కొండా – గృ.నా.పూ; పు.నా. వి.చూ. కొండపనేని. చూ. –రెడ్డి గృ.నా.ప.

కొండావరఘుల

వ్యక్తినామం (స.).

కొండా_ గృ. నా. పూ; వి. చూ. కొండపనేని. చూ. _వరఘుల గృ.నా.వ.

కొండి

సంబంధసూచి (స.).

తేలు తోక, రెక్కతలుపు అంచుల యందు అమర్చు తేలుతోక పంటి ఇనుప గొండ్లెము. శ.ర.

కొండిబత్తిని

వ్యక్తినామం (రా.).

కొండి_ గృ.నా.పూ; వ్య.నా; వి.చూ. కొండపనేని. చూ. _బత్తిని గృ.నా.వ.

కొండిసెట్టి

వ్యక్తినామం (స.).

కొండి_ గృ. నా. పూ: పు. నా. <కొండయ. వి. చూ. కొండపనేని.

చూ. _సెట్టి గృ.నా.వ.

కొండుగారి

వ్యక్తినామం (రా.).

కొండు_ గృ.నా.పూ., చూ. _గారి గృ. నా. వ.

కొండుభట్ల

వ్యక్తినామం (తె.).

కొండు_ గృ. నా.పూ; ? < కొండా. బ్రాహ్మణులలో ఇంటి పేరు.

చూ. _భట్ల గృ.నా.వ.

కొండోజి

చూ. కొండోజు

వ్యక్తినామం (తె.).

కొండోజు

వ్యక్తినామం (తె.).

కొండ_ గృ.నా.పూ: వి. చూ. కొండపనేని. చూ. _ఓజు గృ.నా.వ.

కొంద్ర

సంబంధసూచి (తె.).

ఒకసారి చాలు చుట్టిన కొలదిగల పొలముచుట్టు దున్నినచాలు నడిమినేల, మళ్లించి దున్నిన చాలు. సూ వి.

కొంద్రాజు

వ్యక్తినామం (సా.).

కొండ_ గృ. నా. పూ; పర్వతసూచి. వి. చూ. కొండపనేని.

చూ._ రాజు గృ.నా.వ. "__వర విద్యామహా కొంద్రాజు వేంకటాద్రి నరేంద్రా__" (ఆం. నామం. పు. 172). "__ భారద్వాజ గోత్ర జక్కరాజ యెఱ్ఱనామాత్య పుత్ర__" (పైది. ఆశ్వా. గ.పు. 172).

కొంద్రెడ్డి

చూ. కొండారెడ్డి

వ్యక్తినామం (రా.).

కమ్మవారిలో ఇంటిపేరు.

కొత్త

పౌరుషనామం. (తె.రా.స.సా.)

< క్రొత్త. క్రొత్తగా, నూతనంగా. కమ్మవారిలో ఇంటిపేరు. "-- చెరుకూనూళ్ల ఘనగోత్రస్ఫూర్త కొత్తాన్వయోన్మను రూపోజ్వల--" (రాఘవా. VI - 369).

**కొత్తకాపు**
పౌరుషనామం (తె.).
కొత్త - గృ.నా.పూ; వి.చూ. కొత్త. -కాపు చూ. కాపు.

**కొత్తింటి**
వివాహ స్థలసూచి (రా.స.).
కొత్త + ఇల్లు కొత్తిల్లుకు ద్వి.వి.
కొత్త- వి.చూ. కొత్త.

**కొనిగర్ల**
చూ. కొనిగొర్ల
జంతుసూచి (స.).
యాదవులలో ఇంటిపేరు.

**కొనిగొర్ల**
రూ. కొనిగర్ల
జంతుసూచి (స.).
కొని – గృ. నా. పూ; < కొన్ని. కొంత శబ్దానికి అమహదర్థక బహువచనం ఆదేశంగా వచ్చింది. యాదవులలో ఇంటిపేరు.
చూ. - గొర్ల గృ. నా. ప.

**కొప్పనాథం**
వ్యక్తినామం (స.).
కొప్ప – గృ. నా. పూ. ? < కుప్ప
చూ. -నాథం .గృ. నా. ప.

**కొప్పరాజు**
వ్యక్తినామం (స.).
కొప్ప- గృ. నా. పూ; వి.చూ. కొప్పనాథం. ఆర్వేల నియోగులలో ఇంటిపేరు. చూ.-రాజు గృ.నా.ప.

**కొప్పిసెట్టి**
వ్యక్తినామం (స.).
కొప్పి- గృ. నా. పూ; కొప్ప + ఇ. వి. చూ. కొప్పనాథం.
చూ. -సెట్టి గృ.నా.ప.

**కొప్పుల**
రూ. కొంపుల
తెగసూచి (తె. స.).
కొప్పు బహు.కు ద్వి.వి. వెంట్రుకలతో పెట్టుకున్న ముడి. త. కొప్పు; క. కొప్పు డి.ఇ.డి. 1755. ' a section of Velamas, who tie the hair in a Knot (Koppu) on the top of the head, and an exogamus sept of Mutrasas whose females do up their hair in a knot when they reach to puberty" సి.టి.యస్.ఐ. III. పు. 424).

**కొప్పెర**
వస్తుసూచి (తె.).
కాగు, కటాహం. వెడల్పు మూతిగల చిన్నపాత్ర. సం.కర్పర-. తూర్పార పోసే మనిషి నెత్తిన పొట్టు, దువ్వ

పడకుండా వేసుకునే గోనెగూడ. కొన్ని చోట్ల గోనెలాగ మడత వేసిన కంబళి. మాం.వృ.వ; మ. కొప్పర; క.కొప్పర; తు. కొప్పరిగె; తె. కొప్పెర = metal boiler. డి.ఇ.డి. 1750.

కొబ్బరికాయల

వృక్షసూచి (తె.).

కొబ్బరికాయ బహు. కు ద్వి వి. కొబ్బరి– గృ.నా.పూ; నారికేళవృక్షం. వృ.నా : Cocos nucifera. త. కొప్పరై, కొప్పరి: మ. కొప్పర; క. కొబ్బరి, కొబరి; తె. కొబ్బరి, కొబ్బెర. డి.ఇ.డి. 1751. చూ. _కాయల గృ.నా.ప.

కొమర

రూ. కొమరా, కొమరి

వ్యక్తినామం (రా.స.).

<కొమరు <ప్రా. కుమారో– <సం. కుమార _ దేవతాసూచి. కుమారస్వామి.

కొమరనేని

రూ. కొమిరినేని

వ్యక్తినామం (స.).

కొమరి– గృ.నా.పూ; దేవతాసూచి. వి.చూ. కొమర. పీఠికాపుర సమీపంలో వున్న కుమారారామ గ్రామంలోవున్న దివ్యవాహినిని లేక స్వామిపుష్కరిణిని కొమరేఱు అంటారు.

చూ. _నేని గృ. నా. ప.

కొమరం

వ్యక్తినామం (తె.స.).

<కొమరమ <కొమర + అమ. కొమర– వి. చూ. కొమర;

_అమ. చూ. గృ.నా.వ.

కొమరా

చూ. కొమర

వ్యక్తినామం (రా.).

దేవతాసూచి. కోమట్లలో ఇంటిపేరు.

కొమరి

చూ. కొమర

వ్యక్తినామం (స.).

కొమరిసెట్టి

రూ. కొమిరిసెట్టి

వ్యక్తినామం (తె.).

కొమరి– గృ.నా.పూ; పు.నా; <కొమర + ఇ. కొమర.– వి.చూ. కొమర.

చూ. _సెట్టి గృ.నా.వ.

కొమరెడ్డి

వ్యక్తినామం (తె.).

కొమ– గృ. నా పూ; దేవతాసూచి <కొమర. వి.చూ. కొమర.

చూ. –రెడ్డి గృ.నా.వ.

కొమర్రాజు

వ్యక్తినామం (స.).

కొమర + రాజు. కొమర– గృ.నా.పూ. వి.చూ. కొమర. బ్రాహ్మణులలో ఇంటిపేరు. చూ. _రాజు గృ. నా. ప.

కొమిరిసేని

చూ. కొమరనేని

వ్యక్తినామం (స.).

కొమిరిసెట్టి

చూ. కొమరిసెట్టి

వ్యక్తినామం (తె.).

కొమర + ఇ.

కొంపుల

చూ. కొప్పుల

తెగసూచి (శా.).

"— కొంప్పుల—" (S.I.I. IV. పు. 251; line 5; No. 765)

కొమ్మ

పౌరుషనామం (స.).

శాఖ, కోట, శిఖరం.

కొమ్మన

చూ. కొమ్మనేని

వ్యక్తినామం (శా.స.).

"కొమ్మన సోమయాజులు—" శా. 1352 (T.M P. II; P. 1082; No. 287). ఇది సాహిత్యంలో వ్యక్తి నామంగా కన్పిస్తుంది. తిక్కన తండ్రి కొమ్మన. <కొమ్మ + అన్న. కమ్మ వారిలో ఇంటిపేరు.

కొమ్మనగారి

వ్యక్తినామం (రా.).

కొమ్మన– గృ.నా.పూ; పు.నా.వి.చూ. కొమ్మన. చూ. –గారి గృ.నా.ప.

కొమ్మనేని

రూ. కొమ్మన, కొమ్మినీడు.

కొమ్మినేవి.

వ్యక్తినామం (రా.స.).

కొమ్మ– గృ.నా.పూ: <కొమ్మయ. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. –నేని గృ. నా. ప.

కొమ్మబోల

వ్యక్తినామం (శా.).

కొమ్మ– గృ.నా.పూ; వి.చూ. కొమ్మ నేని. "కొమ్మబోల కాటియయు—" 1055 A.D. (E.T.I. P. 107, No. 27, line 7-8). "చామియబోయువంటి యయుబదియ బోయు దొడ్డియయు కొమ్మ బోల పెద్దియయు కొమ్మబోల తల్లి యయు—" 1066 A.D. (Ibid; పు. 119; నెం 137; పం. 6).

చూ. –బోల గృ.నా.ప.

కొమ్మరాజు

వ్యక్తినామం (స.).

కొమ్మ– గృ.నా.పూ; పు.నా. వి.చూ. కొమ్మనేని. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. –రాజు గృ.నా.ప.

కొమ్మాజోస్యుల

వ్యక్తినామం (తె.స.).

కొమ్మా– గృ. నా. పూ; కొమ్మ + అ. వి.చూ. కొమ్మనేని. బ్రాహ్మణులలో ఇంటిపేరు. చూ. –జోస్యుల గృ.నా.ప.

కొమ్మారెడ్డి
వ్యక్తినామం (స.).
కొమ్మా– గృ. నా. పూ; <కొమ్మ. వి. చూ. కొమ్మనేని. కమ్మవారిలో ఇంటిపేరు. చూ. –రెడ్డి గృ.నా.వ.

కొమ్మినీడు
చూ. కొమ్మనేని
వ్యక్తినామం (తె.స.).
కమ్మవారిలో ఇంటిపేరు.

కొమ్మినేని
చూ. కొమ్మనేని
వ్యక్తినామం (తె.రా.స.).
కమ్మవారిలో ఇంటిపేరు.

కొమ్మిసాని
వ్యక్తినామం (స.).
కొమ్మి– గృ.నా.పూ; <కొమ్మ+ఇ. వి.చూ. కొమ్మనేని. కమ్మవారిలో ఇంటిపేరు. చూ. –సాని గృ.నా.వ.

కొమ్మిసెట్టి
వ్యక్తినామం (స.).
కొమ్మ– గృ.నా.పూ; <కొమ్మ.వి.చూ. కొమ్మనేని. చూ. –సెట్టి గృ.నా.వ.

కొమ్ము
రూ. కొమ్ముల
పౌరుష నామం (తె.).
పశువుల కొమ్ము, పర్వత శిఖరం. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

కొమ్ముల
చూ. కొమ్ము
పౌరుషనామం (స.).
కొమ్ముబహు. కు ది.్వవి.

కొమ్మోజు
వ్యక్తినామం (స.).
కొమ్మ– గృ.నా.పూ; వి.చూ. కొమ్మనేని. చూ. –ఓజు గృ.నా వ.

కొయ్య
రూ. కొయ్యి
పదార్థసూచి (తె.).
చెక్క వస్తువులు చెయ్యడానికి ఉపయోగించే ముడి పదార్థం.

కొయ్యకూర
రూ. కొయ్యగూర.
వృక్షసూచి (తె.).
వృ.నా: Amaranthus spinosus.

కొయ్యగూర
చూ. కొయ్యకూర
వృక్షసూచి (స).

కొయ్యి
చూ. కొయ్య
పదార్థసూచి (రా.).

కొరివి
వృక్షసూచి (స. .
?< కొరివి <సం. కురవక– ఎర్ర గోరింటచెట్టు. కమ్మవా

? <కొఱవి. దే. ఉల్మకం. ? < గ్రామ నామం.

కొఱ్ర

చూ. కొఱ్ల

ధాన్యసూచి (తె.రా).

వృనా : Settaria italica. <కొఱ్ఱు: ప్రియంగు ధాన్యం; త. కొరల్; క.కొర్లె, కొఱలె; తె. కొఱ్రలు. డి.ఇ.డి. 1797.

కొఱ్ల

చూ. కొఱ్ర

ధాన్యసూచి (శా.).

<కొఱ్రలు. కొఱ్రబహు. కు ఔప. "స్వస్తిశ్రీ కొఱ్లిర్వేంగుళ కొడుగు—" (తె.శా. నెం. 7; పు.34).

కొలతల

కొలమాన సూచి (స.).

కొలతబహు.కు ద్వి.వి. ధాన్యాలను కొలిచేపరిమాణం.

కొలని

చూ. కొలను

జలసూచి (శా. సా.). కొలనుకు ద్వి.వి. సరస్సు. "— కొలని కాటమ నాయక—" (టి.యమ్.పి. II; పు. 717; నెం, 48బి.). "కొలని ప్రతాప నృప కుంజరుచేత వరేదుసారణీ—" (భీమే. 1-49).

కొలనిసామి

వ్యక్తినామం (శా.).

<తె. కొలని (<కొలను)+ సామి. "— కొలనిసామి నాయక—" శా. 1073 (టి.యమ్.పి. II; పు. 888; నెం. 121).

కొలను

రూ. కొలని

జలసూచి (తె.స.).

సం. కూలమ్; త. కుళమ్; క.కొళ. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

కొలసాని

వ్యక్తినామం (రా.స.).

కొల— గృ.నా.పూ; ?<కోల: కర్ర, బెత్తం. ?<కొల్ల <కొల్లు <కొల్ను < కొలను. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. —సాని గృ.నా.వ.

కొలసెట్టి

రూ. కొలిసెట్టి

వ్యక్తినామం (స.).

కొల— గృ.నా.పూ. వి.చూ. కొలసాని.

చూ. —సెట్టి గృ.నా.వ.

కొలిసెట్టి

చూ. కొలసెట్టి

వ్యక్తినామం (స.).

కొళువు

పౌరుషనామం (శా.).

?< కొలువు : సేవ. పరిచర్య. <కొలుచు.

**కొల్ల**

రూ. కొల్లా

పౌరుషనామం (తె.రా.న.).

సమృద్ధమైన, పుష్కలమైన, దోచు. క. కొళ్లె; త. కొళ్లై. ధాన్యం నిల్వచేసే పెద్ద మట్టిపాత్ర. మాం.వృ.ప.

**కొల్లపనేని**

వ్యక్తినామం (తె.స.).

కొల్లప_ గృ. నా. పూ; <కొల్ల+అవ. వి.చూ. కొల్ల. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. _నేని గృ. నా. ప.

**కొల్లా**

చూ. కొల్ల

పౌరుషనామం (తె.రా.న.).

కమ్మవారిలో ఇంటిపేరు.

**కొల్లారెడ్డి**

వ్యక్తినామం (తె.).

కొల్లా_ గృ. నా. పూ; వి.చూ. కొల్ల.

చూ. _రెడ్డి గృ. నా. ప.

**కొల్లి**

వృక్షసూచి (స.).

ఒకానొక వృక్షం (శ. ర.). కమ్మవారిలో, బ్రాహ్మణులలో ఇంటిపేరు.

**కొల్లు**

జలసూచి (స.).

<కొలను. నీటిగుంట. బ్రౌ.

**కౌశికనేడి**

వ్యక్తినామం (వ.).

కౌశిక_ గృ.నా.పూ; ? <సం. కౌశిక_

చూ. _నేడి గృ.నా.ప.

**కొసరాజు**

వ్యక్తినామం (స.).

కొస- గృ.నా.పూ; <కొసర_. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. _రాజు గృ. నా. ప.

**కొసిబోయిన**

వ్యక్తినామం (తె.).

కొసి_ గృ. నా. పూ. ?< కొసర.

చూ. _బోయిన గృ.నా.ప.

## కో

**కోక**

రూ. కోకల, కోకా.

వస్త్రసూచి (తె.).

వాడుకలో ఈపదం స్త్రీలు కట్టుకునే వస్త్రానికి మాత్రమే పరిమితమయింది.

**కోకల**

చూ. కోక

వస్త్రసూచి (రా.న.).

కోక బహు. కు ద్వి, వి. గొల్లలలో ఇంటిపేరు.

**కోకా**

చూ. కోక

వస్త్రసూచి (రా.స.).
కమ్మ, కాపు. మాల కులాలలో ఇంటి పేరు.

**కోకిల**

పక్షిసూచి (స.).
పికం, కోయిల. ప్రా. కోఇల-; సం. కోకిల-; మ. కుయిల్; క.కుకిల్; త. కుయిల్. డి.ఇ.డి. 1470.

**కోట**

రూ.కోట్ల
దుర్గసూచి (తె.శా.స.సా.). దుర్గ ప్రాకారం; రాజధాని చుట్టూ ఉండే ప్రహరి; చుట్టూ ప్రహరీగల రాజనివాస మైన పట్టణం. కమ్మవారిలో, బ్రాహ్మణు లలో ఇంటిపేరు. <సం. కోట- శబ్ద భవమని సూ.ని; వైకృత విశేష్యమని శ.ర. గ్రామనామ పూర్వపదాలలోను, పర పదాలలోనూ కన్పిస్తుంది.
ప్రా. కోట్ట, కోట; సం. కోట; త. కోట్టై; మ.కోట్ట; క. కోటె; డి.ఇ.డి. 1831. బ్రాహ్మణులలోను, బలిజలలోను శాఖాభేదంగా, పద్మసాలీలలో గృహ నామంగా ఉంది. కాళాహస్తివద్ద కోట గ్రామానికి కోట గృహనామం కలవారి పూర్వీకులు కరణీకం చేసి నందుకు ఈ ఇంటిపేరు వచ్చిందని ప.ఆం.సా. IX. పు. 249. "— కోట కేత మహారాజ—" శ. 1131. (టి. యమ్.పి.II; పు. 760; నెం. 119). "— కోట బేతరాజ—" (టి.యమ్.పి. II; పు. 767; నెం. 170). "— కోట సింగరాజు మాట వాసియెగాని—" (చాటు. పు. 64).

**కోటమనేని**

వ్యక్తినామం (స.).
కోటమ- గృ.నా.పూ; స్త్రీ.నా. < కోటమ్మ. కోట+అమ్మ. కోట పూర్వ పదంగాగల వ్యక్తినామాలు కోటయ్య, కోటప్ప. చూ. -నేని గృ.నా.ప.

**కోటమరాజు**

చూ. కోటంరాజు
వ్యక్తినామం (తె.స.).
కోటమ- గృ.నా.పూ; వి.చూ. కోటమ నేని. ఆర్వేల నియోగ బ్రాహ్మణులలో ఇంటిపేరు. చూ. -రాజు గృ. నా. ప.

**కోటంరాజు**

చూ. కోటమరాజు
వ్యక్తినామం (స.).
<కోటమ

**కోటి**

వృత్తిసూచి (రా.శా.).
వేగులవాడు, చారుడు. కోటిగాడు అని వాడుకలో వుంది. ?< కోటయ. వ్యక్తి నామం. ?< కోటి; నూరు లక్షలు.
"— కోటి తిరువెంగళనాథయ్య—" శా. 1487 (టి.యమ్.పి II; పు. 783; నెం. 337).

**కోటినేడి**

వ్యక్తినామం (వ.).
కోటి– గృ. నా.పూ;పు.నా. <కోటయ వి. చూ. కోటమనేని
చూ. –నేడి గృ. నా. వ.

**కోట్ల**

చూ. కోట
దుర్గసూచి (వ.).
<కోటలు. కోటబహు.కు ద్వి.వి.

**కోడి**

రూ. కోళ్ళ
పక్షిసూచి (రా.వ.).
కుక్కుటం. కమ్మ, కాపులలో ఇంటి పేరు. త. కోఴి; మ. కోఴి; తు. కోరి; క.కోళి; కోళి; ప్రా. కుక్కుటో–నం. కుక్కుట– డి.ఇ.డి. 1862.

**కోడికాండ్ల**

పక్షిసంబంధసూచి. (రా.).
కోడికాలు బహు.కు ద్వి. వి. కమ్మ వారిలో, బోయకులంలో ఇంటిపేరు.

**కోడిగుడ్ల**

పక్షిసంబంధసూచి (రా.).
కోడిగుడ్డు బహు. కు ద్వి. వి. కమ్మ వారిలో ఇంటిపేరు.

**కోడిపుంజుల**

పక్షిసూచి (రా.).
కోడిపుంజు బహు.కు ద్వి. వి.

**కోడిబోయిన**

చూ. కోడెబోయిన
వ్యక్తినామం (వ.).

**కోడిరెక్కల**

పక్షిసూచి (వ.).
కోడిరెక్క బహు.కు ద్వి. వి.

**కోడె**

రూ. కోడెల
జంతుసూచి (వ.సా.).
కాడికి మరపదగిన దూడ, గిత్త. శ.ర. కమ్మవారిలో ఇంటిపేరు. గోవు మొదలైన వాని మగదూడ, ఎద్దు, వృషభం. సూ.ని. తె.కోడియ, కోడె; కుయి. కోడి డి.ఇ.డి. 1823. "––శ్రీకోడెవంశాబ్ధి సీతకరుండైన––" (కోడెరా. 1–1.).

**కోడెబోయిన**

రూ. కోడిబోయిన
వ్యక్తినామం (వ.).
కోడె– గృ. నా. పూ; వి.చూ. కోడె.
చూ. –బోయిన గృ. నా. వ.

**కోడెల**

చూ. కోడె

జంతుసూచి (వ.).

కోడె బహు.కు. ద్వి.వి. కమ్మవారిలో ఇంటిపేరు.

## కోణ

రూ. కోన

స్థలసూచి (తె.శా.స.).

"—కోణ భీమరాజ—" టి.యం.పి. II; పు. 726; నెం. 119). "—కోణ పత్యరాజ —" (టి.యం.పి. II. పు. 729; నెం. 151).

## కోణంగి

రూ. కోనంగి

పౌరుషనామం (రా.).

అంగాలను వికారంగా చూపి జనులను నవ్విస్తూ భిక్షమెత్తే దాసరి. త. కోట్టి, కోణంకి; మ. కోట్టి; క. కోటంకి. డి.ఇ.డి. 1830.

ఈ అర్థంతోనే అల్లరి చేస్తున్న పిల్లల్ని కోణంగి అని, కొంటె కోణంగి అనీ, కోనంగివాడనీ పిలుస్తారు.

## కోతల

< కోయు.

పౌరుషనామం (రా.).

కోయవారిలో ఇంటిపేరు.

## కోతుల

జంతుసూచి (తె.వ.).

కోతి బహు.కు. ద్వి.వి. మర్కటం, వానరం. కోతులను ప్రదర్శిస్తూ తిరిగే ఎరుకలవారు కోతివారని సి.టి.యస్.ఐ. త. కురన్కు, కోన్తి; మ. కురణ్ణు; క. కోరణి, కోతి; తు. కోతి; తె. కోతి. డి.ఇ.డి. 1473.

## కోదండ

ఆయుధసూచి (రా.).

< కోదండం. విల్లు, ధనస్సు. ముప్పై రెండు ఆయుధాలలో ఒకటి. ?< కోదండము : ఉపాధ్యాయుడు బాలుణ్ణి దండించే సాధనం. నేరం చేసిన బాలుడు పట్టుకొని వేలాడటానికి పైన కట్టిన తాడు. త. కోదండం; క. కోదండ.

## కోదండిగారి

వ్యక్తినామం (రా.).

కోదండి– గృ.నా.పూ. < కోదండయ <కోదండ + అయ. కోదండ– దేవతాసూచి, కోదండం కలవాడు. కోదండం, కోదండ మొదలైనవి వ్యక్తినామంగాను, వ్యక్తినామ పూర్వపదంగాను వున్నాయి. చూ. –గారి గృ.నా.వ.

## కోన

రూ. కోణ

స్థలసూచి (వ.).

లంక, అంచు, లోయ, మూల, అగ్రం,

అడవి. సం. కోణ-; క. కోణె; త. కోణమ్.

కోనంగి

చూ. కొణంగి

పౌరుషనామం (రా.శా.).

దేవాంగులలో ఇంటిపేరు.

"-- కోనంగి సిద్ధప్ప నాయకవ్--" శా. 1139 (టి.యం.పి. II; పు. 693).

కోనంభట్ల

వ్యక్తినామం (స.).

కోనం- గృ. నా. పూ; < కోనమ్మ <కోన+అమ్మ. అడవిదేవత. అడివి+అమ్మ: అడివమ్మ అనే వ్యక్తినామం సర్కారు జిల్లాల్లోవుంది. కరణ కమ్మలలో ఇంటిపేరు. చూ. -భట్ల గృ.నా.ప.

కోనంరాజు

వ్యక్తినామం (స.).

కోనం- గృ. నా. పూ; స్త్రీ.నా < కోనమ్మ, వి.చూ. కోనంభట్ల. బ్రాహ్మణులలో ఇంటిపేరు. చూ.-రాజు గృ.నా.ప,

కోనంరెడ్డి

వ్యక్తినామం (స.).

కోనం- గృ.నా.పూ: స్త్రీ.నా<కోనమ్మ వి.చూ. కోనంభట్ల. బ్రాహ్మణులలో ఇంటిపేరు. చూ. -రాజు గృ. నా. ప.

కోనసీమ

భూసూచి (స.).

కోన- మూలమన్న, లోయ, కోన, అగ్రం. వి.చూ. కోన. కోణమందున్న భూమి. ఇదే కోనసీమ.

కోనేటి

చూ. కోనేరు

జలసూచి (రా.శా.స.సా.).

కోనేరుకు ఔప.

"రాయదళవాయి కోనేటి నాయని వెంకటపతి నాయుడు--" శా. 1580. (టి.యం.పి. I. పు. 19; నెం. 265). "-- కోనేటి చిన తిమ్మరాజు--" శా. 1507 (టి.యం.పి. పు. 622; నెం. 538). "-- కోనేటి తిరువెంగళ నాదయ్యగారు --" శా. 1446. (టి. యం.పి. II; పు. 803.) "-- కోనెటి చినతిమ్మ నృపకుంజరు --" (రామా. పీ-40). "--అరాతులం దునుము కోనెటి తిమ్మ నరేంద్రు--" (సుద. 1-19). "ఔదార్య రాజరాజు కోనేటి తిమ్మరాజు --" (సుద. 1-21). "-- సకల సద్గుణ సాంద్రుడునగు కోనేటి దీక్షిత చంద్రుడు--" (Tel.M. పు.252).

కోనేరు

రూ. కోనేటి

జలసూచి (రా.స.).

చుట్టూ మెట్లు కట్టిన వలుచదరపు చెరువు, పుష్కరిణి. ? కోన+ఏఱు,

త. కోనేరి; క. కోనేరి. కోనేరు తవ్వించినవారో లేక కోనేటిని అభివృద్ధి చేసిన వారో కావచ్చు.

**కోమటి**

కులసూచి (తె.రా.శా.స.సా.).

వైశ్యుడు. తె. కోమటి; త. కోమట్టి; మ. కోమట్టి; క. కోమటి; తు. కోమటి; డి.యి.డి. 1840. సం. కార్పటిక-.కమ్మ, వైశ్యకులాలలో ఇంటిపేరు. "— కోమటి వెంకటరెడ్డి—" శా.1395–1423 (టి.యం.పి. II. పు. 771; నెం. 209). "— ఏలెఁగోమటి వేమన యిరువ దేను —" (చాటు. పు. 15). ఇది గొప్ప వ్యాపారకులం. ప్రతి జిల్లాలోనూ ఉంది. కొ– మతి అంటే మనస్తత్వం. కోమట్ల వ్యాపారంలోవున్న జిత్తులమారి తనానికి ఇది తార్కాణం. కోమటి పదానికి మరో కారణం : గో–మతి; గోవులను కలిగి వున్నవారని కొందరు, గోవులాంటి మనస్తత్వం కలవారని కొందరంటారు. సంస్కృత పదమైన గోమతి 'కోమటి' అయిందంటారు. మునికుల; అమలక, అనుముల; తులసి; చింత; పుచ్చ; దానరి; సకలా మొదలైనవి వీరి గృహనామాలు సి.టి.యస్.ఐ. III. 306.

**కోమటిసీడు**

చూ. కోమటినేని

వ్యక్తినామం (స.).

కమ్మవారిలో ఇంటిపేరు.

**కోమటినేని**

రూ. కోమటిసీడి

వ్యక్తినామం (స.).

కోమటి– గృ.నా.పూ; వృత్తిసూచి. వి.చూ. కోమటి. కమ్మవారిలో ఇంటి పేరు. చూ. –నేని గృ.నా.వ.

**కోమిసెట్టి**

వ్యక్తినామం (తె.).

కోమి– గృ.నా.పూ; పు.నా. కోమయ్య <కోమ+అయ్య. కోమ – పుట్టచివర, వల్మీకాగ్రం. చూ. –సెట్టి గృ.నా.వ.

**కోయ**

రూ. కోయి.

జాతిసూచి (స.).

గోదావరి జిల్లాల్లో వున్న కొండజాతి. వీరు గోండ్ కుటుంబానికి చెందినట్లు చెప్పుకుంటారు. వీరి భాష గోండి భాషా మాండలికమని గ్రియర్సన్ చెప్పారు. Mr. H.A. Stuart says "Khonds call themselves 'Kui' a name identical with 'Koi' or 'Koya'". బస్తర్ లోని ఎత్తైన మైదానాలలో కరువులు, కలహాలు వచ్చినప్పుడు అక్కడ నుండి రెండువందల సంవత్సరాల క్రితం తరుమబడ్డారట. సి.టి యస్.ఐ. IV 37. ఈకులనామం సర్కారు జిల్లాల్లో గృహనామంగా వుంది. కమ్మవారిలోనూ ఇది ఇంటిపేరుగా వుంది,

కోయి

చూ. కోయ

జాతిసూచి (రా.స.).

<కోయ. కోయజాతివాడు. కాపులలో కూడ ఇది గృహనామంగా వుంది.

కోరు

పౌరుషనామం (స.).

<సం. కార– రాజుల కిచ్చే ధనం కాకుండా వస్తురూపమైన కప్పం. ?<కోరు: వాంఛించు. క.కోరు; త.కోరు; మ. కోరు; తు. కోరు.

కోలాట

పౌరుషనామం (రా.).

<కోలాటము : కోల+ఆట. ఒక విధమైన ఆట. చేతిలోని కోలలతో స్త్రీలు తాళం వేస్తూ పాడుతూ గుండ్రంగా తిరుగుతూ ఆడేఆట. కోలతో ఆడేఆట కోలాటం. కోల– చేతికర్ర, బెత్తం. కమ్మవారిలో ఇంటిపేరు. త.కోలాట్టం.

కోలిసెట్టి

చూ. కొలిసెట్టి

వ్యక్తినామం (స.).

కోళ్ళ

చూ. కోడి

పక్షిసూచి (స.).

కోడి బహు. ఉద్వి. వి. కాపు, చాకలి వారిలో ఇంటిపేర్లు.

కోవి

పౌరుషనామం (రా.).

సస్యనాశం. కమ్మవారిలో, హరిజను లలో ఇంటిపేరు.

కోవెల

పౌరుషనామం (స.).

<కోయిల <త. కోయిల్ : దేవుని ఆవాసం, దేవాలయం.

## క్రి

క్రిష్ణంసెట్టి

వ్యక్తినామం (స.).

క్రిష్ణం–గృ.నా.పూ; సం. దేవతాసూచి. కృష్ణుడు. <క్రిష్ణమ్మ : క్రిష్ణ+అమ్మ : చూ. –సెట్టి గృ. నా. ప.

## క్రో

క్రొవ్విడి

అస్పష్టనామబంధసూచి (సా.).

?<క్రొవ్వు+ఇడి. "...వీరులు దారుణ నారువేల వారలఘు పవిత్రులందు..... క్రొవ్విడి వారలారయిున్..." (శ్రీ చిత్రభా. పు. 5).

## క్ష

క్షత్రి

పౌరుషనామం (స.).

క్షత్రియస్త్రీ, రాచకులంవాడు.

## క్షీ

క్షీరసాగర

జలసూచి (స.).

<క్షీరసాగరము. పాలసముద్రం.

మాధ్వులలో ఇంటిపేరు.

# గ

గంగ

చూ. గంగా

జలసూచి (తె.).

హిమాలయ పర్వతాల నుండి ప్రవహిస్తున్న భాగీరథినది.

గంగదారి

వ్యక్తినామం (తె.).

?<గంగధారి. గంగను ధరించినవాడు. ఈశ్వరుడు. చక్రధారిలానే ఇదికూడ వ్యక్తినామం కావచ్చు.

గంగదాసు

వ్యక్తినామం (స.).

గంగ– గృ.నా.పూ; స్త్రీ.నా. దేవతా సూచి. గంగాదేవి. వి.చూ. గంగ. ?< గంగ+అమ్మ. గంగమ్మ. గంగానమ్మ ఒక గ్రామ దేవత.

చూ. –దాసు గృ.నా.ప.

గంగపరస

పౌరుషనామం (రా.).

గంగ– గృ. నా. పూ; వి.చూ. గంగ. –పరస చూ. పరసా. గంగపరస రాయలసీమలో జరిగే ఒక సంతపేరు. కాపులలో ఇంటిపేరు.

గంగరాజు

వ్యక్తినామం (స.).

గంగ– గృ.నా.పూ; దేవతాసూచి. వి.చూ. గంగదాసు. ఆర్వేల నియోగి బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. –రాజు గృ.నా.ప.

గంగసాని

వ్యక్తినామం (తె.స.).

గంగ– గృ.నా.పూ; దేవతాసూచి. వి.చూ. గంగదాసు.

చూ. –సాని గృ.నా.ప.

గంగా

చూ. గంగ

జలసూచి (తె,స.).

కమ్మవారిలో ఇంటిపేరు.

గంగాదేవి

వ్యక్తినామం (రా.స.).

గంగా– గృ.నా.పూ; స్త్రీ. నా. దేవతా సూచి. <గంగ+అ. గంగ– వి. చూ. గంగదాసు. చూ. –దేవి గృ.నా.ప.

గంగాధరభట్ల

వ్యక్తినామం (తె.).

గంగాధర– గృ.నా.పూ; పు.నా; దేవతా సూచి. <సం. గంగాధర– గంగాధరుడు. ఆకాశగంగను ధరించినవాడు. శివుడు. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. –భట్ల గృ.నా.ప.

గంగినేని

వ్యక్తినామం (రా.స.).

గంగి– గృ.నా.పూ; గంగ+ఇ. వి.చూ. గంగదాసు. కమ్మవారిలో ఇంటి పేరు. చూ. –నేని గృ.నా.వ.

**గంగిరెడ్డి**

వ్యక్తినామం (తె.న.).

గంగి–గృ.నా.పూ; పు.నా. <గంగయ. గంగ+అయ. వి.చూ. గంగదాసు.

చూ. –రెడ్డి గృ.నా.వ.

**గంగిరెద్దుల**

జంతుసూచి (స.).

గంగిరెద్దు బహు. కుద్వి.వి. భిక్షమెత్తుకునే దాసరులు అలంకరించి ఆడించే ఎద్దు. దేవవృషభం. గంగి+ఎద్దు. గంగి– పూజ్యమైన, <గంగి_ గంగిగోవు, సాధువు. సాధు స్వభావం కలవాడు. <సం. గంగా– అమ్మ, అయ్య, రావు మొదలైనవి లేకుండా బహువచన ప్రత్యయమైన 'లు' వ్యక్తి నామాల చివరున్న పేర్లు కొన్ని ఉన్నాయి. ఉదా : అంకాలు, జోగులు, భిక్షాలు, రాములు, సుబ్బులు, సోమయాజులు.

**గంగిసెట్టి**

వ్యక్తినామం (తె.రా.స.).

గంగి– గృ.నా.పూ; గంగ+ఇ. వి.చూ. గంగిరెడ్డి. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. –సెట్టి గృ.నా.వ.

**గంగుల**

చూ. గంగులు

వ్యక్తినామం (స.).

**గంగులు**

రూ. గంగుల

వ్యక్తినామం (స.).

**గజరాజు**

వ్యక్తినామం (రా.).

గజ– గృ.నా.పూ. ?

చూ. –రాజు గృ.నా.వ.

**గజ్జి**

వ్యాధిసూచి (తె.).

తీటకురుపు. < సం. కచ్ఛూ–

**గజ్జెల**

ఆభరణసూచి (తె.రా.స.).

గజ్జె బహు.కు. ద్వి.వి. పాదభూషణం. కింకిణి, క్షుద్ర ఘంటా విశేషం, మువ్వ. బలిజకులంలోను, రెడ్డి, కొరవలలోనూ గృహనామం.

**గజ్జేశు**

వ్యక్తినామం (సా.).

?< గజేశు– < గజ+ఈశు–

"గజ్జేశు మవనయ్య బుజ్జగించితివా–"

(వండి. పు. 208).

గంజాయి

వృక్షసూచి (తె.).
మత్తు కలిగించే ఒక చెట్టు.
<హిం. ఘంజా; త. కంజా.

గంజి

ఆహారపదార్థసూచి (స.).
అన్నం వార్చిన రసం. కమ్మవారిలో ఇంటిపేరు. త. కంజి; మ. కఞ్జి; క. గంజి; తు. గంజి; తె. గంజి; సం. కాంజిగమ్. డి.ఇ.డి. 927.

గట్టిన

చూ. గట్టినేని
వ్యక్తినామం (స.).

గట్టినేని

చూ. గట్టిన
వ్యక్తినామం (స.).
గట్టి –గృ.నా.పూ; గట్టు + ఇ. పర్వతం. చూ. –నేని గృ.నా.వ.

గడగొట్టు

చూ. గడిగొట్టు
అస్పష్టనామ బంధసూచి (స.).

గడప

గృహసంబంధసూచి (తె.).
ద్వారం యొక్క కింద ఉన్న భాగం.

గడిగొట్టు

చూ. గడగొట్టు
అస్పష్టనామబంధసూచి (స.).
?<గుడికట్టు : గ్రామం యొక్క ఆయకట్టు లేక గ్రామంలో దేవాలయం నిమిత్తం ఈయబడిన భూమి. శా. శ. పు.94. కమ్మవారిలో ఇంటిపేరు.

గడిదాసు

వ్యక్తినామం (స.).
గడి– గృ.నా.పూ; ? బ్రాహ్మణులలో ఇంటిపేరు. చూ. –దాసు గృ.నా.వ.

గడియ

కాలసూచి (రా.).
ఘటిక : ఇరువైనాల్గు నిముషాలకాలం. <సం. ఘటికా–; ?తలుపునకు అడ్డంగా వేసేకర్ర. కమ్మవారిలో ఇంటిపేరు.

గడియారం

సమయసూచి (స.).
కాలాన్ని తెలిపే యంత్రం. గడియలను తెలుపుతుంది గనుక గడియారం. వెలనాటి వైదిక బ్రాహ్మణులలో ఇంటిపేరు. క. గడియార, త. గడికారం; తు. గడియాళ్.

గడ్డగోని

వ్యక్తినామం (తె.).

గడ్డ- గృ. నా. పూ. ?
చూ. _గోని గృ.నా.వ.

గడ్డమీాది
వివాసస్థలసూచి (తె.).
నివాసప్రాంతాన్ని సూచిస్తుంది. గడ్డ-పట్టిపెల్ల, లంక, ద్వీపం. ఏటిఒడ్డుమీద నివసిస్తున్న వారు కావచ్చు.

గడ్డం
అవయవసూచి (తె.రా.శా.స.).
గడ్డము. చిబుకం. క.గడ్డ; త.కట్టమ్, కెట్టమ్; తు. గడ్డ; కోలా. గడెమ్; తె.గడ్డము. డి.ఇ.డి. 970. బోయ, పద్మ సాలీలలో ఇంటిపేరు. '—గడ్డంరామయ్య దేవుకు—' శా. 1281 (టి. యం. పి. పు. 634 నెం. 636).

గడల
పౌరుషనామం (తె.).
గడ్డ బహు. కుద్వి. వి.; వి.చూ. గెడ్డ.

గడ్డి
తృణసూచి (తె.).
కసవు, తృణం. పశువులమేత కోసం పెంచేది.

గడ్డిరాజు
వ్యక్తినామం (తె.).
గడ్డి- గృ.నా.పూ; తృణవిశేషం.
చూ. _రాజు గృ. నా. వ.

36)

గణపతి
వ్యక్తినామం (తె.).
<సం. గణపతి. గణములకు అధిపతి. వినాయకుడు.

గణపతిభట్ల
వ్యక్తినామం (తె.).
గణపతి_ గృ. నా. పూ; దేవతాసూచి. వి.చూ. గణపతి. బ్రాహ్మణులలో ఇంటి పేరు. చూ. _భట్ల గృ.నా.వ.

గణపతిరాజు
వ్యక్తినామం (స.).
గణపతి_గృ.నా.పూ; వి.చూ. గణపతి.
చూ. _రాజు గృ.నా.వ.

గణపనేని
వ్యక్తినామం (స.).
గణప_ గృ. నా. పూ; దేవతాసూచి. ?<గణపతి. కమ్మవారిలో ఇంటిపేరు.
చూ. _నేని గృ.నా.వ.

గణేశ
చూ. గణేశు
వ్యక్తినామం (స.).
గణ+ఈశు. దేవతాసూచి. ఈశ్వరుడు. గణాధిపతి.

గంట
రూ. గంటల, గంటా, గంట్ల. ఘంట. ఘంటా.

వాద్యసూచి (తె.శా.స.).
<సం. ఘంటా; క. గంటె. గంట వాయించేవారో, గంటలు తయారు చేసే వారో కావచ్చు. '—గంటయ్రెరాడ్డి—' శా. 1649 (టి.యం.పి. II; పు. 1058; నెం. 63).

## గంటల

చూ. గంట
వాద్యసూచి (స.).
గంట బహు. కు ద్వి. వి.

## గంటా

చూ. గంట
వాద్యసూచి (తె.స.).
రెడ్లలో, కమ్మవారిలో ఇంటిపేరు.

## గంట్ల

చూ. గంట
వాద్యసూచి (స.).
<గంటల. గంట బహు, కుద్వి. వి.
బలిజలలో ఇంటిపేరు.

## గండమనేని

వ్యక్తినామం (రా.).
గండమ_ గృ. నా. పూ: వ్య.నా.
చూ. _నేని గృ.నా.ప.

## గండి

జలసంబంధసూచి (తె.రా.న.).
జలం, బిలం. నీళ్ళు ఎక్కువగా వచ్చినందువల్ల చెరువుకట్టతెగి ఏర్పడిన మార్గం. మ.గండి; తు.గండి; క.గండి.

## గండు

పౌరుషనామం (సా.).
సం. గండ_ ; క. గండు : బలం, గర్వం, మగజంతువు. యాదవులలో ఇంటిపేరు. "కారుణ్యవతి గండు కామ సానియును__" (పల్నా. పు. 184 పం. 2775).

## గండ్రల

పౌరుషనామం (స.).
గండ్ర బహు. కు ద్వి. వి. <సం. ఖండ : ఖండం.

## గద

ఆయుధసూచి (తె.).
ముప్పైరెండు ఆయుధాలలో ఒకటి. గుదియ, దుడ్డులాగ వుండే ఆయుధం.

## గద్దిరాజు

వ్యక్తినామం (తె.).
గద్ది_ గృ. నా. పూ. ?<గద్దె
చూ. _రాజు గృ. నా. ప.

## గద్దె

పౌరుషనామం (తె.రా.స.).
సింహాసనం. <సం.ఖట్టికా_; ?<సం. గద్యాణమ్. బంగారునాణెం. పర్కారు జిల్లాల్లో కమ్మవారిలోను; రాయలసీమలో హరిజనులలోనుఇంటిపేరుగాకన్పిస్తుంది.

## గనిపిసెట్టి

వ్యక్తినామం (స.).

గవిపి_గృ.నా.పూ: <గన్నప. వి.చూ. గన్నంరాజు. చూ. _సెట్టి గృ.నా.ప.

గనిమినేని

చూ. గన్నమనేని

వ్యక్తినామం (రా స.).

గనిసెట్టి

వ్యక్తినామం (రా.స.).

గని_ గృ.నా.పూ. <గన్న

చూ. _సెట్టి గృ. నా. ప.

గంధం

రూ. గంధ్యం

వృత్తిసూచి (తె.రా.స.).

సువాసన; చందనపుచెక్క అరగ దీయగా వచ్చిన లేపనద్రవ్యం. సుగంధ ద్రవ్యాలను అమ్మేవర్తకులను గంధం వారని అంటారు. చాకలి,బలిజ,బ్రాహ్మణ కులాలలో ఇంటిపేరు.

గంధమునేని

వ్యక్తినామం (తె.రా.).

గంధము_ గృ. నా. పూ: వి. చూ. గంధం. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. _నేని గృ. నా. ప.

గంధాపులి

వృక్షసూచి (సా.).

?<గంధపలి. సంపెంగ మొగ్గ, ప్రేంకణపుచెట్టు. 'ఈవ్రతితుడినిట్లున్నది.' ''శ్రీరఘుపతీ గంధాషలి వరదయ్యాను రక్షింపు." (ఆంధ్రభా.Tel. M. పు.8).

గంధ్యం

చూ. గంధం

పౌరుషనామం (శా.).

"__ఖండాలందెల్లాను మాడపాదిక గంధ్యవారను తగరంవారును మూసలు వారును ఇచ్చిన ఆయము__" సర్వధారి (తెలం. శా. I; పు. 63. పం. 6-8).

గన్నబోయిన

వ్యక్తినామం (తె.).

గన్న_ గృ.నా.పూ. వి. చూ. గన్నం రాజు. చూ. _బోయిన గృ.నా.ప.

గన్నమసీడి

చూ. గన్నమనేని

వ్యక్తినామం (స.).

కమ్మవారిలో ఇంటిపేరు.

గన్నమనేని

రూ. గనిమినేని, గన్నమసీడి

వ్యక్తినామం (స.).

గన్నమ_గృ.నా.పూ. వి.చూ. గన్నం రాజు. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. _నేని గృ. నా. ప.

గన్నంరాజు

వ్యక్తినామం (స.).

గన్నం_ గృ. నా, పూ. <గన్నమ. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. _రాజు గృ.నా.ప.

గన్నాబత్తుల

వ్యక్తినామం (స.).

గన్నా- గృ. నా. పూ. <గన్నమ. వి.చూ. గన్నంరాజు.
చూ. -బత్తుల గృ.నా.ప.

గన్నెబోయిన
వ్యక్తినామం (తె.).
గన్నె- గృ.నా.పూ. < న్న.
చూ. -బోయిన గృ.నా.ప.

గంపల
రూ. గంపా
వస్తుసూచి ( .).
గంప బహు.కుద్వి.వి. వెదురు బద్దలు మొదలైన వాటితో అల్లిన తట్ట. క.గంపె; మ.గంపె; త.కెంపరై. డి.ఇ.డి. 1041.

గంపా
చూ. గంప
వస్తుసూచి (స.).

గయగోని
వ్యక్తినామం (తె.).
గయ- గృ.నా.పూ. ?<సం. గయా-
చూ. -గోని గృ.నా.వ.

గరిక
వృక్షసూచి (తె.).
ఉ : గరక, గరికి, గరికె, గరెక, గెరిక, గెరికి మ. కరుక; క. కరికె; తె. గరికె డి.ఇ.డి. 1176.

గరికమొక్కల
చూ. గరిక
వృక్షసూచి (స.).
గరికమొక్క- బహు.కుద్వి.వి.

గరికె
చూ. గరిక
వృక్షసూచి (తె.శా.సా.).
'--గరికె మాడచి యనుకాంత యొకర్తె--' (పల్నా. పు. 448; పం. 2508).

గవరరాజు
చూ. గౌరరాజు
వ్యక్తినామం (స.).
గవర- గృ.నా;పూ. స్త్రీ.నా. <గౌరి పార్వతి. ?<గౌర- వర్తకుడు.
చూ. -రాజు గృ.నా.ప.

గవిరినీడి
రూ. గవిర్నీడి
వ్యక్తినామం (స.).
గవిరి- గృ.నా.పూ. <గౌరి. వి.చూ. గవరరాజు. కమ్మవారిలో ఇంటిపేరు.
చూ. -నీడి గృ.నా.ప.

గవిర్నీడి
చూ. గవిరినీడి
వ్యక్తినామం (స.).
కమ్మవారిలో ఇంటిపేరు.

గవుర
రూ. గౌర, గౌరా
వృత్తిసూచి (రా.స.).

వర్తకుడు. బేహారి. గౌడవారిలో ఇంటిపేరు.

గవ్వరాజు

వ్యక్తినామం (వ.).

గవ్వ– గృ.నా.పూ. ? < గవర.

చూ. –రాజు గృ.నా.ప.

గవ్వల

పౌరుషనామం (తె.).

గవ్వ బహు.కు రూప. ఒక రకమైన శంఖం.

## గా

గాజుల

రూ. గాజులోళ్లు

ఆభరణసూచి (తె.రా.స.సా.).

గాజు బహు.కు ద్వి.వి. హస్తభూషణం, ఒక రకమైన మన్ను. సం. కాచ–; క. గాజు. గాజు మట్టితో వలయాకారంలో చేయబడి చేతికి అలంకరించుకునే ఆభరణం. గాజులు తయారు చేసేవారి కిది ఇంటిపేరు కావచ్చు. బలిజ, కాపు వారిలో ఒక తెగ. (సి.టి.యస్.ఐ. I). "–– సకల లోకోపకారంబుగావున గాజుల వంశపయః పారావార––" మను. గాజు. ఆశ్వా.గ.). '–గాజుల వారలును మరి కనకంబువారు ––" (పల్నా. పు. 530: వం. 192).

గాజులోళ్లు

< గాజులవాళ్లు

చూ. గాజుల

ఆభరణసూచి (రా.).

గాడి

శకటసూచి (స.).

గాటం, బండి, రథవిశేషం. హరిజను లలో ఇంటిపేరు.

గాది

చూ. గాదె

వస్తుసూచి (శా.).

"–– గాది లక్ష్మీనరసింహ––" శా. 1464. (టి.యం.పి II; పు. 1060; నెం. 75).

గాదిరాజు

రూ. గాధిరాజు

వ్యక్తినామం (స.).

గాది –గృనా.పూ. ?< గద్దె. ఆర్వేల నియోగి బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. –రాజు గృ.నా.వ.

గాదుభట్ల

వ్యక్తినామం (తె.).

చూ. –రాజు గృ.నా.వ.

గాదు –గృ.నా.పూ. ? < బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. –భట్ల గృ.నా.వ.

గాదె

రూ. గాది

వస్తుసూచి (తె.రా.స.).

ఇంటిబయట ధాన్యం పోయడానికి

రాతితోగాని, మట్టితోగాని ఏర్పరచిన ఏర్పాటు. వెదురు మొదలైన వాటితో కూడా అల్లి ధాన్యం నిల్వచేస్తారు. ఉ : గాది, పర్యా. గుమ్మి. సం. గంజ_. కమ్మ, బ్రాహ్మణ, రెడ్డి కులాల్లో ఇంటి పేరు.

గాథావఝుల

వ్యక్తినామం (తె.).

గాథా_ గృనా.పూ. ?

బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. _వఝుల గృ.నా.ప.

గాధిరాజు

చూ. గాదిరాజు

వ్యక్తినామం (సం.).

ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.

చూ. _రాజు గృ.నా.ప.

గానాల

సంగీతసూచి (సం.).

గానం బహు.బద్వి.వి. పాట. ధ్వని, స్తుతి.

గాబు

వస్తుసూచి (సం.).

మూతివెడల్పుగా గల పెద్దపాత్ర, కొప్పెర. పూ.వి. నీరు నిల్వవుంచడానికి ఇంట్లో ఏర్పాటుచేసుకున్న రాతి లేక సిమ్మెంటుతో చేసిన నిర్మాణం.

గామినేని

వ్యక్తినామం (సం.).

గామి_ గృ.నా.పూ. ?<కామినేని. కమ్మవారిలో ఇంటి పేరు.

చూ. _నేని గృ.నా.ప.

గాయత్రి

పౌరుషనామం (తె.).

ద్విజులు సంధ్యోపాసనలో జపించే షడక్షరీ మంత్రం. 'గాయం తంత్రాయతే యస్మాద్గాయత్రీ తేనకథ్యతే.' గానం చేసేవాడిని అంటే మననం చేసేవాడిని రక్షించేది కనుక గాయత్రి అనబడు తుంది. ఈమంత్రం బ్రాహ్మణులకు ఉపనయన సమయంలో గురువులచేత ఉపదేశింపబడడంచేత దీనికి గురుమంత్ర మనీ, బ్రహ్మోపదేశమనీ పేర్లు. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

గార

వృక్షసూచి (సం.).

ఇంగుది చెట్టు. ?గోడకు పూత పూయ డానికి ఇసుక చేర్చి దంచిన సున్నం, మరక.

గారింటి

నివాసస్థలసూచి (రా.).

గార_ గృ. నా. పూ; వి. చూ. గార. గారతోకట్టిన ఇంటిలో నివసించేవారని అర్థం. చూ. _ఇంటి. గృ.నా.ప.

గారె

రూ. గార్ల

ఆహారపదార్థసూచి (తె.).

<ఘారి_. వడ.

గార్ల
చూ. గారె
అహారపదార్థసూచి (తె.).
< గారెల. గారె బహు.కు. ద్వి.వి.
? < గార్ల గ్రామం.

గాల
? చూ. గాలం.
వృత్తిపరికరసూచి (శా.).
"— గాల ముద్దన బోయండు —" శా. 1239. (టి.యం.పి. II; పు. 782; నెం. 339).

గాలం
తూ. గాల
వృత్తిపరికరసూచి.
<గాలము, చేపలు పట్టడానికి ఉక్కు కమ్మీతో వంకరగా చేసిన సాధనం. యాదవులలో ఇంటిపేరు. సం. గాలమ్: క. గాళ; తు. గాళ.

గాలి
పంచభూత భేదం (తె.రా.స.).
క. గాళి; త. కాల్; తు. గాలి. డి.యి.డి. 1258. వాయువు. విందార్థంలో కూడ ఉపయోగిస్తారు.

గి

గిడుగు
వస్తుసంబంధసూచి (తె.).
కామలేని గొడుగు. వి.చూ. గొడుగు. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

గిండి
వస్తుసూచి (శా.).
సన్నని మెడగల పాత్ర, చెంబు. సం. కుండీ—; క. గిండి; త. గిండి.
"— శ్రీకృష్ణదేవమహారాయల గిండి బసవరాయ—" (టి.టి.డి.యి.యస్.III; పు. 163; నెం. 69.)

గిద్ద
కొలమానసూచి (రా.).
సోలలో నాల్గో భాగం. చిన్న కొడవలి. వా.

గిరి
పర్వతసూచి (రా.).
కొండ. కొందరు సన్యాసులు తమ పేర్ల చివర 'గిరి' తగిలించుకుంటున్న బిరుదు. సూ.ని;ఉవా. ఆనందగిరి.

గిరిజన
తెగసూచి (తె.).
పర్వత ప్రాంతంలో నివసించే జాతి.

గిరిరాజు
రూ. గిర్రాజు
వ్యక్తినామం (స.).
గిరి— గృనా.పూ, పర్వతసూచి. వి.చూ. గిరి. చూ. —రాజు గృ.నా.ప.

గిర్రాజు
చూ. గిరిరాజు
వ్యక్తినామం (స.).

గిరి+రాజు. బ్రాహ్మణులలో ఇంటి పేరు.

## గు

**గుగ్గిలం**

రూ. గుగ్గిలము

వృక్షసూచి (స.).

గుగ్గిలపు చెట్టు. నిర్మాణ ద్రవ్యంగా పనికి వచ్చే గట్టి కలప నిచ్చే పెద్ద చెట్టు. దీనిని 'దూదుమర' అని కూడ పిలుస్తారు. మా.వృ.ప. IV. ? గుగ్గిలపు చెట్టు బంక. సం. గుగ్గుల–; క. గుగ్గిళ; త.మ.క. కుంగిలయం.

**గుగ్గిలము**

చూ. గుగ్గిలం

వృక్షసూచి (సా.).

"—వైశ్య సంఘంబునంజాల కీర్తి గన్నారు గుగ్గిలము వారు—" (కన్యకా. ప. 4).

**గుగ్గిళ్ల**

ఆహారపదార్థసూచి (స).

గుగ్గిళ్లకు ద్వి.వి. ఉడికించిన ఉలవలు, ఆలసంద మొదలైన ధాన్యం. క. గుగ్గరి, గుగ్రి; తు. గుగ్గురి. డి.ఇ.డి. 1360.

**గుజరాతి**

దేశ లేక భాషాసూచి (తె.).

<సం- ఘూర్జర- ఘూర్జర దేశానికి చెందినవారు.

**గుజ్జల**

చూ. గుజ్జు

పౌరుషనామం (శా.స.).

రెడ్లలో ఇంటిపేరు. "—గుజ్జల ఓబల రెడ్డి—" శా. 1216 (టి.యమ్.పి. I, పు. 595; నెం. 251).

**గుజ్జు**

రూ. గుజ్జల, గుజ్జుల

పౌరుషనామం (స.).

<గుజ్జు. పొట్టివాడు, పొట్టికొయ్య, గుంజ. ప్రా. కుజ్జో–; సం. కుబ్జ–; క. గుజ్జు. ?<గుంజ

**గుజ్జుల**

చూ. గుజ్జ

పౌరుషనామం (తె.రా).

గుజ్జు బహు. కు. ద్వి. వి. రెడ్లలో ఇంటిపేరు.

**గుంజ**

రూ. గుంజా

గృహసంబంధసూచి (తె.స.).

క. గుంజె: స్తంభం. ?<గుంజ: గురివెంద, తప్పెట, అవ్యక్త మధుర ధ్వని. సూ. ని. వడ్డెరలలో ఇంటిపేరు.

**గుంజా**

చూ. గుంజ

గృహసంబంధసూచి (స.).

**గుడి**

దేవతాసంబంధసూచి (స.).

దేవాలయం. జోగివారి గృహనామమని (సి.టి.ఎస్.ఐ. I) క.గుడి; త.కుటి, మ. కుటి; తు. గుడి; కొ. కుడి, పర్జి. గుడి; సం. కుటి. డి.ఇ.డి. 1379

**గుడిదేవేరి**

వృత్తిసూచి (తె.).

?<గుడిసాని. దేవదాసి. దేవాలయంలో ఆటపాటలు జరిపే స్త్రీ.

**గుడిసె**

గృహసూచి. (తె.రా.స.).

స్తంభాలు, గోడలు మొదలైనవి లేకుండా గడ్డితో ఏర్పాటు చేసుకున్న చిన్న ఇల్లు. కమ్మ, కాపు, బోయ, హరిజనులలో ఇంటిపేరు. మ. కు[illegible]; త. కుడిసై; క. గుడిసిలు. డి.ఇ.డి. 1379.

**గుడ్డల**

వస్త్రసూచి (తె.).

గుడ్డ బహు. కు. ద్వి. వి. వస్త్రం. క. గుడ్డె; త. కుట్టై.

**గుడ్డి**

అంగవైకల్యసూచి (తె.రా.స.).

<గ్రుడ్డు. అంధత్వం. అంధుడు. అంధురాలు. క. కురుడు, కుడ్డు; త. కురుడన్, కురుటు; తు. కురుడు; మ. కురుటు (డి.ఇ.డి. 1487).

**గుడ్ల**

పౌరుషనామం (తె.రా.స.).

గుడ్డు బహు. కు. ద్వి. వి. <గుడ్డు. కనుగుడ్డు, పక్షిగుడ్డు. ?<గుడ్డ బహు. కు. ద్వి.వి. వస్త్రం. గుడ్డల.

**గుంట**

రూ. గుంట్ల

జలసూచి (స.).

చిన్న గొయ్యి, గుంత. నీరు నిలిచే పల్లం. సం. కుండమ్; క. కుంటె; త. కుంటం. విశాఖజిల్లాలో ఆడపిల్లలను 'గుంట' అంటారు. చూ. మా గుంట సినిమాకెళ్ళింది. బోయలలో ఒక తెగ. బావులను తవ్వడానికి నియమించబడిన వారిని అనంతపురం జిల్లాలో గుంటలని పిలుస్తారని (సి.టి.యస్.ఐ.11).

**గుంటక**

వృత్తిపరికరసూచి (స.).

దున్ని విత్తనాలను చల్లిన తరువాత నేలను సవరించే సాధనం. <గుంట. క. కుంటె. కాపులలో ఇంటిపేరు.

**గుంటి**

భూసూచి (తె.స.).

చేనిభాగం. దున్నడం మొదలైనవానికి ఏర్పరచిన భూభాగం.

**గుంట్ల**

చూ. గుంట

జలసూచి (తె.).

గుంట బహు. కు. ద్వి. వి. బోయ లలో ఇంటిపేరు.

గుండ

వ్యక్తినామం (శా.).

<గుండడు. బంటు, దాసు. కన్నడంలో ఎక్కువగా కన్పించే వ్యక్తినామం. క. గుండ; మ. కుణ్ట. "—గుండ రత్న భూషణ—" (టి.ఎం.పి.. II; పు. 717; నెం. 48 ఎ).

గుండపనేని

రూ. గుండపునీడి

వ్యక్తినామం (రా.న.).

గుండప— గృ. నా. పూ. గుండప్ప. గుండ+అప్ప. వి. చూ. గుండ. కమ్మ వారిలో ఇంటిపేరు.

చూ. —నేని గృ. నా. ప.

గుండపునీడి

చూ. గుండపనేని

వ్యక్తినామం (న.).

గుండా

రూ. గుండాల, గూండా.

పరాక్రమసూచి (న.).

ధీరుడు. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

గుండాబత్తుల

వ్యక్తినామం (తె.).

గుండా— గృ. నా. పూ. వ్య. నా <గుండయ. వి. చూ. గుండ్రాజు.

చూ. —బత్తుల గృ.నా.ప.

గుండాల

చూ. గుండా

పరాక్రమసూచి (రా.).

గుండా బహు. కు. ద్వి.వి. గుండాల: సం. స్త్రీ. ఒక విధమైన గడ్డిదుబ్బు. సూ. ని. కమ్మవారిలో, బ్రాహ్మణులలో ఇంటిపేరు.

గుండావఝల

వ్యక్తినామం (తె.).

గుండా— గృ.నా.పూ. వ్య.నా; గుండ+ అ. వి. చూ. గుండ్రాజు. బ్రాహ్మణులలో ఇంటి పేరు. చూ. —వఝల గృ.నా.ప.

గుండు

రూ. గుండ్ల

శిలాసూచి (తె.స.సా.).

గుండ్రనిరాయి, బోడితల. బ్రాహ్మణు లలో ఇంటిపేరు. త. కుండు; క. గుండ, గుండు; కొలా. గుండ్ నాయి. డి. ఇ. డి. 1414. "—అతవికులజాలెల్లరు వాగ స్యగోత్రులైరి గుండువారని గృహనామ ముండెవారికి—" (శ్రీరా. చం. 1—22) "—శ్రీమద్గుండు వంశ పయోవారాశిత—" (పైది; అశ్వా.గ. పు. 141).

గుండెగోని

వ్యక్తినామం (తె.).

గుండె— గృ. నా. పూ. వ్య. నా. <గుండయ. వి.చూ. గుండ్రాజు.

చూ. —గోని గృ.నా.ప.

గుండెబోవి

చూ. గుండెబోయిన

వ్యక్తినామం (శా.).

"వీరిదేమద్దె కుంటకడన్న గుండెబోవి వారి మావిండితోట—" శా. 1156 (తెలం. శా. I; పు. 69; పం. 10—11).

గుండెబోయిన

రూ. గుండెబోవి

వ్యక్తినామం (తె.స.).

గుండె— గృ. నా. పూ. ?<గుండ. వి. చూ. గుండ్రాజు.

చూ. —బోయిన గృ.నా.వ.

గుండోజి

వ్యక్తినామం (తె.).

గుండ— గృ.నా.పూ. వ్య.నా. వి.చూ. గుండ్రాజు. చూ— ఓజి గృ.నా.వ.

గుండ్ర

ఆకారసూచి (స.).

<గుండ్రం. అంత్య వర్ణానికి లోపం రాగా మిగిలిన రూపం. వృత్తవిశేషమని సూ. వి.

గుండ్రాజు

వ్యక్తినామం (స.).

గుండ— గృ. నా. పూ; వ్య. నా. గుండడు, సేవకుడు. చూ. గుండ. తెలుగులోకూడ గుండమ్మ, గుండయ్య వ్యక్తినామాలు కన్పిస్తున్నాయి. ఆర్వేల నియోగి బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. —రాజు గృ.నా.వ.

గుండ్ల

చూ. గుండు

శిలాసూచి (తె.).

గుండు బహు. కు ద్వి.వి.

గుత్త

రూ. గుత్తా

సంఘటనసూచి (రా.స.).

ఫలితాన్నిచ్చే భూమి మొదలైనవాటిని ఆ ఫలితాన్ని అనుభవించడం కోసం దాని యజమానికి కొంత ధనాన్నిచ్చి అనుభవించడానికి తెచ్చుకోవడం. కమ్మవారిలో ఇంటిపేరు. క. గుత్తె, గుత్తిగె; త. కుత్తగై. గ్రామవృత్తుల వారికి కళ్లంలో మామూలుగా యిచ్చే ధాన్య భాగం. మాం. వ్య. వ. వర్మా. అడుమ, కట్టడి, గుత్త.

గుత్తా

చూ. గుత్త

సంఘటనసూచి (తె.స.).

కమ్మవారిలో ఇంటిపేరు.

గుత్తుల

సమూహసూచి (స.).

గుత్తి బహు. కు ద్వి.వి. పూలు, పండ్లు పూసలు మొదలైన వాటి సమూహం. <సం. గుచ్ఛ—; ప్రా. గుత్తి; క.గుత్తు; త. కొత్తు.

గుదె

రూ. గుదే

ఆయుధసూచి (స.).

గద, ముద్గరం. కమ్మవారిలో ఇంటి పేరు. సం. గదా–; క. గుదిగె.

గుదే

చూ. గుదె

అయుధసూచి (రా.స.).

కమ్మవారిలో ఇంటిపేరు.

గుద్దంటి

వృత్తిపరికరసూచి (స.).

గుద్దలి కి ఔప. ?<గుద్దలి. చెట్టువేళ్ళు మొదలైనవి పెకలించేసాధనం, కుద్దాలం. సం కుద్దాల–; క. గుద్దలి; తు. గుద్దలి.

గున్నల

జంతుసూచి (తె.).

గున్న బహు. కు ద్వి. వి. పంది, ఏనుగు మొదలైన వాటి పిల్ల, పొట్టి. సం. కుణక–; క. గున్న.

గుమ్మడప్ప

వ్యక్తినామం (శా.).

గుమ్మడి– గృ. నా. పూ. వృక్షసూచి. వి.చూ. గుమ్మడి. "—గుమ్మడప్ప రాఘవప్ప నాయనింగారు—" శా.1464 టి.యం.పి. II; పు. 1060; నెం. 75).

చూ. –అప్ప గృ.నా.ప.

గుమ్మడి

వృక్షసూచి (తె.రా.స).

గుమ్మడి చెట్టు. కమ్మవారిలోను,చాకలి కులంలోను ఇంటిపేరు. వృ.నా. Cucurbita maxima. సం. కూష్మాండ–; తు. కుంబుడ; త. కుంపళమ్; మ కుంపళమ్. డి.ఇ.డి. 1455. ఈ ఇంటిపేరుగల చాకలివారు ఈ పండును పేద్యం చేయరనీ, దీనిని తినరని సి. టి. యస్. ఐ. పేర్కొంది. కాని ఇలాంటి ఆచారం ఇప్పుడు కన్పించదు.

గుమ్మరాజు

వ్యక్తినామం (స.).

గుమ్మ– గృ.నా.పూ.? ఆర్వేల నియోగి బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. –రాజు గృ.నా.ప.

గురప్పగారి

వ్యక్తినామం (రా.).

గురప్ప- గృ.నా.పూ; వ్య.నా. <గురవప్ప. గురవమ్మ, గురవయ్య, గురవారెడ్డి మొదలైనవి ఇలాంటి వ్యక్తి నామాలే. చూ. –గారి గృ.నా.ప.

గురాల

జంతుసూచి (సా.).

గుర్రం బహు. కు ద్వి.వి. వి. చూ. గుర్రం "—శ్రీమద్గురాలాన్వయమున బుట్టి—"(దర్శనం.1–64). "—ప్రసిద్ధ దానాలు ధరంజేయువారు గురాలవారు—" (పైద, 1–63).

గురికాని

పౌరుషనామం (రా.).

<గుటికాడు. గుటి+కాడు. లక్ష్యం తప్పకుండా కొట్టేవాడు.

గుఱ్ఱపుశాల

స్థలసూచి (స.).

గుఱ్ఱము+శాల : గుఱ్ఱాలను కట్టేపే చావిడి.

గుఱ్ఱం

రూ. గుఱ్ఱాల

జంతుసూచి (తె.రా.స.).

త. కుతిరై; మ. కుతిర; కొ. కుదిర్; క. కుదిరె, కుదురె, కుదరె; తె. కుదిర, కుదరము; గుఱ్ఱము; కోలా. గుర్రమ్ డి.ఇ.డి. 1423. కమ్మ, గొల్ల. చెంచు, పద్మసాలి, మాల కులాలలో ఇంటిపేరు.

గుఱ్ఱమోళ్ళు

పౌరుషనామం (తె.).

గుఱ్ఱం– గృ. నా. పూ; జంతుసూచి. వి.చూ. గుఱ్ఱం. చూ. –ఓళ్లు గృ.నా.వ.

గుఱ్ఱాల

చూ. గుఱ్ఱం

జంతుసూచి (తె.రా.స.సా.).

గుఱ్ఱం బహు. కు ద్వి. వి.

గులాం

పౌరుషనామం (తె.).

పా. గులాం; హిం. ఘులాం; క. గులామ్; తు. గులామె బానిస. దాసుడు.

గుల్ల

పౌరుషనామం (శా.).

నత్తగుల్ల, కప్పచిప్ప, క్షుద్రశంఖం; బోలు. <సం. క్షుల్లక–. ?<గుళ్ళ. గుడి బహు. కు. ద్వి.వి.; ?<గుండు బహు. కు ద్వివి. "–గుల్ల నాగప్పనాయుడు–" శా. 1444 (టి.యం.పి. I. పు. 612; నెం. 489).

గుళ్ళ

చూ. గుండు

శిలాసూచి (శా.).

?<గుండు బహు. కు ద్వి.వి. ?<గుళ్లు. గుడి బహు. కు ద్వి.వి. దేవాలయం. "ప్రితివీరాజ్యంబు సేయు కుజ్జుమదు వేళు వాన్ను (గా) గుళ్ళకాడమ్మ శ్రీమెద్ది–" 825 A. D. (ఇ. టి. ఐ. పు. 62, నెం. 76).

గుళ్ళపనేని

వ్యక్తినామం (వ.).

గుళ్ళప– గృ. నా. పూ.; వ్య. నా. <గుళ్ళప్ప. చూ. –నేని గృ.నా.వ.

గువ్వల

పక్షిసూచి (తె.రా.స.సా.).

గువ్వ బహు. కు ద్వి. వి. పక్షి, కపోతం. బోయలలో, ముత్తరాసులలో ఇంటిపేరు. "–గుడి రాళ్ళను గట్టకున్న గువ్వల చెన్నా! (చాటువ. పు. 148).

## గూ

**గూడల**

రూ. గూడా

వస్తుసూచి (తె.).

గూడ బహు. కు ద్వి.వి. పూలు పెట్టుకునే బుట్ట, సజ్జ; వానకు తలమీద వేసుకోవడానికి అల్లిన జమ్ముగూడ; నీటిని ముంచి పోయడానికి వెదురుబద్దలతో చేసిన సాధనం; వైష్ణవులు తిరుమణి పెట్టె మొదలైన వన్నీ పెట్టుకొని చంకకు తగిలించుకునే తాటాకులబుట్ట; త. కూడై, కూటు; మ. కూట; తు. గూడె; క. గూడ, గూడె; గోం. గూల. డి.ఇ.డి. 1564.

**గూడా**

చూ. గూడల

వస్తుసూచి (స.).

**గూడెపు**

చూ. గూడెం

నివాస స్థలసూచి (తె.).

**గూండా**

చూ. గుండా

పరాక్రమసూచి (తె.).

**గూన**

వస్తుసూచి (స.).

పెద్దకుండ. అద్దకం వేయడానికి ఉపయోగించే పెద్దకుండను గూనఅంటారు. వెలమలలో ఒక తెగ సి.టి.యస్.ఐ.

**గూని**

అంగవైకల్యసూచి (తె.).

< గూను. వీపుమీద వంపు గలవాడు, గూను కలవాడు. క. గూను; త. కూన్; తు. గూను; మ. కూన్. డి.ఇ.డి.1605

**గూబ**

రూ. గూబల

పక్షిసూచి (తె.).

ప్రా. ఘూగ, ఘూవ; < సం.ఘూక–; క. గూబె : గుడ్లగూబ.

**గూబల**

చూ. గూబ

పక్షిసూచి (రా.).

గూబ బహు. కు ద్వి.వి.

## గె

**గెడ్డ**

భూసూచి (స).

మట్టిపెల్ల, ఏటిఒడ్డు, గెడ్డ అనివాడుక. రూ. గడ్డ. సం. గండ–; క. గడ్డె; త. కట్టి.

## గే

**గేదెల**

జంతుసూచి (స.).

గేదె బహు. కు ద్వి.వి. పర్యా. చూ. బర్రె. బొంతక్ సవరలలో గృహనామమని సి.టి.యస్.ఐ. I.

## గొ

గొట్టాల

వస్తుసూచి (న.).

గొట్టము బహు. కు ద్వి.వి. వెదురు మొదలైనవానిక్రోవి. క. గొట్ట.

గొట్టి

రూ. గొట్టె

వృక్షసూచి (తె.).

వృక్షవిశేషం. శ.ర. ఒక దిమసుగడ్డ, నమ్మదుంపచెట్టు.

గొట్టె

చూ. గొట్టి

వృక్షసూచి (తె.).

ఘోటజటి వృక్షం. సూ.వి; శ.ర.

గొడుగు

వృత్తిసూచి (తె.న.సా.).

ఛత్రం, ఆతపత్రం. దేవుని ఊరేగింపు ఉత్సవంలో పల్లకివెంట గొడుగు పట్టుకొని నడిచేవారు. రాజుగారికి గొడుగు పట్టుకొని నిలబడేవారు గనుక వారికి ది గృహనామం అయింది. గొడుగు పట్టడమే వీరివృత్తి. క. కొడె; త. కుడై; మ. కుట. డి.ఇ.డి.1386. "—గొడుగు మోగాయ—" (పల్నా. పు. 88, పం. 62). గొడుగు భూమానాయుడు 1520 ప్రాంతంలోవాడు. ఇతడు శ్రీకృష్ణదేవ రాయలకు శ్వేతఛత్రంపట్టే ఉద్యోగి. భూమే పల్లిని ఏకభోగ సర్వమాన్యంగా యిచ్చి పేరొందాడు.

గొడ్డటి

రూ. గొడ్డళ్ళ

వృత్తిపరికరసూచి (సా.).

గొడ్డలికి ఔప. చెట్లు నరికే సాధనం. గొడ్డలి. సం. కుఠార—; క. కొడలి; తు. కొడరి, కుడరి; మ. కోటలి; కోలా. గొల్లి. డి.ఇ.డి.యస్. 1702. "గొడ్డటి వారును గోవిందువారు—" (పల్నా. పు. 530; పం. 193).

గొడ్డళ్ళ

చూ. గొడ్డటి

వృత్తిపరికరసూచి (తె.).

గొడ్డలి బహు. కు. ద్వి.వి.

గొడ్ల

జంతుసూచి (రా.న.).

గొడ్డు బహు. కు ద్వి.వి. పశువు. ఆవు, ఎద్దు మొదలైనవి.

గొండ్లాళ్ళ

నృత్యసూచి (న.).

గొండ్లి — గృ.నా.పూ; ఆట, నాట్యం. నాట్యంచేసే వారని అర్థం. —ఆళ్ళ <వాళ్ళ <వాళ్ళు + అ. వారు బహు.

గొంతి

వ్యక్తినామం (న.).

కుంతి, పాండురాజు పెద్దభార్య. సం. కుంతీ—; క. కొంతి ?<గొంతెమ. గొంతి + అమ : గ్రామదేవత.

గొంది

స్థలసూచి (వ.).

కొండ యొక్క చిన్నమరుగు చోటు; మూల, చిన్న సందు.

గొర్జి

పౌరుషనామం (వ.).

?<గొరిజ : దేరా.

?<గొర్జ : కాలితోవ.

గొ్రె

జంతుసూచి (రా.వ.).

గొ్రె, గొఱ్ఱియ. కాపులలో ఇంటిపేరు. త. కొఱి; మ. కొఱి; క. కురి; తె. గొఱ్ఱె. డి.ఇ.డి. 1799

గొ్రెజొచ్చు

జంతుసంబంధసూచి (తె.వ.).

గొ్రె– గృ.నా.పూ; వి.చూ. గొ్రె. గొ్రె వెంట్రుకలు. గొ్రె బొచ్చుతో వ్యాపారం చేయడమో, వాటిని ఎగుమతి చేయడమో చేసేవారు.

గొ్రెల

చూ. గొర్ల

జంతుసూచి (రా.వ.).

గొ్రె బహు. కు. ద్వి. వి. చూ, గొ్రె. కమ్మ, కాపు, గొల్ల కులాలలో ఇంటిపేరు.

గొర్ల

చూ. గొ్రెల

జంతుసూచి (వ.).

గొలుసు

రూ, గొలుసుల

పౌరుషనామం (తె.వ.).

మెడలో వేసుకునే హారం; ఏనుగు మొదలైనవాటి కాళ్ళకు కట్టే సంకెళ్ళు; శిక్షార్హుని చేతికివేసే సంకెల. క.గొలుసు; త. గొలుసు; తు. గొణసు. డి. ఇ. డి. 1755.

గొలుసుల

చూ. గొలుసు

పౌరుషనామం (తె.).

గొలుసు బహు. కు ద్వి .వి.

గొల్ల

రూ. గొల్లోళ్ళ

కులసూచి (తె.రా.శా.వ.).

పశువులను మేపి పాలు, నెయ్యి అమ్మి జీవించే జాతి. ప్రా– గోఆలా; సం. గోపాల–: క. గొల్ల. "—ఇందుల గొల్లభీమయ భోయుని కొడుకు—" 1078 A.D. (ఇ. టి. ఐ. పు. 130; పం. 7). "—కంటికి ఇందుల గొల్ల భీమయ బోయుని—" పైది; పు .163; పం. 8). తెలుగువారిలో ఎక్కువగా గ్రామాల్లో నివసించే కులం యిదేనని స్టూవర్ట్ అంటారు. కృష్ణుడు వీరి మూల పురుషుడని చెప్పుకుంటారు. గొల్లవాళ్ళ పేరుమీదగనే గోల్కొండఏర్పడిందట. ఊరు గొల్లలు, కాడు గొల్లలని రెండు రకాలు. సి.టి.యస్.ఐ. II. 284.

గొల్లోళ్ళు
చూ. గొల్ల
కులసూచి (తె.రా.).
<గొలవాళ్లు. గొల్లవాడుకు బహువచన రూపం.

# గో

గోకరాజు
వ్యక్తినామం (స.).
గోక- గృనా.పూ.? <గొంక- కమ్మ వారిలో ఇంటిపేరు.
చూ. -రాజు గృ.నా.వ.

గోగిన
చూ. గోగినేని
వ్యక్తినామం (స.).
కమ్మవారిలో ఇంటిపేరు.

గోగినేడి
చూ. గోగినేని
వ్యక్తినామం (స.).
కమ్మవారిలో ఇంటిపేరు.

గోగినేని
రూ. గోగిన, గోగినేడి
వ్యక్తినామం (స.).
గోగి- గృ.నా.పూ. వ్యనా. <గోగు లమ్మ. గోగులు + అమ్మ, ఒకానొక దేవత. సూ.ని. "—దక్షవాటిక పశ్చిమ ద్వార భూమి, ప్రతి వసించుచుసర్వాంగ రమ్యయగుచు —కోమలార్ధేందుధరు కొమ్మ గోగులమ్మ. (భీమ. 1-98.). అని పేర్కొనడంవలన ఈ గోగులమ్మ పార్వతీదేవేనని తెలుస్తుంది. కమ్మ వారిలో ఇంటిపేరు.

గోగిరెడ్డి
వ్యక్తినామం (స.).
గోగి- గృ.నా.పూ; పు. నా. వి. చూ. గోగినేని. చూ -రెడ్డి గృ.నా.వ.

గోగుల
వృక్షసూచి (రా.).
వ. ృనా. Hibiscus Cannab nis. గోగు బహు. కు ద్వి. వి. క. గోగి.

గోంగూల
వ్యక్తినామం (శా.).
దేవతాసూచి ?<గోగులమ్మ. గ్రామదేవత. వి.చూ. గోగినేని.
"—గోంగూల బోచినాయిండు—" శా. 1219. (టి. యం. పి.II; పు.802; నెం. 497).

గోడ
రూ. గోడల
గృహసంబంధసూచి (తె.).
సం. కుడ్యమ్; క. గోడె.

గోడల
చూ. గోడ

గృహసంబంధసూచి (తె.).
గోద. బహు. కు ద్వి. వి.

**గోడె**

జంతుసూచి (సా.).
?<గోడా. గుఱ్ఱం. <హిం. ఘోడా; సం. ఘోట-. "--అద్భుత పడుదాత గోడెకుల పూజ్యునకిచ్చు--" (సత్యభా. పు. 2; పం. 3). "--రాయిుడగు శ్రీ గోడె జగ్గరాయుడలరు--" (పైది; పు 3; పం. 18).

**గోదా**

వ్యక్తినామం (స.).
దేవతాసూచి. 1. గోదావరి; 2. గోదాదేవి. శూడికొడుత్త నాచ్చియార్. ఈమె వైష్ణవులు పూజించే దేవత.

**గోన**

జంతుసూచి (శా.).
జంతుసూచి. గో సమూహం.
?<తూ. కోన. "--శ్రీ గోనవంశ మహనీయ--" శా. 1181 (తెలం. శా. I; పు. 54; పం. 25-26)
"--శ్రీ గోనకుల దుగ్ధాబ్ధిజాత--" (పైది; పు. 57; పం. 5).

**గోనె**

వస్తుసూచి (తె.స.).
ధాన్యం మొదలైనవి నింపడానికి జనపనారతో చేసిన సంచి. ప్రా. గోణి-; సం. గోణీ. త. కోణి. హరిజనులలో ఇంటిపేరు.

**గోనెవారి**

పౌరుషనామం (తె.).
గోనెవారుకు బొవ. గోనెలు తయారు చేసేవారో అమ్మేవారో కావచ్చు.
గోనె- గృ. నా. పూ; వి.చూ. గోనె. చూ. -వారి గృ.నా.ప.

**గోపనగోని**

వ్యక్తినామం (తె.).
గోపన- గృ. నా. పూ. గోపన్న. గోపు+అన్న. గోపు- గోపుడు, గొల్లవాడు. -అన-వి.చూ. -అన్న.గృ.నా.ప. చూ. -గోని గృ.నా.ప.

**గోపనబోయిన**

వ్యక్తినామం (స.).
గోపన- గృ.నా.పూ; పు. నా. వి.చూ. గోపనగోని. చూ. -బోయిన గృ.నా.ప.

**గోపరాజు**

వ్యక్తినామం (తె.రా.స.సా.).
గోప- గృ.నా.పూ; పు.నా. కులసూచి: <గోపుడు; గొల్లవాడు. "--గ్రహణవేళ గోపరాజు రామన గోలకొండ ప్రభువుచేత--" (ఆం.గ్రా.పు.17).
"--గోపరాజాన్వయోమాత్యోరామాఖ్యో--" (చాటుప. పు. 82).

**గోపాజోస్యుల**

వ్యక్తినామం (స.).

గోపా_ గృ.నా.పూ; వ్య.నా.వి.చూ. గోపనగోని. బ్రాహ్మణులలో ఇంటిపేరు.
చూ. _జోస్యుల గృ.నా.ప.

గోపాలభట్ల
వ్యక్తినామం (తె.).
గోపాల_ గృ.నా.పూ. పు.నా. <సం. గోపాల_ గోపాలుడు, కృష్ణుడు. గోవులను కాచేవాడు. బ్రాహ్మణులలో ఇంటిపేరు. చూ. _భట్ల గృ.నా.ప.

గోపాలం
వ్యక్తినామం (స.).
దేవతాసూచి. వి.చూ. గోపాలభట్ల.

గోపావఝుల
వ్యక్తినామం (తె.).
గోపా_ గృ. నా. పూ; పు. నా. <గోపాల. వి.చూ. గోపాలభట్ల. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

గోపి
వ్యక్తినామం (స.).
<సం. గోప_, గోపీ_.

గోపిదేవి
వ్యక్తినామం (స.).
గోపి_ గృ.నా.పూ; సం. గొల్లది. వి చూ. గోపి. చూ. దేవి గృ.నా.ప.

గోపిన
చూ. గోపినీడి
వ్యక్తినామం (స.).
<గోపినేని. కమ్మవారిలో ఇంటిపేరు.

గోపినీడి
రూ. గోపిన
వ్యక్తినామం (రా.).
గోపి_ గృ నా. పూ: వి. చూ. గోపి. కమ్మవారిలో ఇంటిపేరు.
చూ. _నీడి గృ.నా.ప.

గోపిసెట్టి
వ్యక్తినామం (తె.స.).
గోపి_ గృ.నా.పూ; పు. నా. దేవతా సూచి. వి.చూ. గోపి
చూ. _సెట్టి గృ.నా.ప.

గోపీనాథ
రూ. గోపీనాథం, గోపీనాథుని
వ్యక్తినామం (స.).
గోపీ_ గృ.నా.పూ. పు. నా. దేవతా సూచి. వి.చూ. గోపి. గోపికలకునాథుడు. కృష్ణుడు. చూ. _నాథ గృ.నా.ప.

గోపీనాథం
చూ. గోపీనాథ
వ్యక్తినామం (తె.).
బ్రాహ్మణులలో ఇంటిపేరు.

గోపీనాథుని
చూ. గోపీనాథ
వ్యక్తినామం (స.).

గోపు
పౌరుషనామం (తె.స.).

ఆకతాయి. తెలగలలో ఇంటిపేరు.

గోమూవరుల

వ్యక్తినామం (తె.).

గోమా– గృ. నా. పూ.? బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. –వరుల గృ. నా. ప.

గోరంట

వృక్షసూచి (తె.).

<గోరంట. ఒకజాతిచెట్టు. దీని ఆకు నూరి స్త్రీలు చేతులకు, కాళ్ళకు పెట్టుకొని రాగవర్ణం వచ్చేలా చేస్తారు.

సం కురంటక–; త. కోరంటమ్; క. గోరంటి; మ. కుఱింటి. డి. ఇ. డి. 1535. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

గోలి

జంతుసూచి (రా.స.).

ఉడుము. సాలీలలో ఇంటిపేరు.

<గోలి : కూరాకు. సి.టి.ఎస్.ఐ.

గోళ్ల

పౌరుషనామం (రా.స.సా.).

గోరు బహు. కు ద్వి.వి. కాపులలో, మాదవులలో ఇంటిపేరు. ప్రా. ఘోరు; సం. ఖుర–; క. ఉగిర్. "–లయ గాల గోళ్ళ చిన్న తిమ్మతమాభవ–" చాటు ప. పు. 128).

గోవర్థన

వ్యక్తినామం (తె.స.).

<సం. గోవర్థన– : గోవులను వృద్ధి నొందించేవాడు. ?<గోవర్థనము. ఒకానొక పర్వతం.

గోవిందం

వ్యక్తినామం (తె.).

<గోవిందమ్మ. గోవిందు + అమ్మ. వి.చూ. గోవిందు.

గోవిందరాజుల

వ్యక్తినామం (స.).

గోవింద– గృ. నా. పూ. దేవతాసూచి. <సం. గోవింద– గోవిందుడు. శ్రీకృష్ణుడు. ఆర్వేల నియోగులలో ఇంటిపేరు. చూ. –రాజుల గృ.నా.ప.

గోవిందవరుల

వ్యక్తినామం (తె.స.).

గోవింద– గృ.నా.పూ; దేవతాసూచి. వి.చూ. గోవిందరాజుల. బ్రాహ్మణులలో ఇంటిపేరు. చూ. –వరుల గృ.నా.ప.

గోవిందు

వ్యక్తినామం (తె.స.).

<సం. గోవింద– పూ. నా; దేవతాసూచి. శ్రీకృష్ణుడు.

గోవుల

జంతుసూచి (స.).

గోవు బహు. కు. ద్వి. వి. పర్యా. చూ. ఆవుల.

గోసగి

జాతిసూచి (శా.).

<ప్రా. ఘోసగ– <సం. ఘోషక–. కడజాతివాడు, మాదిగ కులస్థుడు. "–శ్రీమతుగోసగిఈశ్వరదేవండు–" (తెలం. శా. I; పు. 94; పం. 2–3).

## గౌ

గౌండ్ల

రూ. గౌని, గౌండి

కులసూచి (తె.రా.).

<గౌడులు. గౌడు బహు. కు ద్వి. వి. సారాయమ్మువాడని సూ. ని; కల్లుగీచువాడని శ.ర. కాపువారికి ఇదిపట్టపు పేరు. గౌడ అనేది కన్నడ వ్యవసాయ కుటుంబం. గౌడఆనే ద్రావిడ పదానికి పర్వతం అని అర్థం. అవు అని అర్థం ఇచ్చే సంస్కృత పదం 'గో' నుండి వచ్చిందని కొందరంటారు. బంగార, మలాల, సాలు, హెమ్మన వీరికులంలోని ఇంటిపేర్లు. సి. టి. యస్. ఐ. II. 269. రాయలసీమ, తెలంగాణాలలో ఈకుల నామం గృహనామంగా కన్పిస్తుంది.

గౌతరాజు

వ్యక్తినామం (స.).

గౌత– గృ. నా. పూ; స్త్రీ. నా. దేవతా సూచి. దుర్గాదేవి. <గౌతమి : ద్రోణుని భార్య, గౌతమీనది. ఆర్వేల నియోగి బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. –రాజు గృ.నా.ప.

గౌని

రూ. గౌడ్ల

కులసూచి (రా.).

గ్రామ దేవతలకు బలివ్వడానికి మేక పోతులను సరఫరా చేసేవానికిచ్చే మాన్యాన్ని 'గౌనిమాన్యం' అని రాయల సీమలో అంటారు.

గౌర

చూ. గవుర

వృత్తిసూచి (తె.స.).

గౌరరాజు

రూ. గవరరాజు

వ్యక్తినామం (స.).

గౌర– గృ. నా. పూ; స్త్రీ.నా. దేవతా సూచి. <గౌరి : పార్వతి. వి. చూ. గౌరిసెట్టి. ?< గౌర : వర్తకుడు.

చూ. –రాజు గృ.నా.వ.

గౌరా

చూ. గవుర

వృత్తిసూచి. (స.).

గౌరావఝుల

వ్యక్తినామం (స.).

గౌరా గృ. నా.పూ; <గౌర. వి. చూ. గౌరరాజు. ఆర్వేలనియోగి బ్రాహ్మణులలో ఇంటిపేరు.చూ.–వఝుల గృ.నా.వ.

గౌరిసెట్టి

వ్యక్తినామం

గౌరి_గృ. నా. పూ; స్త్రీ. నా. దేవతా సూచి. పార్వతి. చూ. –సెట్టి గృ.నా.ప.

గౌరీదేవి

వ్యక్తి నామం (తె.).

గౌరీ_గృ. నా. పూ; స్త్రీదేవతాసూచి. <గౌరి. వి.చూ. గౌరిసెట్టి.

చూ. _దేవి గృ. నా. ప.

గౌర్నేని

వ్యక్తి నామం (రా.స.).

గౌరి_గృ.నా.పూ; వి. చూ. గౌరిసెట్టి. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. _నేని గృ.నా.ప.

## గ్ర

గ్రంథం

తూ. గ్రంధి.

పౌరుషనామం (సా.).

<గ్రంధము. కావ్యం, ధనం, ముప్పై రెండక్షరాల శ్లోకం. శబ్దా. గ్రంధ రచన చేసేవారు లేక గ్రంధ పఠనం చేసి విప్పించేవారు. "శ్రీహరిశ్చంద్ర మహారాజు వారినగరి గ్రంధంసుబ్బయ్య—" (ద్రౌప. Tel.M. పు. 535_38

గ్రంధి

చూ. గ్రంధం

పౌరుషనామం (స.).

గ్రంధాలు కలవాడు, కంతి, గనుపు. ముడి.

గ్రంధే

పౌరుషనామం (రా.స.).

?<గ్రంధం; ?<గ్రందె <సం. గ్రంధి_ ద్వారబంధం లోనగువాని నిలువుల యందు బిగకొట్టిన చీలలకు తగిలించు తలుపుల యందలి యినుప పట్టె. శ.ర. తలుపు అడ్డుగడియ.

## ఘ

ఘట్ట

స్థలసూచి (శా.).

<ఘట్టము. సుంకం పుచ్చుకొనేచోటు. నది మొదలైనవాని రేవు. ?<ఘట్టి, వరహా. "—ఘట్టరామదాసుపంతులు—" టి.యం.పి. I; పు. 671; నెం. 19). "—ఘట్ట గోపాలక్రిష్ణ పంతులు—" పైది; పు. 672; నెం. 27).

ఘట్టమనేని

వ్యక్తి నామం (స.).

ఘట్టమ—గృ. నా. పూ. ? <ఘట్టము. సుంకము తీసుకొనేచోటు. కమ్మవారిలో ఇంటిపేరు. ?<నదీఘట్టం.

చూ. _నేని గృ. నా. ప.

ఘట్టమరాజు

వ్యక్తి నామం (రా.).

ఘట్టమ_గృ.నాపూ. వి. చూ. ఘట్టమనేని చూ. _రాజు గృ.నా.ప.

ఘట్టు

పౌరుషనామం. (సా.).

?<గట్టు "కరమును రాణించు ఘట్టు

పంశమున—" (యాజ్ఞ. పు. 6).
"—సారస్వత విఖ్యాత ఘట్టు వీర సత్పుత్ర—"(పైడి. ఆశ్వా.గ.).

ఘట్రాజు

వ్యక్తినామం (స.).
ఘట్టు— గృ. నా. పూ. <ఘట్టు. చూ. ఘట్టమరాజు. నియోగులలో ఇంటిపేరు.
చూ. —రాజు గృ.నా.వ.

ఘంట

చూ. గంట
వాద్యవిశేషం (సా.).
"భారద్వాజగోత్రారామచైత్రోదయంబు ఘంట నాగధీమణికి—" (ప్రబోధ. 1-24). "—మల్లన కవికులోత్తముని ఘంటనాగధీమణి కూర్మినందనుని—" (వరాహ. 1-31).

ఘంటా

చూ. ఘంట
వాద్యవిశేషం (రా.).

ఘనం

సంగీతసూచి (సా.).
సంగీత శాస్త్ర పరిభాష. 'తానమునకు మరియొకపేరు. మనోధర్మ సంగీత భాగమునకు చేరినది. రాగ స్వరూపము. ఒకరకమగు లయతో పాడబడును. తాళములేదు. ఘనం కృష్ణయ్యార్, ఘనం శీనయ్య మొదలైనవారు తానము పాడుటలో అఖండులు కాబట్టి వారికిది ఇంటిపేరయింది. (గాన: పు. 168).

# ఘు

ఘుర్కా

వృత్తిసూచి (స.).
<నేపాలీ. ఘూర్ఖా. కావలాకాయడం

# ఘో

ఘోరకవి

పౌరుషనామం (స).
కవిత్వసూచి. భయంకరమైన కవి. ఆర్వేల నియోగులలో ఇంటిపేరు. కవిత్వం చెప్పడంలో ప్రసిద్ధిచెందినవారు.

# చ

చక్క

రూ. చక్కా
పౌరుషనామం (వ.).
<చక్క. బుజువు, తిన్ననిది, సుందరం.

చక్కా

చూ. చక్క
పౌరుషనామం (వ.).
యాదవులలో ఇంటిపేరు.

చక్రపాణి

వ్యక్తినామం (తె.).
<సం. చక్రపాణి—. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చక్రవర్తుల

పౌరుషనామం (తె.)

<చక్రవర్తులు + అ. < చక్రవర్తి, సార్వభౌముడు, రారాజు. సముద్రపర్యంత మైన భూమండలానికి అధిపతి.

చక్రాల

వస్తుసూచి (తె.స.).

చక్రం బహు. కు ద్వి. వి. సం. ఆయుధం, బండికల్లు, దండు, రాష్ట్రం, గానుగ, గుండ్రనిది. బ్రాహ్మణులలో గృహనామం.

చక్రి

వ్యక్తినామం (తె.).

<సం. చక్రి–. చక్రంగలవాడు. సుదర్శన చక్రం ధరించేవాడు. విష్ణువు.

చట్టి

చూ. చట్టు.

?చట్టు+ఇ. సంబంధసూచి (స.).

?<చట్టి. నోరు వెడల్పుగా వుండే చిన్న మట్టిపాత్ర, అటిక. క. చట్టి; త. చట్టి; మ. చట్టి; తు. చట్టి.

చట్టు

చూ చట్టి

సంబంధసూచి (స.).

?<సం. ఛాత్ర : శిష్యుడు.

చట్రాజు

వ్యక్తినామం (స.).

?చాట్రాజు.

చట్ట– గృ. నా. పూ. <ప్రా. చట్ట– <సం. శాస్త్ర–. ఆర్వేలనియోగి బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. –రాజు గృ.నా.ప.

చట్రాతి

శిలాసూచి (స.).

చట్రాయికి ఔప. చాపరాయి. <చట్టు+ రాయి. చట్టు– భూమగ్నశిల, కొండ, రాయి.

చండి

వ్యక్తినామం (సా.).

దేవతాసూచి, పార్వతి. కోపంగల ఆడది. మిక్కిలి ప్రేమగలది. సం. చండీ–క చండి; త.చండి. "–సంబు వుల్ వట్టెడి చండివెంకాయ–" (పల్నా. పు. 88 పం. 63).

చంద్ర

వృక్షసూచి (రా.స.).

ఖదిరవృక్షం. కమ్మవారిలో ఇంటిపేరు.

చంద్రుభట్ల

రూ. చంద్రుభొట్ల

వ్యక్తినామం (స.).

చంద్రు– గృ. నా. పూ. ?<చంద్ర. వృక్షసూచి. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. –భట్ల గృ. నా. ప.

చంద్రుభొట్ల

చూ. చంద్రుభట్లు

వ్యక్తినామం (స.).

చతుర్వేదుల

చూ. చతుర్వేది

పౌరుషనామం (శా.).

'--చతురువేదులవారి నర్సింవభొట్లు--'

(వల్నా. పు. 249; పం. 818)

చతుర్వేది

రూ. చతుర్వేదుల, చతురువేదుల

పౌరుషనామం (తె.).

నాలుగు వేదాలను అభ్యసించినవాడు.

చతుర్వేదుల

చూ. చతుర్వేది

పౌరుషనామం (స.).

చతుర్వేది బహు. కు వ్వి. వి.

చత్రఘూట్

స్థలసూచి (తె.).

<చతుర్ ఘాట్ : నాల్గురోడ్లకూడలి.

చదల

కీటకసూచి (తె).

<చెద, పుట్టపెట్టేపురు. white ants

సం. శిథిలీ-; త. చిదళ్.

చదల

పంచభూతసూచి (తె.స.).

చదలు+అ : ఆకాశం.

చదుపు

పౌరుషనామం (శా.).

<చదియు : నలగగొట్టు, చంపు, కొట్టు. "--చదుపు నారాయణరెడ్డి--"

టి.యం.పి. పు. 595; నెం 221).

చంద మోలి

వ్యక్తినామం (తె).

చంద-గృ.నా.పూ <చంద్ర. వి.చూ.

చంద్రభట్ల. చూ. -మౌళి గృ.నా.ప.

చందరాజు

చూ. చంద్రరాజు

వ్యక్తినామం (తె.స.).

బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చందు

వ్యక్తినామం (స.).

ప్రా.చంద- <సం.చంద్ర- చంద్రుడు.

క. చందు

చంద్రభట్ల

వ్యక్తినామం (తె.).

చంద్ర-గృ.నా.పూ. <సం. చంద్ర-,

చందిర- బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. -భట్ల గృ.నా.ప.

చంద్రరాజు

రూ. చందరాజు

వ్యక్తినామం (స.).

చంద్ర-గృ.నా.పూ. వి. చూ. చంద్ర

భట్ల, ఆర్వేలనియోగులలో ఇంటిపేరు.

చూ. -రాజు గృ.నా.ప.

చన్నమల్ల

వ్యక్తినామం (సా.).

<చన్నమల్లు, వ్య.నా; చన్న– <క. చన్న : అందమైన, శుభం. –మల్ల <మల్లికార్జున. ''—అతి పవిత్ర చ్ఛత్ర సాల చన్నమల్లాన్వయోధ్యాన—''(సత్య. కృ. పు. 4; పం. 3).

**చప్పిడి**

అపయవలోపసూచి (తె.రా.స.).

లోపలకు అణిగిపోయినట్టిది. చప్పిడి ముక్కు. ?<చప్పు: ఉప్పు, పులుసు, కారం మొదలైనవి లేని పదార్థం. జోగి వారిలో ఇంటిపేరు.

**చలమలసెట్టి**

రూ. చెలమలసెట్టి (స.).

చలమల–గృ. నా. పూ. <చలమల్లు <చన్నమల్లు. చూ. –సెట్టి గృ. నా. ప.

**చలవాది**

పౌరుషనామం (రా.స,).

చావు సమాచారం చెప్పేవాడు.

**చలసాని**

వ్యక్తినామం (తె.స.).

చల– గృ. నా. పూ; స్త్రీ. నా; సం. దేవతాసూచి. వి. చూ. చలసెట్టి. కమ్మ వారిలో ఇంటిపేరు.

చూ. –సాని గృ.నా.ప.

**చలసెట్టి**

వ్యక్తినామం (స.).

చల– గృ. నా. పూ; స్త్రీ నా. దేవతా సూచి.లక్ష్మి. చూ. –సెట్టి గృ. నా. ప.

**చలిచీమల**

కీటకసూచి (రా.).

చలిచీమ బహు. కు ద్వి.వి. చలి+చీమ. చెమ్మనేలలో వుండే చీమ. ఒక విధమైన నల్లచీమ. కమ్మవారిలో ఇంటిపేరు. కోలా. సల్లిచీమ; తె.చలిచీమ. డి.ఇ.డి. యస్. 366.

**చలినేడి**

వ్యక్తినామం (స.).

చలి– గృ. నా. పూ ?

చూ. –నేడి గృ.నా.ప.

**చలివేంద్ర**

పౌరుషనామం (స.).

చలి+వంద్రి: చల్లగా వుండడానికి వేసిన పందిరి.

**చలుచలుమల**

అస్పష్టనామబంధం (శా.).

''—చలుచలమల జయరామరెడ్డి—'' శా. 1712 (టి. యం. పి. పు. 653; నెం. 866).

**చల్ల**

రూ. చల్లా

ఆహారపదార్థసూచి (తె.శా.స.సా.).

చల్ల, మజ్జిగ. దేవాంగులలో, హరిజనులలో ఇంటిపేరు. '—చల్లతిమ్మారెడ్డి—' శా. 1573 (టి.యం.పి. II; పు. 1089; నెం. 319). ''—చల్లవంశాంబుధి

చంద్రుడై—" (విపే. వి. Tel. M. పు. 255). "—కవిగృహనామము చల్ల వారు. కవిపేరుసూరయ—" (పైది; పు. 256).

చల్లకూటి

ఆహారపదార్థసూచి (న.).

చల్లకూడుకు ఔప. మజ్జిగతో కలిసిన అన్నం. కాపులలో ఇంటిపేరు.

చల్లగాలి

బిరుదనామం (తె.రా.న.).

చల్లగావీస్తున్న గాలి. చల్లగాలి లాంటి చక్కని గానం వినిపించి నందువల్ల ఈ ఇంటిపేరు వచ్చింది. వి.చూ. సాహిత్యం లో ఇంటిపేర్లు. కాపులలో, రెడ్లలో ఇంటిపేరు.

చల్లంరాజు

వ్యక్తినామం (న.).

చల్లం— గృ.నా.పూ;<చల్లమ. ఆర్వేల నియోగి బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. —రాజు గృ.నా.ప.

చల్లా

చూ. చల్ల

ఆహారపదార్థసూచి (రా.న.).

కాపులలో, బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చల్లాప్రగడ

వ్యక్తినామం (న.).

చల్లా— గృ. నా. పూ; వి. చూ. చల్లా. ఆర్వేలనియోగ బ్రాహ్మణులలో ఇంటి పేరు. చూ. —ప్రగడ గృ.నా.ప.

చల్లావఝుల

వ్యక్తినామం (తె.).

చల్లా— గృ. నా. పూ; వి. చూ. చల్లా ప్రగడ. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. —వఝుల గృ.నా.ప.

చసినని

?<చసినేని

వ్యక్తినామం (శా.).

"—చసినని వాబలనాయుడు—" శా. 1449 (టి.యం.పి. పు. 27; నెం.181).

చాకలి

రూ. చాకి

కులసూచి (తె.రా.న.సా.).

చాకల+ఇ : చాకలవాడు. "—నరి మూడువేలతో చాకలిచందు—" (పల్నా. పు. 366; పం. 245). ఇది ప్రతిపల్లె లోనూ సాధారణంగా కనిపించే కులం. ఈ ఇంటిపేరు ఈ కులంలోనే ఉంది. చాకలి అని తెలంగాణా, రాయలసీమ, సర్కారు జిల్లాలోను, సాహిత్యంలోనూ కన్పిస్తుంది. చాకిఅని శాసనాలలో గృహ నామం ఉంది. ఇదే అర్థాన్నిచ్చే రజకం అనేపదం గృహనామంగా శాసనాలలో పేర్కొబడింది. 'చాకు' అంటే ఉత కడం, శుభ్రంచేయడం అని అర్థం. ఈ పదంనుండే చాకలి వచ్చింది. వీరు గ్రామ

చాకలి; బాన చాకలి అని రెండు రకాలు. బట్టలు ఉతికేటప్పుడు బాన ఉపయోగి స్తారుగనుక బాన చాకలి. అద్దకం వేసే వారు గూన చాకలి. వీరిలో ఛీమల అనే ఇంటిపేరు ఎక్కువగా కన్పిస్తుంది. గుమ్మడి ఇంటిపేరు గల చాకలి వారు గుమ్మడికాయ తినరు మల్లెవారు ఆ పూలు పెట్టుకోరు. ఉల్లంగుల, కాకు మాను, పీలం మొదలైనవి వీరి కులం లోని ఇంటిపేర్లు. సి.టి.యస్.ఐ VII. 197.

చాకలివోయిన

వ్యక్తినామం (తె.).

చాకలి– గృ. నా. పూ; వృత్తిసూచి. వి.చూ.చాకలి. చూ.–వోయిన గృ.నా.ప.

చాకి

చూ. చాకలి

కులసూచి (శా.).

"––చాకి చెన్నమనాయుడు––" శక. 1439 (టి.యం.పి. పు. 4; నెం. 62 .

చాగ

చూ. చాగం

పౌరుషనామం(తె.).

చాగం

రూ. చాగ

పౌరుషనామం (న.).

దానం, ఈవి. ప్రా. చాగో–; సం. త్యాగ–; క. ఛాగ,

చాగంరెడ్డి

వ్యక్తినామం (న.).

చాగం– గృ.నా.పూ. <ప్రా చాగ– <సం. త్యాగ–.

చూ. –రెడ్డి గృ. నా. ప.

చాగి

చూ. చాగం

పౌరుషనామం (శా.).

<సం. త్యాగిన్. చాగము+ఇ. చాగ కాడు, త్యాగశీలుడు. "––సూర్య వంశంబునేంటి చాగివెంకన కొడుకు––" 1088 A. D (ఇ. టి. ఐ. పు. 142; నెం. 161). "––చాగి పోతరాజు––" (యస్. ఐ. ఐ. VI. పం.2. నెం.94).

చాటల

వస్తుసూచి (తె. స.).

చాటబహు. కు. ద్వి.వి. <చేట. చెరిగే సాధనం.

చామంతులు

పుష్పసూచి (రా.).

<సం. సేమంతీ–: చేమంతిపూవు. చేమంతి బహు. కు. ద్వి వి. వ్య. నా; Chrysanthimum indicum చేమంతి పూవు. సం. సేమంతీ.

చామబోయు

వ్యక్తినామం (శా.).

చామ– గృ.నా.పూ. వర్ణసూచి. <ప్రా. స్సామా– <సం. శ్యామా. "––లోహపు

దివియ యొక్కణ్టి కింగిలారమన చామ బోను వెంటియయు—" 1055 A.D. (ఇ. టి. ఐ. పు. 107; నెం. 207 పం. 7–8).

చామల

ధాన్యసూచి (రా.).

చామ బహు. కు ద్వి .వి. <ప్రా. సా– <సం. శ్యామాక–; త. సామై.

చాయనేడి

వ్యక్తినామం (స.).

చాయ– గృ. నా. పూ; స్త్రీ. నా. <ఛాయాదేవి. సూర్యుని భార్య.

చూ. –నేడి గృ.నా.ప.

చారనేని

వ్యక్తినామం (స.).

చార– గృ. నా. పూ. ?<చారకుడు. సేనలు మొదలైనవాటిని నడిపేవాడు, నాయకుడు. చూ. –నేని గృ.నా.ప.

చారెడ్డి

వ్యక్తినామం (స.).

చా– గృ.నా.పూ. <చామి <చామ+ ఇ. వి చూ. చామబోయి.

చూ. –రెడ్డి గృ. నా. ప.

చిక్కం

రూ. చిక్కాల

వస్తుసూచి (స.).

<చిక్కము ; ఉట్టి. పశువుల మూతికి తగిలించడానికి తీగలు, లతలు మొదలైనవాటితో అల్లిన చిన్నబుట్ట. సం. శిక్యమ్; క. చిక్క–; త. చిక్కమ్.

చిక్కరాజు

వ్యక్తినామం (స.).

చిక్క– గృ.నా.పూ. <క. చిక్క– చిన్న, అందమైన. ఆర్వేల వియోగులలో ఇంటిపేరు. చూ. –రాజు గృ.నా.ప.

చిక్కాల

చూ. చిక్కం

వస్తుసూచి (స.).

చిక్కిన

<చిక్కనేని

వ్యక్తినామం (స.).

చిక్క– గృ. నా. పూ; పు. నా. <చిక్కయ. చూ. –న గృ. నా. ప.

చిగరాకుల

వృక్షసంబంధసూచి (రా.).

<చిగురాకుల. చిగురాకు బహు. కు ద్వి. వి. చిగురు+ఆకు. లేత ఆకు. పల్లవము. కాపులలో ఇంటిపేరు.

చిగురింత

వృక్షసూచి (తె.).

<చిగురించు : తృణవిశేషం. వాడిగా ఉండే ఆకులుకలిగి శీఘ్రంగా పెరిగేగడ్డి.

చింగినాద

పౌరుషనామం (తె.).

<సింగినాదం <శృంగనాదం. స్వాతంత్ర్యానికిపూర్వం మనం జీలకర్రను దిగుమతి చేసుకునే వారమట. నావనుండి జీలకర్రను దింపి అన్నిగ్రామాలకు సరఫరా చెయ్యడం కోసం శృంగనాదం (కొమ్ముబూర) చేసేవారట. శృంగనాదం చేసారుగనుక జీలకర్ర వచ్చిందని అర్థం. క్రమంగా ఈ శృంగనాదమే సింగినాదంగా మారిందని నాజర్‌గారు చెప్పారు. సింగినాదం జీలకర్ర. సా.

**చిటి**

చూ. చిట్టి

పరిమాణసూచి (..).

**చిట్ట**

పౌరుషనామం (శా.).

చైత్రమాసం. తెలుగుసంవత్సరంలో మొదటిమాసం. <ప్రా. చిట్టా– < సం. చైత్ర– "—చిట్ట కొమ్మనబోయుని కొడుకు—" (యస్. ఐ. ఐ. IV. పు. 213; పం, 2; నెం. 685).

**చిట్టాప్రగడ**

వ్యక్తినామం (స.).

చిట్టా– గృ. నా. పూ; జమాఖర్చుల పుస్తకం. లేక చిట్ట. హిం. చిట్టా; ప్రా. చిట్ట–; సం. చిత్ర–. ఆర్వేల నియోగి బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. –ప్రగడ గృ.నా.ప.

**చిట్టావఝుల**

వ్యక్తినామం (తె.).

చిట్టా– గృ.నా.పూ; వి.చూ. చిట్టాప్రగడ. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. –వఝుల గృ.నా.ప.

**చిట్టి**

రూ. చిటి

పరిమాణసూచి (తె.).

క. చిటి, చిఱు; త. చిట్టు : చిన్న, చిన్నది.

**చిట్టిసీడు**

చూ. చిట్టినేని

వ్యక్తినామం (స.).

కమ్మవారిలో ఇంటిపేరు.

**చిట్టినేని**

రూ. చిట్టిసీడు, చిత్నేని

వ్యక్తినామం (రా.స.).

చిట్టి– గృ.నా.పూ; వ్య.నా. <చిట్టయ, చిట్టమ్మ. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. –నేని గృ.నా.ప.

**చిట్టిపెద్ది**

వ్యక్తినామం (స.).

చిట్టి– గృ.నా.పూ; వి. చూ. చిట్టినేని. ఆరామద్రావిడులలో ఇంటిపేరు.

చూ. –పెద్ది గృ.నా.ప.

**చిట్టిబోయిన**

వ్యక్తినామం (స.).

చిట్టి– గృ.నా.పూ; వి.చూ. చిట్టి.

చూ. –బోయిన గృ.నా.ప.

చిట్టిమాల
తెగసూచి (తె.).
చిన్నమాల.

చిళ్ళేని
చూ. చిట్టినేని.
వ్యక్తినామం (స.).
కమ్మవారిలో ఇంటిపేరు.

చిడిపోతు
జంతుసూచి (స.).
చిడి- గృ.నా.పూ; <చిడిపి: చిన్న, అల్పం, చిన్నపోతు.

చిత్తజల్లు
బిరుదనామం (స.).
చిత్తకార్తెలో పడేవర్షపుజల్లు. దబాటు వాన. కొంచెంసేపు బాగాకురిసి వెంటనే తెరిపిస్తుంది. ఈ కార్తెలో సూర్యుడు చిత్త యందుంటాడు. వి. చూ. సాహిత్యంలో ఇంటిపేర్లు.

చిత్తారు
పౌరుషనామం (సా.).
<ప్రా. చిత్తఆర- <సం. చిత్రకార, "—ఘనమైన చిత్తారు గంగాధరుండ వినుపింతు—" (శృంగా. పు. 3).

చిత్రకవి
బిరుదనామం (స.సా.).
కవిత్వసూచి. చిత్రకవిత్వాన్ని అందరూ మెచ్చేవిధంగా చెప్పేవాడు. బ్రాహ్మణులలో ఇంటిపేరు. "చిత్రకవి వంశ దుగ్ధాబ్ధిశీతభాను—" (బిల్హ. 1-6). "—కొత్తపల్లి రంగాచార్యపుత్ర చిత్రకవి సింగరాచార్య—" (రాఘ. వా. ఆశ్వా. గ.).

చిత్రం
చూ. చిత్రము
పౌరుషనామం (తె.).

చిత్రము
చూ. చిత్రం
పౌరుషనామం (తె.స.).
ఆశ్చర్యం, చిత్తరువు, అనేకవిధాలైన, మనోజ్ఞమైన.

చినగోని
వ్యక్తినామం (తె.).
చిన- గృ.నా.పూ. <చిన్న.
చూ. -గోని గృ.నా.ప.

చినరబోల
వ్యక్తినామం (తె.).
చినర- గృ.నా.పూ; ఇంపైన, మనోజ్ఞమైన. ? <చిన్నరి.
చూ. -బోల గృ.నా.ప.

చింతకాయల
వృక్షసూచి (తె.).
చింతకాయ బహు. కు ద్వి.వి. చింత- గృ.నా.పూ; చూ. చింతల.
వృ. నా. Tamarindus indica.
చూ. -కాయల గృ.నా.ప.

చింతకింది

నివాసస్థలసూచి (తె.స.).

చింతచెట్టు కిందప్రదేశం. వి. చూ. చింతల. చింతచెట్టు కిందనివాసం ఏర్పాటు చేసుకున్నవారు.

చింతకుప్పల

వృక్షసంబంధసూచి (రా.).

చింతకుప్ప బహు. కు ద్వి. వి. వి.చూ. చింతగుంపల. కాపులలో ఇంటిపేరు.

చింతగుంపల

వృక్షసూచి (రా.).

? < చింతగుంపుల. చింతతోపులన్న అర్థం కావచ్చు.

చింతమనేని

వ్యక్తినామం (స.).

చింతమ– గృ. నా. పూ; వ్య. నా. < చింతమ్మ. కమ్మవారిలో ఇంటిపేరు.

చింతముత్తినేని

వ్యక్తినామం (స.).

చింతముత్తి– గృ. నా. పూ; ? < చింత ముత్తయ. చింత– చూ. చింతల; –ముత్తి– < ముత్తయ < ముత్త+అయ. –ముత్త–ముదుసలి, వృద్ధ.

చూ. –నేని గృ.నా.ప.

చింతరెడ్డి

వ్యక్తినామం (రా.).

చింత– గృ. నా. పూ; వృక్షసూచి. వి.చూ. చింతల. చూ. –రెడ్డి గృ.నా.ప.

చింతల

రూ. చింతా

వృక్షసూచి (తె.రా.స.).

వృ. నా : Tamarindus indica, తింత్రిణీ వృక్షం. కమ్మ,కోమటి,గొల్ల, దేవనాగ, మాల, మాదిగ కులాలలో ఇంటిపేరు.

చింతా

చూ. చింతల

వృక్షసూచి (తె.స.).

కమ్మవారిలో, కోమట్లలో ఇంటిపేరు.

చింతాకుల

వృక్షసూచి (తె.).

చింతాకు బహు. కు ద్వి.వి. చింత+ ఆకు.చింత– గృ.నా.పూ.వి.చూ.చింతల.

చూ. –ఆకుల గృ.నా.ప.

చింతాబత్తిని

వ్యక్తినామం (స.).

చింతా–గృ.నా.పూ; వ్య.నా. చింత+అ. వి.చూ. చింతల చూ. –బత్తిని గృ.నా.ప.

చిన్నపరెడ్డి

వ్యక్తినామం (స.).

చిన్నప– గృ.నా.పూ; వ్య.నా. < చిన్నప్ప. < చిన్న+అప్ప. చిన్న– చిన్నదైన. క. చిన్న; త. చిన్న. –అప– చూ. –అప్ప గృ.నా.ప.

చూ. –రెడ్డి గృ.నా.ప.

చిన్నబూమన్నగారి

వ్యక్తినామం (రా.).

చిన్నబూమన్న– గృ.నా.పూ; చిన్న– వి. చూ. చిన్నపరెడ్డి. –బూమన్న– భూమి+అన్న. భూమన్న.

చూ. –గారి గృ.నా.ప.

చిన్నం

లోహపరిమాణసూచి (స.).

నాల్గుగురివెండ గింజల ఎత్తుగల బంగారు నాణెమని శ. ర; రెండు గురి వెండ గింజల ఎత్తు బంగారమని చి.వి. అని సూ.ని; తులంలో ముప్పయ్యవవంతు అని. వరహాలో ఎనిమిదవ వంతు విలువగల నాణెమని బ్రౌ; నాలుగు పాతికలని కొందరు. కమ్మవారిలో ఇంటి పేరు. క.చిన్న. చిన్నమంత బంగారం అని వాడుక.

చిన్నంసెట్టి

వ్యక్తినామం (స.).

చిన్నం–గృ.నా.పూ;వ్య.నా. <చిన్నమ.

చూ. –సెట్టి గృ.నా.ప.

చిన్నరెడ్డి

రూ. చిన్నారెడ్డి

వ్యక్తినామం (రా.).

చిన్న– గృ.నా.పూ; వి. చూ. చిన్నప రెడ్డి. చూ. –రెడ్డి గృ.నా.ప.

చిన్నలచ్చిగారి

వ్యక్తినామం (రా.).

చిన్నలచ్చి–గృ.నా.పూ; స్త్రీ నా.చిన్న– చూ. చిన్నపరెడ్డి. –లచ్చి–లక్ష్మిదేవి.

చూ. –గారి గృ.నా.ప.

చిన్నవారి

పౌరుషనామం (రా.).

చిన్న– గృ.నా.పూ; వి. చూ. చిన్నప రెడ్డి. చూ. –వారి గృ.నా ప.

చిన్నవాండ్ల

పౌరుషనామం (రా.).

వయసులో చిన్నవారు, అల్పులు త. చిన్న;క.చిన్న. చూ. –వాండ్ల గృ నా.ప.

చిన్నాబత్తుల

వ్యక్తినామం (స.).

చిన్నా–గృ.నా.పూ; చిన్న+అ. వి.చూ. చిన్నపరెడ్డి. చూ. –బత్తుల గృ.నా.ప.

చిన్నారెడ్డి

చూ. చిన్నరెడ్డి

వ్యక్తినామం (రా.).

?<చెన్నారెడ్డి.

చిప్ప

రూ. చిప్పల

పౌరుషనామం (తె.).

కల్లుతాగేగిన్నె; ముత్తెపుచిప్ప. ప్రా. సిప్పి–; సం. శుక్తి–; క. చిప్పు; త. చిప్పి.

చిప్పల

చూ. చిప్ప

పౌరుషనామం (స.).
చిప్ప బహు. కు ద్వి. వి.

**చిమట**

రూ. చిమటా
వృత్తి పరికరసూచి (స.).
కత్తి మొదలైనవానిని అమర్చేపిడి యొక్క కొన, చిమ్మట, మంగలి వాని సాధనం. కమ్మవారిలో ఇంటిపేరు. <ఉ. చిమ్టా; త. చిమిట్టా; క. చిమట.

**చిమిలికోటి**

వస్తుసూచి (తె.).
చిమిలి- పొగనుఆపి కాంతినిచ్చే గాజు గొట్టం. -కోటి : అంచు; దీపపుకొడి.

**చింపగాళ్ళు**

అంగవైకల్యసూచి (రా.).
వంకరకాళ్ళు గలవాళ్ళు.

**చిరి**

పక్షిసూచి (స.).
?<సం. చిరి : చిలుక. ?<చిటి : వృక్షసూచి. చిట్టికూర.

**చిలకా**

రూ. చిల్కా
పక్షిసూచి (తె.రా.స.).
<చిలుక. శుకం, కీరం. సం. శుక-; త. కిళి,కిళ్ళయ్; మ. కిళి: క. గిళి, గిణి; తు.గిళి, గిణి; తె.చిలుక. డి.ఇ.డి.1318. కమ్మవారిలో ఇంటిపేరు. బహు. రూపమైన చిలకల కమ్మ, కాపు, బోయ యానాదులలో గృహనామమని సి. టి. యస్. ఐ.

**చిలకాబత్తిన**

వ్యక్తినామం స.).
చిలకా-గృ నా.పూ; గృ.నా.పక్షిసూచి. వి.చూ.చిలుకా. చూ. -బత్తిన గృ.నా.ప.

**చిలంనేని**

వ్యక్తినామం (స.).
చిలం- గృ. నా. పూ. ?
చూ.- నేని గృ.నా.ప.

**చిలిపెద్ది**

వ్యక్తినామం (స.).
చిల- గృ.నా.పూ.? ఆర్వేల నియోగులలో ఇంటిపేరు. చూ. -పెద్ది గృ.నా.ప.

**చిలుముల**

పౌరుషనామం (తె.).
చిలుముకు 'ల' ఆగమంగా చేరిన రూపం లోహపు పాత్రలకు వుండే మురికి. కిలుం. ?<చిలుము. <హిం. చిలమ్. గంజాయిగొట్టం. రూ. చిల్లము.

**చిలుమోజి**

చూ. చిలువోజి
వ్యక్తినామం( తె.).

**చిలువ**

సరీసృపసూచి (స.).
చిలుము+వా. నోటిలో విషంకలది. విషధరం. పాము. చిలుము : విషం; -వా : నోరు.

చిలువోజి

రూ. చిలుమోజి

వ్యక్తినామం (తె.).

మరాఠీ వ్యక్తినామం. చిలు–గృ.నా.పూ.? చూ. –ఓజి గృ.నా.ప.

చిల్క

చూ. చిలకా

పక్షిసూచి (న.సా.).

"––శివమద్దుదేవయ్యచిల్కదేవయ్య––" (పండి. పు. 243)

చిల్లర

పౌరుషనామం (తె.న.సా.).

చింతపండు, అల్లం మొదలైన చిన్న చిన్న సరుకులు. క.చిల్లఱ; త. చిల్లఱై; తు.చిల్లరె. "––వెన్నయ యనుజుండు––చిల్లరనాగరాజు––" (శకుం.ప.1–39). "––మంత్రి చిల్లర వెన్నమంత్రి––" (శకుం. ప. 1–14). "––అనుమఁజిల్లర వెన్నామాత్యవరుని––" (పైది. 1–31).

చిల్లా

వృక్షసూచి (రా.).

చిల్ల+ఆ : చిల్లకు సంబంధించిన. ఇందుగ చెట్టు. ఈచిల్లగింజల గంధం నీటిలో కలిపి బురదనీటిని తేర్చుతారు. కురుబలలో గృహనామ మని సి. టి. యస్. ఐ.

చివుకులు

పౌరుషనామం (న.).

చివుకు బహు. కు ద్వి.వి. తడిసి పాత బడినందువల్ల సారహీనమైనది; క్షీణించు; చచ్చు.

## చీ

చీకటి

పౌరుషనామం (తె.రా.స ).

చీకు+కట్టు. తెల్లగా తెల్లవారకముందు కాలం, అంధకారం. కోలా. చీకటి; పర్జీ. చీకొడ్. డి.ఇ.డి. 2144.

చీటి

పౌరుషనామం (స.).

కొద్దిగా రాసిన చిన్న కాగితపుముక్క, ఆజ్ఞాపత్రం. హిం. చిఠీ; క.చీటి;త.చీట్టు.

చీనే

వస్త్రసూచి (రా.).

చీనాదేశానికి సంబంధించిన ఒక విధ మైన వస్త్రం. చీనే వస్త్రాలతో వ్యాపార సంబంధాలు చేసి ఉండవచ్చు.

చీపురు

వస్తుసూచి (తె.రా.).

ఇంటిని శుభ్రంచేసే పూచిక. కొబ్బరి మొదలైన పుల్లలతో కట్టినకట్ట,సమ్మార్జని. క. చీపరి.

చీమల

కీటకసూచి (తె.రా.).

చీమ బహు. కు ద్వి. వి. చాకలి, బోయ కులాలలో ఇంటి పేరుగా కన్పి

స్తుంది. సం. సీమికా_. త.సీమ;కో లా. సీమ; నాయకి. సీమ. డి.ఇ.డి. 2156.

చీర

రూ. చీర్ల

వస్త్రసూచి (తె.).

ఇప్పుడు స్త్రీలు ధరించేదాన్ని మాత్రమే చీర అంటున్నారు. సం. చీరమ్; త. చీరై; క. సీరె.

చీర్ల

చూ. చీర

వస్త్రసూచి (స.).

<చీరలు. చీర బహు. శు ద్వి.వి.

## చు

చుక్కన

వ్యక్తినామం (స.).

చుక్క+అన. చుక్క— గృ. నా. పూ; <ప్రా. సుక్క— <సం. శుక్ర— నవ గ్రహాలలో ఒకటి; శుక్రుడు.

చూ. -అన గృ. నా. ప.

చుక్కా

పౌరుషనామం (తె.స.).

నవగ్రహాలలో ఒకటి, నీటి బిందువు, నక్షత్రం; పూర్వంబడికి మొట్టమొదట వచ్చినవాడికి శ్రీ గుర్తు, రెండోవాడికి చుక్క. మూడవవాడికి దెబ్బ యిచ్చేవారట. ?< శుక్ర— వి.చూ. చుక్కన. ?<వృక్ష విశేషం. <సం. చుక్ర—. చుక్కాకు, చుక్కకూర, ఎరుకలలో బలిజలలో ఇంటిపేరు.

చుక్కా-భట్ల

వ్యక్తినామం (తె.).

చుక్కా— గృ.నా పూ; గృ.నా. వి.చూ. చుక్కన. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. _భట్ల గృ.నా.ప.

చుంచు

జంతుసూచి (తె.రా.శా.).

కంపెలుక, చుంచెలుక. కమ్మవారిలో ఇంటిపేరు. సం.చుచుందరీ_: క.చుంచు. త. చుంటు. డి.ఇ.డి. 2190.

"—లెక్కల కొమ్మిసెట్టి కుంతురు చుంచు వెమ్మిసెట్టి సోదరి—" 1074. A.D. (ఇ.టి.ఐ.పు.125; నెం. 142).

## చె

చెక్క

రూ. చెక్కల

పదార్థసూచి (తె.).

చెట్టుమానునుండి తీసిన పల్చనిముక్క, పేడు. <చెక్కు.

చెక్కల

చూ. చెక్క

పదార్థసూచి (రా స.).

చెక్క బహు. శు ద్వి.వి.

చెంగల్వ

పుష్పసూచి (సా ).

చెన్ను+కలువ : ఎర్రకలువ. ఎర్ర

తామర. చెన్ను- ఎరుపురంగు "--కవి వినుతచర్య చెంగల్వ కాళనార్య !" (రాజగో. 1-30). "--చెంగల్వ వెంకటయ్యయును--"(రాజగో. పు.60, పం. 222-24). "--సారస్వత తనయ చెంగల్వ వెంకటయ్య తనయ--"(పైది. పు. 62; ఆశ్వా. గద్య.).

చెంచు

తెగసూచి (తె.స.).

కిరాతభేదం. క. చంచ; తె. చెంచు. డి.ఇ.డి. 1889. కర్నూలు. నెల్లూరు జిల్లాల కొండల్లో నివసిస్తున్న అడవి జాతి. అహోబలంలోని నరసింహస్వామి తమ కులానికి చెందిన స్త్రీని వివాహం చేసుకున్నాడని చెంచులు భావిస్తారు. అందుకే ఓబలేశుణ్ణి 'అల్లుడు' అంటారు. అరటి, ఇండ్ల, గుజ్జం, తోట, మేకల, నవరం మొదలైనవి ఈ కులంలోని ఇంటిపేర్లు. సి.టి.యస్.ఐ. II. 26.

చెట్టిగారి

పౌరుషనామం (తె.).

చెట్టి- గృ.నా.పూ; పట్టపుపేరు.వి.చూ. సెట్టి. -చూ. -గారి గృ.నా.ప.

చెట్ల

వృక్షసూచి (తె.).

చెట్టు బహు, కు ద్వి.వి.

చెన్న

చూ. చెన్ను

పౌరుషనామం (తె.).

చెన్ను+అ.

చెన్నగోని

వ్యక్తినామం (తె.).

చెన్న- గృ.నా.పూ; పు. నా. <చెన్న కేశవ. దేవతాసూచి.

చూ. -గోని గృ. నా. ప.

చెన్నమరాజు

వ్యక్తినామం (స.సా.).

చెన్నమ-గృ నా.పూ; వ్య నా. వి.చూ. చెన్నంసెట్టి. చూ. -రాజు గృ.నా.ప.

చెన్నమల్లు

వ్యక్తినామం (స.).

చెన్న- గృ.నా.పూ; వి. చూ. చెన్నం సెట్టి. చూ. -మల్లు గృ.నా.ప.

చెన్నంసెట్టి

వ్యక్తినామం (స.).

చెన్నం- గృ. నా పూ; <చెన్నమ. వ్య.నా. చెన్న+అమ. చెన్న- <చెన్న కేశవ; -అమ- చూ. గృ.నా.ప.

చూ. -సెట్టి గృ.నా.ప.

చెన్నాప్రగడ

వ్యక్తినామం (స.).

చెన్నా- గృ. నా. పూ; వ్య.నా. దేవతా సూచి. చెన్న+అ. వి.చూ. చెన్నంసెట్టి బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. -ప్రగడ గృ.నా.ప.

చెన్నాబత్తిన

వ్యక్తినామం (స.).

చెన్నా- గృ.నా.పూ; దేవతాసూచి <చెన్న+అ. వి.చూ. చెన్నంసెట్టి

చూ. -బత్తిన గృ.నా.ప.

చెన్నావఝల

వ్యక్తినామం (తె.).

చెన్నా- గృ.నా.పూ; దేవతాసూచి వి.చూ. చెన్నంసెట్టి. బ్రాహ్మణులలో ఇంటిపేరు <చెన్న+అ.

చూ. -వఝల గృ.నా.ప.

చెన్ను

రూ. చెన్న

పౌరుషనామం (స.).

అందం, సౌందర్యం, శోభ. ఎరుపు రంగు. హరిజనులలో ఇంటిపేరు. <క. చన్న.

చెన్నుభట్ల

వ్యక్తినామం (తె.స.).

చెన్ను- గృ.నా.పూ; దేవతాసూచి. వ్య.నా. <చెన్నుడు. బ్రాహ్మణులలో ఇంటిపేరు. ?<క.చన్న. వి.చూ. చెన్ను.

చూ -భట్ల గృ. నా. ప.

చెన్నోజి

వ్యక్తినామం (తె.).

చెన్ను- గృ. నా. పూ. దేవతాసూచి. వి.చూ. చెన్నురట్ల.

చూ. -ఓజి గృ.నా.ప.

చెమ్మరాజు

వ్యక్తినామం (స.).

చెమ్మ- గృ.నా.పూ.? ఆర్వేలనియోగి బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. -రాజు గృ.నా.ప.

చెరకు

రూ. చెరుకు

వృక్షసూచి (తె.రా.స.).

ఉ : చెఱ్కు. క. చెరుకు.

వృ.నా : Saccharum officenarum

చెరుకు

చూ. చెరకు

వృక్షసూచి (తె.రా.స.).

జోగి, బోయ కులాలలో ఇంటిపేర్లు.

చెరువు

జలసూచి (తె.స.).

తటాకం, కొలను సం.సర-; మ.చిఱ; క. కెఱె; పర్జి. చెరు; కోలా. చెఱు. డి.ఇ.డి. 1848

చెర్లో

జలసూచి (రా.).

<చెరువులో. చెరువులోపలి భాగం. వి.చూ. చెరువు.

చెలమలసెట్టి

చూ. చలమలసెట్టి

వ్యక్తినామం (స.).

చెలికాని

పౌరుషనామం (శా.స.పా.).

చెలికాడు కు ఔప. సంబంధసూచి. "—పద్మనాయక కులప్రధాన చెలికావి రామరాట్తనయ—" (నీలావ. 1-3).

చెలిగోని

వ్యక్తినామం (తె.).

చెలి-గృ.నా.పూ.?చూ.-గోనిగృ.నా.ప.

చెల్ల

పౌరుషనామం (తె.రా.శా.).

?<చెల్లు. వ్యవహార దక్షనాధికారం. శా.శ. రెల్లలో ఇంటిపేరు. "—చెల్ల నరమారెడ్డి—" శా.1558 (టి.యం పి. పు. 637; నెం. 661).

చెవిటమ్మగారి

పౌరునామం (రా.).

చెవిటమ్మ- గృ. నా. పూ; స్త్రీ. నా. చెవిటి+అమ్మ. చెవిటి- చూ. చెవిటి. -అమ్మ- చూ. -అమ్మ గృ. నా. ప.

చూ. -గారి గృ.నా.ప.

చెవిటి

అవయవలోపసూచి (తె.రా.స.).

చెవి+అవిటి ; చెవిటివాడు. -అవిటి : అంగహీనుడు. మాదిగలలో ఇంటిపేరు. త.చెవిటి; మ. చెవిటు; క. కివుడు; తు. కెప్పు. డి. ఇ.డి. 1645

చెవుల

అవయవసూచి (తె.స.సా.).

చెవి బహు కు.ద్వి.వి. కర్ణము. గొల్ల. బోయలలో ఇంటిపేరు. సం. శ్రవ-; త. చెవి; మ. చెవి; క. కివి; తు. కెబి. "—చెవుల బోయని ఇంటి సింహంబు వచ్చె—" (వల్హా.పు.160;పం.2123). "—గొట్టిపాళ్ళను చెవులగోపన యెరిగి—" (పైది పు. 89; పం. 88).

చేట్ల

చూ. చాటల

వస్తుసూచి (స.).

చేతంసెట్టి

వ్యక్తినామం (స.).

చేతం- గృ.నా.పూ; <ప్రా. చేత్తం- <సం. చైత్యం. చూ: -సెట్టి గృ.నా.ప.

చేమ

రూ. చేమకూర

శాకసూచి (తె.).

ఉ : శామ, సామ,సావ,సోమ, సోవ. వృ.నా. : Colocasia antiquorum.

# చే

చేమకూర

చూ. చేమ

వృక్షసూచి (తె.).

చేరెడ్డి

వ్యక్తినామం (స.).

చే- గృ.నా. పూ.?

చూ. -రెడ్డి గృ.నా.ప.

చేసబోయిన

వ్యక్తినామం (తె.).

చేస- గృ.నా.పూ.?
చూ. -బోయిన గృ నా.ప.

చేసెట్టి
వ్యక్తినామం (స.).
చే- గృ.నా.పూ.?
చూ. -సెట్టి గృ.నా.ప.

చొప్పకట్ల
తృణ సంబంధసూచి (తె.).
చొప్పకట్ట బహు. కు. ద్వి.వి. చొప్ప-జొన్న మొదలైన వానిదంటు. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చోడప్పరాజు
వ్యక్తినామం (స.సా.).
చోడప్ప- గృ.నా.పూ? చోడ+అప్ప.
?<చోడ- చోడదేశానికి సంబంధించిన.
?<చౌడ- <చాముండ-
చూ. -రాజు గృ.నా.ప.

చోడి
సస్యసూచి (స.).
ధాన్య విశేషం. చోళ్లు.

చౌగోని
వ్యక్తినామం (తె.)
చౌ- గృ.నా.పూ; చతురస్రం.
?<చవుకము. చవుకమునకు అంత్య వర్ణం లోపించగా మిగిలిన రూపంచౌ <ప్రా. చఉక్క- <సం. చతుష్కమ్; క. చవుక; త. చవుక్కం.

చౌదరి
వృత్తిసూచి (సా.).
పంటలో నాల్గోవంతయిన 'చౌత్' అనే పన్ను వసూలుచేసే ఉద్యోగి. చక్రధారి శబ్ద భవమని కొత్త భావయ్యచౌదరి గారి భావన. "-నిరతిన్ చౌదరి రామ భూపతి-" (ద్రౌప.1-156). 1579లో గోల్కొండ నవాబు ఇబ్రహీం కుతుబ్షా కొండవీడు సీమను వశపరచుకున్నప్పుడు రాయరావను మహారాష్ట్రి సేనానిని పాలకునిగా నియమించగా అతడు 497 గ్రామాలను 14 సముతులుగా చేసి, వానికి చౌదర్లను నియమించెను. దేశపాండ్యాలు, దేశముఖులు, మన్నెవారు, చౌదర్లు అనే పాలకుల నేర్పరచిరి. ఈ సమితులలో కమ్మవారినే నియమించారట. (కమ్మ. చ. పు. 221.). చౌదరి వ్యక్తి నామానుబంధంగా పట్టపుపేరై వాడుక పడింది.

## జ

జక్కనభట్ల
వ్యక్తినామం (స.).
జక్కన- గృ.నా.పూ: వ్య.నా.?<ప్రా జక్ఖ- <సం. యక్ష- కరణ కమ్మలలో ఇంటిపేరు. చూ. -భట్ల గృ.నా.ప.

జక్కరాజు
వ్యక్తినామం (సా.).
జక్క- గృ.నా.పూ; పు.నా. వి.చూ. జక్కన భట్ల "-భారద్వాజ గోత్ర

జక్కరాజ యెఱ్ఱనామాత్య పుత్ర--" (ఆంధ్రకా ఆశ్వా.గ.). "ఇది---భారద్వాజసగోత్ర జక్కరాజు యఱ్ఱయామాత్య పుత్ర---" (కామం. Tel Ma. పు. 309)

**జక్కుల**

తెగసూచి (తె.రా.శా.స.).

కామేశ్వరిని కొలుచు మాంత్రికులగు ఒక జాతివారని శ.ర. <ప్రా. జక్ఖ- <సం యక్ష- యక్షులు. బలిజకులానికి చెందిన వేశ్యలని, నాట్యం చేసేవారని, కృష్ణాజిల్లాలోని తెనాలి ప్రాంతంలో పతి జక్కులవారు తమ కుటుంబంలోనుండి ఒక బాలికను వేశ్యగాఉవ్వడం ఆచారంగా వుండేదని సి టి. యస్. ఐ. I. పు. 438. "--జక్కుల కన్నమ--" శా. 1403 (ఇ. టి ఐ. II; పు. 148 నెం. 77).

**జగడం**

పౌరుషనామం (రా.).

క. జగళ్ : జగడం, పోరు, యుద్ధం.

**జగన్నాథం**

వ్యక్తినామం (రా.).

దేవతాసూచి. <జగన్నాథుడు. జగన్నాథ క్షేత్రంలో వెలసిన మహా విష్ణువు. జగన్నాథం ఓఢ్రదేశంలో ప్రసిద్ధిచెందిన పుణ్యక్షేత్రం.

**జగ్గరాజు**

వ్యక్తినామం (స.).

జగ్గ-గృ.నా.పూ; వ్య.నా. < జగన్నాథ. ఇది జగన్నాథకు సంక్షేపరూపం. వి.చూ. జగన్నాథం. ఆర్వేలనియోగి బ్రాహ్మణులలో ఇంటిపేరు. చూ -రాజు గృ.నా.ప.

**జగ్గు**

వ్యక్తినామం (తె.).

<జగ్గయ్య. జగన్నాథ శబ్దానికి సంక్షేప రూపం.

**జగ్గుభట్ల**

వ్యక్తినామం (తె).

జగ్గు- గృ. నా. పూ; దేవతాసూచి. వి. చూ. జగ్గు. బ్రాహ్మణులలో ఇంటిపేరు. చూ. -భట్ల గృ.నా.ప.

**జంగం**

చూ. జంగమ

కులసూచి (తె.రా.శా.స.).

"--జంగం బసవయ్య--" (టి.యం. పి. II. పు. 952; నెం. 448). "--జంగం మల్లయ--" (యస్. ఐ. ఐ. VI; పు. 220; పం.182; నెం 70). "--జంగం జన్నెభూమయ్య--" (టి. యం.పి. II; పు. 259; నెం. 35).

**జంగమ**

రూ. జంగం, జంగాల

కులసూచి (సా.).

జంగం జాతివాడు. లింగంధరించి శివుని మాత్రమే ఆరాధించే ఒకజాతి. "—సద్వరిష్టఫలదు జంగమ మల్లికార్జునివి—"(కుమా. 1–12). "—జంగమ మల్లయ—" (పైది. 1–46).
"Strictly speaking, a Jangam is a priest to the religious sect of Lingayats, but the term is frequently loosely applied to any lingayat which accounts for the large numbers under this head" అని మద్రాస్ సెన్సస్ 1901లో ఉంది. లింగాయతులు కాని శూద్రులకు జంగం వారు గురువులు. జంగమంఅంటే కదలడం. కదులుతున్న లింగాన్ని పూజిస్తారు కనుకనే వారికి జంగమ లింగాయతులని పేరు. తెలుగు దేశంలో లింగాయతుల్నే జంగాలంటారు. వి.చూ. సి.టి.యస్.ఐ. II, 450

జంగాల

చూ. జంగమ

కులసూచి (స.).

జంగిరెడ్డి

వ్యక్తినామం (స.).

జంగి– గృ.నా.పూ; పు.నా.దేవతాసూచి. శివుడు. <జంగమయ్య. <జంగము +అయ్య. జంగము–<సం. జంగమ–. తిరిగేవాడు, శివభక్తుడు.

చూ. –రెడ్డి గృ.నా.ప.

జంగ్లి

పౌరుషనామం (తె.).

<జంగిలి : అల్పసైన్యాధిపతి; మృగ సమూహం, పశువుల మంద.

జడ

పౌరుషనామం (రా.స.).

స్త్రీలు తలదువ్వుకొని వెంట్రుకలు అల్లుకొనే విధం. వేణి. ?<వృక్షసూచి. దూలగొండి చెట్టు, నేల ఉసిరిక చెట్టు.

జనమంచి

వ్యక్తినామం (స.).

జన– గృ.నా.పూ. ?

చూ –మంచి గృ.నా.ప.

జనార్దన

వ్యక్తినామం (స.).

దేవతాసూచి. <సం. జనార్దన– హరి.

జపాల

పౌరుషనామం (తె.).

జపం బహు. కు ద్వి. వి. మంత్రాల ఆవృత్తి,వేదాధ్యయనం.మంత్రాక్షరాలను, వాటి అర్థాన్ని అనుసంధిస్తూ మనసులో గాని, కొంచెం పెదవి కదుల్చుతూగాని చిన్న శబ్దంతోగాని, పెద్ద శబ్దంతోగాని జపమాల మొదలైనవి లెక్కపెడుతూ ఉచ్చరించడం.

జమిలి

పౌరుషనామం (స.).

ప్రా. జమళం; సం. యమళమ్;

క. జవళి : జంటయైనది.

జంపాల

పౌరుషనామం (తె.స.).

ఊగు, ఉయ్యాల. కమ్మవారిలో ఇంటి పేరు. ?<జంబాలము : అడుసు, ఒక విధమైన నాచు, మొగలిచెట్టు.

జమ్మి

రూ. జమ్మిగుంపు

వృక్షసూచి (స.).

వృ.నా. : Prosopis spicigena.

ప్రా. సమీ: సం. శమీ; త. సంబై : శమీవృక్షం.

జమ్మిగుంపు

చూ. జమ్మి

వృక్షసూచి (స.).

జమ్మిచెట్ల గుంపు.

జమ్ముఏనుగు

వృక్షసూచి (రా.).

జమ్ముల

వృక్షసూచి (తె.స.).

జమ్ము బహు. కు. ద్వి.వి. తృణ విశేషం. లావుతుంగ. కమ్మవారిలో ఇంటిపేరు.

జయంతి

వ్యక్తినామం (సా.).

<సం. జయంతీ. స్త్రీ.నా. దుర్గాశక్తి భేదం, ఇంద్రుని కూతురు. బ్రాహ్మణులలో ఇంటిపేరు. "—వెలనాటి శాఖలోపల జయంతివారు నానొప్పు—" (చంపూరా. 1-11). "—జయంతి వంశ రత్నాకర సుధాకర—" (పైది. పు. 26).

జరుగుబిల్లి

జంతుసూచి (స.).

?<జంగుబిల్లి. అడవిపిల్లి

జల

జలసూచి (తె.).

నీటిఊట. కొంతలోతున కొన్ని నియమితమైన మార్గాలవెంట పారుతున్న ప్రవాహానికి 'జల' అని పేరు.

జలగంతి

అస్పష్టనామబంధం (శా.).

"—జలకుంతి అప్పయ—" శా. 1664. (టి.యం.పి. I; పు. 623. నెం. 543)

జలగం

పౌరుషనామం (రా.స.).

<జలగము: మద్యము. వా. వెలమలలో ఇంటిపేరు.

జలగుండల

జలసూచి (స.).

జలగుండ బహు. కు ద్వి. వి. నీటి గుంట. వి.చూ. జల. -గుండ <గుండము <సం. కుండమ్. గొయ్యి, పల్లం. నీటితో ఉన్న గుంటలు.

జలది

జలసూచి (స.).

<జలధి : నీటికి ఆధారమైనది. సముద్రం.

జలం

జలసూచి (స.).

<జలము, నీళ్లు.
కమ్మవారిలో ఇంటిపేరు.

జలసూత్రం

జలసూచి (స.).

కృత్రిమమైన నీటిఊట. బ్రౌ. ఫౌంటెన్ కావచ్చు. ఒక పాత్రలోనుంచి మరొక పాత్రలోనికి నీరు పడడానికి రెండు కొనలను గొట్టాలుకట్టి ఆ పాత్రల్లో వుంచిన దారం. చంద్రాంగద చరిత్రలో పైడిమర్రి వేంకటపతి ఈ జలసూత్రాన్ని ఇలా పేర్కొన్నాడు. "తీరిచినట్లుగాగ విరుదిక్కుల నొక్కట జాలువాఱు సింగారపు ఱగ్గ చెంతఁగదఁకన్ జల సూత్రము వన్నినట్లుగా సారసగంధి యొర్తు బొమసందున ఁగస్తూరిబొట్టు వెట్టియెంతే రహిఁజేర్చె వజ్రములదీరిన పాపటబొట్టు వేడుకన్" (6–28).
బ్రాహ్మణులలో ఇంటిపేరు.

జలిగని

వ్యక్తినామం (శా.).

?<జలిగౌని ఒల్లి గృ.నా.పూ.?
"—జలిగని క్రిష్ణప్ప—"(టి యం.పి. పు. 595; నెం. 226).
చూ. –గౌని గృ.నా.ప.

జల్ల

వస్తుసూచి తె.).

మోత బండిమీద గూడ, పెద్దగంప, బండిజల్ల.

జల్లి

ఆభరణసూచి (రా.స.).

కొప్పుపై నుంచుకొనే ఆభరణం, కర్ణాభరణ విశేషం. హరిజనులలోను, రెడ్డి కులంలోను ఇంటిపేరు.

జల్లెళ్ళ

వస్తుసూచి (స.).

జల్లెడ ఒహు. ఓ ద్వి.వి. పిండి మొద లైనవి జల్లించే సాధనం. క. జల్లడి; త. సల్లడై.

జవాజి

పౌరుషనామం (రా.స.).

<జవ్వాది సంకుమదం. ఒక జాతి పిల్లి వలన కలిగే పరిమళ ద్రవ్యం. సం. జవాది: క. జవాజు, త. సవాదు. కమ్మ వారిలో ఇంటిపేరు.

జా

జాగీర్దార్

పౌరుషనామం (తె.).

మరాఠీ. జాగీర్‌దార్; పా. జాగీర్దార్. ప్రభువు సన్మానంగా ఇచ్చిన భూమిని గాని దేశాన్నిగాని పొందినవాడు,

జాజి

రూ. జాజుల

పుష్పసూచి (తె.).

<జాది: జాతిపువ్వు. జాజిపువ్వు.

?<జాజి సం. యోధుడు.

జాజుల

చూ. జాజి

పుష్పసూచి (తె.).

జాజి బహు. కు ద్వి.వి.

జాతర

ఉత్సవసూచి (స.).

<సం. యాత్రా. శక్తి మొదలైన గ్రామదేవతలకు చేసే ఉత్సవం. దేవుడు, సముద్రం, పర్వతం, పుణ్యక్షేత్రం మొదలైన వాటికోసం చేసే ప్రయాణం.

జాన

వృక్షసూచి (స.).

<జాన. ఫలవృక్షం.

జామకాయల

వృక్షసూచి (తె.).

జామకాయ .బహు. కు ద్వి.వి. జామ– గృ.నా.పూ: ఫలవృక్షం. హిం. జామ్. వృ నా : Psidium guava.

చూ. –కాయల గృ. నా. ప.

జాస్తి

పౌరుషనామం (స.).

ఎక్కువ

## జి

జిగురు

పౌరుషనామం (తె.).

బంక, జిగురు. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

జింక

రూ. జింకల

జంతుసూచి (తె.స.).

ఒకజాతి లేడి పద్మసాలీలలో ఇంటి పేరు. క. జింకె; తు. జింకె తె. జింక. ది ఇ.డి. 2066

జింకల

చూ. జింక

జంతుసూచి. (తె.రా.స.).

జింక బహు. కు ద్వి.వి. పద్మసాలి, బోయకులాలలో ఇంటిపేరు.

జిడ్డు

పౌరుషనామం (స.).

నెయ్యి మొదలైన వాటి యందలి మెఱుగు, జిగురు. క. జిడ్డు; తుయి. జింద్రు డి.ఇ.డి. 2076. వృక్షవిశేషం అనే అర్థంలో హంస వింశతిలో జిడ్డు వాడబడిందని సూ. ని.

జిత్తి

పౌరుషనామం (శా.).

?<జిత్తు <సం. యుక్తి.: ఉపాయం, మోసం. "–జిత్తి రామనాయక—

శా. 1169 (టి. యం. పి. పు. 680, నెం. 925).

జినపనేని

వ్యక్తినామం (వ.).

జినప– గృ.నా.పూ; పు.నా. దేవతా సూచి. <జిన్నప్ప. జిను + అప్ప. జిను– <జినుడు: బుద్ధుడు, వెన్నుడు. –అప్ప– చూ. గృ.నా.వ. చూ –నేని గృ.నా.ప.

జిల్లా

చూ. జిల్లాల

పౌరుషనామం (తె.).

<జిల్ల. బిల్లగోడు, ఆటలోని బిల్ల. శ.ర; పిల్లలాడుకొనుటకుపయోగించు రాతిముక్క– సూ.ని. గూటిబిల్ల. ?జిల్లా. మండలాల విభజనలో కొన్నిగ్రామాల కలయిక అయిన జిల్లాకావచ్చు.

జిల్లాల

చూ. జిల్లా

పౌరుషనామం (తె.).

జిల్లా బహు. కు ద్వి. వి.

జిల్లేడు

వృక్షసూచి (రా.).

ఉ : జిల్లడ, జిల్లడి, జిల్లెడి, జిల్లెడు. వృ. నా. Calotropis procera.

జీ

జీలకర్ర

వృక్షసూచి (వ.).

<సం. జీరక–. కరణ కమ్మవ్యాపారులలోను, బలిజకులంలోను, ఇంటిపేరు.

జు

జుట్లు

పౌరుషనామం (స.).

<జుట్టుల. జుట్టు బహు. కు. ద్వి. వి. శిఖ, సిగ, వెంట్రుకలు. సం. చూడా; క. జుట్టు; త. చూట్టు.

జున్ను

ఆహారపదార్థసూచి (తె.).

క. జేను. ఆవుగేదె మొదలైనవి ఈనిన రెండుమూడు రోజుల్లో పితికిన పాలకు బెల్లం లేక పంచదార చేర్చి ఆవిరమీద కాచిన గడ్డ.

జురుకు

ధ్వన్యనుకరణసూచి (రా.).

<జుఱుకు : నెత్తురు మొదలైనవి లోపలినుండి పైకివేగంగా వచ్చేధ్వనికి అనుకరణ.

జుర్రోళ్ళు

పౌరుషనామం (రా.).

జుర్రు– గృ.నా.పూ; మజ్జిగ మొదలైన పలుచని పదార్థం ఒకసారి తీసుకొని తాగేటపుడు లేక పీల్చేటపుడు కలిగే ధ్వన్యనుకరణ పదం. రెడ్లలో ఇంటి పేరు. చూ. –ఓళ్ళు గృ.నా.ప.

జువ్వా

పౌరుషనామం (వ.).

<జువ్వ. పక్షి మొదలైన వాటికి పెట్టే ఉరి

## జూ

జూవి

వృక్షసూచి (వ.).

క జువ్వి ; జువ్విచెట్టు.

వృ.నా. : Ficus indica.

## జె

జెట్టి

పరాక్రమసూచి (వ.).

సాము చేసేవాడు, మల్లుడు, శూరుడు. యాదవులలో,హరిజనులలో ఇంటిపేరు.

జెండా

పౌరుషనామం (వ.).

<హిం. ఝండా : టెక్కెం, ధ్వజం.

జెముడు

వృక్షసూచి (వ.).

సం. సింహుండ– : జెముడుచెట్టు.

వృ.నా. : Opuntia dillinie

జెర్రిపోతుల

పరీసృపసూచి (తె.వ.).

జెర్రిపోతులబహు. కు. ద్వి.వి. జెట్టి+ పోతు. సర్పవిశేషం. బోయలలో ఇంటి పేరు. క.జటి; తె.జెటి, జెట్టి; వ.జెర్రి. ది.ఇ.డి. 2299.

జొన్నకూటి

ఆహారపదార్థసూచి (రా.వ.).

జొన్న– గృ.నా.పూ. ధాన్యసూచి. వి.చూ. జొన్నలు. కాపులలో ఇంటిపేరు.

చూ, –కూటి గృ.నా.వ.

జొన్నల

ధాన్యసూచి (తె వ.).

ఆం. నా ; Indian millet

వృ నా : Sorghum Vulgare.

జొన్నలుకు ద్వి. వి. కాపులలో ఇంటి పేరు. త.చోళమ్, చొణ్ణల్; మ,చోళమ్; క. జోళ; తు. జోళ; తె. జొన్న. జొన్నలు; కోలా. సొన్న. ది.ఇ.డి. 2359.

జొన్నాభట్ల

వ్యక్తినామం (తె)

జొన్నా– గృ.నా.పూ; <జన్నా<ప్రా. జణ్ణ– <సం. యజ్ఞ–. బ్రాహ్మణులలో ఇంటిపేరు. చూ. –భట్ల గృ.నా.వ.

జోగావఝుల

వ్యక్తినామం (శా.).

జోగా– గృ. నా. పూ: దేవతాసూచి. 1<జోగులాంబ. 2జోగము : యోగం. చూ. జోగారావు, జోగులు, జోగిరెడ్డి. భైరవుడు కులదేవతగా గల భైరవ మతస్థులను జోగులంటారు. కరణకమ్మ లలో గృహనామం.

చూ, –వఝుల గృ.నా.వ.

జోగి

చూ. జోగు

పౌరుషనామం (తె.స.).
ప్రా. జోగీ; సం. యోగీ. ?<జోగు+ఇ : భిక్షకుడు.

జోగు
చూ. జోగి
పౌరుషనామం (తె.).

జోదుల
పౌరుషనామం (సా.).
జోదుబహు.కుద్వి.వి. <సం. యోధ–: యోధుడు, యుద్ధంచేసేబంటు "—సొం పార జోదులసోమశేఖరుని—" (పల్నా. పు. 497; పం. 316).

జోరీగల
కీటకసూచి (తె.స.).
జోరీగబహు.కుద్వి.వి. జోఱు+ఈగ. పశుమక్షిక. జోఱుటీగ.

జోశ్యభట్ల
వ్యక్తినామం (తె.).
జోశ్య– గృ.నా.పూ; <జోస్యుడు <సం. జ్యోతిషిక– జ్యోతిశ్శాస్త్రం చెప్పగలవాడు. బ్రాహ్మణులలో ఇంటి పేరు. చూ. –భట్ల గృ.నా.ప.

జోష్యుల
చూ. జోస్యుల
పౌరుషనామం (తె.).

జోస్యం
చూ. జోస్యుల
పౌరుషనామం (రా.).
జ్యోతిశ్శాస్త్ర విషయం.

జోస్య
చూ. జోస్యుల
పౌరుషనామం (శా.).
"—చోడ రాజేంద్ర చోడయరాజుల జోస్య నల్లయభట్లు శా.1085. (యస్. ఐ.ఐ. VI.)

జోస్యుల
చూ. జోష్యుల
పౌరుషనామం (తె.స.సా.).
<సం. జ్యోతిషిక– జ్యోతిష్కుడు. జోస్యం తెలిసినవారు. జోస్యుడు బహు. కు ద్వి.వి. "—జోస్యుల భీమన్న శోధించిచెప్పె—" (పల్నా. పు. 178; పం. 2509).

## జ్యై

జ్యేష్ఠి
పౌరుషనామం (స.).
జ్యేష్ఠమాసంలో వచ్చే పున్నమి. పెద్ద, వృద్ధ.

## జ్యో

జ్యోతుల
పౌరుషనామం (స.).
జ్యోతి బహు. కు ద్వి.వి. వెలుగు, నక్షత్రం, సూర్యుడు. హరిజనులలో ఇంటిపేరు.

## ఝ

ఝం-ఝూమారుతం

బిరుదనామం (తె.).

ఝంఝ- వానతో కూడి ఝుమ్మని వీచే పెద్దగాలి, తుఫాను. ఝంఝానిలం కూడ ఇదే. ఝంఝామారుతం సుబ్బయ్యా తంజావూరు కన్నయ్య శిష్యుడైన వద్ది సుబ్బయ్య స్వాధ్యాయి. మైసూరు మహా రాజ వారిచేత 'ఝంఝామారుతం' అనే బిరుదు పొందాడు. అదే వీరికి గృహ నామం అయింది.

## ట

టంకసాల

స్థలసూచి (స.).

టంకము+సాల : నాణాలు ముద్రించే చోటు. మాధ్వులలో గృహనామం. సం. టకశాలా-; క.టంకసాలె; తు.టంకసాలె.

## టెం

టెంకణాదిత్య

బిరుదనామం (శా.).

"టెంకణాదిత్య సోమిశెట్టియుం--" (తెలం. శా. I. పు. 104; పం. 10 ). దక్షిణానికి అధిపతి అని అర్థంకావచ్చు.

టెంకా

పౌరుషనామం (రా.).

< టెంకి : స్థానం, గృహం, జలాశయం. < టెంకి+ఆ. ?< టెంక : మామిడి, తాటి మొదలైన కాయలో వుండే విత్తనం.

## టే

టేకు

రూ. టేకుల

వృక్షసూచి (స.).

టేకుచెట్టు. వృ. నా : Tectona grandis. త. తేక్కు-; మ. తేక్కు-; క.తేగు, తేగ; తె.తేకు, టేకు. కోలా. టెక్; పర్జి : టేక్. ద్రా.ఇ.డి. 2414.

టేకుల

చూ. టేకు

వృక్షసూచి (తె.).

టేకుబహు. కు ద్వి.వి.

## టై

టైలర్

వృత్తిసూచి (రా.స.).

< ఇం.Tailor : దర్జీపని, సూచీవృత్తి. రాయలసీమలో హరిజనులలో వుంది. సర్కారులలో మహమ్మదీయులలో కన్పిస్తుంది.

## డ

డప్పు

రూ. డప్పుల

వాద్యసూచి (తె.).

వాద్యవిశేషం. తోలుతోచేసి మోగించే తప్పెట. క.డబ్బు; త.తప్పు.

డప్పుల
చూ. డప్పు.
వాద్యసూచి (తె.).
డప్పుబహు.కుద్వి.వి.

## డా

డాక
పరాక్రమసూచి (స.).
శౌర్యం, పరాక్రమం, విజృంభణ. క. డాకు; త. టాక్కు.

డాగరు
వస్తుసూచి (రా.).
వెదురు జల్లెడ. కుమ్మరి కులంలోని పెళ్లిళ్ళలో వక్కలు పంచేవాడు. పెళ్ళికి వచ్చినవాళ్ళందరికీ సమానంగా వక్కలు పంచడానికి కూర్చోడం 'శివాసనం' అంటారు. డాగరు (దాగిర) అంటే పెద్ద వెదురు జల్లెడ. డాగరులో పోసిన వక్కల్ని పంచేవ్యక్తికి కార్య కారణ సాదృశ్యాన్ని బట్టి ఈపేరు వచ్చి ఉండ వచ్చు.

డాలరాజు
వ్యక్తినామం (స.).
డాల- గృ.నా.పూ; కేడెము. జెండా, కాంతి. <డాలు. సం. ఢాలమ్; హిం. ఢాల్; క.డాలు. చూ, -రాజు గృ.నా.ప.

## డే

డేగల
పక్షిసూచి (తె.రా.స).
డేగబహు. కు ద్వి.వి. సాధారణ పక్షులను. కుందేలు మొదలైన చిన్న జంతువులను వేటాడేపక్షి. శ్యేనం. క .గిడగ, గిడిగ. గిడుగ. డేగె; తు.గిడి; తె.గిడ్డు. డేగ. డి ఇ.డి. 1280.

## డొ

డొక్క-
అవయవసూచి (తె.స.).
క.డొక్కె : ఉదరం. డొక్కా-సీతమ్మ ఆకలితోవున్నవారి డొక్కలను ఆకాలం లోనైనా నరే సంతృప్తిపరచేలాభోజనం పెట్టేదట. అందువలన ఆమెకు ఈ గృహనామం వచ్చిందంటారు. కనుక ఇది బిరుదనామం. ఈబిరుదనామమే గృహనామంగా మారింది.

## డో

డోలు
పౌరుషనామం (స.).
సం ఢోల-; హిం. ఢోల్ : చర్మ వాద్యవిశేషం.

## త

తక్కెడ
వస్తుసూచి (తె.).
పేము లేక వెదురుతో అల్లిన సిబ్బి ఉగల త్రాసు. సం. త్ర్యంటకమ్; క.తక్కడి;త.తక్కడై: ?<వృక్షసూచి. తక్కలిచెట్టు.

తంగేటి

వృక్షసూచి (శా.స.).

తంగేడుకుచెంప. ఉ : తంగుడు, పర్యా. తంగ; క.తంగేడి. పూచిన తంగేడును మనోజ్ఞమైనస్త్రీతో పోలుస్తారు. తంగేటి సిరిగిరినాయుడు 1359 ప్రాంతీయుడు. మందాడి ప్రాంతానికి అధికారి. ఈతడు రెడ్డిప్రభువుల పాలనలోనివాడు. మల్లికార్జునస్వామికి ఆగ్రామం దానంగా ఇచ్చినట్లు శాసనంరాశాడు (ఎ.ఆర్. నెం. 65 of 2930) కాపు, పద్మసాలీలలో ఇంటి పేరు.

తడ

వృక్షసూచి (స.).

వాసాలకు, కావిడిబద్దలకు, బల్లేలకు. బరిసెలకు పనికివచ్చే గట్టి కలపనిచ్చే చెట్టు. ఆకులు విస్తర్లుగా పనికివస్తాయి. గట్టిదనంతోపాటు సాగేలక్షణం కూడా ఉన్నది గనుక విల్లమ్ములు తయారు చేయడానికి ముఖ్యంగా వాడుతారు. తడ గ్రామనామంగా కూడ కన్పిస్తున్నందున దీన్ని గ్రామనామంగా కూడ సమర్థించవచ్చు.

తడక

రూ. తడికల

పౌరుషనామం (తె.).

ఆకులు, వెదురు బద్దలు మొదలైన వాటితో అల్లి దడి, తలుపు మొదలైన వాటిలాగ ఉపయోగించుకునే సాధనం, తడికలు వెదురుతోను పట్టిపేళ్ళతోను మేసులు తయారుచేస్తారు.

తడికల

చూ. తడక

పౌరుషనామం (తె.).

తడికబహు. కు ద్వి.వి.

తండా

రూ. తాండా

రూ. సమూహసూచి (తె.).

లంబాడి మొదలైన జాతులవారి సమూహం; సరుకు నింపినగోనెల సమూహం.

తత్త్వవాది

పౌరుషనామం (శా.).

తత్త్వాన్నిగూర్చి వాదించేవాడు.

"--తత్త్వవాది తిమ్మణ్ణయ్యన్--" శా. 1436 (టి.టి డి.ఇ.యస్.III; పు.194; నెం. 90).

తంత్రపతి

చూ. తంత్రపాలు

వృత్తిసూచి (శా.).

"--తంత్రపతి ప్రోలినాయుడు--" శా. 1155 (టి. యం. పి. పు. 660; నెం. 927). "One charged with minor affairs; deputy ambassador at a minor court. శా.శ.

తంత్రపాలు

రూ. తంత్రపతి

వృత్తిసూచి (శా.).

సైన్యాధిపతి, సహాయరాయబారి. "--పుణ్యముగాను తంత్రపాలు మల్లి నాయకుడు--" (తెలం. శా.I; పు. 72; పం. 4-5).

**తన్నీరు**

జలసూచి (తె.).

తని+నీరు. తని- సమృద్ధిగా ఉన్న, శుద్ధమైన. కమ్మ, వడ్డెరకులాల్లో ఇంటి పేరు.

**తప్పట**

చూ. తప్పెట

వాద్యసూచి (శా.).

<తమ్మట. "--తప్పట మలయప్ప సదాసేవ--" (టి.టి.డి.ఇ.యస్. V; పు. 440; నెం. 166).

**తప్పడ**

చూ. తప్పెట

వాద్యసూచి (శా.).

"--తప్పడ బసవరెడ్డి--" శా. 1456 (టి.టి.డి.ఇ.యస్.IV;పు.76; నెం.37).

**తప్పెట**

రూ. తప్పట, తప్పడ, తమటం.

వాద్యసూచి (తె.రా.స.).

చర్మవాద్య విశేషం. రాయలసీమలో కుమ్మర్లలోను, సర్కారులో వడ్డెకులంలో ఇంటిపేరు. త. తప్పెట్టై, తప్పట్టమ్; మ. తప్పిట్టి, తమ్మిట్టం; క. తంబట, తంబటె తవటె, తప్పటె, -తబటె, తమటె, తమ్మట, తమ్మటె. డి. ఇ. డి. 2510.

**తమటం**

చూ. తప్పెట

వాద్యసూచి (రా.).

<తమ్మటము.

**తమలపాకుల**

వృక్షసంబంధసూచి (రా.).

తమలపాకు బహు. కు ద్వి.వి. <తమలము ఆకు <సం. తాంబూలమ్. తమలపాకులను ఉత్పత్తి చేయడంలో ప్రసిద్ధి చెందినవారు కావచ్చు. రెడ్లలో ఇంటిపేరు.

**తంబ**

జంతుసూచి (స.).

<సం. తంబ- ఆవు. తంబ అనే పదాన్ని ఇప్పుడు సమూహార్థంలో ఉపయోగిస్తున్నారు.

**తమ్మ**

పౌరుషనామం (తె.).

త. తంబలమ్ : నమిలిన తాంబూలం. వెలనాటి వైదికులలో ఇంటిపేరు.

**తమ్మళ్లు**

జాతిసూచి (శా.).

<తమ్మళి <తమ్మళ. తమ్మళజాతి వాడు. క. తమ్మడి. శంకరాచార్యులు శైవదైవాలయాలలో తమిళ బ్రాహ్మణులను నియమించారు. తమ మధ్య నివసిస్తున్న వీరిని తెలుగువారు తంబళ

(తమిళ) వారని పిలిచారు. ఈ బ్రాహ్మ ణులు గోదావరి, కృష్ణ, నెల్లూరుజిల్లాల్లో ఉన్నారు. కొన్నిప్రాంతాల్లో వీరు శూద్రులుగా చూడబడుతున్నారని సి. టి. యస్,ఐ."—తమ్మళ్ల మాదశివలు_" (టి.యం.పి. పు. 1102; నెం. 397).

తమ్మారెడ్డి
వ్యక్తినామం (రా.స.).
తమ్మా_ గృ.నా.పూ; వ్య.నా. తమ్మ+ ఆ. వి.చూ. తమ్మన. కమ్మవారిలో ఇంటిపేరు. చూ. —రెడ్డి గృ. నా. ప.

తమ్మిన
చూ. తమ్మినేని
వ్యక్తినామం (స.).
కమ్మవారిలో ఇంటిపేరు.

తమ్మినీడి
చూ. తమ్మినేని
వ్యక్తినామం (స.).
కమ్మవారిలో ఇంటిపేరు.

తమ్మినీడు
చూ. తమ్మినేని
వ్యక్తినామం (తె.స.).
కమ్మవారిలో ఇంటిపేరు.

తమ్మినేని
రూ. తమ్మిన,తమ్మినీడి, తమ్మినీడు.
వ్యక్తినామం (రా.స.).
తమ్మి_ గృ.నా.పూ. <తమ్మయ <ధర్మయ. కమ్మవారిలో ఇంటిపేరు.
చూ. _నేని గృ.నా.ప.

తమ్మిరాజు
వ్యక్తినామం (స.).
తమ్మి_ గృ.నా.పూ; వ్య.నా. వి.చూ. తమ్మినేని. బ్రాహ్మణులలో ఇంటిపేరు.
చూ. _రాజు గృ. నా. ప.

తమ్మిసెట్టి
వ్యక్తినామం (స.).
తమ్మి_గృ.నా.పూ; వి.చూ. తమ్మినేని.
చూ. _సెట్టి గృ.నా.ప.

తరిగొప్పుల
?<తరిగోపుల
పౌరుషనామం (సా.).
బ్రాహ్మణులలో ఇంటిపేరు. —తరిగొప్పులాంకుఁడగు శ్రీమల్లప్రధానుండిలన్_" (చంద్రభా. 1_26). "—సాటి తఱిగొప్పుల మల్లన మంత్రి—" (చంద్రభా. 1_26).

తరిగోపుల
పౌరుషనామం (స.).
తఱి_సమయం,వయసు,ఈడు,మాంసం, తరంగం. _గోపుల <గోపుడు. గొల్లవాడు, రాజు, గోపులకు అధిపతి. అనేక గ్రామాలకు అధికారి. కమ్మవారిలో ఇంటి పేరు. ?<తఱిగొల్పు పూనజేయు. ప్రేరేపించు.

తలకోల
వస్తుసూచి (స.).

తల+కోల : సాధువుకాని ఆవును పిదికేటప్పుడు కొనను తాడుకట్టి దాని కొమ్ములకు తగిలించి పట్టుకునే కర్ర.

తలగం

పౌరుషనామం (రా.).

?<తలగాము.తల+గాము.రాహువు, రాహుగ్రహం. కాపులలో ఇంటిపేరు.

తలపనేని

చూ. తల్లపనేని

వ్యక్తినామం (రా.స.).

కమ్మవారిలో ఇంటిపేరు.

తలాడి

పౌరుషనామం (రా.).

<తలాడ <తలగడ.తలకింద ఎత్తుగా ఉంచుకొనే దిండు. తలాడ కు ఔప. ఉ. తలాడ, తలగడ. ?ఇదిగ్రామనామం కూడ కావచ్చు.

తలారి

రూ. తలారు

వృత్తిసూచి (తె.రా.శా.స).

బారాబలూతి ఉద్యోగులలో ఒక వృత్తి వారు. Chief Watch man. ఉ. తలయారి, తలవారి, తలారి. ప్రా. తలారో; సం. స్థలవార–; క. తలారి; తు. తళవారె; తె. తలారి; త. తళవార, తలారి. డి. ఇ. డి. 2553. "—తలరి(పి)చ్చ యాను—" (ద.శా.పు.198;నం.859). "—లారి ప్రోలినాయక—" టి. యం. పి. II; పు. 1103). రాత్రిసమయంలో దొంగతనం మొదలైన నేరాలు జరగకుండ గస్తుతిరిగి కావలికాచే దొరతనపు బంటు. రాజాజ్ఞతో వీరు దండనాలు చేస్తారు ఈగృహనామం రాయలసీమలో మాల, మాదిగల లాలలోను, సర్కారులో ముత్రాసులలోను కన్పిస్తుంది.

తలారు

చూ. తలారి

వృత్తిసూచి (శా.).

బ్రిటీషు కాలంనుండీ ఈ తలారులకు వేతనం చెల్లించేవారని తెలుస్తుంది.

తలారు ప్రోలినాయక—" (టి.యం. పి. I; పు. 1103; నెం. 410).

తలిపిన

చూ. తల్లపనేని

వ్యక్తినామం (రా.).

తలిపినేని

చూ. తల్లపనేని

వ్యక్తినామం (రా.).

తలుపుల

గృహపరికరసూచి (స.).

తలుపు బహు. కు ఔప. కవాటం. ఇంటిద్వారాన్ని మూయడానికి, తెరవడానికి వీలుగా అమర్చే చెక్కతో చేసిన పనిముట్టు. ఇప్పుడు ఇనుప తలుపులు, రేకు తలుపులు కూడా వున్నాయి. తలుపుల వ్యక్తినామం విశాఖ జిల్లాలోను;

గ్రామనామం అనంతపురం జిల్లాలోను వుంది.

తల్లపనేని

రూ. తలవనేని, తలిపిన, తలిపినేని.

వ్యక్తినామం (స.).

తల్లప-గృ.నా.పూ; జలసూచి ?<తల్లము. చెరువు, జలాశయం. కమ్మవారిలో ఇంటిపేరు. చూ. -నేని గృ.నా.వ.

తల్లపరాజు

వ్యక్తినామం (స.).

తల్లవ- గృ.నా.పూ; వి.చూ. తల్లవనేని. ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.

చూ. -రాజు గృ.నా.వ.

తల్లం

జలసూచి (రా.).

<సం. తల్లమ్: జలాశయం, చెఱువు కోమట్లలో ఇంటిపేరు.

తల్లంరాజు

చూ. తల్లపనేని

వ్యక్తినామం (స.).

తల్లం- గృ. నా. పూ; వి.చూ. తల్లపనేని. ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.

చూ. -రాజు గృ.నా.వ.

తల్లాప్రగడ :

వ్యక్తినామం (స.).

తల్లా- గృ.నా.పూ; వి.చూ. తల్లపనేని. ఆర్వేలనియోగులలో ఇంటిపేరు.

చూ. -ప్రగడ గృ.నా.వ.

తల్లావఝ్ఝల

వ్యక్తినామం (స.).

తల్లా- గృ.నా.పూ; వి.చూ. తల్లవనేని. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. -వఝ్ఝల గృ.నా.వ.

తవ్వా

కొలమానసూచి (స.).

<తవ్వ. రెండుసోలల కొలత, మానిక లో సగం.

## తా

తాటి

చూ. తాడి

వృక్షసూచి (తె.సా.).

తాడికి ద్వి.వి. కమ్మవారిలో ఇంటిపేరు. "..తాటిపోతన పట్టి—" (వల్నా. పు. 162; పం. 2158).

తాటిరాజు

వ్యక్తినామం (స.).

తాటి- గృ. నా. పూ; వృక్షసూచి. <తాడికిరూప. వి. చూ. తాడి. ఆర్వేల నియోగ బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. -రాజు గృ.నా.వ.

తాటిసెట్టి

చూ. తాడిసెట్టి

వ్యక్తినామం (తె.).

తాడి

రూ. తాటి, తాడిచెట్టు.

వృక్షసూచి (స.).
వృ. నా ; Borassus flabillifea. త.తాటి; మ. తాన్ని; క.తాళి; తె. తాడి. డి.ఇ.డి. 2614.

తాడిగోట్ల
అస్పష్టనామ బంధం (శా.).
''—తాడిగోట్ల తిమ్మరాజు వారు—'' (టి.యం.పి.II; పు. 1140; నెం.667).

తాడిచెట్టు
చూ. తాడి
వృక్షసూచి (తె.).
ఒడ్డె, కర్నసాలీలలో ఇంటిపేరు.

తాడిసెట్టి
రూ. తాటిసెట్టి
వ్యక్తినామం (స.).
తాడి—గృ.నా.పూ; వృక్షసూచి. వి.చూ. తాడి. చూ. —సెట్టి గృ.నా.ప.

తాడుబోయిన
వ్యక్తినామం (స.).
తాడు— గృ. నా. పూ; వృక్షసూచి. <తాడి. వి.చూ. తాడి
చూ. —బోయిన గృ.నా.ప.

తాండా
చూ. తండా
సమూహసూచి (రా.).

తాంద్ర
వృక్షసూచి (స.సా.).
తాడిచెట్టు. బ్రాహ్మణులలో ఇంటిపేరు.
''—తాంద్రపాపయ్యప్రతాపనైపుణ్యంబు పెఱరాచ తాంద్రల పెంపుడింపు—'' (రంగా. 2—26). సర్కారు జిల్లాల్లోని పర్వత ప్రాంతాల్లో పెరిగే చాలా పెద్ద చెట్టు బోదెనిటారుగాను, పైభాగం, విశాలంగాను వుంటుంది, ఎండాకాలం మంచి పుష్టినిస్తుంది. పండ్లలోని గుజ్జుచాలా వుద్రేకపరుస్తుంది దీనికొయ్య మన్నిక కలిగినప్పటికీ నలదమయంతుల కథ వలన కలి ఆవేశించి వుంటాడని గృహ నిర్మాణానికి నిషేధించారు.

తాతన్నగారి
వ్యక్తినామం (రా.).
తాతన్న— గృ.నా.పూ; పు.నా. తాత+ అన్న. తాత— వి.చూ. తాతా. —అన్న- చూ. గృ.నా.ప. చూ. —గారి గృ.నా.ప.

తాతా
సంబంధసూచి (స.).
<తాత : తండ్రి; తల్లితండ్రి; తండ్రి తండ్రి; బ్రహ్మ. పేరూరిద్రావిడులలోను, వెలనాటి వైదికులలోను ఇంటిపేరు.

తాతిన
చూ. తాతినేని
వ్యక్తినామం (స.).
కమ్మవారిలో ఇంటిపేరు.

తాతిని
చూ. తాతినేని

వ్యక్తినామం (స.).
కమ్మవారిలో ఇంటిపేరు

**తాతినేని**

చూ. తాతిన, తాతిని

వ్యక్తినామం (స.).

తాతి- గృ.నా.పూ; పు.నా. తాత+ఇ. <సం. తాత-: తండ్రి బ్రహ్మదేవుడు. తల్లితండ్రి, తండ్రితండ్రి. ముసలివారిని పూజ్యభావంతో సంబోధించడం; వంశంలో పూర్వపురుషుడు. 'తాత' పదం వ్యక్తినామాల్లో పూర్వపదంగానే కన్పిస్తుంది. ఉదా : తాతబ్బాయి, తాతారావు. తాతిరాజు. తాతిరెడ్డి. కమ్మవారిలో ఇంటిపేరు. చూ. -నేని గృ.నా.ప.

**తాతిరాజు**

వ్యక్తినామం (స.).

తాతి- గృ.నా.పూ; పు. నా. వి. చూ. తాతినేని. ఆర్వేలనియోగి బ్రాహ్మణులలో ఇంటిపేరు. చూ. -రాజుగృ.నా.ప.

**తాతిరెడ్డి**

వ్యక్తినామం (స.).

తాతి- గృ.నా.పూ; పు. నా. వి. చూ. తాతినేని. చూ. -రెడ్డి గృ.నా.ప.

**తాపి**

వృత్తిసూచి (తె.స.).

గృహనిర్మాణానికి ఉపయోగించే సాధనం. తాపీపనిచేయడమే వృత్తిగా కలవారు. చూ. సాహిత్యంలో ఇంటిపేర్లు.

**తాలం**

వృక్షసూచి (స.).

?<సం. తాళ : తాడిచెట్టు ?<సం. తాళ- : బీగం.

**తాళాబత్తుల**

వ్యక్తినామం (స.).

తాళా- గృ. నా. పూ; వృక్షసూచి. <తాళము : తాటిచెట్టు. వి.చూ. తాటిరాజు చూ. -బత్తుల గృ.నా.ప.

**తాళ్లి**

వృక్షసూచి (తె.).

?<తాడి ?తాళిబొట్టు. మంగళసూత్రం. తాళముకలవాడు; తాళంవాయించేవాడు: శివుడు; నేలఉసిరికచెట్టు; పెద్దఆకులతాటిచెట్టు; తాటికల్లు; కంచుతో చేసిన తాళపుచిప్ప; వాద్యవిశేషం సూ.ని.

**తావేటి**

జంతుసూచి (రా.).

?<తాబేటి<తాబేలు. కూర్మం,కమఠం. త.యామై, ఆమై: మ.ఆమ; క.తాబేలు, తాంబేలు; తు.ఏమె; తె.తాబేలు;తామేలు. డి. ఇ డి. 4232. కాపు, వెలమలలో ఇంటిపేరు.

**తాసరి**

జాతిసూచి (శా.).

?<దాసరి. వి.చూ. దాసర్ల "-.తాసరి

పాపనాయుడు__" (టి.యం.పి. పు.637; నెం. 660).

తి

తిక్కల

పౌరుషనామం (తె.).

<తిక్క. ఉన్మాదం, వెఱ్ఱి. వెఱ్ఱిపట్టిన వారు.

తిక్కిన

<తిక్కినేని

వ్యక్తినామం (స.).

తిక్కి- గృ.నా.పూ; వ్య.నా. తిక్క+ఇ <తిక్కయ. ? ప్రా. తిక్ఖ-<సం. తీక్ష్ణ-

చూ. -న గృ.నా.ప.

తిపిర్నేని

చూ. త్రిపురనేని

వ్యక్తినామం (రా.).

కమ్మవారిలో ఇంటిపేరు.

తిప్పనగారి

వ్యక్తినామం (రా.).

తిప్పన- గృ.నా.పూ; పు.నా. దేవతా సూచి. <తిప్పన్న. <తిప్ప+అన్న. తిప్ప- <సం. త్రిపురాంతక-

చూ. గారి -గృ.నా.ప.

తిప్పరపోయిన

వ్యక్తినామం (తె)

తిప్పర- గృ.నా.పూ.? <తిప్పన.

చూ. -పోయిన గృ.నా.ప.

తిప్పరాజు

రూ. తిప్పరాసు

వ్యక్తినామం (శా.).

తిప్ప-గృ.నా.పూ; వ్య.నా. <తిప్పయ.

"__తిప్పరాజు రామరాజు__" శా.1482 (టి.యం.పి.II. పు. 927; నెం. 227).

చూ. -రాజు గృ.నా.ప.

తిప్పరాసు

చూ. తిప్పరాజు

వ్యక్తినామం (రా.).

<తిప్పరసు.

తిప్పాజోస్యుల

వ్యక్తినామం (రా.).

తిప్పా- గృ.నా.పూ; వ్య.నా. వి.చూ. తిప్పరాజు. చూ. -జోస్యుల గృ.నా.ప.

తిప్పాబత్తుల

వ్యక్తినామం (స.).

తిప్పా- గృ.నా.పూ; తిప్ప+అ. వి.చూ. తిప్పరాజు. చూ. -బత్తుల గృ.నా.ప.

తిప్పాభట్ల

వ్యక్తినామం (తె.).

తిప్పా- గృ.నా.పూ; వ్య నా. తిప్ప+అ. వి. చూ. తిప్పరాజు. బ్రాహ్మణులలో ఇంటిపేరు. చూ. -భట్ల గృ.నా.ప.

తిప్పావఝ్ఝల

వ్యక్తినామం (తె.).

తిప్పా- గృ నా.పూ; వ్య.నా. <తిప్ప.

వి. చూ. తిప్పరాజు. బ్రాహ్మణులలో ఇంటిపేరు. చూ. _వఝుల గృ.నా.ప.

తిప్పినేని
చూ. తిప్పినేడి
వ్యక్తినామం (రా.).

తిప్పినీడి
చూ. తిప్పిని
వ్యక్తినామం (న.).
తిప్పి_ గృ.నా.పూ; వ్య.నా;<తిప్ప+ఇ <తిప్పయ. వి.చూ. తిప్పరాజు. కమ్మవారిలో ఇంటిపేరు. చూ._నీడి గృ.నా.ప.

తిప్పిరెడ్డి
వ్యక్తినామం (తె.న.).
తిప్పి_ గృ నా.పూ; వ్య.నా; వి చూ. తిప్పినీడి. చూ. _రెడ్డి గృ.నా.ప.

తిమ్మడి
జంతుసూచి; దేవతాసూచి (రా.).
<తిమ్మడు : కోతి. క. తిమ్మ: త. తిమ్మన్.; హనుమంతుడు.

తిమ్మన్న
వ్యక్తినామం (రా.).
తిమ్మ_ గృ. నా. పూ; దేవతాసూచి. <తిమ్మడు. వి.చూ. తిమ్మడి. ?<తిరుమలన్న. తిరుమల+అన్న : వెంకటేశ్వరస్వామి. చూ. తిమ్మప్పుడు. తిరుమల+అప్పుడు : వెంకటేశ్వరుడు.
చూ. _అన్న గృ.నా.ప.

తిమ్మావఝుల
వ్యక్తినామం (న.).
తిమ్మా_ గృ.నా.పూ; పు.నా: వి.చూ. తిమ్మన్న. బ్రాహ్మణులలో ఇంటిపేరు.
చూ. _వఝుల గృ.నా.ప.

తియ్యాకూర
వృక్షసూచి (న.).
ఒకవిధమైన ఆకుకూర

తియ్యా
పౌరుషనామం (న.)
<తియ్య : మధురమైన. తీపిగల, ఇంపైన, ప్రియమైన.

తిరుకోటి
వృత్తిసూచి (న.).
వేగులవాడు. తిరు_శ్రీప్రదమైన; పవిత్రమైన; _కోటి : వేగు.

తిరుణాము
వాద్యసూచి (న.).
వైష్ణవ దేవాలయాలలో ఊదే వాద్య విశేషం. శ్రీకాకుళంలోని శ్రీవల్లభరాయనికి ముత్యాల తిరుణాము వీరవరసింహదేవుని దేవులైన గంగా మహాదేవులు చదివించినట్లు శాసనంలో వుంది. (యస్.ఐ.ఐ. IV).

తిరుపమోని
పౌరుషనామం (తె.).
తిరుపము_ గృ.నా.పూ; <తిరిపము,

<తిరియు : భిక్షం, భిక్షుకవృత్తి.
చూ. _వోని గృ.నా.వ.

తిరుమలచెట్టి
చూ. తిరుమలసెట్టి
వ్యక్తినామం (రా.).

తిరుమలపెద్దింటి
గృహసూచి (వ.సా.).
తిరుమల_ గృ.నా.పూ; పర్వతసూచి. తిరు + మల : వేంకటాచలం. _పెద్దింటి. చూ. పెద్దింటి. వైష్ణవులలో ఇంటిపేరు. "ఇది శ్రీ తిరుమల పెద్దింటి పద్మనాభా చార్య శిష్యుండ__" (భృగుసం. ఆశ్వా. గ. పు. 137).

తిరుమలప్రగడ
వ్యక్తినామం (స.).
తిరుమల_ గృ.నా.పూ; స్థలసూచి, పర్వతసూచి. వి. చూ. తిరుమలసెట్టి. బ్రాహ్మణులలో ఇంటిపేరు.
చూ. _ప్రగడ గృ నా వ.

తిరుమలరాజు
వ్యక్తినామం (స.).
తిరుమల_ గృ.నా.పూ: వి.చూ. తిరుమలసెట్టి. ఆర్వేల నియోగి బ్రాహ్మణులలో ఇంటిపేరు. చూ. _రాజు గృ. నా వ.

తిరుమలరెడ్డి
వ్యక్తినామం (స.).
తిరుమల_ గృ.నా.పూ; వి.చూ. తిరుమలసెట్టి. చూ. _రెడ్డి గృ.నా వ.

తిరుమలసెట్టి
రూ. తిరుమలచెట్టి
వ్యక్తినామం (స.).
తిరుమల_ గృ.నా.పూ; స్థలనామం. పుణ్యక్షేత్రం. తిరు_స్థలనామపూ.; పవిత్రమైన; _మల : స్థలనామ వ.; కొండ. త. మలై; మ. మల; క. మలె: పర్జి. మలంగ్ డి.ఇ.డి.3882. వేంకటాచలం.
చూ. _సెట్టి గృ.నా.వ.

తిరుమాని
పౌరుషనామం (స.).
< తిరుమణి: వైష్ణవులు నొసటధరించే తెల్లనిమట్టి.

తిరువీధుల
పౌరుషనామం (స.).
తిరు + వీధుల. తిరువీధి బహు. కు ద్వి.వి. తిరు_పవిత్రమైన. _వీధి:బజారు, రాచవీధి. దేవుడు ఊరేగే వీధిని తిరువీధుల అని వ్యవహరిస్తారు. కమ్మవారిలో ఇంటిపేరు.

తివారి
వృత్తిసూచి (తె.).
వేద పాఠకుల వృత్తి. <మరాఠీ. తివారీ. <ప్రా. తివాడీ_ <సం.త్రిపాఠీ.

తీ

తీగ
రూ. తీగల
వృక్షసూచి (స.).

లత, స్త్రీలు మెడలో ధరించే బంగారు పట్టెడ; మొలనూలు; వీణ మొదలైన వాటితంతి.

తీగల

చూ. తీగ

వృక్షసూచి (తె.రా.).

తీగ బహు. కు ద్వి.వి. మైసూరు దేశంలోని కొన్ని ప్రాంతాలలో తమిళ భాషను 'తీగలు' అంటారట. మైసూరులో స్థిరబడిన తీగలవారు వారిభాషను మర్చిపోయి కన్నడభాషను మాట్లాడుతున్నారని సి. టి. యస్. ఐ. పేర్కొంది. వీరు తరువాత తెలుగు దేశంలో స్థిరపడి ఉండవచ్చు.

తీర్థం

రూ. తీర్థాల

జలసూచి (రా.).

రేవు, పుణ్యక్షేత్రం, యజ్ఞం, శాస్త్రం, మహర్షులు స్నానాలుచేసిన నది, తటాకం మొదలైన పుణ్యోదకం. Cf. తీర్థుడు. తీర్థుడు అనే పదానికి ఉపాధ్యాయుడు, మంత్రి, రాజువద్ద సహాయకులుగా వుండే మంత్రి మొదలైన పద్దెనిమిదిమందిలో ఒకడు అని అర్థం. సన్యాసుల పేర్ల చివరచేర్చు ఉపాధిభేదం. ఉ : ఆనంద తీర్థుడు. సూ. ని. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

తీర్థాల

చూ. తీర్థం

జలసూచి (స.).

తీర్థం బహు. కు ద్వి.వి. వెలనాటి వైదిక బ్రాహ్మణులలో ఇంటిపేరు.

## తు

తుంగ

రూ. తుంగా

వృక్షసూచి (తె.).

ఇంటికప్పుకు వాడే గడ్డి కమ్మవారిలో ఇంటిపేరు. క. తుంగ; తు. తుంగు; తె. తుంగ. డి.ఇ.డి. 2690.

తుంగా

చూ. తుంగ

వృక్షసూచి (రా.స.).

తుపాకుల

ఆయుధసూచి (స.సా.).

తుపాకి బహు. కు ద్వి.వి మందు గుండు వేసి దట్టించి కాల్చే ఇనుప గొట్టంగల యుద్ధసాధన విశేషం. బలిజ. యానాదులలో ఇంటిపేరు.

హిం. తుపక్కు, క. తుపాకి; తు. తుపాకి; త. తుపాక్కి. "...తుపాకుల యనంత భూపాల ప్రణీతంబైన..." (వచ.భా. Tel.M. పు. 285).

తుప్పర

రూ. తప్పరి

జలసూచి (తె.).

గాలిచేత చెదిరిపడే నీటిబొట్టు, తుషారం.

తువ్వర. తుప్పర. <సం. తుషార-; క. తూపఱు, తుంతుఱు.

తుప్పరి
  చూ. తుప్పర
  జలసూచి (తె.).

తుంబ
  వృక్షసూచి (రా.).
సౌర. ఉసిరిక. సూ.వి; పాలుపితుకు చెంబు అని ఆం.వా. యాదవులలో ఇంటిపేరు.

తుమ్మ
  రూ. తుమ్మల
  వృక్షసూచి (రా.స.).
పర్యా. జాల, జాలి. వృ.నా. Accacia nilotica. పద్మసాలీలు, మాల, రెడ్డి కులాలలో ఇంటిపేరు.

తుమ్మపనుగు
  వృక్షసూచి (రా).
వృక్షవిశేషం.

తుమ్మగింజలు
  వృక్షసంబంధసూచి (రా.).
తుమ్మచెట్టు యొక్క విత్తనాలు.

తుమ్మనేని
  వృక్షసూచి (స.).
తుమ్మ- గృ.నా.పూ; వృక్షసూచి. వి. చూ. -తుమ్మల.
  చూ. రాజు గృ.నా.ప.

తుమ్మరాజు
  వ్యక్తినామం (స.).
తుమ్మ- గృ.నా.పూ; వి.చూ. తుమ్మల. బ్రాహ్మణులలో ఇంటిపేరు.
  చూ. -రాజు గృ.నా.వ.

తుమ్మల
  చూ. తుమ్మ
  వృక్షసూచి (తె.రా.).
తుమ్మ బహు. కు ద్వి.వి. కమ్మ వారిలో, హరిజనులలో ఇంటిపేరు.

తుమ్మిసెట్టి
  వ్యక్తినామం (స.).
తుమ్మి- గృ.నా.పూ; తుమ్మ + ఇ. వి.చూ. తుమ్మనేని.
  చూ. -సెట్టి గృ.నా.వ.

తుమ్మెద
  కీటకసూచి (స.).
భృంగం, తేటి. త.తుమ్పి; మ.తుమ్పి. క. తుమ్బి. దుమ్బి; తు. తుమ్బి; తె. తుమ్మెద. డి.ఇ.డి. 2731.

తురకా
  రూ. తురక
  తెగసూచి (స.).
తురక, మ్లేచ్ఛుడు. <ప్రా. తురుక్క- <సం. తురుష్క-

తురగా
  జంతుసూచి (తె.స).
<తురగము. వేగంగాపోయేది. గుఱ్ఱం.

ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.

తురాకా

చూ. తురకా

జాతిసూచి (తె.స.).

తులం

కాలమానసూచి (తె.స.).

<తులము : తులమాన విశేషం. పలమందు మూడో భాగం. ఒక రూపాయి ఎత్తు. సం. తులా; క.తొలె; త. తోలా.

తులసిగారి

వ్యక్తినామం (తె.).

తులసి– గృ.నా.పూ; స్త్రీ. నా. వృక్ష సూచి. తులలేనిది. తులసిచెట్టు. సం. తొళసి. కార్తీక శుక్లపక్ష ద్వాదశినాడు శ్రీకృష్ణునకు తులసీదేవికి వివాహం చేస్తారు. ఇది ఒక వ్రతం. తులసమ్మ. వ్య.నా. చూ. –గారి గృ.నా.వ.

తుల్జగారి

వ్యక్తినామం (తె.).

తుల్జ– గృ.నా.పూ; వ్య.నా. <తులజ. మరాఠీ వ్యక్తినామం.

చూ. –గారి గృ.నా.వ.

తుళువ

దేశసూచి (పా.).

క. తుళువ. తుళుదేశంవారు; త.తుళు వమ్ : కన్నడ దేశానికి పడమటనున్న దేశం. మనుచరిత్రలో కృష్ణరాయని వంశం తుర్వసుని వంశమని, తుర్వసు శబ్దంనుండే 'తుళువ' శబ్దం వచ్చిందని చమత్కరింప బడింది. వాస్తవానికి తుళువ దేశాన్ని పాలించేవారు తుళువ రాజులై యుంటారని సూ.ని. ''వాని వంశంబు తుళువాన్వయమయ్యె–'' (మను.).

## తూ

తూము

రూ. తూముల

పౌరుషనామం (స.).

నాలుగు కుంచాల కొలత; భూసూచి– ఎకరంలో రెండువంతులు. ?<తూము. బండి చక్రంలో మధ్య ఉన్న రంధ్రం; నీళ్ళు బైటకువచ్చేలా ద్వారం ఏర్పరచి కట్టిన కట్టడం. కమ్మ. బ్రాహ్మణ ముత్రాసులలో ఇంటిపేరు.

తూముల

చూ. తూము

పౌరుషనామం (స.).

తూము బహు. కు ద్వి.వి. కమ్మ వారిలో ఇంటిపేరు.

తూరుపు

దిక్సూచి (తె.).

సూర్యుడు ఉదయించేదిక్కు. తూఱు– సూర్యుడు ప్రవేశించు. అంతే ఉదయించే దిక్కు. కమ్మవారిలో ఇంటిపేరు.

?ధాన్యాన్ని గాలివాలుగా ఎత్తుమంది

పోసి తాలుధాన్యాన్ని వేరుచేయడాన్ని తూరుపు పట్టడం అంటారు.

తెడ్ల

వస్తుసూచి (స.).

తెడ్డు బహు. కు ద్వి.వి ; కొయ్య గరిటె, పడవ నడపడానికి ఉపయోగించే సాధనం. సం. తర్దూ– ; త. తుడుప్పు.

తెనుగు

చూ. తెలుగు

భాషాసూచి (తె.).

తెప్ప

పౌరుషనామం (శా.).

క. తెప్ప; త. తెప్ప. నౌక; తెప్ప కొయ్య, మిట్ట ప్రదేశం. "—తెప్పవారి మామిడి తోంటను–" శా. 1156 (తెలం. శా. I. పు. 69, పం. 22).

తెలకుల

పౌరుషనామం (శా.).

?తెలకల. <తెలకలు. నువ్వులు. "సహస్ర శాఖాన్వయ గోత్రులైన తెలిక కుటుంబములవారు చాళుక్య రాజకుటుంబ ముల కిష్టభృత్యులై ప్రశంసింపబడిన వారు. వీరాకాలమునఁ బెక్కుదాన శాసన ముల వ్రాయించి యుండిరి. అని శా.శ. పు.130. <ప్రా. తేల్లక– <సం.తైలిక– "బెజవాడ శాసనులైన తెలకుల కొమ్మన గడియన—" (యస్.ఐ.ఐ.IV; పు.203; పం. 7–8).

తెలంగాణ

స్థలసూచి (తె.).

తెలగాణము. తెలుగు + అణెము. తెలుగు దేశానికి సంబంధించిన. శాస నాలలో 'తెలుంగాణెము' అనికన్పిస్తుంది.

తెలుగు

రూ. తెనుగు

భాషాసూచి (స.).

శ్రీశైలం, దాక్షారామం, కాళేశ్వరం మొదలైన ఈమూడు శైవక్షేత్రాల మధ్య ఉన్నస్థలం త్రిలింగదేశం. ఈదేశంలో మాట్లాడేభాష తెలుగు లేక తెనుగు. ల–న లకు భేదం లేదుగనుక తెలుగు– తెనుగు వ్యవహారం. బ్రౌన్ ఈ సిద్ధాం తాన్ని అంగీకరించక తెన్– అంటే దక్షిణం. తెనుగు– దక్షిణదేశపు భాష అని వ్యుత్పత్తి చెప్పారు. త. తెలుగు; క. తెలుగు, తెలగు, తెలంగు; తు. తెలుంగు, తెలుగు. డి.ఇ.డి. 2820.

తెల్లబట్టల

వస్త్రసూచి (తె.).

తెల్లబట్టబహు.కుద్వి.వి. తెల్ల నివస్త్రం. తెల్లనివస్త్రాలు ధరించే వారుకావచ్చు.

తెల్లమంటిగోళ్ళ

పౌరుషనామం (రా.).

తెల్లమంటిగోరు బహు.కు ద్వి.వి.

తెల్లాకుల

అస్పష్టనామబంధం (స.).

"ఇది చాకలికి పర్యాయపదమని 1901 సెన్సస్‌రిపోర్టులో వుంది. వృత్తి మాని ప్రభుత్వ ఆఫీసులలో ప్యూనులుగ పని చేస్తున్న వారని Rev.c. Jain అన్నారు. వి.చూ. సి.టి.యస్.ఐ. VI. వైశ్యకులంలో ఇంటిపేరుగా వుంది.

**తెల్లావుల**

జంతుసూచి (స.).

తెల్ల+ఆవుల : తెల్లనివర్ణంగలఆవులు. కమ్మవారిలో ఇంటిపేరు. ?< తెల్లావల. సిద్ధార్థము. వృక్షవిశేషం. శ.ర.

## తే

**తేళ్ళ**

సరీసృపసూచి (తె.స.).

తేలుబహు.కు ద్వి.వి. కొండితో కుట్టే ఒక విషజంతువు. వృశ్చికం. తేలు మంత్రం పెట్టేవారు కావచ్చు. కమ్మవారిలో ఇంటిపేరు.

## తొ

**తొక్కుడము**

పౌరుషనామం (సా.).

< తొక్కుకు భావార్థకరూపం. "సోమసూర్యులభాతి వెంకటజెట్టి గోవిందజెట్టియును, పొంకంబునందు పూర్వ ఖండర్థి జనులు తొక్కుడములు సడలించు కతన, ఘనులు తొక్కుడము వెంకటజెట్టియంద్రు." (వింజజా. Tel. Man. పు. 303).

**తొంగలి**

పౌరుషనామం (స.).

త.తొంఒల్ : రాజచిహ్నమైనగొడుగు.

**తొట్టి**

వస్తుసూచి (రా.).

నోరువెడల్పు, అడుగు సన్నం గల గంపవంటి పాత్ర. గంగాళమనిత్రో; కటాహము చి.ని., క.తొట్టి; త. తొట్టి. పశువులు నీళ్ళుతాగటానికి రాతితో కట్టిన కట్టడం.

**తొండపనేని**

వ్యక్తినామం (స.).

తొండప- గృ. నా. పూ; పు. నా. < తొండప్ప. < తొండ+అప్ప. < తొండన్ భక్తుడు. -అప- చూ. గృ.నా.వ. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. -నేని గృ.నా.వ.

**తొండము**

పౌరుషనామం (స.).

ఏనుగుతొండం, మోటగూన లోనినీరు సూటిగా బోదెలో పడడానికి అడుగున కుట్టిన ఏనుగుతొండంలాంటి తోలు గొట్టం. < సం. తుండమ్. కమ్మవారిలో ఇంటిపేరు.

తొమ్మండ్రము
సంఖ్యాసూచి (స.).
తొమ్మిదిమంది. హరిజనులలో ఇంటి పేరు.

తొలుచూరి
పౌరుషనామం (స.).
<తొలుచూలు. మొదటిబిడ్డ. తొలుచ <తొలుత. మొట్టమొదటి అనే అర్థంలో తొలుచూరి. తొలిసూరి మొదలైనపదాలు వ్యవహారంలో వున్నాయి.

## తో

తోక
రూ. తోకల
పౌరుషనామం (రా.).
పశుపక్ష్యాదులవాలం. ఎరుకలవారిలో ఇంటిపేరు. క.తోకె; త.తోకై; తు.తోకె; మ. తోక. డి.ఇ.డి. 2916.

తోకచిచ్చు
పౌరుషనామం (స.).
తోక+చిచ్చు. తోకలాగ పొడవుగా వ్యాపించిన నిప్పు. నిప్పురగిలించిన పిడకల వరుస. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

తోకల
చూ. తోక
పౌరుషనామం (తె.ప.).
తోకబహు. బహువచనం. ఎరుకలలో, కమ్మవారిలో ఇంటిపేరు.

తోట
రూ. తోట్ల
వనసూచి (తె.రా.స.సా.).
ఉద్యానవనం, ఉపవనం. ఇంటిచుట్టూ ఉన్నతోట. ఆశ్రమం. క.తోట, తోంట; తు. తోట త. తోట్టమ్; మ. తోట్టమ్ డి.ఇ.డి. 2927. కమ్మ, కాపు, చెంచు, బలిజ, బోయ బ్రాహ్మణ. ముత్రాస, యానాది కులాలలో ఇంటిపేరు. "పీఠ వరగ్రామణికే, దారములారా మమునుదగువాడు మహో, దారుడు తోట కులుడు న. ర్వారాయుడు పేర్మిమమ్ము రావించె—" చాటువు.

తోటకూర
వృక్షసూచి (స.).
కమ్మవారిలో ఇంటిపేరు.

తోటి
వృత్తిసూచి (రా.).
గ్రామసేవకులు. పాకీపని. త. తోట్టి; మ.తోట్టి; క.తోటి,తు.తోటి, తె.తోటి = scavenger. డి. ఇ. డి. 2924. Tondu=to dig. or tolt=to go round. అనే పదాలనుండి వచ్చుంటుందని, గ్రామంలో మురికి పనంతా చేస్తారని, సత్రాలు ఊడ్చుతారని, గ్రామంలో వీరిది చాలాతక్కువ కులమని సి.టి. యస్.ఐ.IV. పు.182. రాయలసీమలోని కాపులలోను, మాలవారిలోను ఈ ఇంటి పేరు కన్పిస్తుంది.

తోట్లి
చూ. తోట
వర్ణసూచి (రా.).
<తోటల. తోటబహు.కు ద్వి. వి.

తోంపాకు
వృక్షసంబంధసూచి (వ.)
<తమలపాకు. <తమలము+ఆకు.
తమలపుఆకు. తోంపు– గృ. నా. పూ;
?<తోపు : ఎరుపురంగు. వా. నోరు
ఎరుపురంగు రావడానికి నమిలేఆకు.
చూ. –ఆకుల గృ.నా.వ.

తోళ్ళ
పౌరుషనామం (రా.వ.).
తోలుబహు. కు ద్వి. వి. జంతువుల
చర్మం. త. తోల్; పర్జి. తోల్; కువి.
తోలు. డి.ఇ.డి. 2937.

## త్రి

త్రిపురనేని
రూ. తిపిర్నేని, తిపుర్నేని.
వ్యక్తినామం (తె.వ.).
త్రిపుర– గృ.నా.పూ; వ్య.నా. త్రిపుర,
త్రిపురాంబ, త్రిపురసుందరి మొదలైనవి
కూడా ఇలాంటి వ్యక్తినామాలే. కమ్మ
వారిలో ఇంటిపేరు.
చూ. –నేని గృ.నా.వ.

త్రిపురమల్లు
వ్యక్తినామం (వ.).
త్రిపుర– గృ.నా పూ; వి.చూ. త్రిపుర
నేని చూ. –మల్లు గృ.నా.వ.

త్రిపురాన
వ్యక్తినామం (వ.).
<త్రిపురనేని

త్రిపురారి
దేవతాసూచి (తె.).
శివుడు. త్రిపుర సంహారసమయంలో
భూమి రథంగాను, సూర్యచంద్రులు
చక్రాలుగాను, వేదాలు గుర్రాలుగాను,
మేరువు చాపంగాను, శేషుడు నారిగా,
విష్ణువు బాణంగా తోడ్పడ్డారట. వి.చూ.
త్రిపురారిభట్లు.

త్రిపురారిభట్లు
వ్యక్తినామం (తె.వ.).
త్రిపురారి– గృ.నా.పూ; దేవతాసూచి.
త్రిపుర+అరి. త్రిపుర–మూడుపురాలు.
–అరి. శత్రువు త్రిపురసంహారం చేసిన
వాడు. శివుడు. బ్రాహ్మణులలో ఇంటి
పేరు. చూ. –భట్ల గృ.నా.వ.

## ద

దడిగ
రూ. దడిగె
పౌరుషనామం. ఆయుధసూచి (తె.).
ఖేటకం, పలక, డాలు.

దడిగె
చూ. దడిగ
ఆయుధసూచి (తె.).

దంటు

వృత్తిసూచి (స.).

తృణవిశేషం. జొన్న మొదలైన వాటి కాడ. వెలనాటి వైదికబ్రాహ్మణులలో ఇంటిపేరు. క. దంటు.

దండగ

పౌరుషనామం (స.).

<సం. దండ–నష్టం. రాజు ధనవంతుని దగ్గర బలాత్కారంగా పుచ్చుకునే ధనం; అపరాధం చేసిన వాని దగ్గర నుండి అపరాధ పరిహారానికిగాను అధికారి పుచ్చుకునే అపరాధ ధనం.

దండనాయక

వృత్తిసూచి (శా.స.).

సేనాపతి లేక దళవాయి. అపరాధానికి శిక్షవిధించే అధికారి. "—దివియలు మూణ్టికి దణ్డనాయక తిక్కవయ్య నాయకులిచ్చిన—" 1043 వి.డి. (ఇ. టి.ఐ. పు.106; నెం. 125). "—దండ నాయక భీమరాసు—" (టి.యం.పి. I. పు. 258; నెం. 14). "—దండనాయక సోమన—" శా. 1094 (పైది. II; పు. 776; నెం. 272).

దండంరాజు

వ్యక్తినామం (రా.).

దండం–గృ.నా.పూ.? ఆర్వేలనియోగు లలో ఇంటిపేరు. చూ. –రాజు గృ.నా.ప.

దండాబత్తిన

వ్యక్తినామం (రా.స.).

దండా– గృ.నా.పూ.?

చూ. –బత్తిన గృ.నా.ప.

దండిభట్ల

రూ. దండిభొట్ల

వ్యక్తినామం (తె.).

దండి– గృ.నా.పూ. ? బ్రాహ్మణులలో ఇంటిపేరు. చూ. –భట్ల గృ.నా.ప.

దండిభొట్ల

చూ. దండిభట్ల

వ్యక్తినామం (స.).

దండు

రూ. దండుగోళ్ళు, దండువాళ్ళు.

పౌరుషనామం (తె.రా.స.).

సేన, దండయాత్ర, సమూహం. కమ్మ, కాపు, బోయ, హరిజనులలో ఇంటిపేరు. సం. దండ–; క. దండు.

దండుగోళ్ళు

చూ. దండు

పౌరుషనామం (తె.).

దండువాళ్ళు

చూ. దండు

పౌరుషనామం (రా.).

దండు+వాళ్ళు.

దండెం

వస్తుసూచి.

<సం. దండికా : వస్త్రాలు ఆరవేయ డానికి లేక ఎండబెట్టడానికి అడ్డంగా పెట్టే

వెదురుకర్ర లేక వారం. కమ్మవారిలో ఇంటిపేరు.

దత్తా

చూ. దత్తాత్రి

వ్యక్తినామం (స.).

కమ్మవారిలో ఇంటిపేరు.

దత్త్రాత్రి

రూ. దత్తా

వ్యక్తినామం (స.).

<సం. దత్తాత్రేయ– : ఒక ముని. అత్రికి అనసూయ యందు జన్మించిన వాడు.

దబిర్

వస్తుసూచి (శా.).

?<దబరా : పెడల్పయిన గిన్నె.

?<దబ్బుఱ : అసత్యం. "–దబిర్ వెంకన్న––" శా. 1616. (టి.యంపి. II; పు. 841; నెం. 826),

దబ్బర

పౌరుషనామం (స.).

బొంకు, అసత్యం; మోసం; నిందా వాక్యం;తప్పు. కమ్మవారిలో ఇంటిపేరు.

దయ్యాల

రూ. దెయ్యాల

పౌరుషనామం (రా.స.సా.).

దయ్యము బహు. కు ద్వి.వి. దేవుడు. <ప్రా. దేవ్వం–, దఇవ్వం. <సం. దైవమ్. ?<క. దెవ్వ : పిశాచం, "దయ్యాల మల్లయ్య తా ముందు కొచ్చి––" (పల్నా. పు. 147; పం. 1729).

దరువుల

సంగీతశాస్త్ర పరిభాష (తె.).

దరువు బహు.కు ద్వి.వి.?<సం.ధ్రువా: గీతి విశేషం.

దర్జి

వృత్తిసూచి (తె ).

సూచికవృత్తి. పర్యా. టైలర్. మహమ్మదీయులలో ఇంటిపేరు.

దర్బా

చూ. దర్భ

తృణసూచి (రా.స.).

బ్రాహ్మణులలో ఇంటిపేరు.

దర్భ

రూ. దర్బా

తృణసూచి (తె.రా.సా.).

ప్రా. దచ్భ; సం. దర్భః; క. దర్భః; త. దర్ప్పె : కుశ. "––దర్భవంశాంభోధితారావిభుడు––" (రుక్మాం.Tel.M. పు. 123). "అని లోక వినుత దర్భాన్వయ జలధి జనితుడు––" (పైది. అశ్వాగ. పు. 124). "–.దర్భకుల పావన గిరిరాజ––" (అభి. Tel. M; పు. 301).

దర్శనాల

పౌరుషనామం (రా.).

దర్శనం బహు. కు ద్వి.వి. ఆధ్యాత్మిక విషయ శాస్త్రభేదం. ఉదా. బౌద్ధదర్శనం, సాంఖ్య దర్శనం.

దళవాయి

వృత్తిసూచి (తె.రా.శా.స.సా.).

దళము + వాయి : సేనానాయకుడు. సుంకరికి సహాయుడైన ఉద్యోగి. <మరాఠీ. దళవాయీ, దళవాహీ.

"—దళవాయి దేవరాజయ్య—" శా. 1365. (టి.యం.పి. II; పు. 802; నెం. 457). "—దళవాయి శేషాద్రి సిద్ధార్థినామ సంవత్సరపు—" (భాస్క. Tel. Ma. పు. 54).

దళారి

వృత్తిసూచి (శా.).

మారుబేరపువృత్తి. "దళారిదామినాయకుడు." శా. 1109. (టి.యం.పి. II; పు. 1103; నెం. 412).

దశగ్రంథాల

పౌరుషనామం (స.).

<దశగ్రంథాలు + అ. పదిగ్రంథాలను అధ్యయనం చేసినవారు. వందవరీక బ్రాహ్మణులలో ఇంటిపేరు.

దశరాజు

చూ. దేశరాజు

వ్యక్తినామం (స.).

# దా

దాటల

రూ. దాట్ల

పౌరుషనామం (స.).

<దాటు. సమూహం. దాటు బహు. కు ద్వి.వి.

దాట్ల

చూ. దాటల

పౌరుషనామం (స.సా.).

"—శ్రీ దాట్ల వెంకటకృష్ణ భూరమణ—" (విజ.నం.వి; పు. 22).

దాడి

పౌరుషనామం (స.).

దండయాత్ర, శత్రువునుజయించడానికి దండెత్తి పోవడం ప్రా. ధాడీ: సం. ధాటీ; క. దాడి. కమ్మవారిలో ఇంటిపేరు.

దాదల

సంబంధసూచి (స.).

<దాదిలి : దాది, పెంచినతల్లి. ప్రా.ధాఈ, ధత్తీ సం. ధాత్రీ, క. దాది.

దాదినేని

వ్యక్తినామం (స.).

దాది— గృ.నా పూ. స్త్రీ.నా. <సం. ధాత్రీ— పెంచినతల్లి, ఉపమాత వి.సూ. దాదలి. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. —నేని గృ.నా.ప

దామ

రూ. దామని

పౌరుషనామం (రా.).

<దామము : బంధం. పాలు పితికే

టప్పుడు పశువులకాలికి కట్టేతాడు; చాలా పలుపులుగల పొడవైన తాడు. కమ్మ వారిలో, కాపులలో ఇంటిపేరు.

దామని

చూ. దమ

పౌరుషనామం (తె.).

దామర

వస్తుసూచి (స.సా.).

పశువులకు ఓట్టుపోసిపెట్టేబుట్ట. పర్యా. తట్ట. మాం. వృ.ప., ఉరిత్రాడు. సూ.ని. "—దామర వెంకట ప్రభువశంసుని—" (బహుళా. 1-15).

దామరాజు

వ్యక్తినామం (శా.స.).

దామ– గృ.నా.పూ; వ్య.నా. దేవతా సూచి. <దామోదరుడు : కృష్ణుడు. దామ+ఉదర. దామము ఉదరమందు కలవాడు. యశోదచేత కట్టబడిన తాడు ఉదరమందు కలవాడు. ?దామ+ఉత్+అర– దమాదులచే ఉత్కృష్టమగుబుద్ధికి విషయమగువాడు. విష్ణువు. సూ. ని. ఆర్వేల నియోగులలో గృహనామం. "—పొడవుము దామరాజు పోతరాజు నకు దమ్మకముగా—" దుర్మతి (తెలం. శా. I; పు. 65; పం.18-20)

చూ. -రాజు గృ.నా.ప.

దామసాని

వ్యక్తినామం (తె.).

దామ– గృ.నా.పూ; వ్య.నా. దేవతా సూచి. వి.చూ. దామరాజు. బ్రాహ్మణు లలో ఇంటిపేరు.

చూ. -సాని గృ.నా.ప.

దామావఝ్ఝల

వ్యక్తినామం (తె.స.).

దామా– గృ.నా.పూ; వ్య.నా. దేవతా సూచి. <దామ. వి. చూ. దామరాజు. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. -వఝ్ఝల గృ.నా.ప.

దామినేని

వ్యక్తినామం (స.).

దామి– గృ.నా.పూ; వ్య.నా. దేవతా సూచి. దామ+ఇ. వి.చూ. దామరాజు. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. -నేని గృ.నా.ప.

దార

చూ. ధారా

పౌరుషనామం. వాద్యసూచి (రా.).

దారణ

పౌరుషనామం (స.).

క. దారణె; త. తారణై : క్రయం, కొనడం.

దారపనేని

చూ. దారపునీడి

వ్యక్తినామం (రా.స.).

కమ్మవారిలో ఇంటిపేరు.

దారపునీడి

రూ. దారపనేని. దారిపినేని.

వ్యక్తినామం (స.).

దారపు- గృ.నా.పూ; ?<సం. ధారా, ద్వార-. చూ. -నీడి గృ.నా.ప.

దారా

చూ. ధారా

వాద్యసూచి (స.సా.).

"...దారావారును బేర్లవారు సుజనా ధారుల్..." (కన్య.వి; పు.4.).

దారి

మార్గసూచి (స.).

ప్రా. దారం; సం. ద్వారమ్; క. దారి: త. తారి; తు. దారి, డి.ఇ.డి. 2589. మార్గం, దారి. హరిజనులలో ఇంటిపేరు. స్థానం, పార్శ్వం, సూత్రధారుడనే అర్థంలో కూడ కన్పిస్తుంది.

దారిపినేని

చూ. దారపునీడి

వ్యక్తినామం (స.).

<దారపునేని. కమ్మవారిలో ఇంటిపేరు.

దా॥రాజుల

వ్యక్తినామం (స.).

దార- గృ.నా.పూ; <సం. ధారా.

చూ. -రాజుల గృ.నా.ప.

దాళా

పౌరుషనామం (స.).

పడియొక్క ఎక్కువ తక్కువలు. నెయ్యి, నూనె మొదలైనవి గల పాత్రలను త్రాసుయొక్క వెదురు పళ్లాలలో (సిబ్బి) పెట్టి సరిఎత్తు రాళ్ళను మరొక దానిలో పెట్టి పడి కట్టడం.

దావల

పౌరుషనామం (స.).

?<దావ. తగవు. దావ బహు.కుద్వి.వి. వాడు నామీద దావావేశాడు. వ్య. ?<దావము : అడవి.

దాశిరాజు

వ్యక్తినామం (స.).

?<దేశిరాజు. దాశి- గృ.నా.పూ; ?<దాశుడు. చేపలను హింసించేవాడు. బెస్తవాడు. ?<దాశేయుడు. జాలరి స్త్రీ కొడుకు. ?<దాశార్హుడు. దాశార్హ సంతతికి చెందినవాడు. కృష్ణుడు. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. -రాజు గృ.నా.ప.

దాసరమోని

వ్యక్తినామం (తె.).

దాసర- గృ.నా.పూ; శూద్రజాతికి చెందిన వైష్ణవ భక్తుడు. దాసరి కులం. వి.చూ. దాసరి. చూ. -మోని గృ.నా.ప.

దాసరి

రూ. దాసర్ల, ధాసరి.

జాతిసూచి (రా.స.సా.).

వైష్ణవ మతావలంబి అయిన ఒక

శూద్రజాతివాడు. సం. దాసేర-; క. దాసరి. బహు : దాసరులు. దాసర్లు, దాసళ్లు. "—మీరు దాసరివారు మేదిని మీద—" (పల్నా. పు. 56; పం. 58). ఎరుకల, కమ్మ, కోమటి. బలిజ. బోయ లలో ఇంటిపేరు. భిక్షవృత్తిలో ఉన్న వైష్ణవకులం. ఒక శూద్రకులస్థుడు తనకు పిల్లలు కలిగితే దేవుడికి ఒకరిని ఇస్తానని మొక్కుకున్నాడట. చాలా మంది కొడుకులు కలిగేసరికి వాళ్ళలో ఒకడిని ఇచ్చాడు. అతడే దాసన్. దాసన్ అంటే సేవకుడు. దేవునికి సేవలు చేయడానికి అతని జీవితాన్ని నియమించాడు తండ్రి. తండ్రి ఆస్తిలోని హక్కులను వదులుకున్నాడు. అందుకనే ఇతని వారసులంతా భిక్షవృత్తిని అవలంబించారు. దాసరివాళ్ళు తోలు సాధనమైన 'తప్పె'తో పాటలు పాడతారు. ప్రతి దాసరి ఒక తెంగళై. ఇది నిజానికి కులంకాదు. వృత్తి విభాగం మాత్రమే. కాని తరువాత ఇది కులంగా భావించబడింది. దాసరివారి బిరుదనామాలైన అన్న, అయ్య గృహనామంగా ఎరుకల, కొరివ, మాల కులాలలో ఇంటిపేర్లుగా వున్నాయి.

దాసర్లు

చూ. దాసరి

జాతిసూచి (తె.న.).

కమ్మవారిలో ఇంటిపేరు.



దాసి

వృత్తిసూచి (తె.న.).

పరిచారికవృత్తి. పనిక త్తె. శైవకవులు పురుషులకు కూడ ఈ స్త్రీలింగ రూపం ఉపయోగించారు.

దాసుగౌని

వ్యక్తినామం (తె.).

దాసు- గృ.నా.పూ: <సం. దాస- భక్తుడు, భృత్యుడు. "—గుప్త దాసాంతకం నామ ప్రశస్యం వైశ్యశూద్రయోః" అన్నారు కనుక శూద్రులపేర్ల చివర దాసు చేరుతుంది. ఉ. గంగదాసు.

చూ. -గౌని గృ.నా.ప.

దాసెట్టి

వ్యక్తినామం (స.).

దా- గృ.నా.పూ: <దాస- వి. చూ. దాసుగౌని. చూ. -సెట్టి గృ.నా.ప.

## ది

దిట్టకవి

బిరుదనామం (స.సా.)

కవిత్వసూచి. దిట్ట- ధైర్యం, చతురుడు, సమర్థుడు. సం. ధృష్ట-; ప్రా. దిట్ఠో; క. దిట్ట. కవిత్వం చెప్పడంలో దిట్ట. ఆర్వేల వారిలోను, శ్రీవైష్ణవులలోను ఇంటిపేరు. "—దిట్టకవి వంశ ప్రోద్భవున్—" (రంగరా. 1-18). "—దిట్టకవివంశ పవిత్రాచ్ఛ నామాత్య—"

(వైది. ఆళ్వా.గ.).

దిండు

పౌరుషనామం (తె.).

తలగడ; నూలువడికే రాట్నపు కదురునకు నూలు మొదలైన వాటితో ఏర్పరచేపిడి; విడుపాటి గుండ్రని తలగడలా చెక్కబడిన మాను; మెరుగుబిళ్ళ మొదలైనవి అంటించే రాళ్ళపనివాని సాన.

దిబ్బారెడ్డి

వ్యక్తినామం (స.).

దిబ్బ- గృ.నా.పూ; పు.నా. <దిబ్బ. ఉన్నతభూమి, కొండ. ప్రా. దీఓ; సం. ద్వీప-; క. తిప్పె: త. తిప్పై; పర్జి. డిప్ప, డిబ్బ; తె. దిబ్బ. డి.ఇ.డి.2641. చూ. దిబ్బయ్య. వ్య.నా.

చూ. -రెడ్డి గృ.నా.ప.

దివాకర

చూ. దివాకరుని, దివాకర్ల

వ్యక్తినామం (శా.).

<సం. దివాకర -: సూర్యుడు.

?<దివాకరము : కాకి, జిల్లేడుచెట్టు, పొద్దుతిరుగుడు పువ్వు. ''విష్ణుదేవరకు నిందుల దివాకర పెద్దేరి కొడుకు—'' 1061 A.D. (ఇ.టి.ఐ. పు.117; నెం. 133; పం. 1).

దివాకరభట్ల

వ్యక్తినామం (స.).

దివాకర- గృ.నా.పూ; పు.నా, దేవతా సూచి. <దివాకరుడు. <సం. దివాకర- సూర్యుడు, వైదికులలో ఇంటిపేరు.

చూ. -భట్ల గృ.నా.ప.

దివాకరుని

చూ. దివాకర

వ్యక్తినామం (స.).

బ్రాహ్మణులలో ఇంటిపేరు.

దివాకర్ల

చూ. దివాకర

వ్యక్తినామం (స.).

బ్రాహ్మణులలో ఇంటిపేరు.

దివినేని

వ్యక్తినామం (స.).

దివి- గృ.నా.పూ; <సం. దివి.= ఆకాశం, స్వర్గం. ?<దేవినేని

చూ. -నేని గృ.నా.ప.

దివ్వెల

పౌరుషనామం (స.).

దివ్వె బహు. కు ద్వి.వి. దీపం. <ప్రా. దీవీ- <సం. దీప-. కమ్మవారిలో ఇంటిపేరు.

## దీ

దీనబంధు

బిరుదనామం (శా.).

దీనులకు బంధువు ''దీనబంధు సీతురావు—'' (టి.యం.పి. పు. 679; నెం. 99).

దీపాల

పౌరుషనామం (తె.స.).

దీపము బహు. కు ది.ద్వి. దీపింప జేసేది—దివ్వె. ? <వృక్షసూచి—మయూర శిఖచెట్టు. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

దీపావళి

పర్వదినసూచి (తె.).

దీపాలవరుస. పండుగసూచి. ఆశ్వయుజమాసంలోని అమావాస్య పండుగ, నరకచతుర్దశి మరుసటిరోజు జరిగే పండుగ.

దీవి

జలసూచి (స.సా.).

నీటిమధ్యఉన్న భూభాగం. ద్వీపం. <ప్రా. దీవో— <సం. ద్వీప—"—సుకవి విధేయశ్రీమాన్ దీవిలక్ష్మీ నృసింహాచార్యాభిధాన—" (తన్క. ఆశ్వా. గ. పు. 24). కమ్మవారిలో, బ్రాహ్మణులలో ఇంటిపేరు.

## దు

దుగ్గి

వ్యక్తినామం (తె.రా.స.).

దేవతాసూచి. <ప్రా. దుగ్గా <సం. దుర్గా : దుర్గాదేవి. కమ్మవారిలో ఇంటి పేరు.

దుగ్గిన

చూ. దుగ్గినేని

వ్యక్తినామం (రా.స.).

కమ్మవారిలో ఇంటిపేరు

దుగ్గిని

చూ. దుగ్గినేని

వ్యక్తినామం (రా.).

కమ్మవారిలో ఇంటిపేరు.

దుగ్గినేడి

చూ. దుగ్గినేని

వ్యక్తినామం (స.).

కమ్మవారిలో ఇంటిపేరు.

దుగ్గినేని

చూ. దుగ్గిన, దుగ్గిని, దుగ్గినీడి.

వ్యక్తినామం (రా.స.).

దుగ్గి—గృ.నా.పూ. స్త్రీ.నా. దేవతాసూచి. <దుగ్గ+ఇ. <దుగ్గ <దుర్గ. పార్వతి. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. —నేని గృ.నా.ప.

దుగ్గిరెడ్డి

వ్యక్తినామం (స.).

దుగ్గి—గృ.నా.పూ; దేవతాసూచి; స్త్రీ.నా. వి.చూ. దుగ్గినేని. చూ. —రెడ్డి గృ.నా.ప.

దుడుకు

స్వభావసూచి (స.).

క. దుడుక; త. తుటుక్కు. దౌష్ట్యం, చెడ్డపని. వేగం.

దుత్తా

వస్తుసూచి (స.)

దుత్త. చిన్నమూతిగల చిన్నకుండ, పాలకుండ,

దుద్దుల
ఆభరణసూచి (తె.).
దుద్దు బహూ.కు ద్వి.వి. చెవికమ్మ

దుంతల
జంతుసూచి (రా.).
దుంత బహు కుద్వి.వి. దుంత—దున్న, మహిషం.

దున్న
రూ. దున్నపోతు
జంతుసూచి (స.).
<దున్న : మహిషం. స్త్రార్యా. పోతు, ఎనుబోతు.

దున్నపోతు
చూ. దున్న.
జంతుసూచి (స.).
పేరూరిద్రావిడ బ్రాహ్మణులలో ఇంటి పేరు.

దుప్పటి
వస్త్రసూచి (స.).
కప్పుకునేవస్త్రం. ప్రా. దుపట్టి; సం. ద్విపటీ; క.డుప్పటి. కమ్మవారిలో ఇంటి పేరు.

దుంపల
శాకసూచి (స.).
దుంప బహూ.కుద్వి.వి.ఒకవిధమైనగడ్డ.

దుమ్ము
పౌరుషనామం (రా.).
ధూళి, పరాగం. రెడ్డికులంలో ఇంటి పేరు.

దుర్గ
వ్యక్తినామం (స.).
<సం. దుర్గా : గౌరి. దేవతాసూచి.

దుర్గం
పౌరుషనామం (తె.స.).
ప్రవేశించడానికి వీలుపడనిది: కోట. కమ్మవారిలో, బ్రాహ్మణులలో ఇంటిపేరు.

దుర్గరాజు
వ్యక్తినామం (స.).
దుర్గ— గృ.నా.పూ; స్త్రీ. నా. దేవతా సూచి. వి. చూ. దుర్గ. బ్రాహ్మణులలో ఇంటిపేరు. చూ. —రాజు గృ.నా.ప.

దుర్గాప్రగడ
వ్యక్తినామం (స.).
దుర్గా— గృ. నా. పూ; దేవతాసూచి. వి.చూ. దుర్గ. ఆర్వేలనియోగి బ్రాహ్మణులలో ఇంటిపేరు.
చూ. —ప్రగడ గృ.నా.ప.

దుర్గావఝుల
వ్యక్తినామం (తె.).
దుర్గా— గృ.నా.పూ; స్త్రీ. నా. దేవతా సూచి. వి.చూ. దుర్గ. బ్రాహ్మణులలో ఇంటిపేరు. చూ. —వఝుల గృ.నా.ప.

దుర్గిరాజు
వ్యక్తినామం (స.).

దుర్గి– గృ. నా. పూ; స్త్రీ దేవతాసూచి <దుర్గ. వి.చూ. దుర్గ. ఆర్వేలనియోగులలో ఇంటిపేరు.

చూ. –రాజు గృ.నా.ప.

దుర్జయ

బిరుదనామం (శా.).

<దుర్జయుడు. గెలవరానివాడు,జయింపరానివాడు. "—కొండపడుమటి బుద్ధరాజు దుర్జయ కుటుంబంలోని—" శా. 1063. (టి. యం. పి. II: పు. 822; నెం. 612).

దుర్వాసుల *

వ్యక్తినామం (తె.స.).

<దుర్వాసుడు : దుష్టమగు వస్త్రం కలవాడు; అత్రి అనసూయలకు కలిగిన ఒకముని.వెలనాటివైదికులలో ఇంటిపేరు.

దువ్విశేని

వ్యక్తినామం (స.).

దువ్వి– గృ.నా.పూ; జంతుసూచి. పెద్దపులి, చిరుతపులి. సం. ద్వీపీ–; త. చిఱుత్తై; కోలా. దువ, దూ; పర్జి. దూ. డి.ఇ.డి. 598. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. –శేని గృ.నా.ప.

దువ్వెన

వస్తుసూచి (స.).

తలదువ్వుకోడానికి ఉపయోగించే సాధనం, ప్రస్నె.

# దూ

దూడల

రూ. దూళ్ళ

జంతుసూచి (తె.రా).

దూడ బహు. దు ద్వి.వి. పశుజాతి శిశువు. లేగ.

దూది

వస్త్రసంబంధసూచి (తె.స.).

క. దూది. విత్తనాలు తీసిన పత్తి.

దూదేకుల

జాతిసూచి (తె.రా.సా.).

తురకలలో ఒకజాతి. "దూదేకుల హుశేను దొమ్మరి గోపాలు—" (చంద్ర.2–56). దూది=పత్తి; ఏకుల = బాగుచేయు. శుభ్రంచేయు. అనే రెండు పదాల కలయికే దూదేకుల. వీరు మహమ్మదీయులుగా మారిన హిందువులు. దూదిని బాగుచేసే వృత్తిగల వారు. ముస్లింలుగా మారిన హిందువులు కను కనే హిందువుల ఆచారాలూ, ముస్లింల సంప్రదాయాలు రెండూ పాటిస్తారు.

దూలం

గృహసంబంధసూచి (రా.స.).

<దూలము. ఇంటిగోడల పైనగాని, స్తంభాలపైనగాని గుజ్జులకు ఆధారంగా వేసే పెద్ద కర్ర. ప్రా. థూలమ్; సం. స్థూలమ్; త. తులై, తులా; మ. తుల, తులాం; క. తుల, తులె, తొలె, ధూల

తు. తొలె, తులె; కుయి. తూలి. (డి.బి. ఐ.ఎ. 214).

దూళ్ళ

చూ. దూడల

జంతుసూచి (స.).

దూసరి

వృక్షసూచి (స.).

తృణవిశేషం. శ.ర. ఒకదినుసు వడ్లు.

# దె

దెయ్యాల

చూ. దయ్యాల

పౌరుషనామం (తె.).

దెయ్యము బహు. కు. ద్వి.వి.

# దే

దేచిరాజు

చూ. దేశిరాజు

వ్యక్తినామం (స.).

ఆర్వేల నియోగి బ్రాహ్మణులలో ఇంటిపేరు.

దేవ

పౌరుషనామం (తె..రా.).

దేవతాసూచి. ప్రా. దెవ, దెవ్వ; సం. దేవ_; తె. దేవర, దేవుడు; త. దేవు, దేవన, దైవం; క. దేవ; తు. దేవ.

దేవ అనే సంస్కృత పదానికి మెట్ట తామర చెట్టు, మగవి తోబుట్టువు అని అర్థం.

దేవతోటి

పౌరుషనామం (స.).

దేవ+తోటి. దేవ– గృ.నా.పూ; వి. చూ. దేవ; –తోటి. చండాలుడు, శుభం, మేలు.

దేవనభోయిని

దేవనబోయని

వ్యక్తినామం (శా.).

"––దేవభోయిని––" (యస్ ఇ.ఐ. IV; పు. 257; పం. 15; నెం. 781).

చూ. –భోయిని గృ.నా.ప.

దేవబత్తిని

చూ. దేవభక్తుని

వ్యక్తినామం (స.).

కమ్మవారిలో ఇంటిపేరు.

దేవబత్తుల

చూ. దేవభక్తుని

వ్యక్తినామం (స.).

దేవభక్తుని

రూ. దేవబత్తిని, దేవబత్తుల, దేవాభక్తుని. వ్యక్తినామం (స.).

దేవ– గృ.నా.పూ; దేవతాసూచి.వి.చూ. దేవ. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. –భక్తుని గృ.నా.ప.

దేవభట్ల

వ్యక్తినామం (శా.).

దేవ– గృ.నా.పూ; దేవతాసూచి.వి.చూ,

దేవ "__దేవభటెన కేతమరాజు___" (యస్.ఐ.ఐ. VI; పు. 93; సం. 6; నెం. 199). చూ. _భట్ల గృ.నా.వ.

దేవమోని

?దేవము+వాని

వ్యక్తినామం (తె.).

దేవం_ గృ.నా.పూ; వి.చూ. దేవం భట్ల. చూ. _నేని గృ.నా.వ.

దేవంభట్ల

వ్యక్తినామం (స.).

దేవం- గృ. నా. పూ; దేవతాసూచి. వ్య.నా. <దేవమ్మ <దేవి + అమ్మ. వ్య.నా. చూ. దేవయ్య, దేవమ్మ. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. _భట్ల గృ.నా.వ.

దేవర

రూ. దేవళ్ళ

దేవతాసూచి (రా.).

ప్రా. దేవ్వో; సం. దేవ_ : దేవుడు, ప్రభువు. దేవర గృహనామాలలో పర పదంగా కన్పిస్తుంది. ఉదా : వరసింహ దేవర, సూర్యదేవర.

దేవరభట్ల

వ్యక్తినామం (స.).

దేవర_ .గృ.నా.పూ; పు.నా. దేవతా సూచి. వి.చూ. దేవర. క.దేవర.బ్రాహ్మ ణులలో ఇంటిపేరు.

చూ. _భట్ల గృ.నా.వ.

దేవరసెట్టి

వ్యక్తినామం (స).

దేవర_ గృ.నా.పూ; వి.చూ. దేవర. చూ. _సెట్టి గృ.నా.వ.

దేవరింటి

పౌరుషనామం (స.).

దేవరిల్లుకు ఔప. <దేవర + ఇల్లు. దేవర_ గృ.నా.పూ; దేవుడు వి.చూ. దేవర. దేవరయొక్క ఇల్లు.దేవాలయం. దేవరగుడి, దేవళ్ళగుడి. కమ్మవారిలో ఇంటిపేరు.

దేవలబోయిన

వ్యక్తినామం (తె.).

దేవల_ గృ.నా.పూ; <దేవాలయం <దేవళం. <ప్రా. దేవుల, దేవఉల <సం. దేవకుల.

చూ. _బోయిన గృ.నా.వ.

దేవర్రాజు

చూ. దేవళరాజు

వ్యక్తినామం (స.).

బ్రాహ్మణులలో ఇంటిపేరు.

దేవళరాజు

రూ. దేవర్రాజు

వ్యక్తినామం (స.).

దేవళ_ గృ.నా.పూ; వి.చూ. దేవళ. ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.

దేవళ్ళ

చూ. దేవర

దేవతాసూచి (స.).
దేవర బహు. కు ద్వి.వి కమ్మవారిలో బ్రాహ్మణులలో ఇంటిపేరు.

**దేవాభక్తుని**

చూ. దేవభక్తుని

వ్యక్తినామం (శా.స.).
కమ్మవారిలో ఇంటిపేరు. "--దేవభక్తుని నారు--" (యస్. ఐ. ఐ. VI; పు.50; పం.4; నెం. 105).

**దేవాంగుల**

తెగసూచి (రా.స.).
బట్టలునేసి జీవించే జాతులలో ఒకతెగ.

**దేవిడి**

నివాసస్థలసూచి (తె.).
జమీందార్ల భవంతి.

**దేవిసీడి**

చూ. దేవినేని

వ్యక్తినామం (స.).
కమ్మవారిలో ఇంటిపేరు.

**దేవినేని**

చూ. దేవిసీడి

వ్యక్తినామం (తె.స.).
దేవి- గృ. నా. పూ; స్త్రీ. నా. దేవతాసూచి. <సం. దేవీ- : దుర్గాదేవి. పూజ్యస్త్రీలపేర్లకు దేవి పరపదాను బంధంగా కన్పిస్తుంది. ఉదా : లక్ష్మీదేవి, సీతాదేవి. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. -నేని గృ.నా.ప.

**దేవిరెడ్డి**

వ్యక్తినామం (తె.).
దేవి- గృ.నా.పూ; వి.చూ. దేవినేని.

చూ. -రెడ్డి గృ.నా.ప.

**దేశగౌని**

వ్యక్తినామం (తె.).
<దేశ+గౌని. దేశ గృ. నా. పూ; వి.చూ. దేశబత్తిని.

చూ. -గౌని గృ.నా.ప.

**దేశబత్తిని**

వ్యక్తినామం (తె.).
దేశ- గృ.నా.పూ. ?

చూ. -బత్తిని గృ.నా.ప.

**దేశరాజు**

చూ. దశరాజు, దేశిరాజు.

వ్యక్తినామం (తె.స.).
దేశ- గృ.నా.పూ; వి.చూ. దేశబత్తిని. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. -రాజు గృ.నా.ప.

**దేశిరాజు**

చూ. దేశరాజు

వ్యక్తినామం (స.).
ఆర్వేలనియోగి బ్రాహ్మణులలో ఇంటిపేరు.

**దేశిరెడ్డి**

వ్యక్తినామం (రా.).
దేశి- గృ.నా.పూ; వి.చూ. దేశబత్తిని.

కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. -రెడ్డి గృ.నా.వ.

**దేసటి**

తెగసూచి (సా.).

రెడ్లలో దేసటివారు ఒకతెగ. <ప్రా. దేసట్ఠ- <సం. దేశస్థ- "శ్రీమద్దేసటి వంశ గ్రామణీ." (కాశీ. 2-1). "శ్రీసాధక సుచరిత్రా- దేసటిపెమా! (హరివం. పూ.భా.1).

## దొ

**దొంగ**

పౌరుషనామం (రా.).

దొంగవాడు; అంటిపువ్వులోవున్న గట్టి కాదను దొంగవాడంటారు. తె. తొంగు, దొంగు, దొంగలించు; త. తొంకన, తొంకి; మ. తొణ్ణన్; నాయి. దొంగ; పర్జి. దొంగ్. డి.ఇ.డి. 2417.

**దొడ్డక**

చూ. దొడ్డా

పౌరుషనామం (స.).

'దొడ్డ' మీద 'క' ప్రత్యయంచేరింది. ?<దొడ్డ+అక్క-.వ్యక్తినామం.రామక్క, చిన్నక్కలాగ దొడ్డక్క-కావచ్చు.

**దొడ్డపన**

చూ. దొడ్డపనేని

వ్యక్తినామం (స.).

కమ్మవారిలో ఇంటిపేరు.

46)

**దొడ్డపనేని**

రూ. దొడ్డపన

వ్యక్తినామం (స.).

దొడ్డప- గృ. నా. పూ; <దొడ్డప్ప. దొడ్డ+అప్ప. దొడ్డ-గొప్ప. -అప- చూ. -అప్ప గృ.నా.వ. కమ్మవారిలో ఇంటి పేరు. దొడ్డ వ్యక్తినామ పూర్వపదంగా గల పేర్లు దొడ్డమ్మ, దొడ్డయ్య.

చూ. -నేని గృ.నా.వ.

**దొడ్డమనేని**

వ్యక్తినామం (స.).

దొడ్డమ- గృ. నా. పూ; దొడ్డ+అమ. దొడ్డ-వి. చూ. దొడ్డపనేని. -అమ-చూ. గృ.నా.వ. చూ. -నేని గృ.నా.వ.

**దొడ్డా**

రూ. దొడ్డక.

పౌరుషనామం (స.).

<దొడ్డ. గొప్ప, శ్రేష్ఠమైన. కమ్మవారిలో ఇంటిపేరు.

**దొడ్డి**

రూ. దొడ్ల

స్థలసూచి (తె.రా.).

పశువులుమేసేచోటు, పశువులను కట్టేసే పశువులశాల. <సం. ద్రోణీ-; త. తొట్టి; మ.తొట్టి, దొడ్డి;కొడ. తొడియ. డి.ఇ.డి. 2869. దేవాంగుల, మాల, యానాది, వెలమలలో ఇంటిపేరు.

దొడ్ల

చూ. దొడ్డి

స్థలసూచి (శా.).

దొడ్డిబహూ.కుద్వి.వి. "—దొడ్ల వెంకట నాయనిగారు—" శా. 1491 (టి.యం. పి. II; పు. 913; నెం. 49).

దొండ

చూ. దొండమాను

వృక్షసూచి (తె.).

కమ్మవారిలో ఇంటిపేరు.

దొండమాను

రూ. దొండ

వృక్షసూచి (స.).

బింబిక, దొండచెట్టు.

వృ.నా. Coccinia Indica.

సం. తుండికా; త. తొణ్ణయ్; మ. తొణ్ణి; క. తొణ్డె, దొణ్డె; తె. దొండ డి.ఇ.డి. 2880.

దొనిపినేని

వ్యక్తినామం (స.).

దొనిపి— గృ.నా.పూ; <దోణ+ప <ప్రా. దోణ— <సం. ద్రోణ—. కమ్మ వారిలో ఇంటిపేరు.

చూ. —నేని గృ.నా.ప.

దొంతంరాజు

రూ. దొంతరాజు

వ్యక్తినామం (వ.).

దొంతం— గృ. నా. పూ; వ్య. నా. <దొంతము. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. —రాజు గృ.నా.ప.

దొంతరాజు

చూ. దొంతంరాజు

వ్యక్తినామం (స.).

బ్రాహ్మణులలో ఇంటిపేరు.

దొంతెల

అస్పష్టనామబంధం (స.).

?<దొంతరల.

దొంతినేని

రూ. దొంతిన్ని

వ్యక్తినామం (స.).

దొంతి— గృ.నా.పూ;? కమ్మవారిలో ఇంటిపేరు. చూ. —నేని గృ.నా.ప.

దొంతిన్ని

చూ. దొంతినేని

వ్యక్తినామం (రా.).

కమ్మవారిలో ఇంటిపేరు.

దొంతిరెడ్డి

వ్యక్తినామం (స.).

దొంతి— గృ.నా.పూ ?

చూ. —రెడ్డి గృ.నా ప.

దొప్పల

పౌరుషనామం (తె.స.).

దొప్ప బహూ. కు ద్వి.వి.ఆకులు మొదలైన వాటితో కట్టిన దొన్నె.

దొమ్మరి

కులసూచి (తె.).

దొమ్మర + ఇ. దొమ్మరివాడు.
తు. దొమ్మరె. "ఉత్తర భారత దేశంలోని డోమ్స్ (Doms)తో వీరిపేరుకు సంబధంవుంది. తెలుగు, తమిళ, హిందుస్తాని భాషలు మాట్లాడతారు. తాడుమీద నాట్యంచేస్తూ ఫీట్స్ చేస్తుంటారు. కొందరు బుట్టలు, చాపలు అల్లుతారు.

చూ. సి.టి.యస్.ఐ.

దొర

పౌరుషనామం (రా.).

ప్రభువు, రాజు, సేనాపతి; వయసులో, విద్యలో పెద్దవాడు. జాలరులలో ఇంటి పేరు.

## దో

దోచిభట్ల

వ్యక్తినామం (తె.).

దోచి– గృ.నా.పూ;? < దోసి < దోసి.
బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. –భట్ల గృ.నా.వ.

దోమ

రూ. దోమల, దోమా.

కీటకసూచి (తె.).

క. దోమె; తె. దోమ; కోలా. డో–మె. డి. ఇ. డి. 2424. మాలలలో ఇంటి పేరు.

దోమల

చూ. దోమ

కీటకసూచి (తె.వ.).

దోమ బహు. తు ద్వి.వి.

దోమా

చూ. దోమ

కీటకసూచి (వ.).

దో + మా : ఇద్దరు తల్లుల సంతతి వారని జననిరుక్తి. శతావధాని దోమా వెంకటస్వామి గుప్తాగారి చతురోక్తి. కమ్మవారిలో ఇంటిపేరు.

దోస

వృక్షసూచి (తె.).

దోస తీగె; వృ. నా. Cucumis sativus.

## ద్రో

ద్రోణంరాజు

వ్యక్తినామం (వ.).

ద్రోణం– గృ.నా.పూ; వి.చూ. ద్రోణావఝుల. ఆర్వేల నియోగులలో ఇంటి పేరు. చూ. –రాజు గృ.నా.వ.

ద్రోణావఝుల

వ్యక్తినామం (తె.వ.).

ద్రోణా– గృ.నా.పూ; < సం. ద్రోణ–.
బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. –వఝుల గృ.నా.వ.

## ద్వా

ద్వారం

పౌరుషనామం (వ.).

ద్వారం : వాకిలి, ప్రవేశం, ఉపాయం. <సం. దువార- దేహమందలి రంధ్రా లయిన చెవి, ముక్కు, నోరు మొద లయినవి.

## ద్వి

ద్విభాష్యం
పౌరుషనామం (స.).
ద్వి- రెండు; భాష్యం- సూత్రవ్యాఖ్యాన గ్రంథం. మాటాడదగినది. రెండు వేదాలకు భాష్యం చెప్పగలవారు. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

ద్వివేదుల
పౌరుషనామం (స.).
రెండు వేదాలను అభ్యసించినవారు. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

## ధ

ధనియాల
ధాన్యసూచి (రా.స.)
వృ.నా : Coriandrum Sativum. దనియాలకు ద్వి. వి. <ప్రా. ధణాఅ- <సం. ధాన్యాక; త.ధనియ; త. నియా. కమ్మవారిలో ఇంటిపేరు.

ధన్యంరాజు
వ్యక్తినామం (తె.స.).
ధన్యం-గృ.నా.పూ; ? ఆర్వేలనియోగు లలో ఇంటిపేరు. చూ. -రాజుగృ.నా.ప.

ధరణీదేవుల
పౌరుషనామం (రా.స.సా. .
ధరణీదేవుడు బహు. కు.ద్వి.వి. ధరణి దేవుడు : ఈ భూమిమీద దేవతలు బ్రాహ్మణులు. ఆర్వేలనియోగులలో ఇంటి పేరు. "—ధరణీదేవుల నాగానా మాత్య—" (దశా.చ. పు. 328).

ధరణిప్రగడ
వ్యక్తినామం (స.).
ధరణి- .గృ. నా. పూ; భూసూచి. భూమి. నేల. ఆర్వేలనియోగులలో ఇంటి పేరు. చూ. -ప్రగడ గృ.నా.ప.

ధర్వేముల
అస్పష్టనామబంధం (శా.).
<ధర+వేముల. "—ధర్వేముల రామ భద్రప్ప—" శా.1642. (టి.యం పి.II; పు. 846; నెం. 885).

## ధా

ధారా
రూ. దార, దారా
పౌరుషనామం (స.).
వాద్యవిశేషం. కాహళి, బాకా. వైదిక బ్రాహ్మణులలో గృహనామం.

ధాసరి
చూ. దాసరి
తెగసూచి (శా.).
"—దాసరితిరుమలయ్య—"శా.1487; (టి. యం.పి. పు. 255; నెం. 1).

ధూపం
పౌరుషనామం (స.).

<ధూపము ; పొగవేసేది, సుగంధ ద్రవ్యాలనుండి వచ్చేపొగ.

ధూర్జటి

వ్యక్తినామం (స.స్థా.).

<సం. ధూర్జటి– బరువైన జటలు కల వాడు. శివుడు. బ్రాహ్మణులలో ఇంటి పేరు. "—ధూర్జటి కేశిరాజయ్య—" (పండి. పు. 209).

# న

నక్క

రూ. నక్కల, నక్కా.

జంతుసూచి (తె.).

జంబుకం. బోయలలో గృహనామం. త.నరి; మ.నరి; కొ.నయ్ర్; తొ.నరి; క.నరి; తు.నరి; తె.నక్క.

నక్కల

చూ. నక్క

జంతుసూచి (రా.న.).

నక్క–బహు. ఈ ద్వి.వి. గొల్ల, బోయ, ముత్రాస, యానాదులలో ఇంటిపేరు.

నక్కా

చూ. నక్క

జంతుసూచి (తె.న.).

నక్క అంకమ్మదేవరకు వాహనం. అంకమ్మదేవర ముత్రాసులకు దేవత. అందుకే ముత్రాసులలో నక్కా ఇంటి పేరు ఎక్కువగా కన్పిస్తుంది.

నంగరేకు

?<అంగరేకు

వృత్తిసూచి (శా.).

"—నంగరేకు నడిపిశెట్టి—" శా. 1089 (టి. యం. పి. II; పు. 786; నెం. 353).

నంగిటి

అవయవలోపసూచి (రా.).

<నంగి <నంగు. ముక్కుతో పలికేది, స్పష్టంగా లేనిది. హరిజనులలో ఇంటిపేరు.

నంగినేని

వ్యక్తినామం (స.).

నంగి– గృ. నా. పూ; ? నంగనాచి. నంగ <సం. నగ్న–, లగ్న–

?<నంగి :నత్తి, మూగ. కమ్మవారిలో ఇంటిపేరు. చూ. –నేని గృ.నా.ప.

నచ్చిరెడ్డి

వ్యక్తినామం (స.).

నచ్చి– గృ.నా.పూ; ?<లచ్చి. <ప్రా. లచ్చి <సం. లక్ష్మి.

చూ. –నేని గృ.నా.ప.

నంజటి

భూసూచి (తె.).

<నంజ : మాగాణిభూమి. శ.ర. త. నంజై. ?<నంజ<నంజా : నంజుకొను.

నట్టేటోళ్లు

నివాసస్థలసూచి (తె.).

నట్టింటి_ గృ.నా.పూ; నటిల్లు కు ఔప. నడుము+ఇల్లు. ఇంటిమధ్య భాగం.
చూ. _ఓళ్ల గృ.నా.ప.

నట్టువ
పౌరుషనామం (సా.).
నాట్యంనేర్పించే ఉపాధ్యాయుడు, నటి, నటుడు. క.నట్టువ; త. నట్టువన్; హిం నటువా. "–_బుధజనులారా నట్టువ గట్టు సింహుని..."(పంచ.Tel.M.పు.218).

నడికట్టు
పౌరుషనామం (న.).
నడుము+కట్టు : కాసె, దట్టీ. మగవారు బిగువుకై నడుముకు కట్టుకునే కట్టు. వి.చూ. కాసె.

నడిమింటి
నివాసస్థలసూచి (స.).
నడిమిల్లుకు ఔప. నడిమి+ఇల్లు. నడిమింటిని మధ్యమందిరంవారుగా కొందరు సంస్కృతీకరించు కున్నారు. నడిమింటి సర్వమంగళశాస్త్రి పేరు శబ్దమంజరిలో కనిపిస్తుంది. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

నడ్డి
అవయవలోపసూచి (స.).
పూర్వకాయము ముందుకు వంగియుండుట, గూని. శ.ర; పూర్వకాయము వెనుకకు వంగియుండుట. సూ.ని. నడ్డి, గూని రెంటిని వేర్వేరు దృష్టితోనే చూస్తారు. వీపుమీద మిక్కిలి ఎత్తుగా వున్నది గూని. నడుమునుండి వెన్నెముక కిందవరకు వీపుపైన ఎత్తుగావున్న భాగాన్ని నడ్డి అంటారు.

నత్తల
కీటకసూచి (రా).
నత్త బహు. కు ద్వి. వి. మాలలలో ఇంటిపేరు.

నత్తి
అవయవలోపసూచి (తె.రా.స.).
మాట్లాడేటప్పుడు మొదటి అక్షరం అనేకసార్లు పలకడం, ఆగి ఆగి అతి కష్టంమీద మాట్లాడం, తడబడుతూ మాట్లాడం నత్తిలక్షణం. <నత్తు, తడబడుతూ మాట్లాడటం క. వత్తు; మ. నత్తుక. డి.ఇ.డి. 2987.

ననబోల
వ్యక్తినామం (రా.).
నన- గృ.నా.పూ; చూ. నన్న,నన్ని.
రూ. _బోల గృ.నా.ప.

నందసాని
వ్యక్తినామం (తె.స.).
నంద_ గృ.నా.పూ; స్త్రీ. సం. దేవతాసూచి. దుర్గామూర్తి భేదం. సూ.ని.
చూ. _సాని గృ నా.ప.

నందసెట్టి
వ్యక్తినామం (స.).
నంద_ గృ.నా.పూ; దేవతాసూచి. వి.చూ, నందసాని,

చూ. _సెట్టి గృ.నా.వ.

నంది

జంతుసూచి (శా.స.సా.).

వృషభం, శివుని వృషభం. బ్రాహ్మణులలో ఇంటిపేరు. "వడ్ల బసువాళక్తుండు నందిపోతాళక్తుండు__" (యస్.ఐ ఐ. VI; పు. 220; పై ది. 174; నెం. 702), "__సంగీతనంది నందిసింగమంత్రికి__" (ప్రబో. 1_24) "నంది సింగనార్య తనయ మల్లనకవి__" (వరాహ. 1_31). "__నంది సింగామాత్యునకును__" పారిజా. 5_108). "__నంది సింగయ తిమ్మా__" (చాటు.పు.72).

నందిభట్ల

వ్యక్తినామం (తె.).

నంది_ గృ.నా.పూ; పవిత్రజంతువు, నందికేశ్వరుడు. శివుని పార్శ్వచరుడైన సేవకుడు. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. _భట్ల గృ.నా.పూ.

నందిరాజు

వ్యక్తినామం (సా.).

నంది_ గృ.నా.పూ; వి.చూ. నందిభట్ల. బ్రాహ్మణులలో ఇంటిపేరు "__ప్రతిష్ఠాపన నందిరాజ లక్ష్మీ నారాయణ__" (శ్రీదీక్షి. పు. 154) "__నందితాచార వందితుడు నందిరాజు లక్ష్మీనారాయణుండు__" (పైది; 1_15).

చూ. _రాజు గృ.నా.వ.

నందిరెడ్డి

వ్యక్తినామం (న.).

నంది_గృ.నా.పూ; వి.చూ. నందిభట్ల.

చూ. _రెడ్డి గృ.నా.వ.

నన్నపనేని

వ్యక్తినామం (న.).

నన్నప_ గృ. నా. పూ; నన్న+అప. కమ్మవారిలో ఇంటి పేరు.

చూ. _నేని గృ.నా.వ.

నన్నెబోయిన

వ్యక్తినామం (న.).

నన్నె_గృ.నా.పూ; ప్రియం, సుందరం. <నన్ని<నన్నయ. ప్రాచీన శాసనాలలో నామాంతాలలో ఉన్న 'అయ్య' శబ్దానికి బదులుగా 'ఇయ', 'ఎ' కన్పిస్తున్నాయి. చూ. నన్నయ, నన్నియ; నన్నిచోడుడు, నన్నెచోడుడు.

చూ. _బోయిన గృ.నా.వ.

నరపతి

పౌరుషనామం (న.).

నర+పతి : నరుడు, మనుష్యుడు. నరులకు అధిపతి రాజు. నరపతులు, అశ్వపతులు, గజపతులు అని మూడురకాలు. నరపతి అయిన కృష్ణదేవరాయలు గజపతిని ఓడించి తిమ్మరుసు యుక్తి వలన ఆతని కుమార్తెను వివాహం చేసుకున్నట్లు చరిత్ర చెప్తుంది.

నరసరెడ్డి

వ్యక్తినామం (రా.).

నరస– గృ.నా.పూ; పు. నా. దేవతా సూచి. <సం. నృసింహ–

చూ. –రెడ్డి గృ.నా.ప.

నరసింహదేవర

వ్యక్తినామం (స.).

నరసింహ– గృ.నా.పూ; దేవతాసూచి. నరసింహుడు. నరసింహమూర్తి అయిన విష్ణువు. ఆరామ ద్రావిడులలో ఇంటి పేరు. చూ. –దేవర గృ.నా.ప.

నరహరి

వ్యక్తినామం (స.).

దేవతాసూచి <సం. నరహరి–. విష్ణు మూర్తి.

నరిబోతు

వ్యక్తినామం (తె.).

నరి– గృ.నా.పూ; దేవతాసూచి, ?<నార– నారాయణ.

చూ. –బోతు గృ.నా.ప.

నరిసెట్టి

రూ. నర్రిసెట్టి

వ్యక్తినామం (తె.స.).

నరి–గృ.నా.పూ; దేవతాసూచి. వి.చూ. నరిబోతు. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. –సెట్టి గృ.నా.ప.

నర్రా

పౌరుషనామం (తె.రా.స.).

<నట్టు : పాలు పిదకనీయని ఆవు. ప్రయాసతో జంది మొదలైన వాటికి పూన్పదగిన ఎద్దు. కమ్మవారిలో ఇంటి పేరు.

నర్రిసెట్టి

చూ. నరిసెట్టి

వ్యక్తినామం (స.).

నర్రెడ్డి

వ్యక్తినామం (రా.స.).

నరి– గృ.నా.పూ; వి.చూ. నరిబోతు

చూ. –రెడ్డి గృ.నా.ప.

నర్రెద్దుల

జంతుసూచి (స.).

నర్ర+ఎద్దుల. నర్ర– వి చూ. నర్రా. పెంకెఎద్దు. నర్రెద్దు బహు.కుద్వి.వి.

నర్సు

వృత్తిసూచి (స ).

<ఆం. నర్స్ : రోగులకు సేవచేసే వృత్తి.

నలగరుల

?<నల్లగొర్ల.

జంతుసూచి (శా.).

"నలగరుల కాపదేశాహి–" టి.యం. పి. II; పు 1103; నెం. 410).

నలబోతు

చూ. నల్లబోతు

వ్యక్తినామం (రా.స.).

నలసాని

వ్యక్తినామం (రా.స.).

నల- గృ.నా పూ: <నల్ల. వి.చూ.
నల్ల. చూ. _సాని గృ.నా.ప.

నల్ల

రూ. నల్లా.

వర్ణసూచి (తె.రా.శా.స.సా.).

నలుపురంగు. ప్రా. నేల్లం; సం.నైల్యం; త నల్లం. డి. ఇ. డి. 2990. కమ్మ వారిలో ఇంటిపేరు. ?<నల్ల. రక్తం. గడ్డకట్టిననెత్తురు. తెలంగాణాప్రాంతంలో నీటిని 'నల్ల' అంటారు.నల్లొచ్చిందా! వా. అంటే మున్సిపాలిటీవారి కొళాయి లేక పంపువచ్చిందా అని అర్థం.

"--నల్లనాగిరెడ్డి--" శా. 1053. (టి. యం.పి. II. పు. 781; నెం. 321). "--నల్ల గంగమ్మన్--" శా. 1440 (టి. టి. డి. ఇ. యస్. III; పు. 270; నెం. 124). "--నల్ల పేరాజు ముల్కుకు--" (పల్నా. పు. 130; పం. 1254).

నల్లగొరల

జంతుసూచి (స.).

నల్ల+గొర్రెల. నలుపురంగులోవున్న గొర్రెలు.

నల్లపనీడు

చూ. నల్లపునేని

వ్యక్తినామం (స.).

నల్లపనేని

చూ. నల్లపునేని



వ్యక్తినామం (తె.స.).

నల్లపునేని

రూ. నల్లపనీడు. నల్లపనేని.

నల్లపు- గృ.నా.పూ; ?<నల్లనయ్య. కఱివేల్పు. కృష్ణుడు.

చూ. _నేని గృ.నా.ప.

నల్లపురెడ్డి

వ్యక్తినామం (తె.స.).

నల్లపు-గృ.నా.పూ;వి.చూ నల్లపునేని.

చూ. _రెడ్డి గృ.నా.ప.

నల్లపూసల

పౌరుషనామం (స.).

నల్లపూస బహు.కుద్వి.వి. నల్లనిగాజు పూస. వివాహంలో నాగవల్లి సమయాన వరుడు వధువు మెడలో సౌభాగ్యం కోసం ఈ నల్లపూసల దండను కడ తాడు. దీనినే నాగవల్లి కుత్తుకంటు అంటారు.

నల్లబోతు

రూ. నలబోతు, నల్లబోతుల, నల్ల మోతు.

వ్యక్తినామం (రా.స.).

నల్ల-గృ. నా. పూ; విశేషణసూచి. వి.చూ. నల్ల. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. _బోతు గృ.నా.ప.

నల్లబోతుల

చూ. నల్లబోతు

వ్యక్తినామం (రా.).
కమ్మవారిలో ఇంటిపేరు.

నల్లబోయిన
రూ. నల్లిబోయిన
వ్యక్తినామం (న.).
నల్ల– గృ. నా. పూ; విశేషణసూచి. వి.చూ. నల్ల.
చూ. –బోయిన గృ.నా.ప.

నల్లమ
వ్యక్తినామం (శా.).
<నల్లమ్మ. నల్ల+అమ్మ. వి. చూ. నల్ల; చూ. అమ్మ గృ.నా.ప. ''నల్లమ క్రిష్ణమరెడ్డి–" శా. 1606 (టి.యం.పి. I; పు. 654; నెం. 869).
''–నల్లమగుందరెడ్డి–" (పై ది. పు. 658: నెం. 698).

నల్లమామిడి
వృక్షసూచి (న.).
?<మామిడిలో ఒకరకం.

నల్లమేకల
జంతుసూచి (రా.).
నల్లమేక బహు. కు ద్వి.వి. చింబోతు. నల్ల– వర్ణసూచి, నలుపురంగు; –మేకల చూ. మేకా. బోయలలో ఇంటిపేరు.

నల్లమోతు
చూ. నల్లబోతు
వ్యక్తినామం (న.).
కమ్మవారిలో ఇంటిపేరు.

నల్లంసెట్టి
వ్యక్తినామం (రా.).
నల్లం–గృ.నా.పూ: స్త్రీ.నా. <నల్లమ <నల్ల+అమ్మ. చూ. –సెట్టి గృ.నా.ప.

నల్లా
చూ. నల్ల
వర్ణసూచి (శా.).
''–నల్లావీరయ్య–" (యస్.ఐ.ఐ.VI; పు. 220; పై ది. 39, నెం. 699).

నల్లిబోయిన
చూ. నల్లబోయిన
వ్యక్తినామం (న.).

నల్లోళ్ళ
పౌరుషనామం (తె.).
నల్ల+వోళ్ళ : నల్ల– వర్ణసూచి. వి.చూ. నల్ల. చూ. –ఓళ్ళ గృ.నా.ప.

నవారి
పౌరుషనామం (తె.).
నవారుకుబొప. పట్టెలున్న మంచానికి అల్లేపట్టెడ. నవారునేసే వృత్తి కలవారు.

నశ్యం
పౌరుషనామం (తె.న.).
<నస్యము : పొగాకుతోచేసే ముక్కుపొడుం.

# నా

నాగబోయిన
వ్యక్తినామం (శా.న.).

నాగ– గృ. నా. పూ; <సం. నాగ– పూజ్యం. కమ్మవారిలో ఇంటిపేరు.
చూ. _బోయిన గృ.నా.వ.

నాగభైరవ
రూ. నాగభైరవి.
వ్యక్తినామం (స).
<సం. నాగభైరవ. కమ్మవారిలో ఇంటిపేరు.

నాగభైరవి
చూ. నాగభైరవ
వ్యక్తినామం (స.).
కమ్మవారిలో ఇంటిపేరు.

నాగరాజు
వ్యక్తినామం (స.).
నాగ– గృ. నా. పూ; వి. చూ. నాగబోయిన. బ్రాహ్మణులలో ఇంటిపేరు.
చూ. _రాజు గృ.నా.వ.

నాగళ్ళ
వృత్తిపరికరసూచి (స.).
నాగలి బహు. కు ద్వి. వి. హలం; పర్యా.మడకదున్నేసాధనం.
ప్రా. ణాంగలో;సం.లాంగల_;క.నేగి ల్ నేగిలు. కమ్మ, కాపు, బోయలలో ఇంటిపేరు.

నాగవరపుల
రూ. నాగావరపుల
వ్యక్తినామం (స.).
నాగ– గృ.నా.పూ; వి.చూ. నాగబోయిన. చూ. _వరపుల గృ.నా.వ.

నాగావరపుల
చూ. నాగవరపుల
వ్యక్తినామం (స.).
బ్రాహ్మణులలో ఇంటిపేరు.

నాగిని
చూ. నాగినేని
వ్యక్తినామం (స.).
కమ్మవారిలో ఇంటిపేరు.

నాగినేని
రూ. నాగిని. నాగిన్ని
వ్యక్తినామం (రా.స.).
నాగి– గృ.నా.పూ; <నాగయ.<నాగ +అయ. వి.చూ. నాగబోయిన. కమ్మవారిలో ఇంటిపేరు.
చూ. _నేని గృ.నా.వ.

నాగిన్ని
చూ. నాగినేని
వ్యక్తినామం (రా.స.).
కమ్మవారిలో ఇంటిపేరు.

నాగిరడ్డి
చూ. నాగిరెడ్డి
వ్యక్తినామం (శా.).
"–ప్రగడ వారి నాయంకరమందు నాగిరడ్డి బొల్లయరడ్డివారి–" శా.1223 (తెలం. శా. I; పు. 92, పం. 8–9).

నాగిరెడ్డి
రూ. నాగిరడ్డి

వ్యక్తినామం (రా.స.).
నాగి_ గృ.నా.పూ; వి.చూ. నాగినేని.
చూ. _రెడ్డి గృ.నా.ప

నాగుబడి

ఆభరణసూచి (స.).
?<నాగు పడిగె. నాగుల పడగలు. పాము పడగలవలె వుండి చెవికి పెట్టు కొనే ఆభరణం. ?<నాగపడిగె : తోక మట్టకింద నాగుపాము పడగ మాదిరి వుండే సున్నిని నాగపడిగె అంటారని మాం.వృ.ప. ఉ : నాగబడిగె; నాగు బడిగె. పర్యా. నాగపాశం, నాగబంధం, నాగుబాము.

నాగుబోతు

చూ. నాగుమోతు, నాగోతుల
వ్యక్తినామం (స.).
నాగు_ గృ.నా.పూ; దేవతాసూచి. <సం. నాగ_ పాము. కమ్మవారిలో ఇంటిపేరు. చూ. _బోతు గృ.నా.ప.

నాగుమోతు

చూ. నాగుబోతు
వ్యక్తినామం (స.).
కమ్మవారిలో ఇంటిపేరు.

నాగురు

వృక్షసూచి (తె.స.).
నాగురు, నాగిని, నావురు, నారువ. గొల్లబిడ్డ మొదలైన పేర్లున్నాయి చలి కాలంలో పుష్పించే సువాసనపల్లు గల ఆకులున్న చెట్టు. బెరడు లేత బూడిద రంగులో పగుళ్లవారివుంటుంది. కొయ్యకు దళ్ళుకట్టడానికి, కంపను ఇంటికప్పుమీద పరవడానికి ఉపయోగిస్తారు. (మాం.వృ. ప. IV. పు. 234). ?<నాగూరు గ్రామనామం కావచ్చు.

నాగుల

వ్యక్తినామం (స.).
దేవతాసూచి. <సం. నాగ_. వి.చూ నాగుబోతు.

నాగోజి

వ్యక్తినామం (తె.).
నాగు_ గృ.నా.పూ, వి.చూ. నాగు బోతు. చూ. _ఓజి గృ.నా.ప

నాగోతుల

చూ. నాగుబోతు
వ్యక్తినామం (స.).
నాగ + పోతుల. కమ్మవారిలో ఇంటి పేరు.

నాగోని

వ్యక్తినామం (తె.).
<నాగ + గౌని, నాగ_ గృ.నా.పూ; వి.చూ. నాగబోతు.
చూ. _గౌని. గృ.నా.ప.

నాడగౌని

పౌరుషనామం (సా.).
నాడగౌడుకు రూప. ఒక ప్రాంతీయాధికారి క. నాడగౌడ. "_బుభాష్యతి

నాడగౌని వేంకటపతి—" (రాఘవా. పు. 7; పం. 27). "—నాడగౌని కులపాలుడు వేంకట భర్త (పైది: పం. 118). "—పౌఢధాత్రేశమాత్రు దేనాడగౌని విమల కులజుల తల మిన్న—" (పైది. 141).

నాతి

పౌరుషనామం (తె.).

క. నాతి; త. నాటి; స్త్రీ, ఆడది.

నాప

చూ. నాపసాని

వ్యక్తినామం (తె.).

నాపసాని

వ్యక్తినామం (స.).

నాప- గృ.నా.పూ: స్త్రీ.నా; <నాగప సాని. నాగప్ప + సాని : నాగవల్లి నడిపే పెద్ద ముత్తయిదువ, పెళ్ళి చివరి రోజు జరిపే సంస్కారాన్ని నాగవల్లి అంటారు. వివాహం తరువాత కొందరు నాల్గవరోజు. కొందరు ఐదోరోజు చేస్తారు. చూ. -సాని గృ.నా.ప.

నాపసెట్టి

వ్యక్తినామం (స.).

నాప- గృ.నా.పూ; <నాగప్ప.

చూ. -సెట్టి గృ.నా.ప.

నామబోల

వ్యక్తినామం (శా).

నామ- గృ.నా.పూ; ?

"—దొడ్డియయు నామబోల భీమ యయుయుం—" 1055 ఎ.డి. (ఇ.టి. ఐ. 107; నెం. 27; పం. 7—8).

చూ. -బోల గృ.నా.ప.

నామాల

పౌరుషనామం (స.).

నామం బహు. కు ద్వి. వి. నుదుట పెట్టుకునే బొట్టు. క.నామ; త. నామం. కమ్మవారిలో ఇంటిపేరు. ఇప్పుడు 'నామాలు' అన్న పదానికి వైష్ణవచిహ్న మైన, వెంకటేశ్వరుని గుర్తుచేసే నిలువు నామాలే ఎక్కువ ప్రచారంలోవున్నాయి. నామాలు పెట్టడమంటే వాడుకలో యివ్వ కుండా ఉండడం అని అర్థం.

నాయని

పౌరుషనామం (తె.).

<నాయుడు. ఇది కొన్ని కులాలలో పేర్ల చివర బిరుదనామంగా కన్పిస్తుంది. తెలగాల పేర్ల చివర, రాయలసీమలోని కమ్మవారి వ్యక్తినామాల చివర నాయుడు అనుబంధించ బడింది. ఈ నాయుడు 'నేని', 'నీడు' మొదలైన వ్యక్తినామ పరపదాలకు పూర్వ రూపం. <సం. నాయక-. వి.చూ. -నేని గృ.నా.ప.

నారపరాజు

వ్యక్తినామం (తె.సా.).

నారప- గృ.నా.పూ;వ్య.నా. <నారప్ప <నారాయణప్ప. నారాయణ+అప్ప.

వి. చూ. నారాయణభట్ల. ఆర్వేల నియోగులలో ఇంటిపేరు. ''ఇది— శ్రీమన్నారపరాజ— శ్రీరామ—'' (కవిజ; ఆశ్వా.గ).
చూ. —రాజు గృ.నా.ప.

నారపరెడ్డి
వ్యక్తినామం (స.).
నారప— గృ.నా.పూ; వి.చూ. నారపరాజు చూ. —రెడ్డి గృ.నా.ప.

నారపుసెట్టి
వ్యక్తినామం (స.).
నారపు— గృ.నా.పూ; <నారప. వి.చూ. నారపరాజు.
చూ. —సెట్టి గృ.నా.ప.

నారంభట్ల
వ్యక్తినామం (స.).
నారం— గృ.నా.పూ; స్త్రీ.నా; <నారమ. వి.చూ. నారాయణభట్ల. వెలనాటి వైదికులలో ఇంటిపేరు. చూ. —భట్ల గృ.నా.ప.

నారసాని
వ్యక్తినామం (స.).
నార— గృ.నా.పూ; పు.నా. దేవతాసూచి. <నారాయణ. వి చూ. నారాయణభట్ల చూ. —సాని గృ.నా.ప.

నారసెట్టి
వ్యక్తినామం (స.).
నార— గృ.నా పూ; పు.నా. వి. చూ. నారాయణభట్ల, చూ. —సెట్టి గృ.నా.ప.

నారా
వ్యక్తినామం (రా.).
దేవతాసూచి. <సం. నారాయణ— కమ్మవారిలో, హరిజనులలో ఇంటిపేరు.

నారాయణభట్ల
వ్యక్తినామం (తె.).
నారాయణ— గృ.నా.పూ; పు.నా. దేవతాసూచి. నారాయణుడు. నారములు (జలములు) ఆయనంగా కలవాడు; నార— జ్ఞానమునకు ఆయనము. విష్ణువు. భారతంలోని శాంతిపర్వంలో నారాయణ పదానికి వ్యుత్పత్తి చెప్పబడింది. బ్రాహ్మణులలో ఇంటిపేరు.
చూ. —భట్ల గృ.నా.ప.

నారిన
చూ. నార్ని
వ్యక్తినామం (రా.).
కమ్మవారిలో ఇంటిపేరు.

నారింసెట్టి
వ్యక్తినామం (స.).
నారిం— గృ. నా. పూ; వ్య. నా. <నారయ <నారాయణ. వి.చూ. నారాయణభట్ల చూ. —సెట్టి గృ.నా.ప.

నారు
సస్యసూచి (స.).
<నాఱు. మొక్కలు నాటటానికి విత్తనాలు ప్రత్యేక స్థలంలో దగ్గర దగ్గరగా పోసి మొలిపించే మొలకళ్ళు,

త. వాఱు. ఉదా: వంగనారు, బంతినారు.

నారుబోయిన

వ్యక్తినామం (స.).

నారు– గృ.నా.పూ; వ్య.నా; <నారాయణ. వి.చూ. నారాయణభట్ల.

చూ. –బోయిన గృ.నా.ప.

నారెన

చూ. నార్ని

వ్యక్తినామం (స.).

నార్ని

రూ. నారిన, నారెన, నార్నె

వ్యక్తినామం (తె.స.).

<నారినేని. నారి– వి.చూ. నారాయణభట్ల; వి. చూ. –ని గృ.నా.ప.

కమ్మవారిలో ఇంటిపేరు.

నార్నె

చూ. నార్ని

వ్యక్తినామం (స.).

కమ్మవారిలో ఇంటిపేరు.

నార్ల

దేవతాసూచి? (స.).

?<నారాయణల.

కమ్మవారిలో ఇంటిపేరు.

నాలనేని

వ్యక్తినామం (స.).

నాల– గృ.నా.పూ; పు.నా; దేవతాసూచి. ?<నల్లనేని. కమ్మవారిలో ఇంటిపేరు. చూ. –నేని గృ.నా.ప.

నాలిక

రూ. నాలుకల

అవయవసూచి (రా.).

రుచిని తెలిపేది. క. నాలిగె; త.నాక్కు.

నాలుకల

చూ. నాలిక

అవయవసూచి (తె.).

నాలుక బహు. కు ద్వి.వి.

నాళం

తృణసూచి (స.).

గడ్డి మొదలైన వాటికాడ; నీరు పోవడానికి ఏర్పరచిన గొట్టం.

నావబోల

వ్యక్తినామం (శా).

నావ– గృ.నా.పూ; ?<నామ–

"నావబోల కొమ్మనియడప్పన్ బూతబోల మావనివసమునంబెట్టిన–" 1099 ఎ.డి., ఇ.టి.ఐ. పు. 165; పం. 6; నెం. 186).

## ని

నిజాం

వక్తినామం (తె.).

<నిజాము. ఒకమహమ్మదీయ ప్రభువు. మొదట ఇది వ్యక్తినామం అయినప్పటికీ క్రమంగా హైదరాబాదులోని మహమ్మదీయ ప్రభువులందరికీ యిదిసామాన్య నామంఅయింది. నిజాం పరిపాలించిన

దేశం కనుక తెలంగాణాను నైజాం దేశమని వ్యవహారం.

**నిట్టల**

పౌరుషనామం (స.సా.).

నిట్ట బహు. కు ద్వి.వి. స్థానం, ప్రవాహం,స్తంభం,పార్శ్వం. పొడవైన. వెలనాటి వైదిక బ్రాహ్మణులలో ఇంటిపేరు. ''ఇతిశ్రీనిట్టల కులతిలక సూరభట్ట మహోపాధ్యాయ--" (సోమనా. ఆశ్వా. ౫).

**నిడుగుండి**

పౌరుషనామం (శా.).

నిడు+గుండి. నిడు- <నిడుద. నిడుద శబ్దానికిలోపించిన రూపం. దీర్ఘమైన, పొడవైన. -గుండి. ? ''--నిడుగుండి నరసింహాచార్య--" శా.1685 (టి.యం. పి. II; పు. 820; నెం. 591).

**నిదానకవి**

బిరుదనామం (తె.).

కవిత్వసూచి. <నిదానము. తొందర పడకుండా చక్కగా ఆలోచించడం. క.నిదానపు; సం. నిర్ధారణమ్. కవిత్వం చెప్పేవాడు. ?<నిదానము. ఆదికారణం, మూలం.

**నిమిషకవి**

బిరుదనామం (రా.స.).

నిమిషంలో ఆశువుగా కవిత్వం చెప్ప గల సామర్థ్యం కలిగినవాడు. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

**నిమ్మ**

చూ. నిమ్మల

వృక్షసూచి (తె.రా.).

సం. నింబ-; క.నింబె : నిమ్మచెట్టు. వృ.నా : Citrus limon.

**నిమ్మకాయుల**

వృక్షసూచి (రా.స.).

నిమ్మకాయ బహు. కుద్వి.వి. నిమ్మ- గృ.నా.పూ; వి.చూ. నిమ్మ. తెలగ, బ్రాహ్మణ, హరిజనులలో ఇంటిపేరు.

చూ. - కాయల గృ.నా.ప.

**నిమ్మరాజు**

వ్యక్తినామం (స.).

నిమ్మ- గృ.నా.పూ; వృ.నా. వి. చూ. నిమ్మ. ఆర్వేలనియోగి బ్రాహ్మణులలో ఇంటిపేరు. చూ. -రాజు గృ.నా.ప.

**నిమ్మల**

చూ. నిమ్మ

వృక్షసూచి (శా.స.).

నిమ్మ బహు.కుద్వి.వి. బ్రాహ్మణులలో ఇంటిపేరు. ''--నిమ్మల ఎలమల్లప్ప రెడ్డి--'' శా. 1693 (టి. యం. పి. పు. 660; నెం. 922).

**నిశ్శంక**

బిరుదనామం (సా.).

<నిశ్శంకుడు : భయంలేనివాడు, జంకులేనివాడు. ''--రాయస్థాపనాచార్య్యాణ నిశ్శంక వీరయశకాజక్కన--"

శా 1213 (తెలం. శా. I; పు. 76; పం. 13). "—నిశ్శంక ప్రతాపరాయ దేవమహారాజ—" (టి యం.పి; పు. 659; నెం. 904). "ఇడశ్రీమన్ని శంక పంశపయః పారావార సుధాకరు లును—శ్రీమద్వేంకట నిశ్శంక పౌత్రు లును.శ్రీ పెద్దన్న నిశ్శంకపుత్రులును—" (శ్రీ.గౌరీ. ఆశ్వాగ.).

## నీ

నీటకాల

పౌరుషనామం (రా.).

?నీటు+కోల. నీటు– విలాసం, కోల : కర్ర. విలాసంగా చేత్తోపట్టుకునేకర్ర. కోయలలో ఇంటిపేరు.

?<నీటుకల : విలాసంగల.

నీరుగట్టి

వృత్తిసూచి (రా.).

<నీరుకట్టు. మాగాణి ఉన్న గ్రామా లలో చెరువునుండి పొలాలకు నీరు వంపకంచేసేవాడు. హరిజనులలో ఇంటి పేరు.

నీలకంఠి

చూ. నీలకంఠం.

వ్యక్తినామం (స.).

నీలకంఠం

రూ. నీలకంఠి.

వ్యక్తినామం (తె.).



<నీలకంఠ– శివుడు. దేవతాసూచి. ?నల్లనికంఠంకలది. నెమలి, ఊరపిచ్చుక, కాటుకపిట్ట, పాము. తుమ్మెద.

నీలం

వర్ణసూచి (తె.రా.).

నీలపురాయి; కృష్ణవర్ణం; కుబేరుని నవ నిధుల్లో ఒకటి. చాకలి, మేదర, రెడ్డి కులాలలో ఇంటిపేరు.

నీలంరాజు

వ్యక్తినామం (స.).

నీలం–గృ.నా.పూ; స్త్రీ.నా. <నీలమ్మ. ఆర్వేలనియోగి బ్రాహ్మణులలో ఇంటి పేరు.

చూ. –రాజు గృ.నా.ప.

నీలి

వృక్షసూచి (స.).

నీలిచెట్టు. తొగట, పద్మసాలీలలో ఇంటిపేరు. ?<నీలి. నల్లవిన్యాసాధనం.

## ను

నుకబోయిన

వ్యక్తినామం (స.).

నుక– గృ.నా.పూ; దేవతాసూచి.

<నూకాలమ్మ. గ్రామదేవత.

చూ. –బోయిన గృ.నా.ప.

నువ్వుల

ధాన్యసూచి (తె.స.).

నువ్వులుకు ద్వి.వి. తిలసస్యం. కమ్మ

వారిలో, మేదరకులంలో ఇంటిపేరు.
వృ.నా. Sesamum indicum.
త.నూ, నువ్వు; కోలా. నువ్వు; నాయకి. నువ్వ్; ప. నువుల్; గోం. నున్గ్; తె. నూవు, నువ్వు, డి.ఇ.డి. 3081.

# నూ

## నూకపోతుల

వ్యక్తినామం (స.).

నూక– గృ.నా.పూ; దేవతాసూచి. వి.చూ. నుకబోయిన.

చూ. –పోతుల గృ.నా.ప.

## నూకరాజు

వ్యక్తినామం (స.).

నూక– గృ.నా.పూ; దేవతాసూచి. వి.చూ. నుకబోయిన. బ్రాహ్మణులలో ఇంటిపేరు. చూ. –రాజు గృ.నా.ప.

## నూకల

ధాన్యసంబంధసూచి (తె.రా.స.).

నూక– బహు. కు. ద్వి.వి. కమ్మ, పద్మసాలి, బ్రాహ్మణ, ముత్తరాసు, వైశ్య కులాలలో ఇంటిపేరు.

## నూగల

ధాన్యసూచి (రా.).

? <నూగులు. వి.చూ. నువ్వులు.

## నూతి

జలసూచి (తె.స.).

నూయికి ఔప. నుయ్యి. చేదుడుబావి. కమ్మవారిలో, బ్రాహ్మణులలో ఇంటిపేరు. కోలా. నువ్వి; నాయకి. నువ్వి; కువి. నూజి. డి.ఇ.డి. 3070.

నూయి తవ్వించినవారో లేక బాగు చేయించినవారో కావచ్చు.

## నూతికట్టు

పౌరుషనామం (స.).

నూయి + కట్టు : నూతికి చుట్టూ కట్టిన కట్ట. నూతికి కట్టు కట్టించినవారు.

## నూని

చూ. నూనె

తైలసూచి (తె.).

## నూనె

రూ. నూని

తైలసూచి (తె.రా.స.).

నూవు + నేయి: నువ్వులనుండి తీసిన తైలం. చమురుగల గింజలనుండి తీసిన తైలాలన్నిటిని నూనె అంటున్నారు. పూర్వం నువ్వులనూనెకు మాత్రమే పరిమితమై ఇప్పుడు అర్థ విస్తృతి చెందింది. కమ్మవారిలో, కోమట్లలో ఇంటిపేరు. తె. నూనె, నూనియ;నాయకి. నూనె; పర్జి. నూనెయ్. డి.ఇ.డి. 3081.

## నూనెముంతల

పౌరుషనామం (తె.).

నూనెముంత బహు. కు ద్వి.వి. నూనె పోసిన పాత్ర.

## నూలు

వస్త్రసంబంధసూచి (స.).

క. నూలు; త. నూల్ : పత్తివడికిన పోగు, వారం, మొలనూలు. కమ్మ వారిలో ఇంటిపేరు.

## నె

**నెట్టం**

చూ. నెట్టెం

అలంకరణసూచి (స.).

**నెట్టెం**

రూ. నెట్టం

అలంకరణసూచి (స.).

తలపాగ, కిరీటం. కమ్మవారిలో ఇంటిపేరు.

**నెమలి**

పక్షిసూచి (స.).

మయూరం. బలిజ, బోయలలో, బ్రాహ్మణులలో ఇంటిపేరు.

త. ఇమలి; క. నవల్; తు. నెయిలు; నాయకి. నమ్లి. డి.ఇ.డి. 2363.

## నే

**నేతి**

తైలసూచి (రా.స.).

నేయికి రూప. నెయ్యి. నేయి, నే. కోమటి, బలిజ, బ్రాహ్మణులలో ఇంటి పేరు. మ. నెయ్; క. నెయ్: త. నేయ్; తు. నేయి; పర్జి. నెయ్, కొలా. నెయ్; నాయకి. నెయ్. డి.ఇ.డి. 3104.

**నేబది**

చూ. నౌబత్తు.

పౌరుషనామం, వాద్యసూచి (స).

**నేరెళ్ళ**

చూ. నేరేడు.

వృక్షసూచి (తె.).

నేరేడు బహు. కు ద్వి.వి. బ్రాహ్మణులలో ఇంటిపేరు. ? గ్రామనామం.

**నేరేడి**

చూ. నేరేడు.

వృక్షసూచి (తె.).

**నేరేడు**

రూ. నేరెళ్ళ, నేరేడి.

వృక్షసూచి (తె.స.).

పర్యా. గిన్ని; వృ.నా; Sizygium Jambolana. మ. నేఅల్, క.నేఅల్, నేజిల్; తు. నేరాళు; తె. నేరెడు, నేరేడు. డి.ఇ.డి. 2378.

## నో

**నోటు**

పౌరుషనామం (స).

బదులు పుచ్చుకొని రాసిచ్చే ప్రాంసరీ నోటు. రెడ్డికులంలో ఇంటిపేరు.

**నోట్టమ్**

పౌరుషనామం (శా.).

త. నోట్టమ్: చూడడం, పరీక్షించడం. ''—నోట్టమ్ నాగప్పన్—'' శా. 1457 (టి. టి. డి. ఇ. యస్. IV; పు. 126; నెం. 63).

నోముల

పౌరుషనామం (తె.స.)

నోము బహు. కు ద్వి.వి. వ్రతం చేయు. యజ్ఞం ఆచరించు. త.నోము.

నోరి

?అవయవసూచి (తె.స.సా.).

నోరుకు ఔప. ముఖద్వారం. వెలనాటి వైదిక బ్రాహ్మణులలో ఇంటిపేరు. "--నోరి సుబ్రహ్మణ్య సూరివరుడు--" (శ్రీరా.క. 1-15).

నోసిప

వ్యక్తినామం (స.).

?<నోసినేని.

## నౌ

నౌబత్

రూ నేబది.

పౌరుషనామం, వాద్యసూచి (తె.).

<హిం. నౌబత్ : చర్మవాద్యవిశేషం. నవుబత్తు. రాజనగరులలోను, మసీదుల లోను వాయించే మేళంపేరు.

## న్యా

న్యాసావఝుల

వ్యక్తినామం (తె.).

న్యాసా- గృ.నా.పూ;<న్యాసి.న్యసించే వాడు. త్యాగి, సన్యాసి. బ్రాహ్మణులలో ఇంటిపేరు. చూ. -వఝుల గృ.నా.ప.

## ప

పగడాల

పౌరుషనామం (తె.రా.స.).

పగడము బహు. కు.ద్వి.వి. బలిజ కులంలో ఇంటిపేరు. <ప్రా. పవాళ- <సం. ప్రవాళ-; త. పవళం, పళగం; మ. పవఴం, పవిఴం; క. పవళ; కొడ. పవుళ, పవ్వ: తు. పకళ, పకల, పవళ, పవల డి.ఇ.డి. 3295.

పగిడి

వృక్షసూచి (తె.).

కరబుజచెట్టు.కమ్మవారిలో ఇంటిపేరు.

పగిడోజు

వ్యక్తినామం (తె.).

పగిడి- గృ.నా.పూ; ?<పయిడి,పైడి: బంగారం చూ. -ఓజు గృ.నా.ప.

పంకా

పౌరుషనామం (స.).

కర్రచెక్కకు గుడ్డ అతికి వేలాడగట్టి లాగే ఒకపెద్ద విసనకర్ర. <ఉ. పంఖా, అప. పంఖా <ప్రా. పంఖ- <సం. పక్ష-.

పంగ

రూ. పంగా

వృత్తిసూచి (తె.).

దేవబ్రాహ్మణ వృత్తులమీద దొరతనం వారు తీసే చతుర్థాంశ రూపమైనపన్ను.

పంగా

చూ. పంగ

వృత్తిసూచి (తె.).

కమ్మవారిలో ఇంటిపేరు.

పంచకట్ల

వస్త్రధారణసూచి (స.).

పంచకట్టు బహు. కు ద్వి.వి

పంచగంటల

పౌరుషనామం (స.).

పంచగంట బహు. కు ద్వి.వి. ఐదు గంటలు. పంచ_ ఐదు. సంఖ్యాసూచి; _గంటల వి.చూ. గంట.

పంచముల

కులసూచి (తె.).

పంచములు. పంచమ కులంవారు. భగవద్గీతలో పేర్కొన్న చతుర్వర్ణాలు కాక ఐదవ వర్ణంవారు.

పంచాంగం

పౌరుషనామం (రా.స.).

తిథి, వార, నక్షత్ర, కరణ యోగాలను తెలిపే జ్యోతిషగ్రంథభాగం. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

పచకుల

వృత్తిసూచి (స్తా.).

పచకుడు బహు. కు. ద్వి.వి. వంట వాడు. పచ_ పాకము. వంట.

"..పచకుల బ్రహ్మనే పంపగా వలయు__" (పల్నా.పు.519;పం.922).

పచ్చల

పౌరుషనామం (స.).

పచ్చ బహు. కు ద్వి.వి. వర్ణసూచి. పచ్చరంగు, మరకతమణి. పచ్చల క్రయవిక్రయాలు వృత్తిగాగలవారు. కమ్మవారిలో ఇంటిపేరు. ?కొందరు స్త్రీలు అలంకారంకోసం చేతులు, మొఖం మొదలైన ప్రదేశాల్లో పచ్చరంగులో వుండేలా పేర్లు, అనేకరకాలైన డిజైన్లు వేయించుకుంటారు. దీనిని 'పచ్చ' పొడిపించుకోవడం అంటారు. ఇలా పచ్చ వేసే వారిని పచ్చలవారు అంటారు.

పచ్చళ్ళ

ఆహారసంబంధసూచి (తె.).

పచ్చడి బహు. కు ద్వి.వి. నంజు. ఊరుబిండి, ముద్ద. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

పచ్చి

పౌరుషనామం (రా.స.)

తడిగలది, ఎండనిది,కాలనిది,ఉడకనిది, తేరనిది, ముదరనిది.

పచ్చిగోళ్ళ

పౌరుషనామం (స.).

పచ్చిగోరు బహు. కు ద్వి.వి. పచ్చి– వి.చూ. చిప్ప;– గోళ్ల.< ?_గోరు : నఖం, ?_గోడ : కుడ్యం: ?_కోడు ;

చిన్నవాగు. గోరు, గోద, కోడు– వీటి బహు. కు. ఔప. కావచ్చు.

పచ్చిసీడి

వ్యక్తినామం (స.).

పచ్చి– గృ.నా.పూ; ?<పచ్చ : పచ్చనిరంగు. ?<సం. పచి : అగ్ని.

చూ. –సీడి గృ.నా.ప

పచ్చిపులుసు

ఆహారపదార్థసూచి (స.).

కాగబెట్టకుండా అన్నంతో కలుపుకునే చింతపండు పులుసు. కమ్మ,కోమట్లలో ఇంటిపేరు.

పచ్చిసెట్టి

వ్యక్తినామం (రా.).

పచ్చి– గృ.నా పూ; వి.చూ. పచ్చిసీడి.

చూ. –సెట్టి గృ.నా.ప.

పట్నంసెట్టి

వ్యక్తినామం (తె.).

పట్నం– గృ.నా.పూ; స్థలసూచి. <పట్టణము. చూ. –సెట్టి గృ.నా.ప.

పడమటింటి

నివాసస్థలసూచి (తె.రా.స.).

పడమటిల్లుకు ఔప. పడమట+ఇల్లు. పడమటదిక్కులో వున్న ఇంటికి సంబంధించినవారు.

పడవల

చూ. పడాల

వృత్తిసూచి (తె.స.).

ఇది పడవకు బహు. కాదు. <పడవాలు.

పడవలు

చూ. పడాల

వృత్తిసూచి (శా.).

''–పడవలు కట్టిరాజు–'' (టి.యం. పి. II; పు. 845; నెం. 867).

పడాల

రూ. పడవల, పడవలు.

వృత్తిసూచి (స.).

పడవలుకు ద్వి.వి. : సైనికోద్యోగం. Commander of an army.

<ప్రా. భడవాల– <సం. భటపాల; తె. పడవాలు; క. పడెవళ, పడెవళ్ళ. డి.ఇ.డి 3195.

పడిగ

రూ. పడిగెల

వస్తుసూచి (తె.).

<సం. పట్టిక– నమిలిన తాంబూలం ఉమిసేపాత్ర.

పడిగెల

చూ. పడిగ

వస్తుసూచి (రా.).

పడిగె బహు. కు ద్వి.వి.

పణిదాసు

వ్యక్తినామం (స.).

పణి– గృ.నా.పూ; <ఫణి.

చూ. _దాసు గృ.నా.ప.

పణిహారి

వృత్తిసూచి (స.సా.).

వాకిటికి కావలివృత్తి. ద్వారపాలకుడు, పణిహారి. బ్రాహ్మణులలో ఇంటిపేరు. "--పణిహారి బాచయ్య--" (పండి. పు. 69).

పంట

చూ. పంటరెడ్డి, పంటల

తెగసూచి (స.సా.).

రెడ్లలో ఒక తెగ.

"_పంట మహాన్వయంబు పాకనాటి దేశంబున__" (భీమే. 6_32).

"–_పంటాన్వయ గ్రామణీ! (కాశీ. 7_266).

పంటరెడ్డి

చూ. పంట

తెగసూచి (స.సా.).

పంటల

చూ. పంట

తెగసూచి (స.).

కమ్మవారిలో ఇంటిపేరు.

పండా

తెగసూచి (స.).

ఓఢ్రదేశంలో వున్న తెగజనులు. <ప్రా. పండియ_< సం. పండిత,పండ. ఉత్కళ దేశంలోని దేవాలయాలలో పూజారులుగా వున్నవారిని పండాబ్రాహ్మణులు అంటారు.

పండితపెద్ది

వ్యక్తినామం (స.).

పండిత_ గృ.నా.పూ; పంతులు, పండితుడు, విద్వాంసుడు.

చూ. _పెద్ది గృ.నా.ప.

పండుగల

పౌరుషనామం (తె.).

పండుగ బహు. కు ద్వి.వి. ఉత్సవం, సంతోషం. సంక్రాంతి మొదలైన పర్వదినాలు.

పతంగి

వృత్తిసూచి (తె.స.).

?గాలిపటాలను తయారు చేసేవృత్తి. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

పత్తి

చూ. ప్రత్తి

పౌరుషనామం (రా.).

కమ్మ, కోమట్లు, పద్మసాలీలు. హరిజనులలో ఇంటిపేరు.

పత్రి

పౌరుషనామం (స.).

<సం. పత్రమ్ : పూజకు ఉపయోగించే బిల్వదళం మొదలైనవి. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

పద్మనాభుని

వ్యక్తినామం (స.).

<సం. పద్మనాభ– దేవతాసూచి, విష్ణువు. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

పంతుల

వృత్తిసూచి (తె.స.).

పంత్. బహు. <మరాఠీపంత్–<సం. పండిత– బ్రాహ్మణులలో గొప్ప ఉద్యోగస్తులు, నియోగులు మొదలైనవారికి ఇది పూజ్యవాచకం.

పందరబోయిన

వ్యక్తినామం (స.).

పందర– గృ.నా.పూ; ?

చూ. –బోయిన గృ.నా.ప.

పందాల

పౌరుషనామం (తె.).

పందెము బహు. కు ద్వి.వి. జూదం మొదలైన వాటిలో ఓడినవాడు గెల్చిన వానికి ఇచ్చేటట్లు పందెమాడి పెట్టేధనం.

పంది

జంతుసూచి (తె.రా.స.).

సూకరం.

ప. పన్ది, వన్ది; మ. పన్ని; కొ. పజ్; తొ. పొది; క. పడి; కొడ. పంది; తు. పంజి; తె. పంది; ప. పెన్ద్; గోం. పద్ది; కొండ పన్ది. డి. ఇ. డి. 3226. గమళ్ళ, బోయకులాలలో ఇంటిపేరు. పందికొట్టు, పందిపట్టు ఒడ్డెవాళ్ళలో ఇంటిపేరు.

పందిగోటి

పౌరుషనామం (తె.).

ఆయుధసూచి. పందిగోరుకు ఔప. వేటగాని సాధనం.

పన్నాల

రూ. పన్యాల

పౌరుషనామం (స.).

వేదభాగాలను 'పన్నాల'ని అంటారు. <ప్రాపణ్ణ– <సం. ప్రశ్న. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

పన్నుల

పౌరుషనామం (తె.).

పన్ను బహు. కు ద్వి.వి. యుద్ధానికి సిద్ధపడు;కలుగు, ఏర్పరచు,కప్పం,శిస్తు.

పన్యాల

చూ. పన్నాల

పౌరుషనామం (స.).

బ్రాహ్మణులలో ఇంటిపేరు.

పప్పు

రూ. పాప్పు.

ఆహారపదార్థసూచి (తె.స.).

వండినపప్పు. బలిజల్లో ఇంటిపేరు. త. పురుప్పు; మ. పరిప్పు; క. పప్పు. పొట్టుపోయి బద్దలైన కాయధాన్యం. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

పబ్బిసెట్టి

వ్యక్తినామం (తె.).

పబ్బి– గృ.నా.పూ; ?<సం. ప్రభు–.

స్వామి. చూ. -సెట్టి గృ.నా.వ.

పమిడి

లోహసూచి (స.

బంగారం. కమ్మవారిలో, బ్రాహ్మణులలో ఇంటిపేరు.

పమిడిపూల

పౌరుషనామం (స.).

పమిడిపూవు బహు. ఈ ద్వి.వి. పమిడి- వి.చూ. పమిడి.

పంబా

పౌరుషనామం (స.).

వాద్యసూచి. < పంబ : చర్మ వాద్య విశేషం.

పమ్మసాని

చూ. పెమ్మసాని

వ్యక్తినామం (శా.).

"—పమ్మసాని తిమ్మానాయుడు—" శా. 1500 (టి.యం.పి. I; పు. 30; నెం. 211).

పయినేని

వ్యక్తినామం (స.).

పయి- గృ.నా.పూ; < పై- < పసి : పసుపుపచ్చని రంగు. కమ్మవారిలో ఇంటిపేరు. చూ. -నేని గృ.నా.వ.

పయ్యావుల

చూ. పైయావుల

జంతుసూచి (తె.).



కమ్మవారిలో ఇంటిపేరు.

పరదేశి

పౌరుషనామం (శా.).

అన్యదేశంనుండి వచ్చినవాడు.

"—పరదేశి తిరువెంకటయ్యాన్—" శా. 1458 (టి.టి.డి.ఇ.యస్.IV; పు. 182; నెం. 98).

పరమసెట్టి

వ్యక్తినామం (తె.).

పరమ- గృ.నా.పూ; దేవతాసూచి. < పరమ-. చూ. -సెట్టి గృ.నా.వ.

పరవస్తు

పౌరుషనామం (స.సా.).

మతంపేరు. "పరవస్తు వంశ—" (రామాభ్యు. పీ-11). బ్రాహ్మణులలో ఇంటిపేరు. చిన్నయసూరి తండ్రి పరవస్తు వేంకట రామానుజాచార్యులు ఉత్తరదేశస్థులు, 17వ శతాబ్దివారు, పరవస్తు మతంవారి శిష్యులు. పరవస్తు మతంవారు ఉత్తరదేశంనుండి వచ్చినపుడు వారితోకూడ ఇతను తన దేవేరి అయిన శ్రీనివాసాంబగారిని తీసుకొని చెన్నపట్టణానికి వచ్చి బసచేసాడట. (ఆం.సా.ప.ప.సం.20; సంచి. 226). అప్పటినుండి వీరికి ఈ ఇంటిపేరు కలిగింది.

పరశురామపంతుల

వ్యక్తినామం (స.సా.).

<పరశురామపంత్. పు.నా. పరశురామ పంత్ గారికి సంబంధించినవారని అర్థం. ఆర్వేల నియోగ బ్రాహ్మణులలో ఇంటి పేరు. "—.బ్రహ్మవిద్వజ్జన గేయ పరశురామ పంతుల రామమూర్తి నామ ధేయ—" (శుకచ. పు. 290). "—పరశురామ పంతుల కుల కంజ రాజి—" (పైది; 1-41).

పరసా

పౌరుషనామం (స.).

<పరస : ఉత్సవానికి వచ్చేజనం, జాతర. <సం. పరిషత్ : సభ,సదస్సు. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

పరానేని

వ్యక్తినామం (స.).

పరా— గృ.నా.పూ; <పర<పరము: మోక్షము. వృత్తియందు పరము శబ్దానికి అంత్యవర్ణం లోపించగా మిగిలిన రూపం. ?<పరమము <పరమాత్మ. ఆర్వేల నియోగులలోను, మాధ్వుల లోను ఇంటిపేరు.

చూ. —నేని. గృ.నా.ప.

పరిగె

పౌరుషనామం (స.).

<పరిగ : కోసిన చేనులో దిగబడిన ఎన్నులు. మాధ్వులలో ఇంటిపేరు.

పరుపుల

వృత్తిసూచి (తె.స.).

పరుపు బహు. క బౌవ. పరుపులుకుట్టే వృత్తివారు.

పర్ణశాల

నివాసస్థలసూచి (స.).

ఆకుటిల్లు. వైఖానస బ్రాహ్మణులలో ఇంటిపేరు.

పర్రెడ్డి

వ్యక్తినామం (స.).

పర—గృ.నా.పూ; దేవతాసూచి.వి.చూ. పరానేని చూ. —రెడ్డి గృ.నా.ప.

పర్వత

చూ. పర్వతము

పౌరుషనామం (తె.).

కాపు, గవళ్ళు, మాల, మేదరలలో ఇంటిపేరు.

పర్వతనేని

వ్యక్తినామం (తె.స.).

పర్వత— గృ.నా.పూ; శిలాసూచి. <సం. పర్వత— వి.చూ. పర్వతము. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. —నేని గృ.నా.పూ.

పర్వతము

రూ. పర్వత

శిలాసూచి (శా.స.).

<సం. పర్వత— కొండ. శ్రీ పర్వత ప్రాంతం నుంచి వలస వచ్చినవారు కావచ్చు. కమ్మవారిలో, బ్రాహ్మణులలో ఇంటిపేరు. "గణపతిదేవండు పవ్వళా

తము పల్లయ తమ్ముండు--" శా.1198 (తెలం. శా. I; పు. 78; పం. 4).

పర్వతరెడ్డి

వ్యక్తినామం (స.).

పర్వత- గృ.నా.పూ; శిలాసూచి. వి.చూ. పర్వతము.

చూ. -రెడ్డి గృ.నా.ప.

పలబోతు

వ్యక్తినామం (స.).

పల- గృ.నా.పూ; ?<పల్లబోతు.

చూ. -బోతు గృ.నా.ప.

పలవనేని

వ్యక్తినామం (స.).

పలవ- గృ.నా.పూ; <పల్లవ. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. -నేని గృ.నా.ప.

పలిసెట్టి

వ్యక్తినామం (స.).

పలి- గృ.నా.పూ; ?

చూ. -సెట్టి గృ.నా.ప.

పలుగు

వృత్తి పరికరసూచి (రా.).

గడ్డపలుగు; దుర్జనుడు; గుంటక గుజ్జులకు, పాపటపు గుజ్జులకు తగిలించే దళమైనతగుడు.

పల్నాటి

స్థలసూచి (స.).

పల్నాడుకు ఔవ.

పల్ల

పౌరుషనామం (తె.).

వర్ణసూచి. పాటలవర్ణం. అరుణవర్ణం.

పల్లపు

చూ. పల్లం

పౌరుషనామం (రా.).

పల్లపోతు

వ్యక్తినామం (స.).

పల్ల- గృ.నా.పూ; <పల్లా. వి.చూ. పల్లావరుల. కమ్మవారిలో ఇంటిపేరు. ?<జంతుసూచి. పాటల వర్ణంగలపోతు.

చూ. -పోతు గృ.నా.ప.

పల్లం

రూ. పల్లపు.

పౌరుషనామం (రా.).

పల్లము. పల్లపునేల. త. పళ్ళం; మ. పళ్ళం; తో. పళ; క. పళ్ళ; తు. పళ్ళ, పల్ల, పల్లా. డి.ఇ.డి.3307.

పల్లంరెడ్డి

వ్యక్తినామం (స.).

పల్లం- గృ.నా.పూ; వి.చూ. పల్లం. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. -రెడ్డి గృ.నా.ప.

పల్లంసెట్టి

వ్యక్తినామం (స.).

పల్లం- గృ.నా.పూ; వి.చూ. పల్లం.

చూ. -సెట్టి గృ.నా.ప.

పల్లవి
పౌరుషనామం (తె.).
సంగీతశాస్త్ర పరిభాష.

పల్లా
ధాన్యకొలతసూచి (రా.స.).
<హిం. పల్లా. పందుము. బోయ, బ్రాహ్మణ, యానాదులలో ఇంటిపేరు.

పల్లావఝుల
వ్యక్తినామం (తె.స.).
పల్లా- గృ.నా.పూ; ఒకదేశ భాగం; ధాన్యం కొలత. వి.చూ. పల్లా. బ్రాహ్మణులలో ఇంటిపేరు.
చూ. -వఝుల గృ.నా.ప.

పల్లెబోయిన
వ్యక్తినామం (స.).
పల్లె- గృ.నా.పూ; ?
చూ. -బోయిన గృ.నా.ప.

పల్లెభట్ల
వ్యక్తినామం స,.
పల్లె- గృ.నా.పూ; వి.చూ. పల్లెబోయిన. బ్రాహ్మణులలో ఇంటిపేరు.
చూ. -భట్ల గృ.నా.ప.

పళ్లె
అస్పష్టనామబంధం (స.సా.).
మాధ్వులలో ఇంటిపేరు.
జగన్నాథాచార్య పుత్ర పళ్ళె పూర్ణ ప్రజ్ఞకవి--"(శ్రీరామ;ఆశ్వా.గ;పు.82).

పవని
పౌరుషనామం (తె.స.).
?<పవనము. వాయువు. ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.

పశురాజు
వ్యక్తినామం (స.).
పశు- గృ.నా.పూ; ?< పశుపతి.
చూ. -రాజు గృ.నా.ప.

పశుల
చూ. పసల
జంతుసూచి (తె ).
పశువు బహు. కు ద్వి.వి. నాలుగుకాళ్ళ జంతువు. బోయ, మాల, మాదిగ కులాలలో ఇంటిపేరు.

పసపల
చూ. పసుపుల
వృక్షసంబంధసూచి (రా.).
బలిజ కులంలో ఇంటిపేరు.

పసల
రూ. పశుల
జంతుసూచి (రా.స.).
<పసలము : గోమహిష జాతి; శాకభక్షక జంతుసమూహం. బలిజ. బోయ, మాదిగ, మాల కులాలలో ఇంటిపేరు.

పసిండి
లోహసూచి (శా.).
<పసిడి . పైడి, బంగారం. తె.పసిడి,

పయిడి. డి.ఇ.డి 3161. "—వసింది వెంకటత్తు రాయవార్—" శా. 1413 (ఇ.టి.ఐ; II; పు. 195; నెం. 95).

పసుపుల

రూ. పసపల

వృక్షసంబంధసూచి (రా.).

పసుపు బహు. కు ద్వి.వి. పసుపు వ్యాపారంచేసేవారుకావచ్చు. బోయలలో, బ్రాహ్మణులలో ఇంటిపేరు.

## పా

పాకనాటి

రూ. పానాటి, పానేటి.

దేశ్యభాగం (రా.స.).

పాకనాడు కు ఔప. పాకనాడు ప్రాంతంలో నివసించినవారు కనుకనే ఈ గృహనామం కాపు, గొల్ల, చాకలి, కంసాల, బలిజ, మాల మొదలైన అనేక కులాలలో కన్పిస్తుంది.

పాకము

పౌరుషనామం (రా.స.).

?< సం.పాక-

?<త. పాక్కమ్ : ఊరు, విడిది.

పాగ

రూ. పాగా.

పౌరుషనామం (తె.).

తలపాగ, గుర్రపుశాల.

పాగా

చూ. పాగ

పౌరుషనామం (స.).

పాంగుల

పౌరుషనామం (శా.).

పాంగు బహు. కు ద్వి. వి. సానుల పేర్ల చివర ప్రయుక్తమైన పదం. అందమైన స్త్రీ. సుందరి అనే అర్థం కావచ్చు. ఉదా; దామరపాంగు కూతురు. మల్లెపాంగు కూతురు. చూ. శా. శ. పు. 186. "—పాంగులచుంపిరి—" శా. 1350 (టి.యం.పి. II; పు. 788; నెం. 366). "—పాంగుల మితినేని గారు—" పైది; నెం. 367).

పాచి

పౌరుషనామం (తె.).

నీటిలో పెరిగే పచ్చని తీగ, శైవాలం, నీటిపైకి తేలే పచ్చని మురికి.

పాచిపళ్ళ

పౌరుషనామం (రా.).

మురికిగా ఉన్న పళ్లుకలవానికి యిచ్చిన వ్యంగ్యనామం కావచ్చు. మాదిగ కులంలో ఇంటిపేరు.

పాటగాని

పౌరుషనామం (రా.).

<పాటగాడు <పాటకాడు.

?<పాటగౌని <పాటగౌడు.

పాటిమీద

నివాసస్థలసూచి (తె.).

పాటి— పాటినేల; దిబ్బ. పాటిమీ

నివాసం. గృహ నివాసం, ఉనికిని సూచిస్తుంది.

**పాడి**

పౌరుషనామం (స.).

?పాడి : ధర్మం, న్యాయం, స్వభావం.

?. ప్రా. పాఢి– <సం. పాఠి–

**పాతింటి**

నివాసస్థలసూచి (రా.స.).

పాతిల్లుకు ఔప. పాత + ఇల్లు.

పాతింటికి సంబంధించిన, పాతఇంటిలో నివసిస్తున్న వారు.

**పాదం**

అవయవసూచి (స.).

<పాదము : అడుగు, కాలు; పర్వతం యొక్క అడుగుభాగం, వేరు.

**పానాటి**

?పాకనాటి

దేశభాగం (రా.).

<పాకనాటి <పాకనాడుకు ఔప.

**పానేటి**

?చూ. పాకనాటి.

దేశభాగం (తె.).

**పాపన్నగారి**

వ్యక్తినామం (రా.).

పాపన్న– గృ నా.పూ; వ్య.నా. పాప+ అన్న. పాప– వి. చూ. పాపరాజు –అన్న– చూ. –అన్న గృ.నా.ప.

చూ. –గారి గృ.నా.ప.

**పాపయ్యగారి**

వ్యక్తినామం (రా.).

పాపయ్య– గృ.నా.పూ; వ్య.నా. పాప+ అయ్య. పాప– వి.చూ. పాప. –అయ్య– చూ. గృ.నా.ప.

చూ. –గారి గృ.నా.ప.

**పాపరాజు**

వ్యక్తినామం (స.).

పాప– గృ.నా.పూ; పు.నా; <పాపయ. వి.చూ. పాపయ్యగారి.

ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.

చూ. –రాజు గృ.నా.ప.

**పాపసాని**

వ్యక్తినామం (స.).

పాప– గృ.నా.పూ; వ్య.నా. వి.చూ. పాపయ్యగారి. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. –సాని గృ.నా.ప.

**పాపసెట్టి**

వ్యక్తినామం (స.).

పాప– గృ.నా.పూ; వ్య.నా. వి.చూ. పాపయ్యగారి. చూ. –సెట్టి గృ.నా.ప.

**పాపినేని**

వ్యక్తినామం (స.).

పాపి– గృ.నా.పూ; వ్య.నా; <పాపయ. వి.చూ. పాపయగారి. కమ్మవారిలో ఇంటిపేరు. చూ. –నేని గృ.నా.ప.

**పాపిరెడ్డి**

వ్యక్తినామం (రా.).

పాపి- గృ.నా.పూ; వ్య.నా; వి.చూ. పాపయగారి. చూ. _రెడ్డి గృ.నా.ప.

పాప్పు

చూ. పప్పు

ఆహారపదార్థసూచి (శా.).

<పప్పు. "పాప్పు తిమ్మయ మహారాజ__" శా. 1469 (టి. టి. డి. ఇ. యస్. V; పు. 309; నెం. 101).
"__పాప్పు తిమ్మరాజయ్యన్__" శా.1467 (పైది; పు.413; నెం.156)

పామరాజు

వ్యక్తినామం (తె.).

పామ- గృ.నా.పూ; ?<పమ్మ- ?<ప్రా. పమ్మ- <సం. పద్మ- ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.

చూ. _రాజు గృ.నా.ప.

పాముల

సరీసృపసూచి (స.).

పాము బహు. కు ద్వి.వి. సర్పం. త. పామ్పు; మ. పామ్పు; క. పావు; తు. హావు; తె. పాము; నాయకి. పామ్; పర్జి. బామ్. డి.ఇ.డి. 3361.

మాల, యానాదులలో ఇంటిపేరు. పాములను ప్రజలకు ప్రదర్శించేవారని సి.టి.యస్.ఐ.

పాయల

పౌరుషనామం (తె).

పాయ బహు. కు ద్వి. వి. చీలిక, ఒక నదిలోనుండి చీలిపారేది; పైరున్న పొలంలోని మునుం.

?పాయ : ఉల్లి మొ॥వి.

పాయసం

రూ. పాశం

ఆహారపదార్థసూచి (రా.స.).

<పాయసము, పరమాన్నం. పాలు, బెల్లంవేసి ఉడికించిన అన్నం.

పారా

వృత్తిసూచి (రా.).

ఆనాడు కావలి వృత్తిగా కలిగినవారు. <ఉర్దూ. పహరా <ప్రా. పహార- <సం. ప్రహార-. వేళలు తెలిపే గంటలు కొట్టడం.

పారావర్ధుల

వ్యక్తినామం (రా.స.).

పారా- గృ. నా. పూ; వృత్తిసూచి. వి.చూ. పారా. వెలనాటి వైదికులలో ఇంటిపేరు.

చూ, _వర్ధుల గృ.నా.ప.

పార్థ

వ్యక్తినామం (రా.).

<పార్థుడు. పృథయొక్క కుమారుడు, అర్జునుడు. రెడ్లలో ఇంటిపేరు.

పార్వతి

వ్యక్తినామం (తె.).

దేవతాసూచి. <సం. పార్వతి_పర్వత పుత్రిక.

పాలకూర

వృక్షసూచి (తె.).

శాకసూచి.

పాలాకుల

వృక్షసూచి (తె.).

పాలాకు బహు. కు ద్వి. వి. పాల– గృ.నా.పూ. సుమంగళవృక్షం.

చూ. –ఆకుల గృ.నా.ప.

పాలావఝుల

వ్యక్తినామం (స.).

పాల– గృ.నా.పూ; <పల్లా. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. –వఝుల గృ.నా.ప.

పాలిని

వృక్షసూచి (శా.).

నల్లతెగడచెట్టు.

"–పాలిని కొప్పునాయక్కన్–" శా. 1467 (టి. టి. డి. ఇ. యస్. V; పు. 144; నెం. 56).

పాలు

పౌరుషనామం (శా.స.).

?<సం. పయ–మాలకులంలో ఇంటిపేరు. త. పాల్; మ. పాల్; క. పాల్; తు. పేరు; పర్జి. పేల్; గోం. పాల్ డి.ఇ డి. 3370.

'–పాలునాయక్కర్–" శా. 1474 (టి. టి. డి. ఇ. యస్. V; పు. 371; నెం. 138).

పాలెంరెడ్డి

వ్యక్తినామం (స.).

పాలెం– గృ. నా. పూ; ? <పాళెం. కావలి. చూ. –రెడ్డి గృ.నా.ప.

పాశం

చూ. పాయసం

ఆహారపదార్థసూచి (తె.).

కమ్మవారిలో ఇంటిపేరు.

## పి

పిక్కల

పౌరుషనామం (స.).

పిక్క బహు.కుద్వి.వి. చింతపిక్కలు మొదలైనవి.

పిగిలి

పక్షిసూచి (స.).

పిగిలిపిట్ట. పిక్కిలి. పీలి.

పిచుక

పక్షిసూచి (తె.).

దేవాంగుల, బోయలలో ఇంటిపేరు.

పిచ్చి

పౌరుషనామం (తె.).

వెర్రి, మతిభ్రమ. సం. పిత్త; త. పిచ్చు; మ. పిచ్చు; క. పచ్చు; కొడ. పిత్త. డి.ఇ.డి. 3407.

పిచ్చిగుంట్ల

తెగసూచి (తె.).

పిచ్చికుంటు; పిచ్చికకుంటు. పిచ్చుక కుంటు, పిచ్చుకుంటు అని వ్యవహరింప బడుతున్నారు. భిక్షుక వృత్తిలో వున్న వారు.డోలువాయిస్తూ అనేక విధాలయిన కధలు, పురాణగాధలుచెప్తూ అనేక వంశ చరిత్రలను, సంఘటనలను మనసులో వుంచుకొని చెప్తుంటారు. కాపు, కమ్మ, గొల్ల మొదలైనవారికి గోత్రాలు చెప్తుంటారు. వెల్లాలవారికి 102పిల్లలట. వారిలో ఒకరేస్త్రీ. పురుషులలో ఒకడుకుంటి. అందుకని మిగిలిన సోదరులంతా అతనికి కొంత ధాన్యాన్ని, ధనాన్ని ప్రతి సంవత్సరం ఇచ్చేలా ఏర్పాటుచేశారు. వేరేలకులపు స్త్రీతో వివాహంచేశారు. ఈ దంపతులకు పుట్టిన పిల్లలకు ఒక కులం అంటూ లేదుగనుక పిచ్చికుంటలు (భిక్షుకులు, కుంటివారు.) అయ్యారు. వెల్లాల వారు వీరిని తక్కువగా చూస్తారు. ఇప్పటికీ పిచ్చిగుంటల వాళ్ళకు వెల్లాల వారు ధనాన్ని యిస్తారు.

పిట్టల

పక్షిసూచి (తె.స.).

పిట్ట బహు.కుద్వి.వి. పులుగు.

పిడతల

వస్తుసూచి (రా.స.).

పిడత బహు. కు ద్వి. వి. చిన్నకుండ, పిడుత. బ్రాహ్మణులలో, రెడ్లలో ఇంటి పేరు.

పిడిసెట్టి

వ్యక్తినామం (తె.స.).

పిడి- గృ.నా.పూ; ?<పృధివిసెట్టి.

చూ. -సెట్టి గృ.నా.ప.

పిడుగు

పౌరుషనామం (తె.స.సా.).

దేశ్యపదమని నిఘంటువులు. బ్రాహ్మణులలో ఇంటిపేరు. ''—పిడుగు పిల్లనార్య తనూభవ—'' (విప్ర; Tel.Ma; పు. 70).

పిండారి

వ్యక్తినామం (శా.).

వి.చూ. పిళ్లారి. ''—శ్రీవీరప్ర తాప పిండారితిరుమల [హను] వెంకటాది—(టి. టి. డి. ఇ. యస్; V; పు. 389; నెం. 144).

పినిసెట్టి

వ్యక్తినామం (తె.).

పిని- గృ.నా.పూ; <పిన: పిన్న, చిన్న. చూ. -సెట్టి గృ.నా.ప.

పిన్నబోయిన

వ్యక్తినామం (స.).

పిన్న- గృ.నా.పూ; చిన్న.

చూ. -బోయిన గృ.నా.ప.

పిన్నమనేని

వ్యక్తినామం (స.).

పిన్నమ- గృ.నా.పూ: <పిన్నమ్మ <పిన్న+అమ్మ. పిన్న- చూ. పిన్న బోయిన; అమ- చూ. -అమ్మ గృ.నా.ప. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. -నేని గృ.నా.ప.

పిన్నమరాజు

రూ. పిన్నంరాజు

వ్యక్తినామం (స.).

పిన్నమ- గృ.నా.పూ; వి.చూ. పిన్నమనేని. ఆర్వేలనియోగులలో ఇంటిపేరు.

చూ. -రాజు గృ.నా.ప.

పిన్నంరాజు

చూ. పిన్నమరాజు

వ్యక్తినామం (స.).

ప్రథమశాఖ నియోగ బ్రాహ్మణులలో ఇంటిపేరు.

పిన్నింటి

నివాసస్థలసూచి (తె.స.).

పిన్న- గృ.నా.పూ; చిన్న. వి.చూ. పినిసెట్టి. కమ్మవారిలో, బ్రాహ్మణులలో ఇంటిపేరు. చూ. -ఇంటి గృ.నా.ప.

పిన్నేని

వ్యక్తినామం (స.).

పిన్న-గృ.నా.పూ; దే.వి.చూ. పిన్నమనేని. ఆర్వేలనియోగులలో ఇంటిపేరు. -'నేని' అనేది పరపదంగా గల ఇంటి పేర్లు కమ్మవారిలోనే ఎక్కువవున్నాయి. ఇక్కడ పిన్నేని బ్రాహ్మణులలో ఇంటి పేరుగా వుండడం విశేషం.

చూ. -నేని గృ.నా.ప.

పిప్పళ్ళ

వృక్షసూచి (స.).

పిప్పలి బహు. కు ద్వి.వి. రావిచెట్టు; మిరియాలచెట్టు.

పిలకత్తుల

ఆయుధసూచి (స.).

<పిల్లకత్తుల. పిల్లకత్తి బహు. కు. ద్వి.వి.

పిలకా

పౌరుషనామం (స.).

<పిలక : తలమీద కొద్దిగా వున్న జుట్టు; కందగడ్డ మొదలైనవాటి మొలక. వెలనాటి వైదికులలో ఇంటిపేరు. కొం. పిల్క-, పిలిక; కులి. పిల్క-. డి ఇ.డి. యస్. 673.

పిల్లల

పౌరుషనామం (స.).

పిల్ల బహు. కు ద్వి.వి. పక్షి మొదలైనవాని సంతతి; చిన్న ఆడబిడ్డ.

పిల్లి

జంతుసూచి (తె.రా.స.).

మార్జాలం. సం. బిడాల: త. పిల్లి; క.పిల్లి; తె.పిల్లి; కోలా. పిల్లి; నాయకి. పిల్లి; పర్జి. బిలెయ్. డి.ఇ.డి. 3438. బ్రాహ్మణ, మాల, మేదర కులాలలో ఇంటిపేరు.

పిల్లికండ్ల
పౌరుషనామం (తె.రా.).
పిల్లికన్ను బహు. కు ద్వి.వి.

పిళ్ళా
పౌరుషనామం (స.).
పిళ్ళ, పిళ్ళై కొన్ని జాతులు వారిపేరుకు చివరచేర్చుకునే పట్టపుపేరు. నగరాల తెగల ఇంటిపేరు. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

పిళ్ళారి
వ్యక్తినామం (రా.స.).
దేవతాసూచి. వినాయకుడు. తమిళ ప్రభావంతో రాయలసీమలోని ఆంధ్రులు విఘ్నేశ్వరుణ్ణి 'పిళ్లారి' అంటారు. మిగిలిన ప్రాంతాల్లో ఈపదం వాడుక తక్కువ.

పీ

పీట
వస్తుసూచి (తె.స.).
<సం. పీఠ- కూర్చోడానికి ఉపయోగించే చెక్కపలక, ఆసనం.

పీతల
చూ. పీతా
కీటకసూచి (స.).
పీత బహు.ద్వి.వి.

పీతా
రూ. పీతల
కీటకసూచి (స.).
<పీత. ఎండ్రకాయ.

పీతాంబరం
పౌరుషనామం (తె.స.).
పసుపు వర్ణంగల వస్త్రం. ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.

పీర్ల
పౌరుషనామం (తె.).
పీరు బహు. కు ద్వి. వి. <హిం. పీర్. మహమ్మదీయ మతగురువు. వ్యు.నా. మహమ్మదీయుల్లో గౌరవార్థకంగా చేసే సంబోధన; తురకల జ్ఞాపకార్థమైన గుర్తు. సన్యాసి జీవితాన్ని గడుపుతూ దివ్యశక్తులు గల ఋషులు, దివ్యులు మరణించిన తర్వాత వారిదర్గాల మీద అనుచరులు నిలిపేవే పీర్లు.

పు

పుచ్చ
రూ. పుచ్చా, పుచ్చల
వృక్షసూచి (తె.).
పుచ్చతీగె. ఎరుకల, కోమటి, బోయ, వీరముష్టి కులాలలో ఇంటిపేరు.
వృ.నా : Citrillus Vulganis.

పుచ్చకాయల
వృక్షసూచి (స.).
పుచ్చకాయ బహు. కు ద్వి.వి. పుచ్చ- గృ.నా.పూ. వి. చూ. పుచ్చ. కమ్మ,

కోమటి, బోయలలో ఇంటిపేరు.
చూ. _కాయల గృ.నా.ప.

పుచ్చల
వృక్షసూచి (స.).
పుచ్చ బహు. ద్వి.వి.

పుచ్చా
చూ. పుచ్చ
వృక్షసూచి (రా.స.).
వెలనాటి వైదిక బ్రాహ్మణులలో ఇంటిపేరు.

పుట్ట
రూ. పుట్టా, పుట్టావాళ్ళు.
పౌరుషనామం (రా.స.).
వల్మీకం, చిన్నపొద. దేశ్యమని శ.ర. కమ్మ, పద్మసాలి, మాల, మేదర కులాలలో ఇంటిపేరు.

పుట్టంరాజు
వ్యక్తినామం (స.).
పుట్టం_గృ.నా.పూ; స్త్రీ.నా. <పుట్టమ్మ <పుట్ట+అమ్మ. పుట్ట_ వి.చూ. పుట్ట; _అం_ చూ. అమ్మ గృ.నా.ప. ఆర్వేల నియోగులలో ఇంటిపేరు. త. పుత్తు; క.పుత్తు; కోలా. పుట్ట. డి.ఇ.డి. 3556.
చూ. _రాజు గృ.నా.ప.

పుట్టా
చూ. పుట్ట
పౌరుషనామం (స.).
కమ్మవారిలో ఇంటిపేరు.

పుట్టావాళ్ళు
చూ. పుట్ట
పౌరుషనామం(రా.).
చూ. _వాళ్ళు గృ.నా.ప.

పున్నమరాజు
వ్యక్తినామం (స.).
పున్నమ_ గృ.నా.పూ; <పున్న+అమ <పూర్ణ_; అమ_ చూ. గృ.నా.ప.
చూ. _రాజు గృ.నా.ప.

పున్నావఝుల
వ్యక్తినామం (స.).
పున్నా_ గృ.నా.పూ; వి.చూ. పున్నమరాజు. చూ. _వఝుల గృ.నా.ప.

పురాణపండా
వ్యక్తినామం (స.).
పురాణ_గృ.నా.పూ; వి.చూ. పురాణం. ఆరామద్రావిడులలో ఇంటిపేరు.
చూ. _పండా గృ.నా.ప.

పురాణం
పౌరుషనామం (తె.శా.స.).
పురాణాలను పఠించేవారు. బ్రాహ్మణులలో ఇంటిపేరు. "__పురాణం బాపయ్య__" శా. 1523 (టి.యం.పి.II; పు. 951; నెం. 439).

పురారి
వ్యక్తినామం (స.).
దేవతాసూచి; పు.నా. <సం. పురారి_ శివుడు.

పురిపండా

వ్యక్తినామం (న.).

పురి– గృ.నా.పూ; క్షేత్రనామసూచి. <పూరీజగన్నాథక్షేత్రం.

చూ. –పండా గృ.నా.ప.

పులగం

ఆహారపదార్థసూచి (న.).

పెసరపప్పువేసి వండినఅన్నం. కమ్మవారిలో, బోయలలో ఇంటిపేరు. క.పుగ్గి: తె. పులగము. డి.ఇ.డి. 3540.

పులి

జంతుసూచి (తె.శా.న.).

శార్దూలం. కమ్మ, గొల్ల, బలిజ, మేదర కులాలలో ఇంటిపేరు. త.పులి; మ.పులి; కొ. పుజ్; క. పులి; తు. పిలి; తె. పులి, బెబ్బులి. డి.ఇ.డి. 3532. బ్రాహ్మణులలో ఇంటిపేరు. "—పులి అన్నమనాయుడు—" (టి.యం.పి.II; పు. 958; నెం. 481).

పులికాని

వ్యక్తినామం (తె.).

పులి–గృ.నా.పూ; జంతుసూచి. వి.చూ. పులి. చూ. –కాని గృ.నా.ప.

పులుగు

పక్షిసూచి (న.).

తీతువుపిట్ట, పిట్ట. పులుగుకూత పిల్లలకు కీడుచేస్తుందని రేపల్లెవాణ్ణి మూడు సార్లు తలుస్తారు.

పులుపుల

పౌరుషనామం (తె.న.).

రుచిసూచి. పులుపు బహు. కు ద్వి.వి. పుల్లవి. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

పులుసు

ఆహారపదార్థసూచి (న.సా.).

చింతపండు నుండి తీసినరసం. అనేక రకాల కూరగాయలతో దీన్ని తయారు చేయవచ్చు. "—బూరెల భీమన్న, పులుసు సుబ్బయ్య—" (పల్నా. పు.249; పం. 815).

పుల్లకూర

రూ. పుల్లగూర్ల

వృక్షసూచి (న.).

పుల్లగూర్ల

చూ. పుల్లకూర

వృక్షసూచి (తె.).

పుల్లకూర బహు. కు ద్వి.వి.

పుల్లంసెట్టి

వ్యక్తినామం (న.).

పుల్లం– గృ. నా. పూ; <పుల్లమ <పుల్లమ్మ. చూ. –సెట్టి గృ.నా.ప.

పుల్లాభట్ల

రూ. పుల్లాభొట్ల

వ్యక్తినామం (న.).

పుల్లా–గృ.నా.పూ; పు.నా. <పుల్లయ, బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. –భట్ల గృ.నా.ప.

పుల్లాభొట్ల
చూ. పుల్లాభట్ల
వ్యక్తినామం (స.).

పుల్లారన్న
వ్యక్తినామం (రా.).
పుల్లారు- గృ.నా.పూ. ?
చూ. -అన్న గృ.నా.ప.

పువ్వుల
చూ. పూవుల
పుష్పసూచి (స.).
పువ్వు బహు. కుద్వి.వి. కమ్మవారిలో ఇంటిపేరు.

పుష్పం
రూ. పుష్పాల
పుష్పసూచి (స.).
సుమం. కమ్మవారిలో ఇంటిపేరు.

పుష్పాల
చూ. పుష్పం.
పుష్పసూచి (స.).
పుష్పం బహు. కుద్వి.వి.

పుస్తకాల
పౌరుషనామం (తె.స.).
పుస్తకము బహు. కుద్వి.వి. గ్రంథం.

## పూ

పూజల
పౌరుషనామం (స.).
పూజ బహు. కుద్వి.వి.<సం.పూజా-: అర్చన, సపర్య.

పూజారప్ప
వ్యక్తినామం (రా.).
పూజారి- గృ.నా.పూ. వృత్తిసూచి. వి.చూ. పూజారి.
చూ. -అప్ప గృ.నా.ప.

పూజారి
వృత్తిసూచి (తె.రా.శా.స.).
<ప్రా. పూజార- <పూజాఆర- <సం. పూజాకార-. పూజచేసేవాడు. "--శ్రీమధుకీశ్వర దేవరకు పూజారి మాధవభట్టు పెట్టిన అఖణ్డ వత్తి--" 1082 ఎ.డి. (ఇ. టి. ఐ. పు. 135; నెం.54). "--పూజారి లక్ష్మీనరసు--" 1765 ఎ.డి. (టి. యం. పి. పు. 893: నెం.206). శైవ, వైష్ణవదేవాలయాల్లోని వారిని పూజారి అనరు. స్త్రీదేవత ఆలయాలలో పూజచేసే వారినే పూజారులని అంటారని సి.టి.యన్.ఐ. పు.225. రాయలసీమలో కమ్మవారిలోను, రెడ్లలోను ఈగృహనామం కన్పిస్తుంది.

పూడిపెద్ది
వ్యక్తినామం (స.సా.).
పూడి- గృ.నా.పూ; పంటకాలువ. బ్రాహ్మణులలో ఇంటిపేరు. "--సకల సుకవి నికరానువర్తి పూడిపెద్ది లింగమూర్తి ప్రణీతంబైన--" (సువర్చ. అశ్వా. గ). "--ఒకనైన పూడిపెద్ది వారనఁబడు ఇంటిపేరు గలది--" (పైది. 1-29).

పూదోట

పౌరుషనామం (స.).

< పూవు+తోట : పూలతోట. ఉద్యాన వనం. కమ్మవారిలో ఇంటిపేరు.

పూరేసంగరాజు

వ్యక్తినామం (స.).

పూరేసంగ– గృ.నా.పూ; ? బ్రాహ్మణులలో ఇంటిపేరు. చూ. –రాజుగృ.నా.ప.

పూల

చూ. పూవుల

పుష్పసూచి (తె.రా.స.).

పూవు బహు. కు ద్వి.వి. ఎరుకల. పద్మసాలె, బోయ, బ్రాహ్మణులలో ఇంటిపేరు.

పూలబోని

రూ. పూలమోని

వ్యక్తినామం (తె.).

పూల గృ. నా. పూ; పుష్పసూచి. < పూవుల. వి.చూ. పూల.

చూ. –బోని గృ.నా.ప.

పూలబ్బాయి

పౌరుషనామం (తె.).

పూల+అబ్బాయి : పూలు అమ్మేవాడు.

పూలమోని

చూ. పూలబోని

వ్యక్తినామం (తె.).

పూలసాని

వ్యక్తినామం (తె.స.).

పూల– గృ.నా.పూ; వి.చూ. పూల.

చూ. –సాని గృ.నా.ప.

పూవుల

రూ. పువ్వుల, పూల.

పుష్పసూచి (శా.స.).

పూవు బహు.కు ద్వి.వి. < సం. పుష్ప; త.పూ; మ.పూ, పూవు; కొ.పూ; క.పూ. పూవు, పువ్వు; తు.పూ; తె.పూ, పువు, పువ్వు, నాయకి. పూత; పర్జి. పూ; కుయి. పూజు. డి.ఇ.డి. 3564.

"–పూవులమణవ్వయ్యర్ –––" శా. 1450 (టి.టి.డి.ఇ.యస్.III; పు. 360; నెం. 176).

పూసల

పౌరుషనామం (తె.శా.స.).

పూస బహు. కు ద్వి.వి. రంధ్రం కలిగిన మణి, రత్నం,పూదియ. ఎరుకల లోను, బలిజలలోను ఒక శాఖా భేదమని. పూసలమ్మే వారని సి. టి. యస్.ఐ. పేర్కొంది. "–పూసల వెంగణ్ణ–" శా. 1558 (టి. యం. పి. II; పు. 1139; నెం. 652).

## పె

పెంకుటింటివారు

నివాసస్థలసూచి (రా.).

పెంకుటిల్లు కు ఔప. పెంకులతో కప్పబడిన ఇంటిలో నివసించేవారు.

పెచ్చెట్టి

చూ. పెద్దిసెట్టి

వ్యక్తినామం (వ.).
పెద్ది + సెట్టి.

పెండిలికొడుకు
పౌరుషనామం (శా.).
పెళ్లికొడుకు. వరుడు, వివాహదీక్షితుడు.
"..పెండిలికొడుకు తిమ్మరాజు.."
(టి. టి. డి ఇ. యస్. V; పు. 276; నెం. 93).

పెండ్లాల
పౌరుషనామం (తె.రా.).
పెండ్లము బహు. కు ద్వి.వి. పెళ్లము.

పెదకంటిరెడ్డి
వ్యక్తినామం (రా.).
పెదకంటి– గృ.నా.పూ; కాపులలో శాఖా భేదం; రెడ్లలో ఇంటిపేరు.
చూ. –రెడ్డి గృ.నా.వ.

పెదమల్లు
వ్యక్తినామం (వ.).
పెద– గృ.నా.పూ; < పెద్ద. వృద్ధుడు, జ్యేష్ఠుడు, శ్రేష్ఠం.
చూ. –మల్లు గృ.నా.వ.

పెదరెడ్డి
వ్యక్తినామం (రా.).
పెద– గృ.నాపూ; < పెద్ద. వి. చూ. పెదమల్లు. చూ. –రెడ్డి గృ.నా.వ.

పెదిరెడ్డి
వ్యక్తినామం (వ.).
పెది– గృ.నా.పూ; పెద + ఇ. వి.చూ. పెదమల్లు. చూ. –రెడ్డి గృ.నా.వ.

పెద్దగారి
వ్యక్తినామం (తె.).
పెద్ద– గృ.నా.పూ; వి.చూ. పెదమల్లు.
చూ. –గారి గృ.నా.వ.

పెద్దగౌని
వ్యక్తినామం (తె.).
పెద్ద– గృ.నా.పూ; వి.చూ. పెదమల్లు.
చూ. –గౌని గృ.నా.వ.

పెద్దన
వ్యక్తినామం (సా.).
పెద్ద + అన్న : జ్యేష్ఠ సోదరుడు
పెద్ద.– వి.చూ. పెదమల్లు;
–అన చూ. –అన్న గృ.నా.వ
"..పొగడొందు పెద్దన పోతురాజునకు.." (హరివంశం. 2–37).

పెద్ది
పౌరుషనామం (తె.రా.వ.).
పెద్ద + ఇ: పెద్ద, గొప్ప, గొప్పవ్యక్తి.
? < పెద్దింటమ్మ. ఒక గ్రామదేవత. మహాలక్ష్మి. తల్లికన్న పెద్దదైన ఆమె సోదరిని 'పెద్ది' అంటారు. ఇది బ్రాహ్మణుల పేర్లచివర చేరే బిరుదపదం. కమ్మవారిలో ఇంటిపేరు.

పెద్దినేని
వ్యక్తినామం (రా.).
పెద్ది– గృ.నా.పూ; పెద్ద + ఇ. వి చూ.

పెద్ది. కమ్మవారిలో ఇంటిపేరు.
చూ. _నేని గృ.నా.ప.

పెద్దింటి
నివాసస్థలసూచి (తె.రా.స.).
పెద్ద+ఇంటి. పెద్ద_ గృ.నా.పూ; వి. చూ. పెదపల్లు. బ్రాహ్మణులలో ఇంటిపేరు.
ఒకనికి ఇరువురు కుమారులున్నారనీ, వారిద్దరూ విభక్తమైనపుడు ఒకడికి పెద్ద ఇల్లు, రెండోవానికి చిన్నఇల్లు భాగంగా రావడంవలన పెద్దింటివారనీ, చిట్టిళ్ళ వారనీ ఇంటిపేర్లు ఏర్పడ్డాయని K.B.S. శర్మగారు స్వధర్మ ప్రకాశినిలో పేర్కొన్నారు. చూ. _ఇంటి గృ.నా.ప.

పెద్దిభట్ల
రూ. పెద్దిభొట్ల
వ్యక్తినామం (స.).
పెద్ది_ గృ.నా.పూ; వి. చూ. పెద్ది. వెలనాటి వైదికులలో ఇంటిపేరు.
చూ. _భట్ల గృ.నా.ప.

పెద్దిభొట్ల
చూ. పెద్దిభట్ల
వ్యక్తినామం (స.).

పెద్దిరాజు
వ్యక్తినామం (స.).
పెద్ది_ గృ.నా.పూ; వి.చూ. పెద్ది. ఆర్వేల నియోగ బ్రాహ్మణులలో ఇంటిపేరు. చూ. _రాజు గృ.నా.ప.

పెద్దిరెడ్డి
వ్యక్తినామం (రా.).
పెద్ది_ గృ.నా.పూ; వి.చూ. పెద్ది.
చూ. _రెడ్డి గృ.నా.ప.

పెద్దిసెట్టి
రూ. పెద్దిచెట్టి
వ్యక్తినామం (రా.).
పెద్ది_ గృ.నా.పూ; వి.చూ. పెద్ది.
చూ. _సెట్టి గృ.నా.ప.

పెనుమత్స
పౌరుషనామం (రా.స.సా.).
?పెనుమచ్చ. <పెన్మెచ్చ. 'పెను మెచ్చు' నుండి ఏర్పడిందని కొందరి వ్యుత్పత్తి. కమ్మవారిలో ఇంటిపేరు.
"—ప్రియ శిష్య పెనుమత్స వంశరాఘ వాంబా—" (చంప.వ; అశ్వా.గ.).

పెన్నబోయిన
వ్యక్తినామం (స.).
పెన్న_ గృ.నా.పూ; <పెను. పెద్ద. త. పెరియ, పెరుం; మ. పెరు; క. పెర్.
చూ. _బోయిన గృ.నా.ప.

పెమ్మరాజు
వ్యక్తినామం (స.).
పెమ్మ_ గృ.నా.పూ; వ్య. నా. <పెమ్మయ. ఆర్వేల నియోగ బ్రాహ్మణులలో ఇంటిపేరు.
చూ. _రాజు గృ.నా.ప.

పెమ్మసాని

రూ. పమ్మసాని

వ్యక్తినామం (శా.స.).

పెమ్మ– గృ.నా పూ; వ్య.నా. వి.చూ. పెమ్మరాజు. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. –సాని గృ.నా.ప.

"—పెమ్మసాని తిమ్మయనాయుడు—" శా. 1503 (టి.యం.పి. I; పు. 583; నెం. 133).

చూ. –సాని గృ.నా.ప.

పెయ్యల

జంతుసూచి (రా.స.).

పెయ్య బహు.కు ద్వి.వి. పాలువిడిచిన ఆడదూడ, వత్సము. ఈనకారుకువచ్చిన గేదె. బ్రాహ్మణులలో ఇంటిపేరు ఉ : పయ, పెయ.

పెరవనపెద్ది

వ్యక్తినామం (స.).

పెరవన– గృ.నా.పూ; పు. నా; < పెరవన. నియోగ బ్రాహ్మణులలో ఇంటిపేరు. చూ. –పెద్ది గృ.నా.ప.

పెరికల

తెగసూచి (తె.స.).

ఉప్పు అమ్మి జీవించేజాతి. పెరికలపై సరకు రవాణాచేసేతెగ. పెరిక అనే పదానికి గోనెసంచి అని మద్రాస్ సెన్సస్ 1901 లోవుంది. తెలుగు వారిలో ఒక కలం. తమిళదేశంలో వీరుగోనెసంచులు తయారుచేస్తారు. ఈ పెరికలనే ఉప్పు బలిజలు అంటారు. ఉప్పు పెరికలలో వేసుకొని గాడిదలమీద తీసుకెళ్ళి వ్యాపారం చేసేవారు. ధనం సంపాదించిన వారు కొందరు "పరశురాముని ధాటికి తాళలేక పారిపోయివచ్చామనీ, పిరికిగావచ్చాము కనుక పెరికవారయ్యా" మనీ చెప్తుంటారు. విశాఖ జిల్లాలో వీరు ఎక్కువగా కన్పిస్తారు చూ. సి. టి. యస్. ఐ.

పెరుగు

రూ. పెరుగుల

ఆహార పదార్థసూచి (స.).

త.పెరుకు; మ. పిరియుక; కొ. పెప్; తొ. పెప్; తు. పెర్పుని; తె, పెరుగు. డి.ఇ.డి. 3621.

పెరుగుల

చూ. పెరుగు

ఆహారపదార్థసూచి (తె.).

పెరుగుకు 'ల' ఆగమంగా చేరింది. దధి. ?< పెరువు : వృద్ధిపొందినది, వర్ధిల్లినది.

పెరుమాళ్ళ

వ్యక్తినామం (తె.స.).

< పెరుమాళ్ళు. దే. పు.నా. దేవతాసూచి. < త. పెరుమాళ్–ఆరామ ద్రావిడుల్లో ఇంటిపేరు.

పెర్బాణ

పౌరుషనామం (శా.).

పేర్+బాణ : మహాబాణవంశం.

"—ప్రిథివీరాజ్యశ్రేయస్ పెర్బాణ వంశభుజం॥—" 10వ శ. ఎ. డి. (ఇ.టి.ఐ. పు. 95; నెం. 118;పం.2).

పెసరకాయల

వృక్షసూచి (తె.).

పెసరకాయ బహు. లు ద్వి.వి. పెసర- గృ.నా.పూ. ధాన్యసూచి. వి.చూ. పెసల. పంటరెడ్లలో ఇంటిపేరు.

చూ. -కాయల గృ.నా.వ.

పెసరపప్పు

చూ. పెసల

ధాన్యసంబంధసూచి (సా.).

పెసలను బద్దలుగా చేసిన పప్పు. "—పెసరపప్పు అనంతుపెద్ది భట్లు గారు—" (వల్నా.పు. 249; పం.817).

పెసల

రూ. పెసరపప్పు.

ధాన్యసూచి (రా.స.).

పెసర బహు. లు ద్వి.వి.

వృ. నా :Phaseolus mungo. జోగికులంలో ఇంటిపేరని సి.టి.యస్.ఐ. త.పయఱు; మ.పయఱు; క. పెసఱ్; తె. పెసర, పెసలు; నాయకి. పెసళ్; పర్జి. పయరి డి.ఇ.డి. 3250.

## పే

పేద

పౌరుషనామం (స.).

<హిం, ప్యాబా : భటుడు, సైనికుడు

పేరం

పౌరుషనామం (రా.స.).

<పేరము, పేరెము : గుఱ్ఱపుపరుగు. కమ్మవారిలో ఇంటిపేరు.

?<పేరమ్మ. వ్యక్తిసూచి.

పేరంరాజు

వ్యక్తినామం (స.).

పేరం–గృ.నా.పూ; వ్య.నా. <పేరమ <పేరమ్మ. పేరు+అమ్మ. పేరు–వి.చూ. పేరుబోయిన; –అమ్మ– చూ. గృ.నా.ప. పెద్దమ్మ– జ్యేష్ఠాదేవి, పెద్దతల్లి. చూ. పేరయ్య. వ్య. నా. ఆర్వేల నియోగ బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. –రాజు గృ.నా.వ.

పేరాప్రగడ

వ్యక్తినామం (స.).

పేరా– గృ.నా.పూ; పేరు+అ. పేర్ : పెద్ద. వి.చూ. పేరుబోయిన. ఆర్వేల నియోగ బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. –ప్రగడ గృ.నా.వ.

పేరి

వృక్షసూచి (తె.స.సా.).

ఒక విధమైన ఫలవృక్షం. శ. ర. కమ్మవారిలో, బ్రాహ్మణుల్లో ఇంటిపేరు. ?పేరయ. వ్యక్తినామసూచి. "—నయ భాషి పేరిపేరయ మనీషి—" (శ్రీరా. శ. 1–15).

పేరినేని

రూ. పేర్ని

వ్యక్తినామం (స.).

కమ్మవారిలో ఇంటిపేరు. పేరి– గృ.నా.పూ; పు.నా. <పేరయ. పేరు+ అయ. పేర్–వి.చూ. పేరుబోయిన

చూ. –నేని గృ.నా.ప.

పేరుబోయిన

వ్యక్తినామం (స.).

పేరు– గృ.నా.పూ; దే. <పేర్– : గొప్ప, పెద్ద. చూ. –బోయిన గృ.నా.వ.

పేరెడ్డి

వ్యక్తినామం (స).

పే– గృ.నా.పూ. <పేర్–. వి. చూ. పేరుబోయిన. చూ. –రెడ్డి గృ.నా.వ.

పేరోజి

వ్యక్తినామం (తె.).

పేరు– గృ.నా.పూ; <పేర్. వి.చూ. పేరుబోయిన. చూ. –ఓజి గృ.నా.వ.

పేర్ని

చూ. పేరినేని

వ్యక్తినామం (స.).

పేర్రాజు

వ్యక్తినామం (స.).

పేర+రాజు. పేర–గృ.నా.పూ; వి. చూ పేరుబోయిన. ఆర్వేలనియోగ బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. –రాజు గృ.నా.ప.

పేర్ల

పౌరుషనామం (స.).

పేరు బహు. కుద్వి.వి. నామం, కీర్తి, పెద్ద. ? <బేరి : వ్యాపారి. కోమట్లలో ఇంటిపేరు.

## పై

పై ఇంటివారు

నివాసస్థలసూచి (రా.).

పై ఇల్లుకుటౌప. పైనున్న ఇంటిలో నివసిస్తున్నవారు.

పైడి

రూ. పైండి

లోహసూచి (తె.రా.స.).

దే. బంగారం. కమ్మవారిలో ఇంటి పేరు.

పైడిగంటము

పౌరుషనామం (సా.).

కవిత్వసూచి. పైడి– వి. చూ పైడి; –గంటము : దే. తాటాకుమీద రాయడానికి ఉపయోగించే ఉక్కుసాధనం. పైడి గంటంతో కవిత్వం రాసేవారు, పైడిగంటాన్ని బహుమతిపొందినవారు. బ్రాహ్మణుల్లో ఇంటిపేరు. "–పైడి గంటము వారు నాంబ్రబలెవన్నె –" (శేషధ. 1–24).

పైడిపక్కాల

పౌరుషనామం (సా.).

పైడిచుక్క బహు. కు ద్వి.వి. పైడి- వి. చూ. పైడి; -చుక్కల- వి. చూ. చుక్క.. "--పైడిచుక్కల వారును పాలెము వారు--" (పల్నా; పు. 15; పం. 212).

పైండి

చూ. పైడి.

లోహసూచి (శా.).

?<పైండా. "--పైండిమారారెడ్డి--" శా. 1224 (టి.యం.పి. II; పు. 805; నెం. 485).

పైయావుల

రూ. పయ్యావుల

జంతుసూచి (తె.రా.స.).

<పై+ఆవుల <పయ్+ఆవుల = తెల్లటి ఆవుల.

## పొ

పొగాకు

రూ. పొగాకుల

పౌరుషనామం (తె.స.)

పొగ+ఆకు: ధూమపత్రం, పువ్వాకు. సర్కారు జిల్లాల్లో ముఖ్యమైన వాణిజ్య పంట. 17వ శతాబ్దిలో పోర్చుగీసువారు మనదేశంలో ప్రవేశపెట్టిన వాణిజ్యపైరు. ఆం. నా. Tobacco.

వృ.నా. Nictiana tabaccum

పొగాకును పండించినవారో లేక పొగాకుతో వ్యాపారం చేసినవారికో ఈ ఇంటిపేరు కలిగింది. కరణ కమ్మ వ్యాపారుల లోను, హరిజనులలోను ఇంటిపేరుగా వుంది.

పొగాకుల

చూ. పొగాకు

పౌరుషనామం (స.).

పొగాకు బహు. కు. ద్వి.వి.

పొటేండ్ల

జంతుసూచి (రా.స.).

పొట్టేలు బహు. కు ద్వి.వి. పొట్టి+ ఏలు; ఏలు <ఎలుగు. పొట్టేలు=గొఱ్ఱె పోతు.

పొట్ట

రూ. పొట్టా

అవయవసూచి (తె.స.).

దే.కడుపు. బోయకులంలో ఇంటిపేరు.

పొట్టపేగుల

పౌరుషనామం (రా.).

పట్టుపోగులకు వికృతి కావచ్చు. సాలీలలో ఇంటిపేరు.

పొట్టా

చూ. పొట్ట

అవయవసూచి (స.).

పొట్టి

అవయవలోపసూచి (తె.రా.స.).

<సం. పంత : వామనుడు, పొట్టి. క. పుట్ట, పుట్టి; తు.పుట్ఠ; కురు. పుడ్డా;

ప్రా. పుటక్ డి.ఇ.డి. 3498. 'పొట్టి' పదాన్ని తేలు అనే అర్థంలో కొందరు వాడతారు.

పొట్టిగాని

వ్యక్తినామం (రా.).

పొట్టి– గృ.నా.పూ; శరీర నిర్మాణ సూచి. ఎత్తు తక్కువవాడు. వి.చూ. పొట్టి. చూ. –గాని గృ.నా.ప.

పొట్టిమాకుల

పౌరుషనామం (స).

పొట్టిమాకు బహు కు ద్వి.వి. పొట్టి– గృ.నా.పూ; వి.చూ. పొట్టి. కమ్మవారిలో ఇంటిపేరు. చూ. –మాకుల గృ.నా.ప.

పొట్టు

పౌరుషనామం (స.).

ఉముక, కాయధాన్యంమీద తోలు. కమ్మవారిలో ఇంటిపేరు.

?<పట్టు <ప్రా. పట్ట– <సం. పట్ట.

పొట్ల

వృక్షసూచి (తె.స.).

ఉ : పొట్ల, పొట్లె; ఆం.నా: Snake-gourd. వృ.నా : Trichosanthes anguina. త. పుటల్, పుటలై; మ. పుట్టల్, పిట్టల్; క. పొట్ల, పొడల, పటల, పట్ల; తు. పట్ల. తె. పొట్ల. డి.ఇ డి. 3491.

పొనకల

వృక్షసూచి (స.).

పొనక బహు. కు ద్వి.వి. ?<పొనిక. తృణవిశేషం. ముంజిగడ్డి. కమ్మవారిలో ఇంటిపేరు.

పొన్న

రూ. పొన్నా

వృక్షసూచి (రా.స.).

<సం. పున్నాగ– దీని విత్తనాల నూనెను యూరపుదేశంలో "డొంబా ఆయిల్" అంటారు.

వృ.నా: Calophyllum ionophyllum.

పొన్నా

చూ. పొన్న

వృక్షసూచి (రా.

కమ్మవారిలో, బ్రాహ్మణులలో ఇంటి పేరు.

పొలాంగారి

వ్యక్తినామం (తె.).

పొలాం_ గృ.నా.పూ; ?<పోలమ్మ. స్త్రీ దేవతాసూచి. చూ. –గారి గృ.నా.ప.

## పో

పోక

రూ. పోకల

వృక్షసూచి (స.).

పోక చెట్టు. <సం. పూగమ్ పోకమాను.

పోకల

చూ. పోక

వృత్తిసూచి (తె.).

పోచగోని

వ్యక్తినామం (తె.).

పోచ– గృ.నా.పూ; దేవతాసూచి. <పోచమ్మ. ఒక గ్రామదేవత. వి.చూ. పోచంబోయిన. ? <పోఁచ: దే.సూత్రం, జన్నిదం. చూ. –గోని గృ.నా.ప.

పోచబోయిన

చూ. పోచంబోయిన

వ్యక్తినామం (తె.).

పోచంబోయిన

రూ. పోచబోయిన

వ్యక్తినామం (తె.).

పోచం– గృ.నా.పూ; స్త్రీ. నా. దేవతాసూచి <పోచము. గ్రామదేవత. పోచ+అమ : పోచమ్మ. స్థానిక దేవతామూర్తి. పోచ–<ప్రోచు : రక్షించు. రక్షించే దేవత. చూ. –బోయిన గృ.నా.ప.

పోచరాజు

రూ. పోచిరాజు.

వ్యక్తినామం (తె.స.).

పోచ– గృ.నా.పూ; వి.చూ. పోచంబోయిన. చూ. –రాజు గృ.నా.ప.

పోచిగారి

వ్యక్తినామం (తె.).

పోచి– గృ.నా.పూ; <పోచయ <పోచ+అయ. వి.చూ. పోచంబోయిన.

చూ. –గారి గృ.నా.ప.

పోచినపెద్ది

వ్యక్తినామం (తె.).

పోచిన– గృ.నా.పూ; వ్య.నా. <పోచన. వి. చూ. పోచంబోయిన. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. –పెద్ది గృ.నా.ప.

పోచినేని

వ్యక్తినామం (స.).

పోచి– గృ.నా.పూ; వ్య.నా. దేవతాసూచి. వి.చూ. పోచంబోయిన.

చూ. –నేని గృ.నా.ప.

పోచిరాజు

చూ. పోచరాజు

వ్యక్తినామం (తె.స.).

బ్రాహ్మణులలో ఇంటిపేరు.

పోడిచెట్టి

చూ. పోడిసెట్టి

వ్యక్తినామం (తె.).

పోడిసెట్టి

రూ. పోడిచెట్టి

వ్యక్తినామం (తె.రా.).

పోడి– గృ.నా.పూ; ?

చూ. –సెట్టి గృ.నా.ప.

పోతన

వ్యక్తినామం (స.).

<పోతన్న. పు.నా; దేవతాసూచి. <పోతురాజు. క్షుద్రపురుషదేవత.

పోతనబోయిన

వ్యక్తినామం (ప.).

పోతన– గృ.నా.పూ; పు.నా. దేవతా సూచి. వి.చూ. పోతన. వ్య.నా. చూ. పోతన : భాగవతకర్త.

చూ. –బోయిన గృ.నా.ప.

పోతంసెట్టి

వ్యక్తినామం (స).

పోతం– గృ.నా.పూ; స్త్రీ.నా; <పోతమ. పోతు+అమ. వి.చూ.పోతన.

చూ. –సెట్టి గృ.నా.ప.

పోతరాజు

చూ. పోతురాజు

వ్యక్తినామం (తె.శా.).

కమ్మవారిలో, బ్రాహ్మణులలో ఇంటిపేరు.

"–పోతరాజు పెమ్మయ దేవమహారాజు–" శా. 1233 (టి.యం.పి. I; పు. 630; నెం. 608).

పోతాప్రగడ

వ్యక్తినామం (స.).

పోతా– గృ.నా.పూ; పు.నా. పోత+ఆ. వి.చూ. పోతన. ఆర్వేల నియోగి బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. –ప్రగడ గృ.నా.ప.

పోతాబత్తుల

వ్యక్తినామం (ప.).

పోతా– గృ.నా.పూ; వి.చూ. పోతన.

చూ. –బత్తుల గృ.నా.ప.

పోతిన

చూ. పోతినేని

వ్యక్తినామం (తె.స.).

కమ్మవారిలో ఇంటిపేరు.

పోతినేని

చూ. పోతిన, పోతున, పోతునీడి

వ్యక్తినామం (రా.స.).

పోతి– గృ.నా.పూ; పు నా. దేవతా సూచి. <పోత+ఇ. వి. చూ. పోతన. కమ్మవారిలో ఇంటిపేరు. పోతి స్త్రీనామాంత పదమనీ, చాళుక్యభీముని దాదిపేరు నాగిపోతి అనీ శా.శ. చూ.–నేని గృ.నా.ప.

పోతు

చూ. పోతుల

జంతుసూచి (రా.స.).

పశుపక్ష్యాదులలో పురుషజాతి. త.పోత్తు; మ.పోత్తు; తె.పోతు; ప.పోత్; కోలా. పోత్; నాయకి. ఫోత్. డి.ఇ.డి. 3747. తాగుబోతు, తిండిపోతులలో చేరిన ఒక ప్రత్యయం. పద్మసాలి, మేదరకులాలలో ఇంటిపేరు.

పోతుకుచ్చి

వ్యక్తినామం (తె.).

పోతు– గృ.నా.పూ; వి.చూ. పోతన బోయిన. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. –కుచ్చి గృ.నా.ప.

పోతున

చూ. పోతినేని

వ్యక్తినామం (తె స.).
కమ్మవారిలో ఇంటిపేరు.

**పోతుసీడి**

చూ. పోతినేని
వ్యక్తినామం (స.).
కమ్మవారిలో ఇంటిపేరు.

**పోతుబోయిన**

వ్యక్తినామం (స.).
పోతు- గృ.నా.పూ; వి. చూ. పోతన బోయిన చూ. -బోయిన గృ.నా.ప.

**పోతురాజు**

చూ. పోతరాజు
వ్యక్తినామం (తె.స.).
పోతు- గృ.నా.పూ; వి.చూ. పోతన బోయిన. కమ్మవారిలో ఇంటిపేరు.
చూ. -రాజు గృ.నా.ప.

**పోతుల**

చూ. పోతు
జంతుసూచి (రా.శా.స.).
పోతు బహు. కు ద్వి.వి. బ్రాహ్మణ, మాదిగ కులాలలో ఇంటిపేరు.
"--పొగడపూగద్దెపై పోతులవారు--" (పల్నా. పు.74; పం. 670).

**పోరెడ్డి**

వ్యక్తినామం (తె.).
పో- గృ.నా.పూ; ?<పోతు. వి.చూ. పోతనబోయిన. చూ. -రెడ్డి గృ.నా.ప.

**పోలకం**

వ్యక్తినామం (స.).
దేవతాసూచి. పోలు + అక + అము.

పోలకమ్మ : పోలమ్మ (?) : పోలక్ష్మి.

**పోలనేని**

చూ. పోలినేని, పోలినేని
వ్యక్తినామం (స.).
పోల- గృ.నా.పూ; స్త్రీ. నా; దేవతా సూచి. < పోలు. వి.చూ. పోలకం.
చూ. -నేని గృ.నా.ప.

**పోలంరాజు**

వ్యక్తినామం (స.).
పోలం- గృ.నా.పూ; స్త్రీ.నా; దేవతా సూచి. పోలము <పోలకమ్మ. వి.చూ. పోలకం. ఆర్వేల నియోగులలో ఇంటి పేరు. చూ. -రాజు గృ.నా.ప.

**పోలంరెడ్డి**

వ్యక్తినామం (రా.).
పోలం- గృ. నా. పూ; దేవతాసూచి. వి.చూ.పోలకం. చూ. -రెడ్డి గృ.నా.ప.

**పోలాప్రగడ**

వ్యక్తినామం (స.).
పోలా-గృ.నా.పూ; పోల+ఆ వి చూ. పోలకం. ఆర్వేల నియోగులలో ఇంటి పేరు. చూ. -ప్రగడ గృ.నా.ప.

**పోలాబత్తిన**

వ్యక్తినామం (స.).

పోలా– గృ. నా. పూ; దేవతాసూచి. వి.చూ. పోలకం.

చూ. –బత్తిన గృ.నా.ప.

పోలిన

చూ. పోలనేని

వ్యక్తినామం (స.).

కమ్మవారిలో ఇంటిపేరు.

పోలినేని

చూ. పోలనేని

వ్యక్తినామం (స.).

కమ్మవారిలో ఇంటిపేరు.

పోలిసెట్టి

వ్యక్తినామం (తె.స.).

పోలి– గృ.నా.పూ; గ్రామదేవతాసూచి. వి.చూ. పోలకం.

చూ. –సెట్టి గృ.నా.ప.

పోలోజ

వ్యక్తినామం (తె.).

పోల– గృ.నా.పూ; స్త్రీ. నా; దేవతా సూచి. వి.చూ. పోలకం.

చూ. –ఓజి గృ.నా.ప.

పోశెట్టి

వ్యక్తినామం (స.సా.).

పో– గృ.నా.పూ; ?< పోసి– వి.చూ. పోసినేని. "—పోశెట్టిలింగమునాఁగ—" (నవచో.పు.3). "—పోశెట్టి లింగాఖ్య సుకవి ఎచితమౌ—" (పై ది. అశ్వా.గ.).

పోసాని

వ్యక్తినామం (స.).

పో– గృ.నా.పూ.? పోసిసాని. వి.చూ. పోసినేని. ?< పోలసాని. వి. చూ. పోలకం. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. –సాని గృ.నా.ప.

పోసిన

చూ. పోసినేని

వ్యక్తినామం (స.).

పోసినేని

రూ. పోసిన

పోసి– గృ.నా.పూ; < ప్రా. పోస– < సం. పౌష–, పౌష్య–.

చూ. –నేని గృ.నా.ప.

## పౌ

పౌరోజు

వ్యక్తినామం (తె.).

పౌర– గృ.నా.పూ.?

చూ. –ఓజు గృ.నా.ప.

## ప్ర

ప్రగడ

చూ. ప్రెగ్గడ

వృత్తిసూచి (స.).

బ్రాహ్మణులలో ఇంటిపేరు.

ప్రతాపనేని

వ్యక్తినామం (రా.).

ప్రతాప– గృ.నా.పూ; < సం. ప్రతాప–

ప్రతాపం. చూ. -నేని గృ.నా.వ.

ప్రతిమల

పౌరుషనామం (స.).

ప్రతిమ బహు. కు ద్వి.వి. బొమ్మ. ఏనుగు వాహిత్తముకింది కొమ్మల నడిమిచోటు. ఆం.వా.

ప్రతివాదిభయంకర

పాండిత్యసూచి (శా.స.).

ప్రతివాది- వాదికి ఎదుటి పక్షంవాడు. -భయంకర : భయాన్ని కలుగజేసే వాడు. ప్రతివాదికి భయంకరమైనవాడు. వాదించడంలో దిట్ట అని తెలుస్తుంది. వైష్ణవులలో గృహనామం.

"--ప్రతివాది భయంకరం హస్తగిరి నాధన్--" శా. 1468 (టి. టి. డి. ఇ. యస్. V; పు. 226; నెం. 86ఎ).

"--ప్రతివాది భయంకర తాతాచార్య--" (టి.యం.పి.II; పు.894; నెం.21813).

"ప్రసిద్ధః పర గోష్ఠీషు ప్రతివాద భయంకరః అని పన్నాల్గో శతాబ్దంలో ప్రతివాది భయంకరం అణ్ణన్‌గారు జగద్విఖ్యాతి పొందారు. ప్రతివాది భయంకర రాఘవాచార్యులుగారు వీరికి పదవతరంవారు.

ప్రత్తి

చూ. పత్తి

పౌరుషనామం (స.).

నల్లరేగడినేలల్లో విస్తారంగా పండించే వాణిజ్యపు పంట. కమ్మవారిలో, పద్మ సాలీలలో ఇంటిపేరు.

క.పర్తి, పత్తి;ఓ.పరుత్తి; మ.పరుత్తి; తు.పర్తి; కొ.పరతి; కు.. పర్తి; కువి. పరి. డి.ఇ.డి. 3280.

ప్రత్తిగుల్ల

పౌరుషనామం (స.).

ప్రత్తి- వి.చూ. ప్రత్తి; -గుల్ల : బోలు: పత్తికాయ ఎండిన తర్వాత పత్తితీయగా మిగిలింది. కాపులలో ఇంటిపేరు.

ప్రధాని

వృత్తిసూచి (శా.).

మంత్రి, కార్యసహాయుడు.

"--ప్రధాని సోమరసయ్యర్--" శా. 1462. (టి. టి. డి. ఇ. యస్. IV; పు. 282; నెం. 153).

ప్రభల

పౌరుషనామం (స.).

ప్రభ బహు.కు ద్వి.వి. వెలుగు; ఉత్సవ సమయాలలో వస్త్రాలతో, రంగు కాయి తాలతో చాలా పొడవుగా కట్టే ప్రభఅనే అలంకారం. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

ప్రమిద

పౌరుషనామం (స.).

నూనెపోసి వత్తిపెట్టి దీపం పెట్టడానికి వాడే మట్టి పళ్ళెం బ్రాహ్మణులలో ఇంటిపేరు. పర్యా.దీపంతె, దీపప్రమిదె. పళ్ళిమ్మిక,ప్రణితె.ఉచ్చా. ప్రమిది, ప్రమిదు,

ప్రమిదె. ప్రెమిద.

ప్రసంగి

పౌరుషనామం (సా.).

ఏదైనా ఒక విషయాన్ని విపులీకరించి చెప్పేవాడు, సంభాషించేవాడు లేక వాదం చేసేవాడు. "...ప్రసంగి రంగప్ప రచన..." (రుక్మాం. Tel. Ma. పు. 242).

ప్రహరాజు

వ్యక్తినామం (స.).

ప్రహ– గృ.నా.పూ;? ఒరిస్సాలోని వ్యక్తినామం. బ్రాహ్మణులలో ఇంటి పేరు. చూ. –రాజు గృ.నా.ప

## ప్రి

ప్రిద్వీసెట్టి

వ్యక్తినామం (శా.).

?<పృథ్వీసెట్టి.

ప్రిద్వీ– గృ.నా.పూ; భూసూచి.<సం. పృథ్వీ–. భూమి. ?<పృధివిసెట్టి : వణిజ నాయకుడు. నరక నాయకుడు. ఇదిఒక బిరుద నామమని శా.శ.

చూ. –సెట్టి గృ.నా.ప.

"పిద్వీసెట్టి రాయనభాస్కర..." 1681 ఎ.డి. (టి.యం.పి. I. పు. 12; నెం. 88)

"పిద్వీసెట్టి రాయనమంత్రిభాస్కర..." శా. 1544 (పైది. పు.505;నెం.268).

"అంక తెలుగరిసెట్టి వీరబలంజ్య ధర్మమునకు చెందిన ఆంధ్రదేశపువర్తకుడు. ఇతనికిగల పృథ్వీసెట్టి బిరుదంకూడ గమనింపదగినది. కోట్లకు పడగెత్తి, నానాదేశ వ్యాపారం చేయువారిని పృధ్వీసెట్టి బిరుదుచే భూషించుచుండిరి. కన్నడ దేశ చక్రవర్తులు విస్తృత సామ్రాజ్య పరిపాలనా సూచకముగా పృధ్వీవల్లభ, జగదేక మల్ల, త్రిభువనమల్ల మున్నగు బిరుదములను ధరించుట ఆచారం. ఆ సంప్రదాయాన్ని బట్టియే దేశవిదేశ వ్యాపార సూచకంగా వైశ్యులు పృధ్వీసెట్టి బిరుదములు ధరించి యుందురు." (అం.దే.చ.భూ. పు. 2).

## ప్రె

ప్రెగడరాజు

రూ. ప్రెగడరాట్.

వ్యక్తినామం (స.).

ప్రెగడ– గృ.నా.పూ; వృత్తిసూచి. వి.చూ. ప్రెగ్గడ. చూ. –రాజు గృ.నా.ప.

ప్రెగడరాట్

చూ. ప్రెగడరాజు

వ్యక్తినామం (సా.).

"...పెద్దలైన వారలు నిరసింతురా! ప్రెగడరాణ్ణరసా! విరసా!..." (చాటుప; పు.105). ప్రగడరాజు గృహనామంలోని చివరిపదం రాజునుమాత్రమే సంస్కృతీకరించి 'రాట్'చేసి, రామలింగడు ఇంటి పేరులోఖూడా హాస్యాన్ని వ్యక్తంచేస్తూ

ప్రగడరాజు నరసకవిని వ్యంగ్యంగా సంబోధించాడు.

॥ పెగ్గడ

రూ. ప్రగడ, హెగ్గడి.

వృత్తిసూచి (శా.).

మంత్రిపదవి. హెగ్గడ, హెగ్గడి, హెగ్గళి. "—ప్రెగ్గడ పాండురంగ—" (టి. యం. పి. II; పు. 788; నెం. 365).

## ప్రౌ

ప్రౌఢకవి

బిరుదనామం (స.సా.).

కవిత్వసూచి. ప్రౌఢుడైనకవి. విపుణుడైన లేక సమర్థుడైన కవి. ఆర్వేల వియోగులలో ఇంటి పేరు.

"—ప్రౌఢకవి మల్లనార్య ప్రణీతంబైన—" (రుక్మాం. అశ్వా. గ. పు. 71.).

## ఫా

ఫారసి

పౌరుషనామం (స.).

?స్వర్ణకారుడు.

?<పారశీక. పారశీకదేశభాష.

మాధ్వులలో ఇంటిపేరు.

## బ

బక్కరాజు

వ్యక్తినామం (స.).

బక్క— గృ.నా.పూ; వ్య.నా.

<బక్కయ. ఆర్వేల వియోగులలో ఇంటిపేరు. చూ. _రాజు గృ.నా.ప.

బక్కిన

చూ. బక్కనేని

వ్యక్తినామం (స.).

బక్కనేని

రూ. బక్కన

వ్యక్తినామం (స.).

బక్క— గృ.నా.పూ; వ్య.నా; వి.చూ. బక్కరాజు.

బంక

రూ. బంకా

పౌరుషనామం (తె.రా.).

బందన. చెట్టునుండి వచ్చే జిగటగల వస్తువు. క.బంక; కోలా. బంక; నాయకి. బక్క; పర్జి. బాక్; త.పచయ్. డి.ఇ.డి. 3159.

?బంకు: కొట్టు; సైనిక నివేశనం.

బంకా

చూ. బంక

పౌరుషనామం (స.).

బంగరాల

పౌరుషనామం (స.).

బొంగరము బహు. కు ద్వి.వి. <సం. భ్రమరక- : బొంగరం.

?<సం.భృంగార-లోహసూచి.బంగారం.

బంగారి

చూ. బంగారు

లోహసూచి (తె.).

బంగారుకు బొప.

బంగారిళ్ళ

నివాసస్థలసూచి (తె.).

బంగారిల్లుకుద్వి.వి స్వర్ణగృహం.

బంగారు

రూ. బంగారి

లోహసూచి (తె.రా.స.సా.).

<సం. భృంగార– ఒకలోహం. బంగారము. బ్రాహ్మణులలో ఇంటి పేరు. "–తప్పకచూచెబంగారు తిమ్మరాజు–" (బం.తి; Tel.Ma. పు. 283).

బంగారు ముక్కెర

ఆభరణసూచి (స.).

బంగారు– వి. చూ. బంగారు. –ముక్కెర. అడ్డబాస, ముంగర.

బంగి

పౌరుషనామం (స.).

?<హిం. బంగి : తపాలులోవంపే వస్తువులమూట. ?<భంగీ : గంజాయి.

బచ్చలకూర

వృక్షసూచి (స.).

వృ నా : Bassillus rubra

త. పచళయ్; మ. పచళ; క. బచ్చలి; తు.బసలె. డి.ఇ.డి. 3164.

తిమ్మవారిలో ఇంటి పేరు.

బచ్చు

రూ. బాచ్చు

పౌరుషనామం (రా.).

<బచ్చు. వైశ్యుడు. బొక్కసానికి అధికారి, వెండి బంగారాల నాణ్యం చూసేవాడు. <ప్రా. వేస్స– <సం. వైశ్య– బ్రాహ్మణులలో ఇంటిపేరు.

బట్టు

పౌరుషనామం (స.).

వేదపాఠం చదివేవాడు, బట్టువాడు, స్వస్తి ముఖుడు.

బహు. బట్టులు, బట్లు, బట్టువారు.

బట్రెడ్డి

వ్యక్తినామం (రా.).

బట్టు– గృ.నా.పూ; ఏ. పట్టపుపేరు. <సం. భట్ట– వి.చూ. బట్టు.

చూ. –రెడ్డి గృ.నా.ప.

బడవర

వృత్తిసూచి (నా.).

<బడవ <సం. పడవా– : దూత. ?<బడ. దే. పెద్ద, మిక్కిలి; వర= శ్రేష్ఠమైన. "బడవర బ్రహ్మయ్యం బనియుంబంచితివా" (పండి. పు. 208).

బండ

రూ. బండా

పౌరుషనామం (తె.).

క.బండె : వెడల్పురాయి. ?<భండ : నెత్తిగోతులవాడు, శరీరంకోసుకొని భిక్ష

మెత్తేవాడు, అకతాయి. ఒడ్డెకులంలో ఇంటిపేరు.

బండా
చూ. బండ
పౌరుషనామం (స.).
కమ్మవారిలో ఇంటిపేరు.

బండాగార
చూ. భండారువు
వృత్తిసూచి (శా.).
"—బండాగార గంగరాజ—" (టి.యం.పి. I; పు. 696; నెం. 268 ఎ.).

బండారపు
చూ. భండారువు.
వృత్తిసూచి (తె.రా.).

బండారి
చూ. భండారువు.
వృత్తిసూచి (తె.స.సా.).
"—బండారి కులదుగ్ధవారాశి జనియించె—" (కాశిం. 1–18). "—సకల గుణహారి బండారి సత్యశౌరి." (కాశిం. 1–34).

బండారు
చూ. భండారువు
వృత్తిసూచి (తె.శా.స.సా.).
కమ్మవారిలో, బ్రాహ్మణులలో ఇంటిపేరు "—భండారు వీరంరాజు—" (టి.యం.పి. II; పు.957; నెం. 474). "—బండారు బసవన్న నాయక కొలుతు—" (పండితా. పు. 243). "—బండారు బసవన దండనాయకుడు—" (పండితా. పు. 38). "—బండారు కౌత దండాధీశు డమలుండి—" (దశకు.1–23).

బండి
రూ. బండ్ల
వాహనసూచి (రా.స.).
మనుష్యులు ఉపయోగించే తేరు, దేవతలకు ఉపయోగించే రధం. కమ్మవారిలో, బ్రాహ్మణుల్లో ఇంటిపేరు. సం. భండి–; క.బండి; త.వంటి; మ.వండి; తొ. పొాడి; తు. బండి; కోలా. బండి. డి ఇ.డి. 3219. బండిపై తెచ్చే వస్తువులమీద సుంకం వసూలుచేసే వృత్తి కావచ్చు రాయలసీమలో కాపు, బ్రాహ్మణ కులాంలోను; నర్కారు జిల్లాల్లో ఒడ్డె, కమ్మ, కాపు, మాల, యానాది కులాలలోనూ ఈ ఇంటిపేరు కన్పిస్తుంది.

బండోజి
వ్యక్తినామం (తె.).
బండ_ గృ.నా.పూ; <సం. భండ వి.చూ. బండ. చూ. –ఓజి గృ.నా.ప.

బండ్ల
చూ. బండి
వాహనసూచి (స.సా.).
బండి బహు. కు ద్వి.వి. కమ్మవారిలో ఇంటిపేరు. "—బండ్ల నాగమనేని పడగొట్టి—" (పల్నా.పు.247: పం.769).

"—ధీమంతుడైన బండ్ల బాపయ్య చరితమ్ము—" (బం.బా.జీ. 1–29).

బత్తి

వృత్తిసూచి (తె.).

<ప్రా. భత్త–<సం. భక్త–సేవకుడు.

బత్తిన

చూ. బత్తినేని

వ్యక్తినామం (రా.స.).

బత్తిని

చూ. బత్తినేని

వ్యక్తినామం (రా.స.).

కమ్మవారిలో ఇంటిపేరు.

బత్తినేని

రూ. బత్తిన, బత్తిని.

వ్యక్తినామం (స.).

బత్తి– గృ.నాపూ; వి. చూ. బత్తి. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. –నేని గృ.నా.వ.

బత్తు

రూ. బత్తుల

వృత్తిసూచి (రా.స.).

పంచాణవృత్తి. కంసాలి, దేవాంగులలో పట్టపుపేరు. కాపుల్లో ఇంటిపేరు.

బత్తుల

చూ. బత్తు

వృత్తిసూచి (తె.రా.స.).

పంచాణపువృత్తి. బత్తి+లు. కమ్మ, కంసాలి, కోమటి, దేవాంగుల, రెడ్డి కులాలలో ఇది పట్టపుపేరు.

బద్రిరాజు

చూ. భద్రిరాజు

వ్యక్తినామం (స.).

నియోగి బ్రాహ్మణులలో ఇంటిపేరు.

బందా

రూ. బంది

పౌరుషనామం (తె.రా.స.).

బందాకోరు, ఖయిదీ. ఆం. వా. సుమారు ఒకటి, రెండెకరాల భూమికి నీటిని సరఫరాచేసే చిన్న చెరువు. పెద్ద చెరువునుండి కాలవద్వారా నీరు తెచ్చు కొని నిల్వచేసేచోటు. మాం. వృ.వ.

బంది

చూ. బందా

పౌరుషనామం (స.).

బందూకు

పౌరుషనామం (రా.).

ఆయుధసూచి. బందూకును ఉపయోగించడంలో ప్రసిద్ధినందు వలన వీరికి ఈపేరు వచ్చింది.

బందెల

పౌరుషనామం (స.).

బందె బహు. కు ద్వి.వి. <ప్రా. బంధియా <సం. బంధక– పశువుల చెఱ, బందెలదొడ్డి.

సలహాయిచ్చాడు. ఆ హోమగుండం నుండి గాజుల కుప్పలతో, పసుపు,కమ్మ, నల్లరాయి, గంధంపొడి, దువ్వెన ఉన్న ఒక గాడిద వచ్చింది. ఆ బలి నుండి వచ్చిన మహా పురుషుని మీదగానే వీరికి ఈ కులంపేరు వచ్చింది. తుపాకుల, పప్పు, పులి, బల్లి, మిరియాల, ముత్యాల, సముద్రం మొదలైనవి ఈ కులంలో ఇంటిపేర్లు. (చూ. సి.టి. యస్. ఐ. I. 134).

బలుసు

వృక్షసూచి (తె.రా.స.).

బంజరునేలల్లో పొదగాపెరిగే ముళ్ళ కంచెమొక్క. కమ్మవారిలో ఇంటిపేరు.

ఉ : బలస, బల్సు, బల్పు, బొల్సు.

వృ.నా : Plectoronia Parviflora.

బల్జోజు

వ్యక్తినామం (తె.).

బల్జ- గృ.నా.పూ; <బలజ <క. బణజిగ. <ప్రా.వణిజ్జ- <సం. వాణిజ్య-

చూ. -ఓజు గృ.నా.ప.

బల్లి

సరీసృపసూచి (తె.రా.).

సం. పల్లీ, పల్లికా; త. పల్లి; మ.పల్లి; క.పల్లి; తు.పల్లి; తె.పల్లి, బల్లి. డి.ఇ.డి. 3294.

బలిజకులంలో ఇంటిపేరు.

బవిరిసెట్టి

రూ. బవిసెట్టి.

వ్యక్తినామం (స.).

బవిరి- గృ.నా.పూ; <ప్రా. భమర- <సం. భ్రమర- భ్రమరాంబ.

చూ. -సెట్టి గృ.నా.ప.

బవిసెట్టి

చూ. బవిరిసెట్టి

వ్యక్తినామం (తె.).

బసవరాజు

వ్యక్తినామం (శా.స.).

బసవ- గృ.నా.పూ; పూజ్యతాసూచి. <సం. వృషభ- బసవడు. ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.

చూ. -రాజు గృ.నా.ప.

బసినేని

వ్యక్తినామం (రా.).

బసి- గృ.నా.పూ;పు.నా. దేవతాసూచి. బస+ఇ. <బసవయ. వి.చూ. బసవరాజు. చూ. -నేని గృ.నా.ప.

బసిరెడ్డి

వ్యక్తినామం (రా.).

బసి- గృ.నా.పూ; వి.చూ. బసినేని.

చూ. -రెడ్డి గృ.నా.ప.

## బా

బాచనేని

రూ.బాచిన

వ్యక్తినామం (స.).

బాచ- గృ.నా.పూ; దేవతాసూచి.

వి.చూ. బావిరాజు.
చూ. -నేని గృ.నా.వ.

బాచిన
చూ. బాచినేని
వ్యక్తినామం (స.).
కమ్మవారిలో, బ్రాహ్మణులలో ఇంటి పేరు.

బాచిరాజు
వ్యక్తినామం (స.).
బాచి- గృ.నా.పూ; పు.నా. దేవతా సూచి. బాచ+ఇ.బాచ- <సం.భాస్కర- సూర్యుడు. ఆర్వేల నియోగులలో ఇంటి పేరు. చూ. -రాజు గృ.నా.ప.

బాచ్చు
చూ. బచ్చు.
పౌరుషనామం (శా.).
"--బాచ్చు నారపసెట్టి--" శా.1200 (టి.యం.పి. II: పు.844; నెం.863).

బాడిగ
పౌరుషనామం (స.).
<సం. భాటక- ఒకరు మరొకని సొత్తును వాడుకోడానికి ఆసొత్తు కల వాడికి ఇచ్చే ధనం, అద్దె.

బాడితి
పౌరుషనామం (స.).
ఆయుధసూచి. <బాడాసు. బాడిస యొక్క రూ. వడ్లవాడు కొయ్య చెక్కే కొఱముట్టు.

బాడిశ
రూ. బాడిశె, బాడిసె
పౌరుషనామం (స.).
ఆయుధసూచి వి.చూ. బాడితి.

బాడిశె
చూ. బాడిశ
పౌరుషనామం (తె.).
ఆయుధసూచి.

బాడిసె
చూ. బాడిశ
పౌరుషనామం (స.).

బాణాల
పౌరుషనామం (శా.స.సా.).
ఆయుధసూచి, బాణము బహు. కు ద్వి.వి దే. దండాయుధం.
"బాణాల వీరాయ--" (యస్. ఐ. ఐ. IV; పు.305 పం.17; నెం. 936).

బాతుల
పక్షిసూచి (స.).
బాతు. బహు. కు. ఔప. బాతువు.

బాదబోయు
రూ. బాదబోల
వ్యక్తినామం (శా.).
బాద- గృ.నా.పూ; పు.నా. <బాదియ; బాదెయ్య. బాదమయ్య. వ్య.నా.
"--బాదబోయు దొడ్డియయు--" 1055ఎ.డి. (ఇ. టి. ఇ. పు. 107;

నెం. 27; పం. 7–8).
చూ. –బోల గృ.నా.వ.

బాదబోల
చూ. బాదబోయు
వ్యక్తినామం (శా.).
"—బాదబోల బోతియయు—"
1081.డి(ప్రా.ఆం.శా; పు.132; పం.11; నెం. 149).

బాదం
వృక్షసూచి (తె.).
బాదంచెట్టు. వృ.నా. Terminatia Catappa.

బాదిరాజుల
వ్యక్తినామం (సా.).
బాది– గృ.నా.పూ. వి.చూ.బాదిబోయు.
"—శ్రీ బాదిరాజుల అన్నుపళ్ళ—"
(ఇ.టి ఐ; పు.161; నెం.85).
చూ. –రాజుల గృ.నా.వ.

బాంధవకోటి
బిరుదనామం (స.సా.)
బంధుసమూహం. బంధువులను ఆదరించి సంపాదించిన బిరుదనామం.
"బాంధవకోటి బాపనయ్య తనూభవ—"
(సానం. ఆశ్వా.గ.)

బాపన
కులసూచి (స.)
<ప్రా. బంభణ, బంహణ; సం. బ్రాహ్మణ-బ్రాహ్మణుడు.
ఆంధ్రదేశంలో ప్రతి గ్రామంలోనూ కన్పించే కులం ఇది. వీరి ఆచారాలను, పద్ధతులను, భాషనుబట్టి అనేక విధాలుగా ఈ కులం విభజింపబడింది. వీరు బ్రహ్మనోటినుండి వచ్చారని ప్రతీతి. ఋగ్వేదంలోని పురుష సూక్తంలో విరాట్పురుషుని ముఖంనుండి బ్రాహ్మణులు వచ్చారని పేర్కొబడింది. బ్రాహ్మణులందరూ సప్తఋషులలో ఒకరినో, ఇద్దరినో వారి పూర్వీకులుగా చెప్పుకుంటారు. చూ. సి.టి.యస్.ఐ.I.

బాపినేని
వ్యక్తినామం (సా.).
బాపి– గృ.నా.పూ; వ్య.నా. <బాపు. మరాఠీపదం. తండ్రిఅని అర్థం. కమ్మవారిలో ఇంటిపేరు. "—మాన్య, బాపినేని వంశవననిధి భవ్యసోమునాది—"
(అలం. చం. 1–16).
చూ. –నేని గృ.నా.వ.

బామిరాజు
వ్యక్తినామం (శా.).
బామి– గృ.నా పూ;వ్య.నా. <బామయ. "—రాజ్యము సేయుచుండగాను బామిరాజుఎల్లయ ప్రగడ వారి నాయంకరమందు—" శా.1233 (తెలం. శా. I; పు 92; పం. 7–8).
చూ –రాజు గృ నా.వ.

బాయనేన
చూ. బాయనేని

వ్యక్తినామం (స).

బాయనేని

రూ. బాయన, బాయినేని

వ్యక్తినామం (స.).

బాయ– గృ.నా.పూ; పు.నా. ?<భావ=భావనారాయణ. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. –నేని గృ.నా.ప.

బాయినేని

చూ. బాయనేని

వ్యక్తినామం (తె.స.).

కమ్మవారిలో ఇంటిపేరు.

బాలకవి

బిరుదనామం (స.సా.).

కవిత్వసూచి. బాలుడైన కవి. ఆర్వేల నియోగులలో ఇంటిపేరు. "—సరికవులెన్న బాలకవి సుబ్బన్న మేలిమి—" (లీలా. Tel. Min. పు.246).

బాలగోని

వ్యక్తినామం (తె.).

బాల– గృ.నా.పూ; వి.చూ. బాలరాజు.

చూ. –గోని గృ.నా.ప.

బాలన్నగారి

వ్యక్తినామం (రా.).

బాలన్న- గృ.నా.పూ; వ్య.నా. బాల+అన్న. బాల–విచూ. బాలరాజు. –అన్న-చూ. గృ.నా.ప.

చూ. –గారి గృ.నా.ప.

బాలబొమ్మ

పౌరుషనామం (స.).

చిన్నపిల్లలకు గాలి సంబంధమైన ఎలాంటి వ్యాధులూ రాకుండా రక్షకోసం మెడలో కట్టే ఒక బిళ్ళ.

బాలరాజు

వ్యక్తినామం (రా.).

బాల– గృ.నా.పూ; <సం. బాలక–బాలుడు. పదహారేండ్ల లోపున్న పిల్లవాడు. ?<బాలాజి.

చూ. –రాజు గృ.నా.ప.

బాలాజి

వ్యక్తినామం (తె.).

దేవతాసూచి.పు.నా. తిరుపతివెంకన్నకు బైరాగులు వాడే పేరు.

బాలిన

చూ. బాలినేని

వ్యక్తినామం (తె.).

కమ్మవారిలో ఇంటిపేరు.

బాలిని

చూ. బాలినేని

వ్యక్తినామం (రా.).

బాలినేని

రూ. బాలిన, బాలిని.

వ్యక్తినామం (రా.స.).

బాలి– గృ.నా.పూ; బాల+ఇ. వి.చూ. బాలరాజు. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. –నేని గృ.నా.ప.

బాలిసెట్టి
వ్యక్తినామం (స.).
బాలి– గృ.నా.పూ; వి.చూ. బాలినేని.
చూ. –సెట్టి గృ.నా.వ.

బావి
జలసూచి (స.).
ప్రా. వావీ– <సం. వాపీ : నుయ్యి, దిగుడుబావి.

బాశింసెట్టి
వ్యక్తినామం (స.).
బాశిం– గృ.నా.పూ; వ్య.నా. <బాచ– వి. చూ. బాయన.
చూ. –సెట్టి గృ.నా.వ.

## బి

బిక్కసాని
వ్యక్తినామం (రా.స.).
బిక్క– గృ.నా.పూ; వి.చూ. బిక్కన. కమ్మవారిలో ఇంటిపేరు.
చూ. –సాని గృ.నా.వ.

బిక్కన
<బిక్కనేని
వ్యక్తినామం (తె.స.).
బిక్క– గృ.నా.పూ; <బిక్క <ప్రా. భిక్ష– <సం. భిక్ష–. కమ్మవారిలో ఇంటిపేరు. చూ. –న గృ.నా.వ.

బిచ్చాలు
వ్యక్తినామం (స.).
<ప్రా. భిచ్చా <సం. భిక్ష.
పెంటయ్యలానే ఈ పేరు సర్కారు జిల్లాలో వెనుకబడిన జాతి వారిలో కన్పిస్తుంది.

బిజ్జరాజు
వ్యక్తినామం (స. .
బిజ్జ– గృ.నా.పూ; <క. బిజయ, బిజ్జ <సం. విజయ. ఆర్వేల నియోగ బ్రాహ్మణులలో ఇంటిపేరు.

బిజ్జుల
వ్యక్తినామం (సా.).
<బిజ్జ. వి.చూ. బిజ్జరాజు.
''—ఒప్పు మీఱెఁజాల బిజ్జులనాద భూపాల మౌళి—'' (అనర్ఘ. 1–36).
''—కోవిదులుమెచ్చ బిజ్జుల కుప్ప విభుడు—'' (అనర్ఘ. 1–39).

బిట్టు
పౌరుషనామం (రా.స.).
శీఘ్రం, హెచ్చు. కాపులలో, హరిజనులలో ఇంటిపేరు.

బిందెల
వస్తుసూచి (స. .
బిందె బహు. కు ద్వి వి. ఒకపాత్ర. <ప్రా. బిందుఅ–సం. బిందుక–

బిరుదరాజు
చూ. బిరుదురాజు
వ్యక్తినామం (స.).
ఆర్వేలనియోగులలో ఇంటిపేరు,

బిరుదు
రూ. బిరుదుల
పౌరుషనామం (న.).
వ్యక్తులయొక్క సామర్థ్యానికి, శౌర్య పరాక్రమాలకూ చిహ్నంగా ఒక సమూహంచేత గుర్తించబడి ఇవ్వబడ్డబిరుదం.

బిరుదురాజు
రూ. బిరుదరాజు
వ్యక్తినామం (న.).
బిరుదు- గృ నా.పూ; వి. చూ. బిరుదము. బ్రాహ్మణులలో ఇంటిపేరు.
చూ. -రాజు గృ.నా.ప.

బిరుదుల
చూ. బిరుదు
పౌరుషనామం (న.).
బిరుదు బహు. కు ద్వి.వి.

బిల్లవోని
వ్యక్తినామం (తె.).
బిల్ల- గృ.నా.పూ; దే. గుండ్రంగా వున్న పల్చని వస్తువు. సూర్య, చంద్ర బింబం. ?<బిల్ల-
చూ. -ఓని గృ.నా.ప.

బిల్లింటి
నివాసస్థలసూచి (రా.).
బిల్ల- గృ.నా.పూ; దే. వి. చూ. బిల్లవోని. చూ. -ఇంటి గృ.నా.ప.

బిల్వ
వృక్షసూచి (రా.).
మారేడుచెట్టు. శ్రీఫలం.

బిల్వనేని
రూ. బిల్వినేని
వ్యక్తినామం (రా.).
బిల్వ- గృ.నా.పూ; వృక్షనామసూచి. వి.చూ. బిల్వ. చూ. -నేని గృ.నా.ప.

బిల్వినేని
చూ. బిల్వనేని
వ్యక్తినామం (రా.).

## బీ

బీరం
పౌరుషనామం (శా.న.).
బీరము <నం. వీర్య-. శౌర్యం, పరాక్రమం. బలిజలలో ఇంటిపేరు. "--తోటను ఆ స్థలాన బీరంవారి కుంటనువారి--" శా. 1158. (తెలం. శా. I: పు. 69; పం. 6-7).

బీరు
పౌరుషనామం (న.).
<నం. వీర-; క.బీర : పరాక్రమం.

## బు

బుక్కరాజు
వ్యక్తినామం (శా.).
బుక్క-గృ.నా పూ; దే. గంధపుపొడి. హిం. బుకా; క.బుక్క-. <నం. భుక్ శబ్దభవమని అనం. గ్రా.నా. "--బుక్కరాజు తిమ్మరాజు--" శా. 1470 (టి.

యం.పి. I; పు. 615; నెం. 472).
చూ. _రాజు గృ.నా.ప.

బుక్కిన
వ్యక్తినామం (స.).
< బుక్కినేని బుక్కి- గృ.నా.పూ; వ్య.నా. < బుక్కయి. వి. చూ. బుక్కరాజు. చూ. _న గృ.నా.ప.

బుగ్గా
జలసూచి (తె.స.).
< బుగ్గ. దే. నీటిబుడ్డ. పర్వతాల మీద నుండి సంతతధారగా పైకి ఉబికి వచ్చే నీటిధార. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

బుంగ
వస్తుసూచి (స.).
చిన్నమూతి గల కుండ.

బుచ్చనగారి
వ్యక్తినామం (తె.).
బుచ్చన- గృ.నా.పూ; వ్య. నా; చూ. వ్య.నా. బుచ్చమ్మ, బుచ్చయ్య.
చూ. _గారి గృ.నా.ప.

బుడిగ
రూ. బుడిగె, బుడెగి, బుడ్డిగ.
వృత్తిసూచి (తె.).
?< బోడిగ. కావలివాడు. శా.శ. 214.

బుడిగె
చూ. బుడిగ
వృత్తిసూచి (తె.).

బుడెగి
చూ. బుడిగ
వృత్తిసూచి (రా.).
రెడ్లలో ఇంటి పేరు.

బుడ్డిగ
చూ. బుడిగ
వృత్తిసూచి (రా.స.).

బుద్ధరాజు
రూ. బుద్ధిరాజు, బూదరాజు.
వ్యక్తినామం (స.).
బుద్ధ- గృ.నా.పూ; పు. నా; దేవతా సూచి. < బుద్ధుడు. బుద్ధదేవుడు, విద్వాంసుడు, తెలిసినవాడు. ప్రజలంతా వేదమార్గాన్ని, నీతిని వదలిపెట్టి జీవ హింసకు అలవాటు పడినందున దేవుడు చూడలేక బుద్ధుడై జన్మించాడట.
అర్వేల నియోగులలో ఇంటిపేరు.
చూ. _రాజు గృ.నా.ప.

బుద్ధిరాజు
చూ. బుద్ధరాజు
వ్యక్తినామం (స.).
నియోగ బ్రాహ్మణులలో ఇంటిపేరు.

బుర్ర
రూ. బుర్రా
అవయవసూచి (స.).
శరీరంలో ఒకభాగం. తల. క.బురడె, బురుడి; తు. బురుడె; నాయకి. బుర్ర; పర్జి. బుర్క. డి.ఇ.డి. 3553.

బుర్రకాయల

పౌరుషనామం (తె.).

బుర్రకాయ బహు. కు ద్వి.వి. ఎండిన సొరకాయ, తలకాయ.

బుర్రనేని

వ్యక్తినామం (స.).

బుర్ర- గృ నా.పూ; అవయవసూచి. శరీరంలో ఒకభాగం. పుర్రె, తల.
కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. -నేని గృ.నా.ప.

బుర్రా

చూ బుర్ర

అవయవసూచి (స.).

కమ్మవారిలో, బ్రాహ్మణులలో ఇంటి పేరు.

బుర్రి

జంతుసూచి (స.).

<బుఱ్ఱి: తరిపి ఆవు, ధేనువు;ఆడపిల్ల.

బుల్లెద్దుల

జంతుసూచి (స.).

బుల్లి+ఎద్దుల : చిన్నఎద్దులు కలవారు కావచ్చు. బుల్లి అనే పదం ఈ అర్థంలో నర్సాపురం జిల్లాలో ఎక్కువ వాడుకలో వుంది.

బువ్వా

ఆహారపదార్థసూచి (స.).

<బువ్వ. అన్నం. <ప్రా. భోప- <సం. భోగ-; క.బువ్వ.
కమ్మవారిలో ఇంటిపేరు.



బుస్సెట్టి

వ్యక్తినామం (స.).

బు- గృ.నా.పూ; ?<బుక్క-.

? బుచ్చి.

?<ప్రా. భూసా. <సం. భూషా.

చూ. -సెట్టి గృ.నా.ప.

## బూ

బూచి

పౌరుషనామం (రా.).

<సం. భూత- భూతం.

బలిజలలో ఇంటిపేరు.

బూదరాజు

చూ. బుద్ధరాజు

వ్యక్తినామం (తె.స.).

ఆర్వేలనియోగ బ్రాహ్మణులలో ఇంటి పేరు.

బూపరాజు

వ్యక్తినామం (తె.).

బూప- గృ. నా. పూ; <భూప : భూపుడు, రాజు. చూ. -రాజు గృ.నా.ప.

బూర

పౌరుషనామం (తె.).

వాద్యవిశేషం. <సం.పుర- కాహళిక అనే వాద్యవిశేషం.

బూరుగమాను

వృక్షసూచి (రా.).

వృ.నా : Salmalia malabonica.

ఆం. నా : Silk cotton tree.

క.బూర, బూరగ, బూరుగ; త.బూరుగ; తె. బూరగ, బూరుగ, బూరుగు; ప.బూరు. డి.ఇ.డి. 3580. శాల్మలీ వృక్షం.

బూరెల

రూ. బూర్ల

ఆహారపదార్థసూచి (స.సా.).

బూరె బహు. కు ద్వి. వి. <సం. పూరికా– "---బూరెల భీమన్న--" (పల్నా. పు. 249; పం. 815 .

బూర్ల

చూ. బూరెల

ఆహారపదార్థసూచి (తె.స.).

బూసిరెడ్డి

వ్యక్తినామం (రా.).

బూసి– గృ. నా. పూ; అలంకారం. <ప్రా. భూసా– <సం. భూషణ–. నాగభూషణం అనే పేరును వాడుకలో నాగబూషి, నాగబూసిఅని ఉచ్చరించడం చూస్తున్నాం. చూ. –రెడ్డి గృ.నా.ప.

## బె

బెజ్జం

పౌరుషనామం (తె.స.)

<బెజ్జము : రంధ్రం. <ప్రా. వేజ్జ– <సం. వేధ్య–హరిజనులలో ఇంటిపేరు.

బెల్లపు

చూ. బెల్లం

పౌరుషనామం (తె.).

బోయలలో ఇంటిపేరు.

బెల్లం

రూ. బెల్లపు.

చెరకు పాలు కాచగా వచ్చినముద్ద. కమ్మవారిలో, బ్రాహ్మణులలో ఇంటిపేరు.

బెస్త

కులసూచి (తె.).

క. బెశద, బెస్త; తె. బెస్త. డి.ఇ.డి. 3595. వంశ పారంపర్యంగా వీరు వేటాడుతూ, చేపలు పడ్తూ నివసిస్తుండే వారు. కాని ఎక్కువగా వ్యవసాయాన్ని వృత్తిగా చేసుకున్నారు అని వీరిని మద్రాస్ సెన్సస్ 1891 పేర్కొంది. దక్కన్ ప్రాంతంలో వీరిని బెస్తలు, కబ్బెరలు అని; కోయంబత్తూరు, సేలం జిల్లాల్లో తొరెయర్, సివియర్ అని పిలుస్తారు. బెస్త అనే పదానికి అర్థం కన్పించదు. వీరు సూతకులస్థుల మని చెప్పుకుంటారు. సూతమహర్షి వీరి మూల పురుషుడని చెప్తారు. సి.టి.యస్.ఐ I.

## బే

బేగారి

వృత్తిసూచి (తె.స.).

<బేగరి : సేవకుడు. జాటసారుల

మూటలు మోసే మాదిగవాడని మూం. వృ.ప. : <బేగరి. గుర్రపువాడు, సాది.

బేతంసెట్టి

వ్యక్తినామం (స.).

బేతం– గృ. నా. పూ; వ్య. నా. <బేతము. <బేతి + అము. వి. చూ. బేతినేని. చూ. –సెట్టి గృ.నా.ప.

బేతిన

చూ. బేతిని

వ్యక్తినామం (స.).

కమ్మవారిలో ఇంటిపేరు.

బేతిని

చూ. బేతిన

వ్యక్తినామం (స.).

బేతి– గృ.నా.పూ; వ్య. నా. భేతాళకు సంక్షేపరూపం. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. –ని గృ.నా.ప.

బేపారపు

చూ. వ్యాపారపు

వృత్తిసూచి (రా.).

వ్యాపారవృత్తి

బేరిసెట్టి

వ్యక్తినామం (స.).

బేరి– గృ.నా.పూ; <బేహారి.

చూ. –సెట్టి గృ.నా.ప

## బై

బైగారి

వ్యక్తినామం (తె.).

బై– గృ.నా.పూ; <బాచ– వి. చూ. బాచిరాజు చూ. –గారి గృ.నా.ప.

బైచరాజు

చూ. బాచరాజు

వ్యక్తినామం (శా సా.).

"––బైచరాజ తిమ్మయ దేవ మహారాజ––" ఎ.సి. 27–6–1491 (ఇ.టి.ఐ II; పు.191; నెం.94). "––కరణం బైచరాజు నాగరాజు––" (టి.యం.పి.II; పు. 798; నెం. 425).

బైటీని

వ్యక్తినామం (స.).

<బైటినేవి. బైటి–గృ.నా.పూ; వ్య.నా. <క.బిట్ట; ప్రా. విట్ఠ–; సం. విష్ణ– కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. –ని గృ.నా.ప.

బైండ్ల

తెగసూచి (తె.).

<బవనీల. యాచకులలో ఒక తెగ. గ్రామదేవతల కొలుపులు కొలవడానికి; కత్తెర, స్ఫోటకం మొదలైన రోగాలు కుదిర్చే మాంత్రికులుగా ప్రసిద్ధిపొందారు. వీరు వాయించే వాద్యం వలన బైండ్ల వారనే పేరు వచ్చింది. వీరి వాద్యాన్ని బవనిక అంటారు. బవనికలు వాయించే వారు కాబట్టే బవనీలు లేక బైండ్లవారు అయ్యారు. ఈ బవనికలను కృష్ణ, గుంటూరు ప్రాంతాల్లో జముకులంటారు,

బైరపనేని

వ్యక్తినామం (స.).

భైరవ- గృ. నా. పూ; వ్య. నా. <భైగప్ప <భైరవప్ప<సం. భైరవ- రుద్రానుచరుడు. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. -నేని గృ.నా.ప.

బైరెడ్డి

వ్యక్తినామం (రా.స.).

బై- గృ.నా.పూ; ?<బైర. వి. చూ. బైరపనేని. చూ. -రెడ్డి గృ.నా.ప.

బైరు

పౌరుషనామం (సా.).

వాద్యసూచి "-.శరధి గభీరు బైరు పెదజంగన్నృపాలుని--" (సత్య. Tel. Ma. పు. 81). "--హరికథాపారాయణ బైరునారాయణ--" (పైడి. అశ్వా. గ; పు. 81).

బైర్రాజు

వ్యక్తినామం (స.)

బైర- గృ.నా.పూ; వ్య. నా. దేవతా సూచి. <బైర. వి. చూ. బైరపనేని. ఆర్వేలనియోగ బ్రాహ్మణులలో ఇంటి పేరు. చూ. -రాజు గృ.నా.ప.

## బొ

బొక్కసం

వృత్తిసూచి (శా.స.).

ఖజానా ఉద్యోగం. <బొక్కసము. భాండాగారం, కోశం, "--బొక్కసం పెదపనాయుడు--" శా. 1451 (టి. యం. పి. II; పు. 966; నెం 549). "--బొక్కసం ఎల్లమ్మ--" శా.1483 (టి.యం.పి. II; పు. 309; నెం.368).

బొక్కా

పౌరుషనామం (స.).

<సం. భూకమ్ : బిలం, కన్నం, గొయ్యి. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

బొక్కోళ్ళ

పౌరుషనామం (తె.

బొక్క- గృ.నా.పూ; వి.చూ. బొక్కా. చూ. -ఓళ్ళ గృ.నా.ప.

బొజ్జ

రూ. బొజ్జా

అవయవసూచి (తె.).

ఉదరం, పొట్ట. క. బొజ్జె, బొజ్జు; త. పొచ్చయ్; తె. బొజ్జ, బొట్ట డి.ఇ.డి. 3665. పూర్వకాలం బౌద్ధారామాలకు దగ్గరగా వుండే గ్రామాల్లో వుంటున్న బౌద్ధేతరులు కూడ బొజ్జన్న, బొజ్జమ్మ అని పేర్లు పెట్టుకున్నారు. బొజ్జ అనేది బౌద్ధకు తద్భవమని పండి. చూ.పు.332.

బొజ్జా

చూ. బొజ్జ

అవయవసూచి (తె.రా.స.).

కమ్మవారిలో ఇంటిపేరు.

బొడ్డు

అవయవసూచి (తె.స.సా.).

నాభి. త. పొక్కుళ్; మ. పొక్కిళ్, పొక్కుళ్; తొ. పికు; క. పొక్కుళ్; కొడ పొక్కి: తు. పువళు. డి.ఇ.డి. 3652. కమ్మవారిలో, బ్రాహ్మణులలో ఇంటిపేరు. "__సేవావిశేషమ్ములఁ జెలగువారలు బొడ్డు కులమువారు__" (కన్యకా. పు.4).
"బొడ్డింటి పేరివంశము దొడ్డది__" (నాకథ. పు. 8).

బొడ్డుమేకల
జంతుసూచి (రా).
బొడ్డుమేక బహు. కు ద్వి.వి.

బొడ్డురాతి
దేవతాసూచి (తె.).
బొడ్డురాయికి ఔప.
కోటగుమ్మం నడిమిరాయి. ప్రతి గ్రామానికీ మధ్యలో వేసి గ్రామ దేవతగా కొలుస్తారు.

బొండా
పౌరుషనామం (స.).
<బొండ : తప్పుచేసినవారి చేతులకు, కాళ్ళకు వేసే దారు యంత్ర విశేషం. దీనినే బండ కొయ్య, బొండమాను అంటారు.

బొండి
?<బొండా.
పౌరుషనామం (శా.).
వి. చూ. బొండా.

?<బోండు : గ్రామాధికారి. బోయ నీడుకు రూపాంతరం. "__బొండి లీలా శాహి__" శా.1193 (టి. యం. పి; పు.605; నెం. 388).

బొద్దన
వ్యక్తినామం (శా.).
బొద్ద_ గృ.నా.పూ. <సం. బోధన_
"__బొద్దన నారాయణ దేవని__" (యస్.ఐ.ఐ. IV; నెం 753; పు.246).

బొద్దు
పౌరుషనామం (తె.).
గోడలు మొదలైన వాటి అంచులకు ఏర్పాటుచేసేది. <స. బద్ధ_

బొద్దుబోయిన
వ్యక్తినామం (స.).
బొద్దు_ గృ.నా పూ; వి.చూ. బొద్దవ
చూ. _బోయిన గృ.నా.ప.

బొనినేని
చూ. బొల్లినేని
వ్యక్తినామం (స.).

బొంతగర్ల
జంతుసూచి (స.).
బొంత_ గృ.నా.పూ వి.చూ.బొంతల.
చూ. _గర్ల గృ.నా.ప.

బొంతల
పౌరుషనామం (తె.రా శా.స).
బొంత బహు. ల ద్వి.వి. పరుపుగా

ఉపయోగించడానికి దూది లేక వస్త్రాలు మొదలైన వాటిచేత దట్టంగా కుట్టిన గంత. "—కౌండిన్యగోత్రులైన బొంతల వితల—" శా. 1184 (తెలం. శా. I; పు.60; పం.19–20).

బొప్పన

చూ. బొప్పని

వ్యక్తినామం (రా.).

కమ్మవారిలో ఇంటిపేరు.

బొప్పని

రూ. బొప్పన, బొప్పన్న.

వ్యక్తినామం (స.).

బొప్ప– గృ.నా.పూ; వ్య.నా. <బొప్ప నేని. వి.చూ. బొప్పరాజు. కమ్మవారిలో ఇంటిపేరు. చూ. –ని గృ.నా.ప.

బొప్పన్న

చూ. బొప్పని

వ్యక్తినామం (రా.).

కమ్మవారిలో ఇంటిపేరు.

బొప్పరాజు

వ్యక్తినామం (శా.).

బొప్ప– గృ.నా.పూ; వ్య.నా. తండ్రి. క.బొప్ప మరాఠీలో కూడా 'బొప్ప' అనే వ్యవహారం. "—బొప్పరాజు వెంకట నరసింహ రాజు—" (టి. యం పి. పు. 609: నెం. 294).

బొప్పాయి

వృక్షసూచి (రా.).

వృ.నా : Carica Pappaya.

బొప్పాయిచెట్టు.

బొబ్బర

ధాన్యసూచి (తె.).

సస్యవిశేషం. నల్ల అలసందలు.

బొబ్బా

పౌరుషనామం (తె.రా.స.).

<బొబ్బ : పెద్దఅరుపు; సింహనాదం. ఉత్తర సర్కారులో తాగేనీటికి 'బొబ్బ' అని వాడుక. కమ్మవారిలో ఇంటిపేరు.

బొమ్మ

రూ. బొమ్మల

పౌరుషనామం (శా.స.).

ప్రతిమ, బిరుద చిహ్నం

?<బ్రహ్మ.

"—బొమ్మ చరణరెడ్డి—బొమ్మ పెద అయ్యలరెడ్డి—"(టి యం.పి; పు.574; నెం. 6).

బొమ్మన

వ్యక్తినామం (తె.).

బొమ్మ– గృ.నా.పూ; పు.నా. దేవతా సూచి. <సం. బ్రహ్మ. బ్రహ్మదేవుడు. ప్రజలను వృద్ధిపొందించేవాడు.

చూ. –న గృ.నా.ప.

బొమ్మనబోయిన

వ్యక్తినామం (స.).

బొమ్మన– గృ.నా.పూ; పు. నా. దేవతాసూచి. వి. చూ. బొమ్మన.

చూ. _బోయిన గృ.నా.ప.

బొమ్మరాజు

వ్యక్తినామం (తె.).

బొమ్మ– గృ.నా.పూ, వ్య.నా. దేవతా సూచి. వి. చూ. బొమ్మన. ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.

చూ. _రాజు గృ.నా.ప

బొమ్మల

చూ. బొమ్మ

పౌరుషనామం (రా.).

బొమ్మ బహు. కు ద్వి. వి. హరిజనులలో ఇంటిపేరు.

బొమ్మలాట

వృత్తిసూచి (రా.శా.సా.),

తోలుబొమ్మలాట వారి వృత్తి.

త.పొమ్మయ్, పొమ్మల్; మ.బొమ్మ; తు.బొమ్బె; తె.బొమ్మ; కోలా. బొమ్మ. డి.ఇ.డి. 3699.

"__బొమలాట వీరప్ప__" (టి.యం. పి; II; పు.1155; నెం. 798.).

"__విస్సాణిధి బొమ్మలాటవిరూ పాధిపు కాళని__" (ఆం.క.త.IX; పు.245).

బొమ్మసాని

వ్యక్తినామం (తె.).

బొమ్మ– గృ.నా.పూ; వి.చూ. బొమ్మ రాజు. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. _సాని గృ.నా.ప.

బొమ్మసెట్టి

వ్యక్తినామం (స.).

బొమ్మ– గృ.నా.పూ; వి.చూ. బొమ్మ రాజు.

బొమ్మారెడ్డి

వ్యక్తినామం (తె.స.).

బొమ్మా– గృ.నా.పూ; బొమ్మ+అ. వి.చూ. బొమ్మరాజు.

చూ. _రెడ్డి గృ.నా.ప.

బొమ్మిడాల

జలచరసూచి (తె.స.).

?<బొమ్మిడాయ బహు. కు. ద్వి.వి. మత్స్యవిశేషం.

?<గ్రామనామం.

?<ధాన్యసూచి.

బొమ్మినేని

వ్యక్తినామం (స.).

బొమ్మి– గృ.నా.పూ; <బొమ్మ+ఇ. దేవతాసూచి. వి.చూ. బొమ్మరాజు. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. _నేని గృ.నా.ప.

బొమ్మిసెట్టి

వ్యక్తినామం (స.).

బొమ్మి– గృ.నా.పూ; వి.చూ. బొమ్మ రాజు. చూ. _సెట్టి గృ.నా.ప.

బొలినేని

చూ బొల్లినేని

వ్యక్తినామం (రా.).

బొల్లపునేని
వ్యక్తినామం (తె.).
బొల్లపు- గృ.నా.పూ; <బొల్లప. బొల్లి + అప్ప. వి.చూ. బొల్లినేని.
చూ. బొల్లయ. వ్య.నా.
చూ. -నేని గృ.నా.ప.

బొల్లిన
చూ. బొల్లినేని
వ్యక్తినామం (స.).
కమ్మవారిలో ఇంటిపేరు.

బొల్లిని
చూ. బొల్లినేని
వ్యక్తినామం (స.).
కమ్మవారిలో ఇంటిపేరు.

బొల్లినేని
రూ. బొనినేని, బొలినేని, బొల్లిన, బొల్లిని.
బొల్లి- గృ.నాపూ; దే. వర్ణసూచి. తెల్లని రంగు. కమ్మవారిలో ఇంటిపేరు. ?<బుల్లి. చూ. -నేని గృ.నా.ప.

బొల్లిసెట్టి
వ్యక్తినామం (స.).
బొల్లి- గృ.నా.పూ; వి.చూ. బొల్లినేని.
చూ. -సెట్టి గృ.నా.ప.

బొల్లోజి
వ్యక్తినామం (తె.).
బొల్లి-గృ.నా.పూ; వి.చూ. బొల్లినేని.
చూ. -ఓజి గృ.నా.ప.

## బో

బోగి
పౌరుషనామం (తె.రా.).
<సం. భోగి- భోగంకలవాడు, భోగం కలది, సుఖం. ?<భోగి : సంక్రాంతి పండుగకు ముందురోజు. కాపులలో ఇంటిపేరు.

బోగినేని
వ్యక్తినామం (తె.).
భోగి- గృ.నా.పూ; <భోగ. వి.చూ. భోగపతి. కమ్మవారిలో ఇంటిపేరు.
చూ. -నేని గృ.నా.ప.

బోడ
రూ. బోడా, బోడి
పౌరుషనామం (తె.).
సన్యాసి, ముండితుడు; బోడివాడు.

బోడా
చూ. బోడ.
పౌరుషనామం (స ).

బోడి
చూ. బోడ
పౌరుషనామం (రా.స.).
కమ్మవారిలో, మాధ్వులలో గృహనామం.

బోనము
రూ. బోనాం.
పౌరుషనామం (స.).

< ప్రా. భోజం < సం. భోజన- భోజనం. గ్రామదేవతలకు నైవేద్యంగా పెట్టేవంటకం, నిండుకుండ భోజనం.

బోనాం

చూ. బోనము

పౌరుషనామం (న.).

బోయ

కులసూచి (తె.రా.న.).

బోయజాతివారు. బోయడు, బోయ- బోయాడు అని ఈ పదం వ్యవహారంలో వుంది. క. బోయ, బోవ; తె. బోయ, బోయడు, బోయవాడు; మ. బోయ్; తు. బోయ, బోవి. డి.ఇ.డి. 3750.

బోయని

పౌరుషనామం (తె.).

< బోయడు. వ్యక్తినామానుబంధం. వి.చూ. బోయిన.

బోయిన

పౌరుషనామం (తె.న.).

వ్యక్తినామానుబంధంగా కూడా వుంది. వి.చూ. బోయిన గృ.నా.ప.

బోయిండ్ల

వృత్తిసూచి (తె.).

? గ్రామోద్యోగం. < ప్రా. భోయ-, భోయగ- < సం. భోజక- : గ్రామాధికారి, గ్రామపెద్ద.

"A village officer enjoying parts and sometimes whole of the revenue collected from an endowed village, a man in a post comparable to that of an agraharika or a Karanam. Surya Rayandhra Nighantu gives the meaning 'a Brahmin' and states that in this meaning the word occurs in the inscri. dialect only until the end of the 14th C. The word occurs in the inscriptional dialect as the title of a village headman who enjoys, beside collecting, the land revenue. The earliest known occurance of the word is during the 4th C. A D. In most cases the word follows a place name of which the person in question is the headman as an irralur bōya. But in a few cases even during the 7th C. it appears to follow the name of a person who is a bōya, as in marāta bol. After 9th C. it occurs more frequently following personal names. A variant of Bōyandu. Bōndu. Boyaundu etc S. Pratapa Reddy Connects

thiswith Tel. Boyi, etc. Palanquin bearer, servant boy etc.
శా.శ.

బోలా ప్రగడ
చూ. పోలా ప్రగడ
వ్యక్తినామం (స.).
ఆర్వేలనియోగ బ్రాహ్మణులలో ఇంటి పేరు.

బోల్ల
చూ. బోళ్ళ
వృత్తిసూచి (స.).

బోళ్ళ
చూ. బోల్ల
వృత్తిసూచి (స.).
< బోఖ. బోయకు బహువచన రూపమైన గౌరవపదం. శా.శ. హక్కుభుక్తాలు గల ఆసామి. వి. చూ. బోయిండ్ల. కమ్మవారిలో ఇంటిపేరు.

## బ్ర

బ్రహ్మజోస్యుల
వ్యక్తినామం (స.).
బ్రహ్మ- .గృ.నా.పూ; సం. పు. నా; దేవతాసూచి. బ్రహ్మ, విష్ణువు. బ్రాహ్మణులలో ఇంటిపేరు.
చూ. -జోస్యుల గృ.నా.ప.

బ్రహ్మభొట్ల
వ్యక్తినామం (స.).
బ్రహ్మ- గృ. నా. పూ; దేవతాసూచి. వి.చూ. బ్రహ్మజోస్యుల.
చూ. -భొట్ల గృ.నా.ప.

బ్రహ్మసాని
వ్యక్తినామం (స.).
బ్రహ్మ- గృ. నా. పూ; దేవతాసూచి. వి.చూ. బ్రహ్మజోస్యుల.
చూ. -సాని గృ.నా.ప.

బ్రహ్మసెట్టి
వ్యక్తినామం (స.).
బ్రహ్మ- గృ. నా. పూ; దేవతాసూచి. వి.చూ. బ్రహ్మజోస్యుల.
చూ. -సెట్టి గృ.నా.ప.

బ్రహ్మాండంబొక్కా
పౌరుషనామం (స.).
బొక్కావారు బ్రహ్మాండం వారుగా ఇంటిపేరు మార్చుకోవాలని అనుకున్నారట. బొక్కావారు అలా మార్చుకోడానికి వీల్లేదని బ్రహ్మాండం ఇంటిపేరు గలవారు కోర్టువారికి అర్జీపెట్టారట. అందుకని బ్రహ్మాండం బొక్కావారుగా పెట్టుకున్నారని దొణప్పగారు చెప్పారు.

## భ

భట్టా
పౌరుషనామం (సా.).
< భట్టుడు; భట్టువాడు. "విద్వాంస కవయోభట్టాః" అభినవదర్పణం. బ్రాహ్మణులలో ఇంటిపేరు. "—భట్టావంశ

సంభవుండును__" (భృగుసం. ఆశ్వా. 
గ: పు. 137).

భట్రాజు

వృత్తిసూచి (రా.స.).

వందిప్రవృత్తి. స్తుతిచేసి జీవించేవాడు. సభాసప్తాంగాలలో ఒకడు. ఆర్వేలనియోగులలో ఇంటిపేరు.

"The Bhāts, Bhatrājus are described, in the Mysore Censes 1891 and 1901 as musicians and ballad_reciters, who speak telugu, and are supposed to have come from the Northern circars. Thay are attached to the courts as proffessionals, reciting ballāds in glorification of the wondorous deeds of local princess and Heroes. C.T.S I. I.

భారతదేశం అంతా వ్యాపించివున్న ఈ కులంవారు వైశ్యయువకునికి, క్షత్రియ స్త్రీకి జన్మించారట. కాబట్టే వీరిని 'రాజు' అని పిలుస్తారు. భట్టుమూర్తి ఈ కులం వాడంటారు. వీరి బిరుదనామం అయిన భట్టుకు రాజుగానీ, మూర్తిగానీ చేర్చుతారు.

భండారం

చూ. భండరువు

వృత్తిసూచి (శా.స.).

బండరము, బొక్కసం. "__భండారం చవునాయనింగారు__" శా. 1239 (టి. యం. పి. I: పు 650: నెం. 638 ). "__భండారం తిమ్మప్పన్__" 14_3_1532 (టి. టి. పి. ఇ.యస్. IV; పు. 28; నెం. 13).

భండారి

చూ. భండారువు.

వృత్తిసూచి (శా.).

"__భండారి కామిసెట్టి__" (టి యం. పి. II; పు. 1087; నెం. 309 ). "__భండారి ఎఱపోతు___" (యస్. ఐ.ఐ. V; పు. 71; పం. 7). భండారి ముప్పినాయకుడు వెలనాటి కులోత్తుంగ రెండవ రాజేంద్ర చోడరాజ దగ్గర భండారిగా వుండడంవలన అతనికి ఈ గృహనామం వచ్చింది. దాక్షారామ భీమేశునికి శా. 1087లో అఖండ దీప దాన శాసనం రాయించాడు.

భండారువు

రూ. బండాగార, బండారపు, బండారి, బండారు, భండారం, భండారి.

వృత్తిసూచి (శా.).

ఖజానాఉద్యోగం, దేవాలయ అర్చక వృత్తి. < ప్రా. భాండాఆర_, బాండారు; సం. భాండాగార_. "ఉపహారానకు భండారువు పొంన్నయంగారు__" (తెలం. శా. I, పు. 84; పం. 5_6).

భద్రిరాజు

రూ. బద్రిరాజు

వ్యక్తినామం (స.).

భద్రి- గృ.నా.పూ; పు నా. దేవతా సూచి. <సం. భద్ర- భద్రుడు, వీర భద్రుడు, శివుడు. ఆర్వేల నియోగ బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. -రాజు గృ.నా.ప.

భయక్కార

రూ. బయకారపు

పౌరుషనామం (శా.).

<భయకార : సంగీతవిద్వాంసుడు. భోగం మేళం వెనుక శబ్దాలను చేయు వాడు. ఆం.వా. బయకాడు : గాయకుడు, గానవిద్యోపాధ్యాయుడు. ''—భయక్కార రామప్పయ్యార్—'' శా. 1466. టి టి. డి. ఇ. యస్. V; పు. 49. నెం. 17). ఇతడు అచ్యుతరాయలు, సదాశివరాయల వద్ద ఒక మంత్రిగా వున్నారు.

భరతము

పౌరుషనామం (పా.).

సంగీత నాట్యాలలో నైపుణ్యం కల వారు. ''—ఈ భరతము వీర రాఘవయ్య—'' (తాశ. Tel Ma.పు 303).

భవనం

గృహసూచి (స.).

<భవనము : ఇల్లు. ఇది కృతిమ వ్యుత్పత్తి. <ప్రా. భోణం <సం. భోజనం : గ్రామదేవతలకు బోనాలెత్తే హక్కుగల మోతుబరి రైతుల ఇంటి పేరు 'బోనం' వారు. దీనిని భవనంగా మార్చింది పండితులు. చూ. తూ. దా. గారి అముద్రిత వ్యాసం.

భవానీభట్ల

వ్యక్తినామం (తె.రా.).

భవానీ- గృ.నా.పూ; సం. స్త్రీదేవతా సూచి. పార్వతీదేవి. బ్రాహ్మణులలో ఇంటిపేరు. చూ. -భట్ల గృ.నా.ప.

## భా

భాగవతుల

పౌరుషనామం (తె.శా.స.పా.).

భాగవత గ్రంధాన్ని చదివి విన్పించే వారు. బ్రాహ్మణులలో ఇంటిపేరు. ?<తెలుగు దేశంలోని నటులకు వారు తయారుచేసే భాగవతకథల వలన భాగవతుల అనేపేరు వచ్చిందని సి. టి. యస్. ఐ. I. ?<భాగవత బ్రాహ్మణులు. ద్రావిడ బ్రాహ్మణులలో ఒకతెగ. ''—భాగవతుల చాయప్ప—''

శా. 1489 ( టి. యం. పి. పు. 23; నెం.146).''—శ్రీ భాగవతుల వంశాబ్ది చంద్రుడై జనించె—.''(శృం.సం.పు.4).

భారతం

పౌరుషనామం (తె.రా.స.).

పంచమ వేదమైన మహాభారతాన్ని చదివి అర్థంచెప్పేవారు. ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.

భావనేని

రూ. భావినేని

వ్యక్తినామం (స.).

భావ– గృ.నా.పూ; పు నా. దేవతాసూచి. < భావన. భావనారాయణ. కమ్మవారిలో ఇంటిపేరు. చూ. –నేని గృ.నా.ప.

భావినేని

చూ. భావనేని

వ్యక్తినామం (స.).

కమ్మవారిలో ఇంటిపేరు.

భాష్యం

పౌరుషనామం (రా.స.).

< సం. భాష్య– సూత్ర వ్యాఖ్యాన గ్రంథం. కమ్మవారిలో, కాపులలో, బ్రాహ్మణులలో ఇంటిపేరు

భాస్కరభట్ల

వ్యక్తినామం (తె.).

భాస్కర– గృ.నా.పూ; దేవతాసూచి. < సం. భాస్కర– భాస్కరుడు, సూర్యుడు. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. –భట్ల గృ.నా.ప.

భి

భిక్షాపతి

వ్యక్తినామం (తె.).

భిక్ష– గృ.నా.పూ; < సం. భిక్ష– వి.చూ. భిక్షావృత్తి. చూ. –పతి గృ.నా.ప.

భిక్షావృత్తి

పౌరుషనామం (శా.).

< భిక్ష. కొలువు, సేవ. సేవచేయడమే వృత్తిగా కలవారు. "–భిక్షావృత్తి అయ్యవారు––"(టి.యం.పి; I; పు.649; నెం. 834).

భీ

భీమన

చూ. భీమనేని

వ్యక్తినామం (స.).

కమ్మవారిలో ఇంటిపేరు.

భీమనాథుని

రూ. భీమానాథుని

వ్యక్తినామం (స.).

భీమ– గృ.నా.పూ; దేవతాసూచి. వి.చూ. భీమనేని.

చూ. –నాథుని గృ.నా.ప.

భీమనేని

రూ. భీమన, భీమిడి, భీమినేని.

వ్యక్తినామం (రా.స.).

భీమ– గృ.నా.పూ; పు.నా; దేవతాసూచి < భీమేశుడు. కమ్మవారిలో ఇంటిపేరు. చూ. –నేని గృ.నా.ప.

భీమరాజు

వ్యక్తినామం (తె.).

భీమ– గృ.నా.పూ; పు.నా. వి.చూ. భీమనేని. ఆర్వేల నియోగులలో ఇంటిపేరు. చూ. –రాజు గృ.నా.ప.

భీమానాథుని

చూ. భీమనాథుని

వ్యక్తినామం (స.).

భీమిడి

చూ. భీమనేని

వ్యక్తినామం (తె.).

భీమినేని

చూ. భీమనేని

వ్యక్తినామం (రా.).

భీమిరెడ్డి

వ్యక్తినామం (రా.స.).

భీమి_ గృ.నా.పూ; భీమ+ఇ. వి.చూ. భీమనేని. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. _రెడ్డి గృ.నా.ప.

## భూ

భూతనాథ

వ్యక్తినామం (శా.).

భూతాలకు అధిపతి. శివుడు. భూత_ గృ.నా.పూ; వి.చూ. భూతాల.

చూ. _నాథ గృ.నా.ప.

"__భూతనాథ రామభట్లు__" శా.1458 (టి.యం.పి.II; పు.929; నెం.242).

"__భూతనాథ శిష్టాభట్టర్__" 18_2_1532 ఎ.డి. (టి.యం.పి. IV; పు. 39; నెం. 18 .

భూతాల

పౌరు.నామం (రా.).

భూతం_ బహు.కు ద్వి.వి. <భూతము. పృథివి మొదలైన పంచభూతాలు; పిశాచాలు. కాపు, రెడ్లలో ఇంటిపేరు.

భూపతిరాజు

వ్యక్తినామం (తె.).

భూపతి_ గృ.నా.పూ; భూమికి అధిపతి. రాజు. ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.

చూ. _రాజు గృ.నా.ప.

భూమసాని

వ్యక్తినామం (రా.).

భూమ_ గృ.నా.పూ: వ్య. నా. <భూమయ. చూ. _సాని గృ.నా.ప.

## భే

భేతనభట్ల

వ్యక్తినామం (స.).

భేతన_ గృ.నా.పూ; భేత + అన్న <భేతన. వి.చూ. బేతిని. వెలనాటి వైదిక బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. _భట్ల గృ.నా.ప.

## భై

భైరవభట్ల

రూ. భైరవభొట్ల

వ్యక్తినామం (తె.).

భైరవ_ గృ.నా.పూ; పు.నా. దేవతాసూచి. <సం. భైరవ. శివుడు. బ్రాహ్మణులలో ఇంటిపేరు,

చూ. _భట్ల గృ.నా.ప.

భైరవభొట్ల

చూ. భైరవభట్ల

వ్యక్తినామం (స.).

ఆదిశైవులలో ఇంటిపేరు.

భైరెడ్డి
వ్యక్తినామం (స.).
భై – గృ.నా.పూ; పు.నా. దేవతాసూచి.
<భైరవ. వి.చూ. భైరవభట్ల
చూ. –రెడ్డి గృ.నా.వ.

## భ్లొ

భ్లొట్ల
వృత్తిసూచి (స.).
<భట్టు బహు. తు ద్వి.వి. కొన్ని ఇంటిపేర్లలో ఉత్తర భాగంగానూ ప్రవర్తిస్తుంది.

## భో

భోగపతి
రూ. భోపతి
వ్యక్తినామం (తె.).
భోగ– గృ.నా.పూ; <భోగము : సుఖం, సంతోషం. కమ్మవారిలో ఇంటి పేరు. <కాపరి, రక్షకుడని శా.శ.
చూ. –పతి గృ.నా.వ.

భోగరాజు
వ్యక్తినామం (తె.స.).
భోగ– గృ.నా.పూ; వి.చూ. భోగపతి. ఆర్వేలనియోగ బ్రాహ్మణులలో ఇంటి పేరు. చూ. –రాజు గృ.నా.వ.

భోగినేని
వ్యక్తినామం (స.).
భోగి– గృ.నా.పూ; భోగ+ఇ. రాజు; భోగ– వి.చూ. భోగపతి. కమ్మవారిలో ఇంటిపేరు. చూ. –నేని గృ.నా.వ.

భోగిరెడ్డి
వ్యక్తినామం (స.).
భోగి– గృ.నా.పూ; వి.చూ. భోగినేని. కమ్మవారిలో ఇంటిపేరు.
చూ. –రెడ్డి గృ.నా.వ.

భోపతి
చూ. భోగపతి
వ్యక్తినామం (తె.స.).

భోసల
పౌరుషనామం (సా.).
<మరాఠీభోంసలె "–భోసలాబ్ధి సుధాంశుడుత్తముడు–" పీతిప. (Tel. Ma. పు. 158). "–చోళసింహాసనాధ్యక్ష భోసల పతాపసింహరాజ–" (పారిజా. Tel.M. పు. 224).

## మ

మక్కల
?<మక్కలు
ధాన్యసూచి (తె.).
మొక్కజొన్నలు.

మంకోజు
వ్యక్తినామం (తె.).
మంకు– గృ.నా.పూ; దే. మొండి, మూర్ఖుడు. ?<మంకెన
చూ. –ఓజు గృ.నా.వ.

**మంగడ్ల**

చూ. మంగలి.

కులసూచి (శా.).

మంగలి బహు. కు ద్వి. వి.

"—మంగడ్ల కొమ్మన కొలచిపెట్టి—" 742—79 ఎ.డి. (ఇ. టి. ఐ; పు. 38; నెం. 54).

**మంగలి**

చూ. మంగడ్ల

కులసూచి తె.రా.స).

మంగలవాడు. ఇది వృత్తి నిబట్టి ఏరడ్పిన కులం. మంగలం అనే పదానికి శుభకరం, శుభ్రం అని అర్థం. శుభ కార్యాలకు వీరువచ్చి వారి నాగస్వరంతో ఆనందింపజేస్తారు గనుక, గడ్డంచేసి మనుష్యుల శరీరాన్ని శుభ్రం చేస్తారు గనుక ఈ పదాన్ని మంగళ్ళకు ఉపయోగిస్తారు. వైష్ణవులు వీరివి భజంత్రీలనీ, కల్యాణ కులమని పిలుస్తారు. వీరిని అంగారకులంటారు. అంగారము అంటే బొగ్గు, నిప్పు. అంగారకుడు ఒకగ్రహం. మంగళ వారాన్ని అంగారక వారం అంటారు. సంస్కృత మంగళ శబ్దానికి సంతోషమని అర్థం. ఈ పదానికి 'ఇ' చేర్చి మంగలి చేశారు. అంగారకగ్రహం చెడ్డది కనుకనే మంగళవారాన్ని చెడ్డ రోజుగా భావిస్తారు. అందుకే మంగలిని కూడా అశుభ శకునంగా భావిస్తారు. మరణాలు సంభవించినపుడు జుట్టు తీయడానికి వస్తారు కనుక అశుభమని ఊహ. పవిత్రమైన రోజున ఈతనిని మంగలి అని పిలవకుండా భజంత్రీలనే పిలవాలట. సుబ్బిగాడు, రామిగాడు అని వ్యక్తి నామాల చివర —అన్న, —గాడు అను బంధంగా చేర్చుకుంటారు.

**మంగినేని**

వ్యక్తినామం (స.).

మంగి— గృ.నా.పూ; స్త్రీ. నా; దేవతా సూచి. <సం. మంగళా : పార్వతి. ?<మంగ— 12, 13 సంవత్సరాల మధ్య వయసున్న పిల్ల; త. మంగ, మంగై : తల్లి. డి. ఇ. డి. 3776. వ్యా. నా. చూ. మంగమ్మ, మంగతాయారు.

చూ —నేని గృ.నా ప.

**మంగుదొడ్డి**

పౌరుషనామం (రా.).

మఱుగుదొడ్డి, పొందుదొడ్డి. మంగు— మాలిన్యం. హరిజనులలో ఇంటిపేరు.

**మజ్జిగ**

ఆహారపదార్థసూచి (రా.).

ప్రా. మజ్జిగా <సం. మార్జికా : చల్ల. బోయలలో ఇంటిపేరు. త. మచ్చికై; క. మజ్జిగె: కొ. మజ్జ్; తొ. మొజ్. డి.ఇ డి. 3781.

**మంచ**

చూ. మంచాల

పౌరుషనామం (తె.).

<మంచె : జొన్న మొదలైన పైరున్న చేలలో ఎత్తుగా కూర్చొని పక్షులు వాల కుండా కాపలాకాయడానికి వేసుకునే పందిరి.

మంచల

చూ. మంచ

పౌరుషనామం (స.).

మంచ బహు. కు ద్వి.వి.

మంచికాళ్ళు

అస్పష్టనామబంధం (శా.).

"స్వస్తి [1] పొలమెయపట్టోడి మంచి కాళు కొడ్డపకు. (తె.శా: శా. నెం. 9, పు. 44).

మంచినీళ్ళ

జలసూచి (స.).

<మంచినీరు. తాగడానికి ఉపయోగించే నీరు. కమ్మవారిలో ఇంటిపేరు.

మంచినేని

వ్యక్తినామం (స.).

మంచి– గృ.నా.పూ; వి. చూ. మంచి భట్ల. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. –నేని గృ.నా.ప.

మంచిభట్ల

వ్యక్తినామం (తె.).

మంచి– గృ. నా. పూ; వ్య. నా; <మంచయ. కాసలనాటి బ్రాహ్మణులలో ఇంటిపేరు. చూ. –భట్ల గృ.నా.ప.

56)

మంచిరాజు

వ్యక్తినామం (స.).

మంచి– గృ.నా.పూ; వి. చూ. భ. ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.

చూ. –రాజు గృ.నా.ప.

మఠం

నివాసస్థలసూచి (రా.).

<మఠము <మఠము. పరదేశులు, సన్యాసులు మొదలైనవారు నివసించే గృహం.

మడక

రూ. మదకల

వృత్తిపరికరసూచి (స.).

<దే. మడక. నాగలి. క. మడికె. డి.ఇ.డి. 3806

మడకల

చూ. మడక

వృత్తిపరికరసూచి (రా.).

మడక బహు. కు ద్వి.వి.

మడియాలు

రూ. మడివాలు

వృత్తిసూచి (సా.).

మడేలు. రజకి. చాకలి. "––బుచ్చి బాచయ్యమడియాలు మాచయ్యశరణు––" (పండి; పు. 243).

మడివాలు

చూ. మడియాలు

వృత్తిసూచి (సా.).
"--మడివాలు మాచయ్య మడుగు వర్చితివా--" (పండి; పు. 208).
"--మాన్యుండు మడివాలు మాచి దేవయ్య--" (పండి; పు. 52).
"--మడివాలు మాచయ్య మందిరంబు నకు--" (పై ది: పు. 59).

**మడుగు**

రూ. మడుగుల
జలసూచి (తె.).
మడుగు, కొలను. పొలంలో తవ్వుకున్న చిన్నగుంట, చిన్నజలాశయం.

**మడుగుల**

చూ. మడుగు.
జలసూచి (తె.).
మడుగు బహు. కు ద్వి.వి.

**మణియం**

రూ. మన్యం
వృత్తిసూచి (రా.సా.).
<మణేగారు. గ్రామాలనుండి రెవిన్యూ ఆదాయాన్ని సేకరించే ఉద్యోగి. త. మణియం; మ. మణియమ్; క. మణియ. Office or duties of the manager of a temple, village head office. D.E D. 3825. "--మణియం శ్రీనివాసుడు గురువు--" (Tel. Ma. నెం. 799; పు. 349).

**మండలనేని**

వ్యక్తినామం (స.).
మండల- గృ. నా. పూ. వ్య.నా; దేవతాసూచి. <సం. మండలి : సూర్యుడు. వి.చూ. మండలి ?<మండలం.
చూ. -నేని గృ. నా.ప.

**మండలం**

దేశభాగసూచి (శా.).
<మండలము. ఒక దేశం; మధ్య ప్రదేశం; సమూహం; శునకం. ?<విలుకాడు రెండు కాళ్లతో మండలాకారంగా నిలవడం. "--మండలం అయ్యంగార్--" శా. 1457 (టి. టి డి. ఇ. యస్ IV; నెం. 70; పు. 137).

**మండలి**

సమూహసూచి (తె.).
సమూహం; మండలేశ్వరుడు; సూర్యుడు.

**మండవ**

చూ. మండువ
గృహనిర్మాణసూచి (స.).
కమ్మవారిలో ఇంటిపేరు.

**మండాబత్తుల**

వ్యక్తినామం (స).
మండా- గృ.నా.పూ; గృ.నా. మండా అన్నదే ఒక ఇంటిపేరు.
చూ. -బత్తుల గృ.నా.ప.

**మండువ**

రూ. మండవ
గృహనిర్మాణసూచి (స.).

< మండువా. నాలుగిళ్ళ భవంతి మధ్య వెలుగు రావడానికి, వాననీరు పడడానికి వీలుగా ఏర్పడిన ఖాళీస్థలాన్ని మండువా లోగిలి అంటారు. 2 < ఒకవైపు గోడ లేని గుర్రాలశాల; పాక.

**మండె**

పౌరుషనామం (స).

పొగాకు మొదలైనవి మగ్గడానికి కుప్ప వేసి మీద కప్పిపెట్టడం. పత్తి, మిర్చి మొదలైనవి ఏవైనా ఒకేచోట పొందిగ్గా కుప్పవేయడం.

**మదమంచి**

వ్యక్తినామం (స.).

మద— గృ. నా. పూ; దేవతాసూచి. < మాధవ. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. —మంచి గృ.నా.ప.

**మదిరాజు**

చూ. మద్దిరాజు

వ్యక్తినామం (స.).

ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.

**మద్దల**

రూ. మద్దెల

వాద్యసూచి (రా. స.).

< ప్రా. మద్దల < సం. మర్దల— మృదంగం. కళావంతులలో, హరిజనులలో ఇంటిపేరు.

**మద్ది**

రూ. మద్దుల

వృక్షసూచి (తె.స.).

ఇంగ్లీ. : Terminalia tomentosa, మద్దిచెట్టు. త. మరుతు, మరుతమ్: మ. మరుతు; క. మత్తి, మద్ది: తు. మత్తి: తె. మద్ది; కు ... మర్రి. డి.ఇ.డి. 3862. మద్దికొళ్ళను అడగానికి ఉపయోగించిన వారని. వెస్తవారిలో ఒక శాఖా భేదమని సి.టి.యస్.ఐ. కమ్మవారిలో, కోమట్లలో, బ్రాహ్మణులలో ఇంటిపేరు.

**మద్దిన**

చూ. మద్దినేని

వ్యక్తినామం (స.).

**మద్దినీడి**

చూ. మద్దినేని

వ్యక్తినామం (రా.స.).

కమ్మవారిలో ఇంటిపేరు.

**మద్దినేడి**

చూ. మద్దినేని

వ్యక్తినామం (స.).

కమ్మవారిలో ఇంటిపేరు.

**మద్దినేని**

రూ. మద్దిన, మద్దినీడి, మద్దినేడి, మద్దిన్న, మద్దిన్ని.

మద్ది— గృ.నా.పూ; వి.చూ. మాదినేని. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. —నేని గృ.నా.ప.

**మద్దిన్న**

చూ. మద్దినేని

సన్మానించి ఇచ్చిన కొంత భూభాగం. కమ్మవారిలో ఇంటిపేరు.

**మన్మధ**
వ్యక్తినామం (స.).
పు.నా; దేవతాసూచి. <సం. మన్మథ. మన్మథుడు.

**మన్యం**
చూ. మణియం
వృత్తిసూచి (రా.).

**మయిలా**
వర్ణసూచి (.స).
నలుపు, చీకటి, మలినం. నల్లని శరీర వర్ణం కలవారు కావచ్చు.

**మరగోని**
వ్యక్తినామం (తె.).
మర + గౌని. మర_ గృ.నా.పూ; ?<మారి_ చూ. _గోని గృ.నా.ప.

**మరాటి**
దేశ లేక భాషాసూచి (తె.స.).
<సం. మహారాష్ట్రి_ మహారాష్ట్రి దేశస్థుడు లేక మరాఠీ భాష మాట్లాడే వాడు.

**మర్రి**
వృక్షసూచి (తె స ).
వటవృక్షం. తె.మఱ్ఱి; కోలా. మర్రి; పర్జి. మర్. డి.ఇ.డి. 3908.
వృ.నా : Ficus bengalensis.
కమ్మ, మాల, ముత్రాస, రెడ్డి కులాలలో ఇంటిపేరు.

**మర్రెడ్డి**
వ్యక్తినామం (తె.స.).
మరి_ గృ.నా.పూ; స్త్రీ. నా; దేవతా సూచి. <మారి. ఒక గ్రామదేవత, మహా లక్ష్మి. చూ. _రెడ్డి గృ.నా.ప.

**మలకల**
పౌరుషనామం (తె.).
మలక బహు. కు ద్వి.వి. చిక్కు, మెలిక, వంకర.
?<మలక : తురుష్కుడు.

**మలసాని**
చూ. మల్లసాని
వ్యక్తినామం (స.).
కమ్మవారిలో ఇంటిపేరు.

**మలసెట్టి**
చూ. మల్లిసెట్టి.
వ్యక్తినామం (స.).

**మలినేని**
చూ. మల్లినేని
వ్యక్తినామం (సా.).
కమ్మవారిలో ఇంటిపేరు.
"__మలినేని యాచమ్మ మముజేర రమ్మ__" (పల్నా. పు.393).

**మలిపెద్ది**
వ్యక్తినామం (స.).

మలి– గృ.నా.పూ; వ్య.నా; దేవతా సూచి. “మల్లికార్జున. వి.చూ. మల్లి గౌని. చూ. –పెద్ది గృ.నా.ప.

**మలిరెడ్డి**

వ్యక్తినామం (స.).

మలి– గృ.నా.పూ. వ్య.నా; దేవతా సూచి. వి.చూ. మల్లిగౌని.

చూ. –రెడ్డి గృ.నా.ప.

**మల్రాజు**

వ్యక్తినామం (స.).

మల్ + రాజు. మల్– గృ.నా.పూ; వి.చూ. మల్లిగౌని. ఆర్వేలనియోగులలో ఇంటిపేరు. చూ. –రాజు గృ.నా.ప.

**మల్లపరాజు**

వ్యక్తినామం (స.).

మల్లప– గృ.నా.పూ: <మల్ల+అప <మల్ల+అప్ప. ఆర్వేల నియోగులలో ఇంటిపేరు. చూ. –రాజు గృ.నా.ప.

**మల్లప్రెగ్గడ**

చూ. మల్లాప్రగడ

వ్యక్తినామం (సా.).

“–మల్ల ప్రెగ్గడ వీరినామాత్య పుత్రి––” (Tel. Ma; ప్రబం. ౨; పు. 49).

**మల్లరసర్**

వ్యక్తినామం (శా.).

మల్ల+అరసర్. మల్ల– గృ.నా.పూ; వ్య.నా. <మల్లయ. “–మల్లరసర్ నాగరసర్ (నాగపండితార్)––” 1538ఎ.డి. (సౌ. టి. ఎ. ఇ. రిప్. IV; పు. 103). చూ. –అరసర్ గృ.నా.ప.

**మల్లసాని**

రూ. మలసాని

వ్యక్తినామం (శా.).

మల్ల– గృ.నా.పూ; వ్య.నా. వి.చూ. మల్లిగౌని. “––మల్లసాని అన్నప––” (టి.యం.పి.II. పు.955; నెం. 467).

చూ. –సాని గృ.నా.ప.

**మల్లా**

వస్తుసూచి (స.).

<మల్ల : మట్టికంచం. సానిక. మ.మల్ల; క. మల్ల; త. మల్లమ్ = a shallow earthen dish. DED 3884.

**మల్లాజోస్యుల**

వ్యక్తినామం (స.).

మల్లా– గృ.నా.పూ; వ్య.నా. మల్ల+అ. వి.చూ. మల్లిగౌని. వెలనాటి వైదిక బ్రాహ్మణులలో ఇంటి పేరు.

చూ. –జోస్యుల గృ.నా.ప.

**మల్లాప్రగడ**

రూ. మల్లప్రెగ్గడ

వ్యక్తినామం (స.).

మల్లా– గృ.నా.పూ; వ్య.నా; వి.చూ. మల్లిగౌని. ఆర్వేల నియోగులలో ఇంటి పేరు. చూ. –ప్రగడ గృ.నా.ప.

**మల్లారెడ్డి**

వ్యక్తినామం (తె.).

మల్లా– గృ.నా.పూ; వ్య.నా; దేవతా సూచి. వి.చూ. మల్లిగౌని.

చూ. –రెడ్డి గృ.నా.ప.

**మల్లావఝుల**

వ్యక్తినామం (తె.).

మల్లా– గృ.నా.పూ; వ్య.నా; దేవతా సూచి. వి.చూ. మల్లిగౌని. బ్రాహ్మణులలో గృహనామం.

చూ. –వఝుల గృ.నా.ప.

**మల్లిక**

పుష్పసూచి (రా.).

<సం.మల్లికా–: మల్లియ, మల్లెతీగ.

వృ.నా : Jasminum sambac.

**మల్లికార్జున**

వ్యక్తినామం (సా.).

వ్య.నా; దేవతాసూచి. <సం. మల్లికార్జున– శ్రీశైలంలోని దేవతామూర్తి. బ్రాహ్మణులలో ఇంటిపేరు

"–ఆరూఢముగ మల్లికార్జున పండితారాధ్యుల చరిత్రమర్థివర్ణింతు–" (పండి.పు. 1). "–మల్లికార్జున పండితారాధ్య సుతుడు దోనయ్య–" (పండి.పు.252).

**మల్లిగౌని**

వ్యక్తినామం (రా.).

మల్లి– గృ.నా.పూ; వ్య.నా: దేవతా సూచి. <మల్లికార్జున– కు సంక్షేప రూపం. చూ. –గౌని గృ.నా.ప.

**మల్లిడి**

చూ. మల్లినేని

వ్యక్తినామం (స.).

**మల్లిన**

చూ. మల్లినేని

వ్యక్తినామం (స.).

కమ్మవారిలో ఇంటిపేరు.

**మల్లిని**

చూ. మల్లినేని

వ్యక్తినామం (స.).

కమ్మవారిలో ఇంటిపేరు.

**మల్లినేని**

రూ. మలినేని, మల్లిడి, మల్లిన, మల్లిని, మల్లీని.

వ్యక్తినామం (స.).

మల్లి– గృ.నా.పూ; వ్య.నా. వి. చూ. మల్లిగౌని. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. –నేని గృ.నా.ప.

**మల్లిసెట్టి**

రూ. మలసెట్టి

వ్యక్తినామం (స.).

మల్లి– గృ.నా.పూ; వ్య.నా. వి.చూ. మల్లిగౌని. చూ. –సెట్టి గృ.నా.ప.

**మల్లీని**

చూ. మల్లినేని

వ్యక్తినామం (స.).

కమ్మవారిలో ఇంటిపేరు.

**మల్లు**

పౌరుషనామం (రా.సా.).

<మల్లుడు. జెట్టి, శ్రేష్ఠుడు. సం.మల్ల. తు.మల్లె; తె. మల్లడి, మల్లాట, మల్లు; త.మల్; మ.మల్లు; క.మల్లాడు డి.ఇ.డి. 3871. "—మల్లువంశంబునమాత—" (Tel.Ma. శివపా; పు. 268).

**మల్లెల**

రూ. మల్లేల

పుష్పసూచి (తె.రా.స.).

మల్లె- బహు. కు. ద్వి.వి. మల్లె పూవుల. ఒడ్డె, కమ్మ, కురుబ, కొరవ, చాకలి,బెస్త, బ్రాహ్మణ, మాదిగ, మాల కులాలలో ఇంటిపేరు. ఈ ఇంటిపేరు గల చాకలి, బెస్తవాళ్ళు మల్లెచెట్టు తాకరని సి.టి.యస్.ఐ.

**మల్లేల**

చూ. మల్లెల.

పుష్పసూచి (రా.).

?<గ్రామనామం. బలిజలలో ఇంటి పేరు.

**మల్లోజు**

వ్యక్తినామం (తె.).

మల్లి- గృ.నా.పూ; వ్య.నా. వి.చూ. మల్లిగౌని. చూ. -ఓజు గృ.నా.ప.

**మళ్ళ**

భూసూచి (స.).

57)

మడి బహు. కు ద్వి.వి. పరిమాణం.

**మసిముక్కు**

పౌరుషనామం (స.).

మసి- నలుపు.దొగ్గు. మైల;- ముక్కు. శరీర అవయవసూచి. వి.చూ. ముక్కు.

**మసీదు**

నిర్మాణసూచి (స.).

తురకవారి ప్రార్థనామందిరం. మసీదు సమీపంలో నివసిస్తున్నవారు.

**మహంకాలి**

చూ. మహంకాళి

వ్యక్తినామం (స.).

**మహంకాళి**

రూ. మహంకాలి

వ్యక్తినామం (తె.శా.).

దేవతాసూచి. <మహాకాళి. దుర్గాదేవి. కమ్మవారిలోఇంటిపేరు. "—మహంకాళి పరదాచార్యులు—" శా.1608 (టి.యం. పి. II పు. 151; నెం. 762).

**మహారెడ్డి**

వ్యక్తినామం (స.).

మహా- గృ.నా.పూ; వ్య.నా. దేవతా సూచి. ?<మహాదేవ- శివుడు. కమ్మ వారిలో ఇంటిపేరు.

చూ. -రెడ్డి గృ.నా.ప.

**మహారాతు**

వ్యక్తినామం (స.).

మహా– గృ.నా.పూ; వ్య. నా. దేవతా సూచి. వి.చూ. మహారెడ్డి. కమ్మవారిలో ఇంటిపేరు. చూ. –రౌతు గృ.నా.ప.

## మా

మాకినేని

వ్యక్తినామం (స.).

మాకి– గృ.నా.పూ; స్త్రీ దేవతాసూచి. <మాకమ్మ<మహాలక్ష్మి. కమ్మవారిలో ఇంటిపేరు. చూ. –నేని గృ.నా.ప.

మాచగోని

వ్యక్తినామం (తె.).

మాచ– గృ.నా.పూ; స్త్రీ దేవతాసూచి. <మాచమ్మ <మహాలక్ష్మి.

మాచనవఝుల

వ్యక్తినామం (తె.స.).

మాచన– గృ. నా. పూ; వ్య. నా. <మాచన్న <మాచి+అన్న. మాచి– వి.చూ. మాచగోని.–అన్న చూ.గృ.నా.ప. వెలనాటి వైదిక బ్రాహ్మణులలో ఇంటి పేరు. చూ. –వఝుల గృ.నా.ప.

మాచర్లోజు

వ్యక్తినామం (తె.).

మాచర్ల– గృ. నా.పూ; గ్రా.నా.

చూ. –ఓజు గృ.నా.ప.

మాచాబత్తుల

వ్యక్తినామం (స.).

మాచా–గృ.నా.పూ; వ్య.నా. మాచ+అ. వి.చూ. మాచగోని.

చూ. –బత్తుల గృ.నా.ప.

మాచినేని

చూ. మాచిన

వ్యక్తినామం (స.).

మాచి– గృ.నా.పూ; స్త్రీ దేవతాసూచి. <మాచ+ఇ. వి.చూ. మాచగోని. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. –నేని గృ.నా.ప.

మాచిరాజు

వ్యక్తినామం (స.).

మాచి– గృ.నా.పూ; స్త్రీ దేవతాసూచి. వి. చూ. మాచగోని. కమ్మ వారిలో, బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. –రాజు గృ.నా.ప.

మాచిరెడ్డి

వ్యక్తినామం (తె.స.).

మాచి– గృ.నా.పూ; స్త్రీ దేవతాసూచి. వి.చూ. మాచిగోని.

చూ. –రెడ్డి గృ.నా.ప.

మాడరాజు

వ్యక్తినామం (శా.).

మాడ– గృ.నా.పూ; దే. సువర్ణం. వి. చూ. మాడల "—మాడరాజు మల్లం రాజుగారి మనుమడు—" క్రీ.శ. 1082. (యస్. ఐ. ఐ. IV: పు. 40; నెం. 248).

చూ. _రాజు గృ.నా.ప.

మాడల

రూ. మాడా

పౌరుషనామం (తె.).

మాడ బహు. కు ద్వి.వి. <మాడ : అరవరా, సువర్ణం; ఒక విధమైన నాణెం. ఆంధ్రదేశంలోని శాసనాలలో వివిధ నాణాల పేర్లున్నాయి. అవి ఆనాటి ప్రభువుల పేరునుగాని, వారి బిరుదనామాలతోగాని ప్రసిద్ధిచెందాయి. ఉదా : ఉత్తమ గండమాడ, కులోత్తుంగమాడ, గండమాడ, చామరమాడ, జయమాడ, బిరుదుమాడ, రాజరాజుమాడ.

మాడా

చూ. మాడల

పౌరుషనామం (స.).

మాడిసెట్టి

వ్యక్తినామం (స.).

మాడి_గృ.నా.పూ; మాడ+ఇ. వి.చూ. మాడల. చూ. _సెట్టి గృ.నా.ప.

మాడెం

భూసూచి (రా.).

?<మాడెము. మండలాధిపతుల భూమండలం.

మాతంగి

వ్యక్తినామం (స.).

దేవతాసూచి. <సం. మాతంగీ. పార్వతి.

మాదన

వ్యక్తినామం (స.).

<మాదన్న.

మాదంచెట్టి

చూ. మాదంసెట్టి

వ్యక్తినామం (తె.).

మాదంసెట్టి

రూ. మాదంచెట్టి

వ్యక్తినామం (తె.).

మాదం_ గృ. నా. పూ; వ్య. నా. <మాదమ్మ. <మాధవమ్మ <మాధవ+అమ్మ.

చూ. _సెట్టి గృ.నా.ప.

మాదాసు

వ్యక్తినామం (స.).

మా_ గృ.నా.పూ; స్త్రీ. నా. దేవతాసూచి. <సం. మా_ లక్ష్మీదేవి.

చూ. _దాసు గృ.నా.ప.

మాదిగ

కులసూచి (రా.స.).

మాతంగి కుమారులు మాదిగలని 'Thurston' అంటారు. ఈ కులాన్ని గురించి అనేకకథలు వాడుకలోవున్నాయి. జాంబవంతుని వారసులని కొందరు భావిస్తారు. మాలవాళ్లు వీళ్ళని 'మా దిగువవారు' అన్నారనీ, ఆ పదమే మాదిగ అయిందని కొందరంటారు. అరుంధతి, వశిష్ఠులనుండి వీరి వంశం అభివృద్ధి

చెందిందని వీరి అభిప్రాయం. అందుకే వీరికి అరుంధతీయులు అని పేరు. అరుంధతీయులు, జగ్గలి, జాంబవులు, మాదిగలు మొదలైనవి వీరిపేర్లు.
సం. మాతంగ; క.మాదిగ; తు.మాడిగె; తె.మాధిగ. డి.ఇ.డి. 3942.

మాదిన
చూ. మాదినేని
వ్యక్తినామం (స.).
కమ్మవారిలో ఇంటిపేరు.

మాదసీడి
చూ. మాదినేని
వ్యక్తినామం (స.).
కమ్మవారిలో ఇంటిపేరు.

మాదినేని
చూ. మాదిన, మాదిసీడి.
వ్యక్తినామం (స.).
మాది– గృ.నా.పూ; వ్య.నా; <మాదయ <మాద+అయ. మాద– సం. మాధవ– కమ్మవారిలో ఇంటిపేరు.
చూ. –నేని గృ.నా.వ.

మాదిరాజు
వ్యక్తినామం (స.).
మాది– గృ.నా.పూ; వి.చూ. మాదినేని. బ్రాహ్మణులలో ఇంటిపేరు.
చూ. –రాజు గృ.నా.వ.

మాదిరెడ్డి
వ్యక్తినామం (రా.శా.స.).
మాది– గృ.నా.పూ; వ్య.నా. దేవతాసూచి. వి.చూ. మాదినేని.
చూ. –రెడ్డి గృ.నా.వ.
"--మాదిరెడ్డి మారసాని--"శా.1139. (టి.యం.పి.II; పు.1107; నెం.433).

మాధవపెద్ది
వ్యక్తినామం (స.).
మాధవ– గృ.నా.పూ; దేవతాసూచి. వి.చూ. మాధవభట్ల. వెలనాటి వైదిక బ్రాహ్మణులలో ఇంటిపేరు.

మాధవభట్ల
వ్యక్తినామం (తె.స.).
మాధవ– గృ.నా.పూ; వ్య.నా; దేవతాసూచి. <సం. మాధవ– మాధవుడు, విష్ణువు. బ్రాహ్మణులలో ఇంటిపేరు.
చూ. –భట్ల గృ.నా.వ.

మానాప్రగడ
వ్యక్తినామం (స.).
మానా– గృ.నా.పూ; వ్య.నా; <మ్రానయ. ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.
చూ. –ప్రగడ గృ.నా.వ.

మానికల
కొలమానసూచి (స.).
మానిక– బహు. తు ద్వి.వి. మానిక, రెండు తవ్వలు.
?<మానికము <మాణిక్య– రత్నం.

మాన్యం
భూసూచి (స.).

<మాన్యము. పన్నుకట్టకుండా అనుభ వించేటట్లు సన్మానించి ఇచ్చిన భూమి.

**మామిడన్న**

వ్యక్తినామం (స.).

మామిడి– గృ.నా.పూ; వృ.నా.వి.చూ. మామిడి. ఆర్వేల నియోగులలో ఇంటి పేరు. చూ. –అన్న గృ.నా.ప.

**మామిడి**

రూ. మామిళ్ళ, మావి, మావిడి.

వృక్షసూచి (తె.రా.స.సా.).

వృ.నా : Mangifera indica.

సం. మాకంద; త.మా; మ. మావు; క.మా, మామ్, మావు; కొ. మూంగె; తె.మావి, మామిడి, మావిడి. డి.ఇ.డి. 3919. "—ఆంధ్రనైషధ కావ్యమందె శ్రీనాధుచే మామిడి సింగనామాత్య మౌళి—" (ముప్ప.చ; పు.37)

ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.

**మామిడిపోతుల**

వ్యక్తినామం (స.).

మామిడి– గృ.నా.పూ; వ్య.నా.వి.చూ. మామిడి. చూ. –పోతుల గృ.నా.ప.

**మామిడిబత్తుల**

వ్యక్తినామం (స.).

మామిడి– గృ.నా.పూ; వృ.నా.వి. చూ. మామిడి. చూ. –బత్తుల గృ.నా.ప.

**మామిడిభట్ల**

వ్యక్తినామం (తె.).

మామిడి– గృ. నా. పూ; వృ. నా. వి. చూ. మామిడి. వెలనాటి వైదిక బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. –భట్ల గృ.నా.ప.

**మామిళ్ళ**

చూ. మామిడి.

వృక్షసూచి (స.).

మామిడి బహు. కు ద్వి.వి. కమ్మ, పద్మసాలీలలో ఇంటిపేరు.

**మాయ**

రూ. మాయల

పౌరుషనామం (శా.స.).

"—మాయ విజయరాజు—" (టి.యం.పి II; పు.788; నెం.365).

**మాయల**

చూ. మాయ.

పౌరుషనామం (రా.).

మాయ బహు. కు ద్వి.వి.

**మారగోని**

వ్యక్తినామం (తె.).

మార– గృ.నా.పూ; వ్య.నా. దేవతా సూచి. <మారెమ్మ <మాహార+అమ్మ <మాతాపుర చూ. –గోని గృ.నా.ప.

**మారనేని**

రూ. మారిన, మారిని, మారినేని, మార్ని.

వ్యక్తినామం (స.).

మార– గృ.నా.పూ; వ్య.నా. దేవతా

సూచి. వి.చూ. మారగోని. కమ్మవారిలో ఇంటిపేరు. చూ. -నేని గృ.నా.ప.

**మారం**

వ్యక్తినామం (రా.స.).

?<మారమ్మ <మారి+అమ్మ. వి.చూ. మారగోని.

**మారంరాజు**

వ్యక్తినామం (రా.స.).

మారం- గృ.నా.పూ; స్త్రీ దేవతాసూచి. <మారమ్మ. వి. చూ. మారగోని. ఆర్వేల నియోగ బ్రాహ్మణులలో ఇంటి పేరు. చూ. -రాజు గృ.నా.ప.

**మారాబత్తుల**

వ్యక్తినామం (స.).

మారా- గృ.నా.పూ; స్త్రీ దేవతాసూచి. మార+అ. వి.చూ. మారగోని.

చూ. -బత్తుల గృ.నా.ప.

**మారావఝుల**

వ్యక్తినామం (తె.).

మారా- గృ.నా.పూ; స్త్రీ దేవతాసూచి. మార+అ. వి.చూ. మారగోని. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. -వఝుల గృ.నా.ప.

**మారిన**

చూ, మారనేని

వ్యక్తినామం (రా.).

కమ్మవారిలో ఇంటిపేరు.

**మారిని**

చూ. మారనేని

వ్యక్తినామం (స.).

మారి- గృ.నా.పూ; స్త్రీ దేవతాసూచి. మార+ఇ.

**మారినేని**

చూ. మారనేని.

వ్యక్తినామం (స.).

**మారిసెట్టి**

వ్యక్తినామం (స.).

మారి- గృ.నా.పూ; స్త్రీ దేవతాసూచి. మార+ఇ. వి.చూ. మారగోని.

చూ. -సెట్టి గృ.నా.ప.

**మారుతి**

వ్యక్తినామం (స.).

పు.నా. <సం. మారుతి : భీముడు, హనుమంతుడు. ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.

**మారుబోయిన**

వ్యక్తినామం (స.).

మారు- గృ.నా.పూ; దేవతాసూచి. వి.చూ. మారగోని.

చూ. -బోయిన గృ.నా.ప.

**మారెడ్డి**

వ్యక్తినామం (స.).

మారి+రెడ్డి. మా- గృ.నా.పూ; స్త్రీ.నా. దేవతాసూచి. వి.చూ. మారగోని.

చూ. -రెడ్డి గృ.నా.ప.

**మారెళ్ళ**
చూ. మారేడు
వృక్షసూచి (స.).
మారేడుబహు. కుద్వి.వి. కమ్మవారిలో, బ్రాహ్మణులలో ఇంటిపేరు.

**మారేడి**
చూ. మారేడు
వృక్షసూచి (రా.స.).

**మారేడు**
రూ. మారెళ్ళ, మారేడి
వృక్షసూచి (తె.).
వృ. నా : Aegle marmelos.
సం. మాలూర; తె. మారేడు; నాయ. మారొఙ్. డి.ఇ.డి. 3949.

**మారోజు**
వ్యక్తినామం (తె.).
మార్ + ఓజు. మార– గృ.నా.పూ; దేవతాసూచి. వి.చూ. మారగోని.
చూ. –ఓజు గృ.నా.ప.

**మారౌతు**
వ్యక్తినామం (స.).
మా–గృ.నా.పూ; దేవతాసూచి. మాచి+ రౌతు. వి.చూ. మాచినేని. కమ్మవారిలో ఇంటిపేరు. ?<మార.
చూ. –రౌతు గృ.నా.ప.

**మార్గము**
పౌరుషనామం (శా.).
దారి, అన్వేషణ. బాటసారుల అడుగుల చేత తుడువబడుతుంది. "–మార్గము పైడిముక్కల మార్గ నారాయణ–" శా. 1179 (టి.యం.పు. II; పు.1091; నెం. 392).

**మార్ని**
చూ. మారనేని
వ్యక్తినామం (స.).
కమ్మవారిలో ఇంటిపేరు.

**మాల**
కులసూచి (రా.స.).
సం. మాల; త. మాలర్; క. మాల; తె. మాల. డి.ఇ.డి. 3951.
"Are the paraihs of the Telugu Country" అని H. A. స్టూవర్ట్ అన్నారు. పర్వతం అనే అర్థాన్నిచ్చే ద్రావిడ భాషాపదం ఈ కుల నామానికి మూలం అని డా॥ ఒపెర్ట్ పేర్కొన్నారు. 'మైల' అనే పదం నుండి మాల వచ్చిందని బ్రౌను తెలుగు నిఘంటువులో ఉంది. వీరు పూర్వం ఒక నాయకుని కింద వుండి ఆనాయకుని కోసం దొంగతనాలు, దోపిడీలు చేసే వారట. అందుకే వీరి గృహనామాల్లో ఎక్కువగా ఈటె, డోలు, బల్లెం మొదలైన యుద్ధానికి పనికొచ్చే ఆయుధాలు చోటుచేసుకున్నాయని సి.టి.యస్.ఐ. V పేర్కొంది. వీరిలో నాల్గు తెగలున్నాయి. తెగనుబట్టి గృహనామాలున్నాయి. బండి, బొమ్మల, దోమ, కాటిక, నత్తల, పిల్లి,

సముద్రాల మొదలైనవి రెడ్డిభూమి వారిలోనూ; అల్లం, దారా, గాడి, గోనె, గుజ్జు, పళుల మొదలైన ఇంటిపేర్లు పోకునాటి వారిలోనూ; బూరి, బల్లెం, చింతల, దుడ్డు, మద్దిల, పాముల, సమ్మెట మొదలైనవి సారింద్ల తెగలోనూ; దాసరి, గంజి, మర్రి, పొవాకు, తుమ్మ మొదలైన గృహనామాలు దైండ్ల తెగలోనూ కన్పిస్తాయి.

మాలంరెడ్డి

వ్యక్తినామం (స.).

మాలం– గృ. నా. పూ; ?<మల్లం. ?<మహాలయ– చూ. _రెడ్డి గృ.నా.ప.

మాలి

వృత్తిసూచి (తె.).

పూలదండలు కట్టి అమ్మేవాడు; తోట కావలావాడు.

మాలే

పౌరుషనామం (స.).

<మాలె<మాలియ : పూలదండ.

మావి

చూ. మామిడి

వృక్షసూచి (తె.).

మావిడి

చూ. మామిడి

వృక్షసూచి (స.).

మాసెట్టి

వ్యక్తినామం (తె.స.).

?<మాచి+సెట్టి. వి.చూ, మాచినేని. చూ. _సెట్టి గృ.నా.ప.

మి

మిక్కిలినేని

వ్యక్తినామం (స.).

మిక్కిలి– గృ.నా.పూ; శ్రేష్ఠమైన, అధికమైన. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. _నేని గృ.నా.ప.

మిట్ట

నివాసస్థలసూచి (రా.).

ఎత్తుగాఉన్నస్థలం; చిన్నకొండ అని కొందరు. ఎత్తుగాఉన్న ప్రదేశంలో నివసించేవారు.

మిడతల

కీటకసూచి (శా.స. ).

మిడత బహు. కు ద్వి.వి. దేవాంగ, బోయ, మాదిగ కులాలలో ఇంటిపేరు.

మిత్తింటి

?<మిద్దింటి. చూ. మిద్దింటి.

నివాసస్థలసూచి (స.).

బ్రాహ్మణులలో ఇంటిపేరు.

మిద్దింటి

రూ. మిత్తింటి

నివాసస్థలసూచి (రా. ).

మిద్దె + ఇంటి. మిద్దె– గృ.నా.పూ; వి.చూ. మిద్దె. చూ. _ఇంటి గృ.నా.ప.

మిద్దె

రూ. మిద్దెల

నివాసస్థలసూచి (తె.).
మిద్దెటిల్లు. ఇంటిమీద చదునుగా పలకలు కప్పి గచ్చు పూసిన కప్పు. త. మిట్టయ్; తు మిత్తిగె; కొ. మెడ్. డి.ఇ.డి. 4158.

మిద్దెల
చూ. మిద్దె
నివాసస్థలసూచి (తె.).
మిద్దె బహు. కు ద్వి.వి. పద్మసాలీలలో ఇంటిపేరు.

మిరపకాయల
వృక్షసంబంధసూచి (తె.స.).
మిరపకాయ బహు. కు ద్వి.వి. బోయలలో ఇంటిపేరు.

మిరియాల
వృక్షసంబంధసూచి (తె.రా.స.).
మిరియం బహు. కు ద్వి.వి. మిరెము, మిర్యము.<సం. మరీచ– కమ్మవారిలో, బలిజ కులంలో, బ్రాహ్మణులలో ఇంటిపేరు. వృ. నా : Piper nigrum.

## మీ

మీగడ
పౌరుషనామం (తె.రా.స.).
కాగిన పాలమీద తెట్ట, పెరుగుమీద తెట్ట. కాపులలో ఇంటిపేరు.

మీదింటి
నివాసస్థలసూచి (తె.).



మీద_గృ.నా.పూ. ఉపరిభాగం, అగ్రం, ఊర్ధ్వం. మీద+ఇల్లుకు బొప.
చూ. –ఇంటి గృ.నా.ప.

మీసాల
పౌరుషనామం (తె.రా.స.సా.).
మీసం బహు. కు ద్వి.వి. బోయలలో ఇంటిపేరు. క.మీసె; తు.మిసె;మ.మీశ; త.మీచయ్. డి.ఇ.డి. 3996.
"__కాసల్నాటి శ్రేష్ఠుడు మీసాలప్పయ్య గారి మేనల్లుడు__" (క్రీడా. పు. 13; పం. 43).

## ము

ముకుంద
వ్యక్తినామం (స.).
పు.నా; దేవతాసూచి.<సం. ముకుంద– విష్ణువు.

ముక్కర
రూ. ముక్కెర, ముంగర
ఆభరణసూచి (స.).
ముక్కు+రాయి. అద్దబాస. ముక్కుకు పెట్టుకొనే ఆభరణం. కమ్మవారిలో, బోయల్లో కుటుంబనామం.

ముక్కంటి
వ్యక్తినామం (రా.).
పు.నా. దేవతాసూచి. దే. ముక్కంటి : శివుడు. యానాదులలో ఇంటిపేరు.

ముక్కు
అవయవసూచి (తె.స.).
శరీరంలోని ఒక ఇంద్రియం. నాసిక. ముక్కు-తిమ్మనకు ఇది పౌరుషనామంగా ప్రసిద్ధి చెందింది. ఇట్లే బుర్రా, నోరు మొదలైన పేర్లున్నాయి. బ్రాహ్మణులలో ఇంటి పేరు. త.మూక్కు; మ.ముక్కు; క.మూగు, మూ; తు. మూకు; మూగు; డి.ఇ.డి. 4122.

ముక్కెర
చూ. ముక్కర
ఆభరణసూచి (తె.).

ముక్తికాని
వ్యక్తినామం (స.).
?< ముత్తికాని. వి.చూ. ముత్తినేని.
చూ. -కాని గృ.నా.ప,

ముక్తినేని
వ్యక్తినామం (రా.స.).
?< ముత్తినేని. వి. చూ. ముత్తినేని. కమ్మవారిలో ఇంటిపేరు.

ముంగర
చూ. ముక్కర
ఆభరణసూచి (రా.).
రెడ్లలో ఇంటిపేరు.

ముడుపు
పౌరుషనామం (తె.).
శుభకార్యారంభాల్లో ధనం ముడిచి మీద కట్టినమూట, దేవతలను ఉద్దేశించి చెల్లించే ధనం మొదలైన కానుకలు.

ముడుంబ
పౌరుషనామం (శా.స.).
చిక్కు, ఉమ్మడి. ఉత్తర సర్కారులో 'ముడుంబ వదలలేదు' అని వాడుక. అం.వా. "--ముడుంబ నరసింహాచార్య--" శా. 1156 (తెలం. శా. I; పు. 70; పం. 12-14). బ్రాహ్మణులలో ఇంటిపేరు.

ముతిన
చూ. ముత్తినేని
వ్యక్తినామం (శా.).
"--ముతిన మయిసెట్టి--" శా.1329 (టి.యం.పి. II; పు. 950; నెం.426).

ముతుసాని
వ్యక్తినామం (సా.).
ముతు- గృ.నా.పూ; ? < ముత్తు; ?< ముద్దు. వి.చూ. ముత్తినేని.
"--ముతుసాని వారును ముయ్యారు వారు--" (పల్నా. పు.15; పం.212).
చూ. -సాని గృ.నా.ప.

ముత్తరాజు
వ్యక్తినామం (స.).
ముత్త- గృ.నా.పూ; దే.వృద్ధ. ఆర్వేల నియోగులలో ఇంటిపేరు. ? < ముత్యాల. ?< మృత్యుంజయకు సంక్షేపరూపం.
చూ. -రాజు గృ.నా.ప.

ముత్తరాసి

కులసూచి (రా.).

<ముత్తరాస <ముత్తరాచ. సవారీలు, వాహనములు మొదలైనవానిని మోయు ఒక శూద్రజాతి. ఆం.వా.వీరిని ముత్రాచ, ముత్తిరాజుల, ముత్రాసన్ అని వ్యవహరిస్తారు. ఈ కులం కృష్ణ, నెల్లూరు, కడప జిల్లాల్లో ఉంది. విజయనగర రాజులు వీరికి 'పాలిగర్స్' అనే బిరుదు ఇచ్చారు. ముత్రాచ అనే పదం ద్రావిడ భాషా మూలమైన ముది, రాచ అనే పదాలనుండి వచ్చాయి. ముది అంటే ముసలి; రాచ అంటే రాజు. ముత్తరాజ నుండి ఈ కులం పేరు వచ్చిందంటారు. వీరు గ్రామ తలారులుగా వుంటారు గనుక వీరి కులాన్ని 'తలారి' అనికూడా అంటారు. వీరు యయాతి వంశీయుల మని చెప్పుకుంటారు. చూ. సి.టి.యస్. ఐ. V. 127.

ముత్తారెడ్డి

వ్యక్తినామం (స.).

ముత్తా-గృ.నా.పూ; వి.చూ. ముత్తినేని

చూ. —రెడ్డి గృ.నా.వ.

ముత్తిసీడు

చూ. ముత్తినేని

వ్యక్తినామం (స.).

కమ్మవారిలో ఇంటిపేరు.

ముత్తినేడి

చూ. ముత్తినేని

వ్యక్తినామం (రా.స.).

కమ్మవారిలో ఇంటిపేరు.

ముత్తినేని

రూ. ముతిన,ముత్తిసీడు, ముత్తినేడి, ముత్తెన.

వ్యక్తినామం (రా.స.).

ముత్తి-గృ.నా.పూ; వ్య.నా. మృత్యుంజయకు సంక్షేపరూపం. కమ్మవారిలో ఇంటిపేరు. చూ. —నేని గృ.నా.వ.

ముత్తు

వ్యక్తినామం (రా.శా.).

ముసలి, పాత. చూ. ముత్తయ్య, ముసలయ్య. కమ్మవారిలో ఇంటిపేరు. "—ముత్తు వెంకట రామరసు—" శా. 1609 (టి.యం.పి. I; పు. 636; నెం. 657).

ముత్తెన

చూ. ముత్తినేని

వ్యక్తినామం (స.).

<ముత్తిన. కమ్మవారిలో ఇంటిపేరు.

ముత్యం

రూ, ముత్యాల

పౌరుషనామం (స ).

<ప్రా. ముత్తా- <సం. ముక్తా-; త. ముత్తు; మ. ముత్తు; కొ. ముత్; తొ.ముత్; క.ముత్తు,ముత్య; తు. ముత్తు; తె.ముత్తియము, ముత్యము. డి.ఇ డి, 4062.

ముత్యాల
చూ. ముత్యం
పౌరుషనామం (తె.రా.స.).
ముత్యం బహు. కు ద్వి.వి. ముత్యాల వ్యాపారం చేసేవారు. కమ్మవారిలో, బలిజ కులంలో, బ్రాహ్మణులలో ఇంటి పేరు.

ముదిరాజు
?వ్యక్తినామం ? కులనామం (స.).
ముది–గృ.నా పూ; దే.వృద్ధ, వృద్ధుడు. త. ముదు; మ. ముత్తు; క. ముత్తు; మొదలిరాజు అని కొందరి భావన.
చూ. –రాజు గృ.నా.ప.

ముదిరెడ్డి
వ్యక్తినామం (స.).
ముది–గృ.నా.పూ; వి.చూ. ముదిరాజు.
చూ. –రెడ్డి గృ.నా.ప.

ముద్ద
రూ. ముద్దా, ముద్దల.
పౌరుషనామం (తె.).
<సం. ముగ్ధా– ముద్దరాలు.
? దే. కబళం.

ముద్దల
చూ. ముద్ద
పౌరుషనామం (రా.).
ముద్ద బహు. కు ద్వి.వి. రెడ్డి, హరిజన కులాల్లో ఇంటిపేరు.

ముద్దగోని
వ్యక్తినామం (తె.).
ముద్ద– గృ.నా.పూ; వి.చూ. ముద్ద.
చూ. –గోని గృ.నా.ప.

ముద్దన
రూ. ముద్దిన, ముద్దినేని
వ్యక్తినామం (స.).
ముద్ద– గృ.నా.పూ; వి. చూ. ముద్ద.
<ముద్ద+అన. చూ. –న గృ.నా.ప.

ముద్దబోయిన
వ్యక్తినామం (స.).
ముద్ద– గృ.నా.పూ; వి.చూ. ముద్ద.
చూ. –బోయిన గృ.నా.ప.

ముద్దరబోయిన
వ్యక్తినామం (స.).
ముద్దర–గృ.నా.పూ; <ముద్ర. అచ్చు వేయడం. చూ. –బోయిన గృ.నా.ప.

ముద్దరాజు
వ్యక్తినామం (స.).
ముద్ద– గృ.నా.పూ; వి. చూ. ముద్ద. బ్రాహ్మణులలో ఇంటిపేరు.
చూ. –రాజు గృ.నా.ప.

ముద్దా
చూ. ముద్ద
పౌరుషనామం (స.).
బ్రాహ్మణులలో ఇంటిపేరు.

ముద్దిన
చూ. ముద్దన

వ్యక్తినామం (స.).

ముద్దినేని

చూ. ముద్దన

వ్యక్తినామం (రా.స.).

ముద్ది– గృ.నా.పూ; ముద్ద+ఇ. కమ్మవారిలో ఇంటిపేరు.

మునగమాను

చూ. మునగా.

వృక్షసూచి (రా.).

మునగా

రూ. మునగమాను, ములగ

వృక్షసూచి (రా.స.).

వృ.నా : Moringa Ptergosperma. త. మురుఙ్కై; మ. మురిఞ్ఞ; క. నుగ్గె, నుగ్గి; తు.నురిగె, నుగ్గె: తె.మునగ; పర్జి. మజ్గ డి.ఇ.డి. 4085.

మునిరెడ్డి

వ్యక్తినామం (రా.).

ముని–గృ.నా.పూ; <ముని, మును= మున్ను, మొదటి. మును పదంలోని చివరి ఉకారం లోపించి ఇకారం చేరిన రూపం. చూ. –రెడ్డి గృ.నా.ప.

మునుంగోటి

అస్పష్టనామబంధం (శా.).

"–మునుంగోటి యలవరెడ్డి–" (యస్.ఐ.ఐ. VI; పు. 34; పం. 5–6; నెం. 250 ఎ.).

మున్నంగి

చూ. ముల్లంగి

వృక్షసూచి (స.

ముప్పడి

చూ. ముప్పిడి

ఆయుధసూచి (శా.).

"–ముప్పడి నాయనిగారు–" శా. 1239 (టి.యం.పి. II; పు. 1124; నెం. 552).

ముప్పన

చూ. ముప్పనేని

వ్యక్తినామం (స.).

కమ్మవారిలో ఇంటిపేరు.

ముప్పనేని

రూ. ముప్పన, ముప్పలనేని, ముప్పానేని.

వ్యక్తినామం (స.).

ముప్ప– గృ.నా.పూ; ?<ముప్పు : ముసలితనం. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. –నేని గృ.నా.ప.

ముప్పరాజు

వ్యక్తినామం (స.).

ముప్ప– గృ.నా.పూ; వి.చూ. ముప్పనేని. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. –రాజు గృ.నా.ప.

ముప్పలనేని

చూ. ముప్పనేని

వ్యక్తినామం (స.).

ముప్పసాని
వ్యక్తినామం (స.).
ముప్ప- గృ.నా.పూ; వి.చూ. ముప్పన.
చూ. _సాని గృ.నా.ప.

ముప్పసెట్టి
వ్యక్తినామం (స.).
ముప్ప- గృ.నా.పూ; వి.చూ. ముప్పన.
చూ. _సెట్టి గృ.నా.ప.

ముప్పానేని
చూ. ముప్పనేని
వ్యక్తినామం (స.).

ముప్పిడి
చూ. ముప్పడి
ఆయుధసూచి (తె.స.).
మూడు + పిడి : చాకు.

ముమ్మడి
చూ. ముమ్మిడి
పౌరుషనామం (రా.సా.).
మూడవ, మూడోతరానికి చెందిన.
బ్రాహ్మణులలో ఇంటిపేరు.
"_సిద్ధాంతమర్మ ముమ్మడి వరదాచార్య__"(రామాభ్యు;పు. 2; ఆశ్వాగ.).

ముమ్మన
చూ. ముమ్మనేని
వ్యక్తినామం (స.).
కమ్మవారిలో ఇంటిపేరు.

ముమ్మనేని
చూ. ముమ్మన, ముమ్మలనేని.
వ్యక్తినామం (స.).
ముమ్మ- గృ.నా.పూ; వ్య.నా. దేవతా సూచి. < ముమ్మడమ్మ. స్థానిక దేవతా నామం. ?< ముంబా : దుర్గా భేదం.
కమ్మవారిలో ఇంటిపేరు.
చూ. _నేని గృ.నా.ప.

ముమ్మలనేని
చూ. ముమ్మనేని
వ్యక్తినామం (స.).
కమ్మవారిలో ఇంటిపేరు.

ముమ్మారెడ్డి
వ్యక్తినామం (స.).
ముమ్మా- గృ.నా.పూ; ముమ్మ + అ.
వ్య.నా; దేవతాసూచి. వి.చూ. ముమ్మనేని.
చూ. _రెడ్డి గృ.నా.ప.

ముమ్మిడి
చూ. ముమ్మడి
పౌరుషనామం (స ).

మురహరి
వ్యక్తినామం (స.).
పు.నా: దేవతాసూచి. < సం. మురహరి_

మురారి
వ్యక్తినామం (తె.స.).
పు. నా; దేవతాసూచి. < సం. మురారి_

ముఃరుగు
ఆభరణసూచి (రా.).

ముంజేతికి అలంకరించుకునే నగ.

ములక్కాయల

వృక్షసూచి (రా.).

ములక్కాయ బహు. క. ద్వి.వి. ములగ– గృ.నా.పూ; వి.చూ. మునగా· చూ. –కాయల గృ.నా.ప.

ముల్లంగి

రూ. మున్నంగి

వృక్షసూచి (రా.).

వృ.నా : Rephanus sativus.

హస్తికంద. కమ్మవారిలోనూ, కోమట్ల లోనూ ఇంటిపేరు,

సం. మూలక; త. ముళ్లంకి, ముళా; మ.ముళ్ళంకి; క.ముల్లంగి, మూలంగె; తు.ముల్లెంగి, మూలెంగి; తె.ముల్లంగి. డి.ఇ.డి. 4105.

మువ్వల

ఆభరణసూచి (న.).

మువ్వ బహు. కు. ద్వి.వి. మూడు+వా. మొనలో మూడునందులుండే పెద్ద గజ్జె. పర్జి. మూవ; కోలా. మూంగ; నాయకి. ముంగె; గోం. ముయ; కొం.మువ. డి.ఇ.డి. 4128.

ముష్టి

తెగసూచి (తె.న.).

ముష్టి అనే తెగపేరు ఇంటిపేరుగా మారి ఉండవచ్చు. వీరముష్టి. బ్రాహ్మణు లలో ఇంటిపేరు.

2< వృక్షసూచి. విషముష్టి మొక్క కంచెగా వేస్తారు. ఆం.నా The Vomit nut.

వృ.నా : Strychnosnux–Vomica·

ముసిడి

వృక్షసూచి (సా.).

ముష్టిచెట్టు. విషముష్టి.

"–ముసిడి చౌడయ్యగారి ముందు పెట్టితివా–" (వండి. పు. 208).

## మూ

మూగి

అవయవలోపసూచి (రా.న.).

<మూగ+ఇ. మూగవాడు. గొల్ల, మాల, ముత్రాసులలో ఇంటిపేరు. ప్రా. మూగ; సం. మూక: క.మూంగ; త.మూఙ్కై. డి ఇడి. 4124.

మూర్తిగారి

వ్యక్తినామం (తె.).

మూర్తి– గృ.నా.పూ; పట్టపుపేరు.

చూ. –గారి గృ.నా.ప.

మూర్తినేని

వ్యక్తినామం (న.).

మూర్తి– గృ.నా.పూ; వి.చూ. మూర్తి గారి. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. –నేని గృ.నా.ప.

మూర్తిరాజు

వ్యక్తినామం (న.).

మూర్తి- గృ.నా.పూ; వి.చూ. మూర్తి

గారి. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. _రాజు గృ.నా.ప.

మూల

రూ. మూలా

నివాసస్థలసూచి (తె.).

మారుమూల, గొంది, కోణం.

మూలఘుటిక

అస్పష్టనామబంధం (సా.).

మూల_1. _ఘుటిక : మట్టితో చేసిన చిన్నపాత్ర: ఇంద్రజాల విద్య. బ్రాహ్మణులలో ఇంటిపేరు. "__మూల ఘటికాన్వయ సముద్ర__" ( దశకు. 1_23 ). దశకుమార చరిత్ర వలన కేతన కౌండిన్య సగోత్రుడనీ, ఇంటి పేరు మూలఘుటిక వారనీ, వేంగీదేశం లోని వెంటిరాల అనే అగ్రహారానికి అధికారనీ తెలుస్తుంది. మూలఘుటిక వారు బ్రాహ్మణులని గుంటూరుజిల్లాలోని నాదెండ్ల మూలస్థానేశ్వర దేవాలయ ముఖ మండపశాసనం (క్రీ.శ. 1150). వలన తెలుస్తుంది.

మూలా

చూ. మూల

నివాసస్థలసూచి (రా.).

బ్రాహ్మణులలో ఇంటిపేరు.

మూలాప్రగడ

వ్యక్తినామం (స.).

మూలా_ గృ.నా.పూ; స్త్రీదేవతాసూచి. <మూలదేవి. ఒక గ్రామదేవత. మహాలక్ష్మి. పేరూరి ద్రావిడులలో ఇంటిపేరు.

చూ. _ప్రగడ గృ.నా.ప.

మూలింటి

నివాసస్థలసూచి (రా.).

మూలలో ఉన్న ఇంటిలో నివసించే వారు.

## మె

మెట్టు

రూ. మెట్ల

పౌరుషనామం (తె.).

సుంకం పుచ్చుకొనే ప్రదేశం; తిప్ప, కొండ.

మెట్ల

చూ. మెట్టు

పౌరుషనామం (స.).

మెట్టు బహు. కు ద్వి.వి. కమ్మవారిలో ఇంటిపేరు.

మెడ

శరీర అవయవసూచి (ప.).

కంఠం, కుత్తుక.

మెరకింటి

నివాసస్థలసూచి (రా.).

మెరక_ గృ.నా.పూ; స్థలసూచి. మిట్ట నేల. చూ. _ఇంటి గృ.నా.ప.

మెరుగు

పౌరుషనామం (తె. స.).

<మెఱుగు : కాంతి, మెరపు; నెయ్యి మొదలైనవాని జిడ్డు.

మెల్ల

అవయవలోపసూచి (రా.స.).

మెల్లకన్ను. వంకరగా ఉన్నచూపు. కమ్మవారిలో గృహనామం.

?<ఉ. మెహల్లా.

# మే

మేక

రూ. మేకల, మేకా.

జంతుసూచి (స.).

సం. మేక; క. మేకె; తె. మేక; నాయికి. మేకె; పర్జి. మేవ. డి.ఇ.డి. 4174. కమ్మవారిలో ఇంటిపేరు.

మేకపోతు

రూ. మేకపోతుల

జంతుసూచి (స.).

మేక+పోతు. వి.చూ. మేక.

మేకపోతుల

చూ. మేకపోతు.

జంతుసూచి (స.).

మేకపోతు బహు. కు ద్వి.వి.

మేకల

చూ. మేక

జంతుసూచి (తె.రా.స.).

మేక బహు. కు ద్వి.వి. కమ్మ, కాపు, గొల్ల, చెంచు, తొగట, యానాది, వెలమల్లో ఇంటిపేరు.

మేకా

చూ. మేక

జంతుసూచి (తె.స.).

కమ్మ, వెలమలలో ఇంటిపేరు.

మేడబోయిన

వ్యక్తినామం (స.).

మేడ- గృ.నా.పూ: <సం. మేళ-: దేవాలయం, మేళం శా. శ; వ్య. నా. చూ. మేడసాని, మేడమ.

చూ. -బోయిన గృ.నా.ప.

మేడల

చూ. మేడా

నివాసస్థలసూచి (తె.).

మేడ బహు.కు ద్వి.వి.

పద్మసాలీలలో ఇంటిపేరు.

మేడసాని

రూ. మేలసాని

వ్యక్తినామం (స.).

మేడ- గృ.నా.పూ: వి. చూ. మేడబోయిన. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. -సాని గృ.నా.ప.

మేడసెట్టి

వ్యక్తినామం (స.).

మేడ- గృ.నా.పూ: వి. చూ. మేడబోయిన. చూ. -సెట్టి గృ.నా.ప.

మేడా
రూ. మేడల
నివాసస్థలసూచి (రా.స.).
< మేడ. సౌధం.
కమ్మవారిలో ఇంటిపేరు.

మేడి
వృక్షసూచి (తె రా.).
వృ. నా ; Ficus glomerata.
క. మేడి; తె. మేడి. డి.ఇ.డి. 4176.

మేడిని
వ్యక్తినామం (స.).
మేడి–గృ.నా.పూ; వ్య.నా.< మేడయ.
వి.చూ. మేడబోయిన.
చూ. –ని గృ.నా.ప.

మేదర
చూ. మేదరి
జాతిసూచి (రా.వ.).

మేదరి
రూ. మేదర
జాతిసూచి (తె.).
మేదర+ఇ చాపలు మొదలైనవి అమ్మి జీవించే జాతివారు. మహేంద్ర శబ్దభవ మని జననిరుక్తి. సం. మేద; త. మేతర వర్, మేతవర్; క. మేద, మేదర, మాదర; తె. మేదర, మేదరి. డి.ఇ డి. 4178.

మేలసాని
చూ. మేడసాని
వ్యక్తినామం (స.).
కమ్మవారిలో ఇంటిపేరు.

మేలసెట్టి
వ్యక్తినామం (స.).
మేల- గృ.నా.పూ; వి.చూ. మేడసాని.
చూ. –సెట్టి గృ.నా.ప.

మేస్త్రి
వృత్తిసూచి (తె.రా.స.).
పనివాళ్ళ పనిని అజమాయిషీ చేసే పెద్ద పనివాడు. < పోర్చుగీసు. మేస్త్రి.
చూ. భాషా. వ్యా.
Yule & Burnell writes "a corruption of Portugeese Mestre, has spread into the vernaculars all over India, and is constant Anglo Indian use a foreman, a master worker.

మైనేడి
చూ. మైనేని
వ్యక్తినామం (రా.స.).
కమ్మవారిలో ఇంటిపేరు.

మైనేని
రూ. మైనేడి
వ్యక్తినామం (స.).
మై– గృ.నా.పూ; దేహం, పార్శ్వం.
కమ్మవారిలో ఇంటిపేరు.
?< మహి+నేని.
చూ. –నేని గృ.నా.వ.

మైబోయిన
వ్యక్తినామం (తె.న.).
మై– గృ.నా.పూ; వి.చూ. మైనేని.
చూ. –బోయిన గృ.నా.ప.

## మొ

మొగలి
పుష్పసూచి (తె.రా.న).
వృ.నా: Pandanus odoratissimus.
కేతకి. కాపుల్లో, బ్రాహ్మణులలో ఇంటిపేరు.
త.మఃకరి, ముకులి, ముచలి, ముతలి; తె. మొగలి ది ఇ.డి. 4004.

మొగళ్ళ
చూ. మొగలి
పుష్పసూచి (న.).
మొగలి బహు. కు ద్వి.వి.

మొగిలన్న
వ్యక్తినామం (రా.).
మొగిలు– గృ.నా.పూ; దే. మేఘం, మొయిలు. ?< మొగలి : వృక్షసూచి.
ఈ పదంతో ఏర్పడిన వ్యక్తినామాలు; మొగిలప్ప, మేఘనాధుడు.
చూ. –అన్న గృ.నా.ప.

మొగిలప్ప
వ్యక్తినామం (రా.).
మొగలి+అప్ప. మొగిలి– గృ.నా.పూ; వి.చూ. మొగిలన్న.
చూ. –అప్ప గృ.నా.ప.

మొగుల
చూ. మొగుళ్ళ
పౌరుషనామం (తె.).
< మేఘ– మబ్బు

మొగుళ్ళ
చూ. మొగుల
పౌరుషనామం (తె.).

మొండెం
అవయవసూచి (న.).
< మొండెము. < మొండియము. తల తెగిన శరీరం.

మొద్దు
పౌరుషనామం (న.).
?< సం. మూఢ, మోట, మూఢురాలు. మాను యొక్క మోడు

మొలక
చూ. మొలకల
పౌరుషనామం (రా.).
< సం. మూలికా–; అంకురం, అంకురించిన బీజం.

మొలకల
చూ. మొలక
పౌరుషనామం (న.).
మొలక బహు. కు ద్వి.వి.

## మో

మోకాదు
చూ. మొహకాద్

వృత్తిసూచి (రా.స.).
గ్రామ నౌఖరు.

మోది
పౌరుషనామం (రా.).
వెచ్చమిచ్చువాడు. ఆం.వా.
బలిజల్లో గృహనామం.

మోదుగు
రూ. మోదుగుల
వృక్షసూచి (స.).
వృ. నా : Butea monsperma.
నల్లరేగడి నేలల్లోనూ, ఉప్పుపర్రల్లోనూ ఎక్కువగా పెరుగుతుంది. త.మురుక్కు; మ. మురిక్కు; క. ముత్తు, ముత్తగ, ముత్తల,ముత్తక ,ముత్తుగ;తు.ముత్తక; తె. మోదుగు. డి.ఇ.డి. 4084.

మోదుగుల
చూ. మోదుగు
వృక్షసూచి (తె.).
మోదుగు బహు. కు ద్వి.వి.

మోపు
పౌరుషనామం (శా.).
గడ్డి మొదలైన వాటి పెద్దకట్ట, పుల్లల కట్ట. "__మోపు వెంకంగారు__" శా.1212. (టి.యం.పి.II; పు.1058; నెం. 66).

మోరోజు
వ్యక్తినామం (తె.).
మోరొ+ఓజు. మోరొ_ గృ.నా.పూ; <మరాఠీ. మోర_ <ప్రా. మోర_ <సం. మయూర_ నెమలి.
చూ. _ఓజు గృ.నా.ప.

మోళిగ
అస్పష్టనామబంధసూచి (శా.).
"__మోళిగ మారయ్య మోసపుచ్చితివా___" (పండి. పు. 208).
"__మోళిగ మాదెయ్య మున్నయ్య శరణు__" (పండి. పు. 243)

# య

యంగుసెట్టి
వ్యక్తినామం (స.).
యంగు_ గృ.నా.పూ; వ్య.నా.<వెంగు <వెంగ <వెంగడ <వెంగమాంబ.
చూ. _సెట్టి గృ.నా.ప.

యజ్ఞన్నభట్ల
వ్యక్తినామం (స.).
యజ్ఞన్న_ గృ.నా.పూ; పు.నా. యజ్ఞ+అన్న. సం. యజ్ఞ_ యజ్ఞం. _అన్న_ చూ. గృ.నా.ప. వైదిక బ్రాహ్మణులలో ఇంటిపేరు. చూ. _భట్ల గృ.నా.ప.

యజ్ఞావఝుల
వ్యక్తినామం (స.).
యజ్ఞా_ గృ.నా.పూ; యజ్ఞ+అ.వి. చూ. యజ్ఞన్నభట్ల. బ్రాహ్మణులలో ఇంటిపేరు. చూ. _వఝుల గృ.నా.ప.

యజ్జ
చూ. యెజ్జు
పౌరుషనామం (సా.).
"యజ్జదాసయగారి నాగడించితివా—"
(పండి; పు. 288).

యజ్జు
చూ. యెజ్జు
పౌరుషనామం (న.).

యడ్ల
చూ. ఎడ్ల
జంతుసూచి (తె.న.).
కమ్మవారిలో ఇంటిపేరు.

యతిరాజు
వ్యక్తినామం (న.).
యతి— గృ.నా.పూ; సన్యాసి. వైష్ణవ యతికి బ్రహ్మసూత్రం, త్రిదండం, చర్మవస్త్రం, శిక్యం, కౌపీనం, కటివేషం వుంటాయి. బ్రాహ్మణులలో ఇంటిపేరు.
చూ. —రాజు గృ.నా.ప.

యథావాక్కుల
పౌరుషనామం (సా.).
?వ్యుత్పత్తి అస్పష్టం.
"—ధర యథావాక్కులాన్వయు లత్వ విదులు—" (శత.చ. పు.66).

యమ్మోజి
వ్యక్తినామం (న.).
యమ్మ— గృ.నా.పూ; <సం.హేమ—బంగారం. చూ. —ఓజి గృ.నా.ప.

యరసాని
చూ. యర్రసాని
వ్యక్తినామం (న.).
బలిజకులంలో ఇంటిపేరు.

యరసెట్టి
చూ. యర్రసెట్టి
వ్యక్తినామం (న.).

యర్రం
?యర్రమ
వ్యక్తినామం (న.).

యర్రమనేడి
చూ. యర్రమునేని
వ్యక్తినామం (రా.న.).
కమ్మవారిలో ఇంటిపేరు.

యర్రమునేని
చూ. యర్రమనేడి, యరంనీడి
యర్రము— గృ.నా.పూ. స్త్రీ. నా. <యర్రమ <ఎర్రమ <ఎఱ్ఱ + అమ. ఎర్ర— వర్ణసూచి. ఎఱుని. చూ.ఎర్రా. ?<ఎర్ <ఎఱై : రాజు, దేవుడు
చూ. —నేని గృ.నా.ప.

యర్రంనీడి
చూ. యర్రమునేని
వ్యక్తినామం (న.).

యర్రసాని
చూ. యరసాని
వ్యక్తినామం (న.).

యఱ్ఱ— గృ.నా.పూ; వర్ణసూచి.వి.చూ. యఱ్ఱమునేని. చూ. _సాని గృ.నా.వ.

యఱ్ఱసెట్టి

చూ. యరసెట్టి

వ్యక్తినామం (స.).

యఱ్ఱ— గృ.నా.పూ; వి.చూ. యఱ్ఱమునేని. చూ. _సెట్టి గృ.నా.వ.

యఱ్ఱెద్దు

జంతుసూచి (స.).

ఎఱ్ఱ+ఎద్దు.ఎఱ్ఱని శరీర వర్ణంగల ఎద్దు.

యలనేని

వ్యక్తినామం (స.).

యల— గృ.నా.పూ; ?<ఎల : లేత. ?<వెల <వెల్ల : తెలుపు.

చూ. _నేని గృ.నా.వ.

యలసాని

వ్యక్తినామం (స.).

యల_ గృ.నా.పూ; వి.చూ. యలనేని. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. —సాని గృ.నా.వ.

యలసెట్టి

వ్యక్తినామం (స.).

యల_ గృ.నా.పూ; వి.చూ యలనేని.

చూ. _సెట్టి గృ.నా.వ.

యల్లంభట్ల

వ్యక్తినామం (తె.స.).

యల్లం_ గృ.నా.పూ; స్త్రీ.నా. దేవతా సూచి. <ఎల్లమ. వి.చూ. ఎల్లమరెడ్డి బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. _భట్ల గృ.నా.వ.

యల్లంరాజు

వ్యక్తినామం (స.).

యల్లం_ గృ.నా.పూ; వి.చూ. ఎల్లమరెడ్డి. చూ. _రాజు గృ.నా.వ.

యల్లాజోస్యుల

వ్యక్తినామం (తె.స.).

యల్లా_ గృ.నా.పూ; <ఎల్లా <ఎల్ల. ఎల్లమ్మ. స్థానిక దేవత. బ్రాహ్మణులలో ఇంటిపేరు. చూ. _జోస్యుల గృ.నా.వ.

యళంకారి

వృత్తిసూచి (శా.).

<అలంకారి. ఇది అలంకారి పదానికి లేఖన దోషం కావచ్చని ప్రా.శా:పు.454. "—వేనాణ్టిదాసు యళంకారియరిపులియు అంకాడిరి_" 972ఎ. డి. (ఇ. టి. ఐ; నెం. 88; పు. 96; వం. 12).

యస్సయ్

వృత్తిసూచి (తె.).

<ఆం. యస్.ఐ.(Sub Inspector).

## యా

యాగరాజు

వ్యక్తినామం (స.).

యాగ_ గృ.నా.పూ; యజ్ఞం. ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.

చూ. _రాజు గృ.నా.వ.

యాత
రూ.యాతం
పౌరుషనామం (తె.).
బాటసారి.

యాతం
చూ. యాత
పౌరుషనామం (తె.).

యాదవ
కులసూచి (తె.స.).
యాదవవంశం. యదువంశానికి చెందిన వారు. ముద్దా, చెన్ను, బొంతగర్ల మొదలైనవి ఈ కులంలోని ఇంటిపేర్లు.

యానాది
కులసూచి (రా.స.).
యానమ్ (yanam) = పడవ; ఆది (adi) = (means) రాబడి, సాధ్యం అని కొందరూ;a=private; nadhu= Lord (or) Protector – Who are not included in the ruling or Principal caste అని కొందరూ వ్యుత్పత్తి చేస్తారు. కానీ ఇవి సరైనవి కావనీ, సంస్కృత పదమైన అనాది నుండి వచ్చిందని మరికొందరి అభిప్రాయం. ఈగల, ఎలుగు, చిలకల, తెంకాయల, తుపాకుల మొదలైనవి ఈకులంలోని ఇంటిపేర్లు.

యానిగౌడి
రూ. యానెగౌడి (తె.).
వ్యక్తినామం (తె.).
యాని_ గృ.నా.పూ: ?<త.యానై : ఏనుగు. క. ఆనె.
చూ. _గౌడి గృ.నా.ప.

యానెగౌడి
చూ. యానిగౌడి
వ్యక్తినామం (తె.).

యామ
రూ. యామా, యామాల
పౌరుషనామం (స.).
<యామము : శరీరాన్నే సాధనంగా కల్గిన ఒక యోగాంగం, యమం.

యామసాని
వ్యక్తినామం (స.).
యామ_ గృ.నా.పూ: <సం. హేమ_ బంగారం. చూ. _సాని గృ.నా.ప.

యామసెట్టి
వ్యక్తినామం (స.).
యామ_ గృ.నా.పూ; వి.చూ. యామసాని. చూ. _సెట్టి గృ.నా.ప.

యామా
చూ. యామ
పౌరుషనామం (స.).

యామాల
చూ. యామ
పౌరుషనామం (స.).

## యి

యినపకోళ్ళ
పౌరుషనామం (స.).
యినుపకోడు బహు. కు ద్వి. వి. ఇనుము+కోడు. ఇనుము– పంచలోహాల్లో ఒకటి; –కోడు. <సం. ఖట్వా– బల్ల కోడు, పీటకోడు, మంచంకోడు.

యిమిడాబత్తుని
వ్యక్తినామం (స.).
యిమిడా– గృ.నా.పూ; ?<ఇమిడా
చూ. –బత్తుని గృ.నా.ప.

యిమ్మడిసెట్టి
వ్యక్తినామం (స.).
యిమ్మడి– గృ.నా.పూ; <ఇమ్మడి. రెండవ. చూ. –సెట్టి గృ.నా.ప.

యిరపనేని
వ్యక్తినామం (స.).
యిరప– గృ.నా.పూ; వ్య.నా. < వీరప–
చూ. –నేని గృ.నా.ప.

## యీ

యీబూది
చూ. విభూతి
పౌరుషనామం (స.).

యీరిసెట్టి
వ్యక్తినామం (స.).
యీరి– గృ.నా.పూ; వ్య.నా. <వీరి_
చూ. –సెట్టి గృ.నా.ప.

## యె

యెజ్జు
చూ. యజ్ఞ, యజ్ఞు
పౌరుషనామం (స).
?<వెజ్జు. <సం. వైద్య– వైద్యుడు.

యెఱ్ర
చూ. ఎఱ్ఱ
వర్ణసూచి (రా.శా.స.).
దేవాంగులలో ఇంటిపేరు.
"–యెఱ్ర తిమ్మరాజ–" (టి.యం. పి. II; పు.966; నెం. 547).

యెల్లిన
చూ. యెల్లినేని
వ్యక్తినామం (స.).

యెల్లినేని
చూ. యెల్లిన
వ్యక్తినామం (స.).
యెల్లి– గృ.నా.పూ; వ్య.నా; దేవతాసూచి. <ఎల్లి. <ఎల్ల– ఎల్లమ్మ. వి.చూ. ఎల్లమరెడ్డి.
చూ. –నేని గృ.నా.ప.

## యే

యేనిసెట్టి
వ్యక్తినామం (తె.).
యేని– గృ.నా.పూ; వి.చూ. యానిగౌడి.
చూ. –సెట్టి గృ.నా.ప.

## ర

రఘునాథభట్ల

వ్యక్తినామం (తె.స.).

రఘునాథ– గృ.నా.పూ; పు.నా. దేవతా సూచి. <సం. రఘునాథ.

బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. –భట్ల గృ.నా.ప.

రఘుపతి

వ్యక్తినామం (స.).

రఘు– గృ.నా.పూ; వ్య.నా.

కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. –పతి గృ.నా.ప.

రంగ

వ్యక్తినామం (తె.).

<పాండురంగనికి సంక్షేపరూపం.

<సం. రంగా– శ్రీరంగనాధుడు.

రంగరాజు

వృత్తిసూచి (తె.).

<రంగిరేజు.

రంగాభొట్ల

వ్యక్తినామం (స.).

రంగా– గృ.నా.పూ; వ్య.నా. రంగ+అ. వి.చూ.రంగ. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. –భొట్ల గృ.నా.ప.

రంగావఝుల

వ్యక్తినామం (స.).

60)

రంగా– గృ.నా.పూ; వ్య.నా. వి.చూ. రంగ. వెలనాటి వైదిక బ్రాహ్మణులలో ఇంటిపేరు. చూ. –వఝుల గృ.నా.ప.

రంగిరెడ్డి

వ్యక్తినామం (తె.).

రంగి– గృ.నా.పూ; రంగ+ఇ. వి.చూ. రంగ. చూ. –రెడ్డి గృ.నా.ప.

రంగిసెట్టి

వ్యక్తినామం (స.).

రంగి– గృ.నా.పూ; వ్య.నా; రంగ+ఇ. వి.చూ. రంగ. చూ. –సెట్టి గృ.నా.ప.

రంగోని

వ్యక్తినామం (తె.).

రంగ + గోని. రంగ– గృ.నా.పూ; వ్య.నా. వి.చూ. రంగ.

చూ. –గోని గృ.నా.ప.

రజకం

వృత్తిసూచి (స.).

<సం. రజక– చాకలివాని వృత్తి.

రంజకం

పౌరుషనామం (శా.).

<రంజకం : ఇంగిలీకము, రాగద్రవ్య విశేషం. ''—రంజకం శ్రీరంగరాజ—'' శా. 1434 (టి. టి. డి. ఇ. యస్. III; పు. 88; నెం. 24). ''—రంజకం కుప్పసాని—'' శా. 1453 (టి. టి. డి. ఇ. యస్. IV; పు.24; నెం. 13).

రణమర్ద
బిరుదనామం (శా.).
?వ్యుత్పత్తి అస్పష్టం.
"—వేగీశ్వరునకు రనమర్ద్దాన్వయ కులతిలకు— ప్రాప్తంబయ్న రణ మర్ద్దకణియదన—" క్రీ.శ. 935. (ఇ.టి.ఐ: పు. 66; పం. 4–8).

రత్నం
చూ. రత్నాల
పౌరుషనామం (తె.).
<రత్నము. రత్నాల వ్యాపారం చేసేవారు.

రత్నాకర
చూ. రత్నాకరం
జలసూచి (సా.).
"వసుధ రత్నాకరంబను వంశ జలధి—" (శశిరే; 1–14).
"—రత్నాకర వంశపయః పారా వార—" (శశిరే; ఆశ్వాగ.).

రత్నాకరం
చూ. రత్నాకర
జలసూచి (తె.రా.స.).
<సం. రత్నాకర.. రత్నాలకు నిలయమైనవాడు, రత్నాలకుగని, సముద్రుడు. క్షత్రియులలో, రెడ్లలో గృహనామంగా కన్పిస్తుంది.

రత్నాల
చూ. రత్నం
పౌరుషనామం (స.).
రత్నాం బహు. కు ద్వి.వి.

రమణిసెట్టి
వ్యక్తినామం (స.).
<రమణి– గృ.నా.పూ; స్త్రీ.నా.
<రమణా : బర్మాలోని ఒక రేవు పట్టణం. ఆ దేశంతో వాణిజ్యంసాగించే వ్యక్తి. చూ. –సెట్టి గృ.నా.ప.

రంప
చూ. రంపాల
వృత్తిపరికరసూచి (శా.).
<దే. రంపము.
"—రంప అనంతభట్లు—"(టి.యం. పి.II; పు.1065; నెం.111).

రంపాల
రూ. రంప
వృత్తిపరికరసూచి (స.).
రంపం బహు. కు ద్వి.వి. వృత్తి పరికరం.
ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.

రసం
పౌరుషనామం (తె.).
<రసము. పాదరసం, నీరు, పసరు, అనురాగం.

## రా

రాగం
పౌరుషనామం (స.).

సంగీతశాస్త్ర పరిభాష.

రాగి

లోహసూచి (రా.స.).

<సం. రక్త– ఒకలోహం, తామ్రం.

రాగిచెంబుల

వస్తుసూచి (తె.).

రాగిచెంబు బహు. కు ద్వి. వి. రాగితో తయారుచేసిన చెంబు.

రాగుల

ధాన్యసూచి (తె.రా.).

రాగులు కు ద్వి.వి. తమిదలు, చోళ్ళు. రాగ– ఎరుపురంగు. ఎరుపురంగులో వున్నాయి కనుకనే రాగులని పేరు. ఎరుకల, మాదిగలలో ఇంటిపేరు.

వృ.నా : Eleusine Corcana.

రాగోని

వ్యక్తినామం (తె.).

రా– గృ.నా.పూ; వ్య.నా. <రాచ. రాచ శబ్దానికి అంత్యవర్ణం లోపించగా మిగిలిన రూపం. చూ. –గోని గృ.నా.వ.

రాఘవ

వ్యక్తినామం (తె.).

పు.నా; దేవతాసూచి. <సం. రాఘవ– రఘురాముడు.

బ్రాహ్మణులలో ఇంటి పేరు.

రాఘవభట్ల

వ్యక్తినామం (స.).

రాఘవ– గృ.నా.పూ; పురుష దేవతా సూచి. వి.చూ. రాఘవ.

ఆరామ ద్రావిడులలో ఇంటిపేరు.

చూ. –భట్ల గృ.నా.వ.

రాచ

పౌరుషనామం (తె.).

<రాచ. రాజసంబంధమైన. రాచవాడు.

<సం. రాజన్: రాజు.

కమ్మవారిలో ఇంటిపేరు.

రాచనేని

వ్యక్తినామం (స.).

రాచ– గృ.నా.పూ; రాజుకు చెందిన. వి.చూ. రాచ. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. –నేని గృ.నా.వ.

రాచమల్ల

చూ. రాచమల్లు

వ్యక్తినామం (తె.).

రాచమల్లు

రూ. రాచమల్ల

వ్యక్తినామం (రా.స.).

రాచ– గృ.నా.పూ; రాజసంబంధమైన. వి.చూ. రాచ. కడప మండలంలో రెడ్లలోనూ, సర్కారుజిల్లాల్లో ఆర్వేల నియోగులలోను ఇంటిపేరుగా ఉంది.

చూ. –మల్లు గృ.నా.వ.

రాచంరెడ్డి

వ్యక్తినామం (స.).

రాచం– గృ.నా.పూ; స్త్రీ.నా. రాచ+ అమ. వి.చూ. రాచ.
చూ. –రెడ్డి గృ.నా.ప.

రాచంసెట్టి
వ్యక్తినామం (స.).
రాచం– గృ.నా.పూ; వి.చూ. రాచ.
చూ. –సెట్టి గృ.నా.ప.

రాచాబత్తుని
వ్యక్తినామం (స.).
రాచా– గృ.నా.పూ; పు.నా. రాజ. < రాచ+అ. వి.చూ. రాచ.
చూ. –బత్తుని గృ.నా.ప.

రాచిరాజు
వ్యక్తినామం (స.).
రాచి– గృ.నా.పూ; రాచ+ఇ. వి.చూ. రాచ. ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.
చూ. –రాజు గృ.నా.ప.

రాజపురోహితు
వృత్తిసూచి (తె.).
రాజ– వి.చూ. రాచ; –పురోహితు <సం. పురోహిత– పురోహితుడు. శుభాశుభ వైదిక కర్మలను చేయిస్తూ మేలు, కీడులను తెలిపే ఆచార్యుడు.

రాజా
వ్యక్తినామం (తె.).
<సం. రాజ. వి.చూ. రాచ.

రాజాసెట్టి
వ్యక్తినామం (తె.స.).
రాజా– గృ.నా.పూ; పు.నా. వి.చూ. రాజా. చూ. –సెట్టి గృ.నా.ప.

రాజు
చూ. రాజుల
?పౌరుషనామం?కులసూచి (రా.స.).
రాచవాడు, క్షత్రియుడు, పుడమిఱేడు. రాజు వైకృతమని ఆం.వా; సంస్కృత శబ్దమని శ.ర; కొన్నికులాలలో వ్యక్తినామాల చివర పట్టపుపేరుగా వాడుతున్నారు బ్రాహ్మణులలో ఇంటిపేరు.
కమ్మ, కాపు, వెలమ కులాలనుండి వచ్చారని మద్రాసు సెన్సస్‌రిపోర్టు 1901 పేర్కొంది. కొండ దొరలను కూడ రాజులంటారు. గోదావరి డెల్టాలో బసవ రాజులు అనేక కుటుంబాల వారున్నారు. వీరి పూర్వీకులు పొరపాటున బసవేశ్వరుణ్ణి చంపారట. అందుకు ప్రతిఫలంగా వారు వివాహం చేసుకోబోయే ముందు ఒక ఆవుకు ఎద్దుకు వివాహం చేసి తరువాత వాళ్ళు పెళ్ళి చేసుకునేవారని Mr.Chains రాశారు. కడపజిల్లాలోను, విశాఖ జిల్లాలోను రాజుకులస్థులున్నారు.

రాజుల
చూ. రాజు
?<కులసూచి (రా.).
రాజు బహు. కు ద్వి.వి. కాపులలో, బ్రాహ్మణులలో ఇంటిపేరు.

రాట్నాల
వృత్తి పరికరసూచి (స.).

రాట్నం బహు. ఈ ద్వి.వి.
<రాట్నము. <సం. రహట_ సూలు వడికే యంత్రం.
బలిజ కులంలో ఇంటిపేరు.

రాణీ

పౌరుషనామం (స.).
<రాణి <సం. రాజ్ఞి_ పట్టపుదేవి. పేరూరు ద్రావిడులలో ఇంటిపేరు.

రాతి

శిలాసూచి (స.).
రాయికి ఔప : శిల.

రామదాసు

వ్యక్తినామం (శా.స.).
రామ_ గృ.నా.పూ; పు.నా. దేవతా సూచి. <రామ_ రాముడు. కంచెర్ల గోపన్నకు రామదాసనే మరోపేరుంది. రామునకు దాసుడు రామదాసు.
బ్రాహ్మణులలో ఇంటిపేరు.
"రామదాసు తిమ్మరుసు__"(టి.యం. పి.I; పు.634; నెం. 643).
చూ. _దాసు గృ.నా.ప.

రామనపెగ్గడ

వ్యక్తినామం (శా.).
రామన_ గృ.నా.పూ; పు.నా. <రామ+ అన. రామ_ వి.చూ. రామదాసు.
_అన_ చూ. _అన్న గృ.నా.ప.
"__పిట్టలూరి కొణ్డపరడ్డి, రామన పెగ్గడ మేడియయు__" 742_79 ఎ.డి. (ఇ.టి.ఐ; పు.38; నెం.64; పం.6).

రామనబోయిన

వ్యక్తినామం (తె.స.).
రామన_ గృ.నా.పూ; పు.నా. వి.చూ. రామన పెగ్గడ.
చూ. _బోయిన గృ.నా.ప.

రామనమోని

వ్యక్తినామం (తె.).
రామన+బోయని. రామన_గృ.నా.పూ: వ్య.నా. వి.చూ. రామనపెగ్గడ.
చూ. _మోని గృ.నా.ప.

రామనాథం

వ్యక్తినామం (స.).
వ్య.నా; దేవతాసూచి. <సం. రామనాథ_

రామరాజు

వ్యక్తినామం (శా.సా.).
రామ_ గృ.నా.పూ; వ్య.నా. వి.చూ. రామదాసు. బ్రాహ్మణులలో ఇంటిపేరు.
"__రామరాజు తిరుమలయ్య__" శా. 1404(టి.యం.పి.II; పు.909; నెం.9).
"__రామరాజు తిరుమల రాజయ్య దేవరాజులుంగారు__" యస్.ఐ.ఐ. VI; పు. 218; పం. 17; నెం. 698).
"__రామరాజు కొండదేవ మహారాజు__" శా. 1475 (టి. యం. పి. I; పు. 24; నెం. 147).
"__రామరాజు కోనేటయ్య__"

(యస్.ఐ.ఐ.IV; పు. 74; నెం. 280).
"—రామరాజు మేద్రాజుంగారు—" (తెలం.శా.I; పు.177; పం.2–3).
"శ్రీరామరాజు తిమ్మరాజు పిన కొండ—" (సాంబో. 142).
ఇది—రామరాజు రంగప్పరాజ ప్రణీతంబైన—"(సాంబో.ఆశ్వా.గ.పు.31).
చూ. –రాజు గృ.నా.ప.

రామసాని

వ్యక్తినామం (తె.స).
రామ– గృ.నా.పూ; వ్య.నా. దేవతా సూచి. వి.చూ. రామదాసు. కమ్మవారిలో ఇంటిపేరు. చూ. –సాని గృ.నా.ప.

రామసెట్టి

వ్యక్తినామం (స.).
రామ– గృ.నా.పూ; వ్య.నా. దేవతా సూచి. వి.చూ. రామదాసు.
చూ. –సెట్టి గృ.నా.ప.

రామాప్రగడ

రూ. రామాప్రెగ్గడ
వ్యక్తినామం (స.).
రామా– గృ.నా.పూ; దేవతాసూచి. రామ+అ. రామ– వి.చూ. రామదాసు ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.
చూ. –ప్రగడ గృ.నా.ప.

రామాప్రెగ్గడ

చూ. రామాప్రగడ
వ్యక్తినామం (సా.).
"రామాప్రెగ్గడ గంగరాజునకు విభ్రాజద్యశశ్శస్ఫూర్తి—"(Tel.Ma; ప్రబంధ. పు. 48).

రామాభట్లు

వ్యక్తినామం (శా.).
రామా– గృ.నా.పూ: దేవతాసూచి. వ్య.నా. వి.చూ. రామదాసు.
"రామాభట్లు నరసింహ జోస్యులు—" శా. 1674 (టి.యం.పి I; పు. 657; నెం. 887). చూ. –భట్లు గృ.నా.ప.

రామాయణం

పౌరుషనామం (శా.స.).
రామాయణ పఠనంలో దిట్టతనం కలవారు. "—రామాయణం మాధవయ్య—" శా.1451; (టి.యంపి I; పు. 660; నెం. 916).

రామావఝుల

వ్యక్తినామం (స.).
రామా– గృ.నా.పూ; వ్య.నా. దేవతా సూచి. వి.చూ. రామదాసు. వెలనాటి వైదిక బ్రాహ్మణులలో ఇంటిపేరు.
చూ. –వఝుల గృ.నా.ప.

రామిడి

చూ. రామినేని
వ్యక్తినామం (తె.).
<రామినీడు. కమ్మవారిలో ఇంటిపేరు.

రామినీడు

చూ. రామినేని

వ్యక్తినామం (స.).
కమ్మవారిలో ఇంటిపేరు.

రామినేని

రూ. రామిడి, రామినీడు.
వ్యక్తినామం (రా.స.).
రామి– గృ.నా.పూ; వ్య.నా. దేవతా సూచి. రామ+ఇ. రామ– వి. చూ. రామదాసు. కమ్మవారిలో ఇంటిపేరు.
చూ. –నేని గృ.నా.ప.

రామిసెట్టి

వ్యక్తినామం (స.).
రామి– గృ.నా.పూ; వ్య.నా. దేవతా సూచి. వి.చూ. రామదాసు.
చూ. –సెట్టి గృ.నా.ప.

రాంభట్ల

రూ. రాంభొట్ల
వ్యక్తినామం (స.).
రాం– గృ.నా.పూ; పు.నా. దేవతా సూచి. <రామ– వి.చూ. రామదాసు. పేరూరు ద్రావిడులలో ఇంటిపేరు.
చూ. –భట్ల గృ.నా.ప.

రాంభొట్ల

చూ. రాంభట్ల
వ్యక్తినామం (స.).

రాంసెట్టి

వ్యక్తినామం (స.).
రాం– గృ.నా.పూ; పు.నా. <రామ. వి.చూ. రామదాసు.
చూ. –సెట్టి గృ.నా.ప.

రాయకవి

బిరుదనామం (సా.).
కవిత్వసూచి. <రాయ <రాజ. రాజ కవి. "–అతులప్రౌఢిమ మీఱు రాయకవి యయ్యెన్ రాజు–" (రామాభ్యు.1–13).
"–శతక నిర్మాణ కర్మఠ రాయకవి తిప్పనార్యపాలకులును–"
(రెట్ట. 1–16),

రాయంచ

పక్షిసూచి (తె.).
రాచ+అంచ <సం. రాజహంస : మేటిహంస,

రాయన

చూ. రాయనేని
వ్యక్తినామం (స.).

రాయనమంత్రి

వ్యక్తినామం (శా.).
రాయన– గృ.నా.పూ; వ్య.నా. వి.చూ. రాయనేని. "–రాయనమంత్రి భాస్కరయ్య–" శా. 1524 (టి.యం.పి.I; పు. 620; నెం. 512).
చూ. –మంత్రి గృ.నా.ప.

రాయనిప్రగడ

వ్యక్తినామం (తె.స.).
రాయని– గృ.నా.పూ; పు.నా. రాయడు+ఇ. వి. చూ. రాయనేని. నందవరీక

బ్రాహ్మణులలో ఇంటిపేరు.
చూ. -ప్రగడ గృ.నా.ప.

రాయనేని
రూ. రాయన
వ్యక్తినామం (స.).
రాయ- గృ.నా.పూ; <రాయడు : రాజు. కమ్మవారిలో ఇంటిపేరు.
చూ. -నేని గృ.నా.ప.

రాయభారం
వృత్తిసూచి (స.).
<సం. రాజభార : దౌత్యం. ఆర్వేల నియోగులలో గృహనామం.

రాయభారి
వృత్తిసూచి (స.).
<రాయబారి. రాయబారం చేసేవాడు, దూత. మాధ్వులలో గృహనామం.

రాయల
పౌరుషనామం (స.).
<రాయడు. <సం. రాజ- వి.చూ. రాచ. కమ్మవారిలో ఇంటిపేరు.

రాయస
చూ. రాయసము
వృత్తిసూచి (శా.స.).
"--రాయస అయ్య పరసయ్య--" శా.1447 ( టి. యం. పి. I; పు. 21; నెం. 131).

రాయసం
చూ. రాయసము
వృత్తిసూచి (శా.స.).
"--నాదెండ్ల కరణం రాయసం అకప్ప--" శా.1047 (యస్.ఐ.ఐIV; పు.214; పం.18).
"--రాయసం కొండమరుసయ్యం గారు--" శా. 1047 (తెలం. శా. I; పు. 156; పం. 7-9).
"--కృష్ణరాయ మహారాయల రాయసం శ్రీపతి--" (టి.టి.డి.ఇ.యస్.III; పు. 197; నెం. 95).
"--రాయసం వెంకటాద్రి--" 8-7-1551ఎ.డి. (టి.టి.డి.ఇ.యస్.V; పు. 430; నెం. 160).
బ్రాహ్మణులలోఇంటిపేరు.

రాయసము
రూ. రాయస, రాయసం
వృత్తిసూచి (స.).
<వ్రాయసం. లేఖకోద్యోగం.

రాయిడి
చూ. రాయిన
వ్యక్తినామం (స.).

రాయిన
రూ. రాయిడి
<రాయినేని
వ్యక్తినామం (రా.స.).
కమ్మవారిలో ఇంటిపేరు.
రాయి- గృ.నా.పూ; <రాయ. వి.చూ రాయనేని. చూ. -న గృ.నా.ప.

రాళ్ళు

శిలాసూచి (రా.).

రాయి బహు. కు ద్వి.వి. వి. చూ. రాయి. బలిజలలో గృహనామం. బలిజలలో ఒక శాఖనీ, రాళ్ళకు పాలిష్‌పెట్టే వ్యాపారం చేసేవారని సి.టి.యస్.ఐ. పేర్కొంది.

రావి

రూ. రావిచెట్టు

వృక్షసూచి (తె.స.).

వృ.నా. Ficus religiosa.

త. అరచు; మ.అరయాల్, అరచు; క. అరసె, అరిసె, అరళి, అరళె; తె. రావి, రాగి. డి.ఇ.డి. 168. తెలగ, కాపు, బ్రాహ్మణులలో ఇంటిపేరు.

రావికింది

నివాసస్థలసూచి (స.).

రావి- వృక్షసూచి. రావిచెట్టుకింద నివాసం కలవారు.

రావిచెట్టు

చూ. రావి

వృక్షసూచి (తె.రా.స.).

రావినేని

వ్యక్తినామం (రా.).

రావి- గృ.నా.పూ; వ్య.నా. <రేవి నాయని. చూ. -నేని గృ.నా.వ



రావు

రూ. రావుల, రావులు

బిరుదనామం (తె.శా.స.సా.).

<సం.రాజ. కమ్మవారిలో ఇంటిపేరు.

"--రావు పిన్నప్ప భూపాల--" శా. 1397 (ఇ. ఎ. ఐ. II; పు. 185; నెం. 57). "--విబుధజన హృదయ శతపత్రుండును రావువంశ విస్తారకుండును--" (ఆంధ్రక. 1-6).

"కవితావిచిత్ర రావుకులసుధాశరధి--" (మిత్రవిం; పు. 49). "--బొమ్మల క్రియ రావువాచ భూవరు సింగా!" (చాటు. పు. 4).

రావుబిరుదు

బిరుదనామం (స.).

వి.చూ. రావు.

రావుల

చూ రావు

బిరుదనామం (తె.).

రావు బహు. కు ద్వి.వి.

కమ్మవారిలో ఇంటి పేరు.

?<రావులా : ఒరిస్సాలోని దేవాలయ సేవకులు. దేవాలయాలలోను, బ్రాహ్మణుల పెళ్ళిళ్ళలోనూ వాద్యం వాయించుతారు. పూలమ్ముతూ జీవించేవారని సి.టి.యస్.ఐ.

రావులవారి

పౌరుషనామం (తె.).

రావుల_ గృ.నా.పూ; వి.చూ. రావుల. చూ. _వారి గృ.నా.ప.

రావులు

చూ. రావు

బిరుదనామం (శా.).

"–_రావులు వెంకటాద్రిగారు–_" శా.1567 (టి.యం.పి. II; పు. 1118; నెం. 507).

రాశినేని

వ్యక్తినామం (రా.).

రాశి_ గృ.నా.పూ; ◄రాచి_ <రాచ_. వి.చూ. రాచ. చూ. _నేని గృ.నా.ప.

రాసమల్ల

వ్యక్తినామం (తె.).

రాస_ గృ.నా.పూ; ?<రాచ. వి.చూ. రాచ. చూ. _మల్ల గృ.నా.ప.

రాసినవాళ్ళు

పౌరుషనామం (రా.).

?<రాసినేనివాళ్ళు. రాసి_ గృ.నా.పూ; వై. <సం. రాశి : కుప్ప; _న_ చూ. గృ.నా.ప. చూ. _వాళ్ళు గృ.నా.ప.

## రు

రుత్తల

పౌరుషనామం (స.).

రుత్త బహు. కు ద్వి.వి; నాశం. దేశ్యమని శ. ర; వైకృత పదమని ఆం.వా. <సం. రిక్త_

రుద్రగోని

వ్యక్తినామం (తె.).

రుద్ర_ గృ.నా.పూ; దేవతాసూచి. <సం. రుద్ర : శివుడు.

చూ. _గోని గృ.నా.ప.

రుద్రభొట్ల

చూ. రుద్రాభట్ల

వ్యక్తినామం (స.).

రుద్ర_ గృ.నా.పూ; దేవతాసూచి. వి. చూ. రుద్రగోని.

చూ. _భొట్ల గృ.నా.ప.

రుద్రరాజు

వ్యక్తినామం (తె.).

రుద్ర_ గృ.నా.పూ; దేవతాసూచి. వి.చూ. రుద్రగోని. ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.

చూ. _రాజు గృ.నా.ప.

రుద్రాక్షుల

పౌరుషనామం (రా.స.).

రుద్రాక్ష బహు. కు ద్వి.వి. మెడలో ధరించే పవిత్రమైన వస్తువు. కర్ణసాలీలలో ఇంటిపేరు. రుద్రాక్షలకు మెరుగు పెట్టి శైవబ్రాహ్మలు మెడలో ధరిస్తారు. "They are supposed to be the tears of ecstacy which Siva (Rudra) once shed, and are consequently sacred to him" సి. ఐ. యస్. ఐ. ఏకముఖ, షణ్ముఖ రుద్రాక్షలు చాలా అరుదు.

రుద్రాభట్ల

చూ. రుద్రభొట్ల

వ్యక్తినామం (తె.స.).

<రుద్ర+అ. వెలనాటి వైదిక బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. -భట్ల గృ.నా.ప.

రుద్రావఝుల

వ్యక్తినామం (తె.).

రుద్రా- గృ.నా.పూ; దేవతాసూచి. వి. చూ. రుద్రగోని. బ్రాహ్మణులలో ఇంటిపేరు. చూ. -వఝుల గృ.నా.ప.

## రె

రెడ్డి

కులసూచి (తె.రా.స.).

వి. చూ. -రెడ్డి గృ.నా.ప.
బ్రాహ్మణులలో ఇంటిపేరు.

రెడ్డిబత్తుల

వ్యక్తినామం (స.).

రెడ్డి- గృ.నా.పూ; పురుషనామానుబంధం. వి.చూ. -రెడ్డి గృ.నా.ప.
కులసూచి. చూ. -బత్తుల గృ.నా.ప.

రెడ్డిమల్లు

వ్యక్తినామం (స.).

రెడ్డి- గృ.నా.పూ; కులసూచి. వి.చూ. -రెడ్డి గృ.నా.ప.

చూ. -మల్లు గృ.నా.ప.

రెడ్డిముక్కల

పౌరుషనామం (స.).

రెడ్డిముక్క- బహు. కు. ద్వి.వి.

రెడ్డిరాయ

బిరుదనామం (స.).

రెడ్డి- గృ.నా.పూ; కులసూచి. పు.నా.ప. వి.చూ. -రెడ్డి గృ.నా.ప.

చూ. -రాయ గృ.నా.ప.

రెడ్డివారి

పౌరుషనామం (రా.).

రెడ్డి- గృ.నా.పూ; కులసూచి, పు.నా.ప; వి.చూ. -రెడ్డి గృ.నా.ప.

చూ. -వారి గృ.నా.ప.

రెబ్బాప్రగడ

వ్యక్తినామం (స.).

రెబ్బా- గృ.నా.పూ; <రెబ్బ. ఉపశాఖ. ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.

చూ. -ప్రగడ గృ.నా.ప.

## రే

రేకల

పౌరుషనామం (తె.).

రేక- బహు. కు ద్వి.వి; తాటాకు మట్టతో కట్టిన దొప్ప. ?<రేఖల.

రేకాది

వృత్తిసూచి (శా.).

Occurs as an attribute of a boya a village officer. ఇ.టి.ఐ.
"—రేకాదిబోయరేవళమ్మ—" 668–69ఎ.డి. (ఇ.టి.ఐ; పు.176: నెం.125).

రేఖల

పౌరుషనామం (స).

రేఖ బహు. కు ద్వి.వి. దగ్గరదగ్గరగా వున్నచెట్లు మొదలైనవాని వరుస; గీత.

రేగి

రూ. రేగుల

వృక్షసూచి (రా.స.).

వృ.నా: Ziziphus mauritiana.

రేగుల

చూ. రేగి

వృక్షసూచి (తె.రా.).

రేగి బహు. కు. ద్వి.వి. కమ్మవారిలో ఇంటిపేరు.

## రొ

రొక్కం

పౌరుషనామం (తె.).

<రొక్కము : చేతివెల, ధనం, నగదు. కోమట్లలో ఇంటిపేరు.

రొట్టెల

ఆహారపదార్థసూచి (తె.స.).

రొట్టె బహు. కు ద్వి.వి. భక్ష్యవిశేషం. బోయలలో ఇంటిపేరు.

రొంటినేని

వ్యక్తినామం (స.).

రొంటి– గృ.నా.పూ.?

చూ. –నేని గృ.నా.ప.

రొండి

అవయవసూచి (తె.).

నడుముయొక్క పార్శ్వభాగం, తుంటి.

## రౌ

రౌతు

పౌరుషనామం (రా.స.).

<ప్రా.రాయఉత్త–,రావుత్త,రాహుత్త.

<సం. రాజపుత్ర– గుర్రం ఎక్కేవాడు.

## ల

లకుంసాని

చూ. లక్కమసాని

వ్యక్తినామం (తె.స.).

లకుంసెట్టి

చూ. లక్కమసెట్టి

వ్యక్తినామం (స.).

లక్కపనాయని

వ్యక్తినామం (శా.).

లక్కప– గృ.నా.పూ; వ్య. నా. లక్క+అప. వి.చూ. లక్కరాజు.

"లక్కపనాయని మాచిరాజు—"

(యస్.ఐ.ఐ.VI; పు.228; నెం.705ఎ).

లక్కమసాని

వ్యక్తినామం (స.).

లక్కమ– గృ.నా.పూ; వ్య. నా. దేవతాసూచి. లక్క+అమ, వి. చూ. లక్కరాజు. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. –సాని గృ.నా.ప.

లక్కమసెట్టి

రూ. లకుంసెట్టి, లక్కంసెట్టి

వ్యక్తినామం (రా.స.).

లక్కమ_ గృ.నా.పూ; వ్య. నా; దేవతాసూచి. లక్క+అమ. వి. చూ. లక్కరాజు.

చూ. _సెట్టి గృ.నా.ప.

లక్కంసెట్టి

చూ. లక్కమసెట్టి

వ్యక్తినామం (తె.స.).

లక్కరాజు

వ్యక్తినామం (స.).

లక్క_ గృ.నా.పూ; వ్య.నా; దేవతా సూచి. <లక్ష్మి. <ప్రా. లక్ఖి <సం. లక్ష్మి.

చూ. _రాజు గృ.నా.ప.

లక్కల

చూ. లెక్కల

పౌరుషనామం (రా.స.).

లక్క బహు. కు ద్వి.వి. కాపులలో ఇంటిపేరు.

లక్కసాని

చూ. లక్కమసాని

వ్యక్తినామం (శా.).

''__లక్కసాని అమ్మన్__'' శా.1391 (ఇ.టి.ఐ. II; పు.77; నెం.43).

లక్కా

పౌరుషనామం (స ).

<లక్క <సం. లాక్ష_

లక్కావఝుల

వ్యక్తినామం (స.).

లక్కా_ గృ.నా.పూ; లక్క+అ. లక్క_ వి.చూ. లక్కరాజు. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. _వఝుల గృ.నా.ప.

లంక

రూ. లంకా

జలసూచి (శా.స.సా.).

నీటిమధ్యలో ఉన్న దిబ్బ, ద్వీపం, అంతరీపం. నదులపాయల మధ్య దిబ్బ వేసిననేల. సామాన్యంగా ఒండునేల. కమ్మవారిలో ఇంటిపేరు.

''__లంక మంత్రమూర్తిగారు__'' శా.1180 (టి.యం.పి.II; పు. 816; నెం. 566). ''__పిల్చెను లంకపోతన్న యనుచు__'' (పల్నా; పు.60; పం,265).

లంకసాని

వ్యక్తినామం (రా.).

లంక_ గృ.నా.పూ; <లెంక. వి.చూ. లంకిరెడ్డి. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. _సాని గృ.నా.ప.

లంకా

చూ. లంక

జలసూచి (రా.స.).

కమ్మవారిలోనూ, కాపులలోనూ ఇంటిపేరు.

లంకిరెడ్డి

వ్యక్తినామం (స.).

లంకి_ గృ.నా.పూ; <లెంక: భక్తుడు, సేవకుడు. చూ. _రెడ్డి గృ.నా.ప,

**లంకిసెట్టి**

వ్యక్తినామం (తె.స.).

లంకి– గృ.నా.పూ; వి.చూ. లంకిరెడ్డి.

చూ. –సెట్టి గృ.నా.ప.

**లంబాడి**

జాతిసూచి (తె.).

లంబాడి జాతి. వీరిని లంబాని,బంజారి, బోయ్‌పారి, బ్రింజారి. సుగాలి లేక సుకాలి అని పిలుస్తారు. సుగాలి అనేది సుపారి (వక్క)కు అపభ్రంశ రూపం. వీరు పెద్దఎత్తున వ్యాపారం చేశారు గనుక ఈ పేరు వచ్చింది. బంజారి అనే పదం < ప్రా. వాణిజ్జారో < సం. వాణిజ్యకారక–నుండి వచ్చింది. లంబాని పదం ఎలావచ్చిందో తెలియదు.

సంస్కృత లవణ శబ్దంనుండి లంబాడి వచ్చిందని, వీరు ఉప్పుమోసే వారని చెప్పారు. లంబాడీలు తాము వాలి, సుగ్రీవుల వంశంవారని చెప్పుతుంటారు. సి.టి.యస్.ఐ. IV.207.

**లహరి**

జలసూచి (స.).

పెద్దఅల.

## లా

**లాలం**

పౌరుషనామం (తె.స.).

< లాలము. ఉల్లారు కిందజాలరు.

**లావు**

పౌరుషనామం (తె.స.).

బలం, ఆధిక్యం, సామర్థ్యం, స్థూలం, హెచ్చు. కమ్మవారిలో ఇంటిపేరు.

## లి

**లిక్కి**

వృత్తిపరికరసూచి (తె.).

వస్తుసూచి. చిన్నకొడవలి.

**లింగబోయిన**

వ్యక్తినామం (తె.).

లింగన– గృ.నా.పూ; వ్య.నా. లింగ+ అన. లింగ– వి.చూ. లింగమనేని;

–అన– చూ. –అన్న గృ.నా.ప.

చూ. –బోయిన గృ.నా.ప.

**లింగనమఖి**

వ్యక్తినామం (సా.).

లింగన– గృ.నా.పూ; పు.నా. లింగ+ అన. వి.చూ. లింగమనేని.

బ్రాహ్మణులలో ఇంటిపేరు.

"–కలాపఖనివెంగ లింగనమఖేంద్రు నాగ—" (సత్యభా; పీ.).

చూ. –మఖి గృ.నా.ప.

**లింగం**

రూ. లింగాల

పౌరుషనామం (తె.రా.).

దేవతాసూచి. < లింగము : పానపట్టంమీదున్న శివునిరూపం. కమ్మవారిలో, హరిజనులలో ఇంటిపేరు.

**లింగమనేని**

వ్యక్తినామం (తె.శా.స.).

లింగమ- గృ.నా.పూ; దేవతాసూచి. <లింగము. <సం. లింగం. వి.చూ. లింగం. పంచ వింశతి తత్వాలయందు ఆదియైన ప్రకృతి (శివస్వరూపం).

కమ్మవారిలో ఇంటిపేరు.

"—లింగమనేని మాదానేండు—" (యస్.ఐ.ఐ.VI; పు.228; నెం.705ఎ).

చూ. -నేని గృ.నా.వ.

**లింగమల్లు**

వ్యక్తినామం (స.).

లింగ- గృ.నా.పూ; వి.చూ. లింగమనేని. చూ. -మల్లు గృ.నా.వ.

**లింగాబత్తుల**

వ్యక్తినామం (స.).

లింగా- గృ.నా.పూ; లింగ+అ. లింగ- వి.చూ. లింగమనేని.

చూ. -బత్తుల గృ.నా.వ.

**లింగాల**

చూ. లింగం

పౌరుషనామం (తె.స.).

లింగం బహు. కు ద్వి.వి.

బ్రాహ్మణులలో ఇంటిపేరు.

**లింగిచెట్టి**

చూ. లింగిసెట్టి

వ్యక్తినామం (తె.).

**లింగినేని**

వ్యక్తినామం (స.).

లింగి- గృ.నా.పూ; వ్య.నా <లింగయ. వి.చూ. లింగమనేని.

కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. -నేని గృ.నా.వ.

**లింగిసెట్టి**

రూ. లింగిచెట్టి

వ్యక్తినామం (తె.స.).

లింగి- గృ.నా.పూ; వ్య.నా; లింగ+ఇ. లింగ- వి.చూ. లింగమనేని.

చూ. -సెట్టి గృ.నా.వ.

**లింగోజి**

వ్యక్తినామం (తె.).

లింగ- గృనా.పూ; వ్య.నా, వి.చూ. లింగమనేని. చూ. -ఓజి గృ.నా.వ.

## లె

**లెక్కల**

రూ. లక్కల, లెక్కల్లి

పౌరుషనామం (శా.స).

లెక్క బహు. కు ద్వి.వి. <సం. లక్ష్య- సంఖ్య, అంకె. కమ్మవారిలో, కోమట్లలో ఇంటిపేరు.

?<సం. లక్ష్యం. లక్షంచేయడం.

"—లెక్కల కొమ్మిసెట్టి" (యస్.ఐ.ఐ. IV; పు 209; నెం.686, పం.5).

**లెక్కల్ల**

చూ. లెక్కల

పౌరుషనామం (శా.).

"Occurs as the family name of a merchant. This from is still preserved in colloq. Tel. but the class form should be lekkala. మొత్తంమీద, కూడగా".

ఇ.టి.ఐ.

"—ఆదిత్య వారమునణ్డు లెక్కల్ల కొమ్మిసెట్టి కుంతురు—" (క్రీ.శ. 1074 (ఇ.టి. I; పు.125; నెం. 142).

**లెంక**

పౌరుషనామం (సా.).

సేవకుడు.

"—లెంకకామున్డును లెంకమాచండు, లెంకలింగాయయు లెంక వేమఁడు, లెంకపభీముఁడు లెంకబూదాసి—" (పల్నా; పు.88; పం.68).

"—స్థితికర్తయన గఁజనియెను లెంక మంచన పండితయ్య".(పండి. పు.2).

## లే

**లేకమాల**

తెగసూచి (తె.).

లేక- గృ.నా.పూ; <రూ. లెంక; _మాల : చండాలుడు.

?<లేకిమాల : లేకి_ రాలిన గింజలు, పరిగెరాలిన గింజలు ఏరుకొని బతికే వాడని అర్థం కావచ్చు.

**లేఖరి**

వృత్తిసూచి (సా.).

లేఖక వృత్తి వాడు. <సం.లేఖాకార_

"—వ్రాసినవరుండు లేఖరి వెంకట రంగయ్య—" (Tel.Ma; పు 226).

"—లేఖరి వెంకట రంగయ్య చేతి వ్రాలు—" (Tel Ma; పు.235).

**లేటి**

చూ. లేడి

జంతుసూచి (స.).

**లేడి**

రూ. లేటి, లేళ్ళ.

జంతుసూచి (స.).

త.ఇరలై; క.ఇరళె, ఇరలె; తు.ఇరళె; తె.ఇఱ్ఱి, లేటి, లేడి; మాల్టో. ఇలరు. డి.ఇ.డి. 403.

**లేళ్ళ**

జంతుసూచి (స.).

లేడి బహు. కు ద్వి.వి.

కమ్మవారిలో ఇంటిపేరు.

## లొ

**లొల్లా**

పౌరుషనామం (స.).

<లొల్ల : దున్నిన నేలను మిట్ట పల్లాలు లేకుండా సర్దేబల్ల.

బ్రాహ్మణులలో ఇంటిపేరు.

## లో

**లోకం**

పృథ్వీసూచి (స.).

<లోకము : చరాచర జగత్తు. కరణ కమ్మ వ్యాపారులలో ఇంటిపేరు.

లోకిరెడ్డి

వ్యక్తినామం (తె.).

లోకి– గృ.నా.పూ; లోక+ఇ.

<సం. లోక– లోకం.

చూ. –రెడ్డి గృ.నా.ప.

లోగిసెట్టి

వ్యక్తినామం (స.).

లోగి– గృ.నా.పూ; <రూ. లోకి. లోక+ఇ. వి.చూ. లోకిరెడ్డి.

చూ. సెట్టి –గృ.నా.ప.

## వ

వక్కల

వృక్షసూచి (తె.రా.).

పర్యా. చూ. పోక (ల)

వక్క– బహు. కు ద్వి.వి.

<సం. వీల్క– ఉడకబెట్టిన పోక చెక్క–

వృ.నా; Areca Catchu

రాయలసీమలో ముస్లింల ఇంటిపేరు. తెలంగాణాలో కాపులలో ఉంది. వక్కల బేరంవల్ల ఈపేరు వచ్చిఉండవచ్చు.

వంకదారి

మార్గసూచి (స.).

<సం. వక్రద్వార– కోటవాకిలి ముందటి వంకరదారి.

వంకా

జలసూచి (స).



?<వంక. నది.

కమ్మవారిలో ఇంటిపేరు.

?<సం. వక్ర– వంకర.

వంకాయల

వృక్షసూచి (రా.స).

ఆం.నా : Brinjal.

వృ.నా : Solanum melongena

వంకాయ బహు. కు ద్వి.వి. కమ్మ, కోమటి, గొల్ల, బ్రాహ్మణులలో ఇంటి పేరు. సం. వంగ; త. పరుత్తై, వంకమ్: మ. వఴుతిన, వఴుతివి; క. బదణి, బదణె, బదనె; తు.బదనె; తె.వంగ, వంకాయ; మాల్టో. బటంగో డి.ఇ డి. 4339.

చూ. –కాయల గృ.నా.ప.

వంకి

పౌరుషనామం (స.).

ఆయుధసూచి <సం. వక్ర– బాకు, వంకిణి.

వంకెల

పౌరుషనామం (రా.).

వంకె బహు. కు ద్వి.వి.

హరిజనులలో ఇంటిపేరు.

వంగల

వృక్షసూచి (తె.రా.శా.స.సా.).

చూ.వంకాయల. వంగ బహు.కుద్వి.వి.

బ్రాహ్మణులలో ఇంటిపేరు.

"—వృత్తికారుడు వంగలవారు—"

(తెలం.శా. I; పు.178; పం.8).

"—ధాత్రి వంగల కులాలంకారులై యేవురన్—" (శశాం.పీ.40; పు.10).

వజ్రాల

వృత్తిసూచి (స.).

వజ్రాలు కు ద్వి.వి.<వజ్రము. రవ్వ.

వఝుల

చూ. వఝూ

పౌరుషనామం (తె.స.సా.).

వఝు బహు.కు ద్వి.వి.వెలనాటి వైదిక బ్రాహ్మణులలోను, ఆరామ ద్రావిడ శాఖలోనూ గృహనామంగా కన్పిస్తుంది.

"వసుధ హనుమంతవఝుల వంశ జుండు వీరరాఘవుండు—"

(పద్మ. పు. 40).

వఝూ

చూ. వఝుల

పౌరుషనామం (తె.స.).

కమ్మవారిలో, బ్రాహ్మణులలో ఇంటిపేరు.

వట్టికూటి

ఆహారపదార్థసూచి (రా.స.).

వట్టి— గృ.నా.పూ; దే. సస్యవిశేషం, వేరి. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. —కూటి గృ.నా.ప.

వడ

చూ. గారె

ఆహారపదార్థసూచి (శా.).

తాపంకూడా కావచ్చు.

వడియాల

ఆహారపదార్థసూచి (రా.).

వడియము బహు. కు ద్వి.వి.

వడ్డి

చూ. వడ్డె

కులసూచి (తె.).

వడ్డెకులం వారివృత్తి.

కమ్మవారిలో, బ్రాహ్మణులలో ఇంటిపేరు.

వడ్డె

కులసూచి (తె.రా.శా.స.).

రాతిపని చేసే తెగ.

కమ్మవారిలో ఇంటిపేరు.

వీరు ఒరిస్సానుండి వచ్చారు కనుక వీరికీపేరు వచ్చింది. ఒడ్డె, వొడ్డ, వుడ్డర్లు అనిపేర్లు. వీరు బావులు తవ్వేవారు, రోడ్లు వేసేవారు అని 1871 సెన్సస్‌లో ఉంది. వారి ఇళ్ళు తేనెపట్టు ఆకారంతో చిన్న వాకిలితో గుడిశెలు నిర్మిస్తారు. బండోళ్ళు, బొచ్చోళ్ళు, మంచాల, శివ రాత్రి, సంత మొదలైనవి వీరిఇంటిపేర్లు. సి.టి.యస్.ఐ. V 422.

"—ఒడ్డె అర్జినేని—" శా. 1559 (టి.యం.పి.II; పు.1144; నెం.696).

వడ్డెన

పౌరుషనామం (రా.).

వర్ధన, వర్ధించుట.

గొల్లలలో ఇంటిపేరు.

వడ్డెర

చూ. వడ్డేరి

కులసూచి (స.).

వడ్డేరి

చూ. వడ్డెర

కులసూచి (తె.).

?<ఉడయవర్- పాలకుడు.

వడ్ల

చూ. వడ్లా

వృత్తిసూచి (రా.శా.స).

వడ్రంగపువృత్తి. <ప్రా. వడ్ఢగ- <సం. వర్ధక- "—వడ్ల బసువా భక్తుండు—" (యస్.ఐ.ఐ.VI;పు.220: నెం. 704; పం. 173).

వడ్లది

కులసూచి (స.).

స్త్రీనామసూచి. వడ్రంగి స్త్రీ. వడ్లత.

కమ్మవారిలో ఇంటిపేరు.

వడ్లా

చూ. వడ్ల

వృత్తిసూచి (రా.స.).

కమ్మవారిలో ఇంటిపేరు.

వడ్లు

ధాన్యసూచి (తె.).

వరికి బహు.

వృ.నా : Oryza sativa.

ప్రా.భత్త; తె.వడ్లు; త.వల్చి;మ.వఌు: క.బత్త, భత్త. డి.ఇ.డి. 4326.

వణిగర్

వృత్తిసూచి (శా.).

<సం. వాణిజ్యకార-

"—వణిగర్ నాగయసెట్టి—" క్రీ.శ. 1532 (టి.టి.డి.ఇ.యస్.VI: పు.54).

వంటల

ఆహారపదార్థసూచి (తె.).

వంట బహు. కు ద్వి.వి. పాకం.

వత్సవాయ

వంశనామసూచి (సా.).

వ్యుత్పత్తి అస్పష్టం.

"తీరుగ వత్సవాయకుల తిమ్మ జగత్పతికీర్తి—" (చాటుప. పు.45).

వద్దినేని

వ్యక్తినామం (స.).

వద్ది- గృ.నా.పూ; వి.చూ. వద్దిరాజు.

కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. -రాజు గృ.నా.ప.

వద్దిరాజు

వ్యక్తినామం (స.).

వద్ది- గృ.నా.పూ; <వర్ధ-

బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. -రాజు గృ.నా.ప.

వనం

ఆరామసూచి (స.).

<వనము : అడవి, తోట.
బ్రాహ్మణులలో ఇంటిపేరు.

వనమాలి

వ్యక్తినామం (శా.స.).
<సం. వనమాలి. దేవతాసూచి. పు.నా.
"__వనమాలి శతవస్తుగారు__"
(టి.యం.పి.I; పు.698; నెం. 284).

వనసాని

వ్యక్తినామం (స.).
వన_ గృ.నా.పూ; <ప్రా. వణ_
<సం. వర్ణ_
చూ. _సాని గృ.నా.ప.

వనసెట్టి

వ్యక్తినామం (స.).
వన_ గృ.నా.పూ; వి.చూ. వనసాని.
చూ. _సెట్టి గృ.నా.ప.

వందిరాజు

వ్యక్తినామం (స.).
వంది_ గృ.నా పూ; స్తుతిచేసి జీవించే వాడు, భట్టు.
ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.
చూ. _రాజు గృ.నా.ప

వందేమాతరం

పౌరుషనామం (తె.).
వందేమాతర ఉద్యమంలో పాల్గొన్నారు కనుక వందేమాతరం రామచంద్రరావు గారికిది ఇంటిపేరయింది,

వముల

?<వాముల
తృణసూచి (శా.).
వామి బహు. కు ద్వి.వి. కుప్పల.
"__వముల కందసెట్టి.__"శా.1470
(టి.యం.పి.II; పు.910; నెం. 18).

వరదనాథం

వ్యక్తినామం (తె.).
వరద_ గృ.నా.పూ; దేవతాసూచి.
విష్ణువు. చూ. _నాథం గృ.నా.ప.

వరంరెడ్డి

వ్యక్తినామం (స.).
వరం_ గృ.నా.పూ; శ్రేష్ఠమైన.
చూ. _రెడ్డి గృ.నా.ప.

వరికుప్పల

ధాన్యసూచి (తె.).
వరికుప్ప బహు. కు ద్వి.వి.
వరి ధాన్యపురాసి.

వరికూటి

ఆహారపదార్థసూచి (రా.స.).
వరి_ గృ.నా.పూ; ధాన్యసూచి. వి.చూ.
వడ్లు. చూ. _కూటి గృ.నా.ప.

వలబోతు

చూ. వల్లపోతు
వ్యక్తినామం (స.).

వలముకారి

<అలంకార్థి

వృత్తిసూచి (శా.).
"__వలంకారి వెంకటేశ్వర__"
శా. 1690 (టి.యం.పి.II; పు. 978; నెం. 620).

వల్లకాటి
రూ. వల్లెకాడి
స్మశానసూచి (తె.).
వల్లకాడుకు ఔప; వల్లడి + కాడు : శ్మశానం.

వల్లపునేని
చూ. వల్లభనేని
వ్యక్తినామం (స.).

వల్లపోతు
రూ. వలబోతు, వల్లబోతుల
వ్యక్తినామం (తె.).
వల్ల- గృ.నా.పూ; దేవతాసూచి.
<వల్లభ- వి.చూ. వల్లభనేని.
చూ. _పోతు గృ.నా.ప.

వల్లబోతుల
చూ. వల్లపోతు
వ్యక్తినామం (రా.).

వల్లభనేని
రూ. వల్లపునేని,వల్లభినేని.
వల్లభుని.
వ్యక్తినామం (తె.).
వల్లభ- గృ.నా.పూ; వృత్తిసూచి.
<వల్లభుడు అంతరంగిక కార్యదర్శి.
కమ్మవారిలో ఇంటిపేరు.
చూ. -నేని గృ.నా.ప.

వల్లభరెడ్డి
వ్యక్తినామం (స.).
వల్లభ_ గృ.నా.పూ; వి.చూ. వల్లభనేని. కమ్మవారిలో ఇంటిపేరు.
చూ. _నేని గృ.నా.ప.

వల్లభినేని
చూ. వల్లభనేని
వ్యక్తినామం (స.).

వల్లభుని
చూ. వల్లభనేని
వ్యక్తినామం (స.).
కమ్మవారిలో ఇంటిపేరు.

వల్లంసెట్టి
వ్యక్తినామం (స.).
వల్లం_ గృ.నా.పూ; <వల్లమ.
<వల్ల+అమ; వల్ల- వి.చూ. వల్లోజు.
_అమ_ చూ. _అమ్మ గృ.నా ప.
చూ. _సెట్టి గృ.నా.ప.

వల్లవుల
కులసూచి (స.).
వల్లవుడు బహు. కు ద్వి. వి.
పుం. గొల్లవాడు.

వల్లీ
వృక్షసూచి (స.).
<వల్లి : తీగ, పుల్లబచ్చలిచెట్టు, వల్లీ

అనే పేరుగలపువ్వు:సుబ్రహ్మణ్యేశ్వరుని భార్య.

వల్లెకాడి

చూ. వల్లకాటి

స్మశానసూచి (స.).

వల్లోజు

వ్యక్తినామం (తె.).

వల్ల– గృ.నా.పూ; <వల్లభ. వి.చూ. వల్లభనేని. చూ. -ఓజు గృ.నా.ప.

వసంతం

ఋతుసూచి (స.).

<సం. ఒకఋతువు, ఒకరాగం. కమ్మవారిలో ఇంటిపేరు.

? <వసంతం : పసుపు, సున్నం కలిపిన ఎర్రని నీళ్ళు.

వసన్నగారి

వ్యక్తినామం (రా.).

వసన్న– గృ.నా.పూ; వ్య.నా.? <వాసన్న <వాసుదేవ– కృష్ణుడు.

చూ. –గారి గృ.నా.ప.

## వా

వాకిట

చూ. వాకిటి

గృహసూచి (శా.).

<వాకిలి. వా + ఇల్లు. గృహద్వారం.

''—వాకిట పెదనాయుడు—''శా.1451 (టి.యం.పి.II; పు.966; నెం.549).

వాకిటి

చూ. వాకిట

గృహసూచి (శా.).

''—వాకిటి అటప్పనాయనిగారు—'' శా.1446 (టి.యం.పి.I; పు.8; నెం.48. 91 of 1912). జోగివారి ఇంటిపేరు.

వాజపేయ

పౌరుషనామం (స.).

<వాజపేయము : ఒకయాగం.

వాజపేయయాజుల

పౌరుషనామం (స.).

వాజపేయయాగం చేసినవారు. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

వాడేల

చూ. వాడ్రేవు

పౌరుషనామం (సా.).

<వాడ్రేవుల. వాడ్రేవు బహు. ను ద్వి.వి. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

''—వాడేల వంశ విఖ్యాతుడయ్యె—'' (శ్రీకృష్ణా. పు. 20).

వాడ్రేవు

చూ. వాడేల

పౌరుషనామం (స.సా.).

<వాడరేవు. వాడ– ఓడ; –రేవు: నది మొదలైనవాటిలో మనుషులు దిగడానికి ఏర్పాటుచేసినదారి;సముద్రంలో సరుకులు ఎగుమతి దిగుమతి చేసేచోటు. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

వానగరం

అస్పష్టనామబంధం (సా.).

"—వానగరం లక్ష్మయ్యగారి ప్రతిని—" (Tel.Ma; పు.13).

వానపాముల

క్రిమిసూచి (తె.).

వానపాము బహు. కు ద్వి.వి. ఎల్లు. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

వానస

అస్పష్టనామబంధం (సా.).

"—వానస కులోద్భవులైన శ్రీమల్లికార్జున పండితారాధ్యుల—" (శివత; పు. 28).

వార్తకవి

కవిత్వసూచి (స.).

జాతివార్తా చమత్కార పూరితమైన కవిత్వం చెప్పేవారు. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

వాసిరాజు

వ్యక్తినామం (స.).

వాసి– గృ.నా.పూ; దే. ప్రసిద్ధిచెందిన, ఆధిక్యం, బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. –రాజు గృ.నా.ప.

వాసిరెడ్డి

వ్యక్తినామం (శా.స.సా.).

వాసి– గృ.నా.పూ; వి.చూ. వాసిరాజు. కమ్మవారిలో ఇంటిపేరు.

"—వాసిరెడ్డి రామన్న—" శా.1688 (టి.యం.పి.II; పు.843; నెం.852).

"—వాసిరెడ్డివారనెడు పౌరుషాలయాహ్వాయముగలిగె—" (రాజావాసి;పు.5).

వాసుదేవర

వ్యక్తినామం (శా.స.).

వాసు– గృ.నా.పూ; సం; పు.నా; దేవతాసూచి. వాసుదేవుడు. కృష్ణుడు.

"—వడ్డవారమునాండు తనపేర రుద్రేశ్వరమును శ్రీవాసుదేవర శ్రీసూర్యదేవరాను ప్రతిష్ఠసేయించె" శా.1084 (తెలం.శా.I; పు.6; పం.7–8).

చూ. –దేవర గృ.నా.ప.

వాసే

కులసూచి (స).

?<వాసె <సం. వైశ్య– కోమటి.

## వి

వింజము

వ్యక్తినామం (స.).

<వింజము: స్త్రీ.నా. <ప్రా. వింఝా <సం. వింధ్యా- దుర్గాభేదం. కమ్మవారిలో ఇంటిపేరు. వింజము పోతరాజు కులోత్తుంగ చోడనృపాలుని దగ్గరున్న అధికారుల్లో ఒకడు. ఇతనితల్లి వింజమదేవి. ఈమె శా. శ. 1067వ సం॥లో భీమేశ్వరునికి అఖండ దీపదానంచేసింది. ఇతని తల్లి పేరే ఈ వంశంవారికి గృహనామం అయింది. ఇప్పటికీ కమ్మవారిలో వింజం వారున్నారు.

విఠంరాజు

వ్యక్తినామం (స.).

విఠం_ గృ.నా.పూ; పు.నా; దేవతా సూచి. <విఠల : విష్ణువు.

ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.

చూ. _రాజు గృ.నా.ప.

విడియాల

చూ. విడెము.

పౌరుషనామం (స.).

విడియం బహు. కు ద్వి.వి.

విడెము

రూ. విడియాల, విశెము.

పౌరుషనామం (తె.శా.స.).

విడియం, తాంబూలం. వీడెము <ప్రా. వీడియా_ <సం. వీటికా_

"__విడెము మాదయగారు__"శా.1200 (తెలం.శా.I; పు.79; పం.8_9).

విదిశోజి

వ్యక్తినామం (తె.).

విదికు_ గృ.నా.పూ; ?<విదిక్కు_ : ఇరుకు, గొంది, మూల, నాలుగుమూలల.

చూ. _ఓజి గృ.నా.ప.

విద్యార్థి

పౌరుషనామం (శా.).

విద్య+అర్థి : చదివేవాడు, చదువు కావాలని కోరుకునేవాడు.

"__విద్యార్థి కృష్ణరాయన్__"శా.1460 (టి. టి. డి. ఇ. యస్. IV; పు. 201; నెం. 107).

విన్నపాల

వృత్తిసూచి (శా.).

విన్నపము బహు. కు ద్వి.వి. మనవి, విజ్ఞాపన. "__విన్నపాల వెంకటాచార్యులు__" శా. 1608 (టి. యం. పి. II; పు. 1151; నెం. 762).

విప్రవినోది

పౌరుషనామం (శా.).

విప్ర_ విప్రుడు, బ్రాహ్మణుడు. _వినోది : వినోదింప చేసేవాడు. బ్రాహ్మణ పురుషుడు, లింగాయత స్త్రీకి జన్మించినవారు కనుక వీరు లింగాయతు లట. బ్రాహ్మణుల ముందు వీరు అనేక ఫీట్స్ చేసి వారిని సంతోషపెడతారు.

"__విప్రవినోది సిద్ధయ్య__"శా.1476 (టి.యం.పి.I; పు.601; నెం.327).

విభూతి

రూ. యిబూది

పౌరుషనామం (తె.శా.).

<ప్రా. విబూది; సం. విభూతి_ తిర్యక్పుండ్రధారులు ధరించే భస్మం, అష్టైశ్వర్యాలలో ఒకటి.

"__విభూతి గౌరయ__" (టి.యం. పి.II. పు.967; నెం.553);

విరిప్పిని

వ్యక్తినామం (స.).

<విరిప్పినేని
విరిప్పి- గృ.నా.పూ; ?<విరూపాక్ష- కమ్మవారిలో ఇంటిపేరు.
చూ. -ని గృ.నా.ప.

**విశెము**
చూ. విడెము
పౌరుషనామం (శా.).
"--విశెము రుద్రదేవుండును.-"
శా. 1216 (తెలం. శా. I; పు. 87; పం. 10-12).

**విశ్వనాథ**
రూ. విశ్వనాథుని, విశ్వనాథం
వ్యక్తినామం (స.).
విశ్వ- గృ.నా.పూ; దేవతాసూచి. కాశీ క్షేత్రంలో నివసించే శివుడు.
బ్రాహ్మణులలో ఇంటిపేరు.
చూ. -నాథ గృ.నా.ప.

**విశ్వనాథం**
చూ. విశ్వనాథ
వ్యక్తినామం (స.).
బ్రాహ్మణులలో ఇంటిపేరు.

**విశ్వనాథుని**
చూ. విశ్వనాథ
వ్యక్తినామం (స.).

**విషంసెట్టి**
వ్యక్తినామం (స.).
విషం- గృ.నా.పూ; ?<బీసం <బీస <బీచ- బీచుపల్లి ఆంజనేయ స్వామికి వాడుక పేరు.
చూ. -సెట్టి గృ.నా.ప.

**విష్ణువఝుల**
వ్యక్తినామం (తె.).
విష్ణు- గృ.నా.పూ; దేవతాసూచి.
<విష్ణువు. విశ్వమందు వ్యాపించి వుండేవాడు. బ్రాహ్మణులలో ఇంటిపేరు.
చూ. -వఝుల గృ.నా.ప.

**విస్సంరాజు**
వ్యక్తినామం (స.).
విస్సం- గృ.నా.పూ; వి.చూ. విస్సాప్రగడ. బ్రాహ్మణులలో ఇంటిపేరు.
చూ. -రాజు గృ.నా.ప.

**విస్సాప్రగడ**
వ్యక్తినామం (స.).
విస్సా- గృ.నా.పూ; పు.నా. దేవతాసూచి. <ప్రా. విస్స- <సం. విశ్వ-
ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.
చూ. -ప్రగడ గృ.నా.ప.

**విస్సావఝుల**
వ్యక్తినామం (తె.).
విస్సా- గృ.నా.పూ; దేవతాసూచి. వి.చూ. విస్సాప్రగడ.
బ్రాహ్మణులలో ఇంటిపేరు.
చూ. -వఝుల గృ.నా.ప.

# వీ

**వీణ**

పౌరుషనామం (స.).

వాద్యవిశేషం. తంత్రులున్న వాద్యం. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

వీణకుప్పయ్య సామవేద బ్రాహ్మణుడు. వీణ, ఫిడేలు వాద్య చతురుడు. ఇతని మూలంగానే 'సంగీత నిలయం' అనే పేరు మద్రాసుకు వచ్చిందట.

**వీధుల**

పౌరుషనామం (సా.).

వీధి బహు. కు ద్వి.వి. రెండిళ్ళ మధ్య ఉన్నదారి. ''—వీధుల నాగన్న వీటిలో విషుడు—" (పల్నా.పు;201; పం.44). ''—వీధుల పల్నేని వేగరమ్మనుచు—" (పల్నా: పు.200; పం.19).

**వీరగంధం**

పౌరుషనామం (స.).

వీరునికి ఇచ్చే గంధం. కమ్మవారిలో ఇంటిపేరు.

**వీరంగం**

వాద్యసూచి (స.).

వీరభద్ర పళ్ళెం పట్టేటప్పుడు వీరభద్రునికి బాగా సాంబ్రాణి వేసి వీరంగం వాయిస్తుంటారు. అది విన్నప్పుడు శరీరం జలదరిస్తుంది. ఒక్కొక్కచోట ఆపి ఖడ్గాలు పలుకుతారు.

**వీరపనేని**

వ్యక్తినామం (స.).

వీరప— గృ.నా.పూ; పు.నా; దేవతా సూచి. వీర+అప <వీర + అప్ప.

వీర— : వీరుడు; —అప— చూ. అప్ప గృ.నా.ప. కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. —నేని గృ.నా.ప.

**వీరపోతిన**

వ్యక్తినామం (స.).

<వీరపోతినేని

వీరపోతి— గృ.నా.పూ; <వీరపోతు : వీరుడైన పోతునాయుడు వి.చూ. వీరపనేని. చూ. —నేని గృ.నా.ప.

**వీరభొట్ల**

వ్యక్తినామం (స.).

వీర— గృ.నా.పూ; పరాక్రమసూచి. వి.చూ. వీరపనేని. వెలనాటి వైదిక బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. —భొట్ల గృ.నా.ప.

**వీరమల్లు**

వ్యక్తినామం (స.).

వీర— గృ.నా.పూ; వి.చూ. వీరపనేని.

చూ. —మల్లు గృ.నా.ప.

**వీరమాచనేని**

రూ. వీరమాసనేని

వ్యక్తినామం (స.).

వీరమాచ— గృ.నా.పూ; వీర— వి.చూ. వీరపనేని: —మాచ— వి.చూ. మాచారెడ్డి.

కమ్మవారిలో ఇంటిపేరు.
చూ. _నేని గృ.నా.వ.

వీరమాసనేని
చూ. వీరమాచనేని
వ్యక్తినామం (తె.స.).
కమ్మవారిలో ఇంటిపేరు.

వీరముష్టి
తెగసూచి (శా.).
కోమట్లను యాచించి జీవించేభిక్షగాడు; వీరభద్రుని ఉత్సవంలో భక్తితో తన నైపుణ్యాన్ని చూపే ఒక తెగ.
"గ్రామంలో కంసాలి, వడ్రంగి, కుమ్మరి,మంగలి మొదలైనవారి వృత్తుల నవలంబించి జీవించెడి శివభక్తులగు జాతివారు. శా.శ.
"__వీరముష్టి వీరయ్య__"శా.1480 (టి.యం.పి. I; పు.588; నెం.135).
"__వీరముష్టి లింగయ్య__"శా.1511 (టి.యం.పి. I; పు.621; నెం.522).

వీరంసెట్టి
వ్యక్తినామం (రా. .
వీరం_గృ.నా.పూ;స్త్రీ.నా; దేవతాసూచి. <వీరమ. వీర_ వి. చూ. వీరపనేని; _అమ_ చూ. _అమ్మ గృ.నా.ప.
చూ. _సెట్టి గృ.నా.ప.

వీరుభట్ల
వ్యక్తినామం (స.).
వీరు_ గృ.నా.పూ; <సం. వీర_ : వీరుడు. వి.చూ. వీరపనేని. వెలనాటి వైదిక బ్రాహ్మణులలో ఇంటిపేరు.

## వు

వుపాధ్యాయుల
చూ. ఉపాధ్యాయుల
వృత్తిసూచి (సా.).
"__౧౦ ఆదివారం నాడు వుపాధ్యాయుల వెంకటపతి వ్రాసిన__"
క్రీ. శ. 1676.

వుప్పరి
<ఉప్పరి
వృత్తిసూచి (స.).
గుంటలు, బావులు తవ్వుతూ రోడ్లు వేస్తుంటారు.
త. ఉప్పరవార్; తె. ఉప్పర.

వుల్లంగుల
వృక్షసూచి (స.).
వుల్లంగి బహు. కు ద్వి.వి. వృక్ష విశేషం. రజకులలో ఇంటిపేరు.

## వూ

వూరబోయిన
వ్యక్తినామం (తె.).
<ఊర+బోయిన. ఊర <ఊరు+అ.
చూ. _బోయిన గృ.నా.ప.

## వృ

వృద్ధుల
పౌరుషనామం (స.).

వృద్ధుడు బహు. కు ద్వి.వి. ముసలి వాడు. పేరూరి ద్రావిడులలో ఇంటిపేరు.

# వె

వెంకిరెడ్డి

వ్యక్తినామం (స.).

వెంకి_ గృ.నా.పూ; పు.నా; దేవతా సూచి. <వెంక+ఇ. వెంక_ <వెంకట_ <వెంగడ_ చూ. _రెడ్డి గృ.నా.వ.

వెంగలసెట్టి

వ్యక్తినామం (స.).

వెంగల_ గృ.నా.పూ; <వెంగళ <వెంగడ <వెళ్+గడ : తెల్లనికొండ.

చూ. _సెట్టి గృ.నా.వ.

వెడ్డు

పౌరుషనామం (సా.).

కపటం, వంచన.

"__వెడ్డు నాగయగారి వెడగు వచ్చితివా" (పండి. పు.208).

వెంత్రప్రగడ

వ్యక్తినామం (తె.స.).

వెంత్ర_ గృ.నా.పూ;? <ఎంత్ర.

ఆర్వేల నియోగ బ్రాహ్మణులలో ఇంటి పేరు. చూ. _ప్రగడ గృ.నా.వ.

వెదుళ్ళ

వృక్షసూచి (తె.).

వెదురు బహు. కు ద్వి.వి.

వృ.నా : Bambusa arundinacea

త.వెదిర్, బెతిరి, వెతిరమ్; కొ.వెదర్; క. బిదిర్, బిద్రు, బిదరు; తు.బెదురు; తె.వెదురు డి.ఇ డి. 4514.

కమ్మవారిలో ఇంటిపేరు.

వెన్న

ఆహారపదార్థసూచి (రా.స.).

వెల్ల + నేయి. పెరుగు చిలికి తీసినది.

త.వెణ్ణయ్; మ.వెణ్ణ; క.బెణ్ణె; తు.బెణ్ణె; కొ. వెణ్.

వెన్ను

వ్యక్తినామం (తె.).

<వెన్నుడు.పు.నా; దేవతాసూచి.విష్ణువు.

?<ఎన్ను : వరిమొదలైన. వాటికంకి.

వెంపటి

వృక్షసూచి (స).

?<వెంపలి. వెంపలి చెట్టు, ఎంపలి.

కమ్మవారిలో, బ్రాహ్మణులలో ఇంటిపేరు.

వృ.నా : Tephrosia Purpurea.

వెర్రిబోయిన

వ్యక్తినామం (స.).

వెర్రి_ గృ.నా.పూ; <వెఱ్ఱి : ఉన్మాదం, పిచ్చి. చూ. _బోయిన గృ.నా.వ.

వెలగా

వృక్షసూచి (స.).

వెలగచెట్టు, ఎలగ, ఎల్గ.

కమ్మవారిలో ఇంటిపేరు.

ఆం.నా : Wood apple.

వృ.నా : Feronia elephantum.

త. వెళ్ళిల్, విళా, విళమ్, ృళరి; ప.విళా; క.బెళల, బెళవర్, బేళవల, బేల డి.ఇ.డి. 4535.

వెలది

స్త్రీనామసూచి (స.).

స్త్రీ. ఇది దేశ్యమని శ.ర; వైకృతమనీ, వనితా శబ్దభవమని ఆం.వా.

ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.

వెలినెల

పౌరుషనామం (స.).

వెలి– తెల్లని; –నెల : చంద్రుడు.

వెలిసెట్టి

వ్యక్తినామం (స.).

వెలి– గృ.నా.పూ; దే. వెలివేయడం లేక తెల్లనైన.

చూ. –సెట్టి గృ.నా.ప.

వెలుగు

పౌరుషనామం (స.).

దే. ప్రకాశించు, జ్వలించు.

?< వెల్గు. దే. అలవ, కంచె. తోటలోకి పశువులు ప్రవేశించకుండా చుట్టూ ముళ్ళ చెట్లు వేసి పెంచిన ఆవరణ.

వెలుగుబంట్ల

రూ. ఎలుగుబంటి

జంతుసూచి (స.).

వెలుగుబంటి బహు. కు ద్వి.వి.

వెలుగోటి

వంశనామసూచి (శా.సా..

"—వెలుగోటి క్రిష్ణమనాయనిగారు—" (టి.యం.పి. I; పు.621; నెం.518).

"—శ్రీ వెలుగోటి కుమార యాచన నాయుడు—" శా.1662 (టి. యం. పి. II; పు.790; నెం.378).

"—వెలుగోట్యన్వయ నారసింహ—" (చాటు; పు. 40).

"—వెలుగోటి పురీంద్రా! కొమార తిమ్మా—" (చాటు; పు. 41).

## వే

వేగిరాజు

వ్యక్తినామం (స.).

వేగి– గృ.నా.పూ: వేగంకలది. గుఱ్ఱం, పులి. ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.

?< వేంగి : గ్రామనామం.

చూ. –రాజు గృ.నా.ప.

వేగుల

వృత్తిసూచి (స.సా.).

వేగువృత్తి. వేగు బహు. కు. ద్వి.వి; వేగులవారు. కమ్మవారిలో ఇంటిపేరు.

"—వేగుల దామినేడ! వేగులవల్ల వేగుల మల్లయ్యా! వెరవకమీరు—" (పల్నా; పు. 204).

వేగేశ్న

చూ. వేగేసిన

పరాక్రమసూచి (స.).

వేగేసిన

రూ. వేగేశ్న

పరాక్రమసూచి (స.).
<వేగి + ఏసిన. వేగి _ వ్యాఘ్రం,పులి; _ఏసిన <ఎయు : ప్రయోగించిన, చంపిన పులిని చంపినవాడు.

వేట

పౌరుషనామం (స.).
<వేఁట : మృగయ;? మేకపోతు, పొట్టేలు

వేదనభట్ల

వ్యక్తినామం (తె.).
వేదన_ గృ.నా.పూ;<వేతన <బేతన_ బ్రాహ్మణులలో ఇంటిపేరు.
చూ. _భట్ల గృ.నా.ప.

వేదం

పౌరుషనామం (రా.స.).
వేదపఠనం చేసేవారు.

వేదరాజు

వ్యక్తినామం (స.).
వేద_ గృ.నా.పూ; <సం. వేద_ వేదం. బ్రాహ్మణులలో ఇంటిపేరు.
చూ. _రాజు గృ.నా.ప.

వేదల

చూ. వేదాల
పౌరుషనామం (శా.).
"__వేదల తిరువెంకటాచార్య__" (టి.యం.పి.II; పు. 820; నెం.599).

వేదాంత

చూ. వేదాంతం (శా.).
పౌరుషనామం (శా).
"__వేదాంత అయ్యవారుభట్టు__" శా.1632 (టి.యం.పి. I; పు. 658; నెం. 897).
"__వేదాంత శఠగోపజయ్యర్__" (టి. టి. డి ఇ. యస్. V; పు. 161; నెం. 65).

వేదాంతం

రూ. వేదాంత
పౌరుషనామం (తె.స.).
వేదాలకు అంతమందున్నవి ఉపనిషత్తులు. ఉపనిషత్తులు చదివేవారు. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

వేదాల

రూ. వేదల
పౌరుషనామం (స.).
వేదం బహు. కు ద్వి.వి. వేదాలకు సంబంధించిన.
బ్రాహ్మణులలో ఇంటిపేరు.

వేదుల

పౌరుషనామం (తె.స.).
వేది బహు. కు ద్వి.వి; వేదంతెలిపినవాడు, పండితుడు.

వేనరాజు

వ్యక్తినామం (స.).
వేన_ గృ.నా.పూ;?
ఆర్వేల నియోగ బ్రాహ్మణులలో ఇంటిపేరు. చూ. _రాజు గృ.నా.ప.

వేప

రూ. వేపా, వేముల

వృక్షసూచి (తె.న.).

వేముకు ఔప.

వృ.నా : Azadirctha indica.

త.వేమ్బు; మ.వేప్పు; క.బేవు; తు.బేవు; తె.వేము, వేప. డిఇ.డి. 4551.

వేపచేదుల

పౌరుషనామం (న.).

వేప– వృక్షసూచి. వేము; –చేదుల : రుచిని సూచించే పదం.

బ్రాహ్మణులలో ఇంటిపేరు.

వేపా

చూ. వేప

వృక్షసూచి (న.).

బ్రాహ్మణులలో ఇంటిపేరు.

వేమన

వ్యక్తినామం (న.).

వేమ+అన

వేమరాజు

వ్యక్తినామం (న.).

వేమ– గృ.నా.పూ; వ్య.నా. < వేమన.

ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.

?వేము : వృక్షసూచి. వి.చూ. వేపా.

వేమినేని

వ్యక్తినామం (న.).

వేమి– గృ.నా.పూ; వ్య.నా. వేమ+ఇ. వేమ- వి.చూ. వేమరాజు.

కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. -నేని గృ.నా.ప.

వేముల

చూ. వేప

వృక్షసూచి (తె.న.).

వేముల చన్నమయ్య సదాశివ రాయల కాలంలో ఉన్న మహా మండలేశ్వర తిమ్మరాజు కొడుకు పాప తిమ్మరాజు వద్ద కార్యకర్త. కమ్మవారిలో, బ్రాహ్మణులలో ఇంటిపేరు.

వేల

అస్పష్టనామబంధం (పా.).

వేయి బహు. కు ద్వి.వి.

?చెలియలికట్ట; పొలిమేర; ఉప్పెన; రాజుగారి భోజనం; అనాయాస మరణం; వ్యాధి; బుధుని భార్య.

"—వేల వెంకటాద్రి నాయని కొమారుడు—" (Tel.Ma; పు.79).

వేల్పుల

పౌరుషనామం (రా.న.).

దేవతాసూచి. వేల్పు బహు. కు ద్వి.వి. దేవత.హరిజనులలో ఇంటిపేరు.

వేళ్ళ

వృక్షసంబంధసూచి (రా.).

?< వేరు బహు. కు ద్వి.వి.

కమ్మవారిలో ఇంటిపేరు.

?< వేలు బహు. కు ద్వి.వి.

వేసంగి

ఋతుసూచి (న.).

<వేసగి. వైశాఖ. గ్రీష్మ ఋతువు, వేసవి. కమ్మవారిలో ఇంటిపేరు.

## వై

వైకుంఠము

పౌరుషనామం (స.).

దేవతానివాససూచి. విష్ణువు యొక్క నివాసం. కమ్మ వారిలో ఇంటిపేరు.

వైదుంబ

వంశనామం, బిరుదనామం(శా.).

"A Title of the Kings of the dynasty who ruled parts of Mdn. Rāyalasīma during the 9th and 10th centuries. శా.శ.

"—వైదుంబ మహారాజ పల్లవ మహారాజ—" (ఇ.టి.ఐ; పు.66; నెం. 90).

"—గణ్డత్రిణేత్రవైదుంబమహరాజు—" (తె.శా; సం.8; పు.41).

వైట్యాల

వృత్తిసూచి (తె.స.).

వైద్యుడు బహు. కు ద్వివి. <సం. వైద్య- బ్రాహ్మణులలో ఇంటిపేరు.

వైద్యం

పౌరుషనామం (రా.).

<వైద్యము : రోగ చికిత్సా శాస్త్రం. నాడిచూచి వాత, పిత్త, ఉష్ణాలను గుర్తిస్తారు. వైద్యశాస్త్రం బాగా తెలిసినవారికి ఇది గృహనామం.

మహమ్మదీయులలో గృహనామం.

వైరాగి

పౌరుషనామం (శా.).

బైరాగి

"—వైరాగి శాంతయ్య—" శా.1384 (టి.యం.పి.II; పు.957: నెం.475).

## వొ

వొబ్బలిసెట్టి

చూ. ఓబిలిసెట్టి

వ్యక్తినామం (రా.స సా.).

"ద్విజాదరణ మనస్సులై తనరు ధన్యులు వొబ్బిలిసెట్టివారు—" (కన్యకా. 1-4).

## వ్యా

వ్యాకరణం

పౌరుషనామం (స.)

<వ్యాకరణము : శబ్దశాస్త్రం. వ్యాకరణ శాస్త్రాన్ని బాగా అభ్యసించినవారు. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

వ్యాపారపు

రూ. బేపారపు

వృత్తిసూచి (స.).

<సం. వ్యాపార- వ్యాపారవృత్తి.

వ్యాసం

పౌరుషనామం (స.).

<సం. వ్యాస- విరివి; ఏదైనా ఒక విషయాన్నిగూర్చి విపులంగా రాయడం.

## శ

**శంకర**
వ్యక్తినామం (స.).
దేవతాసూచి; పు.నా. <సం. శంకర–
ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.

**శంకరమంచి**
వ్యక్తినామం (తె.స.).
శంకర– గృ.నా.పూ; పు.నా. వి.చూ.
శంకర. బ్రాహ్మణులలో ఇంటిపేరు.
చూ. –మంచి గృ.నా.ప.

**శంకల**
పౌరుషనామం (స.).
శంక బహు. కు ద్వి.వి : సంశయం.

**శతఘంటం**
బిరుదనామం (స.).
సం. శత– సంఖ్యాసూచి, నూరు;
–ఘంటం <గంటము : తాటాకుమీద రాయడానికి ఉపయోగించే ఉక్కుసాధనం.
వరుసగా నూరుమంది లేఖకులకు పద్యాలు ఆశువుగా చెప్పడం వలన ఈ బిరుదనామం కల్గింది.
వైదిక బ్రాహ్మణులలో ఇంటిపేరు.

**శనగల**
ధాన్యసూచి (తె.రా.స.).
వృ.నా : Cicero arietinum.
శనగలు కు ద్వి.వి. <సం. చణక–: సెనగలు. పెదకంటి కాపులు, బ్రాహ్మణ, మేదరులలో ఇంటిపేరు.

**శంభిరాజు**
వ్యక్తినామం (స.).
శంభి– గృ.నా.పూ; పు.నా. దేవతాసూచి. <సం. శంభు– శివుడు.
ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.
చూ. –రాజు గృ.నా.ప.

**శరణాగతి**
చూ. శరణు
పౌరుషనామం (స.).

**శరణు**
చూ. శరణాగతి
పౌరుషనామం (స.).
శరణు కల్పించేవాడు కావచ్చు.

## శా

**శాగంరెడ్డి**
వ్యక్తినామం (స.).
శాగం– గృ.నా.పూ; <చాగం
<ప్రా. చాగ– <సం. త్యాగ–
చూ. –రెడ్డి గృ.నా.ప.

**శానం**
వృత్తిపరికరసూచి (స).
స్వర్ణచ్ఛేదన సాధన విశేషం.
సానరాయి, శాణము.

**శాంతం**
పౌరుషనామం (తె.).

<సం. శాంతమ్ : శాంతరసం, ఉపశమం; శాంతిపొందినది.

**శాంతినేని**

వ్యక్తినామం (స.).
శాంతి– గృ.నా.పూ; మంగళసూచి.
<సం. శాంతి– శాంతం, ఓర్పు.
కమ్మవారిలో ఇంటిపేరు.
చూ. –నేని గృ.నా.ప.

**శాయని**

వ్యక్తినామం (స.).
శాయ– గృ.నా.పూ; <చాయ <సం. ఛాయా. చూ. –ని గృ.నా.ప.

## శి

**శికరి**

పౌరుషనామం (స.).
<శిఖరి : కొండ; చెట్టు; ఉత్తరేణి.

**శికా**

<శిఖా
పౌరుషనామం (స.).
<సం. శిఖ– జుట్టుముడి, నెమలిసిగ, కొన; ఊడ; కొమ్మ; కిరణం.
బ్రాహ్మణులలో ఇంటిపేరు.

**శింగరాజు**

వ్యక్తినామం (స.).
<సింగరాజు.
–శింగ గృ.నా.పూ; జంతుసూచి.
<ప్రా. సింఘ– <సం. సింహ– ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.
చూ. –రాజు గృ.నా.ప.

**శింగారపు**

పౌరుషనామం (స.).
అలంకారసూచి. <సింగారము.
<సం. శృంగార– అలంకారం,అందం.
కమ్మవారిలో ఇంటిపేరు.

**శివరాజు**

వ్యక్తినామం (స.).
శివ– గృ.నా.పూ; పు. నా. దేవతాసూచి. <సం. శివ– శివుడు. ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.
చూ. –రాజు గృ.నా.ప.

**శివరాత్రి**

పౌరుషనామం (రా.స.సా.).
పర్వదినం. మాఘబహుళ త్రయోదశి.
ఒడ్డె; జాలరులలో ఇంటిపేరు.
"బంకయ్య శివరాత్రి వెంకయ్య—" (పండి. పు. 240).
"శివరాత్రి బసవయ—" (పండి; పు. 243).

**శిష్టా**

రూ. శిష్ఠు
పౌరుషనామం (తె.).
<సం. శిష్ట– శిష్టుడు. సదాచార సంపన్నుడు; విధేయుడు, ఆజ్ఞాపింప బడినవాడు. బ్రాహ్మణులలో ఇంటిపేరు.
బ్రాహ్మణుల నామాంతాలలో చేర్చే

బిరుదపదం. ఉదా : కణ్ణూరి శింగయ శిష్ట, రామయ శిష్ట. శాస్త్రోక్త ఆచారాలను అవలంబించేవారు కనుక వీరికి ఈ పేరు వచ్చింది.

శిష్టావర్ఝుల

వ్యక్తినామం (స.).

శిష్టా- గృ.నా.పూ; శిష్ఠుడు. వి చూ. శిష్టా. పేరూరు ద్రావిడశాఖలో ఇంటిపేరు.

చూ. -వఝుల గృ.నా.ప.

శిష్ఠు

చూ. శిష్టా

పౌరుషనామం (శా.స.).

"...చీకటి ధమ్మన రాజులు శిష్ఠు అచ్యుతప్రధానులు..." శా.1267 (యస్ ఐ.ఐ;V; 1240). ఇచట పదవిని సూచిస్తుందని శా. శ.

బ్రాహ్మణులలో ఇంటిపేరు.

శీ

శీతంరాజు

చూ. సీతంరాజు

వ్యక్తినామం (స ).

శీరము

చూ. సీరా

వృత్తిపరికరసూచి (స.).

శీర్ల

చూ. సీరా

వృత్తిపరికరసూచి (స.).

శీరము బహు. కు ద్వి.వి.

శీలం

చూ. సీలం

పౌరుషనామం (తె.స.).

<శీలము : స్వభావం; మంచి నడత.

మాలకులంలో ఇంటిపేరు.

శూలద

అస్పష్టనామబంధసూచి (సా.).

"...శూలద బ్రహ్మయ్యజూపుదప్పితివా..." (పండి; పు. 208).

శృంగారకవి

బిరుదనామం (స.).

కవిత్వసూచి. శృంగార రసంతో చక్కగా కవిత్వంచెప్పే కవి.

బ్రాహ్మణులలో ఇంటిపేరు.

శృంగి

పౌరుషనామం (సా.).

కడియం మొదలైన ఆభరణరూపంలో ఉన్న బంగారం.

"...శృంగి బొజ్జయ నుత్తమాంగద..." (పండి; పు. 209).

శె

శెట్టి

పౌరుషనామం (తె.స.).

వి.చూ. -సెట్టి గృ.నా.ప.

శెట్టిగారి

పౌరుషనామం (తె.రా.స.).

శెట్టి- గృ.నా.పూ; వి.చూ. శెట్టి.

చూ. -గారి గృ.నా.ప.

## శే

శేషం

పౌరుషనామం (శా.స.సా.).

< శేషము : మిగిలినది.

బ్రాహ్మణులలో ఇంటిపేరు.

"__శేషం వెంకటపతి__" శా.1464 (టి.యంపి;II; పు.1060; నెం.76).

"ఇదిశేషమునారాయణార్యనందన __" (Tel.Ma, పు.5).

## శౌ

శౌంటినేని

వ్యక్తినామం (స.).

శౌంటి- గృ.నా.పూ; < ప్రా. సోంతి- < సం. శౌంతి.

చూ. -నేని గృ.నా.వ.

## శౌ

శౌర్యనాయని

వ్యక్తినామం (శా.).

శౌర్య- గృ.నా.పూ; పరాక్రమసూచి. < సం. శౌర్య- పరాక్రమం.

"__శౌర్యనాయని రఘుపతినాదయ్య__" (టి.యం.పి;II; పు.1149; నెం. 789).

చూ. _నాయని గృ.నా.వ.

## శ్రీ

శ్రీగిరిరాజు

వ్యక్తినామం (తె.స.).

శ్రీగిరి- గృ.నా.పూ; పర్వతసూచి. శ్రీ- లక్ష్మి. సంపద; -గిరి- : కొండ; శ్రీపర్వతం. ఆర్వేల నియోగ బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. _రాజు గృ.నా.వ.

శ్రీపతి

వ్యక్తినామం (.తె.రా.శా.).

దేవతాసూచి; పు.నా. < సం. శ్రీపతి_. ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.

"_ శ్రీపతి ఓబలేశ్వరరాజ___" క్రీ. శ. 1546 (టి.టి.డి.ఇ.యస్; V; పు. 195; నెం. 75).

శ్రీపాద

పౌరుషనామం (రా.స.).

శ్రీవిద్యోపాసన చేయడంవలన వీరి పూర్వులు శ్రీపాద వారయ్యారని శ్రీ శ్రీపాదకవిసార్వభౌముఁజీవిత చరిత్రలో పైడిపాటి వారు పేర్కొన్నారు.

వెలనాటి వైదికులలో గృహనామం.

శ్రీభాష్యం

పౌరుషనామం (స.).

రామానుజీయ భాష్యపఠనంచేత ప్రసిద్ధులైనవారు.

వైదిక బ్రాహ్మణులలో ఇంటిపేరు.

శ్రీమంతుల

పౌరుషనామం (తె.).

శ్రీమంతుడు బహు. కు ద్వి.వి. సంపద కలవాడు, విష్ణువు, కుబేరుడు, ఇంద్రుడు.

శ్రీరాం
చూ. శ్రీరామ
వ్యక్తినామం (స.).

శ్రీరామ
చూ. శ్రీరాం
వ్యక్తినామం (తె.రా.స.).
పు.నా; దేవతాసూచి. <సం. శ్రీరామ–
కమ్మవారిలో ఇంటిపేరు.

శ్రీరామదాసు
వ్యక్తినామం (తె.).
శ్రీరామ– గృ.నా.పూ; పు.నా; దేవతా
సూచి. <సం. శ్రీరామ– శ్రీరాముడు.
చూ. –దాసు గృ.నా.ప

శ్రీరామునీడు
వ్యక్తినామం (రా.స.).
శ్రీరామ– గృ.నా పూ, వి.చూ.
శ్రీరామదాసు.
చూ. –నీడు గృ.నా.ప.

## ష

షట్కాలం
బిరుదనామం (తె.).
ఆరుకాలాలా. సంగీత ప్రావీణ్యాన్ని
సూచిస్తుంది. వి.చూ. సాహిత్యంలో
ఇంటిపేర్లు.

షడ్దర్శన
చూ. షడ్దర్శనం
పౌరుషనామం (రా. శా.స.).
సం. షట్– ఆరు; –దర్శనం: ధర్మం,
శాస్త్రం. పేరూరు ద్రావిడుల్లో ఇంటిపేరు.

## షా

షాహుకారు
పౌరుషనామం (తె.స.).
<సాహుకారు : సెట్టి, వర్తకుడు.
బ్రాహ్మణుల్లో ఇంటిపేరు.

## షి

షిల్మోజి
వ్యక్తినామం (తె.).
షిల్మ- గృ.నా.పూ;?
చూ. -ఓజి గృ.నా.ప.

## షొ

షొడ్డల
అస్పష్టనామబంధసూచి (సా.).
"–షొడ్డల బాచయ్య వెడ్డువెట్టితివా"
(పండి; పు. 208).
"–షొడ్డల సోమవ్వ!–"
(పండి; పు. 243).

## స

సకలా
పౌరుషనామం (స.).
<సకలము : సర్వం.
కోమట్లలో ఇంటిపేరు.

సంకటి
ఆహారపదార్థసూచి (తె.స.).

చోడి అంబలి. ఏధాన్యంతో చేసినదైనా అంబలని వ్యవహారం.
బోయకులంలో ఇంటిపేరు.

సంకిసెట్టి
వ్యక్తినామం (తె.).
సంకి– గృ.నా.పూ; పు.నా; దేవతా సూచి. <సం. శంకర– ఈశ్వరుడు.
చూ. –సెట్టి గృ.నా.వ.

సంక్రాంతి
పౌరుషనామం (స.).
పర్వదినసూచి. మకరసంక్రమణం.

సంగద
అస్పష్టనామబంధం (సా.).
"–సంగద బసవన్న శరణని కొలుతు" (పండి; పు. 243).

సంగం
చూ. సంఘం
పౌరుషనామం (స.).
బ్రాహ్మణులలో ఇంటిపేరు.

సంగీతం
పౌరుషనామం (రా.స.).
<సంగీతము : గానం, ప్రేక్షణార్థం జరిగే తౌర్యత్రికం. సంగీత శాస్త్రంలో ప్రావీణ్యం కలవారికి ఇది గృహనామం.

సంఘం
రూ. సంగం
పౌరుషనామం (స.).
<సంఘము : సమితి, గుమి

సజ్జ
ధాన్యసూచి (స.).
వృ.నా: Pennesetum typhoideum
క.చజ్జ, చెజ్జ, జెజ్జె, సజ్జె, సెజ్జె; తె.సజ్జ, సద్ద, సజ్జె. డి.ఇ.డి. 1888.

సజ్జరౌతు
పౌరుషనామం (శా.).
సజ్జ– గృ.నా.పూ;కవచం,అలంకరణ; –రౌతు : వి.చూ. రౌతు.
"–సజ్జరౌతు కుటుంబానికిచెందిన–" శా.1456 (టి. టి. డి. ఇ. యస్. IV; పు. 80; నెం. 39).

సజ్జల
చూ. సజ్జ
ధాన్యసూచి (స.).
సజ్జ బహు. కు ద్వి.వి.

సత్తనగారి
వ్యక్తినామం (స.).
సత్తన– గృ.నా.పూ; పు.నా; దేవతా సూచి. <సత్తి+అన. సత్తి– వి.చూ. సత్తిరాజు; –అన– వి.చూ. –అన్న గృ.నా.వ. కమ్మవారిలో ఇంటిపేరు.
చూ. –గారి గృ.నా.వ.

సత్తిరాజు
వ్యక్తినామం (స.).
సత్తి– గృ.నా.పూ; స్త్రీ.నా; దేవతా సూచి. <ప్రా. సత్తి– <సం. శక్తి–,

కాళికాదేవి, పార్వతి.
బ్రాహ్మణులలో ఇంటిపేరు.
చూ. _రాజు గృ.నా.ప.

సత్త్యం
పౌరుషనామం (స.).
<సత్యము : సత్పురుషుల్లో పుట్టేది. సత్యమార్గాన్ని అవలంబించే వారికిది పౌరుషనామం అయింది.
బ్రాహ్మణులలో ఇంటిపేరు.

సత్రము
పౌరుషనామం (శా.స.).
అన్నదానంచేసే గృహం, ధర్మశాల. సత్రంకట్టించిన వారుగనో దాని బాగోగులు చూసేవారుగనో ప్రసిద్ధి చెందిన వారు. "__వారి ప్రధానిసత్రము బొల్లమ రాజుంగారి__" శా. 1180. (తెలం. శా; I; పు. 71; పం. 5_6).

సద్దుల
పౌరుషనామం (తె.).
సద్దు బహు. కు ద్వి.వి; <సం. శబ్ద- : చప్పుడు.

సనిసెట్టి
వ్యక్తినామం (స.).
సని_ గృ.నా.పూ;? ప్రా.సణి_ <సం. శని_ చూ. _సెట్టి గృ.నా.ప.

సందమోని
వ్యక్తినామం (తె.).
సంద+బోయని.
సంద_ గృ.నా.పూ; ?సం. సంధ్యా; ?<ప్రా. చంద_ <సం. చంద్ర_
చూ. _మోని గృ.నా.ప.

సందిరెడ్డి
వ్యక్తినామం (స.).
సంది_ గృ.నా.పూ; సంద+ఇ.వి.చూ. సందమోని. కమ్మవారిలో ఇంటిపేరు.
చూ. _రెడ్డి గృ.నా.ప.

సన్నపనేని
వ్యక్తినామం (స.).
సన్నప_ గృ.నా.పూ; <సన్నము. అల్పమైన. బలహీనమైన. <ప్రా.సణ్హ_ <సం. శ్లక్ష్ణ_ కమ్మవారిలో ఇంటిపేరు.
చూ. _నేని గృ.నా.ప.

సన్నపురెడ్డి
వ్యక్తినామం (స.).
సన్నపు- గృ.నా.పూ; వి.చూ. సన్నపనేని. కమ్మవారిలో ఇంటిపేరు.
చూ. -రెడ్డి గృ.నా.ప.

సన్నాయిల
పౌరుషనామం (స.).
వాద్యసూచి.సన్నాయి బహు. కు ద్వి.వి. నాగసరం. <పా. షహనాయ్

సన్నిధానము
రూ. సన్నిధి
వృత్తిసూచి (తె.స.సా.).
సమీపం, ఆశ్రయం, చేరువు. రంగభోగాలు నిర్వహించే వారిలో ఒకతెగ.

దైవ సన్నిధిలో విన్నపాలు చేసేవారు లేక పురాణాది కాలక్షేపం చేసేవారు. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

"ఇది సనిధానము సూర్యనారాయణ శాస్త్రిచే—" (మురళి; పు. 24).

సన్నిధి

చూ. సన్నిధానం

వృత్తిసూచి (స.).

బ్రాహ్మణులలో ఇంటిపేరు.

సన్నిధిరాజు

వ్యక్తినామం (తె.స.).

సన్నిధి– గృ.నా.పూ; <సం.సన్నిధి–: సమీపం. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. –రాజు గృ.నా.ప.

సభాపతి

పౌరుషనామం (తె.).

సభకు అధిపతి.

సంపంగి

పుష్పసూచి (తె.).

<సం. చంపక; ఉ : సంపెంగ.

సంపెంగనూనె తయారీ, లేక వ్యాపారం చేసేవారు.

వృ.నా: Artobotrys uncinatus.

సం. చంపక; త.చన్పకమ్, చెన్పకమ్; మ.చెమ్పకమ్, చమ్పకమ్; క.సమ్పగె, సమ్పిగె; తు. సంపిగె, సంపయు; తె.సంపెంగ,చంపకము డి. ఇ.డి. 1985.

సంబరాజు

వ్యక్తినామం (స.).

సంబ– గృ.నా.పూ; <సం. సాంబ–: శివుడు. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. –రాజు గృ.నా.ప.

సముద్రాల

జలసూచి (తె.స. .

సముద్రం బహు. కు ద్వి.వి. కమ్మ, ఎరుకల బలిజ, మాల, శ్రీవైష్ణవులలో ఇంటిపేరు. ఏకవచనమైన సముద్రం బలిజలలో, బ్రాహ్మణులలో ఇంటిపేరు.

సమ్మలదేవి

వ్యక్తినామం (తె.స.).

సమ్మల– గృ.నా.పూ; దేవతాసూచి. ?<ప్రా.సామలా <సం. శ్యామలా.

చూ. –దేవి గృ.నా.ప.

సమ్మలనేని

వ్యక్తినామం (స.).

సమ్మల– గృ.నా.పూ; స్త్రీ.నా. వి.చూ. సమ్మలదేవి. చూ. –నేని గృ.నా.ప.

సమ్మిరెడ్డి

వ్యక్తినామం (తె.).

సమ్మి– గృ.నా.పూ; <చామి <ప్రా సామీ<సం.స్వామి.? <ప్రా.సమీ<సం. శమీ:వృక్షసూచి. చూ. –రెడ్డి గృ.నా.ప.

సమ్మెట

వృత్తిపరికరసూచి (స.).

<ప్రా. చమ్మట్టి <సం. చర్మయష్టి : పెద్దసుత్తి. ముద్గరం. కమ్మవారిలో ఇంటిపేరు. సమ్మెట సోమనృపాలుడు 1417 ప్రాంతంవాడు. వెలుగోటి అనంత పోతరాజుకు సామంతుడు. చాళుక్య వంశంనుండి కమ్మవారిలో చేరిన వంశాలలో ఇదిఒకటి. (కమ్మ.చ; పు. 137). సమ్మెటవారు చాళుక్య వంశస్థులని వెలుగోటి వారి వంశావళి వలన తెలుస్తుంది. వీరినే సంపెట, సంబెట వారని కూడా అందులో పేర్కొబడింది.

సయిుంపు

పౌరుషనామం (స.).

<సం. సహన : సహనం, ఓర్పు.

కమ్మవారిలో ఇంటిపేరు.

సయ్యద్‌నేని

వ్యక్తినామం (స.).

సైదులు మొదలైనవి మహమ్మదీయ నామాలైనప్పటికీ మహమ్మదీయేతరుల లోనూ కన్పిస్తున్నాయి.

చూ. –నేని గృ.నా.ప.

సరబాద

అస్పష్టనామబంధం (సా.).

''—సత్కీర్తియుతుడు సరబాద లింగోజి సత్పుత్రుడు—'' (Tel.Ma; పు. 229).

సరవియోళోంబరి

?వ్యక్తినామం (సా.).

?<త. సరవియాళ్వార్–

''—సరవియాళోంబరి సాహెబుకిండు—

(పల్నా; పు. 130; పం. 1267).

సరస్వతి

రూ. సరస్వతుల

వ్యక్తినామం (రా.శా.).

<సం. సరస్వతి–.

రెడ్లలో, బ్రాహ్మణుల్లో ఇంటిపేరు.

''—సరస్వతి సర్వతోముఖ మహాత్రవత యాజులు—'' శా.1654. (టి. యం. పి.I; పు. 656; నెం. 881).

''—సరస్వతి పౌండరీక యాజులు—. శా. 1679 (టి.యం.పి I; పు. 656; నెం. 884).

సరస్వతుల

చూ. సరస్వతి

వ్యక్తినామం (తె.స.).

బ్రాహ్మణులలో గృహనామం

సరిపిననేని

వ్యక్తినామం (స.).

సరిపిన గృ.నా.పూ;?

చూ. –నేని గృ.నా.ప.

సరివి

రూ. సర్వి

వృక్షసూచి (తె.స.).

వృ.నా: Casuarina equisitifolia

సర్దేశాయి

బిరుదనామం (రా.స.).

మహారాష్ట్ర ప్రాంతంనుండి వలస వచ్చినవారు. సర్ దేశముఖీ గౌరవంగల వారి ఇంటిపేరు.

సర్వాప్రగడ

వ్యక్తినామం (స.).

సర్వా– గృ.నా.పూ; పు.నా. దేవతా సూచి. <ప్రా. సర్వ– <సం. శర్వ– శివుడు. ఆర్వేల నియోగ బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. –ప్రగడ గృ.నా.ప.

సర్వి

చూ. సరివి

వృక్షసూచి (తె.).

సర్విసెట్టి

వ్యక్తినామం (స.).

సర్వి– గృ.నా.పూ; దేవతాసూచి. సర్వ+ఇ. సర్వ– వి.చూ. సర్వాప్రగడ.

చూ. –సెట్టి గృ.నా.ప.

సర్వే

పౌరుషనామం (రా.).

<సర్వే : భూమికొలత. సర్వేపని చేసే వారు. కాపులలో ఇంటిపేరు.

సవరం

వృత్తిసూచి (తె.స.సా.).

సవరాల వృత్తి. సవరాలతో వ్యాపారం చేసినవారో, తయారుచేసినవారో కావచ్చు.

<ప్రా. చవరీ, చమరీ <సం. చమరీ: చమరీ మృగం తోక.

"––సవర మన్వయాభరణ నారాయణ భూపాల––" కువల; ఆశ్వా.గ.)

"––సవరము వేంకటపతిని––"(Tel. Ma; పు. 115.).

సహస్రనామముల

పౌరుషనామం (స.).

సహస్రనామం బహు. కు ద్వి.వి. సహస్ర– సంఖ్యాసూచి. వెయ్యి, –నామములు : పేర్లు.

బ్రాహ్మణులలో ఇంటిపేరు.

## సా

సాకిని

చూ. సాకినేని

వ్యక్తినామం (స.).

సాకినేని

చూ. సాకిని, సాగినేని

వ్యక్తినామం (స.).

సాకి– గృ.నా.పూ; <సం. సాక్షి. వి.చూ. సాక్షి.

?<సం. శాక్య–

చూ. –నేని గృ.నా.వ.

సాక్షి

పౌరుషనామం (తె.స.).

<సం. సాక్షి: ఏదైనా ఒక కార్యాన్ని చూసిగాని, వినిగాని చెప్పేవాడు.

సాగబోయిన

వ్యక్తినామం (స.).

సాగ+బోయని

సాగ– గృ.నా.పూ; <ప్రా. చాగ– <సం. త్యాగ–. వి.చూ. శాగంరెడ్డి.

చూ. –బోయిన గృ.నా.ప.

సాగి

పౌరుషనామం (శా.స.సా.).

?<చాగి : త్యాగశీలుడు,

కమ్మవారిలో ఇంటిపేరు.

దుర్జయ వంశంలో సాగి వంశం ఒక శాఖ. 11వ శతాబ్ది నుండి సాగివారు చతుర్థ వంశీకులుగానే చెప్పుకున్నారు. క్రీ.శ. 1103ప్రాంతంలో చాగి బేతరాజు గుడిమెట్ల సీమను పాలించాడు.

"–సాగి రఘునాధయ్య––" శా. 1541 (టి.యం.పి.II; పు. 817;నెం. 584).

"––సాగిపోతక్షమాభర్త జగతి యేలె–" (పెద్దా. సం; పు.2).

సాగినేని

చూ. సాకినేని

వ్యక్తినామం (స.).

సాగి– గృ.నా.పూ; ?<చాగి <చాగ– వి.చూ. సాగబోయిన.

కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. –నేని గృ.నా.ప.

సాగిరాజు

వ్యక్తినామం (స.).

సాగి– గృ.నా.పూ; వి.చూ. సాగినేని.

బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. –రాజు గృ.నా.ప.

సాతినేని

చూ. సాదినేని

వ్యక్తినామం (తె.).

సాదవోయిన

వ్యక్తినామం (తె.).

సాద+బోయని

సాద– గృ.నా.పూ; <సాది–

చూ. సాదినేని

చూ. –వోయిన గృ.నా.ప.

సాదినేని

చూ. సాతినేని

వ్యక్తినామం (తె.స.).

సాది– గృ.నా.పూ; <సం. సాది : అశ్వారోహకుడు, ఆశ్వికుడు.

కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. –నేని గృ.నా.వ.

సాదిరెడ్డి

వ్యక్తినామం (స.).

సాది– గృ.నా.పూ; వి.చూ. సాదినేని.

కమ్మవారిలో ఇంటిపేరు.

సాదు

చూ. సాధు

పౌరుషనామం (తె.స.).

సాధనాల

పౌరుషనామం (స.).

సాధనం బహు. కు ద్వి.వి.

సాధు

రూ. సాదు

పౌరుషనామం (స.).

మంచివాడు, సాధువు; శ్లాఘ్యమైన.

కమ్మ, గానిగ, పద్మసాలి, బ్రాహ్మణ కులాలలో ఇంటిపేరు.

సానిరెడ్డి

వ్యక్తినామం (తె.).

సాని–గృ.నా.పూ; వి.చూ,

–సాని గృ.నా.ప.

చూ. –రెడ్డి గృ.నా.ప.

సానెబోయిన

వ్యక్తినామం (రా.).

సానె– గృ.నా.పూ; < సాని. వి.చూ.

సానిరెడ్డి. చూ. –రెడ్డి గృ.నా.ప.

సాపాటి

ఆహారపదార్థసూచి (స.).

సాపాటుకు ఔప : భోజనం.

< త. సాప్పాటు. సా+పాట్టు.

సా < ప్రా. పసాయ– < సం. ప్రసాద.

సాపినేని

వ్యక్తినామం (స.).

సాపి– గృ.నా.పూ; వి.చూ. సాయపనేని.

కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. –నేని గృ.నా.ప.

సామంతి

చూ. చామంతుల

పుష్పసూచి (రా.స.).

కోమట్లలో ఇంటిపేరు.

సామవేదం

పౌరుషనామం (తె.స.).

చతుర్వేదాలలో ఒకటి. సామవేద పఠనం చేసేవాడు.

బ్రాహ్మణులలో ఇంటిపేరు.

సామిని

చూ. సామినేని

వ్యక్తినామం (స.).

కమ్మవారిలో ఇంటిపేరు.

సామినేడి

చూ. సామినేని

వ్యక్తినామం (స.).

కమ్మవారిలో ఇంటిపేరు.

సామినేని

రూ. సామిని, సామినేడి

వ్యక్తినామం (రా.స.).

సామి– గృ.నా.పూ;పు.నా; దేవతాసూచి.

< ప్రా. సామి– < సం. స్వామి–.

దేవుడు; రాజు; ప్రభువు.

కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. –నేని గృ.నా.ప.

సామిరాజు

వ్యక్తినామం (స.).

సామి– గృ.నా.పూ;పు.నా;దేవతాసూచి.

వి.చూ. సామినేని. ఆర్వేల నియోగ

బ్రాహ్మణులలో ఇంటిపేరు.
చూ. –రాజు గృ.నా.ప.

సామిరెడ్డి
వ్యక్తినామం (తె.).
సామి– గృ.నా.పూ; వి.చూ. సామినేని
చూ. –రెడ్డి గృ.నా.ప.

సామిసెట్టి
వ్యక్తినామం (స.).
సామి– గృ.నా.పూ; వి.చూ. సామినేని
చూ. –సెట్టి గృ.నా.ప.

సాముద్రికం
పౌరుషనామం (సా.).
భాగ్యాన్ని సూచించే దేహ లక్షణాలను తెలిపే శాస్త్రం.
మాధ్వులలో ఇంటిపేరు.

సామ్రాజ్యం
పౌరుషనామం (స.).
<సామ్రాజ్యము : సమ్రాట్టుతనం.
బ్రాహ్మణులలో ఇంటిపేరు.

సాయగోని
వ్యక్తినామం (తె.).
సాయ– గృ.నా.పూ; <చాయ. వి.చూ. సాయపనేని. చూ. –గోని గృ.నా.ప.

సాయపనేని
వ్యక్తినామం (శా.స.).
సాయప– గృ.నా.పూ; <చాయప. ఛాయ + అప. చాయ : చాయాదేవి, సూర్యునిభార్య. కమ్మవారిలో ఇంటిపేరు.
"–సాయపనేని వెంకటాద్రి నాయని వారు–" శా.1291 (టి యం.పి. II: పు. 1130; నెం. 589.
చూ. –నేని గృ.నా.ప.

సారంగం
జంతుసూచి (తె.).
<సారంగము : ఇఱ్ఱి; ఏనుగు; తుమ్మెద; వానకోయిల. ?<సారంగు.

సారంగు
వృత్తిసూచి (సా.).
Sailor; a native boatswain, or chief of a lascar crew; the skipper of a small native vessel–. సి. టి. యస్. ఐ. బ్రాహ్మణులలో ఇంటిపేరు. "సారంగు తమ్మమంత్రి కుమారుడు–" (వైజ; పు.3; ప. 25).
"–సారంగు నృసింహ మంత్రి తనూభవ–" (వైజ; ఆశ్వా.గ.).
గోల్కొండ నగరానికి సారంగు తమ్మయ్య అనే కవి కరణంగా ఉండేవాడు. ఇతని మూలపురుషుని పేరు సారంగధరుడట. అందుచేత ఈ వంశాన్ని సారంగువారని పిల్చేవారట. (స. ఆం. సా;IV; పు. 57).

సార్జన్
వృత్తిసూచి (తె.).
<Eng. Sargeant : భటుల మీది ఉద్యోగి.

సాల్గ్రామం
రూ. సాలిగ్రామం
పౌరుషనామం (శా.).
<సాలగ్రామము : విష్ణుమూర్తి చిహ్నిత శిలావిశేషం.
"—సాల గ్రామం నరసింహా చార్యులు—" శా. 1608 (టి. యం. పి; II; పు. 1151; నెం. 762).

సాలి
రూ. సాలె
కులసూచి (స.).
<సాలియ <ప్రా. సాలియా <సం. శాలికా : సాలెవాడు, నేతపనివాడు.
త.చాలియణ్; మ.చాలియన్;క.సాలియ, సాలిగ; తె.సాలె. డి.ఇ.డి. 2042.
ఆంధ్రపద పారిజాతంలో కంసల పురుషునికి, కుమ్మరస్త్రీకి పుట్టిన వారని చెప్పబడింది. సాలీల కులదైవం భావనా ఋషి. వి. చూ. (సి.టి.యస్.ఐ. VI; 265).

సాలిగ్రామం
చూ. సాలగ్రామం (స.).
పౌరుషనామం (స.)
కరణ కమ్మలలో ఇంటిపేరు.

సాలినేని
వ్యక్తినామం (స.).
సాలి— గృ.నా.పూ; కులసూచి. వి.చూ. సాలి. ?<సాతినేనికి అచ్చుతప్పు.
చూ. —నేని గృ.నా.ప.

సాలె
చూ. సాలి
కులసూచి (తె.స.).

సాల్వ
చూ. సాళ్వ
పక్షిసూచి (స.).

సాళ్వ
రూ. సాల్వ
పక్షిసూచి (స.).
<సాళ్వము : ఒకరకండేగ.
ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.
త. సాళువ, సాళ్వ; తె. సాళువ, సాళువము, సాళ్వము = a kind of bird, a hawk used in hunting.
డి.ఇ.డి. 2045.
?<సాళ్వ దేశానికి సంబంధించిన.

సాహిణి
వృత్తిసూచి (సా.).
సాహిణము+ఇ : అశ్వపాలకుడు.
"—సారసహిత తేజ, ధీర, సాహిణి మారా!" (భాస్క; బాల; 1–1).
"—సాటువ గల వారికెల్ల సాహిణి మారా! (చాటు; పు.68).

సింగభొట్ల
చూ. సింహంభట్ల
వ్యక్తినామం (తె.).
సింగ— గృ.నా.పూ; వి.చూ. సింగమ్మ

నేని. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. _భొట్ల గృ.నా.ప.

సింగం

చూ. సింగము

అడవిజంతుసూచి (రా.స.).

చేనేత పనిచేసే వాళ్ళవద్ద అడుక్కు తినే ఒక జాతి వారిని సింగంవాళ్ళు అంటారని మాం.వృ.ప.

సింగమనేని

వ్యక్తినామం (స.).

సింగమ_ గృ.నా.పూ; వ్య. నా. సింగ+ అమ. సింగ_ వి.చూ. సింగము.
కమ్మవారిలో ఇంటిపేరు.

చూ. _నేని గృ.నా.ప.

సింగము

చూ. సింగం

అడవిజంతుసూచి (స.).

<ప్రా. సింఘ_ <సం. సింహ_ : సింహము. కమ్మవారిలో ఇంటిపేరు.

సింగంసెట్టి

వ్యక్తినామం (తె.).

సింగం_ గృ.నా.పూ; అడవి జంతు సూచి. వి.చూ. సింగమనేని.

చూ. _సెట్టి గృ.నా.ప.

సింగళ

దేశసూచి (శా.).

<ప్రా. సింఘళ_ <సం. సింహళ : సింహళ ద్వీపం.

"__సింగళ అక్కలయ్య__"
శా. 1444 (టి.యం.పి.II; పు. 1148; నెం. 727).

సింగాడి

ఆయుధసూచి (రా.).

బాణం. హరిజనులలో ఇంటిపేరు.
సింగాడి గృహనామకులైన హరిజనులు తరతరాలుగా వచ్చిన తమ ఇంటిపేరు బాగాలేదని కాబోలు సముద్రాల గా మార్చుకోవడం జరిగింది.

సింగారం

పౌరుషనామం (తె.శా.).

<సం. శృంగార_ అలంకారం
"__సింగారం వీరయ్య__" పరీధావి (టి.యం.పి.I, పు. 649: నెం.834).

సింగారెడ్డి

వ్యక్తినామం (స.).

సింగా_ గృ.నా.పూ; <సింగ-.
వి.చూ. సింగమనేని.

చూ. _రెడ్డి గృ.నా.ప.

సింగావఝుల

వ్యక్తినామం (తె.).

సింగా_ గృ.నా.పూ; వి.చూ. సింగమ నేని. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

చూ. _వఝుల గృ.నా.ప.

సింగి

పౌరుషనామం (తె.రా.స.).

?<సం. శృంగి
?ఎరుకల కులంలోని స్త్రీ.
?<సింగ+ఇ : వి.చూ. సింగమనేని.

సింగిరెడ్డి
వ్యక్తినామం (తె.).
సింగి- గృ.నా.పూ; వి. చూ. సింగమనేని. రెడ్లలో ఇంటిపేరు.
చూ. -రెడ్డి గృ.నా.ప.

సింగిసెట్టి
వ్యక్తినామం (స.).
సింగి- గృ.నా.పూ; వి.చూ. సింగమనేని. చూ. -సెట్టి గృ.నా.ప.

సిద్ధగౌని
వ్యక్తినామం (తె.).
సిద్ధ- గృ.నా.పూ;పు.నా. <సం. సిద్ధ- ఈ పదంతో ఉన్న నామాలు సిద్దడు, సిద్దయ్య, సిద్దమ్మ.
చూ. -గౌని గృ.నా.ప.

సిద్ధాంతి
పౌరుషనామం (స.).
<సం. సిద్ధాంతి : తొమ్మిదిరకాల జ్యోతిష గ్రంథాలు తెలిసినవాడు.

సిద్ధాబత్తుని
వ్యక్తినామం (స.).
సిద్ధా- గృ.నా.పూ; సిద్ధ+ఆ: వి.చూ. సిద్ధగౌని. చూ. -బత్తుని గృ.నా.ప.

సిద్ధిరాజు
వ్యక్తినామం (శా.).
సిద్ధి- గృ.నా.పూ; సిద్ధ+ఇ : వి.చూ. సిద్ధగౌని. ఆర్వేల నియోగులలో ఇంటిపేరు. "--సిద్ధిరాజు తిమ్మరాజయ్యవారు--" (యస్.ఐ.ఐ. VI; పు. 218; నెం. 698; పం. 26);
చూ. -రాజు గృ.నా.ప.

సింధు
జలసూచి (స.).
<సింధువు : సముద్రం; ఏనుగు; ఒక నది, ఒక దేశం.

సిపాయి
వృత్తిసూచి (రా.).
<ఉ. సిపాహీ, <ప్రా. అస్సవాహీ; సం. అశ్వవాహి-: భటుడు, కాలిబంటు.

సింహాంభట్ల
చూ. సింగభొట్ల
వ్యక్తినామం (తె.స.).
బ్రాహ్మణులలో ఇంటిపేరు.
చూ. -భట్ల గృ.నా.ప.

సిరిగినీడి
వ్యక్తినామం (స.).
సిరిగి- గృ.నా.పూ; వృక్షనామసూచి.
<చిగర. వర్ణవ్యత్యయ రూపం;
రూ. శిరగ, సిరిగె. క.ఊ, ఆ. 3316.
?<సిరిగిరి <శ్రీగిరి
చూ. -నీడి గృ.నా.ప.

సిరిప్రగడ
వ్యక్తినామం (తె.స.).

సిరి- గృ.నా.పూ; స్త్రీ.నా. దేవతా సూచి. ప్రా. సిరి- <సం. శ్రీ. లక్ష్మి, సంపద. శ్రీవైష్ణవులలో ఇంటిపేరు.
చూ. -ప్రగడ గృ.నా.ప.

సిర్రాజు
వ్యక్తినామం (తె.).
<సిరి+రాజు. సిరి- గృ.నా.పూ; స్త్రీ.నా. వి.చూ. సిరిప్రగడ.

సిర్వసెట్టి
రూ. సిర్విసెట్టి
వ్యక్తినామం (స.).
సిర్వి- గృ.నా.పూ; ? <సర్వి-
చూ. -సెట్టి గృ.నా.ప.

సిర్విసెట్టి
చూ. సిర్వసెట్టి
వ్యక్తినామం (స.).

## సీ

సీత
వ్యక్తినామం (తె.).
దేవతాసూచి; స్త్రీ.నా. <సం. సీతా.

సీతంరాజు
రూ. శీతంరాజు
వ్యక్తినామం (స.).
సీతం- గృ.నా.పూ; స్త్రీ.నా. దేవతా సూచి. సీత+అమ. సీత- శ్రీరాముని భార్య. మహాలక్ష్మి;-అమ- చూ.-అమ్మ గృ.నా.ప. బ్రాహ్మణులలో ఇంటిపేరు.
చూ. -రాజు గృ.నా.ప.

సీతిరాజు
వ్యక్తినామం (స.).
సీతి- గృ.నా.పూ; స్త్రీ.నా. దేవతా సూచి. సీత+ఇ. వి.చూ. సీతంరాజు. ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.
చూ. -రాజు గృ.నా.ప.

సీరా
రూ. శీరము, శీర్ల
వృత్తిపరికరసూచి (తె.).
<సీరము : నాగలి, హలం.

## సు

సుకమంచిరెడ్డి
వ్యక్తినామం (రా.).
సుకమంచి- గృ.నా.పూ;
?<సుగుమంచి : కన్యాశుల్కం.
చూ. -రెడ్డి గృ.నా.ప.

సుఖవాసి
పౌరుషనామం (స.).
ఇల్లు, వాకిలి మొదలైన స్థిర నివాసం లేకుండా వర్తక వ్యాపారాలపై గాని భూమి కౌలుకు ఇచ్చిగాని ఫల భోగంపై గాని జీవనం నడిపేవాడు. కమ్మవారిలో ఇంటిపేరు.
?<వృక్షసూచి. కారుబుడమచెట్టు

సుగంధం
పౌరుషనామం (స.).
సుగంధము. చందనం

సుగంధి
వృక్షసూచి (సా.).
నాగుదోసచెట్టు : ఇంపైన వాసన కలది. "...వెంకటేశ విన్నపాలు తెనుగులిపి ఆకులుగంటక్కి అపూర్తి సుగంధి రామయ వ్రాశిన..."
(Tel. Ma; పు. 289).

సుంకర
రూ. సుంకరి
వృత్తిసూచి (తె.స.).
పన్నులు వసూలు చేసే వృత్తి. బిల్లు కలక్టరు <ప్రా. సుంక ఆర-, సుంక గార-, సుంకార- <సం. శుల్కకార-
"...సుంకర బింకయ్య సురియ చమడయ్య..." (వండి. పు. 208).
సదాశివరాయల కాలంలో ఆదవేని పాలకుడైన సిద్ధిరాజు శ్రీరంగరాయల వద్ద కెరబెళగుంట సుంకాధికారిగా సుంకర చెన్నరసు, పీతాంబరయ్యలు వున్నారు. వీరు 1560 ప్రాంతీయులు.

సుంకరి
చూ. సుంకర
వృత్తిసూచి (తె.స.సా.).
కమ్మవారిలో ఇంటిపేరు.
"...సుంకరి దామినేడొకడు..."
(పల్నా. పు.224, పం.117).
"...చుక్కల గద్దెపై సుంకరివారు..."
(పల్నా. పు.74; పం. 668).

సుంకు
సస్యసంబంధసూచి (తె.స.).
సస్యకుసుమం, జొన్న మొదలైన వాటి కంకిమీద పూత.
?పెళ్ళిళ్ళలో పళ్ళెంలో పోసి వధూవరులమీద చెరిగే బియ్యం.

సుంకేసల
వృక్షసూచి (తె.రా.స.).
వృ.నా : Poincana elata
ఎర్రనిపూలు, నల్లని బంకవుండి నీటి పక్కన పెరిగే పెళుసు కొమ్మల పెద్ద చెట్టు. ?గ్రామనామంకూడ కావచ్చు.

సుంకోజి
వ్యక్తినామం (తె.స.).
సుంక- గృ.నా.పూ; <సుంకము <ప్రా. సుంక- <సం. శుల్క-
చూ. -ఓజి గృ.నా.ప.

సుద్దల
పౌరుషనామం (రా.).
సుద్ద బహూ. కు ద్వి.వి. <సుధా : తెల్లమన్ను. రెడ్లలో ఇంటిపేరు.

సున్నా
పౌరుషనామం (స.).
<సున్న : అనుస్వారం, ఉత్తది.

సుబుద్ధి

పౌరుషనామం (శా.).

మంచిబుద్ధిగల.

"--సుబుద్ధి రామదాసర్--"శా. 1443 (టి. టి. డి. ఇ. యస్; III; పు. 310; నెం. 148).

సుబుద్ధి రామదాసరు ప్రతాపరుద్ర జగపతి వద్ద సేనాపతిగా ఉన్నాడు.

సుమతి

బిరుదనామం (శా.స.).

?వ్యక్తినామం

ద్వైత మతావలంబకుల బిరుద నామం శా.శ.

"--సుమతి శ్రీనివాసాచార్యులు--" శా.1216 (టి. యం. పి; I; పు.605; నెం.364). "--సుమతి రంగరాజు--" శా. 1466 (టి.యం.పి; I; పు. 634; నెం. 636).

సుమనసాని

వ్యక్తినామం (తె.).

సుమన- గృ.నా.పూ; సుమ+అన. వి.చూ. సుమరాజు

చూ. -సాని గృ.నా.ప.

సుమరాజు

వ్యక్తినామం (సా.).

సుమ- గృ.నా.పూ; పుష్పసూచి <సుమము : పువ్వు.

"--కార్తీక మాసమందు సుమరాజు నరసింహరాజు వ్రాసిన--" (Tel. Ma; పు. 12).

చూ. -రాజు గృ.నా.ప.

సురభి

పౌరుషనామం (తె.స.పా.).

సం. సురభి- : కామధేనువు; ఆవు. బ్రాహ్మణులలో ఇంటిపేరు.

"--తద్వంశమును గాంచె సురభి సంజ్ఞ--" (చంద్రికా; కృత్యాది.).

సువర్ణం

లోహసూచి (స.).

బంగారం, మాడ; ధనం.

సువార

పౌరుషనామం (స.).

<సువారము <సూపకార వంట. వంటచేసే వృత్తికలవాడు కావచ్చు.

## సూ

సూకర

జంతుసూచి (స.).

<సూకరము : పంది.

ఆర్వేల నియోగులలో ఇంటిపేరు.

?సూపకార. వి.చూ. సువార.

సూచిరాజు

వ్యక్తినామం (స.).

సూచి- గృ.నా.పూ; సం. సూచి : వ్యూహం. చూ. -రాజు గృ.నా.ప.

సూదా
అహారపదార్థసూచి (స.).
<సూదము : వండిన పప్పు.

సూరనేని
రూ. సూరినేని
వ్యక్తినామం (స.).
సూర- గృ.నా.పూ; పు.నా; దేవతా సూచి. <సం. సూర- సూర్యుడు.
చూ. -నేని గృ.నా.ప.

సూరపనాయని
రూ. సూరపనీడు, సూరపనేని
వ్యక్తినామం (శా.).
సూరప- గృ.నా.పూ; పు.నా. దేవతా సూచి. సూర+అప. సూర- వి.చూ. సూరనేని. "-సూరపనాయని అబ్బ నాయినివారు-" శా.1433 (టి. యం. పి; II; పు.789, నెం. 371).
చూ. -నాయని గృ.నా.ప.

సూరపనీడు
చూ. సూరపనాయని
వ్యక్తినామం (స.).
కమ్మవారిలో ఇంటిపేరు.

సూరపనేని
చూ. సూరపనాయని
వ్యక్తినామం (తె.).
కమ్మవారిలో ఇంటిపేరు.

సూరపరాజు
వ్యక్తినామం (స.).
సూరప- గృ.నా.పూ; వి.చూ. సూరపనేని. బ్రాహ్మణులలో ఇంటిపేరు.
చూ. -రాజు గృ.నా.ప

సూరబోయిన
వ్యక్తినామం (స.).
సూర- గృ.నా.పూ; వి.చూ. సూరనేని
చూ. -బోయిన గృ.నా.ప.

సూరయగారి
వ్యక్తినామం (స.).
సూరయ- గృ.నా.పూ; వ్య.నా.వి.చూ. సూరనేని. చూ. -గారి గృ.నా.ప.

సూరసాని
వ్యక్తినామం (శా.).
సూర- గృ.నా.పూ; వ్య.నా. దేవతా సూచి. వి.చూ. సూరనేని.
"-సూరసాని వెంకటపతి-" శా.1663 (టి.యం.పి;II; పు.817; నెం.586).
"-సూరసాని వెంకణ్ణ జమందార్-" శా.1684 (టి. యం. పి; II; పు. 820; నెం. 590). చూ. -సాని గృ.నా.ప.

సూరాబత్తుల
వ్యక్తినామం (రా.స.).
సూరా- గృ.నా.పూ; సూర+అ సూర- వ్య.నా; దేవతాసూచి. వి.చూ. సూరనేని. కమ్మవారిలో ఇంటిపేరు.

సూరావఝల
వ్యక్తినామం (తె.స.).

